# భారతీయనాగరికత,

## అహింసాతత్వము.

### మొదటి భాగము.







కొమాండూరి శఠకోపాచార్యులు,
కాకినాడ.

# ఉపోద్ఘాతము.



ఈగ్రంథము ఈకాలములో అపూర్వమైనది. ఒకప్రక్కను నవలలు నాటకములు మరియొకప్రక్కను సినీమాలు రేడియోలు ప్రబలియున్న యీకాలములో తత్వవిచారణయే తక్కువ. అందులో అహింసాతత్వము తత్వజ్ఞులకుగూడ సామాన్యముగ రుచింపనిది. ఆతత్వ మీపుస్తకములో చక్కగ వివరింపబడినది. ఏతదుపరి, పూర్వగాథలనుత్రవ్వి, వేదశాస్త్రములయందును ఇతిహాసపురాణములందును మతసిద్ధాంతములందును, చరిత్రలయందును, ధర్మసంస్థాపకుల బోధనయందును, అహింసాతత్వముఏవిధముగ ఎప్పటికప్పుడు సమర్థింపబడి పునరుద్ధరింప బడుచు వచ్చినదో గ్రంథకర్త వివరముగ నీగ్రంథపు మొదటిభాగములో వ్యక్తపచ్చినారు.

ఇట్టిపుస్తకమును ఇట్టికాలమున రచియింప నెట్టియవసరము కలిగెనని, పలువురుప్రశ్నింపవచ్చును. 20 వ శతాబ్దమనుండి,కలియుగ మనండి, అధార్మికశకము (materialistic age) అనండి, ఏనామమును వాడినను, ప్రజలకున్న ధనాశయేమి, కీర్తికాంక్షయేమి, కేవలము స్వార్థము మీదనేకాక అసహనముమీదకూడ ఆధారపడియున్నది. వీనినెల్ల పోషించునదిహింసాతత్వమే. ఉగ్గుపాలనుండి హింసనే బిడ్డలకలవర్చుచున్నాము; బిడ్డలకు బాల్యమునందు దట్టించి, ఎవ్వరేదిపట్టించితే, అదియే వారికి పరిపాటి యగును. తోటిబిడ్డకొట్టెనని చంటిబిడ్డయేడ్చినప్పుడు, కొట్టినబిడ్డను తిరిగి కొట్టనైనకొట్టెదము, లేదా, కొట్టినట్లునటించెదము. గరుత్మంతునకు చేపలను ఆహారమువేయించి వానితో బిడ్డల కానందముగల్పింతుము. శిశుత్వమునందును బాల్యమందును బిడ్డల కెట్టిభావములను గరపితే అవే అతికి తదనుసరణముగ [illegible] మారుచ్చును.

శ్రోత్రియులపిల్లలు ఉల్లిపాయలపేరుచెప్పినా, కేవలము శాక భక్షకులపిల్లలు మత్స్య మాంసాదులు పేరుచెప్పినా, రోయుదురు. వీరెన్నడు ఆవస్తువులను తినియు కనియుండరు. విషజంతువులనుచంపినా, దెబ్బకుదెబ్బకొట్టినా, 'శాఠ్యేన శఠం జయేత్' అనుభావమునే మనమందరమును బోధించుచున్నాముగదా! వీనియొక్క కడపటిపరిణామమే, ఆధునికమహాయుద్ధములు. కొన్నిప్రాంతములలో అవలీలగజరుగుకూనీలు అనాదినుండియు వచ్చుచున్న కక్షలయొక్క ఫలితములు; అవి ఆదియందు అల్పకారణసంజనితములు; రానురాను శాఖలసంగమముచే నదిపొంగినట్లు, కక్షకూడ విజృంభించి, మహానదివలె పొర్లి ప్రవహించును. శాస్త్రములు, పరిశోధన, విజ్ఞానప్రజ్ఞానములు అన్నియు నేడు సత్వరజీవహింసకు కారణములగుచున్నవి. కలికాలములో ధర్మము ఒంటిపాదముమీదనైన నడచుచున్నదా యని సందేహము కలుగుచున్నది. అందువల్లనే గాంధి మహాత్ముడు బ్రిటిషువారికొకసందేశముపంపినారు; అట్టితత్వమునే భారతీయులకుగూడ బోధించుచున్నారు; రాబోవుస్వరాజ్యమునకు అహింసనాధారముగచేసి, తదనుకూలమగు ప్రణాళిక నేర్పర్చినారు. ఇందలివివరములు ఈపుస్తకపురెండవభాగమందు విశదముచేయబడినవి. కావున ఈగ్రంథము కాంగ్రెసువాదులకును తదితరులకునుగూడ సమానముగ ఉపయోగకరమగునని వేరుగచెప్పనక్కరలేదు. తెలుగుభాషలోనున్న యీమూలము అచిరకాలములో ఇతరభాషలలోనికి తర్జుమాయగునని నానమ్మకము.

13-3-1941 భో. పట్టాభిసీతారామయ్య.

# పీఠిక.

"అహింసా ప్రథమంపుష్పం, పుష్ప మింద్రియనిగ్రహః
సర్వభూతదయా పుష్పం, క్షమాపుష్పం, విశేషతః
శాంతిపుష్పం, తపః పుష్పం, ధ్యానపుష్పం తథైవచ
సత్య మష్టవిధంపుష్పం విష్ణోః ప్రీతికరం భవేత్"

(పద్మపురాణం.)

విశ్వవికాసములో నరజాతి విశిష్టమైనది; అందుకు కారణము వారి సంస్కృతియే. జంతుజాతినుండి క్రమపరిణామమున మానవజాతి యుత్పన్నమైనది; ఉన్నతసంస్కృతివల్ల నరజాతి క్రమముగ దేవజాతిగ పరిణమించుట యీశ్వరేచ్ఛయని తోచును. దీనిని నెరవేర్చుటకు విష్ణుపూజకు ముఖ్యసాధనములు అహింసాదులే.

పూర్వకాలమందు భారతీయసంస్కృతియే ప్రపంచమంతకు మార్గదర్శకము, ఆధారము నయినది; దరిమిలాను జరిగిన మార్పులలో మన నాగరికత కొంతమలినమై, తనవిశేషతను పోగొట్టుకొన్నది; అభయ క్షేమాదులుతగ్గి, మధ్య నేర్పడిన యాచారపుంజమునే సనాతనధర్మమని సామాన్యు లాదరించుచున్నారు. ఈలోగా పాశ్చాత్యసంస్కృతి ధైర్యోత్సాహములవల్ల కృషివల్ల చాలవరకు ముందంజవేసినది. వారిభౌతిక విజ్ఞాన మతివేగముగ వృద్ధియైనది. ఈ20వ శతాబ్దిలో పాశ్చాత్యనాగరికత అద్భుతమై, లోకమంతటికి దిగ్భ్రమగల్గించినది. భారతీయులలో కొందరు దానిననుకరించుటే మోక్షసాధన మనుచున్నారు. కొందరు ప్రస్తుతపు ఆచారములను పరాయిసంపర్కము లేకుండ కాపాడుటవల్లనే వైదికధర్మముకుపునరుద్ధరణజరుగునని, భావించుచున్నారు. భారతీయసంస్కృతి ధర్మప్రధానమని వీరందరు నెంచుదురు. కాని ఆధర్మతత్త్వమునుగూర్చి అభిప్రాయములు భేదించుచున్నవి. దేశమందనేక మతాచారములు, భాషలు, భిన్నసంప్రదాయములు నేర్పడి, ప్రతిశాఖవారు తమవాటికే ప్రాబల్యము

కలుగవలెనని స్వార్థబుద్ధితో యత్నించుటలో పరస్పరవిరోధభావము హెచ్చినది.

పాశ్చాత్యుల యాంత్రికసంస్కృతితో సంఘర్షమువల్ల మన సంస్కృతికి ఉత్తేజనమేర్పడి కొంతలాభముకలిగినను, చాలహానియు కల్గినది. పాశ్చాత్యులవలె యాంత్రికముగ భౌతికశక్తి నన్నివిధములను హెచ్చించుకొని విదేశములను నిగ్రహించి భోగులుకావలెనని, అందుకుపాశ్చాత్యసంస్కృతి ననుకరించుటే ముఖ్యకర్తవ్యమని కొందరి నిశ్చయము. దానికై చేసిన ప్రయత్నములవల్లను సంఘర్షము ప్రజలబాధ మరింత హెచ్చినవేగాని నిజమైన సౌఖ్యముకలుగలేదు. ఈస్థితిలో 'అహింసా సత్యముల ఆధారముపైన నిర్మాణపద్ధతి నారంభించవలె; విధ్వంసక చర్యలమానవలె; బాహ్యశక్తిపటాటోపముకన్న అంతశ్శక్తిని సౌమ్యముగ వృద్ధిపర్చుకొని సంఘమంతయు బాగుపడవలె; అదియే లోకముకు కళ్యాణకరము, ముఖ్యముగా మన భారతీయుల సంస్కృతికి సరిపడినది' అని మహాత్ముని యుపదేశము లభించినది.

ఇటీవల పాశ్చాత్య దేశములందు నవ్యనాగరికతయొక్క రాక్షస విజృంభణమున యుద్ధాగ్ని వ్యాపించి లోకమంతయు తల్లడిల్లుచున్నది; లోకసంస్కృతి విషమయముగుచున్నది. ఇట్టి హింసావరణమందు అహింసాప్రవక్తబోధలు జనులకు తలకెక్కుట కష్టము. నిజమే. 'అప్రియస్యతు తథ్యస్య వక్తా శ్రోతాచ దుర్లభః' కదా! లోకమునుజయించు నాశమే గాని ఆత్మనిజయ ప్రయత్నమును, బాహ్యావేశమేగాని అంతరానందమును, రుచించుటలేదు. అయితే, ఇప్పుడు లోకమందు విజృంభించు పాశ్చాత్య సంస్కృతిలోగల్గిన దావానలమువల్ల, కొందరి కందుపై నభిమానముతగ్గినది. అహింసాధర్మమే ప్రశస్త మనుభావన కల్గుచున్నది. ఇది నైతికముగ ఉత్తమముకావచ్చు, కాని ఆచరణయోగ్యముకాదని, మనదేశముకు తగదని, కొందరిఆక్షేపణ. రక్తపాతముతో కార్యము సాధించు హింసాతత్త్వము మన సంస్కృతిలో మొదటనుండికలదని వీరను

చున్నారు; గీతాదిప్రమాణముచూపుచున్నారు. సౌమ్యత శాంతతవల్లనే మనము చెడితిమని, అందుకు మనచరిత్ర నిదర్శనమనియు, కొందరనుట కలదు. అట్టిస్థితిలో యథార్థస్థితిని గ్రహించి మనయభ్యుదయ మార్గము నిర్ణయించుటకు మనభారతీయసంస్కృతిక్రమవికాసమును పరిశీలించుట అవసరము. విపులమగు అట్టివిమర్శగ్రంథమింతవరకే భాషలోను వెలువడినట్లు కనబడదు. (ఒకచిన్న మరాఠీపుస్తకము దీనిగుజరాతీతర్జుమాయు మాత్రం ప్రచురితములు.)

మన సంస్కృతిలో ధర్మవికాసమును అందును అహింసాతత్వపు పరిణామమునుగూర్చి ఆంధ్రములో గ్రంథమేర్పడ వలెనని తోచి, అట్టి రచనకావలెనని శ్రీ ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘము వారు ప్రకటించి బహుమతినీయతలపెట్టిరి; తగినసమర్థత కాలవ్యవధి యుకలవారే అందుకు పూనుకోవలెను; కనుక మొదట నేనందుకు యత్నింపలేను. కాని, సకాలమందెవరినుండియు తగిన రచనరానందున కాలము పొడిగించినారని తెలిసి, పిమ్మటనేను దీని మొదటిభాగము తొందరగవ్రాసి పంపితిని. అది పరీక్షకులసమ్మతినొందుట నాయదృష్టము. అంతట శ్రీ కాంగ్రెసు సంఘమువారు నన్ను రెండవభాగముకూడ వ్రాయ నియమించి, దీనినంతను మొదట తామే ప్రచురింప తీర్మానించిరి. కాని, ఇటీవల రాజకీయరంగమున గలిగిన తీవ్రపరిస్థితులవల్ల తీరికలేక, వారు దీనిప్రచురణ హక్కు-బాధ్యతలన్నిటిని నాకే వదలినారు

ఈచిన్నపుస్తకములోచాల లోపములున్నవి. నాయశక్తి తొందర వ్రాతవల్ల కొన్నితప్పు లేర్పడినవి. మొదటిభాగపు 1–308 పుటలు బందరులో శ్రీపావనీముద్రాశాలలో శ్రీఆంధ్రరాష్ట్ర కాంగ్రెసుసంఘము వారు ముద్రింపజేసినారు. నేబంపినచిత్తునుండియే ఆముద్రణజరిగి, నేను 'ప్రూఫు'లు సరిచూచుట కవకాశమును కలుగలేదు. అందువల్ల ఆభాగములో అచ్చు తప్పులు చాలపడినందుకు చింతించుచున్నాను.

తామచ్చు వేయించిన ఫారములను నాకు పారితోషికముకు ప్రత్యామ్నాయముగ నిప్పించి, గ్రంథప్రచురణాధికారము నాకిచ్చివేసి నందుకు శ్రీఆంధ్రరాష్ట్రకాంగ్రెసు సంఘమువారి కెంతయు కృతజ్ఞుడను. దీనికి దయతో నుపోద్ఘాతమును వ్రాసియిచ్చిన అధ్యక్షులకు నావంద నములు. పై సందర్భములవల్లను, ఈవిషయముగూర్చి యిది దాదాపు మొదటియత్నమగుటను, ఇందనేకలోపము లేర్పడినవి; కాని, విషయ ప్రాముఖ్యమునుబట్టి ఇదిలోకులకు కొంత యుపయోగింప వచ్చునని ఆశించుచున్నాను. అహింసాప్రవక్తలగు కొందరి చిత్రపటములనుకూడ ఇందు చేర్చితిని. దీనియందలి విషయ లోపములను శ్రమ తీసుకొని దయతో నాకు పాఠకమహాశయులు తెల్పిన, వారికి నాకృతజ్ఞతాయుత వందనములు.

సంస్కృతిపరిణామపు సందర్భములో ధార్మికసమస్యలకు ప్రాముఖ్యముండకతప్పదు; కాని, ఆధునికకాలములో ఆర్థికసాంఘికములను రాజకీయము లనుగూడ, ధార్మికములనుండి విడదీయుటకు వీలులేదు. కనుక,ఆయాసమస్యలకు వాటిసంబంధమును సంగ్రహముగ ముఖ్యముగ రెండవ భాగములో చర్చింపబడినవి.

కాకినాడ
12-3-41

కో. శ.

# విషయసూచిక.

## మొదటి భాగము

# భారతీయ నాగరికత
## అహింసాతత్వపు పరిణామము

### అధ్యాయం 1. ఆముఖం.

భారత దేశము చాలా పెద్దది. ఇందులో హిందువులు, ముస్లిములు, జైనులు, సిక్కులు, పార్సీలు, క్రైస్తవులు వగైరా చాలా మతముల వారున్నారు; వివిధభాషలవారున్నారు; ఈ దేశీయులల్లో ఉన్నత సంస్కృతిగలవారును, చాలమంది విద్యా జ్ఞానములేక మూఢ దురాచారములకు లోబడియు నున్నారు.

కాని ఇప్పటి భారతీయ సంస్కృతి ఏకమే. హిందూ సంస్కృతి, పార్సీ సంస్కృతి...అనుటయు, ఆంధ్ర సంస్కృతి, ద్రావిడ సంస్కృతి, వంగీయ సంస్కృతి ... అనుటయు, బ్రాహ్మణ సంస్కృతి పంచమ సంస్కృతి...అనుటయు వాడుకలో నున్నమాట నిజమే; కాని ఇవి అన్నియు అంతర్భాగములే. ఇప్పుడవి వేరువేరు సంస్కృతులనుట సబబుకాదు. అయితే ప్రస్తుత సంస్కృతి ఏకరీతిదికాదు. పైన చెప్పినవి, మరికొన్ని, కలసిన మిశ్రిత సంస్కృతి. అనగా వీటి అన్నిటి సమ్మేళనమె భారతీయ సంస్కృతి. ఈ దేశపు నాగరికత వేలకొలది యేండ్లనుండి ఆయాసమయముల చారిత్రిక పరిస్థితులవల్ల భిన్నజాతుల మిశ్రమువల్లను రకరకముల పరిణామ మొందినది* ఇప్పటి సంస్కృతి తెలియుటకు ఆయా మొదటి సంస్కృతులగూర్చియు పరిశీలించవలెను. ఇప్పుడు లోకమంతటను హింసాభావము విజృంభించుచున్నది. న్యాయమే బలమగుటకు బదులు, బలమే న్యాయముగ చలామణియగుచున్నది.

---

* మన ప్రస్తుత సందర్భమునకు నాగరికత అనగా సంస్కృతి, అని వాడుకో వచ్చును. దానిని ఆంగ్లమందు Culture అందురు.

పెద్దరాజ్యముల యజమానులు తమ శస్త్రాస్త్రములను శరపరంపరగ వృద్ధిజేయుచున్నారు. చిన్న దేశములు భయగ్రస్తములైనవి. యుద్ధమందు ధర్మము పాటించుటలేదు. యోధులు కానివారికిని దేహద్రవ్యముల భద్రత లేకున్నది. న్యాయమయిన కారణము లేకుండను, ముందు సరిగా తెలపకుండను, యుద్ధ ప్రకటనగూడ జరపకుండనే, వినాశకరమైన యుద్ధములు– (ఆపేరును లేకుండనే) జరుపుట నంప్రదాయమగుచున్నది. వీరత్వమనగా రౌద్రభీభత్సములని, "నాయకులును" ను, భావించుస్థితి యేర్పడినది. ఆయా దేశములలో వర్గ సంఘర్షమును హెచ్చినది.

ఈ హింసా తత్త్వము లోకమంతటికిని అనర్థకరమని అన్ని దేశములలోను బుద్ధిమంతులు గ్రహించుచున్నారు ; అయితే, వారు ఈమారణహోమ ప్రయత్నములు నిలుపలేకున్నారు; వారు నాయకుల ప్రస్తుత ధోరణినే ఆక్షేపించుచున్నారు ; కాని, మూల కారణములవైపు తమ దృష్టిని త్రిప్పుటలేదు. జనులలో పరస్పర సంఘర్షమును, స్వార్థాశపై నేర్పడిన హింసాతత్త్వమును మారినప్పుడుగాని, ఆయా జాతులమధ్య పైకగపడు వైరభావముపోదు. కనుక, అహింసాభావమును వ్యాపింపజేయుటే తగు చికిత్స. హింసాపద్ధతిని పరిష్కారము జరిగినను, అది స్థిరము క్షేమకరమూకాదు ; ఈసంగతి క్రిందటి జర్మను మహాయుద్ధమున "వర్సాలేసంధి" రష్యాక్రాంతి వగైరాలవల్లను దర్మిలా సంఘర్షములవల్లనూ స్పష్టము.

ముఖ్యంగా, మన దేశపు ప్రత్యేకపు పరిస్థితులకు అహింసామార్గమేకాని మరొకపద్ధతి కుదరదు ; అనేకమతములు, కులములు, ప్రాంతీయభాషలునుగాక, ఆర్థికంగా ఇక్కడ నున్నంత విభేదములు మరి యేదేశమందును లేవు. రాజకీయంగాను సాంఘికంగానుకూడా కొందరు రాజులు, సామంతులు, సంస్థానాధిపులు నున్నారు. కొందరు జమీందార్లు, తాలూకాదార్లు, మొఖాసాదార్లు నున్నారు. కాని, ఒకరో[illegible] [illegible] నిరాధారులు

కోట్లకొలదిగ నున్నారు. ఇదిగాక, గృహపరిశ్రమలపైన విదేశీయ యంత్ర పరిశ్రమలు దాడిసల్పినవి. అన్నిటికన్న ముఖ్యము, 150 ఏండ్లనుండి మన దేశపు జాతీయస్వాతంత్ర్యం హరించిపోయినది. ప్రజలు నిరాయుధులు నిర్వీర్యులునైనారు. కొందరు రాజభక్తులు, కొందరు జాతీయవాదులు; జనులలో ప్రభుత్వముపైన హింసా భావమేర్పడగానే, ఈవిభేదములు పరస్పరహింసకును స్థానమిచ్చెను. ఇట్టి దుర్గతిలోనుండి తరించుటకు పూర్తియైన అహింసాభావమే మార్గము. మరియు మన దేశపు సంస్కృతికి మొదటినుండియు అహింసాతత్వమే మూలాధారము. దానివల్లనే మన సంస్కృతి ఎన్నియో సంఘర్షముల దాటగలిగినది. అది యెట్లు అంకురించి నదో, అహింసాతత్వము వృద్ధిలోనున్నప్పుడు దేశమెట్లుండెనో, అందులో ఎట్టి పరిణామములు ఆయాకాలములందు కల్గెనో, అందు వలన స్థితిగతులెట్లు మారెనో, ప్రస్తుత స్థితి యేరీతిగ నేర్పడెనో, మనము చూతము.

## అధ్యాయము 2. అహింసాతత్వమెట్టిది?

ముందుగ, అహింసాతత్వపు ముఖ్యసూత్రము: గమనిం తము. ఇతరులను బాధించకుండుటే అహింస: సృష్టిలో నిర్జీవముల కన్న జీవజాతులు విశిష్టమైనవి. విజ్ఞాన సహాయమున వివిధ యంత్రము లేర్పడుచున్నవి. కృత్రిమయత్నమువల్ల ఎన్నియో బలీయమైన మారణయంత్రములలో విషవాయువులు పుట్టించు చున్నారు. వాటి సాయముతో మహానగరముల నవలీలగ నేల మట్టము చేయవచ్చును. సుందరమగు అమూల్యవస్తువుల ధ్వంసము చేయవచ్చును. కాని, ఇన్ని కృత్రిమ యంత్రములతోను విజ్ఞాన సహాయముతోను, ఒక్కనరునిగాని జంతువునుగాని, సృజించ వీలు లేదు. మృతిమైనవానికి పునరుజ్జీవన మీయ లేము.

ఇతరులు మనల హింసించుట కొప్పము. అట్లే మనమును ఇతరుల హింసింపకూడదు. మానవుడు సాంఘికుడు, సంఘములో నుండి జీవించును. సంఘజనుల సుఖదుఃఖములు తనకు వ్యాపించును. చుట్టునున్న సంఘము సంతుష్టమైనప్పుడే తనకును సుఖమేర్పడును. నరులందరి ఆత్మ ఒకే రీతిది ఇతరులకు హింస గల్గుట చూచి నప్పుడు మన మనస్సుకును బాధగల్గును; ఇది ప్రకృతిసిద్ధము.

అయితే, హింసచేయకుండగలమా? లోకమందు చాల మంది మాంసభక్షకులు; వారు స్వయముగ హింసింపకున్నను, ఇతరులు హింసచేసి తెచ్చినదానిని గ్రహించుచున్నారు; శాకాహారులు తిను ధాన్యాదులును జీవజనితములే. ఆవృక్షాదులకును కొంత బాధయుండును. జంతువులు మొక్కలను గడ్డిని తినుటలోను హింసయున్నది; ఆ గోవులపాలు మనము త్రాగుదుము. కనుకనే, "జీవో జీవస్యజీవనం" అన్నారు; ఐతే, వృక్షజాతికన్న జంతువులు, అంతకన్నను, నరజాతియు, గొప్పప్రాణులు. గనుక నరజాతి నేసందర్భములోను చంపకూడదు; జంతువులనుగూడ సాధ్యమైనంతవరకు హింసించకూడదు.

ఇందు కొన్ని సమస్యలు కలవు. ఆత్మరక్షణకై హింస చేయవచ్చునా? ఆత్మరక్షణ అవసరమే. కాని, తరుచు అందుకును హింసాపద్ధతికన్న అహింసయే కార్యసాధనము. ఒకరిపై నొకరికి భయక్రోధములుండుటవల్లనే హింసలు జరుగుచుండును. పరస్పర విరోధములు హెచ్చును. ఒకహింస యింకొక హింసకు కారణమగుచుండును. అందువలన జనులలో నిదానమును విచక్షణయు పోవుచుండును. ఇట్లు హింసాతత్వము అంటుజాడ్యమువలె వ్యాపించి సంఘమంతను బాధించును. అహింసాభావము ప్రేమను జనింపజేయును; అందువల్ల పరస్పరం సానుభూతి గల్గును, మానవులలో (కొంతవరకు జంతువులలోగూడ) సహజముగ సౌజన్యము అంతరంగములో నిలిచియుండును, ఇతరుల ప్రేమను మనకు

చూపినప్పుడు ఈసౌజన్యము వికసించి బయటకు వ్యాపించి, మనలో హింసాబుద్ధిని తొలగించును. కనుక, తుదకు అహింసయే తనకును సంఘమంతటికి గూడ స్థిరలాభమిచ్చును.

హింసాచర్య తత్కాలమునకు జయహేతువైనను, అదిఅగ్ని శేషమువలె తరువాత బాధించును. యూరపు దేశములమధ్య అంతఃకలహములు విడకున్న సంగతి తెలిసదే. రష్యాలోను క్రాంతివల్ల జయమేర్పడినను హింసాతత్వము బొల్షివిక్కునాయకుల నావేశించినది. కనుక; ఇప్పటివరకు రష్యాలో క్రాంతినాయకులే మరల, తమలో యెదురుతిరుగుట, అట్టి వందలకొలది ముఖ్యమనుష్యులను స్టాలినుగారు ఉరిదీయించుటను వినియున్నాము. చీనాలో 1924 నుండి సోవియటు పక్షపు యువకులు ప్రభుత్వ పక్షీయులపైన హింసాచర్యల జరిగించిరి. స్వార్థమునకుగాక ప్రజాక్షేమము స్థాపించుటకనే అట్లుచేసిరి; కాని అందువల్ల చీనులలో ప్రబల కక్షలేర్పడినవి. 1927 నుండి (జాతీయప్రభుత్వపు అధ్యక్షుడైన చీయంగుకైషకు ఈ యువక కక్షీయులను జంతువుల వేటాడినట్లు వేలకొలదిగ చంపించి దారుణమైన హింసాప్రయోగము చేసెను. రమారమి పదేండ్లు ఈతీవ్రహింస దావానలమువలె చీనుల సంఘమును మాడ్చి నిర్వీర్యముచేసినది. ఇప్పుడు జపాను చీనాపైన 1937 నుండి దాడిచేయుచుంటే, పదేండ్లనుండి జరిగిన అన్యోన్య హింసాఫలితమగు దౌర్బల్యమువల్ల చీనులాత్మ రక్షణ చేసుకొనుట కష్టమగుచున్నది.

అహింస యనగా భయపడి జంకుతో వెనుదీయుటకాదు. అహింస బలవంతులకే బాగుగనుండును. సాత్వికగుణములో "సత్వము" ప్రధానము సాత్వికశక్తి వృద్ధిమైనప్పుడే నిజమైన ధైర్యమును తన్మూలమున అహింసయు, జనింపగలవు. క్రిందటి అసహాయోద్యమంలోను సత్యాగ్రహములోను, సరిహద్దురాష్ట్రపు బలీయులగు ఖుదైఖద్మతుగారులును, వీరులగు అకాలీ సిక్కులును ఎక్కువ

అహింసా పరులైరి. అహింస అనగా హింసాచర్యల మానుటే గాక వాఙ్మనశ్శుద్ధియు కావలెను. అనగా కామక్రోధములువదలి నప్పుడింద్రియములు వశమై అహింసాతత్వమేర్పడును

అహింస అనగా దుష్టతకు లొంగుటకాదు. దుష్టతను నిర సించి యణచవలసినదే. ఆపని హింసవల్లకాక అహింసవల్లనే బాగుగ చేయవచ్చును. కాని పిరికితనపు అహింసకన్న హింసయే మేలు. ధీరులు హృదయబలముగలవారే నిజముగ అహింసా పరులు కాగలరు. సరిహద్దురాష్ట్రపు పఠానులు ఖుదై ఖిద్మత్ గారులను పేర గొప్ప అహింసావ్రతులైరి. పరిశుద్ధమైన యీశ్వర భక్తిగలవారు అహింసాపరులగుట సులభము. జగత్ప్రీతయందు ప్రేమ జనులపైని సౌభ్రాత్రమునుగూడ గల్గించును. కనుక, అహింసావ్రతపు చరిత్రలో గొప్ప భక్తులయొక్కయు భక్తి మత ములయొక్కయు వృత్తాంతములుగూడ గమనింపదగును. *

క్రియలోనేగాక వాక్కులోను మనస్సులోనూ హింస కూడదు. క్రోధబుద్ధివలన పరుషవాక్యములు వచ్చును. అందు వలన ఇతరుల మనస్సుకు నొప్పి గలుగును, ఉభయులమధ్యను విరో ధమేర్పడును. కనుక త్రికరణశుద్ధియున్నప్పుడే, అహింస సరిగ నుండును. సత్యమే వాక్శుద్ధికి ముఖ్యాధారము, కనుక, అహింసా వ్రతి ఎప్పుడును సత్యము పాలింపవలెను.

పరులకు హానిచేయు తలపులేనప్పుడు చంపినను హింస అని పించుకోదు. వైద్యుడు చికిత్సకై చేయు గాయమువలన ప్రమా దించినను అది హింసకాదు.

మరియు స్త్రీలు మానరక్షణవర్గై రాలకు మార్గాంతరము లేనప్పుడు తప్పనిసరియగు హింస చేయుట దోషముకాదు ఈసంగ

* అహింసావ్రతపు ప్రవర్తకుడగు గాంధిమహాత్ముడు ప్రతిదినమును బహి రంగముగ ఈశ్వరప్రార్థన చేసెడివాడు.

తులను మనపూర్వులును అంగీకరించిరి. తల్లిదండ్రులు బాలునీ బాగుచేయుటకు కొద్దిగ దండింతురు. అది హింసకానేరదు.

బాధానివృత్తికి తప్పని సరియైనప్పుడు చంపవచ్చునని తోచును. గాంధిమహాత్ముడు సబర్మతీ ఆశ్రమములో నొక యావు రోగముతో మరణబాధ వడుచున్నప్పుడు, ఇక ఆవ్యాధి కుదరదని స్పష్టముగ నిశ్చయమైనమీదట దాని దుర్భరబాధా నివృత్తికై దానిని తుపాకితో చంపించెను.

మానవప్రేమ అహింసకే రూపాంతరము, కనుక సత్య ప్రేమల పరిణామములను మనము ముందుగ గమనింపవలెను.

పరస్పరసౌహార్ద్రము మానవుల సహజస్వభావము. వాతావరణ సౌమ్యముగను సహజముగను ఉంటే, సంఘమంతటను అహింస వ్యాపించును. కాని ఆత్మరక్షణయు స్వాభివృద్ధియత్నమును ప్రకృతి సిద్ధములు; కనుక సంఘములో ఆర్థికముగనో, రాజకీయముగనో, సాంఘికముగనో, కొందరు తక్కినవారిని అణచియుంచేయెడల ఆబాధితులు బాధకులమీద ద్వేషముగల్గి వారికి హానిచేయజూతురు. కనుక, ఏసంఘమందైనను విశేషవ్యత్యాసము లేకుండుట మంచిది. ఒకరిని బాధించుట కలవడినవారు హింసాత్మకులై తమ్ము నితరులు బాధింతురని భయపడుచుందురు. సంఘములో కొద్దిమంది సర్వాధికారులు, తక్కినవారు దాసులు. కొద్దిమంది శ్రీమంతులు, తక్కినవారు దరిద్రులు, కొంతమంది "కులీనులు", తక్కినవారు "నిమ్నజాతి" వారు. కొంతమంది విద్యాగర్వితులు, తక్కినవారు శుద్ధమూఢులు. ఇట్లు పరస్పర వ్యత్యాసము చాల హెచ్చుగనుంటే అప్పుడు సంఘములో పరస్పరక్రోధము, హింసాభావము వ్యాపించుట సహజము. ఇట్లే స్త్రీలకు పురుషుల మధ్యను. కనుక, హింసాతత్వచర్చ అసలు నైతికమే యైనను, దానినుండి అహింసాతత్వముకు పరిణామమునుగూర్చి చర్చించుటలో, ఆనుషంగికముగ

సాంఘికార్థిక రాజకీయ పరిణామములను గూర్చియు, అందుల ఫలి తముల గూర్చియుగూడ సూక్ష్మముగనైన చర్చించుట అవసర మగును. ముఖ్యముగ మనదేశ చరిత్రలో ఆయాయుగములందు సాంఘికాది విషయములందు కొన్ని మార్పులు తీవ్రవ్యత్యాస ములును కలిగినవి, వాటివల్ల జనుల తత్వములో పరిణామము లేర్ప డినవి. వ్యక్తులమధ్య హింసాతత్వము లెట్లేర్పడునో, సంఘమం దును అట్లే యేర్పడును ఒకవ్యక్తి ఔదార్యము దయ గనపర్చి నప్పుడు, రెండవ వాడతనిపైన ప్రేమగల్గియుండును, ద్వేషము గన పర్చిన హింసాభావుడగును. అట్లే ఆయాసంఘపు వర్గములమధ్యను జాతులమధ్యనుగూడ నుండును. కాని ఆధ్యాత్మిక ప్రవృత్తి తక్కిన అన్నిటికిని మూలము కనుక దానికి మనము ప్రాముఖ్య మీయవలెను.

## అధ్యాయము 3. నరజాతి ఆరంభము.

సృష్టి మొదటినుండియే నరజాతి లేదు. విశ్వమందు సౌర కుటుంబమేర్పడిన కొంతకాలముకు సూర్యునుండి విచ్ఛిన్నమై మన భూమి యేర్పడినదని వైజ్ఞానికులు తేల్చినారు. అప్పుడది మహాగ్ని గోళమువలె నుండి, క్రమముగా కొన్నికోట్ల యేండ్లకు చల్లబడి, జీవులేర్పడుట కవకాశము కలిగినది ; నీరును నేలయు ప్రత్యేకమై ఆబడ్డున జిడ్డువలె (సూర్యకాంతి ప్రభావమున) దృష్టిగోచరము కాని అత్యల్పమైన జీవులేర్పడినవట. రుచిశక్తి కాంతి గ్రహించు శక్తిగల్గి, అవి జలాదులాస్వాదించి వృద్ధియైనవి. వాటినుండి క్రొత్త ప్రాణులు పుట్టుచు వచ్చినవి. ఇట్టివాటినుండి కొంతకాలముకు మత్స్యజాతి యేర్పడినది. ఆ యారంభస్థితిలో ప్రకృతి ప్రకోప మును జీవులకు ప్రాణహాని భయమును చాలా హెచ్చు. అప్పటికి చేపలే పెద్దజంతువులు ; అవి నీళ్లలో నోరు తెరిచిపోవుచు, దొరికిన

అల్పజీవులను మ్రింగుచుండెను. మహామీనములు చిన్నచేపల దినివేయుచుండెను. ఇట్లు స్వజాతీయముల దిను పద్ధతినే మన పూర్వులు (మాత్స్యన్యాయ) మన్నారు. ఇట్టి ప్రవృత్తి చేపలలోను సర్పాదులలోను గూడ కలదని వైజ్ఞానికులు కనిపెట్టినారు.

మత్స్యయుగము తరువాత కొంతభూమిపైనగూడ సంచరింపగల "కూర్మజాతి" పుట్టినది. అంతట సరీసృపములు, వాటిలో పెద్దవగు అజగరములుగూడ పుట్టి, ఆకాల మందు భూమిపైన ఆధిపత్యము గల్గియుండినవి. వాటి కన్నిటికి వాక్శక్తి లేదు. బుద్ధి వికాసమును చాల తక్కువ. వాటికి తమతోటి ప్రాణులపైన స్నేహభావ మసలే లేదు. ఈకాలమును "మధ్యజీవయుగ" మందురు. ఈప్రాణులకు విపరీతమైన హింసా ప్రవృత్తి యుండెడిది. వీటిలో కొన్నిటి దేహములోనే విషముండును. ఈజంతువులు నేటికిని తోటిజంతువులపొడ గిట్టక. విడిగనే యుండును; గుడ్లను కని విడిచిపెట్టును. పొదగవు, పిల్లలను పెంచవు. ఆకాలపు జీవజాతులలో తల్లిపిల్లలమధ్యగూడ పరస్పర సంబంధమూ పరస్పర ప్రేమయూ లేవు.

తరువాత ప్రళయమేర్పడి, కొంతకాలమునకు క్రొత్త పరిస్థితి కల్గినది. ఈ "నవజీవయుగ" మందు "మామలు" లను క్రొత్త జాతి యేర్పడినది. ఇవి సస్తనులు. వీటి ఆడజంతువులు స్తనముల పాలుగల్గి, తమ శిశువులను పాలిచ్చిపోషించి, తమలోనుంచుకొని పోషించును. ఈక్రొత్తజాతి ప్రాణుల హృదయములో ప్రేమయు స్నేహబుద్ధియును గల్గినవి. అవి గుంపులుగ కలిసి యుండ నేర్చినవి. ఈజాతిలో ముందువచ్చినవి పందులు; కనుక ఇది "వరాహయుగ" మనవచ్చును; పశువులు, ఏనుగులు, వగైరాలును సస్తనులే. ఇవి యన్నియు స్వజాత్యభిమానము గల్గియుండును. ఆకాలమందే పక్షులు నేర్పడినవి; అవియు తమగుడ్లను రెక్కలతో పెచ్చబెట్టి పొదుగును. ఇట్లు ఆకాలమందు ప్రేమభావపు సూచనగల్గి,

అహింసాభావమున కవకాశమేర్పడెను. అప్పటికవి యత్యల్పములు. అయితే లక్షలకొలది యేండ్లుగడచి, మధ్యమధ్య ప్రళయములు దాటుకొలది, పూర్వము ప్రబలమైన సర్పాదుల ప్రాబల్యము తగ్గినది. వాతావరణము మారిపోయి, మహాజగరములు, "దినోసార్లు, టెరొడాక్టిలులు, వగైరాకొన్ని భీకరజాతులనలే నశించిపోయినవి. అత్యుష్ణముతగ్గి, ఉగ్రతత్వపుజీవులు వెనుకబడినవి. లోకము కొంతచల్లబడినది. స్తనులలోను సింహాశరభాదులు భౌతికముగ బలీయములైనను కొంతకాలమునకు క్షీణించినవి. చిన్నవైనను స్నేహరసముగల కుక్కలు గోవులు మేకలు కోతులు గుఱ్ఱములు వృద్ధియైనవి. అవి ఆపత్తుగల్గినప్పుడు ధ్వనిచేయుచు, పరస్పరము భావము దెలుపుచు సాంఘికభావమారంభించినవి.

కొన్ని కోతిజాతులకు తక్కిన మృగములకన్న చురుకును, మెదటిశక్తి హెచ్చి, క్రమముగ "నరవానరజాతులేర్పడినవి. వెనుకటి జంతువులకన్న వీటి తెలివి తేటలు హెచ్చు అంతట లోకమంతయు మరల విపరీతపు మంచుతో నిండిపోయినది. ఈపరమ హిమము నుండి తెరలేచి జగన్నాటక రంగము నరజాతితో వెలువడినది.

పూర్వయుగముల జంతువులకన్న మనుష్యులకు మెదడును బుద్ధిబలమును హెచ్చు. క్రమముగ హస్తనైపుణ్యమును సహృదయతయు వృద్ధియైనవి. కాని, ఆరంభనరులు చాలవరకు జంతువుల వలెనే ఉండుచు వచ్చినారు. పరిణామము మిక్కిలి క్రమముగానే గల్గినది; అందుకు వారిలో నిరంతరకృషి జరుగుచు వచ్చినది.

ఆదిమ నరులు పరస్పర భయముగల్గి తామస భావులై ఒకరినొకరు తరచు చంపేవారు. క్రమముగ వారి భుజబలముకన్న మనశ్శక్తియు నైతిక భావములును బాగుపడినవి.

ఈ జీవ పరిణామపు చరిత్ర విచిత్రమైనది. అవి స్వాభివృద్ధికై జేయుచుండిన యత్నములు, ఆయపూర్వ ప్రాణుల కృషి

ఫలితముగ వాటి వంశములందు వేలకొలది యేండ్లు జరిగిన మార్పులు, వాటినుండి, ఇప్పటి జంతుజాతుల అంగములందు గలిగిన సమన్వయమును, విశ్వరూపుని యద్భుత మహిమను వెల్ల డించును. అందుండి కొన్ని నీతులను నేర్చుకొనవచ్చును. వీటిలో ముఖ్యము :—

కేవలం పశుబలమూ హింసాతత్వమూ గల జంతువులు పూర్వం తత్కాలమునకు సర్వాధికారముతో ప్రబలియుండినా, ప్రకృతి పరిణామము కనుగుణముగ మారలేక, అట్టి క్రూరజంతువులు చాలవరకు తమ ప్రాబల్యము కోల్పోయినవి. అట్లుగాక, విచక్షణ ప్రేమభావము ఔదార్యముగల అహింసాయుతజీవులు నవ్యపరిస్థితి కనుగుణముగ నిల్చి వృద్ధియైనవి. అట్టివి తాత్కాలికముగ కష్టములోనున్నను, నైతికశక్తి వృద్ధిజేసికొని, మరల వృద్ధి కావచ్చును. ప్రపంచములో కేవల హింసాప్రకృతి వెనుకబడి ప్రేమతత్వపువే వృద్ధియగుట సృష్టిసంకల్పమని తోచుచున్నది. క్రమముగ పూర్వయుగముల జంతువులే ఒకరీతిగ "నారసింహ" జాతిగ మారి, తుదకెట్లో అందు కొన్ని మనుష్యజాతిగ పరిణమించినవిగదా.

కనుక, జంతుసహజమగు పశుతత్వము నరు లందరిలోను వేలకొలది యేండ్లవరకు ప్రబలి, తరువాతగూడ కొంతకాలము పూర్వవాసన ఫలముగ నిమిడియుండెనని వైజ్ఞానికుల యభిప్రాయము. మనకు తెలిసినంతవరకు యూరప్ అమెరికా ఆఫ్రికా వగైరాల ఆదిమనరులలో పశుస్వభావము ప్రబలినది. వారు చాలవరకు మాంసము దినుచుండిరి. కొందరు వట్టి నరాశనులు, అనగా వారు మనుష్యమాంసము తిని యాకలి తీర్చుకొనిరి. ఆహారముగ తోటి నరుని జంపుట దారుణహింస యని మనకిప్పుడు తోచుట సహజము. కాని అప్పుడు నరాశనులు చాల దేశములందుండిరి. మధ్యాఫ్రికావంటి. కొన్నిచోట్ల ఈ శతాబ్దివరకును ఇట్టి "కానిబలు" లుండిరని చారిత్రకులు చెప్పుచున్నారు.

ఇదిగాక, అన్ని దేశములలోను ప్రాచీన నరులు తమ దేవత లకు నరబలినిచ్చు ఆచారముండినదట. కనుక, ఆరంభస్థితిలో నరులలోను హింసాతత్వము చాల హెచ్చుగనే ఉండినది. ఇక బాబిలోనియా పారసీకము మున్నగు పూర్వపు నాగరిక దేశము లందును ప్రాచీన కాలమందు విత్తు చల్లుట కోతలు కోయుట మొదలగు విశేషములా కాలమందు తమలో కులీనుడై ధీమంతు డగు యువకుని ఖండించి, ఆతని రక్తముతో నేలను తడుపుట, ఋషభాదులను యజ్ఞబలిగా నిచ్చుటయు, ఉండెనట.

అంటుజాడ్యములును కారణము బోధపడని ప్రమాదము లును గల్గినను, ప్రాచీన నరులు అవి దేవతల క్రోధఫలితములని యెంచి, వాటిశాంతికై జరిగించు జాతరలలో దున్నలను మేకలను జంపుచు, విశేష మద్యపానముగూడ చేయుచుండిరి అట్టి యాచారముల చిహ్నము లీదేశమునందును నిమ్నజాతులలో మిగిలియున్నవి.

## అధ్యాయము 4.

## భారతదేశపు ప్రారంభస్థితి.

ఇక భారతదేశపు ప్రాచీనస్థితిని గమనింతము. ఆయారంభ కాలమందు దేశమందు అధమం మూడు భిన్నజాతులుండినట్లు సూచనలున్నవి. వీటి సంస్కృతులును వేరు. ఆర్యులు ద్రావి డులుగాక, ఆదిమవాసులగు ఒక కూ్రరజాతియుండెను. దక్షిణ దేశపు అడిచనల్లూరు మున్నగు ప్రదేశములందు ఏడెనిమిది వేల యేండ్లక్రిందటి నరుల పనిముట్లు వస్తువులు దొరకినవి. ఇట్లే పంజాబులోని మహేంజదరో? సింధులోని హారప్ప మొదలైన

చోట్ల త్రివ్వగా, గొప్ప పూర్వనగరముల శిథిలములు బైట పడినవి. వారిభౌతిక నాగరికత చాల గొప్పదే. వారిది ద్రావిడ నాగరికతయని కొందరు నిశ్చయించినారు ; ఇది సుమేరియను నాగరికతను బోలియున్నట్లు చెప్పుదురు. * ఆశిథిలములలో కొద్దిగ లేఖనమునున్నది. కాని, ఆయక్షరముల గుర్తులింకను సరిగ తెలియ లేదు.

కనుక వాని భావము తెలియదు. ఈశిథిలములలో కొన్ని యేడెనిమిది వేలకిందటివట, అప్పుడు లింగపూజ జరుగుచుండిన చిహ్నములున్నవి. అదిమ జనులును యిందు మిశ్రితులై యుండిరేమో తెలియదు. ఋగ్వేదములో దస్యు (దాస) లనబడు ఆర్యులతో పోలినవారు వీరే కావచ్చు. దస్యులు లింగదేవులు అని ఋక్సంహితలోనున్నది. వీరు మిక్కిలి వీరులైనట్లును వీరి స్త్రీలును యుద్ధములందు పాల్గొని ఆర్యులతో పోరినట్లును కొన్ని సూచనలున్నవి. ♦ ఈతాటకలు వీరస్త్రీలు.

దక్షిణదేశపు ద్రావిడులకు 1800 క్రిందటి వాఙ్మయము ద్రవిడ భాషలో నిల్చియున్నది. క్రీ॥ పూ॥ వాఙ్మయమేదియు ఆర్యేతరులది మనదేశమందు లేదు. ద్రావిడుల మొదటి గ్రంథములనాటికే ఆర్యసంస్కృతి ప్రభావ మాప్రాంతమందు వ్యాపించినది. అప్పటికి బౌద్ధజైన సంస్కృతియు ఆప్రాంతములో నుండినది. కనుక, "దాస" జనుల సంస్కృతి తెలుపు ఆర్యేతర వాఙ్మయ మెక్కడను లేదు.

---

* ఇవి ఆర్యులలోనే ఒకశాఖవారి సంస్కృతియని అవినాశచంద్రదాసు గారు Rigvadic India లో సూచించినారు.

♦ విశ్వా ఆపో అజయద్దాస పత్నీః } ఋక్సం 5—30—5
దాసపత్నీ రహిగోపాః } ,, 1—32—11

శ్రీరాముల కాలమునాటికి మధ్య దక్షిణ దేశములందు రాక్షసులనబడిన యొకజాతివారుండిరి. వారు నరాశనులు; పచ్చి మాంసమునుగూడ ధారాళముగ దినుచు, రాత్రులందు సులభముగ అడవులందును సంచరించుట కలవడి, ఆర్యులను సులభముగ మోసపుచ్చుమాయావులై యుండిరి, ఈజాతివారును శివపూజకులే కావచ్చు; కాని వీరు మిక్కిలి క్రూరులు, ఇతర దేశములందు చారిత్రిక కాలమందు నుండిన నరాశను లీజాతివారే కావచ్చు; పూర్వ మొకప్పుడు దక్షిణహిందూ దేశమును సింహళలంకయు దక్షిణాఫ్రికాయు కలసి ఒకే మహాదేశముగ నుండెనట; ఈయన్ని ప్రాంతముల పూర్వజీవుల శేషములనుపోల్చగా అవి యొకేరకపువి, పరస్పరం సంబంధించినవి; అని తెలిసినది. ఈ నిశాచరజాతి ఋగ్వేదములో చెప్పిన "దాస" జాతి ఒకటే అగునో కాదో తెలియదు, అసురులను మఱియొకజాతియు పూర్వముండెను వారార్యులు, చాలకాలం భారతీయార్యుల కిష్టులై యుండిరని కొన్ని ఋక్కులు సూచించును. కాని వీరు తరువాత భారతీయార్యులకు విరోధులైరి. అసురులలో చాలమంది "ఇరాను" (ఇప్పటి పారసీకము) లో నుండిపోయినట్లు "అవెస్తా" గ్రంథము తెలుపును. కొందరు అసురులు మనదేశపు "రాక్షసు" లతోను "దాసు" లతోను చెలిమిచేసుకొని ఆర్యులతో పోరిరి. * సప్తసింధు అనబడిన సింధు పంజాబు ప్రాంతమంతటను ప్రబలులై యుండిన ఈ "దాస" జాతులపైన వృత్రుడను అసురరాజు చాలకాలము పాలించెను. అతడు మిక్కిలి బలీయుడు ప్రజ్ఞావంతుడు, మహాభక్తుడునని మహాభారతపు శాంతిపర్వంలో "వృత్రగీత" లో చెప్పబడినది, అది

---

* పురాణ గ్రంథములలో అసురులను రాక్షసులను ఒకేజాతిగ చాలచోట్ల సూచించిరి. కాని 6 వ శతాబ్దిలో నుండిన అమరసింహుడు ఈభేదము గమనించి అసురులపేర్లు "అసురా దైత్య......పూర్వదేవాస్సురద్విషః" అని వేరుగను, "రాక్షసః కోణపః ......నైఋతో యాతురక్షసీ" అని వేరుగను తన నామలింగానుశాసన" ములో తెల్పియున్నాడు, సంబంధము లుండినవి. రావణుడసురుడైనను తల్లికేకసి రాక్షసజాతిదని ఉత్తర రామాయణములో వ్రాసియున్నారు.

మెట్లున్నను, ఋగ్వేదమందును అతడు మహాశూరుడు "అహి" అని చెప్పినారు. "ఇంద్రు" డను వీరుడు ఆర్యుల నాయకుడై వృత్రునితో దీర్ఘయుద్ధము చేసెను. * 1

ఈ యింద్రుని పేరు బాబిలోనియా చరిత్రలోను గన్పడును. "కేశీ, ఊరు, ఉమా" మొదలగు కొందరు ఇంద్రునికి తోడ్పడినట్లు ఋగ్వేదములో చెప్పబడినది. * *2 వీరిపేరులు బాబిలోనియా చరిత్రలోను ఉన్నవి. తుదకెంతో కష్టముమీద ఇంద్రుడు గెల్చెను. అప్పటికి "అక్కేడియనులు, ఎలమైట్లు మున్నగు ఆర్యజాతీయులు బాబిలోనియాప్రాంతము వశపర్చుకొనిరి. వారికి మంచి అశ్వ బలముండెను. ఇంద్రునికిని మంచి గుర్రపు దళముండెనట. ఈ బలమువల్లను, "దాస" జాతిలోనే విభేదమేర్పడి, కొందరార్యులకు తోడైనందునను, తుదకు విష్ణుసహాయముతో ఇంద్రుడు వృత్రు నోడించి చంపెను. *3 బహుశః ఆయుద్ధమే, తరువాత సంస్కృత వాఙ్మయములో "సురాసురయుద్ధము, దేవాసుర యుద్ధము" అని వివిధముగ వర్ణించిరి. ఆమీద శంబరుడను "దాస" నాయకుడును ఆర్యులతో తీవ్రముగ పోరి, తన నగరములను కోల్పోయెను. కాని తరువాత 40 ఏండ్లు గహనములలో యుద్ధము సాగిన మీదటనే శంబరుడు ఇంద్రునకు వశమయ్యెను. * 4 అప్పుడు ప్రచండమగు భూకంపములును కల్గి అందువల్ల మహేంజదరోవంటి నగరములు

---

* 1 వృత్రింజఘన్వాన్యసృజద్విసింధూన్ (ఋ. 4—19—8)
యోహత్వాహిమరిణాత్ సప్త సింధూన్ (ఋ. 2—12—3)

* 2 అవావచీత్సారథిరస్యకేశీ (ఋ. 10—102—6)
సతో వీరాః ఉరవో వ్రాతసాహాః (ఋ. 6—75—9)
ప్రథమాస ఊమాః (ఋ. 1—6—7)

* 3 వృత్రుని చంపినందుకు ఇంద్రునికి బ్రహ్మహత్యాపాపం పట్టుకొన్నదని, దానిని బ్రహ్మదేవుడెట్లో ఇంద్రునికి వదల్చుట చాలా కష్టమయినదని మహాభారత శాంతిపర్వములో చెప్పినారు.

* 4 నవతించనవేంద్రః పురోద్వ్యైరచ్ఛంబరస్య (ఋ. 2—19—6) యశ్శంబరం పర్వతేషుక్షియంతం చత్వారింశ్యాంశరద్యన్వవిందత్ (ఋ. 2—12—11)

భూమిలో కప్పబడియుండునని కొందరు ప్రాచ్యతత్వజ్ఞులూహించినారు. ఆయుద్ధమందింద్రునికి దైవసహాయముగలైనని భారతములో చెప్పిరి. అది యిట్టిదే యేమో ? భారతదేశమందు మనకు తెలిసిన మొదటి గొప్ప రక్తపాతములు హింసాచర్యలు ఈ సురాసుర యుద్ధములే.

## అధ్యాయము 5.

### వేదసంస్కృతి—ఋగ్వేదము.

వేదములన్నియు ఆర్యఋషులు రచించినవి. వీటిలో ఋగ్వేదసంహిత అతిప్రాచీనము. అది క్రీ॥ పూ॥ పదివేల యేండ్ల క్రిందనే రచింపబడెనని తిలక్‌వంటి కొందరు మహనీయుల అభిప్రాయము. "అంత ప్రాచీనము కాకున్నను సుమారు నాలుగువేల యేండ్ల క్రిందటిది, నేటికి ప్రపంచమందు నిల్చియున్న ధార్మిక వాఙ్మయ మంతటిలో ఇదే అత్యంత ప్రాచీనము" అని యిప్పటి విమర్శకులందగును అంగీకరించినారు.

ఋగ్వేదముగాక, యజుస్సు సామము అని మరిరెండు వేదములు. ఈరెంటి సంహితలు చాలవరకు ఋగ్వేదపువే. యజుర్వేదములో యజ్ఞముల కర్మకాండము ముఖ్యవిశేషము; సామవేదము ఋక్కులే గేయరూపముగ అమర్చబడినవి. ఇవిగాక అధర్వవేదము ఆయుర్వేద ధనుర్వేద తాంత్రికాది శాస్త్రముల మూలాధారము.

ఈనాల్గు వేదములకును మూలములగు సంహితలుగాక వాటి సందర్భములు వివరించి అప్పటి గాథలనుదెల్పు బ్రాహ్మణములున్న

ఆధ్యాత్మిక పరిశోధనల వివరించు ఉపనిషత్తులును కలవు. ఇవి సంహితల తరువాత ఏర్పడిన వందురు.

వేదములన్నియు ఇప్పటి భారతీయార్యుల స్వభాషలో నున్నవి. భారతీయార్యుల సంస్కృతి యెట్టిదో తెలియుట కింత కన్న గొప్పగ్రంథము లేదు.

ఇందు ఆర్యుల ధార్మికభావములు దేవప్రార్థనలునే ముఖ్య ములు, కాని అక్కడక్కడ కొన్ని సాంఘికవిషయములు, దాస జనులతోను అసురులతోను జరిగిన యుద్ధములు వగైరా వృత్తాంత ములును చెప్పబడెను.

అసలు ఆర్యజాతి చాలగొప్పది. ఇప్పుడు యూరపు అమె రికా పాలించు జాతులన్నియు ఆర్యభాషికములే. కాని ఈజాతు లన్నియు మిశ్రితములైనవి. (వీరు ఆర్యులే అని చెప్పుకొనుట కలదు) ఇంగ్లీషు, ఫ్రెంచి, జర్మను, రష్యను, పారసీ, సంస్కృతము, పాలి, హిందీ, బంగాళీ వగైరా భాషలు అసలు ఒకే ఆర్యభాష నుండి యేర్పడినవి. వారల ముఖవైఖరిలోను పోలికయున్నది. దేహనిర్మాణములోను సామ్యముకలదు. అతి ప్రాచీన కాలమందు ఒక కేంద్రస్థలమునుండి, తరువాత వారి శాఖలు విడిపోయి చెరి యొక దేశముచేరియుందురు. ఆఅసలు కేంద్రస్థలము ఎక్కడనో స్పష్టముగ తెలియదు. ఉత్తరకాశ్మీరమో లేక మధ్యమ ఆశి యామో కావచ్చును.

వైదికార్యులు సోదర జాతీయగు అసురులతో చాలకాలము మైత్రి గల్గి తరువాత విరోధపడి సప్తసింధు దేశమును వశపర్చు కొనిరిగదా. వీరి నాయకుడైన యింద్రుడు, అంతటితో తృప్తి నొందక క్రమముగ తూర్పునకును వ్యాపించి హిమాలయ గిరి యందు "త్రివిష్టపము" (ఇప్పటి టిబెత్తు?) ను వశపర్చుకొని తన

కేంద్రస్థలముగ జేసికొనెను. ఇంద్రుడు తరువాత వేదములో చాలాచోట్ల దేవుడుగ భావింపబడెను. చారిత్రికముగ ♦ మనకు తెలిసియున్న మొదటి ఆర్యమహారాజు.

ఆర్యులు ఇతర దేశములలోను "అనార్యు" లతో యుద్ధము చేయవలసివచ్చినది. అమెరికాలో ఆర్యేతరులను ఆర్యులు నిర్దయగను అన్యాయముగను రూపుమాపిరని ప్రిస్కాటు మున్నగు పాశ్చాత్య చారిత్రికులే వ్రాసియున్నారు. యూరపులోను కొన్నిచోట్ల యిట్లు జరిగెను; కాని చాలవరకు ఆయాజాతులు మిశ్రితులైనారు. వారికి ప్రత్యేకమగు ఆధ్యాత్మిక సంస్కృతిలేదు. యూదులు మాత్రము తమ మతమును సంస్కృతినినిల్పుకొన్నారు.

భారతీయార్యులు మొదటినుండి తమ ప్రత్యేకమతమును సంస్కృతియు గల్గియుండిరి. వాటి ననేక విధముల వృద్ధిజేసిరి; అందువల్ల లౌకికబలమునకును వ్యాప్తికిని వారు లోటు రానీయలేదు. ఆయాప్రాంతీయులతో జరిగిన సంఘర్షములో ఆర్యులీ దేశమందును కొంతవరకు హింసాపద్ధతి తీవ్రరక్తపాతము జరిగించిరి; లోగడ చెప్పినవేగాక, సుదాస దివోదాసుల మధ్య యుద్ధమును తీవ్రరక్తపాతమును సూచించును. అది అప్పటి దేశకాల స్థితినిబట్టి సహజమే.

ఆకాలమందే మధ్యహిమాలయములనుండి బదరీ కేదారాదులద్వారా కొందరార్యులు తూర్పున గంగా యమునా ప్రాంతములందలి ఫలవంతములగు భూములవశపర్చుకొనిరి. ఆసందర్భమున గూడ అప్పుడప్పుడు ఆర్యేతరులతో యుద్ధములు జరుగుచు వచ్చినవి.

♦ విదేశములోను పూర్వం గొప్ప నాయకులను వారి మరణము తరువాత దేవతలుగ భావించేవారు మనదేశంలోను ఇప్పుడు ఈశ్వరావతారము లనబడు శ్రీరాముడు, కృష్ణుడు, బుద్ధుడు, గొప్ప చారిత్రక పురుషులుగ పూర్వం జీవించినవారే.

అంతట అగస్త్యాది ఋషులు వింధ్యపర్వతమును సాధించి దక్షిణాపథమునకు బయలుదేరిరి. ఋషుల ఆశ్రమములు ముఖ్యమైన నదీ తీరములందును కొన్ని కొండల యొద్దనుగూడ స్థిరపడినవి. అగస్త్యుడు భరద్వాజుడు, వాల్మీకి, వసిష్ఠుడు మున్నగు నొక్కొక కులపతి ఆశ్రమములో ఇంక నెందరో యుండుచు శిష్యులకు విద్య నేర్పుచుండిరి. ఇట్లవి, క్రమముగ వలసగ్రామములైనవి. ఈఋషు లలో కొందరు అస్త్రవిద్య తెలిసినవారలైనను, అహింసావ్రత మవలంబించినవారు కనుక, సాధారణముగ వారు తమ్ము నెల్లైన బాధించి లేవగొట్టబూను దాసులను రాక్షసులను చంప యత్నింపక క్షత్రియధర్మ మవలంబించిన ఆర్యరాజుల నాశ్రయించు చుండిరి. బ్రాహ్మణ వృత్తిలోనుండి ఆర్యసంస్కృతి నున్నతస్థితికి తెచ్చు చున్న ఋషివర్గములను వారి ఆశ్రమములను రక్షించుట ఈరాజులు తమ ప్రత్యేక బాధ్యతగ నెంచుకొనిరి. కనుక వారు ఆర్యేతరులతో యుద్ధములు చేయుచు వారి నోడించుచుండిరి. ఇట్లు భారతీయు లును కొంత హింసా పరులుగనుండిరి.

కాని ఋగ్వేదమందు కొన్ని ఘోర యుద్ధములను వర్ణించు నవి హింసా సంబంధపువి కావు. ఆకాశమందు వర్షములు కురియు ముందు మేఘజలము క్రిందబడకుండ ఝంఝామారుతముతో గలుగు సంఘర్షము, క్షామదేవతను జయించు ఇంద్రుడు తన యింద్రధనుస్సు వజ్రమను పిడుగుతోను మేఘముల భేదించి వర్ష మును భూమికిరాబట్టుట, భౌతిక యుద్ధమువలె వర్ణింపబడినది. ఇవి రూపకాలంకారపు కవిత్వరచనలు. క్షామమును అహి అనగా వృత్రునితో పోల్చి అంతరిక్షపు ప్రకృతియుద్ధము హిమాలయపు కొండలలో భీకరముగ చెలరేగుటను నిజమైన రక్తపాతపు సంగర ముగను చారిత్రకమగు వృత్రవిధగను సూచించిరి. ఇట్లే ఉషః కాలము రాత్రినుండి పుట్టుట సూర్యుడు దాని వెంటనంటుట హిమ గిరిలో నతిసుందరముగ గన్పడు ప్రకృతి దృశ్యములు. ఉషాదేవి

స్త్రీయైనట్లును, దానిని మొదట రాత్రియు తరువాత సూర్యుడు వెంబడించినట్లును ఋక్కులలో చెప్పబడినది. ఇంద్రుడహల్యాజారుడను కథయు నిట్టిదే. ఈసందర్భములు మరపుకురాగా, చాల శతాబ్దముల తరువాత నేర్పడిన పురాణములందు పూర్వపు ఉత్ప్రేక్షలు రూపకములు నిజమైన రక్తపాతపు హింసాపద్ధతులనియో ఇంద్రాది దేవతల అవినీతి కార్యములనియో వివరించుట జరిగినది. మొత్తముమీద వైదికార్య సంస్కృతి యిప్పుడు కొందరనుకొనునంత హింసాపూరితముకాదు. భారతీయులు తరచు ఆర్యేతరులతో పోరాడుచున్నను, వారిని నిర్మూలనము చేయుటకును, వ్యర్థహింస చేయుటకును విశేష ప్రయత్నముచేసి, "అనార్య" జాతుల రూపుమాపలేదని యెంచవచ్చును

మొదటినుండి భారతీయార్యులకాధ్యాత్మిక భావముండెను. వారు మిత్రవరుణేంద్రాది దేవతలను తమతమగీతములతో ప్రార్థించుచుండిరి. అందు కొన్నిటియందు యుద్ధము కావలెనని యున్నను, తఱుచు పరిశుద్ధమగు ఔన్నత్యాశయముకలదు. విశ్వస్వభావ మెట్టిదో, ఈజగత్తునకు నియామకమగు శక్తి యెట్టిదో ఋగ్వేద కాలమందే ఋషులు చర్చించుచుండిరి. వారి మనోభావములు ఆచారములు వేదములందు ఎట్టి విమర్శమును లేకుండ చెప్పబడినవి. వీటివల్ల వారి సాంఘికాచారములును తెలియును. అప్పటికి ఆర్యులలో కొందరు క్షత్రియవృత్తిని చేయుచుండిరి. కాని, వంశానుగతమగు చాతుర్వర్ణ్యపద్ధతి యింకను యేర్పడలేదు. రాజగు వృత్రుడు బ్రాహ్మణుడైనందున, అతనిని చంపినందు కింద్రునికి బ్రహ్మహత్య బాధగల్గినది.* విశ్వామిత్రుడు కొంతకాలము క్షత్రియుడై తరువాత బ్రాహ్మణుడైనాడు. పరశురాముడు బ్రాహ్మణుడుగనుండి తరువాత క్షత్రియకార్యముల జేసెను. ఋగ్వేద సంహితలో పురుషసూక్తమందు మాత్రము ఈపేర్లున్నవి. కాని ఇందైనను నాలుగువర్ణములున్నట్లు చెప్పక విరాట్పురుషుని దేవతలు

* మహాభారతం— శాంతిపర్వం: [illegible]

యజ్ఞపశువుగ జేసి ఆయావర్ణములు అందులనుండి యుత్పత్తి అయినట్లు నుడివిరి. మరియు మనస్సునుండి చంద్రుడు, ముఖమునుండి యింద్రాగ్నులు పుట్టిరని ఉత్ప్రేక్షించిరి....... 1 అనగా సృష్టియే ఒక మహాయజ్ఞము. దృశ్యప్రపంచమంతయు ఈశ్వరుని దేహము; దాని వివిధాంగములు వివిధప్రవృత్తుల వారి యుత్పత్తిసూచకములు అని చిత్రించిరి. దీనినే ముండకోపనిషత్తులో పరొకరీతిని చెప్పిరి. 2 వేదకాలమందు సంఘములో స్వాతంత్ర్యము హెచ్చుగనే యుండినట్లు తోచును అప్పటి కార్యులు మాంసముసుగూడ తినుచుండిరి. సోమలత రసమును త్రాగుచుండిరి. ఇదియొక మద్యమని కొందరూహించినారు. కాని సోమరసము తీయనై బలకరముగ నున్నట్లు వేదములో చెప్పిరి. దానిని పులియబెట్టినట్లు కనబడదు, తీయని రసము పొటనే తీసికొన్నచో, చెరకురసవలె ఆరోగ్యకరము, ఉత్సాహవర్ధకము ; 3 తరువాత కొంతకాలముకు కొందరు మాదకరసములుగూడ సేవించు అభ్యాసమేర్పడియుండును ; వేదకాలమందార్యులు హానికరమగు మద్యము త్రాగుచుండినట్లు నిదర్శనము లేదు. వారు మొదట అతిశీతలమగు హిమాలయగిరిప్రాంతములందుండిరి. అక్కడ మాంసాహారము ఉష్ణప్రదేశములంత బాధకరముకాదు; మరియు, ఆకొండలలో వరి, గోధుమ వగైరా వ్యవసాయధాన్యముల యుత్పత్తియు చాల కష్టము ; కనుక వైదికార్యులు ఏణమాంసము గోమాంసముగూడ తమ యాహారముగ దినుచుండినట్లు అతిథులకు పెట్టుచుండినట్లును స్పష్ట నిదర్శనము

---

1 దేవా యద్యజ్ఞం తన్వానాః, అబధ్నన్ పురుషం పశుం... బ్రాహ్మణోస్య ముఖమాసీత్ బాహూ రాజన్యః కృతః...... ముఖాదింద్రశ్చాగ్నిశ్చ......(ఋ. 10 వ మం. 102 సూ)

2 అగ్నిర్మూర్ధా... సర్వభూతాంతరాత్మా (ముండకో 2—1—4)

3 ప్రస్తుతపు మద్యనిషేధ పద్ధతిలోను తాటి, కొబ్బరి చెట్ల రసమును తీసిన వెంటనే పులియకుండ త్రాగుట మద్యపానము కాదని గాంధిమహాత్ముడును మంత్రివర్గమును నిర్ణయించినారు.

లుండుట సహజము. అప్పటి ఆర్యేతరజాతులును అహింసాపరులు కారు; వారిలో రాక్షసులు పచ్చిమాంసమును దినుచుండిరి. వారిని నిక్షేపము చేయక, భారతజాతిలో ఆర్యేతర జాతికిని వారి సంస్కృతికిని స్థానమిచ్చుటకే ఆర్యనాయకులును ఋషులును మొదటినుండి యత్నించిరి. కనుక, కేవలం భిన్నమగు ఆ యాసంస్కృతుల నిల్పుచు, సంఘములో సమన్వయము చేసి సంఘర్షము తప్పించుట, ఆర్యులకీదేశమందు ప్రత్యేక సమస్యయైనది.

ఆర్యేతరులతో సాంఘిక సంబంధమునుగూర్చి ఆర్యనాయకులలో కొంత భేదాభిప్రాయము వేదకాలమున కేర్పడినట్లు తోచును. ఆర్యుల విశ్వరూపారాధన నిత్యాగ్నిపద్ధతి యజ్ఞములు సోమపానము ఆశ్రమపద్ధతి వగైరాలకును ఆర్యేతగుల యాచారమునకును బొత్తిగా వ్యత్యాసముండెను. ఆర్యేతరులలో చాలమంది అజ్ఞానులు. వారు చెట్లను, రాళ్లను, క్రిములను పూజించుచు, వాటిని జూచి భయపడుచు, దురాచారులై క్రూరకర్ములైయుండిరి. వారిలోను ఆయా వేర్వేరు తెగల ధార్మికభావములలోను ఆచార వ్యవహారములలోను చాలభేదములుండెను. కనుక, ఆర్యులు వాటి నణచకపోయినను తమ ప్రత్యేకవ్యక్తిత్వమును ఆధిక్యమును కాపాడుకోదలచిరి. కనుక ఆర్యులు ఆర్యేతరులతో వివాహాది సంబంధము లేకుండవలెనని కొందరుద్దేశించియుందురు. వసిష్ఠాది బ్రహ్మర్షులీతరగతివారని తోచును. అందువలన ఆర్యేతరులకొక రీతి సాంఘిక బహిష్కారము జరుగును. ఇందు ఆర్యుల అహంభావమును మానసిక హింసాతత్వమునుగలవు. కొందరార్యేతరులకు (ముఖ్యముగ ఆర్యసంస్కృతికి ఆర్యుల దేశాక్రమణకు కేవల వ్యతిరేకులైన ఆదిమజనులకు) ఆర్యసంస్కృతులతోను, ఆర్యులతోను తాము సాంఘికసంబంధము పెట్టుకోకూడదని తోచియుండును. సం దిచ్చినయెడల తమను ఆర్యులు లోబర్చుకొందురని తమ వాసస్థలములనుండి తొలగింతురనిగూడ, వారికి భయమును ఆర్యులపైన అనుమానముండుట సహజము. ఇట్టి ఆదిమవాసులు

తమ వాసస్థలములు ఆర్యులకు సంబంధములేకుండ వేరు గ్రామములుగ నుంచుకొని, అందులోని కార్యుల నెంతమాత్రమును రానీయకుండినట్లు నిదర్శనములుకలవు. వారికి ఆర్యులపైన అప్పటికి హింసాబుద్ధి హెచ్చుగనుండెను. ఆ ద్వేషమువల్ల వారు ఆర్యుల బహిష్కరింప బూనియుందురు. ఇటీవల వరకు చాల చోట్ల మాలమాదిగల గ్రామములోనికి, ద్విజజాతులవారిని రానీయకపోవు ఆచారము సకృత్తుగ గలదు; కాని క్రమముగ ఆర్యులను, ఆర్యనాగరకత నవలంబించిన ఆర్యేతర శూద్రాదిజాతులును దేశమంతటను బ్రబలిరి. అంత ఆబహిష్కర్తలగు ఆదిమజనులే బహిష్కృతులై అస్పృశ్యులుగ వినబడుట సహజము. ఈ పరస్పర బహిష్కారమువల్లనే తుదకు అస్పృశ్యత యేర్పడెనని కొందరు విజ్ఞుల యభిప్రాయము. ఇది మొదట పరస్పర ద్వేషము మీద కలిగి, తరువాత హింసాతత్వమున కంకురమైనది. చిరకాలమునుండి క్రమముగవృద్ధియైన యీ అస్పృశ్యతాభావము హిందువులలో అహింసాభావ వ్యాప్తికిని దేశమంతటను సాంఘికమైత్రికిని ప్రతిబంధకమైనదని చూడగలము.

ఆర్యసంస్కృతి యభివృద్ధికి బహిష్కారపద్ధతిగాక పరస్పర సమావేశమే యెక్కువ క్షేమకరము. ఆర్యేతరులలో సాంఘిక సంబంధము పెట్టుకొని వారిలోని అవినీతిని దురాచారములను తొలగించి క్రమముగ సంస్కృతి సమన్వయమున కవకాశమిచ్చుటే ప్రశస్తము; అని రెండవపక్షము వారెంచిరి. ఆధోరణి విశ్వామిత్రునిలో కన్పడును. * విశ్వామిత్రుని జీవితము అట్టి సంస్కరణ కనుకూలముగనుండినట్లు ముందుచూచెదము. పరాశరాది ఋషులు ఆర్యేతర స్త్రీలచే సంతానముగనుట, వ్యాసాదులు సంఘ

* వసిష్ఠ విశ్వామిత్రు లిద్దరిమధ్యను విభేదములుండెవి. శిష్టాచారమునకును సంప్రదాయమునకును వసిష్ఠుడనుకూలముగను, విశ్వామిత్రుడు ప్రతికూలముగను ఉండేవారని, పూర్వసంప్రదాయమునకు భిన్నమైనది. విశ్వామిత్ర సృష్టియనుట చిరకాలమునుండి కలదు.

ములో మాన్యులగుట, భీమార్జునాదులకు హిడింబి, ఉలూపి వగై రాలతో వివాహసంబంధములు నిట్టివే- మహాభారతాదులలో చెప్పిన వృత్తాంతములలో నిట్టి వెన్నియో కలవు. తరువాత ఆర్ష యుగమందు బ్రాహ్మణులకు కఠిన నిబంధనలేర్పరచినను అను లోమవివాహముల కవకాశమిచ్చిరి- వర్ణాశ్రమ పద్ధతియు ఆయా వృత్తులవారు తమ కనుకూలమగు కులములో జేరి పరస్పర సంఘర్షము లేకుండ, అన్యోన్య ప్రేమతో నుండుటకే యేర్పడినది-

ధార్మిక భావములోను బ్రాహ్మణాదుల కార్థికాశ లేకుండ జేసి, ఆర్యేతరులకు శిల్పవృత్తి కవకాశమిచ్చుటలోను, ఆర్యేతరుల విశిష్టచర్యలకు భారములకు ఆచారములకును, ఆర్య సంస్కృతిలోను స్థానమిచ్చి అవకాశము కల్గించుటలోను చాలమంది ఆర్యులు ఔదార్యమును విశాలప్రేమభావమును గనపరచిరనియు భారతీయ పూర్వచరిత్ర విశదము చేయును- అనాదిజాతులను హత్యగావించిన పాశ్చాత్యదేశపు సందర్భములమధ్యను, అట్టి హింసాపద్ధతిని త్యజించిన ఆర్యుల సందర్భములమధ్యను నుండెడి తారతమ్యమును దిలకింపుడు !

## అధ్యాయము 6.

### వేదసంస్కృతి — అధర్వవేదము.

ఋగ్వేద సంహిత తరువాత అన్నిటిలో ప్రాచీనము అధర్వ సంహిత- దీనిలోని ప్రార్థన గీతములధోరణి కొంతవరకు ఋగ్వే దపురీతినే యుండును- ఇందలి ప్రత్యేకభావములే మనకీసందర్భ మున కావలసినవి- శత్రుసంహారమును శస్త్రాస్త్రముల సంపా దించుటకు, వాటిని ఫలప్రదంగా జారీచేసి కార్యము సంపాదించు

టకు ఇందు విచిత్రమైన పద్ధతులు మంత్రములునున్నవి. జ్వరాది వివిధవ్యాధులు నిరూపించి, వాటి చికిత్సకై మనదేశమందడవులలో దొరకు అమూల్యౌషధులలో నేవి యెందుకుపయోగించునో, వాటి నెట్లుపయోగించుకొనవలెనో, ముఖ్యముగ పాము తేళ్లు వగైరాల విషము మాన్పుటెట్లో, ఇందు ప్రతిక్రియల జెప్పినారు- మరియు ఆధివ్యాధులను పోగొట్టుటకు, దయ్యముల వదల్చుటకు, శాత్తుపడి అభిచారహోమం వగైరా పద్ధతులు, స్త్రీలవశీకరణముకు, వ్యాపారాభివృద్ధికి, వివిధపాపముల పరిహారముకుగూడ అథర్వవేదములో చిత్రవిచిత్రమగు మంత్రముల జెప్పియున్నారు. ఋగ్వేదమందు యుద్ధజయముకు ఆయుర్వృద్ధికి మంత్రములున్నవికాని, ఈ తాయెత్తులు, తంత్రములు, భేషజ ప్రసక్తి లేదు. అన్యోన్య భయము, దురుద్దేశములు, హింసాబుద్ధి, నీచభావములు నున్నవారికే ఇట్టి ప్రవృత్తి గల్గును. ఆపూర్వకాలపు లోకమంతటను, ఇట్టి భావములు విశేషముగ నుండినవని లోగడచూచియున్నాము. భారతీయార్యులలోమాత్రం ఉదారతత్వముండెను. వీరిలోను కొద్దిమంది మూఢులలో నిట్టి యాలోచనలుండవచ్చు. కాని ఆర్యేతరులగు దస్యులు రాక్షసులు మున్నగు ఆదిమజనులలో నిట్టి భావములు అప్పుడు ఎక్కువగ వ్యాపించియుండును. * నేటికిని నిమ్నజాతీయులలోను ఆటవికులలోను ఇట్టి భావములు నెక్కువగ నున్నవి. ఋగ్వేదముకు వసిష్ఠ విశ్వామిత్రాదులు ముఖ్యఋషులు; అథర్వ "ద్రష్ట" లగు ముఖ్య ఋషులు భృగువు ఆంగిరసుడు వగైరాలు భృగువంశీయులకు, శుక్రాచార్యులు అసురులకు "రాక్షసు"లకు గురువుగ నుండెను.

అథర్వ వేదపు బ్రాహ్మణమగు గోపథబ్రాహ్మణమందు అథర్వ పురుషుడు నల్లనై, క్రోధాత్మకుడై తీవ్ర స్వభావుడై యున్నట్లు చెప్పిరి. ఋగ్వేదాదులందు దేవతలు తేజోమయులు

* రావణుని కొడుకగు ఇంద్రజిత్తు రామలక్ష్మణుల జంపుటకని నికుంభిలా హోమమను పేర పెద్ద హోమము చేసెనట.

సామ్యులుగనున్నట్లే చెప్పబడినవి. అథర్వసంహితభాష దాదాపు ఋగ్వేదభాషవలె నుండుచు, ఉపనిషత్తులకంటె పూర్వపుదిగ తోచును. ఆర్యేతరుల సంస్కృతిలోని ముఖ్య విషయములను విశేషములను ఆర్యులందరికిని ఎరుకపరచి, ఉభయసంస్కృతుల పరిచయము హెచ్చించుటకును, రెండుజాతులకును పరస్పర సంపర్కము హెచ్చించుటకును, ఆర్యఋషులు అథర్వవేదము నిర్మించి యుందురని కొందరి యభిప్రాయము. కాని, పూర్వము ఋగ్యజుస్సామములు మూడింటికే వేదములను వాడుకయుండేది. * అథర్వముకట్టి గౌరవము మహాభారత కాలముదాటువరకు రాలేదు.

అథర్వములో భేషజముల వివరించియున్నారు. వాటిని బ్రాహ్మణులు చేయకూడదని తైత్తిరీయాబ్రాహ్మణములలో నిషేధింపబడినది ♦ పురాణకాలమందు అథర్వవేదమునకు వేద ప్రతిపత్తిగల్గినది. ఇందులకు కారణము ఈక్రియలెల్ల అహింసాతత్త్వమునకు విరుద్ధములగుటయే అయియుండును.

---

* ఇతి వేదాస్త్రయస్త్రయీ (అమరసింహుడు) ఏవంత్రయీ ధర్మమనుప్రపన్నాః (భ. గీ.) మను స్మృతి. అ. 1.23;

♦ బ్రాహ్మణేన భేషజం నకార్యం (శతపథబ్రాహ్మణం 4-1-5)
(3—145; 12—112)
(యాజ్ఞ 1—9)

# అధ్యాయము 7.

## యజుర్వేదము — యజ్ఞములు.

ఆర్యులు పూర్వమునుండి యజ్ఞము చేసేవారు. యజుర్వేద సంహితలో యజ్ఞకాలమందు చెప్పు మంత్రములు ముఖ్యముగా నుండును. బ్రాహ్మణములలో యజ్ఞముల ప్రక్రియ వివరింపబడును. శ్రౌతసూత్రములందును ఆయా యజ్ఞముల ప్రత్యేకత వగైరాలు చెప్పియున్నారు. యజ్ఞములలో చాల రకములున్నవి: అజమేధము, గోమేధము, అశ్వమేధము, రాజసూయము, జ్యోతిష్టోమము వగైరాలు. వీటి ఉద్దేశములు, యజ్ఞపశువును చంపురీతి, యజ్ఞ పరికరములు, హోత వగైరాల కృత్యములు, కర్మకాండ వివరముగ జెప్పబడినది. ఈయజ్ఞములందు బహిరంగముగ నిండుసభలో ఆ యాజంతువుల జంపి, వాటి చరువును అగ్నిలో నేతితో తప్త మొనర్చి, వాటి హోమశేషమును అతిథులతోసహా సేవింపవలెను. కనుక అట్టియజ్ఞములు నిస్సందేహముగ హింసాకృత్యములు.

ఉదారులైన భారతీయార్యులిట్టి జీవహింస కార్యముల బహిరంగముగ మతములో భాగముగ నాచరించుట, అందుకు విశేషముగ ఉత్సాహపడుట, ఇప్పుడు మన కాశ్చర్యముకు విషాదముకు కారణముగావచ్చును అవి ఉపనిషత్తులలో జెప్పిన సర్వభూత సమత్వపు సిద్ధాంతములకు వ్యతిరిక్తములని తోచవచ్చును. అర్యేతరులు పూర్వమునుండియు క్షుద్రదేవతా విగ్రహములయెదుట జరుపు అమ్మవారి జాతరలను బలులను ఆర్యసంపర్కముచే మానుకొనుటకు బదులు, యజ్ఞసిద్ధాంతముచే జాతరలు, బలులు, మరింత ప్రేరణ నొందుట సహజము. ఇట్లు, పూర్వమన్ని జాతులలోను ఏదో విధముగ జంతుబలి విరివిగసాగుట, వాటిని మతధర్మములో భాగముగ మహోత్సవములతో జరుపుట, శోచనీయము,

ఆర్యేతరుల 'మాకాలమ్మ, గంగానమ్మ' వగైరా తమ గ్రామదేవతలు హింసాస్వరూపులు; వాటికి మనుష్యులజంపుట కావేశమప్పుడప్పుడు కల్గును. అది ఆ యా అంటుజాడ్యముల రూపంగానో మరొకరీతిగనో వ్యాపించి, జనసంఘపు మరణమును హానిని గల్గించును. "వాటిని తప్పించుటకు జంతువులను దేవతల యొద్ద సమృద్ధిగ జంపి బలి యిచ్చిననే శాంతించును" అని నమ్మి ఆభయమువల్లనే బలినిచ్చు రివాజు పెట్టుకొనిరి. ఆర్యుల భావ మట్టిదికాదు. భగవంతుడు ప్రేమమయుడు, సర్వసముడు, శివ ప్రదుడు, అనియే వారి భావన. వారట్లే దేవుని కీర్తించుచుండిరి. కనుక వారియజ్ఞపు ఉద్దేశము ఆర్యేతరుల రీతిదికాదు.

"యజ్ఞ" * అనగా దేవారాధన అని యర్థము. మన మందరమును, మనవస్తువులును, అనగా చిదచిత్తులన్నియు ఈశ్వరాంకితములే: "మన ఆహార పదార్థము లీశ్వరదత్తములని గుర్తుగా, వాటి నీశ్వరున కావాహన చేసియే, అతిథులకీయవలెను. పిమ్మట మనము భుజింపవలెను" అని ఆర్య సంప్రదాయము. నిత్యము జరుగు పంచయజ్ఞముల తాత్పర్యము నిట్టిదే. యజ్ఞమనగా ఈశ్వరారాధనకై, భాగవతులగు సత్పురుషుల భుజింపజేసి వారికి శ్రద్ధాపూర్వముగ దానముచేయుట, అనియు భావన కలదు. యజ్ఞ సంప్రదాయమార్యులు హిమాలయ ప్రాంతములలో నున్నపుడు ఆరంభించినది. అతి శీతల స్థితివల్ల అచటి ఆర్యులు రోజును అగ్నిహోత్రమందు సమిధలతో హోమము జేయుచు, నిప్పు ప్రజ్వరిల్ల జేయుచుండిరి. వారు గోమాంసాదుల నాహారముగ భుజించుచుండిరి; కనుక ఆహారముకుద్దేశించిన జంతుమాంసము మంత్రములతో అగ్నితప్తము గావించియుందురని తోచును. కాని యజ్ఞారంభించిన యజ్ఞ సిద్ధాంతము మరుగుబడి, తరువాత బ్రాహ్మణులు మాంసాహారము విడిచిననుగూడ, పూర్వాచారములబట్టి జంతువుల

* "యజ" (ధాతువు) "దేవపూజాయాం" అని పాణిని;

జంపుట అక్రమమనుటకు సందేహము లేదు. "గోవు పవిత్రమైనది, హింసింపరాదు" అనునప్పుడును గోమేధము చేయుట అన్యాయమే.

కొన్నివిశేషయాగములు మరియు దారుణమైనవి. అశ్వమేధమందు బలీయమగు గుఱ్ఱమును దేశమంతటను సంచారము చేయించి, తుదకు వధించి హోమము చేయుదురు. భారతయుద్ధము తరువాత రాజైన ధర్మరాజును, శ్రీరాముడు రాజై భార్యాత్యాగము చేసినమీదటను, అశ్వమేధము చేసిరట. ఇట్టిదే రాజసూయమును. ఇవి ఆయా రాజులసామ్రాజ్యాధికారమును లోకమునకు దెల్పవచ్చును. రాజసూయము గూఢమైనది. అందు రాజులందరును పిలువబడి ఆయాగములో పాల్గొందురు. ఇందు యాగపశువేదో తెలియదు. యజమానుని అధికారమంగీకరింపని రాజు నొకనిని యజ్ఞపశువుగ వధింతురను సూచనకలదు. ఇది నిజమేయగుచో క్రూరమగు హింసాచర్యయగును. ఇదియొక విధమగు నరమేధమన్నమాట. పూర్వము హరిశ్చంద్ర మహారాజట్లు చేయదలచి శునశ్శేపుని జంపదలపగా అది తప్పిపోయెనట. ధర్మరాజు యువరాజైన తరువాత ఇంద్రప్రస్థములో మయసభ నిర్మించి, రాజసూయయాగమునకై రాజుల రావించెను. ఆసభలో యుధిష్ఠిరుడు శ్రీకృష్ణున కగ్రతాంబూల మీయదలచినట్లును, అందుకు శిశుపాలు డొప్పుకొనక, కృష్ణుని ధర్మజునిగూడ ఆక్షేపించెననియు, అంతట శ్రీకృష్ణుడు వెంటనే శిశుపాలుని సభలోనే చంపెననియు, తరువాతనే ఆయాగకాండ పూర్తియైనదనియు చెప్పబడినది. కారణము గూఢముగ జెప్పినను రాజసూయమున నొక్క వ్యతిరేకిరాజును చంపు ఆచారమునకే ఇది నిదర్శనమని యొక సూచనకలదు. ఈవధవలన చాలమందికి కోపముగల్గి పాండవులపైన ద్వేషముతో తరువాత జరిగిన మహాయుద్ధములో కౌరవులకు సాయము చేసియుందురని, కనుకనే వారికి పదునొకండక్షౌహిణుల సేన యేర్పడెనని, కొందరి యభిప్రాయము. రాజసూయయాగము సామ్రాజ్య లాభము గల్గించుట యెట్లున్నను, మహాకలహమునకు కారణమగుట నిజము;

ఈ రాజసూయాదులు మిక్కిలి అరుదుగనే జరిగెడివి. వేద వాఙ్మయములో వాని ఉదాహరణలు చాలతక్కువ. వేదకాలమందు జరుగుచుండిన "అజమేధా" ది యాగములు, తమసొత్తును ఈశ్వరార్పణచేసి భక్తిపూర్వకముగ సభలో నీశ్వరుని ప్రార్థించి, త్యాగరూపముగ అతిధులందరికిని ఆహారము పెట్టుటనే సూచించునని తోచును. అప్పటి ఆర్యులకు ప్రత్యేకపు హింసోద్దేశముగాని క్రౌర్యభావముగాని యుండినట్లు తోపదు. కాని ఇట్టి యజ్ఞములకు కర్మకాండప్రబలి, అందేదో గొప్ప విశేషమున్నదను భావము కొందరిలోగల్గి యుండును. ఈయాగచర్యలను హింసాభావములను తరువాత జ్ఞానులగు ఋషులందరును నిరసించిరని చూడగలము.

## అధ్యాయము 8.

## ఉపనిషత్తులు: అహింసాబీజము.

వేదకాలమందే కొందరు ధీమంతులు స్వార్ధపరత లేకుండ పర్వత స్థలములం దేకాంతవాసులై, సృష్టిలోని యద్భుతశక్తిని సౌందర్యమును మహిమను గమనించుచు, ఈప్రపంచపు మూల కారణముల జర్చించుచు, మానవజీవితపు ఉద్దేశమును ఆదర్శమును గ్రహించ యత్నించుచుండిరి. వారు క్రమముగ మహాజ్ఞానులయిరి. వారినుండి యితరులు బదరీ కేదారాది క్షేత్రములలో సృష్టిరహస్యముల దెలుసుకొనుచుండిరి. వారు సాధారణముగ ప్రకృతి సంపదతో నిండిన యరణ్యములందే ఉండుచు, అక్కడ ఉత్తమ జ్ఞానము తెలుపు ఉపదేశములచేసిరి. కనుక ఆగాధలు తెల్పు కథలకు ఆరణ్యకములని పేరు వచ్చినది. అందలి బోధలే "ఉపనిషత్తు" లని ప్రసిద్ధి జెందినవి. వీటిలోనే అహింసాతత్వమునకు పునాది ఘేర్పడినది. ముఖ్యమైన పది ఉపనిషత్తులు అహింసాభావమును

దాటి చూపునవే. ఈఋషులు యజ్ఞయాగముల ఖండను నిరసించిరి; ఉదారమగు ఆధ్యాత్మికబుద్ధిగల్గి ఈసృష్టియంతయు దేవునదే, త్యాగముచేసిననే అనుభవింపగలము, ఎవరి సొత్తుకును ఆశపడకూడదు అని బోధించిరి. ‡ సృష్టి స్వభావము సరిగా గ్రహించువారికి హింసాభావముండదు సర్వభూతములును ఆత్మగతములే. ఆత్మ సర్వభూతములలోను ఉన్నది. మనలోని ఆత్మయు ఇతర జంతువులందలి ఆత్మయు ఒకే పరమాత్మకు సంబంధించినవి. కనుక పరస్పర ద్వేషముండకూడదు. §

సర్వజీవములకు మనఆత్మకు అభేదమనునంత సంబంధమున్నప్పుడు, సంఘమంతటికిని క్షేమకరమైనదే తుదకు మనకును క్షేమకరమగును. ఈఏకత్వము గ్రహించినప్పుడు మోహశోకముల పాలు కానక్కరలేదు *

ఏకేశ్వరభావము కఠోపనిషత్తులోను శ్వేతాశ్వతరోపనిషత్తులోను ఇట్లు చక్కగా బోధింపబడినది "పరబ్రహ్మయే ఈలోకమంతకును ఆలంబం, ఆదేవుడే సర్వవ్యాపియై సర్వజీవుల కంతరాత్మ మనపనులన్నిటి కాధారుడు, సర్వసాక్షి, అతడు సర్వాంతర్యామి అని గ్రహించుధీరులకే స్థిరమైన శాంతిగల్గును ♦

---

‡ ఈశావాస్యమిదంసర్వం యత్కించజగత్యాంజగత్ । తేనత్యక్తేన భుంజీథాః మాగృధః కస్యచిద్ధనం (ఈశా. 1-1)

§ యస్తుసర్వాణిభూతాన్యాత్మన్యేవానుపశ్యతి । సర్వభూతేషు చాత్మానం తతో నవిజుగుప్సతే (ఈశా. 1-6)

* యస్మిన్ సర్వాణి భూతాని ఆత్మైవా భూద్విజానతః । తత్రకో మోహః కశ్శోకః ఏకత్వమను పశ్యతః (ఈశా. 1—7)

♦ ఏతదాలంబనం శ్రేష్ఠ మేతదాలంబనం పరం (కఠో 2—17)

ఏకోదేవస్సర్వభూతేషు గూఢస్సర్వవ్యాపీ సర్వభూతాంతరాత్మా, కర్మాధ్యక్షస్సర్వభూతాధివాస స్సాక్షీ చేతా కేవలోనిర్గుణశ్చ......తమాత్మస్థంయేనుపశ్యంతి ధీరాస్తేషాం శాంతిశ్శాశ్వతీ నేతరేషాం (శ్వేతా. 6—11—12—18)

అహింసాధారమగు సత్యమే జయప్రదమనియు ఉపనిషత్తులు చెప్పినవి. ‡ కాని సత్యముగమనించి, ఆప్రకారమవలంబించుటయు చాలకష్టము; దాని ముఖమునకు అడ్డముండు బంగారుపాత్రను సత్య ప్రియులు తొలగింపవలెను. * సత్యధర్మములకు ఆత్మజ్ఞానమునకు మార్గము చాలకష్టమైనదే, అది కత్తిపదును అంచువంటిది; కని పెట్టి లేచి మేల్కొనియుండవలెను; అప్పుడే కృతకృత్యులౌదురు § ఇట్లు ఉపనిషత్తులభావములు సౌమ్యములు, గంభీరములు, అహింసా సాధకములు, విశ్వప్రేమజనకములు. సుమారు మూడు నాలుగు వేల యేండ్లక్రిందటనే భారతీయులిట్టి సత్యసూత్రముల గనిపెట్టిరి. ఆకాలమందలి ప్రపంచపు మరియేవాఙ్మయమందును ఇట్టి ఉదార భావములును ఆధ్యాత్మిక ధోరణియు లేవనుట నిస్సందేహము.

ఆస్తిక్యము సత్యము వగైరాలు కొన్ని ఉపనిషత్తులలో గాధల రూపముగనున్నవి. కొన్నిటి నిక్కడ చూతము. కేనోప నిషత్తులో నీక్రింది కథయున్నది. దేవాసురయుద్ధంలో హింసా పరులగు అసురులే బలీయురు, కాని, ధర్మదేవత బలంవల్ల దేవ తలు గెల్చిరి; ఐతే ఆజయము తమశక్తివల్లనే కలిగినదని దేవతలు గర్వపడిరట, అప్పుడు దేవతలకొక విచిత్రభూత మగుపడినది. అదియేమో తెలియక, వారు తమ ముఖ్యులలో నొకడగు అగ్నిని పంపిరి. ఆభూతము అగ్నినిజూచి "మీరెవరు" అని యడిగెను. "ఓ! నేను లోకమంతటిని దహింపగల అగ్నిని" అని అగ్ని జవా బిచ్చెను. ఆవిచిత్రభూత మప్పుడు తనలోనుండి ఒక గడ్డిపోచను తీసి ముందుంచి, "దీనిపైన మీశక్తిని ప్రయోగింపుడు" అనెను.

---

‡ సత్యమేవ జయతే నానృతం । సత్యేన పంథా వితతో దేవయానః... (ముండకో 3—6)
సత్యేన లభ్యస్తపసా హ్యేష ఆత్మా... ( ,, 3—5)

* హిరణ్మయేన పాత్రేణ సత్యస్యాపిహితం ముఖం । తత్త్వం పూషన్నపావృణు సత్యధర్మాయ దృష్టయే (ఈశ, 1—15)

§ ఉత్తిష్ఠత జాగ్రత ప్రాప్య వరాన్నిబోధత
క్షురస్య ధారా నిశితా దురత్యయా దుర్గం పథస్తత్కవయో వదంతి. (కఠో-1—14)

జ్వలనుడుగ్రుడై దానిని దహింపబోయెను; కాని అతడెంతయత్నించి నను, గడ్డిపోచ అట్లే పచ్చగనుండెను. అగ్ని తలవంచుకొనిపోయి, దానిసంగతి తెలియలేదనెను. అంతట వాయుదేవుడు వచ్చెను. "మీారెవరు" అని ప్రశ్నరాగనే "నేనా" నేను సర్వము నెగర గొట్టగల ప్రకంపనుడ ననెను. దీని నట్లుచేయుడు అని ఆభూత మొక గడ్డిపోచను తీసియుంచెను. కాని ఎట్టి ఝుంఝూమారు తమును దానిని కదల్పలేకపోయెను. ఇట్లే వరుణాదినాయకులును పరాభవమొంది నిరాశులై మరలిపోయిరి. అంతట దేవరాజగు ఇంద్రుడు స్వయముగవచ్చి, వినమ్రుడై దీనుడై నిల్చెను. ఇంతలో ఆభూత మంతరించినది. ప్రక్కనున్న హిమగిరి శిఖరమునుండి ఉమాదేవి మీాకిప్పు డగపడిన భూతము బ్రహ్మ తేజస్సు; మీారు గ్రహింపలేక, భ్రమపడితిరి ; అనియుద్బోధించెను. ధర్మబలమున్నప్పుడే నిజమగు జయముగ్గల్గును; క్రోధాహంకారులకు జయముగ్గల్గదు. ఈశ్వరుడే సర్వశక్తులకును మూలము అను నీతు లను కేనోపనిషత్తులోని యీావిచిత్ర కథ సూచించుచున్నది. భగవంతుడు మన యింద్రియములకు ప్రాణముకుగూడ జీవశక్తి రూపుడనే భావమును కేనోపనిషత్తులో నున్నది *

కఠోపనిషత్తులో ఒక చిత్రకథ గలదు.

నచికేతుడను బ్రాహ్మణబాలుడుండెను. తండ్రి అతనిని మృత్యుదేవుని కొప్పగించెను. అతని సౌమ్యతకు బుద్ధికి సంతో షించి, యముడతడు కోరు వరమిత్తుననెను. నరునికి స్థైర్యాదు లెట్లు లభించునని యడిగెను. "అట్టి ప్రశ్నవద్దు. నీకిష్టమున్న ద్రవ్యమును సంపత్తును కోరుకో" అని యముడు అతని మనస్సు

* శ్రోత్రస్య శ్రోత్రం మనసో మనో యద్వాచోహ వాచం స ఉ ప్రాణస్య ప్రాణః......అమృతాభవంతి (కేనో- 1—2)

మార్చబోయెను. "అవి నాకు తృప్తినీయవు; కనుక వద్దు" అ
నచికేతుడనెను. *

అంతట యముడు ఆత్మస్వరూపమునిట్లు వివరించెను. సర్వ
లోను జీవకోటి అంతటిలోగూడ ఒకేపరమాత్మ వ్యాపించియున్నది
అది యెప్పుడును జీవులందరి హృదయములలో నుండును; అ
సూక్ష్మమైనను, సర్వవ్యాపి ♦ దురాశా దుఃఖములకు లోబడనివా
హింసచేయని ప్రేమస్వరూపులునే ఆత్మను దర్శింపగలరు; దుశ్చ
రితుల కాత్మ లభింపదు. ‡ ఈఆత్మ ప్రేమానందరూపము, జీవా
కారి, అని తెలిసినప్పుడు క్రోధభావముండదు. § ఇష్టములు రెం
విధములు. ప్రేయము, శ్రేయము; ప్రేయము తత్కాలము
ఇంద్రియరుచి నిచ్చునది, శ్రేయములు స్థిరక్షేమకరములు
ప్రేయముకు బదులు శ్రేయమే గ్రహింపవలెను. *

యజ్ఞములలో జరుగు జీవహింసను కొందరు ఋషులు ని
సించి, అహింసాసత్యములకు ప్రాముఖ్యమిచ్చిరి ‡ ఇట్లే యీలో
మును సత్యమగు సన్మార్గమున నుంచు కొన్నినియమములు గల
వాటితత్వమునే "ధర్మ" మని "ఋత" మని వేదములందు చెప్పి
ఋతముపైనే లోకమాధారపడినది. భగవంతుడు ఋతస

* నవిత్తేన తర్పణీయో మనుష్యః లప్స్యామహేవిత్తమ ద్రాక్షుచేత్త్వా
జీవిష్యామో యావదీశిష్య సివరస్తుమే వరణీయస్సఏవ|
(కఠో. 1-1-27)

♦ అణోరణీయాన్మహతో మహీయాన్ ...... ధాతుః ప్రసాదాన్మహిమా
మాత్మనః. (కఠో- 1-2-20)

‡ నావిరతో దుశ్చరితాన్నాశాంతో నాసమాహితః | నాశాంతమనసో వా
ప్రజ్ఞానేనమ వాప్నుయాత్ (కఠో 1-2-24)

§ యఇమం మధ్వదం వేద... తతో నవిజగుప్సతే (కఠో- 2-1-5)

* అన్యచ్ఛ్రేయో...ప్రేయో వృణీతే
శ్రేయశ్చ ప్రేయశ్చ...యోగక్షేమాద్వృణీతే
(కఠో. 2-1-1-2)

‡ అథయత్తపో...దక్షిణాః ఛాందోగ్యో- 3—17—4

స్వరూపుడు (ఋతం సత్యం పరంబ్రహ్మ పురుషం కృష్ణపింగళం) అను వేదవచనము రోజును విప్రులు జపించు సంధ్యావందనములో భాగముగ జేర్చిరి.

ధర్మముకన్న అధికమైనది లేదు. ధర్మము అందరికిని ఆనంద మిచ్చునది, అని బృహదారణ్యకములో జెప్పినారు *

వేదఋషులు సాధారణముగ శుభముగోరుటలో తమకే గాక మానవజాతికిని జంతువులకునుగూడ క్షేమము, శాంతికావలె నని స్మరించుచుండిరి * అసత్తును, తమస్సును, మృత్యువును పోగొట్టి, సత్తును, జ్యోతినిచ్చు అమృతత్వమును కల్గింపుమనిరి. ♦ ఇదియు తమకును లోకమునకు ఔదార్యము, ఔన్నత్యము కావలె నను భావమునే తెల్పును. ఇట్టి పరిశుద్ధహృదయమే అహింసా భావ మంకురించి వృద్ధినొందుట కవకాశ మిచ్చినది.

విద్యాబోధనుగూర్చి తైత్తిరియోపనిషత్తులో చెప్పెడి బ్రహ్మ విద్య ‡ నేర్చు విద్యార్థులు ఋషుల యాశ్రమమందుండి సత్యమును ఋతమును గమనింతుమని వాగ్దానము చేసియే విద్య నభ్యసించి సత్యవర్తన నేర్చుకోవలెను. విద్య పూర్తియై స్నాతకుల సమావర్తన జరుగునప్పుడు గురువు శిష్యునికిట్లు బోధించును. సత్యము చెప్పుము, ధర్మముగ నడుచుకో, సత్యధర్మములు కుశలము వగై

---

* ధర్మాత్పరంనాస్తి- (బృహదా- 1—4—14)

ధర్మసర్వేషాంమధు- ( ,, 2—5—11)

* శంనోఅస్తు ద్విపదేశం చతుష్పదే

శంనోభవద్విపదేశం చతుష్పదే ( ఋగ్వేదం- 7—54—1 )

♦ అసతో మాసద్గమయ, తమసోమాజ్యోతిర్గమయ, మృత్యోర్మా అమృతం గమయ.

‡ బ్రహ్మవదిష్యామి- ఋతం వదిష్యామి; సత్యం వదిష్యామి; తైత్తిరీయోప నిషత్తు- శిక్షావల్లి 1వ అనువాకం.

రాలు తప్పవద్దు, సత్కార్యములే చేయవలెను. తక్కినవికూడదు. సందేహము కలిగినప్పుడు, ఉచితజ్ఞులగు యోగ్య బ్రాహ్మణులు వర్తించినట్లే నడుచుకోవలెను. ఇదే ఉపదేశము. * దీనినిబట్టి చదువుతోబాటు సత్ప్రవర్తనకును పూర్వులు ప్రాముఖ్యమిచ్చిరని స్పష్టము.

---

* వేదమనూచ్యాచార్యోఽన్తేవాసిన మనుశాస్తి । సత్యంవద, ధర్మంచర,... సత్యాన్న ప్రమదితవ్యం, ధర్మాన్న ప్రమదితవ్యం, కుశలాన్న ప్రమదితవ్యం,...... యాన్యనవద్యాని కర్మాణి, తాని సేవితవ్యాని, నోఇతరాణి....., అథయదితే కర్మవిచికిత్సావావృత్తవిచికిత్సావాస్యాత్...యేతత్ర బ్రాహ్మణా సంమర్శినః... యథాతే తత్ర వర్తేరన్, తదా తత్ర వర్తేథాః......

(తైత్తిరీయోపనిషత్తు, శిక్షావల్లి. 1 వ అనువాకం)

# అధ్యాయము 9.

## వేదకాలపు అహింసావాదులు.

ఋగ్యజుర్వేదములలో కొన్ని భాగములలోని అప్పటి మహాపురుషుల గాథలు, భక్తి ప్రేమల బోధించును; ఉదారులగు మహర్షులకు హింసాచర్యలందు వెగటు తోచుట సహజము. జీవహింసను అప్పటికే యజ్ఞములలో శ్రీకృష్ణుడను మహనీయుడు మాన్పించి నట్లొక గాథ కలదు. (ఈ వేదకాలపు కృష్ణుడు మహాభారత భాగవతములలో చెప్పిన కృష్ణుడో యింకొకడో) ఇంద్రుడు సప్తసింధు ప్రాంతము జయించి తూర్పుకు వ్యాపించెనుగదా (ఆయనతరువాత తూర్పుదిక్కునకధిపతి యనిపించుకొనెను) ఈలోగా శ్రీకృష్ణుడొక ప్రాంతపు నాయకుడయ్యెను. యజ్ఞమందు తపస్సు ఆర్జవము అహింసా సత్యాదులే దక్షిణగ నుండవలెనని కృష్ణుని కంగీరసుడు బోధించెనట. *

నేమినాథుడను (22వ) తీర్థంకరుడు శ్రీకృష్ణుని కహింసను బోధించెనని జైన గ్రంథములందు చెప్పిరి. (అంగీరసునకే నేమి నాథుడనుపేరు నుండవచ్చు). అంశుమతి అను నదీతీరమందు కృష్ణునికిని యింద్రునికిని పెద్దయుద్ధము జరిగి, అందు కృష్ణునిదే పై చేయి యైనదని ఋగ్వేదములో ననిరి ♦ ఇంద్రునికి యాగహ

♦ అథయత్తపోదానమార్జవం అహింసాసత్యవచన మితితా అస్యదక్షిణాః...
(ఛాందోగ్య– 3—17—4)

* తద్ధైతద్ఘోర ఆంగిరసః కృష్టాయదేవకీ పుత్రాయోక్త్వోవాచ......
(ఛాం 3—17—5)

♦ అవద్రప్సో అంశుమతీ మతిష్ఠదియానః కృష్ణోదశభిస్సహస్రైః (అవర్తత్ ఇంద్రః శచ్యాధమంత మపస్నేహితీర్నృమణా అధత్త......యుజేంద్రస్సాహే
(ఋ. 8—96—13—14—15)

విస్సును యిచ్చి సంతోషపెట్టుదమని, కృష్ణునికి నందగోపాదు లొక్క సారి సూచించిరి, కాని కృష్ణుడట్టి యజ్ఞము కొప్పుకోలేదు. అంతట ఇంద్రుడు కృష్ణునిపై కోపించి గోకులముపైకి దండెత్తి పశువులను నశింపజేయబూనెను. కాని కృష్ణు డింద్రునెదుర్కొని గోవర్ధనగిరి యుద్ధముతో గోవులన్నిటిని ఇంద్రునుండి రక్షించెనని భాగవతగాధ కలదు.

ఇట్లు క్షత్రిధర్మములోగాక కేవలం ఋషులుగ నుండువారి జీవితం ఇంకా విశిష్టంగా ఉండేది. యూరపులోని అప్పటి ఆర్యుల వలె అజ్ఞానులు మూఢులునై యుండక, వీరు విజ్ఞానకాంక్షగల్గి యుండిరి. వీరిలో కొందరు గొప్ప దీక్షతో పరిశోధించుచు, అందుకై ఏకాగ్రత కొరకు మహాటవులలో ఏకాంతవాసముగూడ సహించుచుండిరి. వారి యాశ్రమజీవితము అహింసాతత్వ మల వర్చుకొనుటకన్నివిధములను తగియున్నది. వారు స్వయముగ శాంతులై సౌమ్యులై యుండిరి. బ్రహ్మచర్యవ్రతులై, తమ స్త్రీలకు ఉదారభావముల నేర్పుచు, వారికిని ఆధ్యాత్మిక కృషి కల్గించుచుండిరి. వారు నిగ్రహవంతులు; కాని తరువాత కొందరి వలె ఉగ్రతపస్సుపేర దేహశోషణ జేసుకోలేదు. వారు యుక్తాహారవిహారులై మిత భాషులై యుండిరి. తరుచు మౌనులగుటయు అహింసకుపయోగమే. వాగ్వ్యయము మానసిక హింసకు కారణమగును; సత్యశీలతకును భంగకరము. ♦ వారు ప్రేమస్వభావులైనందున వారి యాశ్రమములను సాధారణముగ క్రూరజంతువులును బాధించుటలేదు. అట్టివేద ఋషులలో వసిష్ట విశ్వామిత్రుల పేర్లు తరువాతగూడ ప్రసిద్ధమైనవి.

---

♦ రఘువంశీయులనుగూర్చి కాళిదాసు "సత్యాయమితభాషిణాం" అని చెప్పినాడు. (రఘువంశము 1 వ సర్గ) ఈకాలమందు అహింసాతత్వము కాచాద్యులగు గాంధిమహాత్ముడు నేటికిని వారముకొకరోజు (ప్రతి సోమవారమును) కేవలం మౌనముతోనే యుండును; నిరంతర ప్రజాసేవాపరుడైనను, ఈవ్రతమును వదలుటలేదు.

## వసిష్టుడు.

వసిష్టుని వ్యక్తిజీవనము పరిశుద్ధము, పవిత్రము. ఆయన ఆర్యరాజుల "పురోహితుడు," అనగా ధర్మవిషయములన్నిటికీ ఆయన అభిప్రాయమే ప్రమాణము. ఆయన హరిశ్చంద్రుడు దిలీపుడు మొదలగు మహారాజుల ముఖ్యాచార్యుడై అనేక ఋషులకు బోధకుడై బ్రహ్మర్షులలో నుత్తముడని ఖ్యాతి నొందెను. ఆయన ఋగ్వేదపు చాల ఋక్కులకు "ద్రష్ట". ఈయన, విశ్వామిత్రుడు, చిరజీవులైనట్లు తోచును. ఈయనకు త్రికాల జ్ఞానపు దివ్యదృష్టి యుండెడట. ఆయన భార్య అరుంధతి ఆదర్శస్త్రీ; వివాహకాలమందామె దర్శనము దంపతులకు చేయింతురు. ఈమె ఆర్యజాతిది కాక, హరిజనస్త్రీ అను వాడుక గలదు; కాని వసిష్టుడు ఆర్యసంస్కృతికెట్టి మిశ్రమము సంపర్కము లేకుండ రక్షించు ధోరణి గలవాడందురు.

## విశ్వామిత్రుడు.

విశ్వామిత్రుని జీవితము విచిత్రము. ఈయన మొదట గొప్పరాజై క్షత్రబలమందు పేరుగాంచియుండెను. ఒకనాడాయన వేటకువచ్చి, వసిష్టుని యాశ్రమమందాబ్రహ్మర్షిని దర్శించెను. అప్పుడు ప్రసంగములో వసిష్టుడు తన ఆశ్రమంలోనున్న కామధేనువు అద్భుతప్రజ్ఞ గలది, అట్టిగోవు యింకెక్కడను లేదు, అని చెప్పెను. ఆధేనువును తనకిప్పించుమని వసిష్టుని విశ్వామిత్రుడు ప్రార్థించెను; అందుకాయన యొప్పుకోలేదు. అంతట దానిని బలవంతముగ తీసుకోబోగా అందుకు వసిష్టుడు లొంగలేదు. అందుమీద విశ్వామిత్రుడు తన శస్త్రాస్త్రములన్నిటి నుపయోగించెను; కాని వాని నన్నిటిని వసిష్టుడు మంత్రబలముతో నరికట్టెనట. తన భుజశక్తియంతయు (నిరాయుధుడైనను తపోధనుడగు) బ్రహ్మర్షి యెదుట వ్యర్థమైనది. అంతట భౌతికమగు హింసాశక్తి

కన్న నిగ్రహవంతుల అహింసాశక్తియే నిజముగ ఘనమైనది అని విశ్వామిత్రుడు కనిపెట్టెను. ‡

అంతట విశ్వామిత్రుడు రాజ్యము వదలుకొని హిమాలయములలో తపస్సు నారంభించెను. తరువాత దక్షిణదేశమునకును ఇతర ప్రాంతములకును వెళ్లి బ్రాహ్మణ్యము కవసరమగు అహింసా సత్యతపస్సులను బాగుగ నభ్యసించెను. అతడెంత తపశ్శాలి యైనను పూర్తిగ అహింసాపరుడైన మీదటనే అతడు బ్రహ్మర్షి యైనాడని వసిష్ఠాదులంగీకరించిరి ; ఆయన విజ్ఞానమును తపోబలమును లోకోత్తరములు ; శిష్టులగు పూర్వాచారపరుల భావములకు భిన్నమైనను న్యాయమని తోచిన దాని నమలు జరుపుటలో ఆయన అతిసాహసముతో వర్తించెను. త్రిశంకువు సశరీర స్వర్గము యత్నించెనట.

(పూర్వము త్రివిష్టపముకు హిమాలయముదారి యుండి యుండును, తరువాత పరిస్థితులు మారినందున పెద్దలందరు నా యాత్రను మానియుందురు) వసిష్ఠాదులు దేవతలుగూడ వ్యతిరేకించినను విశ్వామిత్రుడు తీవ్రముగ యత్నించి తుదకు మధ్యను ప్రత్యేక నగరము నిర్మింపజేసి స్వర్గసదృశముగ జేసిన సంగతి కథా హాన ప్రసిద్ధము. హరిశ్చంద్రుని సత్యవ్రతమునుండి తప్పించ

‡ ధిక్బలం క్షత్రియబలం బ్రహ్మతేజో బలం బలం । ఏకేన బ్రహ్మదండేన సర్వాస్త్రాణి హతానిమే (వాల్మీకి రామాయణం 1—56—23)

కామధేనువుకు బదులు వేలకొలది గోవులు ఐశ్వర్యముకూడ ఇత్తునన్నను వసిష్ఠు డొప్పుకొనందున విశ్వామిత్రుడు సేనబల ముపయోగించెను. అంత వసిష్ఠు డన్నాశక యవనుల బలము రప్పించెను. వారిని విశ్వామిత్రు డోడించె కాని తనబలమంతయు వసిష్ఠుని బ్రహ్మదండమందు వ్యర్థమయ్యెను; తాను బ్రహ్మర్షి యని వసిష్ఠునిచే ననిపించుకొనుటకు నిర్బంధముచే సాధ్యముకాక తుదకు అహింసాయుత తపస్సుచే సాధించెననియు గాథకలదు.

"ధేనువు" అనగా సత్యవాక్కు అనియు జ్ఞానము

దేవీం వాచమజనయంత దేవాః। తాం విశ్వరూపాః పశవో వదంతి సానో మంద్రేషమూర్జందుహానా, ధేనుర్వాగస్మానుపసుష్టుతైతు (ఋ 8—100—11)

టకు విశ్వామిత్రుడతనిని తిప్పలు పెట్టెనని పురాణగాథలు విశ్వామిత్రుని కపకీర్తి కలిగించినవి. కాని వేదములోనిగాథ మరొక రీతిగ నిట్లున్నది. ‡

హరిశ్చంద్రరాజు పిల్లలు లేక వరుణదేవుని ప్రార్థించెను. కొడుకుకల్గునుగాని, అతనిని తనకర్పింపవలెనని వరుణుడు షరతు పెట్టెనట. తరువాత రోహితుడను కొడుకుపుట్టెను. పిమ్మట కొడుకు నిమ్మని వరుణుడు చాలాసార్లడిగెను. హరిశ్చంద్రుడు పుత్రప్రీతివల్ల కొడుకును వదలుకోలేక, ఏదో పేరుపెట్టి తప్పించుకోసాగెను. హరిశ్చంద్రుడు మాట తప్పినందుకు వరుణ శాపముకు గురియై మహావ్యాధిగ్రస్తుడయ్యెను. ఈలోగానే (తండ్రికి మొగమోటము తప్పుటకు) రోహితుడడవికి పోయెను; తరువాత తండ్రి వ్యాధి సంగతి తెలిసెను; రాజసూయయజ్ఞము చేయవలెను; అందొకరాజును వధింపవలెనని, ఆచార్యుడగు వసిష్టుడు విధించెను. అంతట రోహితుడు క్షత్రియుని కన్నను బ్రాహ్మణుడే దొరికిన మరియు మంచిదని గ్రహించి అడవియంతయు గాలించెను. ఒక చోట "అజీగర్తు" డను బీదబ్రాహ్మణుడు ముగ్గురు కొడుకులతో నొక కొండగుహావద్ద నుండెనట. తండ్రితల్లి పెద్దకొడుకును చిన్నవానిని ఉంచుకొని మధ్యవానిని రోహితునికి యజ్ఞపశువుగ అమ్మివేసిరి. ఇట్లావిప్రసుతుడగు "శునశ్శేఫుడు" రాజసభలో యజ్ఞశాలకు తేబడెను. వసిష్టుడు ఋత్విక్కుగ హరిశ్చంద్రునిచేత ఆనరమేధ ప్రక్రియ నారంభింపజేసెను. అజీగర్తుడును దగ్గరనే యుండి తోడ్పడెను. ఇట్టి ఉగ్రయాగమందు ప్రతిభాయుతులే పాల్గొనవలెను. కనుక విశ్వామిత్రుని హోతృస్థానములో నుంచిరి. యూపస్థంభమందు బంధితుడయ్యెను శునశ్శేఫుడు తనదుర్దశగూర్చి విశ్వామిత్రునితో విన్నవించెను. అప్పుడు విశ్వామిత్రుడు శునశ్శేఫు నొకమంత్రము జపించుమని, అహింసాబుద్ధితో నుండుమని

‡ ఋగ్వేదపు ఐతరేయ బ్రాహ్మణం.

బోధించెను. దానిని శునశ్శేఫుడు అట్లే శాంతమనస్సుతో జపి
చెను. ఆమంత్రశక్తికి "వరుణ" దేవుని ప్రసాదముచే కట్లూ
శునశ్శేఫుడు బయటపడెను. నరవధ నివహింబు లేకుండనే హ
శ్చంద్రునికి యజ్ఞఫలమగు ఆరోగ్యము సిద్ధించెను. తనప్రాణము
నిట్లు రక్షించిన విశ్వామిత్రునికి శునశ్శేఫుడు శిష్యుడై, ఆయన
యనుగ్రహమువల్ల గొప్పవిద్వాంసుడయ్యెను ◆ యజ్ఞమందు న
మేధమును జీవహింసను విశ్వామిత్రుడు మాన్పించుట అహింసా
సక్తిని తెలుపును. విశ్వామిత్ర రచితమై నరహింసను మాన్పిం
గల్గిన ఆమంత్రము వరుణదేవు నుద్దేశించినది. అది ఋగ్వేద
సంహితలో భాగమైనది.

దానిని ప్రతిసాయంకాలమును సంధ్యావందనములో భాగ
ముగ జపింతురు * దీనిని "ఉపస్థాన" మంత్రమందురు.

విశ్వామిత్రుడు వచించిన ఋక్కులు భక్తిమయములు
అవి చాల పవిత్రములని ప్రసిద్ధి. ఇప్పుడు బ్రాహ్మణులు నిత్య
మును జపించు, "గాయత్రీ" మహామంత్రము విశ్వామిత్రు
కనిపెట్టినదే ‡

విశ్వామిత్రుడు భారతదేశపు నలుదిక్కులందును అద్భుత
మగు తపస్సు చేసెనని, పశ్చిమదిశలో తపస్సు చేయుచున్నప్పు
అంబరీషుడను రాజు యజ్ఞముచేయుట కేర్పర్చుకొన్న గోవును ఇంద్రు
డెత్తుకొనిపోయెను ; అంతనతడు ఋచీకుడను బ్రాహ్మణునిమధ్య

◆ శునశ్శేఫుడు విశ్వామిత్రునికి ధర్మపుత్రుడని వాడుకయుండెను

* ఇమంమే వరుణశ్రుధీహావమద్యాచమృడయ, త్వామవస్యురాచకే, తత్త్వా
యామి బ్రహ్మణా వందమానః...... అధాతేస్యామ వరుణ ప్రియాసః ఋ-౧ వ

‡ వేదఋక్కులు ఋషులు కనిపెట్టిరనియు, అవి అంతకుపూర్వమునే
అనాదిగనుండినవనీ సంప్రదాయము- గాయత్రి ; ఓంభూర్భువస్సువః తత్సవితుర్వ
రేణ్యం భర్గో దేవస్య ధీమహి ధియోయోనః ప్రచోదయాత్ (ఋ-౩)

పుత్రుడైన శునశ్శేఫుని పదివేల గోవుల ఖరీదునకు యజ్ఞపశువుగ కొనితెచ్చెను. ఆశునశ్శేఫుడు తపస్సులోనున్న విశ్వామిత్రు నాశ్రయించెను. అంతట విశ్వామిత్రుడు రెండుగాథల నతనికినేర్పి, అతని నెట్లో విడుదలచేయించి, ఆజీవహింస మాన్పించి, అంబరీషు నికి తపోబలముద్వారా యజ్ఞఫలము గల్గునట్లు చేయగల్గెను. అని రామాయణములోనున్నది * యజ్ఞములో జీవహింస జంపుటను గూర్చి పూర్వము రెండుపక్షములుండినట్లును, విశ్వామిత్రుడు జీవ హింస లేకుండ దానధర్మాగ్నిచేతనే సద్గతి నొందిరని మహాభార తములో చెప్పియున్నారు. §

ఆర్యేతరులగూర్చి అవలంబింపదగు విధానముగూర్చియు విశ్వామిత్రుడు ఉదారుడై సంస్కరణపరుడైనట్లు తోచును.

విశ్వామిత్రుని కొడుకులుఅందరును చండాలురు అని వసిష్టు నిచే శాపమొందిరట, వారు ఆంధ్ర కళింగ ద్రవిడాదిజనులతోకలసి రని వసిష్టాది "శిష్టులు" వీరిని భ్రష్టులుగనెంచి బహిష్కరించిరి. ఇట్లే త్రిశంకువునుగూడ వసిష్టుడు చండాలునిగనెంచుట, విశ్వా మిత్రుడనికి స్వాగతమిచ్చుట జరిగినది. విశ్వా మిత్రుడు తన స్వజీవితములో క్షత్రియుడు మహర్షియే గాక బ్రహ్మర్షి కావచ్చును. అందుకు తగినంత విజ్ఞానము తపశ్శక్తి యునే కావలెనని ఋజువుచేసెను. ఆంధ్రులలోను ద్రావిడుల లోను చాలమంది యిప్పటికిని కౌశిక, విశ్వామిత్రగోత్రికులు. ఇం దునుబట్టి విశ్వామిత్రుని సంతతివారును భరద్వాజఋషి మొదలగు

---

* వాల్మీకిరామాయణం బాలకాండ, 62 వ సర్గ.

§ ఏషధర్మో మహాయోగో దానం భూతదయాతథా......విశ్వామిత్రో। సితశ్చైవజనకశ్చమహీపతిః...... దానధర్మాగ్నినా శుద్ధాః తేస్వర్గం యాంతి భారత॥ మ-భా అశ్వమేధపర్వం 91 వ అ॥ శ్లో 32-36)

విశ్వామిత్రశిష్యులును ద్రావిడ సంబంధ మంగీకరించి యీదక్షిణ ప్రాంత మంతటను వ్యాపించిరని యెంచవచ్చును. *

విశ్వామిత్రుని నిర్మాణ సామర్థ్యము నద్భుతమని తోచును. ఆయన ప్రత్యేకనగరమును కృత్రిమ వస్తువులను అద్భుత ప్రజ్ఞతో నిర్మించె నని, ఇంద్రుడులేని క్రొత్తస్వర్గపురినిగూడ నిర్మింపబోగా ఇంద్రాదిదేవతలువచ్చి ప్రార్థించి ఆప్రయత్న మాపుచేయించిరని రామాయణబాల కాండలో జెప్పబడినది.

విశ్వామిత్రునికి భరతవంశముతో చిత్రమగు సంబంధము సూచితము. ఆయన ఉత్తరదిక్కున గాఢ తపస్సులో నున్న ప్పుడు "మేనక" అను అప్సరస్త్రీ అక్కడకువచ్చి ఆయనతో నుండెను. అప్పుడు వారికి సంయోగమేర్పడి, వారికి శకుంతల అను కొమార్తె గల్గెను. తరువాత విశ్వామిత్రుడు కుటుంబ సంబంధము పూర్తిగమాని మహాతపస్వియై బ్రహ్మదులు వసిష్ఠ మహర్షిగూడ తుదకు తనను బ్రహ్మర్షిగ నంగీకరించునంత శక్తిని సంపాదించెను. శకుంతలను కణ్వాశ్రమములో దుష్యంత మహా రాజు గంధర్వవిధిని వివాహమాడెను. వారి పుత్రుడగు (విశ్వా మిత్రుని దౌహిత్రుడగు) భరతరాజువల్లనే మన దేశమునకు భరత ఖండమని పేరు వచ్చినదట.

వేదకాలమందు కపిలుడు, ఉద్దాలకుడు మొదలగు విద్వాం సులు జ్ఞానులు నుండినట్లు చెప్పబడినది. వారిలో యాజ్ఞవల్క్యుని పేరుగూడస్మరింపవలెను. ఈయన గొప్ప యోగి, మహాతపశ్శాలి, విద్వాంసుడు, ఈయన విదేహప్రాంతపువాడు కావచ్చును. బృహ

* ఆయావర్గములవారి మధ్య వివాహాది సంబంధములును వ్యవహారములును ఎంతవర కుండవచ్చునను విషయముగూర్చి తరువాతి స్మృతికారులలోను భేదాభి ప్రాయముగల్గినది. పూర్వపు ఆర్యాచారమునకు భిన్నమగు వస్తువులనుగూడ విశ్వామిత్రసృష్టి యందురు.

దారణ్యకమను పెద్ద ఉపనిషత్తులో చాల భాగమీయన బోధల గూర్చినదే. ఈమహర్షి చేసిన వేదాంత బోధలు కొంతవరకు మన తత్వశాస్త్రమునకును ఆధ్యాత్మిక చర్చలకును ఆధారమైనది. ఈయన మహాజ్ఞానియైనను గృహస్థధర్మములకు వ్యతిరేకికాడు. ఈయనకిద్దరుభార్యలు. వారిలో, చిన్నదగు మైత్రేయి స్వయముగ తత్వజ్ఞురాలై భర్తతో సమముగ శాస్త్ర చర్చ చేయుచుండెను. ఆయన ఆమెకట్టి ప్రోత్సాహమిచ్చెను. యాజ్ఞవల్క్యుని బోధలు సర్వసమత్వమును శాంతిని ఈశ్వరుని సర్వవ్యాపిత్వమును విశ్వైక్యమును సూచించును. *

ఈయన శిష్యులు చాలమంది గొప్పప్రాజ్ఞులైరి. వీరిలో ముఖ్యుడు "జనకుడు". జనకుడు విదేహదేశపురాజు. ఈయన స్వయముగ గొప్పజ్ఞానియే గాక తత్వజ్ఞులచే చర్చల జేయించుచు విజ్ఞానమును ప్రోత్సాహమిచ్చుచుండెను. వసిష్ఠుడు యాజ్ఞవల్క్యుడు, సుజాత మొదలగువారితో ఈయనకు జరిగిన సంభాషణలు మహాభారతపు శాంతిపర్వములో వివరింపబడినవి. § జనకుడు తనరాజ్యము నెంతయో న్యాయముగను ఆదర్శప్రాయముగను పాలించెను. గొప్పరాజ్యమున కధిపతియైనను, ఆయన కాస్తివాంఛ లేదు. ఆయన ప్రజలపాలించుచు ఐశ్వర్యవంతుడయ్యు విషయలగ్నుడు కాకుండనుండెను. లోకక్షేమముకై, స్వార్థపరత లేకుండ కర్మజేయుచు, ఆయన తరించెను * జనకరాజు తనయజ్ఞములందు జీవహింస చేయలేదు; తనరాజ్యమందు జరుగు యజ్ఞము లన్నిటిలోను జీవహింస జరుగకుండ మాన్పించెను. ఆయన తనరాజ్యమంతటను శాంతిని, అహింసను, పరోపకారబుద్ధిని వ్యాపింపజేసెను.

---

* ప్రస్తుతమమలులోనున్న యాజ్ఞవల్క్యస్మృతి గొప్ప ధర్మశాస్త్రము, అది ప్రామాణిక శాస్త్రములలో ముఖ్యమని పేరు. దీనిని రచించినవారీయనయో మరి యొకరో తెలియదు.

§ భగవద్గీతలోకూడ: కర్మణైవహిసంసిద్ధి మాస్థితా జనకాదయః | అని చెప్పబడినది

* 804—321 [illegible]

తరువాత భవభూతి తన ఉత్తరరామచరిత నాటకములో వాల్మీకిమహర్షి తన అతిథియైన వసిష్ఠమహర్షికి గోవును చంపించి గోమాంసముతో మధుపర్క మిచ్చినట్లును, కాని జనకమహారాజు మాంసము లేకుండ శాకాహారమునే ఆయాశ్రమములో తీసుకొన్నట్లును చెప్పినాడు. సీతకష్టమువిని ఆయన వానప్రస్థుడైనాడని భవభూతి చెప్పిన కారణము మాత్రము తృప్తికరముగ లేదు. జనకుడెన్నడును మాంసాహారి యైనట్లులేదు.

## అధ్యాయము 10.

### వర్ణాశ్రమోదయము.

ఇట్లు ప్రాచీనకాలపు ఆరంభదినములందు ఆ యాజాతుల సంస్కృతులెట్లుండెనో గమనించినాము. ఆహారాది పరిస్థితులను చూచినాము. ఆ యా నాగరికతలు మొదట కేవలం వేరుగ నుండెను. కాని, త్వరలోనే కొంత సంపర్కమును మిశ్రణమును వేదకాలమునందే జరుగ నారంభించినది. ఆ యా సంస్కృతుల వ్యక్తిత్వమును భంగము లేకుండను, సంఘర్షణ లేకుండను అనుకూల్యముతో అందరును జీవించుటకై, వేదకాలపు అంతమందే వృత్తివిభాగ మేర్పడినట్లు తోచును. ఆవృత్తిభేదమునుబట్టియే నాల్గువర్ణములపద్ధతి అమలుకువచ్చి యుండును. ఈవృత్తులన్నియు సంఘక్షేమము కవసరములు. కాని, క్రమముగ వృత్తులు వంశానుపూర్విగ నుండుట ప్రజ్ఞయు శిల్పశక్తియు బాగుగ వృద్ధియగుటకు సహాయకమగునని తోచియుండును. వేదకాలమందు క్షత్రియులు బ్రాహ్మణవృత్తిని, బ్రాహ్మణులు క్షత్రియవృత్తిని అవలంబించుటకు నిషేధము లేదు. కాని స్మృతికాలమందట్టి యాచారమేర్పడెనని ముందు చూచెదము.

ఆస్తి వగై రాలందాశ లేక తదేక దీక్షతో జ్ఞానార్జనచేయుచు ఇతరులకు విద్య గరపువారు బ్రాహ్మణులనిపించుకొనిరి. వారికి నియమములు నిబంధనలు హెచ్చుగ నుండెను. బ్రహ్మ అనగా పరమాత్మ, జ్ఞానము, ఇంద్రియనిగ్రహము అనియు అర్థము లుండెను. వీటి ననుసరించువాడే బ్రాహ్మణుడగును. ఆకాలపు అశాంతస్థితినిబట్టి సంఘరక్షణకు క్షత్రియవృత్తియు అవసరమైనది. కనుక ఈ రెండువృత్తులవారికిని సంఘమందు గౌరవము హెచ్చుగ నుండెను. ఆర్యులలో ఈరెండు రకములవారుగాక తక్కినవారు కృషి వ్యాపారాదులు జేయుచు వైశ్యులనిపించుకొనిరి.

బ్రాహ్మణులు తరువాత త్వరలోనే మాంసాదుల విడిచి, అహింసాపరులై సంఘముకు క్షేమంకరులై పేరుతెచ్చుకొనిరి. వారికి నాలుగు ఆశ్రమ ధర్మములు ఏర్పడినవి. వారేకాగ్రత కృషిచేసి వివిధశాస్త్రముల రచించిరి. తత్వశాస్త్రమేగాక జ్యోతి శ్శాస్త్రము, వైద్యము, ధనుర్విద్య మొదలగు ఇతర విద్యలకును కారకులైరి. భారతదేశము ప్రాచీనలోకపు విజ్ఞానముకు పునాది యగుటకు వారే బాధ్యులైరి. తరువాత ఈస్థితిలో పరిణా మము గల్గెను. కాని, ఆకాలమందు రచించిన ఆయా వివిధ శాస్త్రముల గ్రంథములన్నియు ఖలమై నశించిపోయినవి. తరువాత పాణిని, చరకుడు, శుశ్రుతుడు, బ్రహ్మగుప్తుడు మున్నగు విద్వాం సులు తమ గ్రంథములలో అపూర్వాచార్యు లాయా శాస్త్రము లలో ప్రవీణులైనట్లు వారి సిద్ధాంతముల నుదహరించి, కొన్ని పూర్వగ్రంథములుండినట్లు సూచించిరి.

## అధ్యాయము 11.

### ఆ ర్ష కా ల ము.

వేదవృత్తాంతముల తరువాత మనదేశపు సంస్కృతిలో శ్రీరామచరిత్ర ముఖ్యమైనది. దీనిని విపులముగ వివరించు వాల్మీకి రామాయణము ‡ గొప్ప ఇతిహాసగ్రంథము. రామాయణ భారత గ్రంథములలోని ముఖ్యవృత్తాంతములలో యుద్ధకథలు హింసాచర్చలును ప్రధానములు. కనుక అప్పటి భారతీయ నాగరికతలో సంఘర్షమును హింసాప్రవృత్తియు అధికముగనే యుండెనని భావింపవచ్చును. రాముడు బాల్యమందు విశ్వామిత్రునితో నున్నప్పుడును, పిమ్మట అరణ్యములో వసించినప్పుడు, అక్కడి ఒకజాతి ఆదిమజనులగు రాక్షసులను జంపినట్లు, అందు వానరులను మరొకజాతివారు తోడ్పడినట్లును స్పష్టము. దశరథాది రాజు లప్పుడప్పుడే ఆర్యుల యధికారము స్థాపించుచుండిరి. అట్లే ఆర్యఋషులు ఆర్యసంస్కృతి వ్యాప్తికై ఆర్యావర్తపు అడవులలోను, దక్షిణదేశమందుగూడ ధైర్య సాహసములతో ఆశ్రమముల స్థాపించిరి. వీరప్పుడప్పుడు యజ్ఞముల జేయుచుండిరి. ఈయజ్ఞములలో వేర్వేరు ప్రాంతములనుండి ధీమంతులగు జ్ఞానులు సమావేశమై, శాస్త్రజ్ఞానమువృద్ధిచేయుచు, సృష్టిరహస్యముల గనుగొనుటకు పరిశోధన జేయుచుండిరి. వీరీయజ్ఞములో యాగపశువుల జంపుచుండిరి. అందు హింస యుండినను సత్వగుణము నుండెను. రాక్షసుల ప్రకృతి హింసామయము. ఆర్యవ్యాప్తికెల్లైన విఘ్నముల కల్గించి ఆర్యనాగరికత నణప యత్నించిరి. వారు మాయచేసి రక్తమాంసములను పైనుండి జల్లి యజ్ఞవాటికల నపవిత్రముచేసిరి.

---

‡ ప్రస్తుతరూపపు వాల్మీకి రామాయణములోను, వ్యాసభారతములోని కొన్ని భాగములు బుద్ధజినులకు తరువాత చేర్పడినవే, కాని అసలు శ్రీరామకథ (భారతపు ముఖ్యకథగూడ) బుద్ధునిజీనుని జీవితములకు చాల పూర్వమే జరిగినది.

ఆశ్రమముల ముట్టడించి అందలి ఋషుల జంపి తినుచుండిరి. విశ్వామిత్రాది ఋషులు కొందరు అస్త్రబలము గలవారే కాని వారహింసావ్రతులు. క్షత్రియులగు శ్రీరామాదులు వీరికి తోడ్పడి శత్రువుల నణచిరి. శ్రీరాముడు బాల్యమందే విలువిద్యనేర్చి గొప్ప యోధుడై విశ్వామిత్రునితో అడవుల దిరిగి ఆయనయొద్ద భృశాశ్వాదుల ప్రత్యేకాస్త్రముల వాడుక నభ్యసించెను. ఆయన సూచన ప్రకారం రాక్షసులను స్త్రీలైనను కూరులై శూరులైన తాటకనుగూడ చంపెను. అప్పటికి దేశమందార్యులకు రాక్షస బాధ చాల హెచ్చుగ నుండెను. సవతితల్లి వరముపేరున, ఆయన యుక్తవయసు రాగనే రాజ్యపాలనకు దిగక, రాజ్యమువీడి, రాక్షసులు విశేషముగ నుండు యమదిశకే బయలు వెడలెను. మొదట విడివిడిగ కొందరు రాక్షసుల జంపెను. కాని, ముఖ్యముగ దండకారణ్యము జేరినప్పుడక్కడ చాల రక్తపాతము జరిగెను. ఆయరణ్యము కొంతవరకాంధ్ర దేశమునగూడ వ్యాపించియుండెను. జనస్థానపు రాక్షససేనతో జరిగిన పోరులో నాయకులగు ఖరదూషణులును రామునిచే నిహతులైరి. తరువాత వాలి వధయు, పిమ్మట లంక ముట్టడియు జరిగెను. వానరులనబడు జాతి రామునివైపు నుండి లంకేశ్వరుని రాక్షస సేనతో బోరుటలో రెండుపక్షములలో చాలమందిచనిపోయిరి. ముఖ్యనాయకులిద్దరి మధ్య జరిగిన యుద్ధము దానికదే సాటిగనుండెనట *

తుదకు రావణ కుంభకర్ణులు హతులు కాగా వీరితమ్ముడును శ్రీరామునికి తత్కాలమిత్రుడైన విభీషణునికి సహజముగ లంకా రాజ్యము లభించెను. తరువాత శ్రీరాముడు పట్టాభిషిక్తుడైన మీదట రామరాజ్యము న్యాయముగనుండినను, లవణాసురుడు వగైరాలతో యుద్ధము జరుగుచునే యుండెను.

ప్రతిష్ఠకొరకు శ్రీరాముడు జరిగించిన భార్యోపసర్జనము సీతాదేవి స్థితినిబట్టిచూచినచో హింసాచర్యగదోచును. తరువాత

* రామరావణ యోర్యుద్ధం రామరావణ యోరివ.

ఈస్థితిలో అశ్వమేధ యజ్ఞము జరిపిరి. ఆకాలమందార్యులకును ఆర్యేతరులకును మధ్య అధికమగు సంఘర్షమున్నట్లు స్పష్టము. ఇట్లు చరిత్రదృష్టితో జూచిన శ్రీరామకాలమందు జనులలో ముఖ్యముగా (ఆర్యేతరులు) నరాశనులు పచ్చిమాంసము దినువారు నగు రాక్షసులలోను సోదర శత్రుత్వముబట్టిచూడ వానరజనులలోను హింసాతత్వ మధికముగ నుండెను. ఇట్టి యితివృత్తముతోనే శ్రీమదా్రమాయణము అహింసా ప్రతిపాదకముగను, నీతిబోధకముగ కవి నేర్పుతో రచింపబడెనని ముందు చూడగలము.

అసలు వేదకాలము కృతయుగమని, శ్రీరాముని కాలము త్రేతాయుగము, కురుపాండవుల కాలము ద్వాపరయుగము, అంతట కలియుగము వచ్చినది; అని ప్రాచీనుల సంప్రదాయము. కురుపాండవుల కాలమందార్య నాగరికత ఈదేశమంతటను వ్యాపించినట్లు తోచును. నరాశనులరుదైరి * నాగస్త్రీలు దాశకన్యలు హిడింబివంటి "రాక్షసి" కూడ, అక్కడక్కడ ఆర్యసంస్కృతి నొందిరి. వారివల్ల సంతానములు కల్గినవి.

కాని ఆకాలమందు హింసాతత్వమధికముగ నుండినట్లే తోచును. ప్రస్తుతపు మహాభారతములోని అసలు చారిత్రక భాగమీయుద్ధాది హింసాచర్యల కథయే. ‡ మానసిక హింసా భావము సోదర సంఘములో నేర్పడినప్పుడు ఇది చివరకు హింసా కృత్యముగ పరిగణించి ఉభయ వినాశకమగును. దుర్యోధనాదులకు పాండవులపైన బాల్యమునుండి యుండిన ద్వేషభావమును రాజ్యముకై దురాశయమును, మొదట అనేక కలహములకు కారణమైనది. అంతట పాండవులలో భీమార్జునులు తమ బలమును వృద్ధిజేసికొనిరి. దుర్యోధనుని పక్షముకు మొదటినుండియు

---

* శ్రీరాముని కొడుకు కుశుడు కుముద్వతియను నాగస్త్రీని తన రాణిగా జేసికొనెను. (రఘువంశం 17 స)

‡ తరువాత ఆదిగొప్పనీతిగ్రంథము పంచమ వేదముగ జేయబడిన సంగతి ముందు చూడగలము.

సంఖ్యాబలము హెచ్చు. పాండవులకు నైతిక బలముండెను. ఆయా ప్రాంతముల రాజ్యములు చెరియొక పక్షమును జేరినవి. సమాధాన సమాఖ్య ప్రయత్నములు జరిగినవి. కాని కుదర లేదు. ఒక హింసా చర్య మరొక హింసాచర్యకు దారి తీసినది. అన్ని సందర్భములు ఆలోచించి అందరి యంగీకారమునొంది, ధృతరాష్ట్రుడు యుధిష్ఠురుని కౌరవ సామ్రాజ్యమునకు యువరాజుగ జేసెను; కాని పాండవులసలు రాజ్యపుపాలనలో జేరకుండ, వారికి ఖాండవ ప్రస్థాదుల విడదీసి, వాటిని బాగుచేసుకొని, అందు నగరాదుల నిర్మించుకొమ్మనెను. ఈఖాండవ ప్రస్థములో చాలభాగి మార్యుల ప్రవేశము లేని దుర్గమమగు నిబిడారణ్యము. ఇందు అతి భయంకరమైన వ్యాఘ్రాది క్రూరమృగములును భీకర విషసర్పములును చెలరేగుచుండినవి. ఇక్కడ "నాగు" లను వీర నరజాతి యుండెను. కాని వారి క్రౌర్యము శౌర్యము, మాయిత్వము వారికి సర్పాదులతో నుండిన చనువును, సర్పపూజనుబట్టి ఆర్యులీ నాగజాతిని సర్పములతో సమముగ జూచినట్లు తోచును. ఈకీకారణ్యమును తగులబెట్టి యగ్నిదేవుని అజీర్ణరోగము పోగొట్టుటకు కృష్ణార్జునులు నిశ్చయించిరి; అంతట ఆమహారణ్యముచుట్టును దుర్గమమగు అడ్డువేసి, ద్వారమార్గములందు కాపుండి, అర్జునుడా మహారణ్యమునంటించి వేసెను. అందు వృక్షజాతులేగాక అనేక విధములగు మృగజాతులు దగ్ధమై నశించినవి. ఇందు హింస్ర జంతువులేగాక అన్నివిధములగు మృగములును నాగజాతినరులును గూడ బయటకు తప్పించుకోలేక చచ్చిపోయిరి. * తప్పించుకో

---

* ఈ ఖాండవ దహనములో అర్జునుడు అక్కడి జీవజాతియందలి నిర్దయుడైనాడని సంస్కృతభారతములో నున్నది. ఆంధ్రభారతములో అంత తీవ్రము కాకున్నను ఇట్లున్నది.

చ॥ జ్వలన శిఖాళియుం విజయు సద్విశిఖాళియుం జుట్టుముట్టినం
దలరి భయాకులంబులగు తద్వనజీవుల యార్తనాదమం
దులియును నొక్కపెట్టు దివి నుద్గతమయ్యె నమందమందరాం
చల పరివర్తన ప్రసభ సంక్షుభితార్ణవ ఘోషఘోరమై॥

(ఆ. భా. 1—8—203)

బోయిన వారిని కృష్ణార్జునులాపుచేసి చంపిరి. అప్పుడెందరో నాగులిట్లు తీవ్రహింసపాలైరి. కాని నాగజాతిలో ఒక కక్షతో అర్జునునికి మైత్రియు నుండి యుండవచ్చును. అప్పటికే అర్జునుడు ఉలూపి అను నాగరాజ సోదరిని పెండ్లియాడెను. "మయు" డను నాగజాతీయుడు ఖాండవ దహనానంతర మర్జుని మిత్రుడైనాడు. ఇతడు అద్భుత ప్రజ్ఞగల భవన నిర్మాత.

అసురుల విశ్వకర్మ. + పాండవు లితనిచే నద్భుతమగు మహాసభను తాముకట్టిన ఇంద్రప్రస్థనగరములో నిర్మింపజేసిరి. ఈమహామందిరము చిత్రవిచిత్రమై కన్నుల చెదరజేయు స్ఫటిక ఫలకములతో సంమోహాకరమై యుండెనట, ఈభవనములోనే ధర్మరాజు రాజసూయయాగము తలపెట్టెను. రాజసూయయాగము ఇతరరాజులపైన సర్వాధికారము స్థాపించుట కుద్దేశించినది. ఆ యజమానుని సర్వాధికారముకు ఆయనమాటకు అడ్డమువచ్చు రాజును లోబర్చుటో చంపుటో జరిగినగాని, యాగము పూర్తిగాదు. ఈయాగముకు రాజులందరి నాహ్వానించిరి. ఈమయ భవనములోనే సభజరిగి, అక్కడ రాజసూయ మారంభించుచుండగా చేది భూపుడగు శిశుపాలుడు ధిక్కరించెను. వెంటనే శిశుపాలుని పాండవుల ప్రాణమిత్రుడగు శ్రీకృష్ణుడు ఆసభామందిరములో నందరు రాజులయెదుట చక్రప్రయోగముతో సంహరించెనట. *ఇది ఘోరహింసయని కొందరు రాజులకుతోచి వారప్పటి

---

+ ఆర్యేతరులలో మయుడు గొప్పశిల్పి. వారల సంస్కృతికి కారకుడుగ తోచును; దూరస్థమగు అమెరికాలోని ఆర్యేతరుల ప్రాచీన సంస్కృతికి "మయ" సంస్కృతి (Maya civilization) అనియే వ్యవహారముండుట విచిత్రము.

* రాజసూయములో నిట్లు ధిక్కరించు రాజును చంపుట ఒకవిధమగు నరమేధమని కొందరు సూచించిరి. ఈయాగారంభములో అగ్రతాంబూలముకు శ్రీకృష్ణు డర్హుడు కనుక ఆయనకు తాంబూలము ముందుగా నిత్తునని ధర్మరాజు డల్లు చేసెను. వెంటనే శిశుపాలుడు ఆచర్య నాక్షేపించెనట అంతట శిశుపాలుడు హతుడయ్యెను, ఉభయపక్షములకు [illegible] శిశుపాలు మరణ మాందోళన కారణమయ్యెను.

నుండి పాండవవిరోధులై దుర్యోధనుని మిత్రులైరి. ఈసభలోనే దుర్యోధనుడు ద్రౌపది నవహసించి యవమానముచేసెను. ఇది మానసిక వాచికహింస. దీనిచే దుర్యోధనుని క్రోధాగ్ని హెచ్చినది. అంతట కుట్రజరిగి ద్యూతములో ధర్మరాజోడి పాండవులడవికి పోయిరి.

యీరాజులలో కొందరికి ఈవిరోధభావమువలన కష్టముగ తోపలేదు. తరువాత రాయబారపు యత్నములు మరల జరిగి సూది మోపునంత స్థలమైన నిచ్చుటకు దుర్యోధను డొప్పుకోక రాజీచెడెను. కాని యెక్కువ సేనలు కౌరవ పక్షముకే వచ్చినవి. ఇట్లు హింసాభావము దేశమంతటను వ్యాపించి, తుదకు ఘోర యుద్ధము జరిగినది. గ్రంథవర్ణనమును బట్టి చూడగ, ఆప్రాచీన కాలమందు అంత ఘోరయుద్ధమును ఒకే మహాసమరములో అంత మంది హత్యయు, ఆకాలపు ప్రపంచమందింకెప్పుడును కాలేదని తోచును. రణరంగమందు హింసాతత్వమును జయాశతో యెందుకైనను సిద్ధమగుటయు సహజము. పూర్వకాలమందు హింసా తత్వముచే జరుగు క్రౌర్యమును తగ్గించుటకై యుద్ధమునకు కొన్ని నియమములుండెను. రాత్రియుద్ధము, నిరాయుధులపైనను అపహాయులపైనను యుద్ధమును చేయకూడదు. ఓడిపోయి లొంగిన తరువాత వానిని చంపకూడదు. ఐనను భీష్మాదులను ప్రత్యక్షయుద్ధములో బడగొట్టలేక, పాండవులు వక్రమార్గమవలంబించిరి. ధర్మరాజంతటి సత్యవ్రతుడు "అశ్వత్థామాహతఃకుంజరః" అనుట విచారకరము. అప్పుడు అశ్వత్థామ యను యేనుగ చచ్చినది. కనుక ధర్మరాజునోటవచ్చిన మాటలు నిజమేయైనను, తన పుత్రుడగు అశ్వత్థామ మరణించినాడని ద్రోణునికి తోచవలెనని, అట్లయితేనే ద్రో[illegible] శోకగ్రస్తుడై [illegible] దొరుకునని పాండవు

లకు తెలుసును. కనుక అదియొక విధమగు అబద్ధమనియే యెంచవలెను. అసత్యము హింసాతత్వములోనిదే +

ఈ హింస అశ్వత్థామ హృదయములో హింసాకార్యమునకై ప్రేరణ గల్గించెను. యుద్ధములో కౌరవసేనయోడి, దుర్యోధనుడు గదాయుద్ధములో హతుడైన తరువాత, తన పక్షము నశించినను, తలపెట్టినది మహాపాపమని తెలిసియు, అశ్వత్థామ అర్ధరాత్రివేళ యుద్ధానంతరమలసి శాంతముగ శిబిరములో నిద్రపోవు యోధులను రాజపుత్రులను పాండవ సుతులనుగూడ చంపివేసెను: ఉత్తరాగర్భమందున్న శిశువునుగూడ చంపుటకు అతడు ప్రయత్నించుటబట్టి, పాండవుల హింసాతత్వము కొద్దిదైనను, అందుచే నెట్టి ఘోర ప్రతిహింస గల్గునో ఇది తెలుపుచున్నది. ఈమహాసమరములో ఉభయపక్ష సేనలును నశించినవి. తరువాత చాలకాలము దేశము మహారిష్టములకు లోనైనది. అప్పుడు యువక పురుషుల సంఖ్య హెచ్చినందుననే సంఘస్థితి తారుమారైనది. హింసాతత్వము నిరుత్సాహము దేశమంతటను వ్యాపించి, చాలకాలము వరకు భారతజాతి కోలుకోలేదు.

---

+ అప్పుడు ధర్మజుడన్న వాక్యములో కుంజర శబ్దము ద్రోణునికి వినబడకుండ జేసిరి. తుదకు మహాప్రస్థానమై జీవితాంతమున ధర్మరాజు నరకలోకము వెళ్ళెనట. అందుకీ యసత్యమే కారణమైనది.

## అధ్యాయము 12.

### జైన సంస్కృతి.

మహాభారత యుద్ధముచేగల్గిన అయోమయస్థితి చాల కాలమువరకు సర్దుకోలేదు. జనులలో ఉత్సాహము స్వతంత్రాలోచనలు వెనుకబడినవి. కొంత విపరీత పరిణామము గల్గినది. యజ్ఞాదుల కర్మకాండ కొందరు జైమిన్యాది ఋషులు వృద్ధిజేసిరి. త్యాగమున కేర్పడినయజ్ఞము భోగమునకును వేదవిహితమను కారణమునను జరిగించిరి. వీటిలో వివిధజంతువుల జంపుచుండిరి. ఆర్యులే యిట్లుజేయుటబట్టి తక్కినవారు తమ జాతరుల నింకను వృద్ధిజేసిరి. వేదములు అప్పటికి వేయేండ్లకు పూర్వమెప్పుడో యేర్పడినవి. వాటి భాషార్థములు సామాన్యులకు బోధపడుట లేదు. పాణిని నియమమగు సంస్కృతములో శాస్త్రగ్రంథముల రచించుచుండిరి. ఆభాష విద్వాంసులందరికీ సామాన్యభాషయే. ఉన్నత జాతులవారికి వాడుకలో నుండెను. కాని అవిగూడ స్త్రీ శూద్రులకు బోధపడవు. వారికి వేదభాష లసలే తెలియనందున వారికి వేదాభ్యాసమున కర్హతయే లేదనిరి. సామాన్యజనులకు విజ్ఞానమును సంస్కృతిని వ్యాపింపజేయుట కెట్టి ప్రయత్నములును జరుగలేదు. సామాన్యజనుల దుఃఖనివారణ కెవరున్ను ప్రయత్నింపలేదు. కొందరు దుర్బోధమైన శాస్త్రచర్చల జేయుచుండిరి. కొందరు మాత్రము తపస్సుల జేయుచుండిరి, కాని వారును, పూర్వపు వసిష్ఠ విశ్వామిత్రులవలె సంఘక్షేమమున కవసరమగు చర్చల జేయకయు వారి సమస్యల పరిష్కారములగు జ్ఞానమార్జింపకయు, తమవ్యక్తి మోక్షముకై అడవులందు తీవ్రతపస్సుల జేయుచుండిరి. కొంత లౌకికమగు శక్తుల సంపాదించిరి. కాని వాటిని ప్రజాలాభముకై వినియోగించలేదు. ఈ తీవ్రతపస్సులో తరుచు తమ శరీరమును, ఆత్మను, మనస్సును శోషింపజేయుచుండిరి

అందువల్ల ఆత్మవికాసము గల్గుటకు బదులు దాని వినాశమేకల్గెను. ఆర్యసంఘము లటుండ, ఆసంస్కృతిలో జేరిన (శూద్ర)జాతియనబడు వారికిని, ఆదిమ జాతివారికిని, ఆర్యులతో సంపర్కమేదో విధమున కల్గుచునే యుండెను. అందువల్ల క్రొత్తసమస్యలెన్నియో కల్గినవి. వాటి పరిష్కారముకు అహింసయు సద్భావమును ఉదార బుద్ధియు కావలెను. పరస్పర సంఘర్షము పోగొట్టి ప్రేమభావము బుట్టించుట యవసరమైనది; కుత్కరము లేకుండను క్లిష్టత లేకుండను సామాన్యులగు జనులందరికిని అన్ని సంస్కృతుల వారికిని సుబోధమగునట్లు మతసిద్ధాంతములను సుకరముగ జేయుటయు అవసరమైనది. ధర్మమును క్షీణదశలోనుండి నుద్ధరించువారు కావలసివచ్చినది.

అప్పుడు ఆర్యులకు ఆర్యేతరజాతులకుకూడలిస్థలమై, హిమాలయగిరులకు గంగానదికి మధ్య పుణ్యభూమియై, జరాసంధాది శూరులకును జనకాది కర్మవీరులగు వేదాంతులకును యాజ్ఞవల్క్యాది మహర్షులకును ఆవాసమై వారల విహారపు రంగస్థలమైన ప్రస్తుతపు బిహారు రాజ్యములో క్రీ-పూ-6 వ శతాబ్దిలో నిద్దరు మహనీయు లవతరించి అహింసామతమును ప్రపంచంలో స్థాపించి తమకును భారత భూమికిని శాశ్వతకీర్తి సంపాదించిరి. వీరే జినుడు, బుద్ధుడు. సర్వభూతహితముకై యత్నించుటే ఉత్తమమైన ఆధ్యాత్మిక ధర్మమని ఉపనిషత్తుల సిద్ధాంతము. కురుపాండవ యుద్ధపు మహాప్రళయములోను తరువాత కొంతకాలమున నిది మరపున వచ్చెను; కాని, కొందరు ధీమంతులు అక్కడక్కడ ఈసిద్ధాంతముకు పునరుజ్జీవన చేయదొడగిరి. వీరినే జైనులు "తీర్థంకరు"లనిరి. వీరిలో మొదటివారు ఋషభదేవాదులు. వారినిగూర్చి చారిత్రికమగు వివరములు తెలియవు. 22 వ వారగు "నేమినాథుడు" చారిత్రిక పురుషుడే. యీయనయే శ్రీకృష్ణునికి అహింసాసిద్ధాంతము నుపదేశించినట్లు జైనగ్రంధములో నున్నది. 23 వ వాడగు "పార్శ్వకముని" గొప్పవిద్వాంసుడు, మహాధార్మికుడు. ఈయన

పరీక్షిత్తు కాలమువాడని, అహింస, సత్యము, అస్తేయము, అపరిగ్రహము ఈనాలుగును అవశ్యము అవలంబించవలెనని యీయన బోధించినట్లు జైన గ్రంథములలో చెప్పియున్నారు

తరువాత జినుడవతరించెను. ఈయన * క్రీ॥ పూ॥ 6 వ శతాబ్ది మొదట అనగా బుద్ధునికన్న సుమారు 15 ఏండ్లు ముందుగా దక్షిణబిహారులో అనగా అప్పటి మగధదేశములో జనించెను. ఆయన అసలు పేరు వర్ధమానుడు, జన్మస్థలము వైశాలీపురము; తండ్రి సిద్ధార్థుడు. జినునికి మహావీరుడనియు వాడుక కలదు, వీరిది క్షత్రియ వంశము. వైశాలి లిచ్ఛవీ అను చిన్నచిన్న గణరాజ్యపు (రిపబ్లికు) రాజధాని. వర్ధమానుడు బాల్యమందు విద్య నభ్యసించి పార్శ్వమునియొద్ద అహింసాసిద్ధాంతపు ఉపదేశమొందెను. కొన్ని యేండ్లాయన దేశములో సంచరించి, అనుభవము సంపాదించి తన 33 వ యేట "జీనుడైనాడు" జీనుడనగా ఇంద్రియాదుల జయించినవాడు. తరువాత, ఆయన 30 ఏండ్లు మగధ ప్రాంతమునను చుట్టుపట్లను అహింసాధర్మపు ప్రచారముచేసెను. ఆయన (పావా) పురములో చనిపోయెను.

అంతట జైనమతము క్రమముగ దేశమంతటను వ్యాపించినది. అది యిప్పుడు గుజరాతు, మాళవప్రాంతమందు మాత్రమును కొద్దిగ (కనర) జిల్లాలోను ఉన్నది. మనదేశపు నగరములలో సాహుకార్లుగనున్న "మార్వాడీ" లలో చాలమంది జైనులు.

---

* క్రీ. పూ 6 వశతాబ్దిలో లోకమందన్ని నాగరిక దేశములలోను గొప్ప ధర్మప్రవర్తకులు సుమారు ఏకకాలమందే ఉదయించిరి. మనదేశమందు జిన బుద్ధులు, చీనాలో కంఫ్యూషియసు లోత్సే, గ్రీసులో థేల్సు హిరాక్లిటను నుద యించిరి.

జైనబౌద్ధమతముల సామ్యమును భేదమును సూక్ష్మముగ గమనింతము. ఈ రెండును హిందూమతమును సంస్కరించి, దురాచారములనుండి శుద్ధిచేయుట కుద్దేశించినవే

వీటి ప్రవర్తకులు ఉభయులు క్షత్రియులు త్యాగపురుషులు. రెంటిలోను బ్రాహ్మణజాతి ప్రాబల్యము తగ్గించిరి. యజ్ఞాది కర్మ కాండను- ముఖ్యముగ జీవహింసను ఈ రెంటిలోను నిషేధించిరి. రెంటిలోను సన్యాసుల ప్రభ కలదు. వారిలో బౌద్ధులను 'శ్రమణకు' లని జైనులను "క్షపణకు'' లని చెప్పుదురు. ఈ రెండుమతముల మూల సూత్రము అహింసావ్రతము. ఇక భేదములు, బౌద్ధుల అహింసావ్రతమనగా మానవప్రేమయే. వారు కోసిన మాంసము తినుటకలదు. జైనులు జంతుహింస నిషేధింతురు. జైనులు కేవలం శాకాహారులు. జంతువుల చర్మమను కారణమున చెప్పు లను వారు ధరింపరు. వీరి గురువులు నడకలో చీమలు వగై రాలనుకూడ తొక్కకుండ తప్పించుకోబోదురు. జైనులు (జీవ హింసానుమానము లేకుండుటకు) సూర్యాస్తమయమైన మీదట భుజింపరు. ఉభయులును ఈశ్వరునిపూజింపరు. కాని జైనులు 24 తీర్థంకరులను, బౌద్ధులలో మహాయానులు బుద్ధుని బోధి సత్వుని విగ్రహములను బూజింతురు. ఉభయులును వేదము పరమ ప్రమాణమని ఒప్పుకోరు. బౌద్ధులవేదము త్రిపిటకము. జైనులది "అంగ'' గ్రంథము. ఇవి చాలవరకు పాలీభాషలోనేయున్నవి. ఉభయులును తమ ముఖ్యసిద్ధాంతములను "త్రిరత్న'' ములందురు. అయితే, బుద్ధుని, సంఘమును, "ధమ్మ'' మును శరణుజొచ్చుటే బౌద్ధులకు త్రిరత్నము. సమ్యక్ (=బాగుగ) దర్శనం, సమ్యక్ జ్ఞానం, సమ్యక్ చారిత్ర్యము (=నడత) ఇవి జైనుల త్రిరత్నములు. ఈ మూటిలో బౌద్ధుల "అష్టమార్గములు'' ఇమిడియున్నవని జైనులం దురు. కొందరు జైనులు చాతుర్వర్ణ్యవ్యవస్థను మన్నింతురు. ప్రాయోపవేశముతో నిరశనులై మరణించుట ప్రశస్తమని జైనుల సంప్రదాయము. బౌద్ధులలో మహాయాన హీనయానములున్నట్లే

జైనులలో శ్వేతాంబర దిగంబరులని, శాఖలున్నవి. బౌద్ధమత మిక్కడ కొంతకాలముబలీయమై, దేశాంతరములలో నిల్చియున్నది; కాని మాతృదేశమందు దాని వ్యక్తిత్వమిప్పుడు లేదు.

జైనమత మితర దేశములలో లేదు. కాని స్వదేశమందా మతస్థులు కొందరిప్పటికి నున్నారు. వారి వాఙ్మయం అహింసా సిద్ధాంతపువ్యాప్తికి బలకరము. జైనగ్రంథముల సంపర్కము గాంధిమహాత్మునికి అహింసాతత్వముపైన ధ్యానమును హెచ్చించి నది. జైనమతపు కొన్నిసిద్ధాంతములను వాటి ప్రమాణ వాక్యములతో నిక్కడ మచ్చుకు గమనింతము.

1. జీవమును చంపినా, చంపకపోయినా, హింసాబుద్ధి కలిగి నంతటనే, అట్టివారికి బంధమేర్పడుట నిశ్చయము.

2. "హింస" అనగా ఉద్దేశపూర్వకంగా జీవశక్తిని నశింపు జేయుటే.

3. ఆత్మవికాసము కడ్డమగు క్రోధలోభాదులన్నియు హింసాకోటిలోనే చేరును; అబద్ధమాడుట వగైరాలు హింసాకోటికి సూచనగ చెప్పబడినది.

---

1. అజ్ఝవసిదేణబంధో సత్తేమారేహి, మావమారేహిం । ఏసోబంధ సమాసో జీవాణం ణిచ్ఛయణయస్స ॥ఛా.। అధ్యవసితేనబంధః, సత్వేమృతేపి మానామృతేపి ఏషోబంధసమాసః, జీవానాం నిశ్చయనయస్య. (శ్రీకుందకుందాచార్యులు క్రీ-పూ॥ 1వ శతాబ్దిలో రచించిన సమయసారములోది)

2. ప్రమత్తయోగాత్ ప్రాణివ్యపరోపణం హింసా (శ్రీఉమాస్వామి ఆచార్యులు క్రీ- శ- 1వ శతాబ్దిలో రచించిన తత్వార్థ సూత్రములోది)

3. ఆత్మపరిణామహింసన హేతుత్వాత్, సర్వమేవహింసైతత్ । అనృత వచనాది కేవల ముదాహృతం శిష్యబోధాయ (పురుషార్థ సిద్ధ్యుపాయం. 42 వ శ్లోకం; 10 వ శతాబ్దిలో అమృతచంద్రాచార్యులు రచించినది)

4. వాఙ్మనః శరీరములలో దేనిచేతనైనను, బాధించుట, బాధకల్గించుట, ఆచర్య కొప్పుకొనుట; ఇట్లు 3×3 మొత్తం 9 విధ ముల హింసయుండును. ఇందుకు అపవాదములున్నవి.

5. హింసలో ఆరంభహింస (= వ్యాపారచర్యలో జరుగునది) అనారంభహింస (నిర్వ్యాపారులది) గృహస్థులు కానివా రెండురకముల హింసనూ మానవలెను.

6. గృహస్థులేదో వృత్తిచేయవలెను; అయితే, వారు అది తగ్గించుకోవలెను. వారికి వ్యాపారసందర్భపు కొంతహింస తప్పని సరియగుట ఒకప్పుడుండును.

7. జీవుల ప్రాణం తీయకుండ మాంసంరాదు; కనుక మాంస భోక్తలకు హింసతప్పదు. తనంతట పోయిన జంతువు మాంసము తిన్నను అందులో నిమిడియున్న జీవాణువుల ధ్వంసమువల్ల హింస కలుగును.

---

4 కృతకారితాను మననైః, వాక్కాయ మనోభిరిష్యతే న వధా । ఔత్స ర్గికీ నివృత్తిః విచిత్రరూపాపవాదికీ త్వేషా
( ,, ,, 76 వ శ్లోకం )

5. హింసాద్వేధాప్రోక్తాఽఽరంభానారంభ జాత్వార్ధిత్తైః
గృహవాసతో నివృత్తో ద్వేధా । పి త్రాయుతేతాందం॥
(శ్రావకాచారములోది; దీనిని 10 వ శతాబ్దిలో అమితగతి ఆచార్యులు రచించిరి)

6 గృహవాసనే వనరతో మందకషాయః ప్రవర్తితారంభః । ఆరంభ జాంసహింసాంశక్నోతి నరక్షితుం అనియతం ( ,, ,, )
( వృత్తిచేయవలెనన్నారు; కనుక మార్వారీ గృహస్థులు వ్యాపారంచేయుదురు; వ్యాపారంలో కొంతహింస తప్పదన్న యీకోరిక మార్వారీలు హెచ్చు వడ్డీ - పుచ్చుకొనుటకు (ప్రమాణమా ? వారివడ్డీరేటు మందకషాయత్వము సూచించునా ?)

7. నవినాప్రాణి విఘాతాత్ మాంసస్యోత్పత్తిరిష్యతే యస్మాత్ । మాంసభజతస్తస్మాత్ ప్రసరత్యనివారితాహింసాత్. (అమృత చంద్రాచార్యుల పురుషార్థ సిధ్యుపాయములోనిది. )

మృతజంతువుమాంసము అనారోగ్యకరమని తామసాహారమని హిందువులు నిషేధించిరి)

8. మద్యములో వివిధములగు జీవకణము లుండును; త్రాగుడులో ఆజీవముల జంపుటవల్ల హింసకల్గును; కనుక మద్యపానము హింసాకరము.

9 రాత్రివేళ భుజించువారి ఆహారములో జీవములుచేరి హింసతటస్థించును ; కనుక, అహింసాపరులు రాత్రిభోజనము మానవలెను.

10 సమ్యగ్దర్శన, జ్ఞాన, చారిత్ర్యములు మోక్షముకు మార్గములు.

11 పురుషులన్నిపనుల జేయునప్పుడును, ఏది మంచిదో ఏది చెడ్డదో ఆ విచక్షము గల్గియుండవలెను.

12 ప్రాణులందు ప్రేమను, గుణవంతులజూచి ఆనందమును కష్టపడుచున్న జీవులయందు దయను, దుష్టుల విషయమున తటస్థముగ నుండుటను, నాకు పరమాత్మ యెల్లప్పుడును కల్గించుగాక.

---

8. రసజానాం జీవానాం బహూనాంయోని రిష్యతే మద్యం । మద్యం భజతాం తేషాం హింసాసంజాయతే వశ్యం.

( ,, ,, 63 )

9 రాత్రౌ భుంజానానాం యస్మా దనివారితాభవతిహింసా । హింసాదిరతైస్తస్మాత్ త్యక్తవ్యా రాత్రిభుంక్తిరపి. ( ,, 129)

10 సమ్యగ్దర్శనజ్ఞానచారిత్రాణి మోక్షమార్గః.

(శ్రీఉమాస్వామి ఆచార్యుల తత్వార్థసూత్రములోనిది)

11 పరిజ్ఞాయ సదా సేవ్యా పురుషేణ సుఖావహా । హేయోపాదేయ తత్వజ్ఞాయూరతా సర్వకర్మణి। (కులభద్రాచార్యుల "సారసముచ్చయం" లోని 75 వ శ్లోకం)

12 సత్వేషుమైత్రిం, గుణిషుప్రమోదం, క్లిష్టేషు జీవేషు కృపాపరత్వం మాధ్యస్థభావం విపరీతవృత్తౌ । సదామమాత్మా విదధాతు దేవః॥

(ఇది అమితగతి గారి "సామాయిక పథం" అను గ్రంథపు మొదటి శ్లోకం)

# అధ్యాయము 13.

## బౌద్ధ సంస్కృతి.

### బుద్ధుడు

బుద్ధుడు జినునికన్న ఎక్కువ యేండ్లు జీవించెను. ఈయన మెక్కువ ప్రజ్ఞావంతుడున్ను కృపాపరుడునై లోకవిఖ్యాతుడైనాడు. ఈయన క్రీ. పూ. 560 ప్రాంతములో జనించెను; పూర్వపు విదేహరాజ్యము (ఇప్పటి ఉత్తరబిహారు) లోని "శాక్య" రాజుల సంతతిలో శుద్ధోదనునికి మాయాదేవికిని పుట్టెను. ఈమె నేపాళములోని తన పుట్టింటికి వెళ్ళుచుండగా, దారిలో హిమాలయ పాదములయొద్ద "లుంబిని" లో నామెకు సిద్ధార్థుడు జనించెను. శాక్యులది కోసలవిదేహములమధ్య చిన్నరాజ్యము. దీని రాజధానియగు కపిలవస్తులో సిద్ధార్థుడు బాల్యమందు క్షత్రియోచితమగు విద్య నేర్చుకొనెను. ఇతడు బాల్యమునుండి దయాళుడై, ఉదారబుద్ధిగల్గి, తోటినరులందు సానుభూతిగల్గి వారికష్టములజూచినప్పుడు తాను విచారించుచుండెనట. ఆపురమందును చుట్టు గ్రామాలలోను తిరుగునప్పుడు జనుల దుఃఖముల గమనించుచు, వాటిని పోగొట్టుటెట్లని, అవి యెందుచే గల్గినవని పరీక్షించుచుండెను. తండ్రి యీసంగతి గ్రహించి, ఇతడు విరాగియగుచున్నాడని తలచి, ప్రతిభాయుతుడగు కొడుకు గొప్ప రాజ్యాధికారి కావలెనని కోరి సిద్ధార్థునికి దారిలో కష్టపడు దుఃఖితులు అతని కంట బడకుండునట్లు కట్టుదిట్టము చేసెనట. కాని రాజభటులెంత జాగ్రత్తలోనున్నను, ఎవరో దుఃఖితులు సిద్ధార్థునికి ఎప్పుడైనను కనబడుచునేయుండిరి. తక్కిన రాజపుత్రులవలె సిద్ధార్థుడు లేళ్ళు దుప్పులు వగైరా శాంతజంతువులను చంపుట మానివేసెను; జనులు సుఖకరముగ లేరని నెవిగ్నుడై కొన్ని బంధ

కములు, దుఃఖకరములు, అని అతడు గ్రహించెను; సంఘములో తీవ్రమగు మార్పుకావలెనని, ముందుగా తన జీవితములో మార్పుకావలెనని, ఆయన యుద్దేశించెను. తన యైశ్వర్యము భోగము స్థిరముకావు. సంసారములో నిజమైన ఆనందము లేకున్నది. ఆయన భార్య యశోధర ప్రసవించి మగశిశువును కన్నది. యువరాజుకు కొడుకు గల్గెనని పౌరులందరు నుత్సవము జేయుచుండిరి. తనబంధములు హెచ్చుచుండెను; ఆయన రాత్రి వేళ నిద్రించుచున్న భార్యను శిశువును బంధుమిత్రులను రాజ్యమును విడచి బయలుదేరెను. (ఇదే బౌద్ధగ్రంథములలో "మహానిష్క్రమణ" అనబడును) అంతట బుద్ధుడు తన విలువగల వస్త్రులను దుస్తులను దారిలో గనబడిన ఒక బీదవానికిచ్చి, వాని చిరుగు గుడ్డలను తాను ధరించెను; మోక్షసాధనము గ్రహించుటకు వెదుక నారంభించెను.

సిద్ధార్థు డప్పటికి సంస్కృతమందు మంచిజ్ఞానము సంపాదించి, సాంఖ్యాది దర్శనములను, వేదములను, అభ్యసించెను. అప్పటి ప్రసిద్ధఋషుల నాశ్రయించి, యోగరహస్యముల దెలుసుకొనెను. అరణ్యములో ప్రసిద్ధులగు సాధుసన్యాసులతో గలసి, వారి సలహాప్రకారం సంప్రదాయ పద్ధతులతో తీవ్రతపస్సు నారంభించెను. ఆయనమౌనియై, ఆహారము మానుచు ఎండవానల లక్ష్యపెట్టక, మరియైదుగురితో కలసి, "ఉరుబిల్వ" మనుచోట ఆరేండ్లు ఉగ్రతపస్సు చేసెను. ఆరంభమందు కొంత తపస్సు ఇంద్రియ నిగ్రహమునకును ఏకాగ్రతకును తోడ్పడినది; కాని ఏండ్లు కొలది ఏకాకిగ తపించుచు; లోక సంబంధము లేకుండుటవల్ల దేహ మనస్సులకు శోషగల్గెను; ఆత్మవికాసమునకు బదులు సంకోచమే కల్గుచుండెను. ఆయన హృదయము లోకుల కష్టములగూర్చియు సంఘపు అభివృద్ధినిగూర్చియు, తపించుచుండెను. సహచరులు మాత్రము తమ మోక్ష మొక్కటియే ధ్యేయముగ బెట్టుకొనిరి. కొన్నిరోజులు నిరాహారులై కేవలము వాయుభక్షకులై తపించు

చుండగా, ఒకసారి సిద్ధార్థుడు సొమ్మసిలి మూర్ఛిలినట్లయి, దివ్య
జ్యోతి మనోవీధిని గోచరించినది. అంతటితో ఆయనకు దివ్య
జ్ఞానము తట్టినది. "దేహహింస యెల్లకాలమును జరిగితే లో
లనున్న ఆత్మయు కృశించును" అని యెంచి ఆనుష్క తపస్సు
కట్టిపెట్టి ఆయన మితముగ ఆహారము నారంభించెను. తో
తపస్వులందు కిష్టపడలేదు. వారు అహంకారులై, ఆయనపై
కోపించి వెడలిరి. సిద్ధార్థుడు "వ్యక్తి తనమోక్షముకే యత్నిం
చుట తప్పు, జీవకోటి నుద్ధరించుటే కర్తవ్యము. జీవులు ఒక
నొకరు హింసింపకూడదు. పరస్పర ప్రేమగల్గి అన్యోన్యమైత్రి గ
సహకార మొనర్చుటే జనుల బాధా నివారణకు సాధనము. సంఘ
మును సేవించి, సంఘోద్ధరణకు కృషిచేసినప్పుడే వ్యక్తులకును
దుఃఖనివారణ గల్గును; అదే నిర్వాణము; అదే మోక్షసాధనము.
ప్రస్తుతము లోకపుదుఃఖముకు పరస్పర హింసాభావమే కారణము.
కనుక అహింసయే సాధనము" అని నిశ్చయించెను. ♦ ఇట్లాయన
బుద్ధుడైనాడు.

అప్పుడాయన వెంటనే కాశీయొద్ద "సారనాధ" అనుచో
కొందరికి తనబోధ నారంభించెను; అప్పటినుండి తనజీవితమంతయు
జనులకు అహింసాధర్మమును బోధించి వారికి సత్ప్రవర్తన గల్గించి
జనుల విభేదములను తొలగించి, పరస్పర ప్రేమద్వారా సంఘ
మంతను బాగుచేయుట కుపయోగించెను. ఆయన మతబోధలలో
క్లిష్టత పెట్టలేదు.

"ఈశ్వరునికి నరులకు గల సంబంధము సృష్టి ఉత్పత్తి
వగైరాలనుగూర్చి అప్పటికున్న తార్కిక చర్చలలోకి పోవద్దు
నరులందరూ సోదరులే; కనుక హింస, క్రోధము, ద్వేషము
లేకుండ సంఘమంతటినీ బాగుచేయుటకే, అందరూ యత్నించ
వలెను. అహింసయే ఉత్కృష్టధర్మము; యజ్ఞయాగములహింసను

♦ ఈజ్ఞాన మాయనకు గయవద్ద నొకచెట్టు క్రింద నుండగా కల్గినది; ఆ
బోధి వృక్షమును పవిత్రముగ నెంచబడినది.

మాని. అందలి త్యాగమునే ఆచరణలో బెట్టుడు. " అని ఆయన బోధించెను. ఈ అహింసాధర్మమే మోక్షసాధనమను సిద్ధాంతము ఉపనిషత్తులలో సూచించినదే. అది పరిశుద్ధహిందూమతమే అని గ్రహించి కాశీవగైరా ప్రాంతములలో కొందరు బ్రాహ్మణ విద్వాంసులును ఆయనకు తోడ్పడిరి. అన్నికులములవారును ఆయనకు శిష్యులయిరి. రాజులు సహజముగ క్లిష్టతలేక జాతి వైషమ్యములేక సమభావము బోధించు ఈమతము నాదరించిరి. విదేహప్రభువేగాక కోసలరాజగు "పసినేది" యు కాశీరాజును ఆయన కభిమానులైరి. ఈ యిద్దరురాజులమధ్యను విదేహరాజు తోను సరిహద్దువగైరాల తగాదాలుండినవి. వాటికై ఆయారాజుల మధ్య యుద్ధములు కలుగునట్లుండినవి. అంతకుపూర్వ మట్టి తగాదాలచే యుద్ధములు జరుగుచు, కలతలింకను హెచ్చుచు, జనుల వధయే ఫలితమగుచుండెను. బుద్ధుడిప్పుడు స్వయముగ ఆయా రాజులమధ్య రాజీపరిష్కారము జరిగించి, విశేష రక్తపాతమును అరిష్టమును తప్పించెను. వారిమధ్య పరస్పరము సౌహార్ద్రింగూడ కల్గించెను. సాంఘిక హింసలుకూడ ఆయన మాన్పించెను. అప్పుడు రాజాదరణతో పెద్ద యాగములు జరుగుచు వాటిలో వందలకొలది జంతువుల జంపుచుండిరి. కోసలరాజొకసారి యట్టి మహాయాగముకై జంతువులను సిద్ధముచేసియుండెను. అప్పుడు బుద్ధుడు స్వయముగ వెళ్ళి రాజుతో మాట్లాడి, ఆజంతువుల విడిపించి, అప్పటినుండి జీవహింస జరిగించకుండ రాజుచే బాసచేయించెను. "సత్ప్రవర్తనము ప్రేమచర్యలే మంచివి; వాటితోనే దేవతలు సంతోషింతురు. కాని జంతుహింసచేగాదు" అని ఆయన సామాన్యులనొప్పించి, చాలచోట్ల పామరులు జరిగించు జాతర హింసలనుగూడ, ఆయన నిల్పుచేయించెను. ఆయన తన ధర్మబోధ లన్నిటిని ఆప్రాంతపు పామరజనులకును వాడుకభాషయగు "పాలీ" లోనే చెప్పుచుండెను. మరియు ఆయన వారికి సుబోధమైనట్లే మత విషయముల జెప్పెను. "సర్వసమత్వ" మాయన మతములో ముఖ్యము; క్షత్రియ జన్మచే బ్రాహ్మణులుగాని మరియెవరుగాని

అధికులు కాగు ; అన్ని కులములవారు అన్ని జాతులవారుగూడ అహింసాధర్మముద్వారా ముక్తి పొందగలరు. పరస్పర ప్రేమయే ప్రియకరము, క్షేమము అను సిద్ధాంతము సహజముగ శూద్రులకు బాగుగ నచ్చినది. వారి యుద్ధరణ కది అత్యంతోపయోగి. ప్రజలలో చాలవరకు జనులు వారేగనుక బుద్ధుని బోధ వెంటనే సామాన్యులందరిలో వ్యాపించి, వారి యంగీకారము పొందినది. అస్పృశ్యత జన్మనుబట్టి యుండుట హింసా ప్రవృత్తియే. ఒక జాతినో, కులమునో, అస్పృశ్యులుగ దూరమందుంచి నిర్మంథ పెట్టుట గొప్పహింస ; కనుక ఆయన ఆజాతి నుద్ధరించబూనెను. జన్మనుబట్టి హెచ్చుతగ్గులు పెట్టి సంఘములో విభేదములకు తావిచ్చి కలహకారణులౌటయు హింసా ప్రవృత్తియే ; కనుక, ఆయన తన శిష్యులలో ఆవిభేదము పాటించక, అందరినీ సమదృష్టితో చూచెను.

ఆయన ప్రేమభావము అపారము. అయితే సంఘములో ముఖ్యముగ ఆర్యేతరులగు పామరజనులలో యుగములనుండి వ్యాపించిన హింసాతత్త్వము నొక్కరే తన ప్రవృత్తిచే బోగొట్టలేరు. కనుక సంఘసేవకై జీవితమంతను ధారబోయు కొందరి నాయన తయారు చేసెను. వారికి "శ్రమణకు" లని పేరు. వీరు త్యాగులై, ద్రవ్యార్జన లేకుండ, అహింసాధర్మము జనులకు బోధించుచు, ఆదర్శరూపమగు సత్ప్రవర్తన గల్గియుండవలెను. కాని వారు సోమరులు కాక ప్రజాక్షేమముకై కృషిచేయవలెను. ఆర్థిక సమస్య అందరికిని ముఖ్యము గనుక ఆయన ప్రజలలో శిల్పవిద్యయు వృత్తినైపుణ్యమును వృద్ధిచేయించెను.

ఆయన చాలచోట్ల ఈశ్రమణకుల సంఘములను స్థాపించి వారి జీవితము సన్మార్గమందుండునట్లు, నియమము నేర్పరచెను. అప్పటికి జనులందరిలోను మద్యమాంసములవాడుక చాల హెచ్చుగ నుండెను. బుద్ధుడు వాటిని చాలవరకు నిరుత్సాహపర్చెను.

లనుగూడ శ్రీమణికలుగ చేర్చువిషయమై మొదట సందేహించెను. శ్రీమణకులు ధర్మసేవకులగు సన్యాసులుగ నున్నంతకాలము విరాగులై బ్రహ్మచర్యముతో నుండుట యవసరము. గనుక వారు కాషాయవస్త్రధరులై వేషభాషలు తగ్గించి, విషయవాంఛ లేకుండు నట్లు జేసెను. స్త్రీలనుగూడ వీరి "విహార" ములందు వసింపనిచ్చి, వీరిలో తిరుగనిచ్చినయెడల మానవస్వభావమునుబట్టి పరస్పర రాగ మేర్పడి వారల బ్రహ్మచర్యముకు భంగముకలిగి, అవినీతి యేర్పడ వచ్చును. కాని, స్త్రీలకు ధార్మికబోధకధికారమునిరాకరించుటయు, అన్యాయమే. సమతత్వబోధకులు స్త్రీల నణచియుంచలేరు. మరియు మూఢభావములు సంఘములో తొలగించి మానవజాతిని బాగుపరచదలచినప్పుడు స్త్రీలలో ప్రబోధము జరిగించవలెను. అహింసాధర్మమును స్త్రీలలో స్త్రీ ప్రచారకులద్వారా బోధించుట సులభము. కనుక, ఆయన స్త్రీలు శ్రీమణికలై సంఘసేవికలగుట కంగీకరించెను. ఇట్లు శ్రీమణక సంఘములో స్త్రీలు పురుషులు గూడ చేరిరి. ఆ స్త్రీల ప్రవర్తనాదుల విషయమై ఆయన కట్టుదిట్టము లేర్పర్చెను. శ్రీమణకులు స్త్రీలైనను పురుషులైనను ఓపినంత కాలమును ధార్మికసేవ చేయవలెను; ఇక చేయలేక కుటుంబవృత్తికి దిగదలచువారు శాశ్వతముగ సన్యాసులుగనే యుండనక్కరలేదు. అట్టివారా సంస్థలను విడచి గ్రామములలో వివాహము చేసుకొని కుటుంబజీవనము చేయవచ్చును; కాని శ్రమణకులు బౌద్ధధర్మపు విహారాదిభవనములలో ఉన్నంతకాలము బ్రహ్మచర్యము తప్పకూడదు" అని బుద్ధుడేర్పర్చెను. వారు ద్రవ్యము కూర్చక భిక్షుకులుగనేజీవించునట్లు నిర్ణయించెను.

బుద్ధుడు తన మతప్రచారములో నొకసారి, తన జన్మస్థలమగు "కపిలవస్తు" నకు వచ్చెను. అక్కడ భిక్షచేయుచుండగ తల్లి, భార్య వగైరాలాయనను సమీపించిరి. ఆయన వారిని రానిచ్చి వారికిని అహింసాతత్వమును బోధించి వారును తమ జీవితము ధర్మోద్ధరణకు వినియోగించునట్లు చేసెను. ఆయన సవతి

తమ్ముడగు నందుడు తన ప్రియభార్యయగు సుందరియం దత్య
తానురాగముతోనుండి, ఆ ప్రేమలో ప్రపంచమును మరచియు
డెను. అప్పుడు బుద్ధుడతనికి బోధించి, కుటుంబప్రేమకన్న విశ్వ
ప్రేమ వేయిరెట్లు అధికము ఆచరణీయము అని ఒప్పించి, అతని
గూడ భిక్షువుగ జేసెను. అతడు శ్రమణుకుడైన మీదట కొం
కాలముకు సుందరియు శ్రమణికయైనది. ఇట్లు ఆయన తన
కుటుంబములో మగ్నుడౌటకు బదులు, వారికిని ధర్మసేవాస
గల్గించెను. ఆయన జీవితములో ఆయన నిగ్రహము, అహిం
విశ్వమానవప్రేమ తెలుపు వృత్తాంతము లెన్నియో జరిగిన
అవి (మహావగ్గో) మొదలగు బౌద్ధధర్మ గ్రంథములలో వివరిం
బడినవి.

బుద్ధుని పవిత్రజీవనమువల్లను, ఆదర్శమైన అహింసాతత్త్వము
వల్లను, ఆయన ఆత్మశక్తియు, సాత్త్విక తేజస్సును అద్భుతము
వృద్ధియైనవి. అట్టి లోకోత్తరులగు ధార్మిక పురుషులకు అతీంద్రి
యపు ప్రజ్ఞగల్గి వారు ఇతరుల ఆధివ్యాధులను సులభముగ కుదర్చ
గలరని పెద్దలందురు. బుద్ధుడు తన లోకక్షేమకరమైన జీవనములో
చాలమంది అసాధ్యములని యెంచిన దీర్ఘమగు మనోవ్యాధులను
శరీరరోగములను కుదిర్చి, వారిని స్వస్థచిత్తులుగను ఆరోగ్యవంతు
లుగను చేసి పంపినట్లు బౌద్ధగ్రంథములలో నున్నది. దేహము
కును మనస్సుకును అత్యంత సంబంధమున్నదని ఘనవైద్యులు
చెప్పుచున్నారు. అట్లే హృదయభావములకు మనస్సుకు సన్ని
హితత్వమున్నది. కనుక కల్మషయుక్తమైన హృదయమును, శో
గ్రస్తమైన మనస్సును పరిశుద్ధములై సద్భావయుతములై ఉత్సా
హములతో నిండినప్పుడెట్టి వ్యాధులనైన జయించు అంతశ్శక్తి
గల్గుట సాధ్యమే. అహింసాభావము మనస్సును హృదయమును
నిష్కల్మషము తేజోవంతముగ జేసి, హృదయ వికాసము వృద్ధి
జేయును. హృదయము బాగుపడి వృద్ధిజెందినప్పు డాధివ్యాధులు

పోవుట సహజము. కనుక, ఈకథలలో కొంత అతిశయోక్తి యుండినను, ఇవి నిరాధారములని భావింపకూడదు.

బుద్ధుడు చిరకాలము (80 ఏండ్లు) జీవించి, చాలబోధలజేసి, భారతీయసంఘపు సంస్కృతికి పునర్నిర్మాణముచేసెను. ఆయన జీవితకాలములో ఆబోధలు లిఖితములైనట్లు స్పష్ట నిదర్శనములు లేవు.

## అధ్యాయము 14.

### బౌద్ధుల ధార్మిక వాఙ్మయం.

బుద్ధుడు క్రీ- పూ- 480 లో చనిపోయెను. ఆయన అనంతరం అంతటి ప్రతిభావంతులగు శిష్యులు లేరు. కాని, ఆయన సహచరులగు "సారిపుత్రుడు, మొగ్గల్లాయనుడు, (=మౌద్గల్యాయనుడు) ఆనందుడు వగైరా ముఖ్య శిష్యులు దేశమంతటను అహింసా ధర్మమును ప్రచారము చేసిరి. చాలమంది రాజులా ధర్మమును ప్రోత్సాహపర్చిరి. చాలకాలము అందుకు వ్యతిరేకియైన మగధరాజగు అజాతశత్రుడు బుద్ధుని జీవితాంతమునకు ముందాయనను రప్పించి యాదరించి ఆసిద్ధాంతములు కొంతవరకామోదించెను. ఇట్లు బుద్ధుని మత ప్రాముఖ్యత దేశమంతటను హెచ్చుగనే, ఆయనసిద్ధాంతముల ప్రామాణిక గ్రంథముండుట అవసరమైనది. కనుక ఆబోధలను బుద్ధుని జీవిత గాథలను బౌద్ధభిక్షువుల శ్రామణక జీవితమున కేర్పర్చిన నిబంధనలను లిఖితముగ నిబద్ధము చేయుట అవసరమైనది. అప్పటికే (ఇతర దేశములోవలెగాక) మన దేశములో గొప్ప ధార్మిక వాఙ్మయమేర్పడియుండెను; లిఖిత పద్ధతియు [illegible] వాడుకలో

నుండెను. కాని వ్రాతలో తప్పులు రావచ్చుననియో మరి యెందువల్లనో ధార్మిక బోధలను సాధారణముగ లిఖితము చేయరైరి. వాటిని శిష్యులందరూ వల్లించి ముఖస్థమే చేయుచుండిరి. కాని పూర్వంవలెకాక సామాన్యులును పాళీలో బుద్ధుని బోధలను వాడుచుండిరి; వారినోటిలో తప్పులేర్పడును. విచిత్ర పాఠాంతరములును హెచ్చినవి. కనుక వాటిని పండితులప్పుడప్పుడు పరిశోధించిరి. రాజగృహ వైశాలీలలో సభలు జరిగెను. మూడవ పరిషత్తును అశోకచక్రవర్తి క్రీ॥ పూ॥ 241 లో పాటలీపుత్ర (పాట్నా) నగరమందు జరిగించెను. ఆపరిశోధనతరువాత కొంత కాలమునకు మరల ఇట్లే కొంత ప్రక్షేపములు పాఠాంతరములును వచ్చినవి. తుదకు సింహళములోని అనూరాధ పురమందు క్రీ॥పూ॥ 80 ప్రాంతమందు బౌద్ధప్రపంచపు ముఖ్య విద్వాంసులు, ఆగ్రంథములన్నిటిని పరిశోధించి, విడదీసి, యేర్పర్చి, వాటిని పూర్తిగ లిఖితముచేసిరి. ఇవి యన్నియు "పాళీ" భాషలో నున్నవి. ఇవి మహాభారతమునకు మూడురెట్లు గ్రంథమై మూడు సంపుటములుగ నిర్ణీతమైనది. ఈధార్మిక వాఙ్మయమును "త్రిపీటక" మందురు. మొదటి సంపుటము ("సుత్తపిటకం") సూక్తపీఠకం లేక సూత్రపీఠకం)

దీనిలో బుద్ధునిజీవిత చరిత్రకు సంబంధించిన విపులమైన గాథలు, ఆయన సామాన్యముగ తన సంచారములో అప్పుడప్పుడిచ్చిన యుపన్యాసములు ప్రసంగములున్నవి. ఇందు 5 ప్రత్యేక గ్రంథములు చేరియున్నవి. *

* ఈ 5 "దీఘనికాయ, మాఘమనికాయ, ఖుద్దకనికాయ, సంయుక్త నికాయ, అంగుత్తరనికాయ" అన బడును.

వీటిలోని "ఖుద్దకనికాయ" లోని 15 భాగములలో నొకటి యగు "ధమ్మపద" అప్పుడప్పుడు బుద్ధుడు బోధించిన కొన్నినీతుల సంగ్రహము. ఇందు 423 పద్యములున్నవి. ఇది భగవద్గీతవలె ధార్మిక ప్రపంచమంతటను ప్రసిద్ధమైనది. ఇది అహింస, సత్యము వగైరా సద్గుణముల ప్రాముఖ్యమును వెల్లడిజేయును. ఇది బౌద్ధుల పారాయణ గ్రంథము; ప్రపంచమందలి ముఖ్యభాష లన్నిటిలోనికిని తర్జుమాయైనది. ‡

రెండవ పీఠకము "వినయపిటక దీనిలో బౌద్ధభిక్షువులు పూర్తియైన అహింసాపరులై యోగ్యజీవనముతో సంఘసేవ చేయుటకు వారనుసరించవలసిన విధులు నియమములు, వారి ఆచార వ్యవహారములును పూర్తిగ వివరింపబడినవి. దీనిలో మూడు అంతర్భాగములున్నవి. మూడవపీఠకము "అభిధమ్మపిటక" ఇందు బౌద్ధధర్మపు దార్శనిక సిద్ధాంతములు, సాంకేతిక విషయములు, పారిభాషిక సంజ్ఞాపదములును చర్చింపబడినవి. బౌద్ధసిద్ధాంతములకు, ఈధార్మిక సూత్రములకు కొన్ని మచ్చువాక్యములు మాత్రి మీక్రింద నుదహరించబడినవి.

ధమ్మపదలో

1. బుద్ధుని, ధర్మమును, సంఘమును, ఆశ్రయించి, ఆర్య సత్యముల నాల్గింటిని మంచి విచక్షణతో గ్రహించువాడు ధన్యుడు,

2. దుఃఖముకు అహింసాదులు కారణములు.

---

‡ శ్రీ బా॥ దు॥ బలరామకృష్ణయ్యగారు దీనిని తెలుగులో సహా: కసు: బుద్ధ పురాణములో చేర్చియున్నారు.

1. యోచబుద్ధంచ ధమ్మంచ సంఘంచ సరణంగతో । చత్తారి అరియాని సచ్చాణి సమ్మప్పజ్ఞాయుపస్సతి (ధమ్మపదం- బుద్ధవగ్గో 191)

సంస్కృతు (ఛాయ- యశ్చబుద్ధంచ ధర్మంచ సంఘంచ శరణం గతః (చత్వారిచార్య సత్యానిసమ్యక్ప్రజ్ఞ యాపశ్యతి)

2. సమణోగోతమోచాతు వణ్ణిం సుద్ధిపంజాపోతి (మజ్జిమనికాయ, ము. ఖణ్ణోసక, అస్సలాయనసుత్త)

3. దుఃఖమును పోగొట్టిన మీదటనే సిద్ధుడై, నరుడు నిర్వాణ మొందగలడు.

4. దుఃఖమును పోగొట్టుటకు అహింసాదులను అష్టమార్గములచే సాధింపవలెను. (౧ సమక్ దృష్టి, ౨ సంకల్ప, 3 వాణి, ౪ కర్మాంత, ౫ ఆజీవిక, ౬ వ్యాయామ, ౭ స్మృతి, ౮ సమాధి, ఈ 8 అష్టమార్గములు.

(ఈ 4 ఆర్యసత్యములు)

(1) దుఃఖము లోకమందున్నది.

(2) నాల్గువర్గములవారును శ్రమణకులై పవిత్రులైతే, ఎట్టివారును శుద్ధులై సిద్ధిబొందుదురు.

(3) విరోధము విరోధమువల్లకాక, మైత్రివల్లనే శాంతించును.

(4) రాగద్వేషాదులుపోయి, మంచిశీలము కలవాడే, దమసత్యాదియుతుడే సన్యాసముకు తగును.

5. యుద్ధాదులలో జయమొందినవానికి విరోధులు హెచ్చి దుఃఖమేర్పడును; ఓడినవానికిని దుఃఖము తప్పదు. హింసకు దిగక శాంతముగనున్నవాడే సుఖపడును.

---

3. నహి వేరే న వేరాని సమ్మన్తిధకుదాననం । అవేరేనచ సమ్మన్తి ఏసధమ్మో సనాతనో (ధమ్మపద, యమకవగ్గో 5)

(ఛా॥ నహి వైరేన వైరాణి శామ్యంతీహ కదానన । అవైరేణచ శామ్యంతి ఏషధర్మస్సనాతనః)

4. యోచవంతకసావస్సో సీవేఖను సమాహితో । ఉపేతా దమసచ్చేన సవేకాసావ మరహతి ( ,, ,, 10 ) ఛా యశ్చ వాంతకషాయస్యాత్ గీలేషుసుసమాహితః । ఉపేతోదమ సత్యాభ్యాంస వైకాషాయమర్హతి.

5- జయం వేరం పసవతిదుక్ఖంసేతి పరాజితో ! ఉపసంతో సుఖంసేతి హిత్వా జయపరాజయా॥ ( ,, సుఖవగో. 20)

(ఛా- జయో వైరం ప్రసూతే- దుఃఖం శేతే పరాజితః । ఉపశాంతః సుఖం శేతేహిత్వా జయపరాజయా.

6. క్రోధమును శాంతతతోను, అసాధువును మంచితోను, పిసినిగొట్టును దానముతోను, అబద్ధమును నిజముతోను, జయింపవలెను.

7. అహింసావ్రతులు నిగ్రహవంతులు, దుఃఖములేని "అచ్యుత" స్థానమును పొంది సుఖింతురు.

8. ఎక్కువగ మాటలాడినంతనే ధర్మధరుడుకాడు; కొంచెముగ ధర్మము నేర్చియైనను వాటిని, నిగ్రహియై, శ్రద్ధతో ఆచరించు వాడే ధర్మధరుడు.

9. ఎవడు, అహింస, సత్యము, ధర్మము, నిగ్రహము, దమము, అవలంబించునో, ఎవడు మాలిన్యము పోగొట్టి పరిశుద్ధుడగునో, అట్టివాడే "స్థవిరుడు" (=పెద్ద) అనిపించుకొనును.

---

6. అక్కోధేన జినే కోధం, అసాధుం సాధునా జినే। జినే కదరియం దానేన, సచ్చేన అలికవాదినం. ( ,, కాంధవగ్గో 223)
(ఛా. అక్రోధేన జయేత్ క్రోధం, అసాధుం సాధునా జయేత్। జయేత్కదర్యం దానేన సత్యే నాలీకవాదినం)

7. అహింసకాయే మునయో నిచ్చంకాయేన సంవుతా। తేయాంతి అచ్చుతంఠానం యత్థగన్త్వాన సోచరే ( ,, ,, 225)

(ఛా. అహింసకాయే మునయో నిత్యంకాయేన సంవృతాః। తేయాంతి అచ్యుతం స్థానం యత్రగత్వానశోచతి)

8. నతావతా ధమ్మధరో యావతా బహుభాసతే, యోచ అప్పంపిసుత్వాన ధమ్మంకాయేనపస్సతి, సవేధమ్మధరోహోతి యో ధమ్మం నప్పమజ్జతి, (,, ధమ్మవగ్గో=259)

ఛా. నతావతా ధర్మధరో యావతా బహుభాషతే, యశ్చాల్పేనాపి శ్రుత్వేన ధర్మం కాయేన పశ్యతి, సవైధర్మధరో భవతి యో ధర్మేన ప్రమాద్యతి.

9. యమ్హి సచ్చంచ ధమ్మోచ అహింసా సంఞమోదమో, సవేవన్తమలో ధీరో థేరోతి పవుచ్చతి, ( ,, 261)

యస్మిన్ సత్యంచ ధర్మశ్చ, అహింసాసంయమోదమః, సవైవాంతమలో ధీరః స్థవిరస్సఉచ్యతే.

10. రాత్రిపగలు అహింసయందే మనస్సునిల్పి దానియం దిష్టముగల బౌద్ధశ్రమణకులు మెలకువతోనుండి ప్రబుద్ధులౌదుర.

11. బ్రాహ్మణత్వము జటలు వేసుకొన్నను, జాతి గోత్ర ములవల్లను రాదు. ధర్మసత్యవంతులే శౌచవంతులు. వారే బ్రాహ్మణులు.

12. ప్రాణిహింస చేయువారు జీవహింసను మానివేసిన మీదనే నిర్వాణము పొందగలదు.

దీఘనికాయలో

13. ప్రాణి హింసను, చోరీని, అబద్ధమాడుటను, పరస్త్రీ గమనమును, పండితులు ప్రశంసించరు.

---

10. సుప్పబుద్ధంపబుజ్ఝంతి సదోగోతమసావకా.
యేసందివాచరత్తోచ అహింసా మరతోమనో,
( ,, పకిణ్ణకవగ్గో. 300)

(ఛా. సుప్రబుద్ధ ప్రబుధ్యంతే సదా గౌతమ శ్రావకాః। యేషాం దివాచ రాత్రౌచ అహింసా యాం రతం మనః

11. నజటాహినగోత్తేహి, నజచ్చాహోతి బ్రాహ్మణో, యమ్హిసచ్చఞ్చ ధమ్మోచసో సూచీసోచ బ్రాహ్మణో ( ,, ,, 393)

(ఛా. నజటాభిర్నగోత్రైశ్చ నజాత్యాభవతి బ్రాహ్మణః)

12. పాణాతిపాతిస్స పురిసపుగ్గలస్సపాణాతి పాతవేరమణి, హోతి పరి నిబ్బానాయ (మజ్ఝిమనికాయ, సల్లేఖసుత్తం)

ఛా॥ ప్రాణాతిపాతినః పురుష పుంగవస్య ప్రాణాతిపాత విరమణం పరి నిర్వాణాయ]

13. పాపాతిపాతో అదిన్నాదానో ముసావాదోచ, పరదారగమనంచేప, నప్పసంసంతి, పండితాతి (దీఘనికాయ 3 సింగలో వాదసుత్తం తే. 31)

(ఛా॥ ప్రాణాతిపాతం అదత్తాదానం: మృషావాదం, పరదారగమనం చైవ నప్రశంసంతి పండితాః)

అంగుత్తరనికాయలో

14. భిక్షుకులారా శస్త్రవ్యాపారం, ప్రాణివ్యాపారం, మాంసవ్యాపారం, మద్యవ్యాపారం, విషవ్యాపారం; ఈఅయిదు రకముల వస్తువ్యాపారమును శ్రమణకులే గాక, ఉపాసకులైన సామాన్యులును చేయకూడదు.

సుత్తనిపాత— ధమ్మికసుత్తలో.

15. ప్రాణులను చంపకూడదు. చంపించకూడదు. ఇతరులు జరిగించు హత్యనామోదించకూడదు. స్థావరజంగమములైన అన్ని జీవులమీాదను దయ యుంచవలెను.

మంగళసుత్తలో.

16. దేహమునువంచి శరీరకృషి చేయవలెను. శిల్పములో తరిఫీయతు అయి శ్రద్ధతో శిల్ప కార్యములజేయుట క్షేమకరము. సత్యముగనే మాటలాడవలెను.

---

14. పంచయిమాభిక్షవేబణిజ్జా ఉపాసకేన అకరణీయ; కతమేపంచ సత్థవణిజ్జా, సత్థబణిజ్జా, మంసబణిజ్జా, ముజ్జబణిజ్జా, విసబణిజ్జా. (అంగుత్తరనికాయ 5—177)

ఛా. భిక్షవః। పంచయిమాచివాణిజ్యాని ఉపాసకేన అకరణీయాని కతమానిపంచః—సత్వవాణిజ్యం, శస్త్రవాణిజ్యం, మాంసవాణిజ్యం, మద్యవాణిజ్యం, విషవాణిజ్యం.

15. పాణం నహానేనచ ఘాతయేయ్య। నచానుమఞ్ఞాహననం పరేసం। సత్వేసుభూతేసు నిధాయదణ్డంయేథావరా యేచతసంతిలోకే (సుత్తనిపాత-ధమ్మసుత్త)

(ఛా. ప్రాణిం నహన్యాత్ నచఘాతయేత- నచానుమాన్యాత్ హననం పరేషాం। సర్వేషుభూతేషు నిధీతదండం యేస్థావరాయేచ చలంతిలోకే॥

16- బాహుసచ్చంచ సిప్పంచ వినయోచ సుసిక్షితో। సుభాసితాచయావాచా ఏతం మంగళముత్తమం (మంగళసుత్తం

(ఛా- బాహుసత్యంచ శిల్పంచ వినయోశ్చ సుశిక్షితః। సుభాషితాచయావాచా ఏతన్మంగళముత్తమం.

ఇందునుబట్టి శ్రమణకులుగ సంఘసేవ చేయువారే భిక్షుకులుగ జీవింపవలెను; తక్కిన వారందరు ఏదో శిల్పాది వృత్తుల ద్వారానే శ్రమపడి, దేశపు సంపత్తును హెచ్చుచేసియో ఇతర విధములనో సంఘాభివృద్ధికి తోడ్పడవలెనని బుద్ధుని అభిప్రాయమని తోచును.

ఇట్లు "త్రిపిటక'' మనబడు పాలీగ్రంథములలో అహింసావశ్యకతను దాని కనుబంధములైన సత్యశౌచాదుల గూర్చియు ప్రబోధించినారు. మద్యమాంసముల దినగూడదనియు ప్రశంసించిరి.

దరిమిలాను సంస్కృతములో వ్రాసిన బౌద్ధ గ్రంథాలలోను మద్యమాంసములు తినుట మంచిదికాదని, విషయములందు పేరాస వలె వాటిని గల్గించు మాంసాహారమును మద్యపానమును విడువవలెనని, అట్లు విడువక మాంసాదుల తినువారికి స్త్రీమితము తప్పి మోక్షము లేకుండ పోవుననియు స్పష్టముగ జెప్పినారు *

---

* మద్యం మాంస పలాండుం నభక్షయేయ మహామునే, బోధిసత్త్వైః మహాసత్త్వైః భాషాజ్ఞైః జినపుంగవైః ...

యద్వైవరాగో మోక్షాయ అంతరాయకరో భవేత్, తద్వైవమాంసం మద్యం అంతరాయకరం భవేత్, తస్మాన్న భక్షయేన్మాంసం ఉద్వేజనకరం నృణాం, మోక్షధర్మవిరుద్ధత్వాదార్యాణా మేష వైధ్వజః, (లంకావతారసూత్రం)

ఈసంస్కృత గ్రంథములో చాలభాగము వచనము. ఇది చాల ప్రాచీన గ్రంథమై ఇదివరలో దొరకక ఇటీవలనే (1922 లో) జపానులో ప్రచురింపబడినది. క్రీస్తుశకపు మొదటిశతాబ్దిలో సింహళములో బౌద్ధవిద్వాంసులు సిద్ధాంతముల జర్చించిరి. అప్పుడు మాంసము దినవచ్చునని కొందరు వాదించగా. అందుకు జవాబుగ ఇది వ్రాయబడెనట. ఇది క్రీ: శ 443 లోనే చీనా భాషలోకి తర్జుమాయైనదట.

## అధ్యాయము 15.

### బౌద్ధ సంస్కృతి.

#### —♦ జా త క క థ లు. ♦—

బౌద్ధుల త్రిపీటకములు. అహింసాతత్వమును విద్వాంసులలో మంచి ఆధ్యాత్మికదృష్టిని గల్గించి, అహింస సనాతన ధర్మములో ముఖ్యాంశమని స్పష్టపర్చినది. అవి విదేశములకును ప్రామాణిక గ్రంధమైనందున వాటిద్వారా అహింసాతత్వము భారత దేశపు చుట్టుపట్ల దేశములలో విద్యావంతుల యామోద మొందినది. కాని, సామాన్యజనులకు కేవలం ఆధ్యాత్మిక చర్చలుగాని నైతిక బోధలుగాని రుచికరముగావు. పామర జనులకు కథలంటె చాలాప్రీతి, అప్పటికి మన భారత దేశమందు వేదకాలము నుండి చిత్రవిచిత్రమైన కథలు వ్యాపించినవి. వీటిలో ముఖ్యమైనవి, అహింసాతత్వముకు సరిపడునట్లు బౌద్ధులచే సమన్వయింపబడినవి. ఇవే బౌద్ధజాతక కథలు. ‡

ఈజాతకకథలు సులభమైన పాలీభాషలో నున్నవి. ఇవి అయిదారు వందల సంఖ్యవి. ఇవి బుద్ధునికి పూర్వపు కాలమందు జరిగినట్లుండును. ఈ ప్రతికథలోను ఒక ముఖ్యపురుషుడు అహింసాత్మకఁడు ఆకథాంశముకు తగినట్లు అహింసాతత్వమును బోధించును, లేక ఆచరణలో బెట్టును. "ఈనాయకుడు అసలు బుద్ధదేవుడే, అతడంతకు పూర్వము చాలసారులు ఈభూమిపైన జన్మములెత్తుచుండెను; ప్రతిజన్మలోను ఆకాలపు జీవులకు అహింసా

‡ ఈకథలు బుద్ధుడే చెప్పినట్లందురు, కాని మూలపు పాలీకథలు నశించిన పట్ల, వాటిని సింహళభాషలోకి, క్రీ-పూ. 3 వ శతాబ్దిలో అనువదించియుండిరి. వాటినుండి మరల పాలీలోకి క్రీ. శ 4 వ శతాబ్దిలో బుద్ధఘోషుడు చేసిన అనువాదములే ఇప్పుడు వాడుకలో నున్నవి.

తత్వపు ఆధిక్యము కనబర్చుచుండెను. ఆజన్మలందట్లు అవతరించిన బుద్ధుని పూర్వజన్మరూపములకు "బోధిసత్వుడు" (=స్థితప్రజ్ఞుడు) కనుక వెంటనే మోక్షమొంద దగినను తన మోక్షముమాత్ర మపేక్షించు స్వార్థపరుడు కాలేదు. లోకములో అహింసాతత్వ మింకను వ్యాపించవలె కనుక ప్రజల నుద్ధరించుటకై ఆయన మరల భూమిపై పుట్టుచుండెను. అట్టి జన్మలలో నొకప్పుడు ఆకాలపు జంతువుగను, ఒకప్పుడు వృక్షజాతిలోనుగూడ, ఏదో యొకరకపు ప్రాణిగ పుట్టెను. తుదకాయన గౌతమబుద్ధుడై యవతరించి, అంతటితో నిర్వాణమొందెను, అని బౌద్ధులందరి నమ్మిక. ఈ జాతకకథలు పామరుల కాకర్షకమై వారికి రుచికరముగ నున్నవి. వీటిలో కొన్ని వేదేతిహాసములలోని గాథలే. కొద్ది మార్పులతో కనబడుచున్నవి. * సామాన్యప్రజలలో అహింసాతత్వము వ్యాపించుట కప్పుడీ జాతక కథలు తోడ్పడినవి. ఈకథలలో మచ్చుకు రెండు మూడింటిని రుచిచూతము.

## —◆ దేవధమ్మ జాతక కథ ◆—

బోధిసత్వుడొక జన్మలో దేవదత్తుడను కాశీరాజుకు జ్యేష్ఠపుత్రుడై జనించెను; తరువాత ఆరాజుకింకొక కొడుకును కల్గెను అంతట రాణి చనిపోయినది. రాజు మరల పెండ్లాడి ఆమెవల్ల మరొకపుత్రుని పొందెను. ఇతనిపేరు "ఆదిత్యుడు" ఈ రెండవదగు ముద్దుల భార్య వివాహకాలమందామెకు రాజు రెండువరములిచ్చెను. అందునుబట్టి తరువాత, తనకొడుకును వయస్సు వచ్చిన మీదట, అతనినే యువరాజుగ చేయుమని ఆభార్య రాజును వేధించెను. ఆకోరికను రాజు నిరాకరించలేదు; కనుక, బోధిసత్వుడామె కోరిక ప్రకారం తన సోదరునితో నడవికిపోయెను, తరువాత, ఆదిత్యుడును వారిని జేరెను. వారందగును దారిలో చాల శ్రమ

* ఇందొక కథలో శ్రీరాముని యితిహాసమంతయు చిన్న చిన్న కథవలె చెప్పబడినది. శ్రీరాముడు దయార్ద్రహృదయుడు, పరోపకారి అని సూచించినారు. అయితే [illegible] సీత దేవి శ్రీరామునికి సోదరి యని చెప్పినారు;

పడి, బడలికచే నొకచోట నిల్చిరి. దప్పిక హెచ్చినది. ఆదిత్యు డటనుండి నీటికై వెళ్ళి ఒక కొలనుచూచి దానిలో దిగెను. ఆసరస్సు నొక పిశాచుడు కాచుచుండెను. అతడాదిత్యునిజూచి "నాప్రశ్నకు ముందుగా జబాబు చెప్పు. దేవసమానమగు దాని నెరుగుదువా ? అని గర్జించెను. ఔను. సూర్యచంద్రులు" అని ఆదిత్యుడనెను. కాని, అందుకు తృప్తిజెందక, తన ప్రశ్నకు సరి యైన జబాబీయనివారిని చంపి తినుటకు తన కధికారమున్నందున, అతడాదిత్యు నాచెరువులోనే పట్టి బంధించెను. ఆదిత్యుడెంతకును రానందున బోధిసత్త్వుని పెద్ద తమ్ముడు వెదకుచు ఆ కొలనులో దిగెను. అతనిగూడ "దేవసమాను నెరుగుదువా?" అని ఆపిశాచ మడిగెను. "చతుర్దిగ్భాగములు" అని జబాబు వచ్చెను. కాని, పిశాచుడు, తృప్తిలేక, అతనినిగూడ కొలనునీటిలో బంధించెను. తుదకు వీరిద్దరి కొరకు బోధిసత్త్వుడే వెదకుచు, ఆకొలను జేరి, అక్కడి పరిస్థితి గ్రహించి ముందుగా పిశాచి నానవాలుపట్టి, "నాతమ్ములను నీవే బంధించినావుగదా?" అని యడిగెను. ఈతని కద్భుతజ్ఞానమున్నదని, తనప్రశ్నలకీతడు జబాబీయగలడని, పిశాచు డప్పుడు గ్రహించి "అవును? నీబుద్ధికి సంతోషించితి వీరిలో నొక్కనిని విడుతును. ఇద్దరిలో నెవరు కావలెను?" అని అడిగెను. "చిన్నవానిని వదలుము" అని బోధిసత్త్వుడు కోరెను.

"అదేమి సవతితమ్ముని విడుదల కోరితివి?" అని పిశాచు డడిగెను. "అతడు రాజగుటకే నేనడవికి రావలసివచ్చినది. కాని తల్లి కోరికప్రకారమతడు రాజ్యభారము తీసుకొక తనంతట నాయొద్దకు వచ్చెను. మాయిద్దరు సోదరులము తండ్రియాజ్ఞ యని వచ్చినాము. అతనిని మరల యింటికి చేర్చుట నాముఖ్యబాధ్యత; లేకున్న నాకప్రతిష్ఠ గల్గును. " అని బోధిసత్త్వుడని కనిష్ఠునే విడువుమనెను. "అహింస దేవసమానము; హింస పైశాచికము. పూర్వజన్మలో హింసా ప్రవృత్తివలన నీకీపిశాచజన్మము కలిగినది. ఇప్పుడు నరహింసచేస్తే, శాశ్వతపతనము కల్గును'' అనియు

పిశాచుని కతడు తెలియజెప్పెను. అంతట పిశాచుడిద్దరిని వదలి, అప్పటినుండి నరహింసను మాంసభోజనమునుమాని, బోధిసత్త్వుని బోధచే ధన్యుడై నాడు. ఇంతలో తండ్రి పోగా బోధిసత్త్వుడు వచ్చి రాజై, ఆదిత్యుని తన సేనాధిపతిగ జేసెను.

## —◆ నిగ్రోధమిగ జాతకం ◆—

ఒకజన్మలో బోధిసత్త్వుడు కాశీరాజ్యమందొక అడవిలో మృగమైపుట్టెను. కాశీరాజాయడవికి తరుచు వచ్చుచు, వేటలో ప్రతిసారియు చాల జంతువుల జంపుచుండెను. ఇట్లు ప్రతిరోజును ఎన్నియో మృగములు చచ్చుచుండెను. అంతట రోజు కొక్కొక్క మృగమును అక్కడి యజమాని పంపునట్లును, అందుతో తృప్తుడై రాజు తక్కినవాటి జోలికి రాకుండునట్లును, రాజీ జరిగినది. ఇట్లు జరుగుచుండగా కొంతకాలము కొక చూలాలగు లేడికి వంతువచ్చినది. ఆగర్భవతి మరణించుట కిష్టపడక, బోధిసత్త్వ మృగము ఆలేడికి బదులు తానే, ఆరోజున రాజువేట కెరకాదలచి తానే రాజు కెదురుగ వెళ్లెను. రాజు వేటకువచ్చి, "ఈరోజున నీవంతుకాదే, మరొక లేడిది; నీవెందుకు వచ్చితివి?" అని ఆశ్చర్యముతో నడిగెను. "ఆలేడి గర్భవతిగ నున్నది. దాని స్థానమున నాయంతట నేను బలియగుటకు వచ్చినాను. ఈరోజున నన్నే చంపితినుము" అని బోధిసత్త్వుడు చెప్పెను. "ఆహా! మరొకరిని కష్టమునుండి కాపాడుటకు, ప్రాణమిచ్చుటకు సిద్ధమైనావు. ఇట్టి దయాస్వరూపమగు నీప్రాణమును తీయను. నీయాత్మార్పణ బుద్ధికి నాకాశ్చర్యమైనది, నీవు కోరువరమిత్తును" అని రాజు చెప్పెను. ఇక ముందు మీరు జంతువులను హింసింపవద్దు, జీవహింసయు మాంసభోజనమును క్రూరకార్యములు. కనుక మీరు వాటినిమానుట మీకును లోకమునకును క్షేమకరము" అని బోధిసత్త్వుడుచెప్పి, రాజును అహింసాపరునిగ జేసెను. అందువల్ల ఆప్రాంతమంతటను రాజుకు మృగయావ్యసనముపోయి, ఎన్నియో మృగములకు సౌఖ్యము కల్గినది.

## మతకభత్త జాతకం

కాశీనగరమందు వేదాభ్యాసపరుడు పూర్వాచార నిష్ఠుడు అగు బ్రాహ్మణుడుండెను. అతడు శాస్త్రప్రకారం పితృవులకు పిండప్రదానంచేయుచు, దాని కనుబంధముగ, ఒక యాగ మారంభించెను. ఆసందర్భములో ఆయన యజ్ఞపశువుగ ఒక మేకను గంగకు తీసుకొనిపోయి దానిని స్నానము చేయించుమని శిష్యులను నియమించెను. వారు దానిని గంగకు తీసుకొనిపోగా, ఆమేక గంగానది చేరగనే పూర్వజన్మజ్ఞానమొంది, తనకిక బాధావిముక్తి యగునని సంతోషముతో నవ్వెను. వెంటనే మరల యేడ్పుధ్వని పట్టెను. ఈసంగతి తెలిసి విద్వాంసుడా మేకలో నేదో విశేషమున్నదని దాని ధోరణినిబట్టి కనిపెట్టి, "ఇదేమి విచిత్రము, ఈ నవ్వుకు యేడ్పుకు అర్థమేమి?'' అని హెచ్చరించెను. "నాకిప్పుడు పూర్వజన్మజ్ఞానమేర్పడినది. వెనుక నొకసారి యిట్లే నేను మేకను చంపినందున నేను 499 జన్మలెత్తి ప్రతిసారియు బలవన్మరణమొందితిని. ఈసారితో విముక్తినై, నాకు మోక్షము కల్గును; ఈసంగతి నాకు తెలిసి సంతోషమున నవ్వితిని. కాని, ఇకముందు నీకు చాల జన్మల వరకిట్టి దుర్దశ గల్గునుగదా యని విచారము తోచి యేడ్పువచ్చినది.'' అని యామేక మనుష్య వాక్కుతో నన్నట్లా విద్వాంసునకు వినబడినది. అంతట ఆబ్రాహ్మణుడు దీర్ఘాలోచనలోబడి, తుదకంతటితో యాగము మానివేసి, ఆ మేకను వదలివేసెను. అప్పటినుండి ఆయన హింసల నసలే వదలి ప్రాణులందు ప్రేమగల్గి యుండెను. విప్రునుండి విడుదలయైన మేక, దగ్గరనున్న కొండపైనున్న చెట్టువద్దకు వెళ్లి ఒక పిడుగుదెబ్బచే చచ్చెను. ఆచెట్టు బోధిసత్వుని స్వరూపము గనుక అహింసాతత్వము జనులందరి కవసరమని ఆవనస్పతి నరవాక్కుతో అక్కడి జనులకు బోధించెను.

## అధ్యాయము 16.

### —♦ రా మా య ణ ము ♦—

తరువాత మన సంస్కృతి కెక్కువ సంబంధించినది, వాల్మీకి రామాయణము. ఇది పారాయణ గ్రంధము ; ముఖ్య భాషలన్నిటిలోనికి తర్జుమాయైనది. దేశభాషలలో సామాన్యు లందగును దీనిని చదువుదురు. ఈకధతో సంస్కృతములోను, దేశభాషలోను, లెక్కలేని నాటకములు, ప్రబంధములును యేర్పడినవి. ఇట్టిగ్రంధపు సంగతులు భారతీయుల భావ పరిణామముకు చాల వరకు కారణమైనవి. కనుక, రామకధ నిదివరలో చర్చించినను, ఈ గ్రంధమును అహింసా ప్రశంసలో కొంత గమనింపవలెను.

వాల్మీకిరామాయణము గొప్ప యితిహాసము. ఆధ్యాత్మిక గ్రంధము, ఆదికావ్యము అనికూడ భావింతురు. అనగా ఇందులో చరిత్ర ధర్మబోధ, ధ్వనిసహితమైన వర్ణనయు ఉన్నవి. ఈగ్రంధ రచనగూర్చి రామాయణములోనే చిన్న కథ గలదు. వాల్మీకి మహర్షి యొకనాడు నారదమహర్షిని "గుణవంతుడు, ధర్మజ్ఞుడు, సత్యవంతుడు, సర్వభూతహితుడు, దయావంతుడు నగు మహనీయుడు ; అట్టివారి చరిత్ర తెలుపుము." అని యడిగెను. * ఇట్టి గుణములు అహింసాపరునకే యుండునని స్పష్టము. నారదుడు శ్రీరాముడే అట్టి ఉత్తమపురుషుడు అనిచెప్పి, శ్రీరాముని జీవితకథ నంతను బోధించెను. ఆయద్భుతకథా విశేషమును స్మరించుచు అంతట వాల్మీకి బయటకు వెళ్లి తమసానది యొద్దనుండగా ఒక చెట్టుకొమ్మమీద బెగ్గురుపక్షులు జంటనిల్చి కూయుచుండెను; ఇట్లువి విలాసముతోనుండగా ఒక మూలనుండి ఒక వ్యాధుడు

---

* కోన్వస్మిన్ సాంప్రతం...... ధర్మజ్ఞశ్చకృతజ్ఞశ్చ సత్యవాక్యో దృఢవ్రతః । చారిత్ర్యేణ చకోయుక్తః సర్వభూతేషు కోహితః

రామాయణం 1—1—2, 3)

బాణముతో నాపక్షుల గొట్టెను. అందొకపక్షి ఆదెబ్బతగిలి, వెంటనే క్రిందబడి చచ్చెను. రెండవది, దుఃఖముతో నేడ్చెను. వాల్మీకి యాదృశ్యమునుచూచి వ్యాకులమనస్సుతో నుద్రేకమొందెను. ఆయన శోకముతో శ్లోకరూపమున నిట్లనెను; ‡ "ఓనిషాదుడా ప్రేమలోనున్న క్రౌంచము జంటలో నొకదానిని చంపిన నీకు శాశ్వతముగ అప్రతిష్టగల్గును." అని దానిభావము, కాని శ్రీరామకథ నంతకుముందు ధ్యానించుచుండగ ఆయననోటనుండి వచ్చిన యీశ్లోకములో "కామమోహము గల్గిన రాక్షసుని జంపిన ఓ శ్రీనివాసా, మీకు శాస్వతకీర్తి కలుగుగాక" అనియు ధ్వని కల్గినది. ఇట్లు సీతను హరించిన రావణుని వధ కూడ ఈశ్లోకములో అర్థమైనది. వాల్మీకి యింటికివెళ్ళి, బ్రహ్మప్రేరితుడై అట్టి చిన్న శ్లోకములతోనే రామాయణము రచించెను. హింసాచర్యను నిరసించుట కుద్దేశించిన శ్లోకసూచనతో రామాయణ రచన జరిగినదనుటలో చాల అర్థమున్నది. ఇందుల ముఖ్యపాత్రయగు శ్రీరాముడు ప్రేమమూర్తి; లోకసంరక్షణమే ఆయన సంకల్పము. అహింసామూర్తులగు ఋషుల రక్షించుటకే ఆయన బాల్యమందే అడవులలో దిరిగి ఋషులతో ఆశ్రమజీవనములో పాల్గొనెను. సంహారకర్తయగు శివుని విల్లు విరిచివేసెను. బ్రాహ్మణుడై క్షత్రియుల జంపుచు హింసాజీవనము చేసిన పరశురాముని తేజస్సును హరించి, హింసాపరుడై యుండిన ఆయన కుత్తమగతికి మార్గము తెగగొట్టి కర్మయోగియగు జనకుని పుత్రికకు భర్తయై, రాజ్యవిభవమును ఐశ్వర్యమంతను వదలి సంపూర్ణ త్యాగము చూపెను. ఇందులో ఆదర్శపుత్రుడై పితృవాక్యము పాలించుచో శాక, శ్రీరాముడు దక్షిణ ప్రాంతమంతటను జనులకు కంటకము హింసాభరితము అయిన రావణ పాలన మంతమొందించెను:

---

‡ మానిషాద ప్రతిష్ఠాంత్వమగమః శాశ్వతీః సమాః । యత్క్రౌంచ మిథునాదేక మవధీః కామమోహితః॥ వాల్మీకి రామాయణం (1-అ-2-శ్లో 15)

ఇట్టి (అనుష్టుప్ వృత్తపు) శ్లోకములను మొదటిసారి వాల్మీకియే రచించె నందురు.

దక్షిణ ప్రాంతమునుగూడ ఋషులు వగైరా అహింసాపరులకు వాసయోగ్యముగ జేసెను భాతృభార్యను హరించి నైతిక హింస గల్గించిన వాలిని సంహరించెను. రావణుడు వ్యక్తిగ దుష్టుడై హింసాపరుడై యుండెను. అంతేగాక అప్పటి రాక్షసుల, సంస్కృతి కేవలం హింసామయము ; వారప్పటి నరులజంపి వారి పచ్చిమాంసమునే తినుచుండిరి ; మద్యపాన నిరతులై దురాచారపరులై స్త్రీలోలురై నిశాచరులు మాయాపరులై యుండిరి. రావణుని సోదరుడు కుంభకర్ణుడును అతినిద్రికు, అతిక్షుధకును లోనై, తామస గుణమూర్తిగ నుండెను. అట్టి తామస సంస్కృతి నంతమొందించి హింసాతత్వము దక్షిణ ప్రాంతమంతటను లంకలోను పోవునట్లు పరివర్తన గల్గించుటే రావణవధయుద్దేశము, ఫలితమును. యుద్ధ సందర్భముతరువాత రాక్షసజాతిలో నెవరిని శ్రీరాముడును వానరులును ఏవిధముగ బాధించలేదు. విభీషణుడు (సత్వగుణయుతుడు) రాక్షసరాజ్యమంతటి కధికారిగ జేయబడెను. అనగా ఈ ఆదిమ జాతిలోను సత్వగుణము అహింసా తత్వము వ్యాపించదొడగెనని భావింపవచ్చును. ఆ తరువాత జనులు అహింసాపరులైరని రామాయణాంతమున చెప్పినారు. * అప్పటి భావములనుబట్టి యుద్ధమే కార్యసాధనమైన సంగతి నిజమే. తరువాత సుగ్రీవ విభీషణులు సామంతరాజులుగ శ్రీరాముని చక్రవర్తిత్వమొప్పుకొని, పట్టాభిషేకముకు వచ్చిరి. ఇట్లు మూడు భిన్న సంస్కృతులమధ్య సమన్వయమారంభించెను. భారతదేశమంతయు అంతట ఒకే సామ్రాజ్యముక్రిందకు రాగలిగినది. ఈరీతిగా భారతదేశపు జాతీయైక్యతకు, పరస్పర మైత్రికిని వాల్మీకిరామాయణము పునాదియైనది. ఈ జాతీయైక్యత రాజకీయ ప్రేమకు అహింసకు ముఖ్యావశ్యకము.

---

* సర్వం ముదితమేవాసీత్ సర్వో ధర్మ పరోభవత్, రామమేవానుపశ్యంతో నాభ్యహింసన్పరస్పరం. ( ,, 6—12—8—100) రామరాజ్యపు ఆధిక్యము అహింసలోనే కలదని సూచితము.

ఇట్లు చారిత్రిక విశేషమే కాక ఆధ్యాత్మిక సూచనయు కలదందురు. శ్రీరాముడను పరమాత్మనుండి సీతయను జీవాత్మ ♦ రావణుడను రజోగుణబలముచే విడిచివచ్చి, లంకయను ప్రకృతిలో బద్ధమైనది. రావణ కుంభకర్ణులను రజస్తమో గుణముల బలమధికముగ నున్నంతకాలము జీవాత్మ బంధములోనే యుండెననియు, సుగ్రీవాంజనేయాదులను జ్ఞానభక్త్యాదులు తోడ్పడగా, పరమాత్మ జీవాత్మను ప్రకృతి బంధమునుండి విమోచన చేయబోవును. ఈసందర్భములో ప్రకృతి గుణములలో రజస్తమో గుణములు బంధములో నుంచుటకే యత్నించినను, సత్వగుణము విముక్తికై పరమాత్మవైపు లాగును. కనుక, ఇట్లు వచ్చిన విభీషణుడను అహింసాదియుత సత్వగుణ సహాయముతో తుదకు రజస్తమో గుణముల నణచి, పరమాత్మ జీవాత్మను బంధవిముక్తి గల్గించి, అగ్నిపరీక్ష చేసి తన సాయుజ్యమునకు తీసుకొన్నది. ఈ అంతరర్థములోను రాక్షసుల ఆసుర ప్రకృతిని శ్రీరామాదుల దైవీ ప్రకృతి గెల్చుటలో గూడ, అంహింసాదినైతిక తత్వముకు జయముగల్గుట సూచితము.

రామాయణము ఆదికావ్యమగుటలో, వాల్మీకి ఆయావ్యక్తుల స్వరూప స్వభావములను ప్రకృతి పరిణామమును చక్కగ వివరించెను. శ్రీరాముడు ఉత్తమపురుషుడు, సీత ఆదర్శ స్త్రీ: తాను అడవికి వెళ్లు నియమము లేకున్నను, ఆదర్శపతివ్రత కనుక భర్తతో అడవిలో సకలకష్టములను సహించినది. ఇక లక్ష్మణుని భ్రాతృప్రేమకు మితిలేదు. భరతుడు రాజ్యాధికారియైనను గర్వితుడు గాకుండ, శ్రీరాముని పాదసేవకుడుగ ఆయన ప్రతినిధిగనే తనను భావించుకొని, భోగజీవితము వదలి నిగ్రహియై యుండెను. అట్లే ఆంజనేయుని రాజసేవాపరత మొదలగు పాత్రోచిత గుణములును ఆదర్శరూపములు. మానవుల తత్వముకు తగినట్లు ఆయా

♦ జీవపరమాత్మల సంబంధము భార్య భర్తల ప్రేమ సంబంధముగ ఉత్ప్రేక్షించుట సంప్రదాయసిద్ధము.

ప్రకృతి స్థితిని సమన్వయించుటయు వాల్మీకిలో గొప్పవిశేషము. ఋషుల ఆశ్రమముల శాంతజీవితము. ఆయాపర్వతాదుల గాంభీర్యము ప్రకృతిలో నిమిడియున్న విశ్వమహత్వమను సత్యస్వరూపమే శివమై సుందరముగ నుండుటయు రామాయణములో మనోహరముగ చిత్రితములు; తరువాత వచ్చిన భాసుడు, కాళిదాసు వగైరాల విశేషములు చాలవరకు వాల్మీకినుండి తీసుకొన్నవే. ఈసంగతి కథావస్తువుకే గాక ఆయావర్ణనలకు శైలికిని వర్తించును. వాల్మీకి రామాయణము మనదేశ భాషలన్నిటిలోకితర్జుమాయైనది. వీటిలో ముఖ్యమైన తులసీదాసు హిందీరామాయణము అంత్యంత భక్తిని విశ్వప్రేమను బోధించునదై, పామరులకును ఆకర్షకమైనట్లు అనేకమగు అద్భుత కథలజేర్చి వృద్ధిచేయబడి ఉత్తరదేశమందు ప్రఖ్యాతిగాంచినది. ఇట్లే బెంగాలీలో కృత్తివాసీయమును, తమిళములో కంబరామాయణము, మహారాష్ట్రల మోరోపంతు కావ్యమును, ఆయాభాషలలో ప్రధానములు, గొప్పనైతిక గ్రంథములై ఆయాప్రాంతముల ధార్మికాభివృద్ధికి తోడ్పడినవి. మన ఆంధ్రమున మాత్రము రామాయణముకన్న భారతమే ప్రసిద్ధమైనది. భాస్కరుడు, మొల్ల, రంగనాథ రామాయణం వగైరాలు నేటికిని తులసి కంబాదుల గ్రంథములకన్న ప్రఖ్యాతిరానిమాట నిజమే; కాని, ఇక్కడను శ్రీరామకథ మాత్రము ప్రజారంజకముగనే యున్నది.

## అధ్యాయము 17.

### మహాభారతము.

—♦ భగవద్గీత ♦—

ఇట్లు బౌద్ధ సంస్కృతి వ్యాపించి అహింసా ధర్మపు వాఙ్మయం పాలీ భాషలో ఉత్పత్తి యైనది. కాని, అప్పుడు సనాతన హిందువులకు, బౌద్ధజైనులకు మధ్య కక్షలు లేవు. వాఙ్మయరంగములోను ఒకదాని ప్రభావము రెండవదానిపైన కలుగుచూవచ్చినది. అందువల్ల సంస్కృతంలోను మంచి అహింసా బోధచేయు సాహిత్యమా కాలమం దేర్పడినది.

బుద్ధునికి పూర్వం జీవించి పనిచేసిన శ్రీరామ కురుపాండవాదుల అసలు చరిత్రగ్రంధములు బుద్ధునికి పూర్వమే కొంత ఉత్పన్నమైయుండును. కాని, తరువాత, ఆగ్రంధములలో కొంత పరిణామం జరిగినది. కాలానుకూలమైన కథాసందర్భమున కతుకు భావముల శ్లోకము లక్కడక్కడ చేరియుండవచ్చు. కొన్ని సవరణలు జరిగియుండెనేమో. నీతిబోధకమైన అనేక కథలును గాధలును ఈబౌద్ధయుగమందు భారత రామాయణములలో చేర్చియుందురు. రామాయణముకన్న భారతములో నీతిబోధక చరిత్రలున్ను గీతలును చాలగలవు. మొదట భారతపు పాండవ జయకథ 8800 శ్లోకములే యుండినది. దీనిని అసలు వ్యాసమహర్షి రచించెను. తరువాత భారతం సుమారు 24000 గ్రంథముగవృద్ధియైనది. దీనిని వ్యాస శిష్యుడగు వైశంపాయనముని అర్జునుని మునిమనుమడైన జనమేజయునకు బోధించెను; తరువాత కొంత కాలమునకీ గ్రంధమే ఇంకను బాగుగ పరివర్ధితమై లక్షశ్లోకముల మహాభారతముగ తేలినది. ఈయద్భుత గ్రంధమంతను నైమి

శారణ్యమను హిమాలయ పర్వతములందున్న ఒక వన్యాశ్రమములో శౌనకాది ఋషులకు సూతుడను విద్వాంసుడగు కథకుడు చెప్పెను. అని కొందరు విజ్ఞుల అభిప్రాయము. ఈ సంగతులు మహాభారతపు ఆదిపర్వమునుండియు సూచితములు. ఈ గాథల పరివర్ధనమంతయు క్రీ॥ పూ॥ 2 వ శతాబ్దినాటికి పూర్తియై అప్పటికే ఇప్పుడు మనకున్నరీతి భారతరామాయణములు స్థిరముగ వ్యాప్తికి వచ్చియుండునని కొందరు పెద్దల యూహ. కనుక సంస్కృతి దృష్టితోనే పరిశీలించునప్పుడు ఈగాథలను చర్చింపవలెను. ఇవి బుద్ధునికి తరువాత వచ్చినట్లే యోచింపదగును.

ఈ ఇతిహాస గ్రంథము వేదమువలె ప్రాచీన భాషలో నుండక అప్పుడు వాడుకలోనున్న సులభ సంస్కృతములో జ్ఞప్తిలో నుంచుకొనుట కనువైన అనుష్టుబ్ అను చిన్నశ్లోకములుగ వ్రాసిరి. ఇందు పామరులకును తెలియునట్లే నీతులు అధ్యాత్మ విషయములును చెప్పినారు. కనుక మహాభారతమును స్త్రీలు శూద్రులు గూడ వేదమునకు బదులుగ చదువవచ్చుననిరి. దానికి పంచమ వేదమని పేరువచ్చినది. ఇందలిగాథ లన్నిటిలో ముఖ్యమైనది భగవద్గీత. హిందూ మతమునకు ముఖ్యాధారమగు గ్రంథములు మూడు. 1. ఉపనిషత్తులు, 2. భగవద్గీత, 3. వేదాంతసూత్రములు. ముఖ్య మతకారులందరును వీటిమీద తమ సిద్ధాంతముల దెల్పు వ్యాఖ్యానములు వ్రాసినారు. వీటిలోను గీతయే అన్ని విధములను ప్రశస్తము, ప్రసిద్ధమును.

భగవద్గీత ఉపనిషత్తులంత విపులము వేదాంత సూత్రములంత క్లుప్తముకాక, వాటికన్న నెక్కువ సులభశైలిదై జ్ఞప్తిలో నుంచుకొనవీలగు శ్లోకరూపముగ నున్నది. భగవద్గీతకున్న వ్యాప్తి మరి యేసంస్కృత గ్రంథమునకు లేదు. దాని ప్రామాణ్యమును అట్టిదే. హిందూమతపు ధర్మసారమంతయు ఈగీతలో సంగ్రహముగ చెప్పి, వాటి పరస్పరసంబంధమును చక్కగ సూచించినాడు.

ఇది ఆధ్యాత్మికమే కాని, లౌకికమగు నిత్యజీవితములో జనుల నడవడి బాగుచేయుట కుపయోగించు భావములును చేరియున్నవి. మతత్రియ ప్రవర్తకులైన శంకర రామానుజ మధ్వులే గాక, నింబార్క వల్లభాదులును ఇటీవల సీతానాథతత్వభూషణ మున్నగువారలు దీనిపైన వేరువేరు సిద్ధాంతముల వ్యాఖ్యానములు వ్రాసినారు. మరియు, ఆనీబిసెంటు, లాలాలజపతిరాయి. అరవిందఘోషు, మొదలగు నవ్యరాజకీయ నాయకులును ఇందుపై చర్చా గ్రంథముల వ్రాసి, తమజీవితపువృత్తికీగ్రంథభావము లుపయోగించుకున్నారు. శ్రీబాల గంగాధరతిలకు, మహాత్మాగాంధి గార్లును చక్కని వ్యాఖ్యలలో చర్చ చేసియున్నారు. కనుక, పరిణామ కరమగు ఈగ్రంథమును బాగుగ పరిశీలించి, దీనికి అహింసా సిద్ధాంతముతో ఎట్టి సంబంధమున్నదో గమనింపవలెను. భగవద్గీత కథా సందర్భమునుబట్టి అది హింసాప్రబోధకమని కొందరి యూహ. కౌరవులకు పాండవులకు మధ్య రాజ్యముకై జరిగిన తగాదాలో రాజీప్రయత్నములు విఫలమై తుదకు, ఉభయపక్షములును యుద్ధసన్నద్ధులై కురుక్షేత్రపు విశాలమగు మైదానముమీద తమతమ సేనలను సిద్ధముచేసిరి. యుద్ధమారంభించు రోజున రణరంగమందు చేరియొకవైపున వారు తమ తమ వ్యూహములను తయారుచేసిరి. ఇక యుద్ధమారంభింతురనగా పాండవ సేనలో ముఖ్య వీరుడగు అర్జునుడు తన సారథియగు శ్రీకృష్ణునితో రెండుసేనలను ముందుగ పరిశీలించు నిమిత్తం తన రథమును ఆరెండుసేనల మధ్య ఖాళీస్థలముకు తోలుమనెను. శ్రీకృష్ణుడట్లు చేయగా అర్జునుడు రెండుప్రక్కలను రథముపైనుండి, ఒక్కసారిగ చూచెను. రెండుసేనలలోను తన కత్యంత బంధువులు, మిత్రులు, పూజ్యులగు గురువులు నున్నారు యుద్ధాంతంలోగా వీరిలో చాలమంది హతులౌట నిశ్చయము. వారి నందరిని చంపి రాజ్యమేలుటచే సౌఖ్యముండదు. స్వజనుల జంపుదుమను దుఃఖమావరించి, అర్జునుడాసంగతి కృష్ణునితో జెప్పి, తాను యుద్ధము చేయననెను. అంతట శ్రీకృష్ణుడు ప్రాణిస్వభావము, జీవితోద్దే

శము, మానవధర్మము, మోక్షోపాయములు ఇత్యాదుల నుపదే శించి స్వధర్మమగుయుద్ధము చేయవలసియున్నప్పుడు జంకకూడదని ప్రోత్సహించెను. ఇదే గీతోపదేశము. అంతట అర్జునుడు సందేహముతీరి, యుద్ధమున కుత్సాహముతో పూనుకొని, పాండవపక్షమున ఆమహాసమరపు నాయకుడై అద్భుతశౌర్యముతో పోగ సాగించి విజయము నొందెను * అహింసాపరుడై వెనుదీసిన అర్జునుని నిరుత్సాహమును జంకును పోగొట్టి, సాత్విక తత్వమునుండి అతనిని ఘోరరక్తపాతము గల్గించు మహాయుద్ధమునకు పురికొల్పుటకేగదా శ్రీకృష్ణుడు గీత నుపదేశించెను. అర్జునుడు చెప్పిన ఆక్షేపణలన్నిటికిని సమాధానము చెప్పి అతని సందేహముదీర్చి తస్మాద్యుధ్యస్వభారత అని ప్రోత్సహించిన బోధ హింసా ప్రబోధకమే యని చాలమంది యభిప్రాయము. కాని ఇక్కడ అర్జునుడు నిజమైన అహింసాపరుడుకాడు. హింస సంఘక్షేమమునకు హానికరమను భావముతోగాక, స్వజనమునుచంపి రాజ్యమును తీసుకొన్నను తనకు సఖముగ నుండదనీ, రాజ్యలాభమువలన పొందదలచిన వైభవలాభము బంధుమిత్రుల మరణమువల్ల అదృశ్యమగుననీ, పైగా ఉభయపక్షములలో మహావీరు లున్నందున జయము తనకు కల్గునో కల్గదో అనీ అర్జునుడప్పుడు వెనుదీసెను. ♦

---

* స్వధర్మ నిర్వహణమునకై ఎట్టి యుద్ధమైనచేసి, ఆసందర్భమున, స్వలాభమునకుగాక, దేశోపకారమునకై రక్తపాతము చేయుట తప్పుకాదని, భగవద్గీత అట్టి చర్య నుగ్గడించుననియు, బెంగాలు ప్రాంతపు కొందరు విప్లవకారులు భ్రమించి, రాజకీయ హత్యలకు యత్నించిరి. వారి యిండ్లు సోదాలు చేసినప్పుడు బాంబు సామానులతో భగవద్గీతయు అప్పుడప్పుడు దొరకుచుండెనట

♦ దృష్ట్వేమం స్వజనం కృష్ణ యుయుత్సుం సముపస్థితం
సీదంతి మమగాత్రాణిముఖంచ పరిశుష్యతి।
వేపథుశ్చశరీరేమే రోమహర్షశ్చ జాయతే।
నచశక్నోమ్యవస్థాతుం భ్రమతీవచమే మనః॥

ఆచార్యాః పితరః పుత్రాః ...... ఏతాన్నహంతు మిచ్ఛామి ఘ్నతోపి మధుసూదన। అపిత్రైలోక్యరాజ్య స్యహేతోః। కింను మహీకృతే, స్వజనంహి కథంహత్వాసుఖినః స్యామమాధవ॥ నచైత ద్విద్మః కతరన్నోగరీయో యద్వాజయేమ యదివానో జయేయుః (భ. గీ. అ. 1 శ్లో. 29, 30, 34, 37 అ 2 శ్లో. 6)

అంతవరకు అందరినీ యుద్ధముకు ప్రోత్సహించిన అర్జునునికి అహింసాతత్వము లేదు. ప్రజాక్షేమపు తలపుతో కాక స్వలాభదృష్టితో నేయుండి అతడు హఠాత్తుగ పిరికితనమునకు లోనై "చేతులు కాళ్లు వణుకుచున్నవి, నేను బంధు మిత్రులపైన యుద్ధము చేయలేను" అనెను. ధర్మరాజీ యుద్ధముకు ముందు భీమార్జునులతో ఆలోచించగా దుర్యోధనుడు రాజ్యములో తమకు న్యాయమైన భాగమేమీ యివ్వదలచుకోలేదు కనుక తప్పక యుద్ధము చేయవలసినదని అర్జునుడు ధర్మజుని తొందరచేసెను. ఆ నమ్మికమీద ఎందరో రాజులు వచ్చి తమ సేనలతో సహా యుద్ధప్రియత్నముతో నుండిరి. ఉభయసేనలు రాజులు అట్టి ప్రవృత్తిలోనుండి పాండవసేన తన నాయకత్వములో నున్నపుడు హఠాత్తుగ తాను యుద్ధముచేయననుట పిరికితనమే యగును; ఆస్థితిలో హఠాత్తుగ అహింసాపద్ధతి నవలంబించి ఎల్లైన తమ సేనను చంపదలచిన కౌరవసేనను నిల్పు చేయుటసాధ్యమునుకాదు, అప్పుడు తాను పోరకుండుట పాండవ సేన సంపూర్ణ వినాశముకు కారణమగును. (అప్పు డర్జునుడు తాను యుద్ధము చేయలేననియే చెప్పెను. కాని ప్రజాక్షేమము నిమిత్తం ఉభయసేనలుగాని లేక ధర్మరాజును ఆయన పక్షమునుగాని యుద్ధము నిల్పివేయనగునని సూచించనేలేదు.) అప్పటికి ఉభయపక్ష సైనికులును నాయకులును ఇట్టి అధికారాది విషయములందు హింసాతత్వముతోనే యుండిరి. అహింసాతత్వము ఒక్కసారిగ కాక, క్రమముగ హృదయ మనఃపరిణామమువల్లనే కలుగవలెను. * అర్జునుడు నిజమైన అహింసాతత్వమునే కాక స్వార్థయుతమైన జంకు వల్లనే అట్లుచెప్పెను. కనుకనే శ్రీకృష్ణుడు "అట్టి పిరికితనముమాని

* ఇప్పటి చీనా యుద్ధము రెండేండ్లక్రిందట ఆరంభించినప్పుడు ఈస్థితిలో చీనులు హఠాత్తుగ జపానీయుల ఆయుధములతో ఎదుర్చుట మాని అహింసా సత్యాగ్రహము జరిగించుట సాధ్యముకాదని మహాత్మాగాంధీగారు చెప్పినారు.

లెమ్మ అర్జునా!" అని ముందుగ హెచ్చరించెను. † కనుక శ్రీకృష్ణుడు అహింస వద్దనికాక అట్టితత్వమును అందుకుతగినత్యాగాదులును లేనివారు అహింసాతత్వమునకు తగరనిమాత్రము సూచించెనని భావింపవచ్చునేమో. "రక్తపుకూడుతో భోగము లనుభవింతుమా" * అని అర్జునుడు పెద్దమాటలే చెప్పినను అది భ్రమయుతమే కనుక నీవు పెద్ద కబుర్లుచెప్పుచున్నావు. జీవితపు తత్వము కనిపెట్టకున్నావు ♦ అని శ్రీకృష్ణుడు చెప్పెను. కొంత తత్వోపదేశము జరిగినమీదట అర్జునునికి శ్రీకృష్ణుడు అప్పటిలోకపు పరిస్థితిని విశ్వరూప సందర్శనముద్వారా చూపించెను. అప్పుడు ఉభయపక్ష సైనికులు వీరావేశముతో విశ్వరూపుని మహాదంష్ట్రలలోనికి చొచ్చుచు వినాశముకు సిద్ధమగుచుండిరని అర్జునుడు గమనించెను. + "నీవిప్పుడు పోరకున్నను వీరందరు నెట్టును పోరి మరణించనైయున్నారు. అట్టి స్థితిలో నీవు పోరుమానుట లోకముకు లాభకరముకాదు. నీవు నిమిత్తమాత్రమే" § అని శ్రీకృష్ణుడు సూచించెను. ప్రపంచపు క్రమపరిణామములో కురుపాండవుల కాలముకు అహింస ప్రశస్తమను భావమేర్పడినను స్వార్థముకుగాక లోక క్షేమముకై తప్పనిసరియైనప్పుడు అవసరమగు యుద్ధము చేయవచ్చునని ధీమంతులెంచిరి. అందునుబట్టి

---

† క్షుద్రంహృదయ దౌర్బల్యంత్యక్త్వోత్తిష్ఠ పరంతప భ. గీ. 2

* భుంజీయభోగాన్ రుధిర ప్రదిగ్ధాన్ భ. గీ. 2—5

♦ అశోచ్యానన్వశోచస్త్వం ప్రజ్ఞావాదాంశ్చభాషసే భ. గీ. 2—11

+ అమీచత్వాం ధృతరాష్ట్ర స్యపుత్రాః సర్వేః సహైవావనీపాల సంఘైః, భీష్మద్రోణ సూత పుత్రస్తథాసౌ సహాః స్మదీయైరపియోధముఖ్యైః.
భ. గీ. 11—26

వక్త్రాణితేత్వరమాణా విశంతి దంష్ట్రాకరాళాని భయానకాని. (భ.గీ. 11-27)

§ ఋతేపిత్వానభవిష్యంతి సర్వే......నిమిత్తమాత్రం భవసవ్యసాచిన్.
(భ. గీ. 11—32, 33)

ఇక్కడ ధర్మపక్షముకు అధర్మపక్షముకు మధ్య సంఘర్షణమేర్పడి నందున స్వజనులను కారణముచే జంకక న్యాయపక్షము నిర్వహించుటకై అర్జునుడు యుద్ధము చేయవలసియుండెను. * ఇక భగవద్గీతలో చెప్పిన ఆయా సిద్ధాంతములనుబట్టి మన సమస్యకు జవాబును గ్రహించవలెను. రెండవ అధ్యాయములో నరుడు స్థితప్రజ్ఞుడు కావలెనని చెప్పినారు. స్థితప్రజ్ఞుడనగా నిగ్రహముగల్గి సుఖ దుఃఖములచే నుద్రేకము నొందక నిర్భయుడై రాగ క్రోధములు వదలినవాడు. + అట్టివాడు అహంకారి కాడు. సాధారణంగా అహంకారియే హింస చేయును. అహంకృతియు బుద్ధిచలనమును లేకుండ విధి నిర్వహణలో రక్తపాతము చేయవలసివచ్చినను అది హింసయు బంధకము కాదు. * అట్టి సమత్వబుద్ధితో సుఖదుఃఖముల భరించువాడే యోగియై తరించును. అనగా యుక్తకర్మ చేయుచు ఇతరులను తనవలె చూచుకోవలెను. § ఋషులు ఉపనిషత్తులలో చెప్పినట్లే ఈసమత్వమును కారణము జెప్పినారు.

---

* ప్రపంచపు క్రమపరిణామమును మన దశావతారముల వరుస సూచించును. సృష్టి మొదట మత్స్యాదులనుండి క్రమముగ అర్ధ నరరూపమగు నరసింహరూపమై...కృష్ణుని యవతారమైన మీదటనే పూర్తియైన అహింసా రూపమగు బుద్ధావతారము వచ్చినది. అప్పటికి మనఃపరిణామము పూర్తియైనది.

+ దుఃఖేష్వనుద్విగ్నమనాః సుఖేషు విగతస్పృహః.
వీతరాగభయక్రోధః తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా॥
...... వశేహియస్యేంద్రియాణి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా.
భ. గీ. 2-56, 61.

* యస్యనాహంకృతో భావో బుద్ధిర్యస్య నలిప్యతే హత్వాపి సఇమాన్ లోకాన్ నహన్తి ననిబధ్యతే.
భ. గీ. 18, 18

§ సమత్వం యోగ ఉచ్యతే. భ. గీ. 2-48

యోగః కర్మ సుకౌశలం. ఆత్మౌపమ్యేన సర్వత్రసమంపశ్యతియోఽర్జున.
సుఖంవాయదివా దుఃఖం సయోగీ పరమోమతః. భ. గీ. 6—32.

ఈశ్వరుడు సర్వభూతముల హృదయములో నున్నాడు. ఆజీవులన్నిటిలో తన ఆత్మయు, తనలో ఆజీవులును ఉన్నట్లుభావించి అందరియందు సమభావముగల్గి వృత్తి కులభేదము లేకుండ విద్వాంసుడగు బ్రాహ్మణుని శ్వపచునిగూడ సమదృష్టితోనే ఆదరించవలెను. * ఇట్టి అహింసాసిద్ధాంతముకు ఆధ్యాత్మికత ఆధారము. ఇక కర్మయోగ సందర్భము గమనింతము. గీతలో జ్ఞానము చాల అవసరమని చెప్పిరి; జ్ఞానయుక్తుడై కర్మ చేయవలసినదనియు బోధించినారు. కర్మ బంధకము గనుక అత్యవసర మైనంతవరకే నిత్యకర్మలజేసి, అంతట వాటినిగూడ త్యజించవలెను. కామ్యకర్మ లన లేకూడదు. నిష్కర్మలగుట ముఖ్యము. జ్ఞానులై సన్యసించుటే ధీమంతుల కాదర్శమని అద్వైతుల అభిప్రాయము. ‡ కాని శంకరుల ఈభావములను అద్వైతులే అగు శ్రీబాల గంగాధర తిలకుగారు విపులముగ చర్చించి ఖండించినారు. కర్మల ననలే వదలుటచే ప్రేమసిద్ధాంతముకు పరోపకార చర్యలకు అవకాశము పోవును. జనులలో భిక్షాటనమును సోమరితనమును పెరుగును. ఇప్పుడట్టిహాని మనసంఘమునకు కలిగియున్నది. ఈవిషయంలో శ్రీ తిలకుగారి భావమే శ్రీకృష్ణుని యభిప్రాయమును సరిగ తెలుపునని తోచును. గీతలో చాలచోట్ల కర్మ

---

* ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశేర్జున తిష్ఠతి......

సర్వభూతస్థ మాత్మానం సర్వభూతాని చాత్మని

ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః (6—29)

విద్యావినయ సంపన్నే బ్రాహ్మణే గవిహస్తిని

శునిచైవశ్వపాకేచ పండితా స్సమదర్శినః ( ,, 5—18 )

‡ నహిజ్ఞానేన సదృశం పవిత్ర మిహవిద్యతే గీ. 4—38

సర్వంజ్ఞాన ప్లవేనైవ వృజినం సంతరిష్యతి 4—36

యోగసన్యస్త కర్మాణం జ్ఞానసంఛిన్న సంశయం

ఆత్మవంతం నకర్మాణి నిబధ్నంతి ధనంజయ 4—41

ఇట్టి శ్లోకములనుబట్టి జ్ఞానమే మోక్షసాధకమని శంకరాచార్యులు భావించినారు.

యవసరమే. పూర్వులునుచేసిరి; ఫలాశలేకుండ కర్మచేయుట కధికారమున్నది. కర్మవద్దను వారును యేదో కర్మచేయుట తప్పదు. సన్యాసము జ్ఞానయోగముకన్న కర్మచేయుటే ప్రశస్తముఅని స్పష్టపరచియున్నారు. ♦

ఇట్లు గీతలో కర్మకావలసినదే అన్నారు. కాని కర్మ నిష్కామముగనే చేయవలెనని స్పష్టపరచినారు * అనగా ఫలాసక్తి లేకుండనే తృప్తుడై కర్మచేయదగును. అయితే ఫలాపేక్షలేకుండ కర్మజేయుట అనగా నేమి? ఎట్టిఫలము నుద్దేశించకనే కర్మచేయుట గాదు. అట్టి నిరుద్దేశమగు కర్మ ప్రవృత్తియుండదు. ఇక్కడ ఫలాసక్తి లేకుండుట అనగా నిష్ఫలమైన కర్మచేయుమని కాదు. అట్టి నిష్ఫలకర్మ చేయకూడదని స్మృతిలోనే నిషేధించినారు § కనుక నిష్కామకర్మ అనగా స్వలాభముకు కాక లోకక్షేమము కొరకే అందుకు తగిన కర్మలజేయుట. సంఘమంతటికి లోకముకును అభివృద్ధిని భగవంతు డుద్దేశించినాడు. అది ఈశ్వరునికి ప్రీతి

♦ ఏవంజ్ఞాత్వాకృతం కర్మపూర్వైరపి ముముక్షుభిః
కురుకర్మైవతస్మాత్త్వం పూర్వైః పూర్వతరం కృతం 4—15
నియతంకురు కర్మత్వం కర్మజ్యాయోహ్యకర్మణః 3—8
కర్మణ్యేవాధికారస్తే మాఫలేషు కదాచన
మాకర్మఫలహేతుర్భూర్మాతేసంగోస్త్వకర్మణి
నహికశ్చిత్క్షణమపిజాతు తిష్ఠత్యకర్మకృత్
కార్యతేహ్యవశః కర్మ సర్వః ప్రకృతిజైర్గుణైః 3—5
తయోస్తుకర్మసన్యాసాత్ కర్మయోగోవిశిష్యతే 5—2
కర్మణైవహిసంసిద్ధిమాస్థితా జనకాదయః
లోకసంగ్రహమేవాపి సంపశ్యన్ కర్తుమర్హసి 3—20

* త్యక్త్వా కర్మఫలాసంగం నిత్యతృప్తోనిరాశ్రయః
కర్మణ్యభిప్రవృత్తోపి నైవకించిత్కరోతిసః (4—20)
తస్మాదసక్తః సతతం కార్యంకర్మ సమాచర
అసక్తోహ్యాచరన్ కర్మ పరమాప్నోతి పూరుషః (3—19)

§ నకర్మ నిష్ఫలం కుర్యాన్నాయత్యాను సుఖోదయః (మనుస్మృతి 4-78)

యోగస్థః కురుకర్మాణి సంగత్యక్త్వా ధనంజయ (భ-గీ 2—48)

కరము. అట్టి ఈశ్వరప్రీతికే కర్మచేయుమని విధించినారు. వైదిక సంకల్పములోను ఈశ్వరప్రీతి నిచ్చుటకే కర్మచేయునట్లు చెప్పె దురు. భగవంతుడు విశ్వరూపుడని గీతలో (11 వ అధ్యాయం) చెప్పియేయున్నారు. అట్టి యీశ్వరునే మనస్సునందుంచుకొని విశ్వ రూపుని పూజగ, యుక్తమైన కర్మల జేయవలెను.+ లోక సంగ్రహం నిమిత్తమే కర్మజేయవలె ననుటలోను యిదే భావము‡ అనగా లోకపుక్షేమం నిమిత్తం రక్షణోపయోగములకు వీలైన కర్మనే చేయవలెనని తాత్పర్యం. ఈశ్వరు నాశ్రయించి, ఆయన బోధ నను హృదయంలోనుండి గ్రహించి సర్వకర్మలను చేసేయెడల లోక హితమైన కర్మలే చేయగలరు *

ఏది యుక్తము, చేయదగినదియో తెలియుటకు అంతరాత్మ ముఖ్యాధారము. పరిశుద్ధంగా హృదయముంచుకొనేవారికి అంత రాత్మ బోధన వినపడును; అంతరాత్మకు కష్టముగతోచు కర్మలను మానవలెనని మనుస్మృతిలోను చెప్పియున్నారు. × ఇట్టి లోక కల్యాణకరమైన కర్మ చేయువారు యోగమునుండి తప్పుట సంభ వించినను ప్రమాదముండదన్నారు. § ఇట్లు తప్పుటకు కామ క్రోధములకు లోనగుటే కారణం. హింసాజనకమగుటచే క్రోధం మానవలెను. ‡ మానవ ప్రవృత్తిలో రెండురకములుండునని భగవద్గీతలో చెప్పి ఈరెంటి స్వభావమును వివరంగా చర్చించారు.

---

+ మన్మనాభవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు
మామేవైష్యసి కౌంతేయ సదామద్భావ భావితః భ-గీ 18—65

‡ లోకసంగ్రహమేవాపి సంపశ్యన్ కర్తుమర్హసి (3—20)

* సర్వకర్మాణ్యపి సదాకుర్వాణో మద్వ్యపాశ్రయః
మత్ప్రసాదాదవాప్నోతి శాశ్వతం పదమవ్యయం (18—56)

× యత్కర్మకుర్వతోస్యస్యాత్ పరితోషాంతరాత్మనః
తత్ప్రయత్నేన కుర్వీత విపరీతం పరిత్యజేత్
మనుస్మృతి (4-161)

§ నహికల్యాణ కృత్కశ్చిద్దుర్గతిం తాతగచ్ఛతి. గీ 6-40.

‡ కామఏష క్రోధఏష......వైరిణం ( ,, 3-37)

1. దైవీప్రకృతి, 2. ఆసురీప్రకృతి. వీటిలో ఆసురి ప్రకృతివారు హింసాత్మకులై, లోక క్షయమునకు సిద్ధపడుచు, తమ కామ భోగాలే ముఖ్యమని యెంచి ప్రళయాంతకమైన విపరీతాలోచన జేయుదురట. వారు తామే జగత్తుకీశ్వరులమనీ, తమతో సమానులు అధికులు లేరనీ, * సత్యమర్యాదల పాటించనక్కర లేదనీ, ఎంచుదురు. వారు తక్కినవారి నణచివేయుచు వారిని బాధించుచుందురట. ఈవివరం ఈకాలపు హింసాత్మకులైన వ్యక్తులకు వర్తించును. ఇది లౌకికంగాను, ఈనాటి సామ్రాజ్య తత్వము "ఫాసిస్టు" తత్వము కలవారికిని అన్వయించునని తోచును.

ఇక దైవీ ప్రకృతి అహింసా సత్యశాంతులు, జ్ఞానము, భూతదయ, మృదుత్వం, పరిశుభ్రత గలవారిది. ఐతే దైవీప్రకృతికి అభయం, సత్వసంశుద్ధి మొదటి గుణములుగ చెప్పినారు. ♦ కనుక అహింసాతత్వము ధైర్యమూ బలమూ కలవారికే బాగుగ నుండగలదని సూచనయగుచున్నది.

"దైవీసంపత్తే మోక్షసాధనం, ఆసురీసంపత్తు బంధకరమే" అని గీతాకారులు చెప్పినారు. ఈసంపత్తులు ఆధ్యాత్మికమేకాక

---

* దంభోదర్పోఽభిమానశ్చ క్రోధః పారుష్యమేవచ
అజ్ఞానం చాభిజాతస్యపార్థసంపద మాసురీం॥
అసత్య మప్రతిష్ఠంతే జగదాహురనీశ్వరం......
ప్రభవం త్యుగ్రకర్మాణః క్షయాయ జగతేహితాః
చింతా మపరి మేయాంచప్రలయాంతాము పాశ్రితాః .....
ఆశాపాశశతైర్బద్ధాః కామక్రోధ పరాయణాః......
ఈశ్వరోహమహం భోగీ సిద్ధోహం బలవాన్ సుఖీ
......కోఽన్యో, స్తి సదృశోమయా, అహంకారం......
మామాత్మ పరదేహేషు ప్రద్విషంతోభ్యసూయకాః-
తానహంద్విషతః...... ఆసురీష్వేవయోనిషు-
భ- గీ- 16-8,9,11,12,14,15,18,19

రాజకీయాలకును వర్తించునట్లే వివరించినారు ♦ కనుక అహింసా దులే రాజకీయమోక్షము అనగా స్వాతంత్ర్యసిద్ధికిని వర్తించునని సూచన.

కామక్రోధములు వదలి నిగ్రహముగల్గి యుండవలెనని గీతలోను తక్కిన ధార్మికగ్రంథాలలోను చెప్పిరి. త్యాగతపస్సులు కావలెననిరి కాని, ఆపేరిట, ఆహారవిహారములు క్షీణింపజేసి శరీరాదులు కృశింపజేయుట ఆసురకృత్యమే అని స్పష్టము * శరీరక్షీణతవల్ల లోనున్న అంతరాత్మకును బాధకల్గును.

దైవీసంపత్తున కాధారములన్న అహింసా సత్వగుణముల కాహారనియమ మవసరమనికూడ గీతలో చెప్పినారు. అత్యశనము అనశనముకూడదు. ఆహారనిద్రాదులు చర్యలూ యుక్తముగ నున్నపుడే మంచియోగికాగలడు. ‡ అహింసాసత్వగుణము లభివృద్ధిచేయుట కాహారనియమము కావలెనని, అట్టి సాత్వికాహార మెట్లుండవలెనో వివరించినారు.

---

♦ అభయం సత్వసంశుద్ధి ర్జ్ఞానయోగవ్యవస్థితిః
దానందమశ్చయజ్ఞశ్చ స్వాధ్యాయ స్తప ఆర్జవం
అహింసా సత్యమక్రోధ స్త్యాగశ్శాంతిర పైశునం
దయాభూతేష్వలోలత్వం మార్దవంహ్రీ రచాపలం
తేజః క్షమాధృతి శ్శౌచం మద్రోహోనాతి మానితా
భవంతి సంపదం దైవీమభిజాతస్య భారత (భ-గీ 16—1, 2,3)

* అశాస్త్రవిహితం ఘోరం తప్యంతేయే తపోధనాః......
కర్శయంతః శరీరస్థంభూత గ్రామమచేతసః. మాంచై
వాంతశరీరస్థం తాన్ విద్ధ్యాసురనిశ్చయాన్ (భగీ 17-5-6)

‡ నాత్యశ్నతస్తుయోగోస్తి నచైకాంత మనశ్నతః।
నచాతి స్వప్నశీలస్య జాగ్రతో నైవచార్జున।
యుక్తాహార విహారస్య యుక్త చేష్టస్యకర్మసు.
యుక్తస్వప్నావబోధస్య యోగోభవతి దుఃఖహా (భ. గీ. 6-16-17)

♦ రస్యములు స్నిగ్ధములు హృదయ రంజకములును బలకర ములును సాత్వికములు. ఇందుకు వ్యతిరేకములు రాజసములు, తామసములు. చేదు, పులుపు, ఉప్పు, కారములు ఎక్కువగ నుండునవి అత్యుష్ణములు ఘాటై తీక్ష్ణమైనవి." రాజసములు". నిలవయున్నవి. యెండిపోయినవి, మత్తత గల్గించునవి, తిన వీలు లేనివి తామసములు.

నల్లమందు మద్యమాంసములు (కొన్నినిలువ ఊరుగాయలు గూడ) తామసాహారములందురు. శరీరముకు మనస్సుకు హృదయముకు సన్నిహితసంబంధమున్నది; కనుక కారము పులుపు వగైరాలు హెచ్చినప్పుడు శరీరంలో మంట, బాధ, అనారోగ్యము కల్గి, దృఢముగా ఓపికతో పనిచేయు శక్తిక్షీణించును. మరియు అందువల్ల మనస్సులోను నాడులలోను ఉద్రేకమేర్పడి, పరస్పర కలహము, అవిశ్వాసాదులును క్రోధభావమును గల్గును. అవి హింసాస్వభావ వర్ధకములు కనుకనే ఋషులు సాత్వికాహారముం గ్రహింతురు. *

---

♦ ఆయుః సత్వబలారోగ్య సుఖప్రీతి వివర్ధనాః
రస్యాః స్నిగ్ధా స్థిరాహృద్యా ఆహారాః సాత్వికప్రియాః
కట్వామ్ల లవణాత్యుష్ణ తీక్ష్ణ రూక్ష విదాహినః
అహారా రాజసస్యేష్టా దుఃఖ శోకామయ ప్రదాః.
యాతయామంగతరసంపూతి పర్యుషితంచయత్
ఉచ్ఛిష్టమపిచామేధ్యం భోజనం తామసప్రియం

శరీరపోషణ కవసరమైన ఉప్పు పులుసు వగైరాలు చాలవరకు కూరగాయల లోను ఫలములలోను సహజముగ చేరియుండును. అయితే ఉడకబెట్టి వార్చి వేయుటలో చప్పబడి నిస్సారమై రుచిహీనమగుచున్నది.

* ప్రస్తుతం మనఆహారం చాలవరకు రాజసముగనున్నది. అందుచేతనే పరస్పరవిభేదములు, కలతలు, సంఘర్షములు సాంఘిక వ్యాపారములందును హెచ్చినవి. సహకారము ఐకమత్యము చాలతక్కువయైనవి. రాజకీయముగను కక్షలు సంఘర్షము చెలరేగుచున్నవి. ఇందుకు కొంతవరకు ఆహారముద్రేకముగ నుండుట కారణముకావచ్చును, కనుక అహింసావ్యాప్తికిని మనలో ఆహారసంస్కరణయా ఆవసరమని తోచును.

తపస్సు స్వభావపద్ధతులును దానిని చేయుట కుండదగు ఉద్దేశఫలములును గూడ గీతాకారులు ప్రత్యేకంగా చర్చించినారు. ఈసందర్భంలోను గీతలో అహింస అవసరమని సూచించినారు. స్వభావమును బట్టి శరీరవాఙ్మనస్సులలో ప్రతిదాని ద్వారాను తపస్సు జరుగవచ్చు. ఇందు శరీరతపస్సు అనగా దైవభక్తి, పూజ, హింసచేయక ప్రేమతోనుండుట, పరిశుభ్రత, ఋజుత్వము, బ్రహ్మచర్యమున చరించుట, సత్యము ప్రియమునైన మాటలాడుట ధార్మికవిజ్ఞానము నెల్ల నేర్చుట, వాగ్రూపమైనతపస్సు, నిగ్రహము, మౌనము, సౌమ్యతభావశుద్ధియు మనస్సుకు చేరిన తపస్సులు.♦

ఇక ఉద్దేశఫలము. తన లాభముకాక శాస్త్రవిహిత పద్ధతిని శ్రద్ధతో చేయు తపస్సును, దానమును, యజ్ఞములును సాత్త్వికములు. డంబముకును, తాను గౌరవ లాభము లొందుటకును చేయునవి రాజసములనిపించుకొనును. మూఢ భావముతోను, ఇతరులను బాధించి హింసించుటకును చేయుతపస్సు, అశ్రద్ధతో అన్నదానము లేని యజ్ఞమును అపాత్రులకు సత్కృతి లేకుండ జేయు దానములును తామసములు* గీతలో సన్యాసము, త్యాగము

♦ దేవద్విజగురుప్రాజ్ఞ పూజనం శౌచమార్జవం।
బ్రహ్మచర్యమహింసాచ శారీరంతప ఉచ్యతే॥
అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియహితం చ యత్
స్వాధ్యాయాభ్యసనం చైవ వాఙ్మయం తపఉచ్యతే॥
మనఃప్రసాదః సౌమ్యత్వం మౌన మాత్మవినిగ్రహః
భావసంశుద్ధి రిత్యేత్తపో మానసముచ్యతే॥ భ గీ. 17-14, 15; 16 )

* యజ్ఞములు: అఫలాపేక్షిభిః......శ్రద్ధావిరహితం యజ్ఞం
తామసం పరిచక్షతే. (గీ, 17-11, 12, 13)
తపస్సు :— శ్రద్ధయాపరయాతప్తం...పరస్యో
త్సాదనార్థంవా తత్తామస ముదాహృతం.
17-17, 18, 19
దాతవ్యమితి......అసత్కృతమవజ్ఞాతం తత్తామసముదాహృతం
(భ- గీ- 17—20; 21, 22)

వివరించు లోకోపకారియగు కర్మలను వారునూ వదలకూడదు. స్వలాభప్రాప్తికి జేయు కామ్యకర్మలనే మానవలెను. కాని విధించినారు.

కనుక సన్యాసులమని నిష్క్రియులై యుండుట గీతోద్దేశము కాదు. ఇట్లే జ్ఞానయోగములోను సర్వభూతములు ఒకటేరీతి వను జ్ఞానముండుటే సాత్వికజ్ఞానము; తత్వార్థములకు భిన్నమై అల్పమైనది తామసమే. ఇట్లు జ్ఞాన త్యాగసన్యాసములలోను ప్రేమ చర్యయు అహింసయు ప్రధానమని సూచించినారు♦ క్షయము హింసగల్గు చర్యలు చేయువారు తామసులు‡ అహింసాచర్య మొదట కష్టమై తుదకు సౌఖ్యకరమగును. అట్టిదే స్వాతికసుఖము *

జాతులలోను అహింసా సత్యాది వ్రతము లవలంబించు బ్రాహ్మణులు గౌరవింపబడుటకు వారి స్వభావ ప్రవృత్తి శాంతియుతమగుటే కారణము.§

---

♦ కామ్యానాం కర్మణాం న్యాసం సన్యాసం కవయోవిదుః
సర్వకర్మ ఫలత్యాగం ప్రాహుస్త్యాగం మనీషిణః।
యజ్ఞదానతపః కర్మనత్యాజ్య మితిచాపరే
నియతస్యతు సన్యాసః కర్మణోనోపపద్యతే (18 అ- 27 శ్లో )
సర్వభూతేషు యేనైకం భావమవ్యయమీక్షతే
అవిభక్తం విభక్తేషు తద్జ్ఞానం విద్ధిసాత్వికం ( ,, 18-20 )
యత్తు కృత్స్న ...... అతత్వార్థవ దల్పంచ తత్తామస ముదాహృతం
(18 అ- 22 శ్లో )

‡ అనుబంధం క్షయం హింసామనపేక్ష్యచపౌరుషం

* యత్తదగ్రే విషమివ పరిణామే మృతోపమం
తత్సుఖం సాత్వికం ప్రోక్తంఆత్మబుద్ధి ప్రసాదజం (18—37)

§ శమోదమ స్తపఃశౌచంక్షాంత రార్జవ మేవచ- జ్ఞానం విజ్ఞానమాస్తిక్యం బ్రహ్మం కర్మస్వభావజం ( ,, 18—42)

యజ్ఞసందర్భములోను జీవహింసవల్లను సార్థముకు కాక; లోకోపకారకమగు కర్మ చేయుటే జ్ఞానదానమే నిజమైన యజ్ఞమన్నారు. అట్టి యజ్ఞార్థమే కర్మచేయుట ప్రశస్తమని చెప్పిరి. అందును ద్రవ్యయజ్ఞమే అధికము. * జ్ఞానములోను అహింస కావలెను § అట్లు జ్ఞానకర్మయోగములు రెంటిలోను అహింస ప్రధానమని యెంచిన సంగతి చూచియున్నాము. ఈ రెండుగాక భక్తియోగమును మోక్షసాధనమని గీతలో చెప్పియున్నారు.

భగవంతుడు ప్రేమమయుడు, జగత్పిత. భగవద్భక్తి పూర్తిగ నుండుటకు, నరులు పరిశుద్ధహృదయులై, ఈశ్వరుని పిల్లలగు జీవులయందు మైత్రి గలిగియుండవలెను. అప్పుడే నిజమైన భక్తి నిల్చును. దేవుడు నరులందరి హృదయములో నున్నట్లు చెప్పినారు. కనుక నరులకు జేయు హింస దేవుని కిష్టముకాదు. భ క్తి స రి యై న మా ర్గ ము న వృ ద్ధి య గు ట అహింసా వ్యాప్తికిని సహాయకరమగును. ఈశ్వరునియందు భక్తితో మనస్సునుంచితే ఏది ధర్మమో ఏది కాదో తెలియక సందేహము కలిగినప్పుడు, భగవంతుడే తోపించగలడు. అదే అంతరాత్మ బోధనయనియు అందురు. ♦

కనుక అట్టి సందిగ్ధస్థితి కల్గినప్పుడు తక్కిన అన్ని ధర్మముల మాని భగవంతునే శరణుజొచ్చినయెడల భగవంతుడే అన్ని చిక్కులనుండి పాపములనుండి మనకు మోక్షము (విడుదలను)

---

* గతసంగస్య ముక్తస్య జ్ఞానావస్థితచేతసః యజ్ఞాయా
చరతః కర్మసమగ్రం ప్రవిలీయతే- ( ,, 4—23)

§ ద్రవ్యయజ్ఞాస్తపోయజ్ఞాజ్ఞానయజ్ఞాస్తథాపరే......
సంశితవ్రతాః ( ,, 4—38) శ్రేయాన్ ద్రవ్యమయా ద్యజ్ఞాత్ జ్ఞానయజ్ఞఃపరంతప ( ,, 4-33 ) అమానిత్వ మదంభిత్వం అహింసాక్షాంతి రార్జవం.. ఏతద్జ్ఞానమితిప్రోక్తం ( ,, 13-7,12)

♦ మహాత్మాగాంధిగారు దీనినే ఒకప్పుడు Inner voice అనుచుందురు. ఆయన ఉపవాసాదులలో ఈశ్వరధ్యానము ప్రార్థన నిరంతరం చేయుటకలదు.

గల్గించునని గీతలోను తుదిని చెప్పి, సారము చివరకు తేల్చినారు. ♦
ఇట్లు భగవద్గీత జ్ఞాన కర్మభక్తియోగములు మూడును అహింస
పైన ఆధారపడినట్లు తేల్చి అహింసకు విశేషప్రాముఖ్య మిచ్చినారు.

---

♦ సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ
అహంత్వా సర్వపాపేభ్యో మోక్ష యిష్యామిమాశుచః॥
ఇదే శ్రీకృష్ణుని చరమోపదేశ మంటురు ( ,, 18—66)

## అధ్యాయము 18.

### —♦ మహాభారతగాథలు ♦—

ఆదిపర్వములో డుండుభోపాఖ్యానమను కథ కలదు. "రురు" అను సద్బ్రాహ్మణుడొకనాడొక డుండుభము (=బురద పాము) ను చంపబోయెను. "నరుల జంపు విషసర్పముల గొట్ట వచ్చుగాని కప్పలదిని బ్రతుకుచు నరుల జోలికిరాని బురదపామును చంపదగునా?" అని ఆ డుండుభము మనుష్యవాక్కుతో జెప్పెనట. రురువు తెల్లబోయి "నీవెవరవు?" అని యడిగెను. అపుడది "నేను మొదట సహస్రపాదుడను సద్బ్రాహ్మణుడను; ఒకనాడడవిలో నామిత్రుడగు నొక విప్రుని (తపస్సులో నుండగా) కూయపామును పైన వేసి జడిపించినాను; అతడు మూర్ఛితుడై ఎట్లో లేచి, నను డుండుభమగునట్లు శపించెను. నమనామముగల నీదర్శనము కాగానే

విముక్తి యగునసెను. అని మరల బ్రాహ్మణుడై, అహింసాధర్మ ముత్తమము, బ్రాహ్మణుల కావశ్యకమునని చక్కగ బోధించెను.*

---

* అహింసా పరమో ధర్మః సర్వప్రాణ భృతాం వర తస్మాత్ప్రాణ భృతస్సర్వాన్ నహింస్యాత్ బ్రాహ్మణః క్వచిత్|| అహింసా సత్యవచనం క్షమా చేతివి నిశ్చితం | బ్రాహ్మణస్య పరో ధర్మః వేదానాం ధారిణోపిచ|| (మ. భా. ఆదిపర్వ 11 వ అధ్యాయం శ్లో|| 13—16) క్షత్రియులవలె యుద్ధాది బాధ్యతలేని బ్రాహ్మణులకు అహింస ముఖ్యమని, సంఘమంతకు వారు ఆదర్శముగ నుండవలెనని యిందుల భావము. కోరిన వరమిత్తును అని రాజు చెప్పెను. ద్రవ్యము వగయిరాల గోరుటకు బదులు ఆస్తీకుడు "ఈనాగయజ్ఞ మింతటితో నిల్చిపోవలెను" అని కోరెను. ఆకోరికమాని మరొకదానిని కోరమన్నను ఆస్తీకుడు చలింపలేదు. తన మంత్రబలముతో తక్షకుని యజ్ఞగుండమునుండి బావలనిచ్చెను. ఆస్తీకుని వంటి యుత్తముని కిచ్చిన వరము చెల్లింపక తప్పదని అందరు సభ్యులు నాయజ్ఞ మాపుచేయించిరి. ఇట్లు దుర్మరణమునుండి రక్షితులైన తక్షకాది నాగులందరును ఆస్తీకుని శ్లాఘించి, "నీకోరికలు మాకు తెల్పుము, నీమాటప్రకారం జరుపుదుము" అనిరి. "మీరిక నరులను వ్యర్థముగా హింసింపకూడదు" అని కోరెను. అందుకు నాగులందరు నొడంబడిరి. అప్పటినుండి నాగులకును ఆర్యులకును మధ్యను అహింస యేర్పడి హింసకు ప్రతిహింస కలుగును కదా; ఇది యింతటిలో నిలువలేదు. అతని కొడుకు జనమేజయుడు నాగుల జంపుటకు సర్పయాగము చేసెను. అప్పుడు చాలమంది నాగు లక్కడికి దేబడి చంపబడిరి. పితృహతకుడగు తక్షకు నెట్లైన చంపవలెనని రాజు నిశ్చయించెను. తక్షకుని ఇంద్రుడుకూడ రక్షింపలేక పోయెను. ఇక అగ్నిగుండమువద్దకు తక్షకుని చేర్చుచుండగా, వాసుకి మేనల్లుడగు ఆస్తీకు డాసభకువచ్చి జనమేజయుని చక్కగాస్తుతించెను. ఆయన పాండిత్యముకు యోగ్యతకు ఆర్యసభ్యులందరు మెచ్చుకొనిరి. ఆస్తీకుడుమహర్షి అప్పుడు నీవు నది (సర్పములోను తమకు ప్రాణభయము గల్గినపుడె నరుల హింసించును) యీకథలో ఆస్తీకుని ప్రేమగుణము, పరస్పర మైత్రియు చక్కగ గనబడును. చక్రవర్తి వరమునుకూడ అతడు స్వలాభము కుపయోగించుకొనక, మహాత్యాగియై విశ్వప్రేమను చూపి లోకోపకారియైనాడు. ఉభయజాతుల మైత్రి స్థాపించి అహింసనే ఆచరణలో బెట్టినాడు.

హింసాచర్య ప్రతిహింసకు కారణమగుననుటకు పరిక్షిత్తుకథయే గాక పరశురాముల చరిత్రయు నిదర్శనము.

పూర్వము కార్తవీర్యార్జునుడను మహారాజు వేటాడుచు వచ్చి జమదగ్ని యాశ్రమమందలి ధేనువును నిర్బంధముగా తాను కొనిపోయి ఆశ్రమమును చికాకు పర్చెను. జమదగ్ని పుత్రుడగు పరశురాముడు క్రోధుడై రాజును జంపెను.

హింసాతత్వమునకు వశుడై నాగజాతి నంతను నశింపజేయుదుననీ పట్టుపట్టి మహాసభ జేసి, అనేకుల సహాయముతో మహాయాగము నారంభించెను.

ఆయాప్రాంతములనుండి నాగులను పట్టి తెప్పించి, వారి నా యజ్ఞకుండపు మహాగ్నిజ్వాలలలో నాహుతిజేయ దొడగెను. ఇట్లెందరో నాగు లక్కడికి దేబడి చంపబడిరి. పితృహంతకుడగు తక్షకు నెట్లైన చంపవలెనని రాజు నిశ్చయించెను. అతడింద్రు నాశ్రయించెను. ఇంద్రుడును మనస్ఫూర్తిగ యత్నించెను, కాని రక్షింపలేకపోయెను. ఇక అగ్నిగుండమువద్దకు తక్షకుని చేర్చు చుండగా, వాసుకి మేనల్లుడగు ఆస్తీకు డాసభకువచ్చి జనమేజయుని చక్కగా స్తుతించెను. ఆయన యద్భుత పాండిత్యమును యోగ్యతను ఆయార్యసభ్యులందరు మెచ్చుకొనిరి. అప్పుడు "నీవు కోరిన వరమిత్తును, అడుగుము" అని రాజాతనితో ననెను.

కాని, ఆస్తీకుడు త్యాగి విశ్వప్రేమియు నగు మహర్షి. ద్రవ్యము వగయిరాల గోరుటకుబదులు ఆస్తీకుడు "ఈనాగయాగ మింతటితో నిల్చిపోవలెను" అని కోరెను. ఆకోరిక మాని మరొక దానిని కోరమన్నను ఆస్తీకుడు చలించలేదు తన మంత్రిబల ముతో తక్షకుని యజ్ఞగుండమునుండి యీవల నిల్పెను. ఆస్తీకుని వంటి యుత్తమునికిచ్చిన వరము చెల్లింపక తప్పదని అందరు సభ్యులు నాయాగమాపుచేయించిరి. ఇట్లు దుర్మరణమునుండి రక్షితుడైన తక్షకాది నాగులందరును ఆస్తీకుని శ్లాఘించి, "నీకోరి కలు మాకు తెల్పుము, నీమాటప్రకారం జరుపుదుము" అనిరి. "మీరిక నరులను వ్యర్థముగా హింసింపకూడదు" అని కోరెను. అందుకు నాగులందరు నొప్పుకొనిరి. అప్పటినుండి నాగులకును ఆర్యజాతీయులకును మధ్యను అహింస యేర్పడినది (సర్పములీ కాలమందు సందడినుండి తప్పించుకొనుటను, తమకు ప్రాణభయము గల్గినప్పుడే నరుల హింసించును) యీకథలో ఆస్తీకుని ప్రేమగుణము పరస్పర మైత్రియును చక్కగ గనబడును. చక్రవర్తి యిచ్చు వర

మును తత్క్షణాదులిచ్చువరమునుకూడ ఆతడు స్వలాభము కుపయో గించుకోక, మహాత్యాగియై విశ్వప్రేమనేచూపి లోకక్షేమము కోరి నాడు. ఉభయజాతులమైత్రి స్థాపించి, అహింసనె ఆచరణలో బెట్టినాడు.

హింసాచర్య ప్రతిహింసకు కారణమగుననుటకు పరీక్షిత్తు కథయెగాక పరశురామాదులచరిత్రియు నిదర్శనము.

పూర్వము కార్తవీర్యార్జునుడను మహారాజు వేటాడుచు వచ్చి జమదగ్ని యాశ్రమమందలి ధేనువును నిర్బంధముగా తోలు కొనిపోయి ఆశ్రమమును చికాకుపర్చెను. జమదగ్ని పుత్రుడగు పరశురాముడు క్రోధుడై రాజునె జంపెను. అంతట కార్త వీర్యుని కొడుకులు జమదగ్ని ఋషిని చంపివేసిరి. యీ వార్త తెలియగనే ఉన్మత్తుడైనట్లు పరశురాముడు ఆరాజపుత్రులనేకాక కంటబడ్డ క్షత్రియులందరిని చంపెను. చాలా రాజవంశములపుడు నశించెను. హింసాత్మకులగు రాక్షసజాతియు విజృంభించిరి. వారు ఋషులను చాలా బాధపెట్టిరి. ఇట్లు పరశురాముని కులమువారగు బ్రాహ్మణులే చాలా ప్రమాదముకు లోనైరి. తుదకు శ్రీరాముడు దుష్టుల సంహరించి ఋషుల రక్షించవలసివచ్చెను. ఇట్లు హింసకు ప్రతిహింస జరిగి సంఘమంతటికిని అనర్థము కలుగును. మహా భారత కాలమందును ఇట్టివి చాలా జరిగెనని చూచియున్నాము. శ్రీకృష్ణుండు శిశుపాలుని జంపినందుకును కొంత ప్రతిహింస జరిగి నది. ఆచేదిరాజు తమ్ముడగు సాల్వుడు అన్న మృతికి కసిదీర్చు కొనుటకై మహాసేనతో వచ్చి ద్వారకను ముట్టడించెను.

అప్పుడు దీర్ఘయుద్ధము జరిగి రెండుపక్షములను ఎందరో హతులైరి. తాను పదినెలల పనిలో మగ్నుడైతినని శ్రీకృష్ణుడు ధర్మరాజుతో అరణ్యములో చెప్పెను. అరణ్య పర్వములోనిదే ధర్మవ్యాధునికథ విచిత్రమైనది. కౌశికుడను బ్రాహ్మణయువకుడు

ఏకపుత్రుడైనను చిక్కులోనున్న తలిదండ్రులవదలి, మహా తపస్సు చేయుచుండెను. కాని అడవిలో నతని కహంభావమునిల్చి యున్నది. ఒకనాడతడు చెట్టుక్రింద వేదము చదువుచుండెను. అది ఉదయవేళ. ఒక పక్షి పైనుండి వేసినరెట్ట అతనిపైన పడినది. వెంటనే కోపముతో నతడు పైకి తలయెత్తిచూచెను. అహంకారి అయినను అతడు తపశ్శాలి. ఉగ్రతేజుడు. అతని కోపాగ్నికాపక్షి తప్తమై క్రిందబడిచచ్చెను. అతడా దృశ్యము చూచి వ్యాకులుడై ఆచికాకులోనె దగ్గరనున్న గ్రామముకు భిక్షకై వెళ్లెను. ఒకయింటి యజమానుడప్పుడే మరలి వచ్చుచుండెను. గృహిణి శ్రమపడివచ్చిన తన భర్త కుపచారము చేయుటలో కౌశికుని సత్కరించుట కాలస్యమైనది. భర్త విశ్రమించగనే ఆబ్రాహ్మణి కౌశికుని సత్కరింపవచ్చెను. "ఏమి యిట్లు జాగు చేసితివి. నన్నవమానింతువా? నేను తపశ్శాలినగు ఋషినని యెరుగవా?" అని కౌశికుడామెనుజూచి గర్జించెను. "నాభర్తకు సేవచేసి వచ్చితిని. ఆలశ్యము క్షమింపుడు" అని ఆపతివ్రత వినయముతో ననెను. కాని బ్రాహ్మణుడు "ఋషియగు అతిథిని వాకిట నిలువబెట్టి భర్తను ముందు సత్కరింతువా?" అని కండ్లెర్ర చేసెను. ఇంతలో ఆమె నేను ఈ యుదయము క్రోధాగ్నికి దగ్ధమైన పక్షినిగాను. గృహిణి అలసివచ్చిన భర్త నాదరించుట అతిథిపూజకన్న ముఖ్యధర్మము. మీరు ఋషులైనను అహింసా ధర్మ మలవర్చుకోలేదు. మీతపస్సు వ్యర్థము. మిథిలానగరపు ధర్మవ్యాధునితో మీరు మాటాడి ధర్మోపదేశ మొందదగును అని జవాబిచ్చెను. ఉదయమందు పక్షి చచ్చినసంగతి స్వయముగా ఆమె గ్రహించినందు కాశ్చర్యాన్వితుడై, ధర్మవ్యాధుని సంగతి చూతమని ఆందోళనగల్గి కౌశికు డక్కడనుండి బయలుదేరెను. కొన్నిరోజులకు మిథిలాపురి జేరెను, అంతట వాకబుచేసి బ్రాహ్మణుడు ధర్మవ్యాధుడున్న వీధికిచేరెను. కాని అది బజారులో మాంసమమ్మే వీధి. అందొక మాంసపుకొట్టుమీద ఆవ్యాధుడు

కూర్చొని యుండెను; ఆదృశ్యముకు సంకోచించి బ్రాహ్మణుడు దారిలోనిల్చిపోయెను. కాని యింతలో వ్యాధుడే దుకాణము నిలుపుచేసి దిగివచ్చి కౌశికునితో "అయ్యా పతివ్రతపంపున" మీరు దయచేసినారు. ఇక్కడ మీకు దుర్వాసన ; నాయింటికి పోదమురండు" అని చెప్పి తనయింటికి తీసుకొనిపోయెను. విభ్రాంతుడగు కౌశికుడు అట్లు వ్యాధుని యింటచేరి యతనిచే సత్కరింపబడి, సుఖాసీనుడయ్యెను

వ్యాధుడు తన తల్లితండ్రుల కుపచారముచేసి వచ్చెను. అంతట కౌశికుడతనితో "నీవు చేయువృత్తి కేవలం హింసాకార్యము, శాస్త్రదూష్యము, అసహ్యము. అట్టికిరాతుడవగు నీకిట్టి దివ్యజ్ఞాన మెట్లు కలిగినది? పతివ్రత నన్ను పంపినదని, నేను నీకై వచ్చితినని నీవెట్లు ముందుగా గ్రహించితివి? నీవు సామాన్యుడవని ఆబ్రాహ్మణి నీవద్ద ధర్మం నేర్చుకోమన్నది'' అని చెప్పెను. అంతట ధర్మవ్యాధుడు "అయ్యా నిజమె. నీక్రోధదృష్టిచే పక్షి చచ్చుట, ఆమె భర్త నాదరించులోగా నీవు తొందరపడుట ఆమె గ్రహించి, నిన్నిక్కడకు పంపినది. కనుక నీవు అహింసాధర్మ మింకను నేర్చుకోవలెను" అనెను.

అంతట కౌశికుడు ధర్మవ్యాధుని జ్ఞానమున కాశ్చర్యమొంది "నీమహిమ మద్భుతము, నీచర్య నిషిద్ధము. ఇది యెట్లు? ఈధర్మసూక్ష్మము నాకు దెల్పుము అని యడిగెను. అంతట కౌశికుడు*

* ఎగ్గుచేసినవారికి హితముచేత యార్యజనములు కీర్తింతురన్న, దోషకారి తన దోషమున దానకాలిపోవు. వేర వానికి గీడు కావించనేల॥ పాపములకెల్ల నెక్కుడు పాతకంబు సువ్వె క్రోధ లోభంబులు. సువ్రతాత్మ, వానిరెంటి జయించినవాడుగాని ఎందు పరమ ధార్మికుడని యెన్నబడడు॥ హింస చేయనివాడు లేడీజగమున నొక్కడైనను దమ శమ యోపినట్లు, హింస తెరువునకడగల్గి యోగవలయు నదియు చూవె యహింసవా నతిశయిల్లు॥ శ్రీవినుమహింసధర్మవితతికెల్లను మేటి, అది సత్యయుక్తమైన వెలయు, ఆనఘ శిష్టచరితలందు సత్యము కడు నధికమనిరి. శ్రుతులనరసి బుధులు॥ సలిలములు శ్వియాకసము సర్వము జంతుమయంబు గావునం గలుగు నవశ్యము సకలకర్మములందును హింస —



(అం. నా. భా. అరణ్యపర్వం ధర్మవ్యాధో)

నేను కిరాతవంశజుడను, నాకులవృత్తి చేయుచున్నాను, లోకమందు చాలామంది మాంసాహారులున్నారు, వారికై మాంస విక్రియము జనుల కవసరము, జనుల కుపయోగించువృత్తి కులవృత్తి యైనందున దానిని విడచి మరొకదానికై యితరులకు పోటి వచ్చుట తగదు. నేను గృహస్థుడను, కుటుంబ పోషణకీవృత్తి. కాని యెన్నడును ఏజంతువును హింసింపను. ఇతరులు తెచ్చిన మాంసమునే కొని విక్రయించెదను. నాకు హింసాబుద్ధి ఎంత మాత్రమును లేదు- హింసాచర్య నసలె చేయకుండుట గృహస్థునికి సాధ్యము కాదు. ఇందు మనస్సే ప్రధానము. మనస్సు శాంతము ప్రేమ మయముగనుంచు హృదయుడె నిజమగు అహింసాత్మకుడు నేను పూర్వజన్మమందు బ్రాహ్మణుడనె, కాని నామిత్రుడగు రాజుతో వేట కడవికి వెళ్లి, అందు పాల్గొంటిని. రాజు బాణమొకపొదలో కదులుచున్న ప్రాణికి తగిలినది; కాని అది మృగము కాదు. జపములోనున్న బ్రాహ్మణుడు. ఆబ్రాహ్మణుని శాప ఫలముగ అహింసా చర్యతో సంబంధమునుబట్టి నాకీ కిరాతజన్మ వచ్చినది. నా యుపచారమువలన అప్పుడా బ్రాహ్మణుడు బతికెను. కనుక నాకాజ్ఞానమును సత్ప్రవర్తనయు ఇప్పుడు కల్గినది. మన వర్ణము వృత్తికంటె, మననీతి బుద్ధియె ప్రధానములు.* నీకు కోపము పోవలెను. మరియు వృద్ధులై నిరాయుధులైన మీ తలిదండ్రులను వదలి మీరు అడవిలో నుండుటచే మీకు మనశ్శాంతియు అహింసాభావమును కుదుటగ నుండవు. గనుక తల్లిదండ్రుల బోషింపుము. అహింసాతత్వము లేక తపస్సు చేయుటచే లాభము లేదు" అని హితబోధచేసెను. అంతట కౌశికుడు తృప్తుడై గృహముకు బోయెను. అహింసాతత్వపు పరీక్షలో చర్యకన్న ఉద్దేశమున కెక్కువ ప్రాధాన్యమీయవలెనని యీకథ

---

* పాపవర్తనుండు బ్రాహ్మణుండయ్యును నిజముగ శూద్రుకంటె నీచతముడు, సత్యశౌచధర్మశాలి శూద్రుడయ్యు నతడు సద్ద్విజుండ యనిరి మనులు-

(ధర్మవ్యాధోపాఖ్యానం.)

తెల్పుచున్నది. ఈకథలోని ధర్మవ్యాధుని మనస్సు కేవలం అహింసా యుతము. కౌశికుని జీవితముపైకి అహింసారూపమైనను అట్టి మనఃపరిపాకము గలుగలేదు. కౌశికునివలె వనవాసికాకున్నను నతడు వ్యాధుడై గృహస్థుడైనను, అహింసాయుతుడగుట సాధ్యమనియు తెలుచున్నది. సంఘమునకుపయోగియగు వృత్తి పశుపాలనమైనను విద్యాబోధమైనను వర్తకమైనను చెప్పులు కుట్టుటమైనను పాకిపని అయిననుసరె, అందులో గౌరవము నీచత్వము అనేభేదమక్కర లేదు.* న్యాయమయిన వృత్తియేదైనను మంచిదే. అయితే మాంసవిక్రయములో స్వయముగా హింస లేకున్నను కొంత సంపర్కముండును. జంతువును జంపి మాంసమును తయారుచేయుట జీవహింసయే; మాంసభోజనమును అహింసావాదుల దృష్టిలో తప్పే. ఈఉభయులకును తోడ్పడు విక్రయకర్త, కర్తా కారయితా చైవప్రేరకశ్చానుమోదకః అను న్యాయము ననుసరించి హింసాచరణకు సహకారికాడా అను ప్రశ్నగల్గును. మద్యపానము అకార్యమైనట్లె మద్యవ్యాపారము అప్రశస్తము. అట్లె మాంసవిక్రయం అహింసాదృష్టిలో అప్రశస్తమనియే యోచించదగునని తోచును.

శాంతిపర్వములోని తులాధార కథయు ఇట్టిదే. జాజలి అను బ్రాహ్మణుడు గొప్పవిద్వాంసుడై, సముద్రతీరములో మహాతపస్సు చేయుచుండెను. ఆయన కేవలం వాయుభక్షకుడై, జలమధ్యమందుండి, ఐహిక వాంఛలజంపుకొని, మహాప్రజ్ఞను సంపాదించెను. ఖగోళ జ్ఞానమునుగూడ సంపాదించెను కాని, తన అహింసా సత్యవ్రతమును శక్తియు, మరెవరికిని లేదని ఆయనకు గర్వము గల్గెను. కాని "నీకన్న ప్రాజ్ఞుడు ధీరుడు లోకోపకారి కాశిలో తులాధారుడను వైశ్యుడున్నాడు, అతనివల్ల హితబోధ నొందుము, కాని అతనికిని అహింసాదిశక్తి యింకను సంపూర్ణము

---

* [illegible] ధిమహాత్ముడును చాలాసార్ల స్పష్టపర్చినాడు;

కా లేదు'' అని ఆకాశవాణి వినబడెనట. అంతట, జాజలి ఆశ్చర్య మొంది, తనకన్నను అహింసాది గుణములు గలవాడెట్లుండునో చూతమని, కాశికి బయలుదేరి వెళ్ళెను. కొన్నాళ్ల కాయన వారాణసిచేరి, ఆమహానగర మందతనికై వాకబుచేసెను. తుదకు తులాధారు డక్కడి బజారులో నొక దుకాణములో వ్యాపారము చేసుకొనుటను చూచెను. ఇదేమి దరివ్యాసక్తుడై లోకవ్యాపారంలో మగ్నుడైనవాడు మహాత్ముడా అని జాజలి శంకించుచు చూచెను. ఇంతలో తులాధారుడు దుకాణమునుండి జాజలికి నన్మానమిచ్చి "తమరుసముద్రతీరమందలి తపస్సువదలీ గ్రామములు అడవులు దాటి నానిమిత్త మింతదూరము దయచేసినందుకు ధన్యుడను. ఆకాశవాణి మాటచొప్పున మీరిట్లు వచ్చినారు'' అని ముందుగనే తులాధారుడు పలకరించెను. అతనికట్టి దివ్యజ్ఞానమున్నందుకు జాజలియు ఆశ్చర్యమొంది, తనకు హితముపదేశింపుమని కోరెను.

అంతట వినమ్రుడగు తులాధారుడు "స్వధర్మము నిర్వర్తించుచు, న్యాయపరివర్తనతో లోకులకు మేలుచేయుటే ప్రశస్తము. జీవితమందు వంశానుగతముగనుండు వృత్తిని వదలుట కూడదు. ఏకాంతముగ తన మోక్షముకై తపస్సు చేయుటకంటె, పరహితము అహింసాపరుడై లోకులందుకృపాపరుడై, జనులబాధల బోగొట్టుటే ఈశ్వర సంకల్పము, ఉత్తమము అని బోధించెను. వ్యాపారాది వృత్తులజేయుచునే అహింసాపరులగువారు లోకహితము గావింపవచ్చును, పుణ్యగతుల నొందవచ్చును, అని తులాధారుడు తన జీవితముద్వారా నిరూపించెను.

(మహాభారతం శాంతిపర్వం తులాధారోపాఖ్యానం)

## —◆ ఘోషయాత్ర ◆—

అరణ్యపర్వములో చెప్పిన ఘోషయాత్రాచరిత్ర మానసిక హింసచే గల్గు అనుభవమునకు ఉదాహరణము.

జూదమందోడినమీదట పాండవులందరును ద్రౌపదితో కలసి వనమునకు బోయిరి; అక్కడ "ద్వైతవన" మను అడవిలో ఆశ్రమ మేర్పరచుకొనిరి. మొదట కష్టముగ నున్నను, పాండవులు క్రమముగ వన్యజీవన మలవర్చుకొనిరి. ధౌమ్య నారదాది మునులు వచ్చి హితముపదేశించుచుండిరి. పాండవులు ఋషులవలె సుఖశాంతజీవనము చేయుచుండిరి. చుట్టుపట్ల మునులు వగైరాలు పాండవులందు సద్భావముతో నుండిరి. ఈసంగతి దుర్యోధనాదులకు తెలిసినది. వారు ఈర్ష్యతో, పాండవుల బాధింప జూచిరి. తమ రాజవైభవమును వారికి ప్రదర్శించి వారి మనస్సుల నొప్పించుట కుపాయము కనిపెట్టిరి; గ్రామజీవనమును గోసంపదను రక్షించి తణిఖీచేయుటకు రాజులు గ్రామములను ముఖ్యముగ పశువులుండు గొల్లపల్లెలను స్వయముగ వెళ్లి పరీక్షించు రివాజు పూర్వముండెను. దానిని "ఘోషయాత్ర" అందురు. అట్టి ఘోషయాత్ర చేయుదమని ధృతరాష్ట్రునొప్పించి దుర్యోధన దుశ్శాసన కర్ణ శకునులు కుట్రచేసి కొంత సేనను ఆస్థానికులను స్త్రీ పరివారమునుగూడ తీసుకొని బయలుదేరిరి ? ఈదుష్ట చతుష్టయము ద్వైతవనపు సరస్సు ఒడ్డుననే తమ డేరాలు వేయించిరి. ఆసరస్సులో నప్పుడు గంధర్వ రాజగు చిత్రసేనుడు విహరించుచుండెను. కనుక మరొకచోట వసింపుడని వారిని గంధర్వులు కోరిరి. కాని దుర్యోధనాదులందరు నక్కడనే బసచేసిరి. అందుపైన చర్చ పెరిగి, వారిని పట్టి తెమ్మని ఇంద్రుడాజ్ఞాపించెను. అంతట కౌరవసేనకు గంధర్వులతో పెద్ద యుద్ధము జరిగెను. కర్ణాదులు తమ శౌర్యముజూపి ధైర్యముతో పోరిరి. కాని వారందరును తుదకోడిరి. ముఖ్యముగ దుర్యోధనాదులను బంధించి, గంధర్వులు త్రివిష్టపమునకు పైపు తీసుకొనిపోవుచుండిరి. అంతట కొందరు

కౌరవాశ్రితులు స్త్రీలును చేయునదిలేక పాండవులతో తమకు జరిగిన ఆపత్తు సంగతి దీనముగ జెప్పుకొని, రారాజాదుల విడిపింప గోరిరి.

అంతట భీమసేనుడు "సరే మమ్ము పరాభవింపదలచి వచ్చిన దుష్టులకు తగిన ప్రాయశ్చిత్తము జరిగినది. కాదగినకార్యమును గంధర్వులే నెరవేర్చిరి." అని సంతోషముతో ననెను. కాని యుధిష్ఠిరుడొప్పుకోలేదు. దుర్యోధనుడు సోదర కుటుంబపువాడు, ప్రస్తుతమాదేశపు రాజు; ఆతనిని విడిపించుటయె మనబాధ్యత. అతడు దురుద్దేశముతో వచ్చినను అపకారి కుపకారము చేయుటే ప్రశస్తము. అని వెంటనే యుద్ధముచేసియైనను కౌరవాదులను విడిపించుమని సోదరులతో ననెను. అన్న యాజ్ఞ ప్రకారం అర్జునుడు వెంటనేపోయి, గంధర్వుల నడ్డుకొనెను; కౌరవుల విడువుమని చిత్రసేను నడిగెను, "వీరు మిమ్ము నవమానింపవచ్చిన దుర్మార్గులు, వీరిని పట్టితెమ్మని స్వర్గాధిపుడగు ఇంద్రుడు యాజ్ఞయైనది" కనుక విడువము. అని గంధర్వరాజు జబాబు చెప్పెను. కాని వారి నెట్లైనను విడిపింపుమని యుధిష్ఠిరునాజ్ఞ; కనుక విడువనిచో యుద్ధము చేయుమని, అర్జునుడు యుద్ధమారంభించెను. తీవ్ర సమరముజరిగి, తుదకర్జునుడు జయమొందెను. అంతట అందరును ద్వైతవనముచేరి ధర్మరాజువద్ద నిల్చిరి. దుర్యోధనాదులు తలపెట్టిన దుశ్చర్యను అందుపైన జరిగిన వృత్తాంతమంతను చిత్రసేనుడే తెలియచెప్పెను. కాని ధర్మజుడు వెంటనే దుర్యోధనాదుల కట్లు విడిపించి, వారి కాతిథ్యమిచ్చి ఇక నెన్నడు నట్టి దుశ్చర్యలు తలపెట్టకుమని, హింసాప్రకృతి యెప్పుడును హానికరమని, బోధించెను. చిత్రసేనునికిని నచ్చచెప్పి, ధర్మరాజు అందరిని సమాధానపర్చి పంపెను. ధర్మరాజు ఔదార్యమునకు గంధర్వులెంతయు ఆశ్చర్య సంతోషపరులై, ఈవిచిత్రమును వినిపింప నింద్రునొద్దకుబోయిరి. దుర్యోధనాదులు మాత్రము విచార

గ్రస్తులై, తేలుకుట్టిన దొంగవలె చప్పుడు లేకుండ రాజధాని చేరిరి. ఒకరికి మనోవ్యథ చేయదలచిన కౌరవులు తామే భంగమునకు పాలైరి.

భారతములోని శిబిచక్రవర్తి కథ భూతదయకు ఆత్మార్పణకు ప్రబలమగు ఉదాహరణ.*

"ఉశీనరు" రాష్ట్రపు చక్రవర్తియగు "శిబి" మహారాజు ప్రేమమయుడు, మహాత్యాగి, ఆయన ప్రసిద్ధి అంతటను వ్యాపించినది. దాని నింద్రాగ్నులు పరీక్షించదలచిరి. అప్పుడు అగ్ని పావురపు రూపమునెత్తెను. ఇంద్రుడు డేగయై, దానిని తరుముచున్నట్లు కనబడెను. డేగ బలీయముగనుక తరిమి సమీపించి, శిబి చక్రవర్తి యున్నచోట పావురమును పట్టబోవుచుండెను. ఆ పావురము అలసి ప్రాణరక్షణ గోరుచు శిబిచక్రవర్తి ఒడిలో జేరెను. కాని డేగ విడువక, తన కాకలి యగుచున్నదనెను. "శరణాగతుని నేను రక్షింతును; నీ కితరాహారమిత్తును; దీనిని నీవువిడువవలె" అని శిబి యెన్నివిధములనో చెప్పెను. అయినను డేగయు తన పట్టు వీడలేదు. నీకు కావలసినదాని నిత్తునని రాజనెను. రాజు దేహములోనే ఆ కపోతపు బరువు మాంసమును తీసి యిచ్చినయెడల, పావురమును వదలుటకు డేగ యొప్పుకొన్నది. అందుకు సిద్ధమై శిబి తన శరీరమునుండి మాంసమును కత్తితోతీసి త్రాసులో వేయించెను. కాని ఆమాయపావురపు బలువు పెంచ్చినది. ఇంకను మాంసము తీసినయెడల శిబి మరణించుట తప్పదు. ఐనను సరే, తన దేహమంతను భక్షింపుమని రాజు స్వయముగ త్రాసులో చేరెనట. ఇట్లతడు ప్రాణము నర్పించుట చూడగనే, శ్యేన కపోతములు మాయమైనవి. ఇంద్రాగ్నులు ఆయనకు ప్రత్యక్షమై, చక్రవర్తి యమూల్య దేహమును అందలి కండలతో యథాస్థితికి

* ఆం. మ. భా. అరణ్యపర్వ 3 వ ఆశ్వాసం ఈకథను ధర్మరాజునకు లోమశ ఋషి వివరించెను.

రప్పించి, ఆమహనీయుని విశ్వప్రేమకు సంతుష్టులై వెళ్లిరట. "నాకు రాజ్యము స్వర్గము మోక్షము అక్కరలేదు. దుఃఖార్త్తులగు ప్రాణులబాధ తొలగుటే నాకు కావలసినది" అని శిబి జీవితాదర్శము.‡

అరణ్యపర్వములోని "అజగరోపాఖ్యాన" మను చిన్నకథ విచిత్రమైనది. పాండవులు వనవాసములో నుండగా, భీముడొకనాడు హిమవత్పర్వతములోనికి పోయెను. (అప్పుడు వారు మాంసమును తినుచుండిరి; కనుక ఆహార సంపాదనకే యీవేట) అక్కడనొక గుహలో నొక గొప్ప కొండచిలువ యుండెను; అక్కడకు వచ్చిన భీమునిబట్టి, అతని దేహమును తన దానిని గట్టిగా చుట్టివేసెను. భీముడు నాగాయుత బలుడని ప్రసిద్ధి. కాని దీనికి లొంగి యొండేమియు చేయలేక నిర్వీరపడి పెనగ నిశ్చేష్టుడాయెను. ఇంతలో భీమునికై వెదకుచు, ధర్మజుడు తమ్ముని యడుగుజాడల బట్టి ఆకొండగుహజేరి ఆభీకరదృశ్యమును చూచెను. అతడు స్థిమితము తెచ్చుకొని "అయ్యో, నీవెవరవో, ఇందేదో మాయయున్నది భీముడేమి? కొండచిలువకు పట్టుబడుటేమి? " అని ప్రశ్నించెను. అంతట అజగరము ధర్మరాజు సౌమ్యతకుమెచ్చి మనుష్యుల వాక్కుతో "నేను పూర్వమున నహుషుడను చక్రవర్త్తిని; శాపహతుడనై యిట్లైతిని * నేను కొన్నిప్రశ్న లడుగుదును; వాటికి

---

‡ నత్వహం కామయే రాజ్యం నస్వర్గం నాపునర్భవం
కామయే దుఃఖ తప్తానాం ప్రాణినా మార్తినాశనం

* నహుషుడను రాజు పూర్వముండెను. అతడు మహాబలుడై సామ్రాజ్యము నేలెను; అతడు నూరు యజ్ఞములుచేసి యింద్రసముడయ్యెను; ఈగర్వము వలన అతడు కేవలం అహింసాపరులగు ఋషులనుగూడ బాధించుచుండెను. ఒకనాడు తన పల్లకిని అగస్త్యునిచే మోయించుకొనుచు అఋషిని "సర్ప, సర్ప" (= త్వరగా నడువు) అని తొందరచేసెను. అంతట అగస్త్యుడు సర్పోభవ (సర్పము అగుము) అని వదలగా నహుషుడు అజగరమై, హిమాలయము చేరెనట; తన హింసాతత్త్వమువలన అతడు భ్రష్టుడైనాడు.

సరియైన సమాధానము వచ్చినప్పుడే, నేను వదలుదును; నాయెదుట నెట్టివారును దుర్బలురగుదురని దేవవర మున్నది; కనుక భీముడు లొంగిపోయినాడు" అని చెప్పెను. అంతట ధర్మరాజు ప్రశ్నలడిగించుకొని, వాటి కన్నింటికిని సరియైన జవాబిచ్చెను. అంతట అజగర దేహమువిడచి నహుషుడు నరరూపుడై ధన్యుడై వెళ్లెను. ఇట్లు విడుదలయైన తమ్మునితో కలసి ధర్మరాజు సుఖముగ తన బసకు చేరగల్గెను.

ఈ నహుషప్రశ్నలో నొకటి: "బ్రాహ్మణునకెట్టి గుణము లుండవలె?"

ధర్మరాజు జబాబు "సత్య, క్షమా, దమ, శౌచ, దయా, తపోదాన శీలంబులెవ్వనిని గానదగునట్టివాడు బ్రాహ్మణుండు..."

ఇంకొకప్రశ్న "హింసగావింపనివాడు సుగతికేగునట, అది యెట్లు ? "

ధర్మరాజు జబాబు "అవును, సత్యముకన్నను అహింసయే విశిష్టము; దేవ, మనుష్య, తిర్యక్, అని జీవుల గతులుమూడు: ఇందు దానాదిగుణములు గల అహింసాపరులుమాత్రమే దేవగతి నొందుదురు. "

ఎట్టి మహా బలులకును అహింస యున్నపుడే, ఆబలము అందరికినీ క్షేమకరము ; లేనియెడల హానికరమగును. అని యీ నహుషచరిత్ర మనకు తెలుపుచున్నది.

అరణ్యపర్వము తుదనున్న యక్ష ప్రశ్నల గాథయు నిట్టిదే. ఒకబ్రాహ్మణుని ఆశ్రమమందున్న అరణిని మృగమొకటి తన కొమ్మకు తగుల్చుకొని పారిపోయెను ఆదుప్పిని పట్టి తన యరణిని తెచ్చి యిమ్మని ఆవిప్రుడు పాండవులను ప్రార్థించెను. వారు దానిని వెంబడించి అడవిలో దూరము పరుగెత్తిరి; కాని, ఎంత

శ్రమపడినను వారికది దొరకనేలేదు. తుదకు అలసి పోయి, వారు మహాటవిలో నొక చెట్టుక్రిందజేరిరి. వారు దప్పిబాధవలన నీటికై వెదకిరి ; ఒక ప్రక్క నొక చెరువుమాత్రమా చెట్టు తుదినుండి నకులునకు కనబడెను. అంతట నకులుడక్కడబోయి నీరు తేదలచి, ముందుగా తానందలి నీరు త్రాగబోయెను అప్పుడొక అశరీర వాణి "ఈచెరువు నాది: నేను కొన్ని ప్రశ్నలడుగుదును ; వాటికి సరియైన జబాబిచ్చినచే, నీవు నీటిని ముట్టవచ్చును ; లేనియెడల నీకు ప్రమాదమగును." అనెను. కాని, నకులుడా వ్యక్తి దృష్టికగ బడనందున లక్ష్యముచేయక, నీటిలోదిగెను ; వెంటనే అతడు ఒడ్డుమీద మూర్ఛిలి పడెను. నకులుడెంతసేపటికి రానందున, భీమాదులు నొక్కొక్కరుగ వెదకుచు, ఆచెరువువద్దకుజేరి అశరీర భూతపు మాటవిని, లక్ష్యముచేయక, చెరువు నీటిలోదిగి, వెంటనే మూర్ఛిలిపోయిరి. తుదకు తమ్ములందరిని వెదకుచు, ధర్మరాజ క్కడికి జేరెను. అంతట "అయ్యా, నేనొక యక్షుడను, ఈచెరువు నాది; నేనడుగు ప్రశ్నలకు సమాధానమీయవలెను ; లేకుండ నీటిలో ప్రవేశించినందుకే నీతమ్ములు మూర్ఛిల్లియున్నారు ; కనుక జాగ్రత్త" అని ధ్వని వినబడెను. అదృశ్యము జూచి శోకగ్రస్తుడైనను, ధర్మరాజు శాంత చిత్తముతో "మీప్రశ్న లడుగుడు, నాకు తోచిన సమాధానమిచ్చెదను," అనెను. అంతట భీకరాకారముతో కనబడి యక్షుడు చాల క్లిష్టమైన కొన్ని ప్రశ్నలడిగెను. అందుకు ధర్మరాజు అద్భుతమగు నిదానముతో సరియగు జబాబులిచ్చెను. అంతట యక్షుడు చాల సంతోషించి, అతనిని నీరు త్రాగనిచ్చి "నీవింత చక్కగ జబాబు లిచ్చినందుకు సంతుష్టుడనైతిని ; పడిపోయిన నీతమ్ములలో నొకడు మాత్రము లేచి రాగలడు ; ఈనలుగురిలో నెవరు కావలెనో కోరుము" అనెను ధర్మరాజు "నాకు నకులుడు కావలెను" అనెను. అంతట యక్షుడు "ఇదేమి, నీ ప్రియసోదరులు, మహాబలురు, విఖ్యాతులు నీ కాపత్తులో తోడగువారు నగు భీమార్జునులను వదలి, భిన్నోదరుడగు

నకులుడు కావలెనంటివి?'' అని యడిగెను. ధర్మరాజు "అయ్యా నాతల్లికి నేనున్నాను. నాసవతి తల్లియగు మాద్రి కొడుకులిద్దరును లేకుండుట అన్యాయము; కనుక ఆమె జ్యేష్ఠపుత్రుని బ్రతికింపుము. మీరెవరో సామాన్య యక్షులుకారని తోచును. ఇందు న్యాయమే ప్రధానము, కాని నాస్వార్థముకాదు'' అని జబాబిచ్చెను. అంతట యక్షుడు, నీధర్మబుద్ధికెంతయు సంతోషించితి; నీతమ్ములు నలుగురును స్వస్థులై నీవెంట వత్తురు; నేను యమధర్మరాజును; నీధర్మశీలత యెంతటిదో నీభావములెట్టివో పరీక్షించుటకే యిట్లుచేసితిని. నీకొకవరమిత్తును. కోరుము'' అని చెప్పెను. అంతట ధర్మరాజు "అయ్యా, బ్రాహ్మణుని అరణిని దుప్పి యెత్తుకపోయినది. దాని నిప్పింపుము'' అని కోరెను. "ఓహో, దానిని నీవుమరవనేలేదా? అది నిజమగు దుప్పికాదు; మిమ్ములను పరీక్షించుటకవకాశముకై, నేనే అట్లు చేసితిని; ఇదిగో ఆ యరణి'' అని యిచ్చివేసి, యమధర్మరాజు "ఇక మీవనవాసపు 12 ఏండ్లు పూర్తియైనందున అజ్ఞాతవాసమునుగూడ సరిగా పూర్తి చేయగలరు; నీకింకొక వరమీయ దలచితిని. కోరుము'' అనెను. అంతట ధర్మజుడు ధన బలాదులు కోరక "నేను ధన్యుడను, నాకెన్నడును క్రోధ మోహాదులు లేకుండుగాక" అని కోరెను* అట్లేయని యముడాశీర్వదించెను.

ఐశ్వర్యముకన్నను బలముకన్నను అహింసాశాంతములే గొప్ప సంపదయని ధర్మజు డిక్కడ భావించినట్లు తేలుచున్నది. ఆచెరువుయొద్ద యక్షుడడిగిన ప్రశ్నలు కష్టమైనవి కనుక నే ఇప్పుడు

---

* ఆదిదేవుఁడైన నీవు దయామతిం బొడసూపి న
న్నాదరించుటచేసి, ధన్యుఁడనైతి నింతకు నెక్కుఁ
డొండేది గల్గెడు, నైన నామది యెల్లనాఁకను గ్రోధ
మోహాదులం బెడఁబాసి ధర్మువునందు నెక్కొనఁజేయవే.

(ఆం. మ. భా. అరణ్య. 7 ఆ. 88 వ పద్యం)

కష్టమైన సమస్య కల్గినప్పుడు అది "యక్షప్రశ్న'' అనుట కలదు. ఆప్రశ్నలలో నొకటి* సూర్యగతి కాధారమేది? సత్యము.

మరలప్రశ్న:- పురుషునికి మహిమ యెట్లుగల్గు? అతని కేది సహాయము?

జబాబు:- "తపస్సుచే గల్గును; ధైర్యమే సహాయము'' (పిరికితన మహింసాలక్షణముకాదు, పురుషధర్మముకాదు, అని సూచితము)§

ప్ర:- ధర్మమునకు కుదురేది?

జ:- దాక్షిణ్యము ♦

ప్ర:- ఉత్తమధర్మమేది‡

జ :- అహింసయే గొప్పది*.

ఉద్యోగపర్వమున కౌరవ పాండవుల రాయబారవు సందర్భమున హింసవలన లోకమునకు హాని గల్గునని భారతములో చెప్పియున్నారు. పాండవుల యజ్ఞాతవాసము తరువాత యుధిష్ఠిరునకు న్యాయముగ అర్థరాజ్యమీయవలసియున్నను వారైదూళ్ళతో తృప్తిపొందుదురుగనుక ఆప్రకారమిమ్మని ధృతరాష్ట్రునితో చాలమంది చెప్పిరి. ఆసందర్భమున విదురుడు ధృతరాష్ట్రునితో "హింస హానికరము, శాంతియే లోక క్షేమకరము" అని అహింసాప్రశస్త్త చాలదూరము విశదముచేసెను. దుర్యోధనాదులు కామ క్రోధములకు లోనై యుద్ధముకే ఆయత్తులగుచున్నారు. రాజ నీతిని

---

* ఆం మ. భా. అరణ్య 7 వ ఆ. 428—454 పద్యములు

... ... తదాధారభూత మది యెయ్యదియో ?) 428

... ... అమ్మహాత్మునకు సత్యమాధారమండ్రు బుధులు 424)

§ శ్రుతమువలన శ్రోత్రియుడగు నతుల తపోయుక్తి గడుమహత్త్వము వడయున్, ధృతిచే సహాయయుతుడగు నతిశయముగ బుద్ధిమంతుడగు బుధసేవన్.

♦ అమరగ దాక్షిణ్యము ధర్మమున కలకుదురండ్రు)

(దాక్షిణ్యము మానసికమగు అహింస) " " 442)

‡ మేటి ధర్మమగునట్టిది యెయ్యది......

* విను మహింస [illegible] యను ధర్మము.

బట్టియేగాక, అహింసాధర్మమునుబట్టియు సంధి ప్రశస్తమనిచెప్పెను. ధృతరాష్ట్రునికి కొంత నచ్చినను, దుర్యోధనాదులు వినిపించుకో లేదు. అంతట శ్రీకృష్ణుడే రాయబారిగ వెళ్ళి సభలో ధృతరాష్ట్రునకును దుర్యోధనాదులకును ఉభయ పక్షములును శాంతము వహించుట బంధువులకేగాక, జాతికంతకును మంచిది; యుద్ధము లోకమంతటికిని అనర్థకము అనిచెప్పెను * ఇతరులును ఎన్నియో ఉపపత్తులను చెప్పిరి. కాని దుర్యోధనుడెంతమాత్రము నొప్పుకో లేదు;

సూదిమొన మోపినంతయైన యివ్వ నేను♦

పైపెచ్చు ధర్మమునకు భిన్నముగ దూతయగు శ్రీకృష్ణుని బట్టి బంధింపబోయెను. అంతట రాజీచెడి, చివరకు భారతదేశమందలి రాజులందరును ప్రచండయుద్ధము చేసిరి. దేశమంతటను హింస దావానలమువలె వ్యాపించి. తరువాత చాలాకాలము నిల్చి యుండెను. మహాభారతయుద్ధపు ఫలమునుబట్టియు, హింస ప్రశస్తము కాదని ఆమహాగ్రంథములో సూచించియున్నారు. పాండవులు ధర్మబుద్ధితోనే యుద్ధముచేసి గెల్చిరి; కాని, ఆరక్తపాతమువల్ల ఉభయపక్షముల బంధు మిత్రులును హతులైనట్లు

---

* కౌరవ పాండవుల్ తెలుగుగైకొని శాంతతఁబొంది యున్కి మే
లారయ నాకునీకు గులమంతకు నీనృపకోటి కెల్లఁ
పోరితమైన నిలిశకును బుట్టుమహాపద, గావునన్ ధరి
త్రీ రమణాగ్రగణ్య గణుతించి యవశ్యము బొందొనర్పవే॥
ఇట్లే నారదుని వచనము.

బలవంతుల బలములు నగ్గలమగు బలమెదుర గలుగగా గీడ్పడు నాకొల దుల వారికి గర్వము నిలుచునె నయమార్గ వృత్తి నిలిచినభంగిన్.

♦ ఏమును వారు బంచికొని యేలుటగల్గదు వల్కకుండ మిం
కేమిటను వాఁడిసూదిమొన యించుక మోపినయంత మాత్రమున్
భూమియొనర్చి పొందున్నప పుత్రులకిత్తునె, యెవ్వరైన
సంగ్రామమునన్ జయంబుగొని రాజ్యముసేయుట నిశ్చయించితిన్



(ఉద్యోగ ౩ వ ఆశ్వా ౩౬౩ వ పద్యం)

తేలినది. ద్రోణుని వధకై ధర్మరాజు మానసికమగు అబద్ధ మాడెను.* ఆక్రోధమున అశ్వత్థామ అర్థరాత్రి పాండవేయుల జంపెను. తరువాత ఉభయపక్షముల స్త్రీలు రణరంగమునకువచ్చి తమ పతిపుత్రాదుల శవములజూచి యేడ్చినట్లు స్త్రీ పర్వమందు విరివిగ వ్రాయబడినది. వాఙ్మయ రంగమందింకెక్కడను లేనంతగ భీభత్సదృశ్యము వర్ణించుట హింసవలని బాధలందరి హృదయ మందును నాటుటకే.

ఈ మహాగ్రంథమిట్లు శోకాంతముగ నిల్పుచేయక, సకల విధమగు నీతులను బోధించుచు శాంతి అనుశాసనిక పర్వముల జేర్చుట గొప్ప విశేషము. భీష్ముడు శరతల్పగతుడై ధర్మరాజు కెన్నియో నీతులు స్వయముగను ఇతిహాసములద్వారాను తెల్పిన వివరణములు ఇంకా యితర ఋషులుచేసి బోధనలును యీపర్వ ములలో చక్కగ వ్రాయబడినవి. ఈ రెండుపర్వములు నీతికి అహింసాబోధకు రత్నాకరమువలె నుండును. ఇందలి కొన్ని ఘట్టములు మాత్రము మనము గమనింతము.

అహింసాతత్వమునుబట్టియే, అతిథులుగ వచ్చినవారు శత్రు వులైనను, ఆదరింపవలెనేగాని బాధించగూడదని, ఈనీతిని పక్షు లును గమనించెనని శాంతిపర్వములోని యీ క్రింది కథ తెల్పు చున్నది.

కపోత లుబ్ధక సంవాదము :— ఒకప్పుడొక లుబ్ధకుడు♦ ఒక వర్షపురోజున, ఎక్కడను పక్షులు దొరకక, అడవిలో దిరుగు

* "అశ్వత్థామా హతః కుంజరః" అను శబ్దార్థము నిజమే, కాని, అక్కడ తన కొడుకే చనిపోయెనను భావము ద్రోణునికి తోచుటకే ఆయుక్తిని పన్నిరని ధర్మరాజుకు తెలియును. కనుక అందుల ఫలితముగ తరువాత ధర్మరాజు నరక లోకమునకు వెళ్లినాడు (స్వర్గారోహణపర్వము)

♦ లుబ్ధకుడనగ పిట్టలగొట్టి, వాటి మాంసమువల్ల జీవించువాడు.

చుండెను. వానకు పిట్టలన్నియు ఏమూలనో నక్కియున్నవి. వరద వల్ల వాగులు నిండి, దారిలేకుండెను. ఈస్థితిలో చలితో నతడొక్క చెట్టుక్రిందజేరి, అక్కడ చలితో నేలమీద వణకుచున్న ఒక ఆడ పావురమును బట్టుకొని, ఒక పంజరములో బెట్టెను. కాని ఆకలి కన్న నెక్కువ చలిచే బాధపడుచు అతడట్లే ముడుచుకొని పడి యుండెను. ఇంతలో మగపావుర మెక్కడనుండియో వచ్చి, తన సఖికై వెదుకుచు విచారించెను; అక్కడ లుబ్ధకుడు చలితో నేల బడి వడకుటను చూచెను; లుబ్ధకుడు తనకు శత్రువే, కాని తన చెట్టుయొద్ద నాశ్రయించియున్నాడు. లుబ్ధకుని చలిబాధచూచి, దయతో ఆపావురమా చుట్టుపట్లనున్న పీచు తెచ్చి రాపిడినిప్పుతో నంటించెను. ఆమంటకు కాగి, లుబ్ధకుడు తెప్పరిల్లి లేచెను. కాని హింసాపరుడగు లుబ్ధకుడు తన యాకలిబాధ నెట్లైన తీర్చుమని కోరెను. అది సమ్మతించి ఆహారముకై అంతటను వెదకెను. ఎక్కడను దొరకలేదు. తన మాట నిల్పుకొనుటకు ఆమగ పావురము మరల నిప్పుచేసి, అందు తానే ప్రవేశించెనట ; ఆయద్భుత చర్య చూడగనే లుబ్ధకుని హృదయము మారినది. పక్షి తనంత టనె శత్రువగు తనయాకలితీర్తునన్నమాట నిల్పుకొనుటకాత్మార్ప ణముచేయుటచూచి, "ఇంక నేను హింసాకృత్యము చేయను, నా జీవితము పాపభూయిష్టము" అని పశ్చాత్తాపమొందెను; అతడు వెంటనే పంజరములో నుండు పావురమును విడిచిపెట్టెను; తన సంసారమునుగూడవదలి, అతడు సన్న్యాసియై, అంతట మహాప్రస్థా నమునకు బయలుదేరిపోయెను. ఆయాడపావురము తన భర్త వియోగము సహింపలేక, తాను నాయగ్నిలో పడి మృతినొందెను. ఆపావురములు రెండు నిట్లు పుణ్యలోకము జేరినవి. అవి మరణించి స్వర్గమందు దివ్యులతో సమానముగ సుఖపడుచున్నట్లు లుబ్ధకునకు ప్రత్యక్షమైనవి. అంతట లుబ్ధకుడు తపస్వి యైనాడు. అతడు దావాగ్నిచే మృతుడై తానును స్వర్గము చేరెను.

ధర్మరాజు కొంతకాలము విరక్తుడై భీష్మునొద్ద ఉపదేశము బొందెనుగదా; అందులో శీల మెట్టిదిగ నుండవలెనని యడుగగా, ధర్మరాజుకు భీష్ముడిట్లు చెప్పెను "వేనిని హింసింపకూడదు. విరోధ పడకూడదు. ఎవరైనను కోపించినను తిట్టినను, మంగళముగనే మాట్లాడవలెను.* నరుడు కంటితోను వాఙ్మనః కాయములతోను చేయుపనులకు తగుఫలమునే పొందును. అహింసా సత్యాదులే సుఖమిచ్చును; పరులు తనకు చేయరాదను పనులు తాను ఇతరుల కాచరించకూడదు♦ భారత మంతటిలో భీష్మునిపాత్ర అద్భుతము. ఆయన తండ్రి సౌఖ్యమునకై రాజ్యాధికారము వదలిన మహా త్యాగి. ఆజీవము అఖండబ్రహ్మచర్యము జరిపిన మహానిగ్రహి. తనకు విరోధపక్షమైనను పాండవుల జయముగోరిన ఉదారుడు, శత్రువులకు తన జీవితము గుట్టుచెప్పి వారి గౌరవమునిల్పిన కరుణా మయుడు, అట్లు తనను బాధించినవారికి హితోపదేశము చేసిన ధీమంతుడు. భారతమందలి యీనీతులు బౌద్ధధర్మపు బోధల రీతినే యున్నవి. తరువాత అనుశాసన పర్వమందు బృహస్పతియు" వైదిక కర్మలన్నిటికంటె అహింసయే ప్రధానమని విశదపరచెనట§ రాజ్యాధికారమువచ్చిన తరువాత పాండవులు అశ్వమేధయాగము

* నహింస్యాత్సర్వ భూతాని మైత్రాయణ గతశ్చరేత్, నేదం జీవిత మాసాద్య వైరం కుర్వీత కేనచిత్.
క్రోధ్యమానః ప్రియం బ్రూయాత్ ఆక్రుష్టః కుశలం వదేత్
(మ. భా. శాంతిపర్వం 278 వ శ్లో॥ 5, 6)

§ అహింసా పాశ్రయం ధర్మం... కామక్రోధౌ చ
సంయమ్య తతః సిద్ధిమవాప్నుతే, ఆత్మోపమ
మస్తు భూతేషుయో వై భవతి పూరుషః, న్యస్త
దండో జితక్రోధో స ప్రేత్యసుఖ మేధతే,
(మ. భా. అనుశాసనపర్వం 113 వ అ. 3, 6 శ్లో)

♦ చక్షుషా మనసా వాచా కర్మణా చ చతుర్విధం।
కురుతే యాదృశం కర్మ తాదృశం ప్రతిపద్యతే
... దమః క్షమా హ్రీరహింసా వ్యవసితాదాత్మ్యం
చేతిసుఖావహాః......పరేషాం యదసూ
యేత నతత్కుర్యాన్నరః క్వచిత్ (మ. భా. శాంతి. 391వ. అ.16,20శ్లో.)

చేసిరట. అప్పుడును శ్రీకృష్ణుడర్జునితో నీతిబోధ సందర్భములో హింస అధర్మమని స్పష్టముచేసెను.* ఆయజ్ఞము పూర్తి యగుచుండగా సభలోనిఒకమూల బిలమునుండి ధర్ముడే ముంగి స్వరూపమునవచ్చి "ఈకూ్రర యాగములకన్న ఉంఛవృత్తి బ్రాహ్మణుడు జరిగించిన సక్తుప్రస్థదానమే ప్రశస్తము, పుణ్యము, సదుద్దేశముతో తనకున్నమట్టుకు మంచినీళ్లనిచ్చినను, అట్టిదానమే హింసా యాగముకన్న మేలు" అని చెప్పెనట.♦ అంతట జనమేజయుడు సందేహపడెను. పూర్వము దేవేంద్రుడు యజ్ఞములో వధకు పశువును తెచ్చినప్పుడు, కొందరు ఋషులు హింసాయజ్ఞము కూడదని ఆక్షేపించిరి. అప్పుడు చర్చ జరిగినది: కాని ఇంద్రుడు ఒప్పుకోనందున తేలలేదు. తరువాత అగస్త్యుడు ఋషుల నందరిని వప్పించి, జంతుహింస మాంసము లేకుండ, గింజలతోనే యజ్ఞముచేసి, అన్నతృప్తిచేసి యజ్ఞము చేసెను. అంతట ఇంద్రుడు కోపించి, ఆప్రాంతమందు వాన లేకుండను పంటలేకుండను చేసెను. అగస్త్యుడు మహా తపస్విగనుక మరొకప్రాంతమునుండి గింజలు తెప్పించి, అన్నదానముతో యజ్ఞపూర్తి జేసెను. తన తపోబలము వృద్ధిచేసుకొని, హింసాయజ్ఞమునే కోరు యింద్రుని పదభ్రష్టుని

---

* అహింసాపరమోధర్మః హింసా చాధర్మలక్షణం.

(మ- శా- అ॥- 43 వ ॥ 2 వ శ్లో)

♦ సక్తుప్రస్థేవనో నాయం యజ్ఞస్తుల్యో నరాధిపాః
ఉంఛవృత్తేర్వదాన్యస్య కురుక్షేత్ర నివాసినః॥ నధర్మః
ప్రీయతే తాత...శ్రద్ధా పూతైస్సతుష్యతి అత్ర మాం
సప్రదానేన శిబికాశీనరో నృపః ప్రాప్యపుణ్యకృతాన్
లోకాన్ మోదతే దివిసుప్రభః నయజ్ఞైర్వివిధై ర్విప్ర
యథాన్యాయేన సంచితైః నరాజసూయైః...ఫలం
ప్రాప్నుయాదంతిక (శ్లో 98.104) నాయం యజ్ఞ
కృతో ధర్మః నహింసాధర్మ ఉచ్యతే,

చేయబూనెను. అంతట ఇంద్రుడక్కడ వర్షము కురియునిచ్చి తన ఆటంకం మానుకొనెను. పిమ్మట ఋషులందరును నిరాటంకముగ అహింసా యజ్ఞమును సంతోషముతో సాగించుకొన్నారు. ఋషులందరును శాకాహారులు. మాంసము వర్జించినవారు.

యజతీజైః సహ్యాపాత్తు త్రివర్గపరశూషితైః
(మ- భా- అశ్వమేధ- 91 వ అ- 16 వ శ్లో)
భవతస్సమ్యగిష్టాతు బుద్ధిర్హింసా వివర్జితా ఏతామహింసాయజ్ఞేషు.

## అధ్యాయము. 19

### — అశోక కాలం —

బుద్ధుని ప్రయత్నంవల్ల రాజకీయ రంగంలోను విశేషకలహములు లేక దేశము శాంతమైయుండెను గదా. ఇట్లొక శతాబ్ది దాటెను శిశునాగులవంశ మంతరించి, మగధరాజగు నందుడు తన దుష్ప్రవర్తనవల్ల ప్రజలలో చాలమందికి విరోధియైనాడు. అతని మరణానంతరం రాజైన చంద్రగుప్తుడు చాణక్యుడను రాజనీతిజ్ఞుని సలహాతో మగధరాజ్యమును పాలించుచు, దానిని విస్తరింపజేసెను. ఇతడు చాల ఉదారుడు, చాణక్యుడు దుష్టులయెడ కఠినుడైనను నీతిప్రధానుడే, హృదయమందు దయయు, పరోపకారబుద్ధియు గల ప్రేమాత్ముడే. ఆపత్తు లేక బలమైనసంపత్తుగల్గి యుండుటని తన గురువగు చాణక్యు డుపదేశించెను.• ఆప్రకారం చంద్రగుప్తుడు అన్ని మతముల అన్నిజాతుల వారియందు సమభావముగల్గి, ప్రజలకిష్టుడై పాలించెను.

• పరోపకరణం యేషాం జాగర్తి హృదయేసతాం.
నశ్యంతి విపదస్తేషాం సంపదస్స్యుః పదే పదే॥
చాణక్య నీతిశాస్త్రం

అతని తరువాత కొడుకు "బిందుసారుడు" శాంతుడుగ నుండెను, ఇతనిపాలనలో యితనికొడుకు "అశోకుడు" కొంతకాలము వాయవ్యప్రాంతపు "తక్షశిల" ప్రాంతంలోను, తరువాత "ఉజ్జయిని" లోను తండ్రి తరఫున పాలకుడై, చాలబలీయుడై ప్రజ్ఞావంతుడైనాడు. ఆవిద్యాకేంద్రము లందతడు, విజ్ఞానమును సంపాదించెను. తండ్రితరువాత అశోకుడు మగధసామ్రాజ్యపు చక్రవర్తియై ఆర్యావర్తమంతను చక్కగపాలించుచు, ఇతరరాజుల కెంతమాత్రమును జంకక, మహాసమర్థుడై పాలించెను, అతడు సత్యప్రియుడు, నీతిమంతుడు.

అశోకుడు ప్రాచ్యదక్షిణాపథములగూడ నేకచ్ఛత్రముక్రిందకు తీసుకొనిరాదలచెను. అందుకై అతడు క్రీ. పూ. 260 ఆప్రాంతమందు తగు సన్నాహముతో కళింగదేశముపైకి అనగా మహానదికి గోదావరినదికి మధ్యనున్న ఆంధ్రోత్కళ రాజ్యముపైకి దండయాత్రచేసెను. అప్పుడు ఉభయపక్ష సేనలును చాల ధైర్యముతో పోరినవి. తుదకు అశోకుడే గెల్చెను. గోదావరివరకు యావత్తు దేశమును, అతని సామ్రాజ్యములో జేరినది. కాని ఆఘోరయుద్ధములో వేలకొలది జనులు రణరంగములో హతులైరి; ఇంక నెందరికో గాయములుతగిలి, యెన్నియో కుటుంబములు దుఃఖము పాలైనవి. ఇట్టియుద్ధముల భీభత్సదృశ్యములను చూచుట రాజులకు మామూలే. అశోకు డిదివరలో మధ్య పశ్చిమము లందెన్నియో యుద్ధముల జేసి యుండెను. కాని ఈకళింగ యుద్ధములో ఆయన హృదయము కరగినది. అంతటినుండి రక్తపాతమును హింసాచర్యలను చేయునని అమహానీయుడు వ్రతముపూనెను కనుక తక్కిన దక్షిణదేశము నశోకుడు సేనతో ముట్టడింప లేదు.

అశోకుని యీదృక్పథమునకును తక్కినవారిదానికిని చాల భేదము గల్గినది. అంతట ప్రపంచచరిత్రలో క్రొత్త యుగ మేర్పడినది. అశోకుడప్పటినుండి ప్రజాక్షేమమే తన యాదర్శముగ బెట్టుకొనెను. దేశమంతటను నానాప్రోవల సౌకర్యముకై చక్కని

విశాలమైన రస్తాల నిర్మించి, వాటి ప్రక్కలను జనుల సౌకర్యముకు చెట్లు పాతించెను.♦ సత్రములును, వసతిగృహములను కట్టించెను. నూతులు కాలువలు చెరువులు త్రవ్వించి, దేశమంతటను మంచి నీటి సదుపాయము గల్గించెను. వ్యవసాయ వ్యాపారముల సౌకర్యము గల్గించెను. ఆరోగ్య సదుపాయముల హెచ్చించెను. విద్యాబోధకును జనుల అజ్ఞానము పోగొట్టుటకును కట్టుదిట్టముల జేసెను. జనులందరును అహింసను నీతిని అవలంబించవలెనని, అకారణముగ ఎట్టి హింసాచర్యలను చేయకూడదని, ప్రజలందరిని ఆజ్ఞాపించెను. ప్రజలలో పరస్పర మైత్రి యేర్పడుటకు ప్రత్యేకపు యేర్పాటులు జరిగించెను. శిల్ప వ్యాపారములగూడ వృద్ధిజేసి జనులకు జీవనోపాధి గలిగించెను.

అశోకుడు అహింసాప్రవర్తకులగు బౌద్ధ భిక్షువులకు బౌద్ధ సంస్థలకు, చైత్య విహారాదులకు ద్రవ్యాది సహాయము చేయుచు, కొంతకాలముకు బౌద్ధధర్మమవలంబించెను. కాని, ఆయన తాను బౌద్ధుడనని బహిరంగముగ చెప్పలేదు. దానిని హిందూమతము గనే భావించి యుండును: ఆయన సాంప్రదాయిక హిందువులందును సమభావమునే చూపెను.

సాధ్యమైనంతవరకు జాతివిభేదములను కులకక్షలను పోగొట్టుటకే యత్నించెను.* ప్రజల సుఖమును హితము తనవియని ఆయన భావించెను.

అశోకుడు ఆయాప్రాంతపు లిపిలో తన సిద్ధాంతము నీతి ప్రజలకు తెలియునట్లు అహింసా సూత్రములను విశాలమైన పెద్ద

♦ ఉష్ణమగు మనదేశమందు రోడ్లకు రెండువైపులను చెట్లు బాటసారులకే గాక, పశుపక్ష్యాదులకును ఎంతో యుపయోగకరములు. అవి ఆర్థికముగను లాభకరములు. ఈపద్ధతిని కొందరు తరువాత రాజులును అవలంబించినారు.

* ప్రజాసుఖే సుఖం రాజ్ఞః, ప్రజానాం చ హితే హితం।
నాత్మప్రియం హితం రాజ్ఞః, ప్రజానాం తు ప్రియం హితం॥
(అర్థశాస్త్రము)

పెద్ద శిలాస్తంభములపైన అందరికిని తెలియునట్లు చెక్కించెను. ఇవి స్థిరమై తరతరముల వారికిని అహింసావశ్యకతను బోధించినవి. ఇవిగాక చాలచోట్ల చిన్న స్థంభములగూడ కట్టించి, వాటిపైనను తన యుపదేశములను తెలియపర్చెను. ఇందు కొన్ని నేటికిని నిల్చియున్నవి. ముఖ్య శాసనములలో నొకటి కళింగశాసనము. దీనిలో, అశోకుడు కళింగయుద్ధములో చూచిన రక్తపాతమును, అప్పటినుండి ఆయన అహింసావ్రతము పూనిన సంగతిని తానిక నవలంబించు ధర్మసిద్ధాంతములను ఉదహారించెను. *

అశోకుడు అహింసా ధర్మవ్యాప్తికి ఇంకను చాలవిధముల యత్నించెను. ఆయన తక్షశిల, కాశి. సారనాథం, నలాంద, రాజగృహ, మొదలగుచోట్ల బౌద్ధధర్మము ఉన్నతవిద్య విజ్ఞానము, వృద్ధియగుటకై, ఆవిద్యాసంస్థలను నెలకొల్పి విహారాదులను గొప్ప విద్వాంసులను పోషించెను. ధర్మాభివృద్ధికై ఇతరులను దానము చేయునట్లు ప్రోత్సహించెను. సామాన్యప్రజల వాడుకభాషయగు పాలీలో వాఙ్మయవృద్ధి చేయించెను. బుద్ధునిచరిత్ర వృత్తాంత ములకు బోధలకు సంబంధించిన వాఙ్మయమును పాటలీపుత్ర పుర ములో పండితసభ ద్వారా పరిష్కరించి, నిర్ధారణ చేయించెను.

ఆయన బౌద్ధమతమునకు అహింసాధర్మమునకు ప్రత్యేక ప్రాముఖ్యమిచ్చెను, బౌద్ధమతవ్యాప్తికై అన్ని ప్రాంతములకు విద్వాంసులగు ప్రచారకుల బంపెను. విదేశములకు, దక్షిణప్రాంతములకు రాయబారుల నంపెను. అశోకుడు ధార్మికచక్రవర్తి అని అప్పటి నాగరిక దేశము లంతటను పేరుగల్గినది. కనుక ఆయన ప్రతినిధులను ఆయా దేశముల రాజులు తమ రాజధానులందుంచుకొని విశేషముగ గౌరవించిరి. తమ రాజ్యములందు బౌద్ధమత బోధకు భారతశిల్ప ప్రచారమునకు తగు అవకాశమిచ్చిరి. ఆర్యబౌద్ధ

* కళింగశాసనమేగాక ఆంధ్రరాష్ట్రములో భట్టిప్రోలు, జగ్గయ్యపేట, ఈ శాంతచోట్ల నిర్మించిన శిలాశాసనములు ప్రసిద్ధములు.

సంస్కృతి అప్పుడు దక్షిణదేశమందును చీనా, గాంధారాది దేశములందును ఇంకను పశ్చిమమున సిరియా, పాలస్టీన్ వరకుకూడ వ్యాపించినది. ఆయన సూనువగు మహేంద్రుని, తన సోదరి యగు "సంఘమిత్ర" ను సింహళముకు పంపెను. బౌద్ధధర్మమే గాక పాలీభాషయు అప్పుడక్కడ వ్యాపించినవి. (నేటి సింహళ భాష పాలీకి పరిణామమే)

బలీయులు, ధీరులు, అవలంబించినప్పుడే అహింసాతత్వము బాగుగ శోభించి, వ్యాపించుననుటకు అశోకుని జీవిత చరిత్ర ప్రబలనిదర్శనము. అతడు మహా చక్రవర్తియైనను అతని భౌతిక సామ్రాజ్యముకన్న ధార్మిక సామ్రాజ్యమే అధికమై భారతదేశమంతటికేగాక, రమారమి అప్పటి నాగరిక ప్రపంచమంతటికిని వ్యాపించి, లోకముకు అమితోపకారముగల్గించినది. ఇట్టిలోకోత్తరుడగు మహారాజు ప్రపంచమందు మరి యెప్పుడును ఎక్కడను జనించలేదని హెచ్. జి వెల్సు మున్నగు పాశ్చాత్య విద్వాంసులును నిర్ణయించియున్నారు. ఇట్లాయన సుమారు 40 ఏండ్లు చక్కగ పాలించి ప్రజల సంతుష్టులను ఉదారులనుజేసి చనిపోయెను.

---

## అధ్యాయము 20.

### —◆ బౌద్ధ కావ్య సాహిత్యము ◆—

ఆ కాలపు కథా వాఙ్మయమందును అహింసా ప్రబోధ మున్నది. ఇది కాంతాసమ్మతముగ నుండుట సహజము◆ బౌద్ధ వాఙ్మయమందిట్టివి చాల యేర్పడినవి. చాల వరకివి పాలీభాషలో నున్నవి; కొన్ని సంస్కృతములోను కలవు. క్రీ॥ త॥ 2 వ శతాబ్ద ఆరంభమున అశ్వఘోషుడను మహాయానపక్షపు బౌద్ధకవి చాల గ్రంథముల రచియించెను. వీటిలో సంస్కృతమందలి "బుద్ధ చరిత్రము, సౌందర నందము'' ప్రధానమైనవి. ఇవి అలంకారికుల మహాకావ్య పద్ధతిని రామాయణమునుపోలి వ్రాయబడినవి. బుద్ధ చరిత్రములో అహింసా ప్రవక్తయగు బుద్ధదేవుని జీవిత చరిత్రయు బోధలును అనేక కథలతో మనోహరముగ వర్ణింపబడినవి. ఆయన జీవదయాపరుడై చేసిన ప్రజోపకారములగు పనులను, అహింసా ప్రచారమును సమయోచితముగ వివరించినారు.* "సౌందర నందము" లో ముఖ్యపాత్ర "నందుడు'' ఇతడు బుద్ధుని సవతి తమ్ముడు; తన భార్యయైన సుందరియందు అపరిమిత ప్రేమగల్గి తన సాంఘిక ధర్మమును మరచెను. సిద్ధార్థుడు బుద్ధుడై మొదట నందునికిని పిమ్మట సుందరికిని విశ్వప్రేమతత్వము బోధించి, వారిని శ్రమణ

---

◆ ఉపదేశము మూడు విధములుగ నుండవచ్చునని అలంకారికులందురు 1 ప్రభుసమ్మితము, ఆజ్ఞారూపమై, ధర్మంచర, మొదలగు వేదవిధులవంటివి. 2 సుహృత్సమ్మితములు- మహాభారతాదులవలె హింస చేయుటయు, అధర్మమును హానికరమెట్లగునో నిరూపించి నచ్చచెప్పుట. 3 కాంతాసమ్మితములు. ప్రత్యక్ష బోధగ నుండక కథలద్వారా ఆయాజనుల అనుభవమును తెలుపుచు చదువరుల హృదయముల ధ్వనిద్వారా నైతికభావము గల్గించుట, ఇదే ఉత్తమపద్ధతియందురు.

* ఈ కథను శ్రీ తిరుపతి వెంకటేశ్వర కవులు ప్రబంధముగను, మరికొందరు వచనముగను ఆంధ్రీకరించినారు. వీటిలో శ్రీ. చౌ. దుగ్గిరాల బలరామకృష్ణయ్య చౌదరిగారి బుద్ధపురాణములోను బుద్ధుని జీవితకథ యంతయు ఆయన బోధలును కలవు.

శిష్యులుగ జేసుకొన్న కథ యిందు విపులంగా వర్ణింపబడినది. ఈగ్రంథములో విశ్వమానవ సౌభ్రాతృపు ధర్మము సమయోచిత ముగ సూచితము.* కుటుంబప్రేమకన్న విశ్వప్రేమయే అన్ని విధములను ప్రశస్తమనుటే యిందలి ముఖ్య సిద్ధాంతము. పాలీ లోని కథాగ్రంథము లన్నిటిలో పెద్దది "బృహత్కథ" దీనిని "గుణాఢ్యు"డను విద్వాంసుడు రచించెను. అతడు ఆంధ్ర సామ్రా జ్యపు ప్రతిష్ఠాన ప్రాంతములోని "సుప్రతిష్ఠిత" మను పురమందొక బ్రాహ్మణయువతికొక నాగరాజన్యునివల్ల జనించెను; ఆంధ్రచక్ర వర్తియగు శాతవాహనుని మిత్రుడై, కొంతకాలమతని మంత్రి యైనాడట• అతడీ గ్రంథమును అప్పుడు పైశాచీ భాషలో వ్రాసెను. ఈమహాగ్రంథము ఏడులక్షల శ్లోకములదై; 7 భాగ ములుగ విభజింపబడెను. అప్పటికి జనులలో వ్యాపించిన చిత్ర కథలన్నీ యిందులో చేరినవి: ఈగ్రంథమంతయు దొరికియుంటే అప్పటి ఆంధ్రసామ్రాజ్యపు దేశపరిస్థితులు, అప్పటి సంస్కృతి సాంఘిక విశేషములు బాగుగ తెలిసియుండేవి. గ్రంథకర్త యీ రచనను శాతవాహనునికి వినిపించగా, అతడు "ఇంతటి మహా గ్రంథమును పైశాచిలో వ్రాసినారే" అని మొదట చులకన జేసెనట. అంతట తన శ్రమ వ్యర్థమైనదని గుణాఢ్యుడు నిరు త్సాహపడి, ఏకాంతముగ ఊరిబయట ఆమహాగ్రంథపు ఒక్కొక తాళపత్రమును చదివి, అగ్నిలో బడవేయుచుండెనట. ఈసంగతి శాతవాహనుడు విని వెంటనే వచ్చి ఆపుచేయించెను. కాని అప్ప టికి 6 భాగములు దగ్ధమై 7 వ లక్ష మాత్రమే మిగిలెనట, అదియు చాల విపులమే. పంచతంత్రము హితోపదేశము మొద లగు సంస్కృత గ్రంథముల కథలు బృహత్కథలో నున్నవి . .

---

* ఈపాత్రలనే తీసుకొని కథలో మార్పుచేసి ఈ పేరుతోనే, శ్రీ పింగళి లక్ష్మీకాంతంగారు, కా. వెంకటేశ్వరరావుగారు ఆంధ్రములో చక్కని ప్రబంధము రచించినారు.

• కథాసరిత్సాగరం: 1 వ లంబకం 6 తరంగం చూడుడు.

అందుకొన్ని తరువాత పారసీ, గ్రీకు భాషలకును వాటి నుండి ఇప్పుడు ఇంగ్లీషు ఫ్రెంచి వగైరా భాషలలోనికిని తర్జుమాలై Aesop's Fables మొదలగు పేరిట పాశ్చాత్య లోక మంతటను అమలులోనున్నవి. మనదేశమందు కాళిదాసు విక్రమోర్వశీయముకు సుబంధువు వాసవదత్తకు, హర్షుడు నాగానందాది నాటకములకు, భవభూతి మాలతీమాధవముకు, విశాఖదత్తుడు ముద్రారాక్షసముకు, తీసుకొన్న కథావస్తువులు బృహత్కథలోనున్నవే, ఈబృహత్కథకొక సంగ్రహమును క్షేమేంద్రుడు రచించెనట.♦ కాని, అది అతి సంగ్రహముగనున్నదని దాసిభావమంతను క్లుప్తముగ సోమదేవకవి "కథాసరిత్సాగర" మను పేర సంస్కృతములో కొద్దిమార్పులతో రచించెను. బృహత్కథ మూలము యిప్పుడు ఖలమైపోయినది.

ఈ మహాగ్రంథమందలి కథలను శ్రీ శివుడు పార్వతీదేవికి రహస్యముగ జెప్పెనట. అనుచరుడగు పుష్పదంతుడు చాటునుండి విని, శప్తుడై, భూలోకమందు మాల్యవంతునిద్వారా గుణాఢ్యునికి తెల్పిరట. ఇందలి వత్సరాజుకథలు, కాకోలూకకథ, బ్రాహ్మణుడు మేక, వగైరా కథలు, నందరికిని తెలిసినవే. వత్సరాజు ప్రద్యోతుని కొమార్తె యగు వాసవదత్త నెత్తుకొనివచ్చి, పెండ్లియాడెను. అతడు ఉదయనుడని ప్రసిద్ధుడై కౌశాంబినుండి గొప్పరాజ్యము పాలించెను. అతని కొడుకు నరవాహనదత్తుడనేక కష్ట సుఖముల పాలైనాడు. ఇదే ముఖ్యకథ. ఇందులో తక్కిన అవాంతరకథలు సందర్భోచితముగ చేర్చబడినవి. ఇందలి కొన్ని కథలు అహింసాతత్వమును ధ్వనిరూపముగ బోధించును. అందు రెండు మూడింటిని గమనింతము.

---

♦ ఇదిగాక బుధస్వామి అను కవి దీనినుండియే శ్లోకసంగ్రహమను సంస్కృత గ్రంథము తయారుచేసెను. దీనికిని కథాసరిత్సాగరమునకును కొన్ని చోట్ల కథలలో భేదమున్నది.

## —◆ జీమూతవాహనుని చరిత్ర ‡ ◆—

హిమాలయపు కొండలలో ఒక చిన్న రాజ్యమందు జీమూతకేతువను రాజుండెను. ఆయనకు జీమూతవాహనుడేక పుత్రుడు. ఈతని భూతదయ అపారమైనది, అతడు యువరాజై ప్రజలను సుఖపెట్టుటకే నిరంతరము కష్టపడుచుండెను. ప్రజలు దుర్భర దారిద్ర్యముతో బాధపడుచుంటే తనవంటి కొద్దిమంది రాజరికమందు విభవమనుభవించుట అతని కిష్టములేదు. ఆరాజు నింట వంశానుగతమగు కల్పవృక్ష ముండెనట. దానిని జీమూతవాహనుడు నిర్వ్యాజ ప్రేమభక్తులతో సేవించెను. అంత నా దేవతరువు ప్రసన్నమై, "నీకేమి కావలె, కోరుము" అని యడిగెను. అతడు తనస్వంతమున కేమీ కోర లేదు, ఈభూమియంతను దరిద్రత లేకుండ జేయుము; నిన్ను లోకమునకిచ్చినాను నీసహాయము లోకమంతకు చేయుము అని కోరెను.*

అట్లే అందరికిని సమృద్ధి గల్గినది. "దయాళువగు జీమూతవాహనుని ఔదార్యముననే యిట్లైనది; అతడు బోధిసత్వపు అంశమే'' అని అందరును శ్లాఘించిరి.* కాని, రాజుగారి జ్ఞాతులు మాత్రమసూయావిష్టులై, ఆరాజ్యాధికారము హరింపవలెనని, వారు రాజుతో కయ్యముకు కాలుదువ్విరి. యుద్ధము తప్పనట్లుండెను. జీమూతవాహనుడాసంగతి గ్రహించి, "యుద్ధము జననాశకము, రాజ్యముకై రక్తపాతము చేయవద్దు. జ్ఞాతులే రాజ్యము పాలింపనిమ్ము" అని తండ్రితో చెప్పి, తాను రాజ్యమువదలి, వనము జేరెను; అంతట తండ్రియు అతని ననుసరించెను. ఇట్లు బుద్ధుని వలె అఖండత్యాగము చేసి, జీమూతవాహనుడు మలయాచలము కేగి, అక్కడి ప్రకృతి దృశ్యములో నిమిడియున్న ఈశ్వర మహాత్వ

‡ కథాసరిత్సాగరం 4 వ లంబకం, 2 వ తరంగం

* అదరిద్రాంకురుష్వే తేంపృథివీ మఖిలాంసఖే స్వస్త్యస్తు తేప్రదత్తోసి, లోకాయ ద్రవిణార్థినే. (కథాసరిత్సాగరం)

* దయాళురోస్యబోధిసత్వాంశో నూనం జీమూతవాహనాత్ ।
[illegible] (కథాసరిత్సాగరం)

మును గ్రహించుచు ఆనందించుచు, తండ్రికి సేవ చేయుచుండెను. కొంత కాలమున కక్కడ విద్యాధరరాజు కొడుకగు మిత్రావసునితో నతనికి స్నేహమేర్పడెను. మిత్రావసుని చెల్లెలు "మలయవతి" ఆశాంతప్రదేశములో అద్భుతముగ గానము చేయుచుండెను. అంతట వారిద్దరికి పరస్పర ప్రేమగల్గెను. సౌమ్య తేజోవంతుడగు జీమూతవాహను డిట్లు విద్యాధరరాజు కల్లుడైనాడు. కాని, అతడాకొండలందే యుండెను.

ఇట్లుండగా ఒకనాడొకమూల నొక నాగస్త్రీ యేడ్చుచుండెను; తన కొడుకును వెనుకకు లాగుచుండెను. ఏమని యడుగగా ఆమె తనకథ నిట్లుచెప్పెను. "కశ్యపునికి కద్రూ, వినతలని యిద్దరు భార్యలు. సూర్యుని గుర్రపుతోక నల్లదని కద్రువు, తెల్లదని వినత, తగువులాడిరి: ఓడినవారు రెండవవారికి దాసిగ నుండవలెనని పందెము వేసుకొనిరి. అది నిజముగా తెల్లదే; కాని తల్లిపంతము నెగ్గించుటకు కద్రువు పిల్లలగు నల్లని కాలసర్పములు ఆపరీక్షాసమయమందు ఆగుర్రపుతోక నంతను గట్టిగ చుట్టుకొనెను. కనుక పందెములో వినతయోడి, కద్రువుకు దాసియైనది. వినత కొడుకగు గరుడుడు ఆసర్పములను మోయవలసివచ్చెను. ఈస్థితి అతికష్టముగ నుండెను. ఈదాస్యమునుండి విముక్తి యెట్లని అడుగగా, స్వర్గమునుండి ఒకసారి అమృతభాండము తెచ్చి నాపిల్లల యెదుట బెట్టుము ; అట్లు జరిగినవెంటనే మీకు దాస్యమునుండి విడుదల" యగు నని కద్రువు తనసర్పముల కోరికపైని చెప్పెను. తల్లి మోక్షముకై తానాపని చేసెదనని, అమిత బలుడైన గరుడుడు ఎగిరి, స్వర్గముజేరి, ఇంద్రునాశ్రయించి, మనవిచేసెను. హింసాత్మకులగు సర్పజాతి కమృతము పోయుట నరజాతికి ప్రమాదకరము ; ఐనను కొనిపొమ్ము, కాని అక్కడ నిలవయుంచుటకు వీలులేదు." అని చెప్పి యింద్రుడు, ఆయమృతభాండపుమూతిపైన గట్టి దర్భల నల్లియిచ్చి వెంటనే మరొకభటుని మరొక భాండములో వెంటనే అమృతమును తెమ్మని పంపెను. ఎంతో కష్టపడి

గరుడుడద్భుతబలముతో నెగురుచువచ్చి, ఆభాండమును కద్రువు నాగులున్నచోట బెట్టెను. వెంటనే వినతకు కద్రువు విడుదల యిచ్చెను. అంతట నాగములు స్నానముచేసి వచ్చెను. యీలోగా అందలి యమృతము నింద్రభటుడు తీసుకపోయెను. అమృత భాండమును తొందరతో నన్నిప్రక్కలనుండియు నాకబోయినవి. తొందరలో దర్భల యల్లిక తగిలి వాటి నాలుకలు తెగి, ద్విజిహ్వములైనవి* ఇన్నాళ్లు తనను తల్లిని హింసపెట్టిన సర్పముల నాహారముగ తినుటకు గరుడుడు దేవతలయొద్ద వరము పొంది నాగులన్నిటిని నిరంతమును చంపదొడగెను. అంతట నాగజాతి నశించుచున్నందున రోజుకొక నాగముచొప్పున గరుడునికి నాగరా జొప్పగించుటకు, గరుడుడట్టి నాగమునుమాత్రము చంపి తినుట కును, రాజీ జరిగినది. ఆప్రకారం, రోజుకొక నాగమీ కొండ కొనను నిల్చును. గరుడుడిక్కడనే తిని వాటి యెముకలమాత్ర మిక్కడ విడుచును. అదే ఆతెల్లని యెముకలగుట్ట; యీరోజున నాకొడుకు దే వంతు, నాకొక్కే కొడుకు; అందువల్ల నాదుఃఖ మాగుటలేదు.” “అని నాగస్త్రీ చెప్పి యేడ్చెను. సహజముగ దయాశీలుడగు జీమూతవాహను డీశోకకథవిని, ఆనాగుని రక్షింప నిశ్చయించెను; కాని, ఎట్లు? అతడా నాగ యువతిని తల్లిని వెనుకకు పొమ్మని పంపి, వధ్యచిహ్నమగు రక్తాంబరమును తానే ధరించి, మనిషి ఆనవాలు తెలియకుండ ఆకొండ చివర నాగము వలె చుట్టుకొని పండుకొనెను. రివాజు ప్రకారం గరుడాస్త్రల మందు పైనుండి వ్రాలి, రక్తాంబరము క్రిందనున్నది మామూలు వలె నాగమనియెంచి, ఉక్కుమేకులవంటి తన ముక్కుతో గట్టిగ పొడిచెను; రక్తప్రవాహమారంభించెను. మాంసము మరొకరీతి నున్నదని సందేహించి, గరుడుడు వస్త్రము తీసి చూచెను. అంతట ప్రమాదము జరిగినదని గ్రహించి, గరుడుడు వెంటనే జీమూత వాహనుని “మీరెవరు నేను తెలియక మిమ్ము పొడిచినాను” అని

* ఇప్పటికిని సర్పములన్నియు ద్విజిహ్వములని కవి సంప్రదాయము.

విచారముతో నడిగెను. ఎవరైననేమి తినుమని జీమూతవాహను డెంత జెప్పినను, అట్లుచేయక, గరుడుడు నిజస్థితిని తెలుసుకొనెను. అంతట గరుడుడు తాను అట్టి దయాశీలుని రక్తము కార్చినందుకు మహాపాపము చేసినానని, క్షమించి తన పాపముకు నిష్కృతి గల్గింపుమని ప్రార్థించెను. ఇకముందెన్నడు ఇట్లు నాగముల జంపకుండ వాగ్దానము చేయుమని జీమూతవాహనుడుకోరి, గరుడునిచే నట్టి వాగ్దానము చేయించుకొనెను. అప్పటినుండి గరుడుడు నాగులను వ్యర్థముగ హింసించుట మానివేసెను. యీలోగా రక్తస్రావము హెచ్చి, జీముతవాహనుడు నీరసించెను. అప్పుడు జీమూతవాహనుని భార్య, తండ్రి, బావమరిది వగైరాలు అతనికై వెదకుచు వచ్చి, అతడు మరణాసన్నుడై నాడని శోకించి, దేవుని ప్రార్థించిరి. జీమూతవాహనుని లోకోత్తరత్యాగముజూచి, గౌరీదేవి వెంటనే అక్కడ ప్రత్యక్షమై, అతని గాయములు పోయి ఆరోగ్యము గల్గునట్లు చేసెను. గౌరీదేవి "జీమూతవాహనా, నీ ఆత్మార్పణము అద్భుతమైనది. ఇట్టి ఆదర్శత్యాగము దుర్లభము. నీవు కోరు వరమిచ్చెదను'' అనెను. ఇదివరలో ఆకొండపైన చచ్చిన నాగులన్నియు పునరుజ్జీవితమగునట్లు జీమూత వాహనుడు కోరెను. అట్లు పార్వతీదేవి జరిగించెను.

ఈకథలో మానవునిలో నెంత త్యాగశక్తి సాధ్యమగునో అంతయు కనపర్చబడినది. ఆత్మార్పణచేసియైనను దీనుల రక్షించుట ఉత్తమ ధర్మమను సంగతిని, ఈకథనుండి మనము గ్రహింపదగును. జీవరక్షణ మన్నిటికన్నను గొప్పది. (ఈకథనే హర్ష చక్రవర్తి నాగానంద రూపముగ రచించెను). విద్యాధరులందరి కోరికపైన జీమూతవాహనుడు తుదకు విద్యాధర రాజయినాడని గూడ చెప్పబడినది. జ్ఞాతి కలహమువల్ల యుద్ధముకు సిద్ధమై వేలకొలది జనులకు మరణము గల్గించుట చాలతప్పు. "రాజత్వమొక కరిజన్మహక్కు కాదు; అది ప్రజల నుద్ధరించుట కుద్దేశించిన ధర్మ బాధ్యత.

యే" అని గ్రహించియే. జీమూత వాహనుడు రాజ్యాశ లేకుండ, దేశపు శాంతస్థితి కాపాడెను. అట్టి మహనీయునకే రాజ్యపాలనమును ప్రజాభిప్రాయముద్వారా భగవంతు డిచ్చుట సహజమే.

## —♦ వణిక్పుత్ర కథ§ ♦—

వితస్తా నదీతీరమందు తక్షశిలా నగరము వెలయుచుండెను. ఆప్రాంతపురాజగు కళింగదత్తుడు ఆనగరమునుండిపాలించుచుండెను. ఆపురములో వితస్తాదత్తుడను వర్తకుడుండెను; అతడు బుద్ధదేవుని శిష్యుడు; అతడు విద్వాంసులగు బౌద్ధశ్రమణకులను గౌరవించుచు, బౌద్ధధర్మవ్యాప్తికై సహాయముచేయుచుండెను. అది అతని కొడుకగు "రత్నదత్తుని కిష్టము లేదు. తండ్రి నతడు తరుచు నిందించుచు వేధించుచుండెను, తమ విహారములందు నిమ్నజాతీయులను గూడ కలుపుకొనుచు జాతి సాంకర్యముచేయు శ్రమణకుల నాదరింపకూడదు, వారు బ్రాహ్మణులకు ప్రత్యేక గౌరవమీయరు. అందువల్ల ధర్మభంగమగును, అని కొడుకువాదము. "ధర్మమొక కక్షది. వర్ణపుదికాదు, బ్రాహ్మణులకును కామ క్రోధాదులు, ద్రవ్యాసక్తి ఉండకూడదు. ఇప్పుడు బౌద్ధధర్మము ప్రజాసామాన్యమునకు మేలుచేయునది; అది అహింసను, పరోపకారమును బోధించును. అట్టి మతమందభిమానముంచుట అధర్మముకాదు" అని తండ్రి చెప్పెను♦ కాని, కొడుకు పూర్వసంప్రదాయమే పవిత్ర

§ కథా సరిత్సాగరం, 6 వ లంబకం, 1 వ తరంగం

"తక్షశిల" పంజాబులోని విద్యాకేంద్రమగు నగరముగను రాజధానిగను పూర్వముండెను

♦ బ్రాహ్మణ్యమపి తత్ప్రాహుః యద్రాగాది వివర్జితం । సర్వం దయాచ భూతేషు సమ్యక్ సాజాతి విగ్రహః॥ కించ ధర్మ్యస్తమేకత్ర సర్వభూతాభయప్రదం... భూతేష్వభయదానేన నాన్యోపకృతిర్మమ । తదహింసావిధాస్వస్మిన్ వత్స మోక్షప్రదాయిని, ధర్మే నేతిరతి శ్చేన్మే, తదధర్మో మతస్తవ॥

కథాసరిత్సాగరం- 6 వ లం. 1 వ తః

మనుచు తండ్రిని మరింత బాధించెను. బాధపడలేక తండ్రివచ్చి రాజుతో చెప్పుకొనెను. రాజు కొడుకును పిలిపించి బోధించెను; కాని అతడు పట్టుపట్టెను. అంతట రాజు కోపము వచ్చినట్లుండి "నీవు గొప్ప నేరము చేసినావు, నీకిందుకు శిక్ష ఉరియే. కాని నిన్ను రెండు నెలలవరకు ఉరితీయరు అంతవరకు నీవు తండ్రి యింటివద్దనే ఉండవచ్చును" అని రత్నదత్తుని తండ్రియింటికి పంపెను.

ఆరోజునుండి అతనికి తన చావుసంగతియే జ్ఞప్తికి వచ్చుచుండెను. అన్నపు హితవు పోయినది. ఆరెండు నెలలును అతడు బెంగపడి తిండి తినలేకపోయెను. అంతట రాజతనిని రప్పించెను. "ఏమి, నీవిట్లు చిక్కి శల్యమైయున్నావు. నేను నిన్నింతవరకు అన్నము తినవద్దన్నానా ?'' అని రాజడిగెను. "మీరు నాకు మరణశిక్ష చెప్పినప్పటినుండి నాకు అన్నము రుచిగలేదు ; నాకు మతిబోయినది ; చావు నాపైన బడుచున్నట్లున్నది" అని రత్నదత్తుడు దీనముగ జవాబిచ్చెను. అప్పుడు "అబ్బే, నీకు నిజంగా మరణశిక్ష లేదు, మృత్యుభయ మెట్టిదో నీకు తెలియుటకే అట్లంటిని" అని రాజు చెప్పెను. "మృతుభయముపోయి మోక్షము గల్గించుటకే బౌద్ధధర్మ ముపయోగించును. అహింసయు పరోపకారమునే పరమార్థమైనవి, రక్షకములు ; వాటికై యత్నింపవలెను ; కనుక, నీ తండ్రి ధోరణిలో తప్పు లేదు'' అని బోధించెను. అంతట వణిక్పుత్రుడు బుద్ధి తెచ్చుకొని, కృతజ్ఞుడై, "నాకు నట్టి ధ్యానము గల్గింపుడు" అని కోరెను. అంతట రాజు తైలముతో నుండిన గిన్నెనొకదానిని అతని శిరస్సుమీద పెట్టించి, "దీనితో నీవీ నగరవీధులు తిరిగి రావలెను. ఐతే, ఇందొక్క చుక్కయైనను ఈ నూనె గిన్నెనుండి క్రింద జారకూడదు. అట్లు జరిగితే, నా భటులు నిన్ను వెంటనే చంపగలరు." అనియిద్దరు రాజభటులను విచ్చుకత్తులతో వెంటబంపెను. అప్పుడా కోమటిబిడ్డ అతిజాగ్రత్తతో పుర వీధులంతటను ఆగిన్నెతో తిరిగి ఎక్కడను చమురు

త్రోణకకుండనే చేరగల్గెను. అంతట రాజతనిని "ఏమయ్యా, పుర వీధులలో ఏమేమి జరుగుచున్నవి" అని యడిగెను. అతడు "ఏమో, నేను వీధులవైపు చూడలేదు, నాధ్యానమంతయు గిన్నెపైనే యుండినది. చమురొలుకునేమో యని ప్రాణభయముతోనుంటిని" అనెను. "చూచితివా, నీకు మరణ భయముండబట్టి ఏకాగ్రుడవై జాగ్రత్తతో మెలగితివి. ఇట్లే నీవు ఇంద్రియ వశుడవుగాకుండ స్వవిషయమందును ఏకాగ్రుడవుగనే ఉండు. ఆంతరిక ధ్యానము పెట్టుకో, అప్పుడు నీకు తత్వము తెలిసి, కర్మబంధము పోవును. యోగ్యవర్తనముంటే, మోక్షము వచ్చును" అని హితబోధచేసెను•

## నాగార్జున కథ.

ఈ గ్రంథంలో నాగార్జున కథ యొకటి గలదు. ప్రసిద్ధ విద్వాంసుడు, బౌద్ధ ప్రచారకుడు, జ్ఞాని, రాజ్యాంగ నిపుణుడు అగు నాగార్జునుడు కొంతకాలమాంధ్రదేశమందుండెను. నేటికిని "నాగార్జునకొండ" అతనికి స్మారకముగ నున్నది. ఐతే, ఈక్రింది కథలోని నాగార్జునుడు అతడో మరొకడో తెలియదు.

నాగార్జునుడు బోధిసత్వునియంశమై, చాల దయాళువై యుండెను. "చిరాయు" రాజ్యముకు "చిరాయు" అను రాజుండెను. నాగార్జునుడతనిమంత్రి, అతడు ప్రజల కన్నివిధములను న్యాయము జరిగించుచుండెను. లోకోపకారముకై, నాగార్జునుడు బాగుగ శాస్త్రపరిశోధనచేసి, నరులకు జరామరణములు పోగొట్ట గల ఔషధపు ప్రక్రియ గనిపెట్టెను. తనరాజు కట్టి ఔషధమిచ్చి, అతని ఆయుస్సు హెచ్చించెను. అప్పుడు నాగార్జునుని ముద్దుల

• ఏకాగ్రోఽపి హి బహిర్వృత్తి నివృత్తః తత్వమీక్షతే
దృష్టతత్వశ్చన పునః కర్మజాతే నబధ్యతే॥

కథాసరిత్సాగరం : 7 వ లం॥ 7 వ త॥

కొడుకు బాల్యమందేపోయెను. అంతట నాగార్జునుడు తన మహా దుఃఖమును భూతదయగ మార్చుకొని, తక్కినవారికి అట్టి అకాల మరణపు దుఃఖము రాకుండుటకై, అందరికి నుపయోగించు సంజీవనిని తయారుచేయు యత్నములో నుండెను. అది కొంతవరకు సిద్ధమైనది. ఇందు్రిడామాటవిని, "నరులకు మరణమే లేకుంటే లోకము గొప్ప ప్రమాదము పాలగును" అని నచ్చచెప్పి ఆప్రయత్నమంతటితో మాన్పించెను. ఇట్లతడు తయారగుచున్న ఔషధమును నేలపాలు చేసెనట.

రాజు కొడుకగు "జీవహారుడు" చాలకాలముక్రిందనే యువ రాజాయెను. కాని, తండ్రి అల్లే శతాబ్దముల కొలదిగ జీవించు చుండెను. తనకు రాజ్యాధికారమిక వచ్చునెప్పుడు? ఇట్టిస్థితికి మంత్రియే కారకుడు, కనుక అతనిని చంపుదునని తలచి, యువ రాజు మంత్రిని చంపించెను. మంత్రి దుర్మరణము సంగతి విని రాజు వైరాగ్యముతో నడవికి బోయెను. కాని, జీవహింస ప్రతి హింసకు కారణమగునుగదా? నాగార్జునుని కొడుకులు రోషా విష్టులై, క్రొత్తగ రాజైన జీవహారుని జంపివేసిరట. ఇట్లు రాజ్యా పేక్షవల్ల తండ్రి మంత్రిని జంపిన జీవహారుని కారాజ్యముతో బాటు ప్రాణహానిగూడ గల్గినది. కనుక, హింస తుదకు దుష్ఫలితమునే యిచ్చునని యీకథ సూచించుచున్నది.

## అధ్యాయము 21.

### స్మృతికాల సంస్కృతి.

సుమారు ఇతిహాస రచనకాలమందే ఇప్పుడున్న సంస్కృత స్మృతులేర్పడినవి. మనుస్మృతి, పరాశరస్మృతి, యాజ్ఞ వల్క్యస్మృతి, వగైరా ఆయా ఋషుల స్మృతులలో ముఖ్యము.

మనుస్మృతి‡ దీనిలోను కొన్ని శ్లోకములు ప్రక్షిప్తములని కొందరి భావన ; అసలు మనువు ఈ స్మృతికాలముకన్న ప్రాచీనుడు, ఆవృద్ధమనువు గ్రంథమిప్పుడు లేదు, అందలి కొన్ని శ్లోకములిప్పటి స్మృతిలో చేరియుండును.

వేదకాలమందువలెగాక, స్మృతికాలమందు వర్ణవ్యవస్థ జన్మప్రధానమగు పద్ధతి వచ్చినది. ఆ యా వర్ణములుబట్టియే వృత్తుల జేసుకొనుచుండిరి. పూర్వపు ఆర్యులు, దాసులు, రాక్షసులు, వానరులు, నాగులు వగైరా జాతిభేదములు పోయినవి. అయితే వర్ణములు మొదటి వృత్తినిబట్టి యేర్పడియుండును.

బ్రహ్మమనగా విద్య, విజ్ఞానము, దేవుడు. ఈ విషయమై ప్రత్యేక కృషిచేయువారు మొదట సర్వము జగత్తు బ్రాహ్మమై నట్లు అందు కొందరు క్షాత్రకార్యముల జేసి క్షత్రియులైరి. కృషి వాణిజ్య పరులైనవారు వైశ్యులనిపించుకొనిరని సర్వకర్మల జేయుచు హింసానృతపరులై లుబ్ధులై శుచిత్వం వదలిన ద్విజులే శూద్రత్వమొందిరి. అని మహాభారతంలో చెప్పినారు* గీతలోను గుణకర్మలనుబట్టి చాతుర్వర్ణ్యమేర్పర్చితిమన్నారు.♦ "గుణకర్మలలో మార్పునుబట్టి శూద్రుడు బ్రాహ్మణుడగును; బ్రాహ్మణుడు నిట్లే శూద్రుడగును" అని మనుస్మృతిలో చెప్పియున్నారు§

---

‡ మన ప్రస్తుత విషయమున ఆయా స్మృతులలో అంతగా భేదంలేదు. ముఖ్యమైన మనుస్మృతినే చర్చకాధారముగ దీసుకోవచ్చును.

* నవిశేషోస్తి వర్ణానాం సర్వం బ్రాహ్మమిదం జగత్ | కామభోగ ప్రియాస్తీక్ష్ణాః క్రోధనాః ప్రియసాహసాః|| త్యక్త స్వధర్మరక్తాంగాస్తే ద్విజాః క్షత్రతాంగతాః|| గోభ్యోవృత్తిం సమాస్థాయ | పీతాః కృష్యుపజీవినః|| స్వధర్మాన్నానుతిష్ఠంతి తేద్విజావైశ్యతాంగతాః|| హింసానృత ప్రియా లుబ్ధాస్సర్వకర్మోపజీవినః | కృష్ణాశ్శౌచ పరిభ్రష్టాస్తే ద్విజాశ్శూద్రతాంగతాః|| (మ. భా. శాంతిపర్వ. 188 శ్లో. 10-13)

♦ చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మ విభాగశః (భ. గీ. 4-13)

§ శూద్రో బ్రాహ్మణతామేతి బ్రాహ్మణశ్చైతి శూద్రతాం| క్షత్రియాజ్జాతమేవంతు విద్యాద్వైశ్యాత్తథైవచ-(మనుస్మృతి: 10-65)

వివాహాదులలోను మొదట స్వేచ్ఛ యధికముగనుండి, క్రమముగ నియమములు హెచ్చినవని, కొందరి యభిప్రాయము. వంశపారంపర్యముగ ఆయావృత్తులను బాల్యమునుండి జనులలవర్చు కొనుటచే ఆయా కర్మ విద్యలందు శిల్పప్రజ్ఞ హస్తనైపుణ్యము హెచ్చెను. ఈపద్ధతియే చిరకాలముండిన తరువాత ఆయా కుల ములమధ్య వైషమ్యము విభేదములు గల్గినవి. శూద్రులు సేవా వృత్తి వారన్నను, చాలమంది శిల్పకళలో ప్రవీణులై వివిధవస్తు వుల నిర్మించుచుండిరి. వైశ్యులు కృషి.గోరక్షవాణిజ్యముల జేయు చుండిరి. క్షత్రియులు దేశరక్షణ శాంతి స్థాపన జేయుచుండిరి. అన్నిటికన్న ఎక్కువ బాధ్యతగలది బ్రాహ్మణవర్ణము. ఆకాల మందు అన్ని దేశాలలోను, కొద్ది నేరములకును కూ్రరశిక్షలు విధించిరి. అదియు కొంత హింసాతత్వముకు సూచకము. బ్రాహ్మ ణులు బాల్యమందే ఉపనీతులై, తల్లిదండ్రుల విడచి వనములో. ఒక గురువుగారి ఆశ్రమమందు శిష్యులై, అక్కడ విద్యాభ్యాసము చేయవలెను; వేద వేదాంగముల నిదర్శనములను నేర్చుచుండిరి. ఇంతేగాక, ప్రతి బ్రాహ్మణుడు ఏదో అభిమానవిద్యగూడ గ్రహించుచుండెను. దర్శనశాస్త్రము, ఆయుర్వేదము, ధను ర్వేదము, ఖగోళశాస్త్రము, ప్రకృతి విజ్ఞానము, రసాయనము, వాస్తువిద్య, న్యాయశాస్త్రము, ఇట్టి విద్యలలో నొకదానిలో ప్రవీణులై 24 వ యేటను విద్య పూర్తిచేయుచుండిరి. వీరట్టి విద్యలలో విశేష పరిశోధన జేసి తాము కనిపెట్టిన విశేషములను తరువాత ఇతరులకు బోధించి గ్రంధరూపమున జేయుచుండిరి. విద్యార్థులు ఆస్తిసంపర్కము లేకుండ కేవలం భిక్షవల్లనే జీవిం చుచు, నిగ్రహవంతులై అహింసాత్మకులై యుండవలెను. బ్రాహ్మణులు గృహస్థులైనతరువాతను ముఖ్యముగ విద్యనేర్పుట, ధర్మశాస్త్రనియమముల జెప్పుట, మొదలగు పనులనే జేయు చుండిరి. విశేషద్రవ్యార్జనకుద్దేశించు వ్యాపారాదుల బ్రాహ్మ ణులు చేయుటలేదు, ఆహారవిహారములందును బ్రాహ్మణులకు

నియమములు హెచ్చు.వారు అహింసాపరులుగనే యుండవలెను. తమ జీవితమును స్వార్థముకుగాక లోకోపకారముకే వినియోగింపవలెను. వారు సకాలముకు ఆశ్రమము మార్చి వానప్రస్థులు కావలెను, తుదకు సన్న్యాసులై ఆత్మపరిశోధకులై లోకక్షేమముకే జీవితమంతను నియోగించవలెను. వారు అహింసా, సత్య, శమ, దమాదులెప్పుడును ఆచరించవలెను; నరులలో అప్పటి బ్రాహ్మణులవలె జంతువులలో గోవులును అహింసాస్వరూపములు. అవి సంఘమున కత్యంతోపకారులై యుండవలెను. కనుక గోవును బ్రాహ్మణుని రక్షించుట, అహింసాతత్వపు పోషణకును అప్పటి లోకపు క్షేమముకును అవసరముకనుక "గోబ్రాహ్మణేభ్యశ్శుభమస్తు నిత్యం లోకాస్సమస్తాస్సుఖినోభవంతు" అని కలిపి చెప్పినారు. ఇట్లు అహింసలో బ్రాహ్మణులకు ప్రత్యేక బాధ్యత నిచ్చినను చాలా చోట్ల స్మృతులలో అహింసా సత్యాదులు అన్ని వర్ణములవారికిని కావలెననియే చెప్పినారు. బౌద్ధబోధలో తరుచు "ధమ్మ'' శబ్దము. అహింసాప్రధానమన్నారు, మహాభారతములోను "అహింసా పరమోధర్మః" అనిరిగదా; ఇట్లే మనుస్మృతిలో "ధర్మము" నిర్వచించుటలో అహింసాదుల జెప్పినారు.*

వేదకాలమందు యజ్ఞములలో జీవహింసచేయు రివాజును మాంసభోజనముకు ఉండెనుకదా. మహాభారతకాలముకు మాంసభోజనమును బ్రాహ్మణులు మానియుందురు. అప్పటికి ఆర్యులు

---

* అహింసా సత్యమస్తేయంశౌచ మింద్రియ నిగ్రహః ఏతంసామాసికం ధర్మం జాతుర్వర్ణ్యే బ్రవీన్మనుః. (మనుస్మృతి అ 10 శ్లో- 63)

సత్యాస్తేయాదులును అహింసాపోషకములే అని గమనించవలెను.

ధృతిః క్షమాదమోస్తేయం, శౌచమింద్రియనిగ్రహం; ధీర్విద్యాసత్యమక్రోధః దశకం ధర్మలక్షణం ( అ- 6-92)

యోహింసకాని......నక్వచిత్ సుఖమేధతే ( ,, 5-45)

యోబంధనవధక్లేశాన్ ప్రాణినాం నచికీర్షతి, సర్వస్యచహితప్రేప్సుః సుఖమత్యంత మశ్నుతే. ( ,, ,, 46)

యద్ధ్యాయతి......యోహానసి చకంతన ( ,, ,, 5-47)

చాలవరకు హిమాలయములనుండి మైదానములలో నుండిరి. ఈమహాభారతములో యజ్ఞములో జీవహింస గూర్చియు మాంస ముగూర్చియు చక్కని చర్చగలదు.

ధర్మరాజు భీష్మాచార్యులను "అహింసయే ధర్మమనిరికదా, శ్రద్ధాయజ్ఞములలో మాంసము పెట్టితే పితృదేవతలకు తృప్తి యందురు. అదెట్లు?'' అని అడిగెను. అంతట భీష్ముడు "అహింస చాల ముఖ్యమైనది. మాంసము విడిచినవారికి, వారు నెలనెలకు అశ్వమేధము చేసిన వచ్చునంత పుణ్యముండును. వారికి సర్వ ఫలములు గల్గును" అనెను.♦

మద్యమాంస భోజనముగూర్చి మనుస్మృతిలో ఒకచోట "అది దోషముకాదు, కాని వదలివేయుట ప్రశస్తము'' అన్నారు* ఈశ్లోకం ప్రక్షిప్తమని కొందరి విజ్ఞుల యూహ. ఇది వేదములందు పూర్వపు ఆచారము దెల్పిన వాటికి సమర్థనకావచ్చును.

---

♦ రూపమవ్యంగతామాయుః బుద్ధిం సత్వం బలం స్మృతిః............
యోయజేతాశ్వమేధేన మాసిమాసి యతవ్రతః, వర్జయే న్మధుమాంసం చసమమేతద్యుధిష్టిర నభక్షయతియో మాంసం నచహన్యాన్నఘాతయేత్। తన్మిత్రం సర్వభూతానాం మనుస్స్వాయం భువో బ్రవీత్
(మ. భా. అను శా. 115 వ అధ్యాయం)
వాజిమేధంబుశతంబెను బూజనీయకర్మమందుడు। మాంసభక్షణము విడుపు వినుము చంపుటయును చంపబూనుటయు కల్మషంబులకెల్లనగ్గంబులధిప
(అం. మ. భా. 4 అ)
అహింసాపరమోధర్మః తథాహింసాపరంతపః। అహింసాపరమం సత్యం యతో ధర్మః ప్రవర్తతే ( ,, ,, అ. 115-25)
సదాయజతిసత్రేణసదాదానం ప్రయచ్ఛతి, సదా తపస్వీ భవతి మధుమాంస వివర్జితః ( ,, ,, ,,—17)
దానము ధర్మము......... అహింసా మానాకృతులుంద్రు... పెద్దల్.
(అం. మ. భా. 6 వ అ.)

* నమాంసభక్షణే దోషోనమద్యేనచమైథునే।
ప్రవృత్తిరేషా భూతానాం నివృత్తిస్తు మహాఫలా (,,

అనగా ఈవిసర్జన క్రమపరిణామమని సూచన. స్మృతులలో చాల చోట్ల "మాంసభక్షణమెంతమాత్రమును కూడదు; అది జీవహింసాకరము, నింద్యము" అని స్పష్టముగనే చెప్పినారు.‡ మరియు అంతరాత్మ బోధనను గ్రహించి, అంతరాత్మకు తృప్తికరమైన "పనులును లోకకంటకములుకాని పనులుమాత్రమే చేయవలెను" అనిగూడ చెప్పినారు.♦

అస్పృశ్యుల విషయమునుగూర్చి స్మృతులలో వచనములు సందిగ్ధముగనున్నవి. అక్కడక్కడ చండాలశబ్దము వాడినారు. కాని, ధర్మాచరణలో భ్రష్టులగువారు చండాలురగుదురనిరి, వారు ప్రాయశ్చిత్తముద్వారా మరల తమ స్వస్థితికి రావచ్చునని నిర్ణయించినారు. చాకలి, మంగలి, యీడిగ, వగైరాలు మిశ్రజాతులనియు మరికొన్ని సంకరజాతులనుజెప్పి, నీచవృత్తులలో శ్వపచాదుల జేర్చిరి; కాని, ఆనువంశికముగ చండాలురను పంచమజాతి ప్రత్యేకవర్ణముగ నున్నట్లు వక్కాణించలేదు. వర్ణవిభాగ సందర్భములో "నాలుగే వర్ణములు: 5 వ వర్ణమనునదే లేదు" అని స్పష్టపర్చినారు * సంఘములలో పురుషులకు స్త్రీలకు సంబంధముగూర్చియు కొంత భావభేదమున్నది. వేదకాలమందు స్త్రీల

---

‡ నాకృత్వా ప్రాణినాం హింసాం మాంసముత్పద్యతేక్వచిత్।
నచప్రాణివధస్స్వర్గః తస్మాన్మాంసంవివర్జయేత్ ( ,, 5-48)

♦ యత్కర్మకుర్వతోఽస్యస్యాత్ పరితోషోఽన్తరాత్మనః।
తత్ప్రయత్నేనకుర్వీత, విపరీతంతువర్జయేత్ ( ,, 4-161)
కాయేనమనసావాచా యత్నాత్ ధర్మం సమాచరేత్,
అస్వర్గ్యం లోకవిద్విష్టం ధర్మ్యమప్యాచరేన్నతు॥
(యాజ్ఞవల్క్యస్మృతి అ. 1—156)

* బ్రాహ్మణః క్షత్రియో వైశ్యస్త్రయో వర్ణాద్విజాతయః
చతుర్థఏకజాతిస్తుశూద్రో నాస్తితుపంచమః (మను 10-4)
అనగా పంచములు మిశ్రజాతులవలె శూద్రమహాజాతిలో నంతర్భాగమని భావనచేయవచ్చు.

విషయమందౌదార్యముండెనుగదా. అట్టి భావములును స్త్రీలలో గాంధర్వాది వివాహముల జేసుకోవచ్చునని స్త్రీలను గౌరవించవలె ననియు* ఉభయులు నీతిగనుండవలెననిగూడ మనుస్మృతిలో చెప్పినారు. పురుషులును మొదటిభార్య యున్నప్పుడు మరల పెండ్లాడుటకు కొన్ని నిర్బంధములుండేవి. స్త్రీలు కొన్ని సందర్భములలో పునర్వివాహము చేసుకొనుటకు శాస్త్రము సమ్మతించెను§ ఆస్తివిషయములోను కొన్ని సందర్భములలో భార్యకు కొమార్తెలకు కొంతవాటా కుటుంబపు ఆస్తిలోనుంచి తీసి యిచ్చే పద్ధతి ఉండేది.♦ అందువల్ల స్త్రీసంఘము విషయమై స్మృతికర్తలగు పురుషులు ఆకాలమందు ఇప్పుడనుకొనునంత హింసాపరులుగ లేరు. దరిమిలాను పౌరాణిక సంస్కృతి దరిమిలాను ఈస్థితి చెడినది. స్మృతికాలమందు కేవలం పూర్వాచారమే జరుగవలెను. మార్పు కూడదు'' అనే భావం లేకుండా ధీమంతులగు సజ్జనులు సమయోచితమగు మార్పులు జరిగించగా, ఆప్రకారంజరిగేది. గోమేధ మాంస విసర్జనాదులీరీతినే గల్గినవి‡ తరువాత కొంతకాలమైన

---

* యత్రనార్యస్తు పూజ్యంతే రమంతే తత్రదేవతాః అన్యోన్యస్యాప్యవ్యభిచారో భవేదామరణాంతికః, ఏషధర్మస్సమాసేన జ్ఞేయ స్త్రీపుంసయోపరః. (మనుస్మృతి. 9-101)

§ నష్టేమృతే ప్రవ్రజితే......నారీణాం పతిరన్యో విధీయతే,

నారద స్మృతి- అ 12-97-
(పరాశర- ,, 4-2)

♦ యదికుర్యాత్సమానాంశాన్ పత్న్యః కార్యాః సమాంశికాః పితుఠూర్ధ్వం విభజతామాతాత్యం శంసమం హరేత్। అసంస్కృతాస్తు సంస్కార్యాః భ్రాతరః పూర్వసంస్కృతైః। భగిన్యశ్చ నిజాతంశాత్ తత్వాంశంతు తురీయకం (మనుస్మృతి)

‡ అస్వర్గ్యం లోక విద్విష్టం......మాంసదానంతదాశ్రాద్ధే...... గోమేధంచ తధామఖం......ఇమాన్ ధర్మాన్ కలియుగే వర్జ్యానాహుర్మనీషిణః (బృహన్నారదీయం- 22-16
సమయశ్చాపి సాధూనాం ప్రమాణం వేదవద్భవేత్]
అదిత్య పురాణవచనం

మీదటను కాలానుసారముగ ఆచారముల మార్పుపద్ధతి పోయిన దని చూడగలము. కాని, స్మృతులకాలములో యేర్పడిన నియమములు అప్పటి సంఘావసరములనుండి ధీమంతులేర్పర్చినవి ; అవి అధికార వాంఛవల్లనే హింసాప్రవృత్తితో బ్రాహ్మణుల స్వలాభముకే చేసిరని చెప్ప పరిపాటిగలదు. తరువాత కాలానుసారముగ మార్పులు జరుగనందున ఆ ప్రాచీన నియమములు దరిమిలా కాల పరిస్థితికి సరిపోక బాధించినవి. స్మృతికర్తలు అప్పటి నియమములు అధికారవాంఛతోనే చేసిరను వాదము సవ్యముగతోచదు. స్మృతి కాలమందలి దార్శనిక వాఙ్మయముగూడ సూక్ష్మముగ గమనింతము.

అప్పటి ధార్మికవేత్తలు ఉపనిషత్తు వగైరాలలోని భావములు సులభముగ శిష్యులందరును జ్ఞప్తియందుంచుకొనునట్లు ప్రతి శాస్త్రముకును సూత్రవాఙ్మయముగూడ రచించిరి.‡ వేదాంత భావములకు బాదరాయణసూత్రము లేర్పడినవి. ఇవి విద్వాంసులు చాల పవిత్రముగ నెంచుదురు. తరువాత వచ్చిన హిందూ మతకర్తలీవేదాంతసూత్రములపైన విపులమైన వ్యాఖ్యానములు రచించినారు. ఈ నిశ్శ్రేయస సిద్ధికి పరిశుద్ధజ్ఞానము కావలెను. "భగవంతుడు సర్వభూతవ్యాపి ; లోకరక్షకుడు ; ఆత్మలన్నియు ఈశ్వరీయములే, ఆత్మజ్ఞానముగల్గి ఈశ్వరేప్సితమగు సర్వభూత హితము గల్గించుట మోక్షసాధనము.'' అని ఉపనిషత్తులవలె వేదాంతసూత్రములలోను చెప్పినారు (కాని ఈసూత్రములు అతి గూఢములు; అవి సామాన్యులకు దుర్బోధములు) ధర్మమనగా అభ్యుదయము (=లౌకిక క్షేమము) నిశ్శ్రేయసము (=అలౌకికమగు ఆత్మ క్షేమము) ఈ రెంటికిని సాధకమని కణాదమహర్షి నిర్వచించెను.*

---

‡ అప్పటికి చాల పూర్వమునుండి లేఖనము భారతీయులకు తెలిసినదే, వ్యాపారాదులకు వ్రాతవాడుకయుండెను. కాని ధార్మికభావములు వ్రాతలో తారుమారు కావచ్చునని వల్లనద్వారా ముఖస్థము చేయుటే ప్రశస్తముగనెంచబడెను.

* యతోఽభ్యుదయ నిశ్శ్రేయససిద్ధి స్సధర్మః- (వైశేషికసూత్రము)

ఈశ్వర ప్రేమను బోధించుచు భక్తిసూత్రములును ప్రత్యేకముగ నేర్పడినవి. వీటిని నారదభక్తిసూత్రములందురు. ఈశ్వర భక్తికి విశ్వప్రేమ అంతర్భాగమే; గనుక పరోక్షముగ భక్తివాఙ్మయము అహింసా పోషకము. భక్తుల హింసా సత్యాదులను పరిపాలించవలెనని ఈసూత్రములలో స్పష్టముగ చెప్పినారు.♦ ఇట్లే గౌతమ ధర్మసూత్రములలోను విద్యాంతమున అహింసా సత్యములవశ్యకములన్నారు.‡ అప్పటి దర్శనవాఙ్మయము 6 శాఖలది. ఈషద్దర్శనములలో ఉపనిషత్తుల వేదాంత శాస్త్రమొకటి, ఇంకొకటి పూర్వమీమాంస; ఇందు వైదిక కర్మల వివరముండును; వీటిలో యజ్ఞాదుల సంగతి చూచినాము. నిత్యమును భూత యజ్ఞము చేయవలెను; అనగా జీవములబోషింపుట ముఖ్యము. న్యాయదర్శనము తర్క ప్రధానము. జ్ఞానాభివృద్ధికి సాధనము; వైశేషిక దర్శనములో పంచభూతముల విభజనజేసి, పదార్థవిజ్ఞానము చర్చించినారు.* ఇందులోను హింస చెడ్డది; హింసతో సంపర్కము కలవారందరికిని ఆదోషమేర్పడును అని చెప్పినారు.

సాంఖ్య శాస్త్రమును మహాజ్ఞానియగు కపిలమహర్షి నిరూపించినారు. వారి సిద్ధాంతప్రకారం పురుషుడు (అనగా ఆత్మ) ప్రకృతికి అందలి రజోగుణాదులచే గల్గు కామక్రోధాదులకు లోబడకూడదు. పురుషుడు ప్రకృతిపరిణామములో మగ్నుడు కాకుండా సాక్షివలె ఆనందస్వరూపుడైయున్నాడు. కనుక నరు

♦ అహింసా సత్యశౌచ దయాస్తిక్యాది చారిత్ర్యాణ పరిపాలనీయాని.
(నారద భక్తిసూత్రములు- 78 సూత్రం)

‡ సత్యధర్మా (గౌతమధర్మసూత్రములు- 1-9-70)
ఆర్యవృత్తః ( ,, ,, 1-9-71)
నిత్యమహింస్రో మృదుర్దృఢకారీదమనదాన శీలశ్చ ( ,, 1-9)
"నిత్యమహింస్రః మృదుః" అనగా నిమిత్తే సత్యపి అహింసాశీలః కృశాన బాధించినను సహించువాడు అని హరిదత్తునిమితాక్షర.

* దుష్టం హింసాయాం, తస్య సమభివ్యాహారతో దోషః.
(కణాద మహర్షి రచితమైన వైశేషిక సూత్రము.)

నికి చమత్కారమును అందుచే గల్గు హింసా స్వభావమును ఉండ కూడదనియే సూచితమగును. ఇక యోగశాస్త్రము; దీనికి పతంజలి ఋషి రచించిన యోగసూత్రములు మూలాధారము. మోక్షసాధన కింద్రియ నిగ్రహము అవసరము; ఈశ్వర ప్రణిధానము కావలెను, యోగాంగములుగ యమనియమాసనాదు లష్టాంగములుండవలెననిరి.♦

వీటిలో మొదటి అంచెయగు "యమ మనగా అహింస, సత్యం, ఇతరుల ఆస్తి అపహరించకుండుట, బ్రహ్మచర్యము, (ఒక రిచ్చు) పదార్థములను స్వీకరించకుండుటయు§ కనుక యోగాభ్యాసము చేయదలచువారందరును ముందుగా అహింసాపరులు కావలెనని తేలినది. అహింసను మొదటనే వక్కాణించి, దాని కుపాంగములైన సత్యబ్రహ్మచర్యాదుల దెల్పిన సంగతిని గమనింపవలెను. "అపరిగ్రహము"ను చెప్పుటయు విశేషము. మన దేశమందిప్పుడన్నిచోట్లను బ్రాహ్మణులను వారిననుసరించి తక్కిన వారును వేరువేరు పేర్లతో యాచనకు సిద్ధమగుచున్నారు. పరిగ్రహవాంఛ అనుచితమని ఇందుచే తేలును. అహింస కుదిరి నప్పుడు పరస్పర వైరముపోవును.*

ఇక్కడ, "అహింస" అనగా రక్తపాతము మానుటేగాక, ప్రాణుల కట్టి ద్రోహమును చేయకుండుట అని యోగశాస్త్రజ్ఞు లర్థము చేసియున్నారు. ఇట్లే సత్యమనగా మాటలలోనేగాక

♦ యమ నియ మాసన ప్రాణాయామ ప్రత్యాహారధారణాధ్యాన సమాధయోఽష్టావంగాని-
( పాతంజలయోగ సూత్రములు 2 వ- సా- 27 వ సూ- )

§ తత్రాఽహింసా సత్యాస్తేయ బ్రహ్మచర్యాపరిగ్రహాయమాః-
(యోగసూత్రములు 2-30)

* అహింసా ప్రతిష్ఠాయాం తత్సన్నిధౌ వైరత్యాగః ( ,, 2-35)

మనస్సులోను యథార్థభావముండుట అనిచెప్పినారు.◆ అపరిగ్రహమునుగూడ విధించు ఉద్దేశము ఈపరిగ్రాహకులు యాచనాదులచే గృహస్థాదులు బాధపెట్టుటవలన హింసాది దోషములుండుటయే అనివ్యాఖ్యాతలు సూచించినారు. ఇట్లు అన్ని విధములుగను అహింసను పాటించుట అవసరమని మన శాస్త్రములు ఘోషించుచున్నవి.

అప్పటి ధార్మిక వేత్తలు అహింసను సత్యక్షమాదులను బోధించుటేగాక, సాత్వికబలమును ఆరోగ్యమును జనులలో వృద్ధిజేయుటకు యత్నించిరి. శౌచము విషయమై ప్రత్యేక నిబంధనలేర్పరచిరి. కొందరు విద్వాంసులారోగ్యశాస్త్రములో ప్రత్యేక కృషిచేసి వైద్యశాస్త్రమును వృద్ధిచేసిరి. ఇప్పటి పాశ్చాత్య (అల్లోపతి) వైద్యులవలె కేవలము శరీరముకే చికిత్స చేయక, దేహము, మనస్సు, ఆత్మ యీమూడింటికిని దృఢమైన పరస్పర సంబంధము కలదని, శరీరము వట్టి భౌతికయంత్రమే కాదని, కనిపెట్టిరి. కనుక, యోగనియమములును, ఈశ్వరప్రణిధానమును అహింసాపరత్వమును పరిశుద్ధమును ఆరోగ్యరక్షణకు సహకారులగునని యెంచిరి. కనుక యోగశాస్త్రజ్ఞులవలె వైద్యశాస్త్రజ్ఞులును "హింసాప్రేరకమగు మద్యసంబంధమును, ఆరోగ్యేచ్ఛులు పెట్టుకోకూడదు; వాటి విక్రయసంధానాదులును చేయకూడదు; పురుగు చీమవగైరా జంతువులందును ఆత్మభావముండవలెను; దీనులకు దుఃఖార్తులకు సాయముచేయవలెను.

హింస, చోర్యీ, అసత్యము వగైరాలను త్రికరణశుద్ధితో వదలవలెను. వాటిని మనస్సుతో తలపెట్టుటయు కూడదు"

---

◆ తత్రఅహింసాప్రాణినామద్రోహః... సత్యం వాఙ్మనసోర్యథార్థతా...
అపరిగ్రహాశ్చ హింసాద్యసంఖ్యదోషదర్శనాత్పదార్థం నామస్వీకరణం-
పాతంజలయోగసూత్రముమీద శ్రీనాగోజీభట్టులవారివృత్తి-
(శ్రీనాగణేశుని వ్యాఖ్యలోను ఇట్లేచెప్పినారు)

అని వాగ్భటాదులు విధించినారు* వారి పూర్వీకులగు చరకాదులును అట్టి భావముల దెల్పినారు.

## —♦ అహింసావ్యాప్తిలో లౌకికోన్నతి. ♦—

అప్పటి లౌకికజీవితము నిప్పుడు గమనింతము. క్రీస్తుకు పూర్వం 5 వ శతాబ్దినుంచి క్రీ. శ. 6 వ శతాబ్దివరకు మనదేశమంతటను అహింసాతత్వముకు ప్రాబల్యముండినది. బౌద్ధ జైన ధర్మము లాసమయమునందే యీ దేశములో విశేషముగా వ్యాపించినది. అవి వేరుమతములుగ భావించక భారతీయులందరును ఆసిద్ధాంతముల నాదరించుచుండిరి. సంప్రదాయ హిందువుల గ్రంథములలోను ఆకాలమందే అహింసాసత్యముల కెక్కువ ప్రాధాన్యమిచ్చినారు. ఈకాలమందే భారతదేశము లౌకికముగను ఉన్నత గౌరవమునొంది, దేశము అపూర్వసౌఖ్యమునందున్నట్లు చరిత్రవలన తెలియుచున్నది. క్రీ. పూ. 4 వ శతాబ్దినుండియే మనదేశములో చాలభాగ మొకే మహారాజ్యములో భాగమై ఒకే పరిపాలనకులోనై, శాంతిసౌఖ్యము లనుభవించెను. చంద్రగుప్తుని సామ్రాజ్యపాలన చక్కని నీతిపై నాధారపడి జనుల యభివృద్ధికి కారణమైనదని, రాజ్యాంగనిర్మాణము అప్పటికి లోకమున క్రొత్తదైన ఉదారసంఘటన పద్ధతులపైన నడుచుచుండెనని, మెగస్తనీస్ వంటి విదేశలేఖకుల గ్రంథములును తెల్పుచున్నవి. అప్పటి పాటలీపుత్రాది మహానగరములును 18 వ శతాబ్దివరకు పాశ్చాత్య నగరములకుండిన సౌకర్యము లన్నింటితో నొప్పుచుండినవి. ఆ చంద్రగుప్తుడు విదేశీయుల నోడించుటేగాక అహింసాధర్మము

---

* మద్య విక్రయసంధాన దానా దానాని నాచరేత్ । ఆత్మవత్స
తతం పశ్యేదపికీట పిపీలకం ॥ అప్రవృత్తి వ్యాధి । శోకార్తాన్
అను వర్తేత శక్తితః ॥ హింసాస్తేయాన్యథా కామస్ ,
పైశున్యం పరుషానృతే । సంభిన్నాలాపవ్యాపారమభిధ్యా
దృగ్వి పర్యయం "పాపం కర్మేతి దశధాకాయవాఙ్మనసైః త్యజేత్ ।
( వాగ్భటుని అష్టాంగ [illegible] )

కప్పటి కేంద్రమై మగధ సామ్రాజ్యములో తక్కిన చాల రాజ్యముల జేర్చెను. అతని మనుమడు అశోకుడు భౌతికముగ నింకను బలీయుడై, ధార్మికముగ లోకోత్తరుడై, నైతికముగ భారతీయైక్యమును సాధించెనని చూచియున్నాము. మౌర్య సామ్రాజ్యము క్రీ. పూ. 2 వ శతాబ్దిలో తగ్గి, అప్పటి ప్రధానియగు పుష్యమిత్రుడు బౌద్ధులను హింసించి తాను రాజైనాడు. అంతట మగధరాజ్యపు ప్రాబల్యముపోయి నాల్గుశతాబ్దులు ఆంధ్రరాజ్యము క్రింద మనదేశము చాలయభివృద్ధిలో నుండినది. ఈశాతవాహన వంశపు పాలన క్రీ. త. 3 వ శతాబ్ది తుదకు తగ్గగా ఆర్యావర్తపు గుప్త సామ్రాజ్యము క్రీ. త. 4 వ శతాబ్దినుండి 7 వ శతాబ్ది తుదివరకు బలీయమై, చాలవరకు ప్రజలలో శాంతిని కాపాడినది.

ఈ వేయేండ్ల పైకాలములోను యూరప్ మొదలగు ప్రాంతములలోవలెగాక అంగవంగ కళింగాది రాజ్యములన్ని కలసిన భారతదేశముకే మహాదేశమని, భారతీయుల జాతియని, మన సంస్కృతి ఒకటే అని దృఢభావమేర్పడినది. ఆయా రాజ్యముల మధ్య అప్పుడప్పుడు చిన్న యుద్ధములు జరిగినను, సార్వజనిక జీవనమంతగా భంగము కలుగలేదు. భారతీయులు సుఖులై ఐహికమునను, పరమార్థములోను ధన్యులని, దేవజాతివారును కీర్తించిరని విష్ణుపురాణములో నొక వచనము కలదు.*

ఇట్టి యౌన్నత్యమును పరస్పరమైత్రిని స్వదేశప్రేమను జాతీయ భావమునుగూడ మన ధర్మజ్ఞులు పెంపొందించిరి. ఇదియు అహింసావృద్ధికవసరమే జీవులు బాధనుండి విడుదలయగుట

* గాయంతి దేవాః కిలగీతకాని ధన్యాస్తు యే భారతభూమిభాగే- స్వర్గాపవర్గాస్పద మార్గభూతే భవంతి భూయః పురుషాః సురత్వాత్ కర్మాణ్య సంకల్పిత తత్ఫలాని సన్యస్య విష్ణౌ పరమాత్మరూపే, అవాప్య తాం కర్మమహీ మనంతే తస్మిన్లయం యేత్వమలాః ప్రయాన్తి॥ అత్రాపి భారతం శ్రేష్ఠం జంబూద్వీపే మహామునే యతోహి కర్మభూరేషా హ్యతోఽన్యా భోగభూమయః (వి 2-3-24-30)

కెల్లప్పుడును యత్నింపవలెనని మనధార్మిక గ్రంథములలో బోధించి నారుకదా. స్వధర్మము సాధించుటలో మరణము వచ్చిననుసరే, కాని పరకీయము కూడదన్నారు.♦ ఈబంధవిముక్తి, ఆధ్యాత్మికముకేకాక దీనికి పునాదియగు రాజకీయ మోక్షమునకు వర్తించునని భావింపవచ్చును. "పరాధీనత దుఃఖకారణము. పరవశమును వదలి, అంతయు స్వవశమగునట్లు చేయ యత్నింపవలెను." అని మనుస్మృతి వగైరాలలో ప్రత్యక్షముగను స్వాతంత్ర్యబోధ చేసినారు.*

కనుక ఆధ్యాత్మికంలోను రాజకీయంలోనుగూడ స్వతంత్రతయే ఆత్మ వికాసము గల్గించును. వేదకాలపు ఋషులు తామప్పటికి వ్యాపించి మేరు కైలాసపర్వతములను గంగా యమునా సరస్వతీ శతద్రు నదులనే పవిత్రములుగ మంత్రములలో జేర్చి స్మరించుచుండిరి.§ తరువాత వారుబ్రహ్మపుత్ర మహానది, గోదావరి, కృష్ణ, తుంగభద్ర, కావేరీ, తామ్రపర్ణి, నర్మద వగైరాలగూడ జేర్చి, వీటి తీరములను పుష్కర క్షేత్రములని నిర్ణయించిరి.

---

♦ శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్ స్వనుష్ఠితాత్, స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః.

* సర్వం పరవశం దుఃఖం, సర్వమాత్మవశం సుఖం, ఏత ద్విద్యాత్సమాసేన లక్షణం సుఖదుఃఖయోః. యద్యత్పరవశం కర్మతత్తద్యత్నే నవర్జయేత్, యద్యదాత్మవశంస్యాత్తు తత్తత్సేవేతయత్నతః.

(మనుస్మృతి 4-159, 160)

§ "ఇమంమే గంగేయమునే సరస్వతి శతద్రు......" ఋగ్వేదం. పూర్వము సింధు యమునానదులమధ్యమందు సరస్వతియను గొప్పనది యుండినది. ఇది యిప్పుడెండిపోయి, కొన్నిచోట్ల ఆజాడ మాత్రము సూచకముగ మిగిలినది. కాని యిది కాళిదాసు కాలమందును ప్రవహించుచుటేగాక చాల పవిత్రముగ నెంచబడినట్లు తోచును. మేఘ సందేశములో ఈ క్రింది శ్లోకములో సరస్వతీ తీర్థము పవిత్రమైనట్లు చెప్పియున్నది.

"హిత్వాహాలామభిమతరసాం...పీత్వాతాసా మభిగమమపాం సౌమ్య సారస్వతీనాం అంతశ్శుద్ధస్త్వ మపిభవితావర్ణమాత్రేణ కృష్ణః"

ఈ సంప్రదాయప్రకార మాయా పుష్కరనదుల యాత్ర జేయువారు 12 ఏండ్లు యావత్తు భారత దేశమును సేవించి, అన్ని ప్రాంతములతో పరిచయము చేసుకొందురు. అది పరస్పర మైత్రికి కారణమగును. ఇట్లే సప్త కులపర్వతములును దేశమందాయా వైపులనుండుటవలన అన్ని ప్రాంతములను దర్శించిననే కులపర్వత దర్శనమై, దేశమంతటిపైన నభిమానమేర్పడును.♦

భారత దేశమందన్ని దిక్కులును పవిత్రమై ధార్మిక వృద్ధి కేంద్రములని యెంచు పుణ్యక్షేత్రములున్నట్లు నిర్ణయించుటయు నిట్టిదే.*

ఆ కాలమందు పశ్చిమ ఆసియా యూరప్ దేశములలో చాల భాగ మొడుదుడుకులలోనుండెను. అందులో కొన్ని శతాబ్దులకు "డార్క్ ఏజెస్" (అంధకారయుగము) అని పేరు. శకహూణాది వివిధజాతులవారు ఆయా దేశములను కొల్లగొట్టి, జనుల హింసించి, ప్రజలకు శాంతి లేకుండ జేసిరి. మన దేశపు రాజులు కొంతకాలము ఈదండులను సరిహద్దులందాపిరి. పిమ్మట కొన్ని తండాలు వాయవ్యప్రాంతములోనుండి దూరివచ్చిరి. కాని, వారును ఇక్కడ శాంత స్థిరవాసులై, హిందువులలో కలిసిపోయిరి. సంఘాభివృద్ధి కడ్డమురా లేదు. వాతావరణము అహింసాయుతమైనప్పుడు అట్లే సమన్వయమగుట సహజము. కనిష్కాది శకరాజులును భారతీయ ధర్మమందేయుండి, అహింసాతత్త్వ మవలంబించి, తక్షశిలాదుల సంస్కృతపాలీ సంస్థలబోషించిరి; వాఙ్మయమును విజ్ఞానమును కళలును ఈకాలమందే బాగుగ వృద్ధియైనవి. ధన్వంతరి సుశ్రుత చరకాది ఘన వైద్యులు, బ్రహ్మగుప్త వరాహమిహిరాది జ్యోతిశ్శాస్త్రజ్ఞులు, దార్శనికులు, వాస్తువిజ్ఞులు, శిల్పకళాభిజ్ఞులును,

♦ మహేంద్రో మలయః సహ్యః శుక్తిమాన్ ఋక్షపర్వతః, వింధ్యశ్చ పారియాత్రశ్చ సప్తైతే కులపర్వతాః. (విష్ణు- 2- 3- 13)

* అయోధ్యా, మథురా, మాయా, కాశీ, కాంచీ, అవంతికా, పురీ, ద్వారవతీ, చైవ సప్తైతా మోక్షదాయకాః.

అత్యంతనైపుణిజూపిరి; ఆయాశాస్త్రకళలందు విజ్ఞానపూరితమగు గ్రంథములరచించిరి. లోగడ మనము చూచిన సాహిత్యగ్రంథములును చాలవరకా కాలపువే. ఈవిజ్ఞాన సాహిత్యగ్రంథములలో కొన్ని తరువాత అరబ్బీగ్రీక్ వగైరా భాషలలోకి తర్జుమాయై, పిమ్మట ఆధునిక పాశ్చాత్యవాఙ్మయమునకును విజ్ఞానమునకును ఆధారములైనవి. అప్పుడు అహింసాతత్వమును దానిపై నేర్పడిన భారతీయ సంస్కృతియు చుట్టుపట్ల యితర దేశమంతటనుగూడ వ్యాపించినవి. మహేంద్ర బుద్ధఘోషాదులు సింహళములోను, బుద్ధభద్రకుమార జీవాదులు చీనాలోను, మతానందాదులు కొరియాలోను గుణవర్మాదులు యవద్వీపాదులలోను, దీపంకరాదులు తిబెత్తులోను, ఇట్లే పాశ్చాత్యదేశములందును భారతీయులు మన యున్నత సంస్కృతిని ధర్మమును ఆయాదేశములందు వ్యాపింపజేసిరి; ఆయాదేశముల భాషలలో పాలీ సంస్కృతభాషల మహాగ్రంథముల ననువదించిరి. వాటి మూలములు మనదేశములో నశించిపోయినను, ఇట్టివి వందలకొలది యుద్గ్రంథముల యనువాదము లిటీవల చీనా తిబెత్తు వగైరాలలో దొరకినవి. ఇట్లు వ్యాపించిన భారతీయ సంస్కృతియే చీనా, జపాను, బర్మా, జావా బోర్నియో, సింహళం వగైరాలలో గొప్ప నాగరికత యేర్పడుటకు పునాదియైనది. ఇది సిరియాద్వారా క్రైస్తవమత మేర్పడుటకును తోడ్పడినదని కొందరి యభిప్రాయము. ఏసుక్రీస్తు తన మతములో అహింసాతత్వమునకు ప్రాముఖ్యమిచ్చెను. అట్టి సిద్ధాంత మప్పటి శాప్రాంతములోలేదు. కాని క్రీస్తు జనించి వసించిన యూదదేశమందంతకు పూర్వమే కొందరు భారతీయ విద్వాంసులు అహింసయు ధర్మము ఏకేశ్వరభక్తియునే మోక్షసాధనములని బోధించినట్లు నిదర్శనము లున్నవి. ఈభావము లప్పుడు యూదులలో వ్యాపించినందున, తరువాత, యూదుడగు క్రీస్తు తన నవ్యమతము స్థాపించుట సులభమైనదని తోచును.

ఆర్థికముగను భారతదేశమప్పు డున్నతస్థితిలోనున్నది. మన దేశీయులు చక్కని నూలుతీయుచు సన్నని వస్త్రముల దయారు చేయుచుండిరి. ప్రజలకు కావలసిన వస్తువులన్నియు ఈదేశమందే శిల్పులు నిర్మించుచుండిరి. విదేశములకును అట్టి వస్తువులీ దేశమునుండియే యెగుమతి యగుచుండినవి. అప్పుడు మన సముద్ర వ్యాపారము వృద్ధిలో నుండినట్లు, మన ప్రాచీన వాఙ్మయ కథలలోను సూచనగలదు; అప్పటి పాశ్చాత్య యాత్రికులును భారతీయుల పరిశ్రమలు శిల్పమును అద్భుత చాతుర్య యుతములై, ఇతర దేశములకాదర్శమైనవని వ్రాసినారు. ఇందునుబట్టి అహింసా తత్వము వృద్ధియగుట భౌతిక ప్రగతి కాటంకము కల్గించదని స్పష్టపడుచున్నది. సాంఘికముగను సంఘర్షము లేకుండ సంఘటనమే హెచ్చుగనుండినది. మన గ్రామములలో అప్పటి నిర్వాహ పద్ధతిలోను అహింసాతత్వముండెను. సంఘములో సాముదాయిక పద్ధతియు పరస్పర సహకారమును హెచ్చుగ నుండెను. వృత్తులలో పోటీలేకుండ వంశాను గత పద్ధతియుండెను; ప్రతిగ్రామముకును అవసరమైన ఆహారపు దినుసులు బట్టలు వడ్రపు కమ్మరపు వస్తువుల పనిముట్లు వగైరాలు ఆగ్రామములోనే తయారగుచుండెను. గ్రామ జీవనములో పరాధీనత లేదు. నూలు వడకుట మొదలుగ అనుబంధ వృత్తులు వ్యవసాయికులకు సహాయకారులై యుండెను. అదనంగా ఉత్పత్తియైన వస్తువులను విదేశముల కెగుమతి చేయుటకు, ఇతర ప్రాంతములకు పంపుటకు, ప్రత్యేకసంస్థ లుండెను. ఆ యా వృత్తులజేయువారికి భృతిగ మాన్యపు భూముల నిచ్చుచుండిరి. వ్యవసాయకులకును పోటీలేకుండ కట్టుదిట్టములుండెను. భూములందు సమిష్టి హక్కుపద్ధతియే మొదట ఉండినది. క్రమముగా ఇది సపిండులందరికి సమిష్టియై, అంతట ప్రత్యేక కుటుంబముకు సమిష్టియైనది. మొదట వ్యక్తులకు ప్రత్యేకపు హక్కులేదు. తరువాత కాలక్రమమున వ్యష్టిపద్ధతి కలిగి, విభాగములకు సౌకర్యము హెచ్చింప

బడి, వ్యక్తులకు ప్రత్యేకపు హక్కులుకల్గినవి. సమిష్టిపద్ధతిలో ఐక్యము ప్రేమభావము నుండుట సహజము. గ్రామములందలి పన్ను వసూళ్లను, తగువులు పరిష్కారమును, మరమ్మతులు నీటి సరఫరా వగైరాలును, ఆ యా గ్రామ పంచాయితీద్వారానే ప్రజలప్రతినిధులు పరిష్కరించుకొనిరి. ఇట్లు పరస్పరప్రేమ యధికమై; ఈనాటిరీతికలహాపరత్వముకుహింసాతత్వముకుఅప్పుడవకాశము తక్కువగ నుండెను; పరస్పరమును సహనము సహకారమునుగల్గి, ఆయా గ్రామముల జనులైకమత్యముతోనుండిరి.

ప్రాచీనకాలమందు భావస్వాతంత్ర్యమును సహనబుద్ధియు మన దేశీయులలో చాల హెచ్చుగనుండినది. హిందువులును బౌద్ధులును చాలశతాబ్దము లిష్టముగనే యుండిరి. తాత్విక చర్చలో జైమిని వగైరా పూర్వమీమాంసకులును జాబాలివగైరా నాస్తికులును ఈశ్వరాస్తిత్వ మొప్పుకోలేదు. ఐనను వారిని ఆస్తికులు పాశ్చాత్యదేశములలోవలె హింసింపలేదు. అప్పుడు విదేశీయులకు మనవారు లోబడలేదు, కాని వారికి ఆతిధ్యమిచ్చిరి. శకయవనాదులు హిందూమతము నంగీకరించి వసించిరి. నైఋతి మూలలో మలబారు ప్రాంతమందు సిరియాదేశపు క్రైస్తవులు రాగా, వారి కక్కడ హిందూరాజులు క్రీ. త. 2 వ శతాబ్దిలో శరణు నిచ్చిరి. వారి వంశీయులు వృద్ధియై, తమ ధర్మమును వృద్ధిజేసికొనుచు, "సిరి యను క్రైస్తవు" లను పేర నున్నారు. ఇది అప్పటి హిందువులాప్రాంతమందు అహింసాపరులై ఉదారులై యుండినట్లు నిదర్శనము. ఇట్లే 7 వశతాబ్దిలో మనదేశపు పశ్చిమ ప్రాంతీయులింకొక జాతికి స్వాగతమిచ్చిరి;వీరు పార్సీలు. అరబ్బులు పారసీకుల జయించి, అచటివారినందరిని ముస్లిములుగ జేసిరి. అందు కొందరు తమ పూర్వమతము నైనను నిలుపుకోదలచిరి; కాని, ఆ యరబ్బులు తమ నవ్యమతమే సత్యమైనదనియెంచి, సహనము లేకుండిరి. వారిధాటికాగలేక, స్వమతరక్షణకై, పారసీకులు స్వదేశమువిడచి, ఓడయెక్కి సముద్రముపైన వెడలిరి.

ఆయోడఁలెట్లో మన దేశపు పడమటితీరమందలి సూరత్ ప్రాంత ముకు జేరెను. ఆ ప్రాంతపు హిందూరాజులు స్వమతముకై శరణార్థులైన వీరిని తమ రాజ్యమందు శాంతముగ నుండనిచ్చిరి; గోహత్యను గోమాంసభుక్తిని వదలవలెననిరి. అందుకంగీకరించి, వీరప్పటినుండి శాంతులై వ్యాపారమును వర్తకమును జేసికొనుచు "పార్సీ" (=పారసీ) లను పేర ప్రసిద్ధిజెందియున్నారు. ఈచిన్న సంఘము కింతవరకెట్టి హింసను తక్కిన భారతీయులు చేయక, వారికి మతస్వాతంత్ర్యమిచ్చుటయు అప్పటి భారతీయుల అహింసా పరత్వముకు నిదర్శనము.

ఈ పారసీకులు బొంబాయి వగైరా ప్రాంతములందు గొప్ప గొప్ప వ్యాపారస్థులై, మన దేశపు ఆర్థిక సంపద బాగుచేయు చున్నారు. వీరిది "జోరాష్టరు" అను ఋషి స్థాపించిన మతము. వీరు ఇరాను ఆర్యులు; వైదికులకువలెనే వీరికిని త్రికాలాగ్ని ఉపాసన ఉపనయనాదులు నున్నవి. "ఇతరులను హింసింపకూడదు. తాము సంపాదించు ఆస్తిని నిలవయుంచుకోక, పరోపకారముకై బీదలకు దానముచేసివేయవలెను. అట్టి వారికే స్థిరమగు సౌఖ్య సంపదలుండును; అదే ముఖ్య ధర్మము'' అని వీరి ముఖ్య మత గ్రంథమగు "అవెస్తా'' బోధించుచున్నది. ఇదే మన యజ్ఞ సిద్ధాంతమును. (దీనిని "అవెస్తా"లో "యశ్న" అనిరి) ఈధార్మిక బోధనవల్ల పారసీకులు వితరణపరులై పరోపకారులైనారు.

# అధ్యాయము 23.

## —♦ పౌరాణిక సంస్కృతి ♦—

### —§ పురాణముల ముఖ్య కథలు §—

భారత రామాయణములకూ ముఖ్యమైన బౌద్ధ గ్రంథములకూ తరువాత పురాణములు, కావ్యములు, ఏర్పడినవి. ఈపురాణములలో జెప్పిన కొన్ని కథల నిప్పుడు గమనింతము. ఇవిచాలవరకు పూర్వపురాజులకూ చక్రవర్తులకూ భగవంతుని మత్స్య కూర్మాది వివిధావతారములు వగైరాలకు సంబంధించినవి. ఇవిగాక సృష్టి యారంభము మొదలు మన్వంతరములు ఆయావంశాదుల వివరములు నిందున్నవి. ముఖ్యపురాణములు 18‡ ఇందు కొన్ని వైష్ణవములు; మరికొన్ని శైవములు. ఇందలి కథలు నీతిబోధకములు, చాలవరకు మహాభారతాది పూర్వగ్రంథములలో చెప్పినవే. ఇక్కడ మరల వాటి ప్రశంస మనకక్కరలేదు. మిగిలినవాటిలో కొన్నిమాత్రము అహింసా సత్యాది ప్రతిపాదకములు. అట్టి ఒకటి రెండింటిని మాత్రమిక్కడ స్మరింతము.

### —♦ ప్రహ్లాద కథ ♦—

పూర్వము హిరణ్యకశిపుడను బలీయుడగు రాజుండెను. అతడు మహాశూరుడు; తనభౌతిక బలముతో అతడీ దేశమునేగాక, హిమాలయాదుల అడ్డముదాటి, త్రివిష్టపాదులనుగూడ హింసా బలముతో జయించెను; దక్షిణప్రాంతపు పాతాళమునుగూడ వశపరుచుకొనెను; అతడు గొప్ప అహంకారి. అప్పటి స్వర్గపాలకుల కన్నను వీరుడై, వారినికూడ లోబర్చుకొనెను. అయితే, అతనిది

‡ ఇవిగాక 18 ఉప పురాణములు, కొన్నిదరిమిలా పురాణములు నున్నవి.

ఆసురతత్వము. లోకమంతటిపైన తనదే అధికారము, తనకన్న యీశ్వరుడెవడూ లేడు * అందరూ తన భోగముకే తోడ్పడవలెను. ఇట్టిది ఆసుర భావమని లోగడ చూచియున్నాము. బలీయునిదేరాజ్యము. ఇతరుల స్వాతంత్ర్యమును సంఘ సమత్వమూ అతని కెంతమాత్రమును గిట్టవు. అతడు "పానాసక్తుడు" అతనిభార్య గొప్ప శీలవతి, కొడుకు ప్రహ్లాదుడు బాల్యమునుండి సాత్వికభావుడు, సౌమ్యుడు, దేవునియందు అపారభక్తిగలవాడు. తనకొడుకును రాజసుడై హింసాపరుడై తనవలె నగునట్లు తయారుచేయవలెనని, తానే సర్వాధికారి, లోకమునకు వేరే యీశ్వరుడు లేడని, ప్రకృతి తనకు వశమైనట్లు కనపర్చుటకును, తండ్రి హిరణ్యకశిపుడు విశ్వప్రయత్నములను జేసెను. కాని ప్రయోజనము లేకపోయినది. తన గురుపుత్రులచేత రాజనీతిని, తన ప్రభావమును దండనీతిని అతనికి బోధింపజేసెను. కాని ప్రహ్లాదునకవి యిష్టముకాలేదు. తండ్రి అతనిని దండించెను; స్వయముగ వాదించెను. ప్రహ్లాదుడు తనను రాజభటులును రాజును బెదరించినను, కొట్టినను, చలింపక దృఢనిశ్చయుడై, విష్ణువే లోకేశ్వరుడు నరులందరును సములే అని దృఢనిశ్చయమును తెలిపెను. అంతట హిరణ్యకశిపుడు తన కొడుకే తనకు తోడగుటకు బదులు సర్వేశ్వరునిగ ఒప్పుకొక భేదించెనని ఆగ్రహావిష్టుడై, అతనిని చంపుటకై క్రూరచుపాములచేతగూడ కరిపించెను. కాని ప్రహ్లాదుడు బాల్యమునుండి కేవలం ప్రేమమయుడు. అతని తత్వములో కోపమనేదిలేదు. అతని హృదయమును మనస్సును శరీరమును పరిశుద్ధములు, సర్పవిషము అతని రక్తములోగాని హృదయములోగాని యెక్కలేదు. అంతట హిరణ్యకశిపుడు కొడుకును కొండలనుండి క్రిందకు దొర్లించెను, ఏనుగులచే త్రొక్కించెను, లోతు నీళ్ళలో ముంచెను. ఎన్ని జరిగినను,

* పరమేశ్వర సంజ్ఞోజ్ఞః కిమన్యః మయ్యవస్థితే-
(విష్ణుపురాణం అం 1 అ- 17 శ్లో 28)

ప్రహ్లాదుని హృదయములో జంకు భయము క్రోధము అహంకారము లేవు. అతడు తనను బోధించువారికి హానిచేయ తలపెట్టలేదు. కనుక అతని హృదయమెంతమాత్రమును జంకలేదు. అట్టి పరమ సాత్త్వికమైన ప్రాణిచుట్టు వాతావరణమును అహింసా మయమగును. అక్కడి జంతువులు తమ హింసాతత్త్వమును మరచును. పూర్తియైన అహింసాపరుని బాధించుటకు వాటికి మనస్సురాదు. మరియు, ధైర్యమూ ఆత్మవిశ్వాసమూ కల అహింసాపరుని సత్త్వబలము చాల హెచ్చు. ఎట్లైననేమి! హిరణ్యకశిపు చర్యలవల్ల ప్రహ్లాదుని కపాయము జరుగలేదు. పైకి దుర్బలుడుగ తోచు చిన్నబాలుడిట్లు తన మారణయత్నములకు తాళుకొని క్షేమముగ నుండుట హిరణ్యకశిపుకు మరింత ఆశ్చర్యమును ఆగ్రహమును గల్గించినది. ప్రహ్లాదుడు భయపడలేదు సరిగదా, చుట్టుపట్ల దైత్యులందరు ఈశ్వరభక్తులు ప్రేమాత్మకులు లోకులందు సమభావముకలవారు కావలెనని, అట్టి సమత్వమే ఈశ్వరారాధనయగుననీ, అతడు వారి కందరికీ హితబోధ చేయుచుండెను.* అంతట హిరణ్యకశిపు మండిపడి, కొడుకుకు దారుణ విషము నన్నములో కలిపిపెట్టి చంపుడని తన వంటవాండ్ల నేర్పర్చెను. వారు రాజాజ్ఞను నెరవేర్చిరి. కాని పవిత్రమగు ఆదేహమందావిషము హరించిపోయినది. అంతట రాజపురోహితులు వచ్చి "మీతండ్రి సర్వేశ్వరుడు, వేరే దేవుడులేడు, అందుకు నీవంగీకరింపకపోతే, నీకు రక్షణపోయి వినాశమగును." అని దూషించిరి. కాని ప్రహ్లాదుడు "నాపనులబట్టియే గతిగల్గును; కనుక సాధుకర్మనేజేతును" అనెను.♦

---

* విస్తారః సర్వభూతస్య విష్ణోస్సర్వమిదం జగత్,
ద్రష్టవ్యమాత్మవత్తస్మాత్ అభేదేన విచక్షణైః (విష్ణు 1-17-84)
...సర్వత్ర దైత్యాః సమతాముపేత, సమత్వమారాధనమచ్యుతస్య॥

♦ కర్మణాజాయతే సర్వం కర్మైవగతిసాధనం, తస్మాత్సర్వప్రయత్నేన సాధుకర్మ సమాచరేత్॥ ( ,, 1-18-32)

అంతట ఆపురోహితులు "కృత్య" అను బ్రహ్మరాక్షసిని సృజించి, దాని శూలముచే ప్రహ్లాదుని చంపించజూచిరి. ఆశూలము, ప్రహ్లాదుని హృదయమునకు తగిలి, విరిగి క్రిందపడినది. కాని దానినుండి జ్వాలలు బయలుదేరి, ఆపురోహితులనే దహింపతొడగినవి. ఆవిప్రులు తగులబడుట చూచి, ప్రహ్లాదుడు వెంటనే "విష్ణువు సర్వవ్యాపి, కనుక ఆయన నాశత్రువులలోను ఉన్నాడు. వీరు నాశత్రుపక్షమువారైనను నాకు వీరియందు అహింసాభావమే. ఈసత్యమునుబట్టి, వీరు మరల బ్రతుకవలెను" అని భగవంతుని ప్రార్థించెను.* అంతట ఆవిప్రులు జీవితులై, ప్రహ్లాదు నాశీర్వదించి, ఆయద్భుతవృత్తాంతమును హిరణ్యకశిపునకు వినిపించిరి.

ఇట్లు, అపకారికి నుపకారముచేసి, వారి హృదయము కరుగునట్లు ప్రహ్లాదుడు చేసెను. అతనిని చంపుటకేర్పడిన "కృత్య" అతని నేమియు జేయలేక పురోహితులనే బాధించినదని తెలిసి, హిరణ్యకశిపుడు ప్రహ్లాదుని "ఆమహిమకు కారణమేమ"ని యడిగెను. అంతట ప్రహ్లాదుడు "ఇతరులకు అపకారము కావలెనని తలపెట్టనివాడు పాపికాడు. పరపీడ చేయువానికే హాని కల్గును. నేనహింసాపరుడనుగనుక నన్నది బాధించలేదు. అట్లే యితరులును హరి సర్వవ్యాపి యని గ్రహించి, సర్వభూతములయందును మంచి ప్రేమతో నుండవలెను. అని జబాబిచ్చెను.♦

* యథాసర్వగతం విష్ణుం మన్యమానో నపాయినం,
చింతయామ్య రిపక్షేపి జీవం త్వేతే తథాద్విజాః.
యేహంతుమాగతాః...... తేష్వహం మిత్రపక్షేచ
సమః పాపోస్మిన క్వచిత్ - తథా తేనాద్యసత్యేన జీవం త్వసురయాజకాః (విష్ణు- 1-18-40-42)

♦ అన్యేషాంయోనపాపాని...నవిద్యతే | కర్మణా మనసా వాచా పరపీడాం కరోతియః | తద్బీజం జన్మఫలతి ప్రభూతం తస్యచా శుభం| సోహం నపాపమిచ్ఛామి...తస్యమే జాయతే కుతః | ఏవం సర్వేషు భూతేషు భక్తిరవ్యభిచారిణీ, కర్తవ్యా పండితైర్జ్ఞాత్వా సర్వభూతమయం హరిం. (విష్ణుపురాణము 1-19 శ్లో|| 5-9)

అంతట హిరణ్యకశిపుడుగ్రుడ్డై, ఎట్లైనను ప్రహ్లాదుని చంపించదలచి, అద్భుతమగు ఎత్తుగల తన మేడపైనుండి క్రింద నున్న రాతి అంచుమీద విసిరి వేయించెను. అంతట ప్రహ్లాదుడు పైనుండి పడుచు, ధైర్యముతో హరిని హృదయమందుంచెనేగాని జంకలేదు, ఎవరిపైనను ద్వేషముంచలేదు. అతని ధ్యానప్రేమల మహిమవల్ల అతడు దెబ్బతగులకుండునట్లే నేలపైన బడి, సమముగ ఆనుకొనెను. ఇట్లతనిని ఇతర విధములను హిరణ్యకశిపు ఎన్నియో బాధల పెట్టెను. అయితే వారి యెవరిపైనను ప్రహ్లాదుడుకోపపడక, భగవంతుని తదేక ధ్యానముతో స్మరించుచుండెను. అంతట అతనికన్ని ప్రమాదములును తప్పుటచూచి హిరణ్యకశిపు నివ్వెర పడెను; కొడుకును శుక్రాచార్యునిచేత రాజనీతిని బోధించెను. తరువాత కొడుకు రాగనే, హిరణ్యకశిపు "చూచితివా" రాజనీతి యెట్టిదో? ప్రతివానికి మిత్రులు శత్రులు నుందురుగదా! శత్రుల నణచివేయవలెను'' అనెను. కాని ప్రహ్లాదుడు "అది సరే, కాని సమభావము నేర్చిన వానికి మిత్రుడు శత్రువు అను విభేద మెందుకు? బంధవిముక్తి గల్గించు కర్మలు విద్యయునే మంచివి. దురాశయే బంధకము. కనుక స్వలాభము విడచియే కార్యముల జేయుచు సమభావముతోనే యుండవలెను. లోకమంతటిని తన వలె చూచుకోవలె. విష్ణువు విశ్వరూపధరుఁడుగదా'' అని జబా బిచ్చెను.*

తన హింసా సిద్ధాంతమును, లోకమంతటిపైన తన భౌతిక సామ్రాజ్యము స్థాపించు నిరంకుశత్వసిద్ధాంతమును, తన కొడుకే

---

* తత్కర్మయన్న బంధాయ, సావిద్యా యా విముక్తయే,
...తస్మాద్యతేత పుణ్యేషు యయిచ్ఛేన్మహతీం
శ్రియం॥ యతితవ్యం సమత్వేచ నిర్వాణ మపిచేచ్ఛతా।
...ఏతద్విజానతా సర్వం జగత్స్థావరజంగమం
ద్రష్టవ్యమాత్మవద్విష్ణుః యతోఽయం విశ్వరూపధృక్.
(విష్ణు 1-19-41,46,48)

యీరీతిని నిరసించుట తనకు హానికరమనియెంచి,* హిరణ్యకశిపు కొడుకురొమ్మమీద పట్టరాని కోపముతో తన్నెను. అప్పుడును ప్రహ్లాదుడు కాలుష్యమొందక విష్ణువునే తదేక ధ్యానముతో స్మరించుచుండెను. అంతట రాజాజ్ఞపైన భటులు ప్రహ్లాదుని సముద్రమున బడవేసి ఆతనిపైన బ్రహ్మాండమైన పాషాణములను కొండలను తెచ్చివేసిరి.♦ అంతట సముద్రములో అద్భుతమగు మహాక్షోభము గల్గి, తుదకు భగవంతుడు తన దివ్య తేజస్సును గనపర్చెను. అది వారికి అద్భుతముగ గన్పడెను. ఆ తేజస్సు వచ్చిపడగనే హిరణ్యకశిపు నిశ్చేష్టుడై నిర్వీర్యుడైనాడు.

అంతట ప్రహ్లాదుడామహాతేజస్సునుజూచి, తన్మయుడై, విశ్వరూపుడగు భగవంతుని నిర్వ్యాజ ప్రేమతో ప్రార్థించుచు, ఒడలు మరచెను. ప్రహ్లాదుని అహింసాభావమునకును, విశ్వప్రేమభావమునకును, భక్తికిని సంతోషించి, భగవంతుడతనికి వరములిత్తుననెను. తనకు సర్వజన్మలందును విష్ణుభక్తి+ స్థిరముగ నుండవలెనని, తనతండ్రి భక్తుడగు తనపైన జరిగించిన హింసాచర్యలచే నతనికి కల్గుపాపములు పోవలెనని§, ప్రహ్లాదుడు కోరెను. "ఇవిసరే. నీవింకేమైన కోరుము" అని విష్ణువు చెప్పెను. భక్తుడగు వానికింకేమియు నక్కఱలేదు.‡ అని ప్రహ్లాదుడు జవాబిచ్చెను.

---

* తనకు వారసుడై సామ్రాజ్యము తనవలె నిరంకుశముగ పాలించవలెనను కొన్న కొడుకే యిట్లగుట తన సామ్రాజ్యతత్వమునకు మూలోచ్ఛేదకమగును. కనుక ఆకొడుకుపైన కత్తి గల్గుట సహజము.

♦ సచితః పర్వతైరంతః సముద్రస్య మహామతిః. తుష్టావాహ్నికవేళాయాం
ఏకాగ్రమతిరచ్యుతం॥ (విష్ణు 1-19-68)

\+ నాథయోని సహస్రేషు యేషు యేషు వ్రజామ్యహం
తేషు తేష్వచ్యుతాభక్తి రచ్యుతాస్తు సదాత్వయి (వి. 1-20 28)

§ మయిద్వేషానుబంధో భూత్ సంస్తుతా వుద్యతేతవ,
మత్పితుస్తత్కృతం పాపం దేవ తస్య ప్రణశ్యతు.
(విష్ణు 1-20,21)

‡ ధర్మార్థ కామైః కింతస్య......యస్యభక్తిః స్థిరాత్వయి (,, 1-20,27)

"సరే, నిశ్చలభక్తిగల నీకుపూర్ణమగునిర్వాణముగల్గును"*అని, అంతటవిష్ణువంతర్హితుడైనాడు. ప్రహ్లాదుడువచ్చి నిర్వీర్యుడై నిరహంకారియైన తండ్రిని గురువును వెంటనే ప్రీతితో సేవించెను.♦ తండ్రియుతృప్తిచెందెను. అతనియనంతరం ప్రహ్లాదుడుదైత్యులరాజై అంతవరకున్న హింసా సామ్రాజ్యముల నిరంకుశ సంప్రదాయం తొలగించి, దైత్యుల వంశములోను అహింసభావమునే స్థాపించి, అధికారతత్వమువీడి, ప్రజాక్షేమము కాపాడి, తుదకు మోక్షము నొందెను. ఈ ప్రహ్లాదచరిత్ర దృఢమై పరిశుద్ధమైన అహింసా తత్వమెప్పుడును జయమొందునని సూచించును. తండ్రి హింసా చర్యల నతడు ప్రతిఘటించి నిరంకుశతను నిరసించెను; కాని, హిరణ్యాకశిపుపై నగాని అతని భటులపైనగాని, ఎంతమాత్రమూ కోపపడలేదు; తన తండ్రి నిరంకుశ సామ్రాజ్యము తనకు లభించునని, స్వార్థపు ఆశపెట్టుకోక, త్యాగియైనాడు. ఇట్లు విష్ణు పురాణములో జెప్పిన సంగతులనుబట్టి తరువాత తండ్రికొడుకులిద్దరూ యిష్టులైరి. హిరణ్యాకశిపు పశ్చాత్తాపమొంది, ప్రీతుడైనాడు. తరువాత కొంతకాలముకతడు నరసింహుచే 'ఉపరతి'

---

* యథాతే నిశ్చలం చేతో మయి భక్తి సమన్వితం, తథాత్వం
మత్ప్రసాదేన నిర్వాణం పరమాప్స్యసి. (విష్ణు 1-20-28)

♦ సచాపి పునరాగమ్య వవందే చరణౌ పితుః, తంపితా
మూర్ధ్న్యుపాఘ్రాయ పరిష్వజ్యచ పీడితం, జీవసీత్యాహ
వత్సేతి బాష్పార్ద్రనయనో ద్విజ (విష్ణు 1-30,30)

ఇందునుబట్టి, విష్ణువు వెళ్లిన తరువాత ప్రహ్లాదుడు తండ్రికి నమస్కరించగా, తండ్రియు ప్రహ్లాదుని కౌగిలించి, కండ్లనీళ్ళు తెచ్చుకొని, బాగున్నావా అని ప్రహ్లాదు నడిగినట్లు కనబడును.

పొందగా ప్రహ్లాదుడే రాజైనాడు* ("ఉపరతి" అనగా "సమాప్తి" అని శబ్దార్థము)

ప్రహ్లాదుని రక్షించుటకు విష్ణువు కనపడినప్పుడు విష్ణువు నరసింహాకృతినే ధరించి, అప్పుడే హిరణ్యకశిపునిపట్టి చీల్చి రక్తపాతముతో చంపెనని భాగవతములో నున్నది. హరివంశములో ప్రహ్లాదుని హిరణ్యకశిపు బాధించినట్లు అతడు హరిని ప్రార్థించినట్లును చెప్పకయే, హిరణ్యకశిపు పెట్టిన బాధలు సహించలేక దేవతలను ప్రార్థించగా, వారి కోరికపైన నారాయణుడు నరసింహాకృతినిపొంది, ఆరూపముతో సభాస్థలికిరాగా, హిరణ్యకశిపుతోను అతని సేనలతోను పోరి, వారిని చంపినట్లున్నది. వీటి అన్నింటిలో మొదటిదగు విష్ణుపురాణకథయే బాగున్నది. మన యాంధ్రకవులును ఆయా గ్రంధములనువదించుటలో. మూలానుసారముగనే జేసిరి. కలిదిండి భావనారాయణగారి విష్ణుపురాణములో నరసింహావతార ప్రశంస లేదు. ఆభాగమిట్లున్నది. "జలరుహాలోచనుండరుగఁ జయ్యన నాయనఘుండు ప్రాయి పెం। పలవడ దండ్రిపాదముల కర్మిలి మ్రొక్కిన గౌగలించి, యిట్లెలమి- ఘటిల్లగా బ్రతికితే యని మూర్ధము మూరుకొంచు కన్నుల బ్రమదాశ్రుబిందువులు నూల్కొన బాలితుజేసె నందనున్" ఇట్లు పశ్చాత్తాప

* ప్రీతిమాంశ్చాభవత్తస్మిన్ అనుతాపీ మహాసురః, గురుపిత్రోశ్చకారైనం శుశ్రూషాంసోపి ధర్మవిత్। పిత్ర్యుపరతిం నీతే నరసింహస్వరూపిణా, విష్ణునాసోపి దైత్యానాం మైత్రేయా భూత్పతిస్తతః (విష్ణు 1-20-31, 32)

ఇక్కడ 'ఉపరతింనీతే' మరణము పొందింపబడి, అనిశబ్దార్థం; ఇందుపైన శ్రీధరాయవ్యాఖ్యలో 'పునశ్చకాలాంతరే బ్రహ్మశాపవశాత్ అతిక్రోధేన తంహంతుముద్యతే తత్పితరి నృశింహరూపేణ ఉపరతిం నీతే సతి' అనిచెప్పినారు. అతడు దేవతలగూడ బాధపెట్టగా నరసింహుడవతరించి హిరణ్యకశిపు సేనలతోను, అతనితోను ఘోరయుద్ధముచేసి తుదకు చంపెనని హరివంశములో చెప్పినారు.

త్రప్తడగు తండ్రికి గురువులకు శుశ్రూష జేయుచుండె నంత జన కుండు దివి కేగినంతలో దైత్యపతియయి ప్రహ్లాదుడంత........." వెన్నెలకంటి సూరయ్య తన ఆంధ్ర విష్ణుపురాణములో శ్రీధర స్వామి చెప్పిన సూచనల నందుకొని ఇట్లు విపులము జేసినాడు.

"హరి వరమువలన నప్పుడు హిరణ్యకశిపుడును తొంటి యారసమెల్లన్ బరిహృతమై సత్వగుణ స్ఫురణమెయిఁ గాగలించె సుతు ప్రహ్లాదుఁ... అనేక దివ్యవర్ష సహస్రంబులు రాజ్యంబు చేసి తనిసి విష్ణుసాయుజ్యమును బొంద నిశ్చయించియు, దనకు జన్మత్రయావసానంబునగాని కైవల్యప్రాప్తి లేకుండుటం జేసి♦ రజోగుణ ప్రేరితుడై క్రమ్మర విష్ణుదేవునితో బద్ధవైరుండైన, అంభోజాక్షుడు దుర్నిరీక్ష్యమగు ఘోరాకారమూర్తిన్ సభాస్తంభ స్థానమునం జరాచర భయత్ర స్తంబుగా భీమ సంరంభం బొప్ప నృసింహుడై పొడమి యారాత్రించరాధీశ్వరుఁ గుంభ ద్గర్వునిప్రాణముంగొని మెనస్తోకప్రభావంబునఁ." ఇది తృతీయపంథ.

ఇక్కడను నృసింహునిపైన హిరణ్యకసిపు కలియబడినట్లు లేదు.* భాగవతములోమాత్రము "ప్రహ్లాదుని యాశ్వరునిగూర్చి

---

♦ పూర్వము జయ విజయు లిద్దరు శ్రీమన్నారాయణుని ద్వారపాలకులై యుండి, సనకసనందుల విష్ణుసందర్శనమునకడ్డగించి "మూడుజన్మలు భూమిలోబుట్టి విష్ణువిరోధులై విష్ణునిచే హతులై మరల విష్ణు సాన్నిధ్యము జేరగలరు" అని శాప మొందిరట. ఆప్రకారం మొదట హిరణ్యాక్ష హిరణ్య కశిపులై, అంతట రావణ కుంభకర్ణులై, పిదప శిశుపాల దంతవక్త్రులై, ప్రతిసారియు విష్ణువుతో పోరి హతులైరని పురాణ కథ.

*అదృశ్య తాత్యద్భుత రూపముద్వహం స్తంభే సభాయాం నమృగం నమానుషం...ప్రాయేణ మేఽసుం హరిణోరుమాయినా వధః స్మృతో నేన సముద్యతేన కిమ్, ఏవం విమృశ్యాభ్యపతత్ గదాయుధో నదన్ నృసింహం ప్రతిదైత్య కుంజరః, అలక్షితోఽగ్నౌ పతితః పతఙ్గమో యథానృసింహౌజసి సోఽసురస్తథా, తంవిశ్రి దుంతం సగదంగదాధరో మహోరగం తార్క్ష్యసుతో యధాగ్రహీత్॥ సతస్య హస్తోత్కలిత స్తదాసురో విక్రీడయన్ యద్వదహి ర్గరుత్మతః। అసాధ్యమన్య తహృతౌకసో ఘనాపురచ్ఛదా భారత సర్వధిష్ణ్యపాః॥

హిరణ్యకశిపు బాధించుచుండ, సభాస్తంభములోనుండి అప్పుడే నరసింహరూపముగ విష్ణువు కనబడెను; తనతో పోరనే విష్ణువు వచ్చెనని యూహించి హిరణ్యకశిపు గదాహస్తుడై యుద్ధమునకు తయారై నృసింహునిపై నతడు కలియబడెను; విష్ణువతని పట్టుకొనియు లీలకై మొదటిసారి విడచెను. ఇంతలో దేవతలు భయపడిరి. హిరణ్యకశిపును తన బలమునకు నృసింహుడు జంకెనని భ్రమపడి, ఖడ్గచర్మములతో మరల విష్ణువుపై గదిసెను. అంతట విష్ణువతనిని చీల్చివేసెను." ♦ అని చెప్పియున్నారు.

---

♦ తంమన్యమానో నిజవీర్యశంకితం యద్ధస్తముక్తో నృహరేర్మహామనాః, పునస్తమాసజ్జతఖడ్గచర్మణీ ప్రగృహ్య వేగేన గతశ్రమోమృధే......

పోతరాజుగారాంధ్రభాగవతములోను ఇట్లే చెప్పినారు. ఈకథ ప్రకారం హిరణ్యకశిపు తమ్మును బాధించెనని దేవతలు విష్ణువుతో మొరపెట్టుకోగా అహింసాత్మకులగు గోబ్రాహ్మణాదులను శమదమ ప్రేమ మయుడగు ప్రహ్లాదుని అతడు బాధించినవెంటనే వచ్చి యతని జంపుదునని విష్ణువు వాగ్దానమిచ్చినట్లున్నది. (శుద్ధసాధులందు సురలందు శ్రుతులందు గోవులందు విప్రకోటియందు ధర్మపదవియందు దగిలి నాయందు వాడెన్నడలుగునాడె హింస నొందు) కన్న కొడుకు శమదమ సంపన్నుడు నిర్వైరుడనగ ప్రహ్లాదుని వాడెన్నడు రోషత నాపన్నత నొందించు, నాడె పట్టి వధింతుజ్ఞ (ఆంధ్రభాగవతం 7 వ స్కంధం) ప్రహ్లాదుని గూర్చి "సద్గుణంబులెల్ల సంఘంబులై వచ్చి, యసురరాజు తనయునందు నిలచి, పాసి చనవు విష్ణుభావుని విధమున నేడు దలిగియుండు నిర్మలాత్మ" అని పోతన వివరించెను. అతనికి అసుర విద్యను బోధించినమీదట, తండ్రి మరల పరీక్షించగా విద్యాసారములిట్లు ప్రహ్లాదుడు చెప్పెను "తను హృద్భాషల సఖ్యముజ్ఞ శ్రవణముజ్ఞ దాసత్వముజ్ఞ వందనార్చనముజ్ఞ సేవయు నాత్మలో నెఱుకయుజ్ఞ సంకీర్తనల్ చింతనంబను నీతొమ్మిది భక్తిమార్గముల సర్వాత్మజ్ఞ హరిజ్ఞ నమ్మి సజ్జనుడైయుండుట భద్రమంచు దలతుజ్ఞ సత్యంబు దైత్యోత్తమా" అని హరిభక్తి లేని జీవితము వ్యర్థమని వివరించెను. తనను తండ్రి కొట్టించినను ప్రహ్లాదుడు ధీరుడై అహింసాయుతుడై యున్నట్లిట్లు చెప్పినారు.

"తన్ను నిశాచరుల్ పొడువ దైత్యకుమారుడు మాటిమాటికిన్ పన్నగశాయి యోదనుజ భంజన యోజగదీశ యోమహాపన్న శరణ్య యోనిఖిల పావన యంచు నుతించుగాని తాకన్నుల నీరు లేడు భయకంప సమేతుడుగాడు భూవరా" "పాఱడు లేచి దిక్కులకు బాహువులొడ్డడు బంధురాజిలో చూఱడు ఘోర కృత్యములు మానడు తండ్రిని మిత్రవర్గముం జీరడు మాతృ సంఘము వసించు సువర్ణ గృహంబుల నిక్క [illegible] కంటకింపడున్"

## —◆ హరిశ్చంద్ర కథ ◆—

ఇప్పుడు దేశమంతటను వ్యాపించియున్న హరిశ్చంద్రకథ అహింసా సత్యముల మహత్వమును బోధించును. ఇది మార్కండేయాది పురాణములలో చెప్పబడినది. తరువాత ఈకథ మన వాడుకభాషలలోను, ప్రబంధరూపమునను ఇటీవల నాటకముగను ప్రచురితమై ప్రజాభిరుచి నొందినది.* చారిత్రకాలముకు చాల పూర్వము వేదకాలమందు హరిశ్చంద్రుడను రాజవరపుత్రుడు కల్గుట, తరువాత నరయజ్ఞము చేయవలసివచ్చుట, శునఃశేఫ చరిత్ర, ఐతరేయ బ్రాహ్మణములో నున్నట్లు లోగడ చూచినాము. ఇది అందుకు భిన్నము, ఇది యీ క్రిందిరీతినున్నది.

పూర్వము హరిశ్చంద్రుడను సూర్యవంశపు చక్రవర్తి కోసలరాజ్యము నయోధ్యనుండి పాలించుచుండెను. అతడు చరిత్ర

---

అంతట ప్రహ్లాదుడు తోడి దైత్యబాలురకు అహింసాభక్తుల బోధించినట్లు తెలిసి తండ్రియును గదిమెను. "బలవంతుడనేజగముల బలములతో జనకవీర భావమున మహాబలుల జయించితి నెవ్వని బలమున నాడెదవు నాకు ప్రతివీరుడవై" అందుకు ప్రహ్లాదుడు అహింసమునకు సర్వవ్యాపియగు దేవుడే సక్క బసియుడై నను దుష్టశక్తి హింసాభావముగల తన యింద్రియములే శత్రువులనుటకిట్లు చెప్పెను.

"బలయుతులగు దుర్బలులకు బలమెవ్వడు నీకు నాకు బ్రహ్మాదులకున్ బల మెవ్వడు ప్రాణులకును బలమెవ్వండట్టి విభుడు బలమసురేంద్రా" "లోకము లన్నియున్ గడియలోన జయించినవాడ వింద్రియానీకము జిత్తమున్ గెలువనేరవు నిన్ను నిబద్ధుజేయు నాభీకరశత్రు లార్వుర బ్రభిన్నులజేసిన బ్రాణికోటిలో నీకు విరోధి లేడొకడు నేర్పున జూడుము దానవేశ్వరా" ప్రాణులు తనకు విరోధులు కాకుండుట కేమికారణము? తన హృదయమందలి ఈశ్వరుడే ఇతరులందరిలోను అంతటను వ్యాపించియున్నాడు. "ఇందుగల డందు లేడని సందేహముపలదు చక్రి సర్వోపగతుం డెందెందు వెదకిచూచిన నందందే గలడు దానవాగ్రణి వింటే" కనుక ఈశ్వరునందువలె, సర్వజీవులందును ప్రేమగల్గి యుండవలెననియు ఇందుచే సూచితము.

* బాల్యమందు హరిశ్చంద్రునికథను స్వభాషలో చదివినమీదట, ఆమహాకథకైన తనకు గౌరవమును సత్యప్రియత్వమును యేర్పడి తన సౌజన్యమునకు కారణమైనదని గాంధిమహాత్ముడు ఆత్మకథలో తెలిపినారు.

కాలముకు ప్రసిద్ధులైన ఆర్గురు చక్రవర్తులలో నొకడు. అతడు చాల మంచివాడై ప్రజానుకూలముగ దేశమంతటిని పాలించుచుండెను. అతని యోగ్యత సత్ప్రవర్తన ఆదర్శరూపములని అన్ని దేశములందును ప్రఖ్యాతియేర్పడినది అతడు ప్రసిద్ధమగు ఇక్ష్వాకు వంశజుడు. (ఈవంశమందే తరువాత శ్రీరాముడు జనించెను) వారి కులగురువగు వసిష్ఠమహర్షికి విశ్వామిత్రునితో చర్చవచ్చెను. పూర్తిగ సత్యపరులగుట నరులలో నుండదని విశ్వామిత్రుడనెను. అట్టి మహానుభావులుందురని, వసిష్ఠుడు అందుకు హరిశ్చంద్రు నుదాహరణముగ జెప్పెను. సంపూర్ణత్యాగులు అహింసాపరులు అయితేనేగాని సత్యమును సర్వకాలములలోను కాపాడుకొనుట సాధ్యముకాదు. కనుక రాజగు హరిశ్చంద్రుని కట్టి గుణము లున్నట్లు అతికఠినమైన పరీక్షచేసినగాని ఒప్పుకొనని విశ్వామిత్రుడనెను. ఎట్టి పరీక్షకైనను తన శిష్యుడగు హరిశ్చంద్రుడు నిలువ గలడని వసిష్ఠుడువాదించెను.

ఈపట్టుదలవలన విశ్వామిత్రుడు హరిశ్చంద్రుని పరీక్షించుటలో తన యావచ్ఛక్తిని వినియోగించెను; తాను అతి కఠినునివలె వర్తించి, ఆయన పెట్టదగిన బాధలనన్నింటిని బెట్టిచూచెను. హరిశ్చంద్రునియొద్దకు మాయస్త్రీలను బంపించి, అతనిచేత అన్యాయపు వాగ్దానముపొంది, తద్వారా ఆయన రాజ్యమంతను తాను వశపర్చుకొనెను. ఇదికాక తనకు హరిశ్చంద్రుడు చాల సొమ్ము యిచ్చుకొనవలెనని తేల్చెను. రాజ్యభ్రష్టుడు గనుక హరిశ్చంద్రుడు తన సర్వాభరణములు వగైరాలును, రాజ్యపుఆస్తిగ విశ్వామిత్రున కొప్పగించి, ఈసొమ్ములను అలాయిదాగా తీర్చుకోవలెనట. తానట్లొప్పుకోలేదని ఒకచిన్న అబద్ధమాడిన చాలును, రాజ్యము మరల తీసుకోవచ్చును, తన కేమీా యివ్వనక్కరలేదు. అని విశ్వామిత్రుడాశపెట్టెను కాని హరిశ్చంద్రు డబద్ధమాడుట కొప్పుకోక తనను విక్రయించి ఆసొమ్ము తన బాకీక్రింద తీసుకొమ్మని కోరెను. కాని విశ్వామిత్రుడంతటితో పోక, హరిశ్చంద్రుని

మీద మాత్రమంతసొమ్మురాదు, కనుక ముందు రాజుభార్యను కొడుకును విక్రయించవలెనని, అట్లు జరిగించుటకై నక్షత్రకుడను బండబ్రాహ్మణ శిష్యుని ఫరమాయించెను. ఇతడు గురువుకు తగిన శిష్యుడనిపించుకొనెను. అతడు హరిశ్చంద్రుని అష్టకష్టములు బెట్టెను "ఒక చిన్నఅబద్ధమాడుతే చాలు గురువుగారిచేత విడుదల చేయింతును, అందులో తప్పులేదు; ఆఅబద్ధములో అక్రమము లేదు." అని అతడాశగొల్పెను. హరిశ్చంద్రుడందుకొప్పుకోలేదు. నక్షత్రకుడు చంద్రమతిని లోహితుని దుర్మార్గులచే కొనిపించెను. వీరు చంద్రమతిని బాలుని ఎన్నియోచిక్కులుపెట్టిరి. నక్షత్రకుడు హరిశ్చంద్రు నొక మాదిగవానికి విక్రయించెను. ఇదియంతయు విశ్వామిత్రుడు హరిశ్చంద్రునిశాంతమును, సత్యమును పరీక్షించుటకు చేసినవే. హరిశ్చంద్రునికెట్లైన కోపమును హింసాప్రవృత్తిని గల్గించుట కతడనేక మాయోపాయముల బన్నించెను.

హరిశ్చంద్రునికొన్న వీరబాహుడు శ్మశానపు కావలాపనిని హరిశ్చంద్రున కొప్పగించి, అతనిని "వీరదాసు" అనెను. లోహితుడు పాముకాటున చచ్చినట్లు విశ్వామిత్రుడు మాయచేసెను. ఇంతలో రాజుగారియింట వస్తువులుపోయినట్లును, ఆవస్తువులు హరిశ్చంద్రుని భార్యయగు చంద్రమతి ఒడిలో దొరికినట్లును ఒక మాయచేసెను. ఇట్లు విశ్వామిత్రుడు మానవునికి సంభవము కాదగిన కష్టములన్ని హరిశ్చంద్రునికి తెచ్చిపెట్టెను. చచ్చిన కొడుకును దహనముచేయుటకు చంద్రమతి "వీరదాసు" దున్న శ్మశానముకేవచ్చెను. కాని అక్కడ దహనము చేయుటకు రుసుము నీయవలెను; దానిని చంద్రమతినుండి వీరదాసు వసూలు చేయబూనెను. అది అతని నౌకరీ బాధ్యత. ఆస్థితిలో రాజుగారి యింట సొమ్ములపహరించిన నేరముకు చంద్రమతికి మరణదండన వచ్చెను. అట్లు ఆశిరశ్ఛేదముగూడ హరిశ్చంద్రుడే (వీరదాసు) చేయవలసియుండెను. సత్యపాలన నిమిత్తమందుకును హరిశ్చంద్రుడు సిద్ధపడెను. ఆదుర్భరస్థితి సంతట విశ్వామిత్రుడే సహింప

లేకపోయెను. అంతవరకు హరిశ్చంద్రుని నయమునను, భయమునను, అసత్యమాడింప జూచెను. హింసాప్రవృత్తిగల వారసత్యమాడుదురు. అతని కష్టైనను కోపమును హింసాధోరణిని కల్గింపజూచెను. ఒక చిన్న అబద్ధమాడితే కష్టములన్నీ పోవును అట్లు చేయుము అని తొందర జేసెను. కాని విశ్వామిత్రునిమీద అలుగక, ఎన్నికష్టములు వచ్చినను దిగమ్రింగి, ఇక రాజాజ్ఞ ప్రకారం తన భార్యను ఖడ్గముతో శిరశ్ఛేదము చేయుదమని హరిశ్చంద్రుడు చేయి పైకెత్తెను. ఇంతవరకు పాషాణహృదయునివలె సంచరించిన విశ్వామిత్రుడప్పుడువచ్చి ఖడ్గహస్తమును నిలుప జూచెను. కాని హరిశ్చంద్రుడు కర్తవ్యమునుండి చలింపలేదు. అప్పుడు భగవంతుని సత్యస్వరూపము హరిశ్చంద్రాదులకు విశ్వామిత్రునికిగూడ ప్రత్యక్షమైనది. మానవుడు పడదగిన కష్టములన్నిటిని పెట్టినను హరిశ్చంద్రుడు నిల్చినాడు. తనపైన క్రోధహింసలు చూపక, అసత్యము మనసులోనైన తలపెట్టక, హరిశ్చంద్రుడాదర్శసద్వర్తనుడైనాడని విశ్వామిత్రుడంగీకరించెను; చంద్రమతి దాస్యమును చోరశిక్షయు లోహితుని మరణమును విశ్వామిత్రుని తపోబలమున జనించిన మాయాఫలితములే గనుక వాటినన్నిటిని రద్దుచేసి, విశ్వామిత్రుడు మరల హరిశ్చంద్రుని, అతని కుటుంబమును విడుదలచేయించి, ఆయన రాజ్యమంతను యథాస్థితిలో నొప్పగించి, హరిశ్చంద్రు నభినందించి, ఆశీర్వదించెను. అప్పట్లో విశ్వామిత్రుని హింసించినను, దూషించినను, చిన్న అసత్యమాడినను, తనబాధలు వదలి, రాజ్యము మరల చేకూరునని తెలిసియు, హరిశ్చంద్రుడును పూర్తియైన అహింసాపరుడు ధీరుడుగనుకనే, ఎప్పుడును ఆత్మ విశ్వాసమును, నైతిక ధర్మమును మరువక ప్రహ్లాదునివలె తన నిష్ఠను నిలుపుకొగలిగెను. ఈ యిద్దరి కథలును ఆదర్శనీతిబోధకములు. కనుక అవి కావ్య నాటకములుగను, హరికథలుగ గూడ వ్యాపించి ప్రజాదరము బొందుచున్నవి.

## —♦ రంతి దేవ కథ ♦—

పూర్వము రంతిదేవుడను మహారాజు తనరాజ్యపు ఆస్తి నంతను ప్రజాక్షేమముకే వినియోగించెను. ఇట్లుండగా ఆయన ప్రవృత్తిని పరీక్షించుటకు, దేశమందు గొప్ప కరువేర్పడెనట. ఆయన తన సర్వస్వమును పీడితులగు జనులకిచ్చివేసెను. అంతట రాజ్యము నితరులకొప్పగించి, రంతిదేవుడు దేశ సంచారముచేసెను. అప్పుడాయన యొక యెడారిలో తిరుగునప్పుడు 48 రోజులు నిరాహారముగ నుండవలసివచ్చెను. 49 వ రోజున ఆయనకాహారము దొరికెను. ఆకలిబాధ తీర్చుకొనుటకు, దాని నాతడు తినబోవుచుండెను. ఇంతలో నొక బ్రాహ్మణుడు, అంతట నొకశూద్రుడు, పిమ్మట చండాలుడు, ఆవెనుక ఒకనితో కుక్కలును వచ్చెను. ఆజనులందరికిని కుక్కలకుగూడ తనయొద్దనున్న ఆహారమును నీళ్లను గూడ రంతిదేవుడిచ్చివేసి, క్రమముగ వారినందరిని తృప్తిపరచెను ఇదేమి నీయాహారమిచ్చివేసితివి, నీవు బాధపడుదువు. దేహము పోషించుకొని ఉత్తమగతినొందుము. అని యెవరో హెచ్చరింపగా "నాకట్టి యున్నతస్థానమక్కర లేదు. ఇతరులు బాధపడుచుండ నేనూరకుండలేను. ఆదుఃఖార్తుల హృదయములో నేనుచేరి, వారి బాధలను నేననుభవింపగోరుదు. అప్పుడే నాకు శాంతిగల్గును" అని రంతిదేవుడుచెప్పెను.* అట్టి యుదార మహాపురుషుని భారతీయులిప్పటికిని స్మరించుట యాశ్చర్యముకాదు.

---

* న కామయేఽహంగతి మీశ్వరాత్పరాం, అష్టర్ధియుక్తామపు నర్భవంవా। ఆర్తిం ప్రపద్యేఽఖిల దేహ భాజామంతస్థితో, యేనభవంత్య దుఃఖాః।

(శ్రీ మద్భాగవతం ౯)

## 24. పౌరాణిక సంస్కృతి.

### —• కా వ్య క థ లు •—

ఆకాలపు మహాకావ్యములలోని కథలును, అప్పటి సంస్కృతికి సూచకములు.. వీటిలో బౌద్ధుల గ్రంథముల విమర్శించినాము. సంస్కృతములోని సాంప్రదాయిక హిందువుల కావ్యములగూడ గమనింతము. వాటిలోను కొన్ని చక్కని కథలున్నవి. ఈకథలనూ చాలవరకు భారత పురాణాదులనుండి బృహత్కథనుండియు తీసుకొన్నారు. వీటిలో చాలవరకు శృంగార వీరరసములకే ప్రాముఖ్య మిచ్చినారు. అందువలన కామక్రోధముల ప్రకోపము దాని ఫలితములు ఇట్టివాటి వివరణ హెచ్చు. దాదాపు ప్రతి మహాకావ్యములోనూ వీరరసము పేర యుద్ధచర్యలకును రక్తపాత వర్ణనకును కొంత ప్రాచుర్యమున్నది. వీటికిని శృంగారరసపు దశవిధావస్థలకును ఉండవలసిన వర్ణన సందర్భములగూర్చి ఆలంకారికులు కొన్నినియమముల నేర్పరచినారు. అందు కొన్ని హింసాభావపోషకములైనను, మరికొన్ని అహింసాభావముకే సహాయకములు. ఆనియమములప్రకారం, దృశ్యకావ్యములలో మరణవృత్తాంతముల దెలుపవచ్చునే కాని మరణమును, హత్యను, రంగముపైన చూపకూడదు. ఇట్లే కావ్యములలో శోకకరమైన సందర్భములెన్ని వచ్చినను, కథ సమాప్తియగునప్పటికి, సుఖాంతముగనే యుండవలెను, కాని శోకాంతము కాకూడదని యేర్పాటు. నాటకము లీశ్వర ప్రార్థనతో నారంభించి, శుభముకోరు భరతవాక్యముతో ముగింపుకావలెను.

శ్రవ్యకావ్యములును మంగళాది, మంగళమధ్యము, మంగళాంతముగ నుండవలెనందురు.ఇట్లు సాధ్యమైనంతవరకు హింసాభావము మిగులకుండ ప్రేమభావమే చదువరుల హృదయమందు జనింపజేయుట ధర్మమని మనపూర్వులెంచిరి. పాశ్చాత్యరచన

లలో గొప్ప గ్రంథము లనబడునవి తరుచు భీభత్స దృశ్యముల తోను, ఇంద్రియోద్రేకమును ఉద్వేగమును గల్గించు వృత్తాంత ములతోను, పూర్తియగుట కలదు. ఇట్టివి Realistic అనుపేర సంఘంలోని కొన్ని సందర్భముల యథాస్థితిని చూపినను తరుచు హింసాభావముకు తోడ్పడును. ప్రేమతత్వమునే పోషించుట భారతీయ సంప్రదాయం. అయితే ఆచరణలో కొందరు కవులు ఆనియమములను పైకి గమనించినను, ముఖ్యంగా దరిమిలా కావ్యాలలో ఆయుద్దేశము ఫలింపజేయలేదు. కొందరు మహా కవులు అహింసాభావము నక్కడక్కడ చక్కగ పోషించిరి. చారి త్రికముగ ఇట్టి ముఖ్య కవులలో మొదటివాడు భాసుడు.* అతడు చాల నాటకముల రచించెను. వీటిలో స్వప్నవాసవదత్తాదులకథ బృహత్కథలోనిది; తక్కినవి చాలవరకు భారత రామాయణా దులలోనివి. ఆకథలగూర్చి యిక్కడ చర్చించనక్కర లేదు. తక్కినవాటిలో ఒకటి రెండింటిని గమనింపవలెను.

భాసుని "చారుదత్త" నాటకము సుప్రసిద్ధమగు "మృచ్ఛ కటిక"కు‡ పునాది. చారుదత్తుడు అహింసాపరుడు, శాంతుడు, పరోపకారి; అతనికి హానిగల్గించుటకు హింసాకారుడగు శకారు డను రాజస్యాలకుడు ప్రయత్నించి విఫలుడైనట్లీకథలోనున్నది. ఈకవి ఇతిహాసకథలను రసపోషణకై తనకు తోచినట్లు మార్చి నాడు. ఇతని "పాంచరాత్ర"మను మూడంకముల నాటకము విచిత్రము. దీని పాత్రలన్నియు భారతములోని పురుషులే; కాని, ఈకథమాత్రం భారతములో లేదు. ఈకథ యిట్లున్నది. పాండవులు విరాటరాజుకొలువులో అజ్ఞాతవాసము చేయుచుండగా అది సమాప్తియగుముందు దుర్యోధనుడొక మహాయజ్ఞము

---

* భాసుడు కాళిదాసుకన్న పూర్వుడు. ఇతడు 2 వ శతాబ్దివాడు కావచ్చు. ఇతని గ్రంధములు చాలకాలం అదృశ్యమైనవి. 1912 సం॥ లో తిరు వనంతపురంలో మరల ప్రచురితమైనవి.

‡ మృచ్ఛకటికనుగూర్చి ముందు చర్చింతుము.

చేసెను. అందుకు చాలమంది రాజులు విచ్చేసిరి. ఆయజ్ఞము చక్కగనేజరిగి, పూర్తియై, అవభృథస్నానమైనది. అప్పుడు యజ్ఞాంతమున దుర్యోధనుడు తనగురువగు ద్రోణాచార్యునికి వందనముచేసి, తమకిష్టమువచ్చినదానిని యజ్ఞాంతపు గురుదక్షిణగ కోరుమని, అట్లు కోరికను తప్పక నెరవేర్తునని, చెప్పెను. ద్రోణుడు తనకేమియు కోరుకోలేదు. కాని, "అన్నదమ్ముల కుటుంబమగు కౌరవపాండవులమధ్య యుద్ధము జరుగబోవును

అట్టియుద్ధము జరిగితే భారతదేశమంతటికీ మహానర్థమగును. ఈమహాపత్తునెట్లైన తప్పించి లక్షలకొలది జనులకు హింసలేకుండ నివారించుట ప్రాజ్ఞులధర్మము; అట్టి దారుణయుద్ధము రాకుండ జేయుటయెట్లు!' అని దయామయుడగు ద్రోణుడాలోచించుచుండెను. ఇప్పుడు సమయము దొరికినదని ద్రోణుడు "పాండవులకు నీవు అర్థరాజ్యము పంచిపెట్టుము, అదే నేగోరువరము. అదే గురుదక్షిణ అని చెప్పెను. దుర్యోధనుని కట్లుచేయుట యిష్టము లేదు. ద్రోణుడు భూరిధనమో భూములో తనకు కోరుకొనునని అతడనుకొనెను. కాని, అందరియెదుట నిచ్చినమాట నిప్పుడు తప్పుటకు వీలులేదు. కనుక, శకునితో ఆలోచించి, దుర్యోధనుడు ద్రోణునితో పాండవు లెక్కడనున్నారో 5 రాత్రిలలోగా మీరు తెలుసుకోగలిగితే, అట్లే వారికి పంచియిత్తును" అని జబాబిచ్చెను. పాండవులప్పటి కజ్ఞాతవాసములోనుండిరి. వారెక్కడనుండిరో ఎంత వెదికించినను కౌరవులకు తెలియలేదు. "ఈఐదు రోజులలో ఆఅజ్ఞాతవాసులజాడను ద్రోణుడు తెలుసుకోలేడు. గనుక వాటానిచ్చుట కవసరముండదు" అని దుర్యోధనుడాలోచించి అట్లు చెప్పెను. ఆషరతుకు మొదట సంకోచించియు, భీష్ముని సలహాపైన ద్రోణుడంగీకరించెను. పాండవులగుట్టు తెలియుటకై భీష్ముడు వెంటనే యొక యుక్తినిపన్నెను. విరాటనగరములో ఎవరో కీచకుల జంపిరని అప్పుడే కబురు వచ్చినది. అదీ

భీముని చర్యయే కావచ్చును. కనుక పాండవులను బయటపెట్టుటకై అక్కడ కౌరవులచే దండయాత్ర చేయించవలె. విరాటుడు కౌరవుల యజ్ఞముకు రాలేదు; కనుక అందుకు శిక్షగ విరట రాజు గోవుల బట్టుకోవలెనని భీష్ముని సూచనపైన కౌరవులు నిశ్చయించిరి. వారందరూ వెంటనే మహాసేనతో జేరి రెండు వైపులను గోగ్రహణము చేసిరి. అంతట నొకవైపున అర్జునుడు ఉత్తరకుమారునితోవచ్చి కౌరవదళమును జయించి, విరటుని గోవుల విడిపించెను. ఆయుద్ధములో అభిమన్యుడు కౌరవులతరపున వచ్చెనట. అతనిని ఇంకొకవైపునుండి భీముడు పట్టుకొని విరటుని యొద్దకు తెచ్చెను. అర్జునుడు కౌరవుల నోడించి గోవుల మరల్చెను. వీరు పాండవులని తెలిసిపోయినది. ఈలోగా అజ్ఞాతవాసపుకాలము పూర్తయినది. అంతట విరాటుని కూతురగు "ఉత్తర" ను అభిమన్యునికిచ్చి త్వరలోనే పెండ్లిచేయుటకు నిశ్చయమైనది; కనుక ఆకబురు చెప్పి ఆపెండ్లికి పిలుచుటకు ఉత్తరుని ధర్మరాజు దుర్యోధనాదులయొద్దకు బంపెను. దుర్యోధనుడు ద్రోణునికి వాగ్దానము చేసినదిమొదలు అయిదు రాత్రులలోగానే ఈ శుభలేఖవచ్చినది. పంచరాత్రులలో పాండవులజాడ తెలిసెను; కనుక, ద్రోణుని కోరిక ప్రకారం దుర్యోధనుడు అర్ధరాజ్యమును పాండవులకిచ్చుటకు ఖరాగుచేసెను.

ఇట్టిది దీనికథ. కాని ఇది ఒక సుఖస్వప్నమువంటిది. ఈప్రకారం దుర్యోధనుడు వాటాను పంచిపెట్టియుంటే, పాండవులకు యుద్ధకారణమే ఉండదు; అప్పుడు, భారతమహాయుద్ధమును అందువల్లగల్గిన విపరీతమైన జననష్టమున్ను లేకపోయేది. తనఊహా ప్రపంచంలో దారుణమైన భాతృయుద్ధము జరుగక రాజీజరిగిన బాగుండును; ఆ హింసావాతావరణమునుండితప్పి భారతదేశ మింకను మంచిస్థితిలో నుండేది. అని భాసమహాకవి చిత్రించుకొనెను. భ్రాతృకుటుంబమున కర్ధరాజ్యము ఉభయపక్షముల కాచార్యుడగు ద్రోణుని ప్రయత్నముద్వారా లభించినట్లు, హింసలేకుండ

అహింస యేర్పడినట్లును, భాసకవిచేసినకల్పనమనోహరమే. అప్పటి గోగ్రహణము నిజమే. కాని పాండవుల కర్థరాజ్యమును దుర్యోధను డిచ్చుటకు ఖరారుచేసిన కథ సరికాదు. ఇది ఈదేశపు దురదృష్టము. తుద కప్పుడు హింసాతత్వమే విజృంభించి, భారతదేశము మహారణ యజ్ఞముపాలైనది. భ్రాతృకలహములో రాజీయే ప్రశస్తమని సూచించుటే కవి యుద్దేశము.

భాసుని "మధ్యమవ్యాయోగమ"ను చిన్న నాటకపుకథయు చిత్రమైనది.

పాండవులు వనవాసము చేయుచుండగా, వారిని ధౌమ్యముని తనయింట జరుగు యజ్ఞముకాహ్వానించెను. భీముని విడచి తక్కినవారక్కడకు వెళ్లిరి. భీముడప్పుడు వ్యాయామముకు వెళ్లెను. ఈలోగా భీమునికి హిడింబి యను రాక్షసివల్ల పుట్టిన ఘటోత్కచుడడవిలోనుండి ఆప్రాంతముకు వచ్చెను. హిడింబి ఉపవాసముచేసి మరునాడు పారణకు నరమాంసము తినదలచి ఒక నరుని తెమ్మని కొడుకును బంపెను. ఆప్రకారం ఘటోత్కచుడు వెతుకుచు అడవిలో నొక బ్రాహ్మణ కుటుంబము వసించుటజూచెను. ఆవిప్రునికి ముగ్గురు కొడుకులు. వారిలో నొక్కని తన తల్లి పారణకీయవలెను. లేకపోతే అందరినీ చంపుదునని ఘటోత్కచుడు బెదరించెను. ఘటోత్కచుడు మహావీరుడగు రాక్షసుడు. అతనితో పోరి లాభము లేదు. కనుక ఆత్మార్పణ తప్పదు, అందుకు తాను తానని ముగ్గురు కొడుకులును సిద్ధపడిరి. తండ్రి పెద్దకొడుకును, తల్లి చిన్నకొడుకును నిల్పుకోగా, మధ్యముని ఘటోత్కచుడు తీసుకొనిపోయెను. ఈ మధ్యముడక్కడ చెరువులో నీరు త్రాగబోగా అతనిని ఘటోత్కచుడు "మధ్యమా, రమ్మ" అని పిలిచెను. కాని యీలోగా ఆదగ్గరనే సంచరించుచుండిన భీముడక్కడకు వచ్చెను. (భీముడు కౌంతేయులలో మధ్యముడు; పాండవమధ్యముడనికూడ కొన్నిచోట్ల అతనికి వాడుక కలదు) ఈవిప్రసుతుడు

ఆశ్రయింపగా, అతనిని భీముడు రక్షింప నిశ్చయించెను. ఘటోత్కచుడు తండ్రి నానవాలు పట్టలేకపోయెను. కనుక విప్రబాలుని వశపర్చుకొనుటకు కొంతసేపతడు భీమునితో పోరెను. తుదకతని పరీక్షింపదలచి ఆవిప్రునిస్థానే తానే ఆహారమగుదునని భీముడు సిద్ధపడెను. ఇట్లు వారిద్దరును అడవిలో హిడింబియొద్దకేగిరి. హిడింబి భీమునిజూచి, భర్తయేయని గ్రహించి, సిగ్గుపడెను. దంపతులు కలుసుకొనిరి. ఇట్లు (విశ్వామిత్రుడు శునశ్శేఫుని రక్షించినట్లు) భీముడు ఆవిప్ర యువకుని బలికాకుండ రక్షించెను.

ఈ కథయు భారతములో లేదు. హిడింబి భీముని ప్రేయసియై ఆతనివల్ల ఘటోత్కచునికనెను, అనునదిమాత్రము భారతములో నున్నదే.

హిడింబి మాగుమూల అడవిలోని రాక్షసి. హిడింబి తన పారణకు నరుని తెమ్మనికోరినట్లు ఈకవి చెప్పినాడు. భీముడా విప్రబాలుని రక్షించుటకు నిశ్చయించి, అతనికిబదులు తానే సిద్ధమగుటయు విశేషము. అయితే, హిడింబి నరమాంసము కోరెనని తెలిసినప్పుడు, భీముడామెను పరీక్షించి నరభోజనమునుండి తప్పించుటకు నిశ్చయించెను; ఆమెకింకను నరమాంసాశ యున్నదను భావన భీముని బాధించినది. ఆమెను కలియగనే, ఇదేమని అతడడిగెనట ఆమె చెప్పిన సమాధానమువిని, ఈమెకిప్పుడు నరాశనత్వము లేదని, తనను కలియుటకట్లు యుక్తి చేసినదని గ్రహించి "నీవిప్పుడు జాతిచే రాక్షసివి; ప్రవర్తనలో కాదు.* అని భీముడు సమాధానపడెనట. ఈ యేకాంకనాటకములో భీముని ప్రేమ భావమును, భారతకాలమునాటికి నరాశనత్వము అరుదుగనున్న దనియు సూచితము.

* "జాత్యా రాక్షసీ, న సముదాచారేణ" (మధ్యమ వ్యాయోగము)

తరువాత చెప్పదగినవి కాళిదాసు రచనలు* సంస్కృత కవులందరిలో నితడు మహనీయుడు, భావగాంభీర్యములోను, శైలీ మాధుర్యములోను, అతని గ్రంథములు అసమానములు; వాటిలో మన సంస్కృతియు చక్కగా గోచరించును. ఇతనికావ్యములు ధ్వనిప్రధానములు, కళాభివ్యంజకములు. అక్కడక్కడ భూత దయ సూచించు గాథలున్నవి.

కాళిదాసు శ్రవ్యకావ్యములలో నుత్తమమైనది "రఘు వంశము'' దీనిలో కవి ఇక్ష్వాకువంశపు దిలీపుడు మొదలు ఆరాజుల చరిత్రమును వివరించినాడు. మొదటనే ఆరాజుల జీవిత మెట్టిదో తెల్పినాడు. ఈవివరములు ఉదారమైన ఉన్నతాదర్శ ముల దెల్పును. రాజులు పన్నులద్వారా ద్రవ్యమును పోగు జేయుదురు; అది తప్పదు? దానిని నిలవజేసుకొని స్వలాభము కుపయోగించుకోక వీరు ప్రజలకే వినియోగించి త్యాగమునే చేసిరి. వారు సత్యపరులై మితముగనే సంభాషించిరట. దేశముల జయించినందుకు ఐక్యము కలిగించి, జనరక్షకులని కీర్తిసంపా దించిరి. ఇంద్రియలోలురుకాక బిడ్డలకొరకే గృహస్థులైరి.♦

ఇట్లు రాజవంశము వారికి కలవని సూచించిన త్యాగము, మితభాషిత్వము, సత్ప్రవర్తనము, బ్రహ్మచర్యము అహింసా ప్రవృత్తికి సాధకములు; కనుక చక్రవర్తులు రాజులుగూడ అహింసాధర్మమును యథాశక్తిగ పాలింపవలెనని కాళిదాసు సూచించినాడు. ప్రజాక్షేమము నిమిత్తమే పన్ను వసూలుచేసి రాజు వారిని రక్షించి పోషించి తండ్రివలె నుండెనని దిలీపుని గూర్చి కాళిదాసు చెప్పినాడు.‡

---

* కాళిదాసు క్రీ. త. 5 శతాబ్దివాడని అనేకుల అభిప్రాయం; 1 వ శతాబ్దివాడని కొందరందురు.

♦ త్యాగాయ సంభృతార్థానాం సత్యాయమితభాషిణాం యశసే విజిగీషూ ణాం ప్రజాయై గృహమేధినాం (ర-1-17)

‡ ప్రజానామేవ భూత్యర్థం స తాభ్యో బలిమగ్రహీత్ (రఘువంశ 1-18)

ఆయన ప్రజలకు తండ్రివలె నుండేవాడని వివరించినాడు.*

రఘువంశపు రెండవసర్గలోని యొక చిన్న కథ వినతగినది. దిలీపమహారాజు పిల్లలులేక భార్యతో కలిసి వసిష్ఠాశ్రమమునకు వెళ్లి తనకు పుత్రుడు కావలెనని కోరినాడు ; కులగురువగు వసిష్ఠుడాలోచించి పూర్వము నీవు కామధేనువును అనాదరణచేసితివి ; అందువల్ల నీకు సంతానము లేకపోయినది. దాని కూతురగు నందిని నాయొద్దనున్నది. దానిని సేవించుము దాని యనుగ్రహమువలన మీకు శుద్ధిగలిగి మంచి సంతానము గల్గును" అని దివ్యదృష్టితో చెప్పెను. అట్లేయని, కులగురువు సెలవుపొంది, శాంతి ప్రేమస్వరూపిణి యగు ఆధేనువున కాదంపతు లుపచారము చేయుచుండిరి. దిలీపుడు స్వయముగ నందిని కడవిలో కాపుగ నుండెను. ఒకరోజున ఆధేనువు హిమాలయగిరులలో నొక గుహలో దూరెను. అప్పుడా రాజక్కడనే యుండెను. కాని ఆయనదృష్టి ఆకొండల ప్రకృతి సౌందర్యమందు లగ్నమైయుండెను. ఈలోగా సింహమొకటి హఠాత్తుగ నందిని ధేనువుపైకి దుమికెను. నందిని యరపులు విని, దిలీపుడు తిరిగి చూచెను ; నందిని దీనముఖియై సింహపుపట్టులో చిక్కియుండెను. వెంటనే దిలీపుడు తన బాణములను సింహముపైన వేయుటకు చేతిని అంబులపొదిలో పెట్టెను ; కాని ఆచేయి అందు పట్టుకొని, యీవలకు రాలేదు. అతడు రోషపూరితుడై పెనుగులాడుటజూచి, సింహమిట్లనెను. "రాజా నీవెంతగుంజినను లాభములేదు ; ఈప్రక్కనున్న దేవదారుమొక్కను శ్రీ శంకరులవారు పుత్రసమముగా పెంచినారు. దీనినడవియేనుగు పాడుచేయుచున్నందున

---

* ప్రజానాం వినయాధానాద్రక్షణాద్భరణాదపి
సపితా పితరస్తాసాం కేవలం జన్మహేతవః ( ,, 1-24)
తథాపి సర్వే తస్యాసన్ పరార్థైక ఫలాగుణాః

శాకుంతలము శ్లో॥ "స్వసుఖనిరభిలాషః ఖిద్యసే"
లోకహేతోః ప్రతిదినమథవా తే వృత్తిరేవం విధైవ,
అని వివరించినాడు.

తనబంటునగు నన్ను సింహముగజేసి, దానికి కాపుంచి యిక్కడ జేరు జంతువుల నాహారముగ దినుమన్నారు ; శివునాజ్ఞ తప్పదు; ఇందునీకు పౌరుషలోపము లేదు. శస్త్రరక్షణకు సాధ్యముకాని విషయములో వీరులకీర్తికి భంగముండదు"* అంతట దిలీపుడు ఆలోచించి "నేనిప్పుడు చేతగానిస్థితిలో నేమి చెప్పినను నవ్వులాటయే. లోకమంతటికి సృష్టిస్థితిలయకారుడైన యీశ్వరుడును నాకు పూజ్యుడు. గురుధనమగు ఆవును కండ్లయెదుట నశింపనిచ్చుటయు కూడదు; కనుక నీయాహారమునకై నా దేహము తీసుకొని నామాంసముతో నీయాకలి తీర్చుకో; పాపమీయావు సాయంకాలమైె కనిపెట్టుకొన్నదూడను జేరవలెను. అప్పుడుభయుల కోరికలును నెరవేరును" అనివేడెను‡ కాని సింహము "ఇదేమి, ఏకచ్ఛత్రాధిపతివి. వేలకొలది గోవులను నీవు గురువుకీయవచ్చును వెళ్లి ప్రజల బాలించుకో" అని మరల్ప జూచెను. కాని, రాజు "క్షత్రియుడనగా ఆపత్తునుండి రక్షించువాడే. అది లేసి రాజ్యమెందుకు, ప్రాణమెందుకు. ఇది కామధేనువుతో సరియైనది. నా దేహమునే క్రియధనముగ నిచ్చెదను. నన్ను హింసింపకూడదని నీకు తోచునా, నాకీర్తి దేహమును దయయుంచి కాపాడు, రక్ష్యమగు ఆవును చావనిచ్చి నేనింటికి చేరలేను'' అని సింహమును ప్రార్థించి ఒప్పించెను.♦ అంత దిలీపుని

---

* శస్త్రేణరక్ష్యం యదశక్యరక్షం నతద్యశః శస్త్రభృతాంక్షిణోతి
(రఘు 2—38)

‡ మాన్యస్స మేస్థావరజంగమానాం సర్గస్థితిప్రత్యవహారహేతుః, గురోర పదం ధనమాహితాగ్నేః నశ్యత్పురస్తాదనుపేక్షణీయం॥ సత్వం మదీయేనశరీరవృత్తిం దేహేన నిర్వర్తయితుం ప్రసీద. దినావసానోత్సుక బాలవత్సా విసృజ్యతాం ధేనురియం మహర్షేః (" 2—44, 45)

♦ క్షతాత్కిలత్రాయత ఇత్యుదగ్రః క్షత్రస్య శబ్దో భువనేషు రూఢః। రాజ్యేనకింతద్విపరీతవృత్తేః ప్రాణైరుపక్రోశ మలీమసైర్వా॥ ........ సోయం స్వదేహార్పణ నిష్క్రయేణ న్యాయ్యోమయా మోచయితుం భవత్తః...... ధాతుర విరోధకృత్స్నహిశక్యమగ్రే వినాశ్యరక్ష్యం స్వయమక్షతేన కిమప్యహింస్యస్తవ చేన్మతోహం యశః శరీరే భవ మేదయాలుః. (రఘు 2—53, 55, 57, 58,)

చేతి కంబుల పొదినుండి పట్టువదలినది. అంతట రాజు బాణముల వదలి సింహమువద్దజేరి తన దేహము నర్పించెను.* కాని అతడు కండ్లు తెరచి చూచునప్పటికి సింహము కనబడలేదు. ఆ నంది మాత్రము "రాజా, తెల్లబోకుము. నాయొద్దకు సింహములు రాలేవు. నిన్ను పరీక్షించుట కీమాయ కల్పించితి; నీగురుభక్తి దయాశీలముచూచి సంతోషించితి ఇప్పుడు నీవు కోరు వర మిత్తును." అని ప్రేమతో చెప్పెను; అతడు తనకు కొడుకు పుట్ట వలెననగా "నాపాలను పిదికించి త్రాగుము; నీకోరిక సిద్ధించును" అని ధేనువుచెప్పెను. దూడకును వసిష్ఠుని హోమమునకును సరి పోగా మిగిలిన పాల నింటివద్ద త్రాగుదును, అని ఆ మహా నీయుడు చెప్పి, అట్లు చేసెను; తరువాత దిలీపునకక్లో పుత్రుడు "రఘువు" జనించెను. ఈకథలో అహింసాసత్యమూర్తియగు గోవును ప్రకృతి మధ్యను సేవించుద్వారా కార్యసిద్ధియైనట్లు చూచినాము. ధేనువుకు హింసలేకుండ కాపాడుటకై యత్నించి, తుదకు రాజగు దిలీపుడు ఆత్మ సమర్పణము చేయుట గొప్ప విశేషము.

కాళిదాసు తన గ్రంథములో ప్రశాంత గంభీరములైన హిమాలయాదిగిరులను, అహింసాతత్వమున కావాసములగు ఋష్యా శ్రమములను, అక్కడి పరిస్థితులు పరమానందదాయకములని మనో హరముగ వర్ణించినాడు. శాకుంతల నాటకములో కణ్వాశ్రమ మును కశ్యపుని నివాసస్థలమును చక్కగ చిత్రింపబడినవి.

హింసగ్ర మృగములబారినుండి రక్షణను ఋషులో కర్షకులో కోరినప్పుడు, రాజులు వేటకు వెళ్లవలెను; కాని కొంతకాల ముకు కొందరు తమ ఖులాసా తీర్చుకొనుటకు మాంసాహారము సంపాదించుటకును వేటాడజొచ్చిరి. "దుష్యంత రాజొకసారి

---

* సన్న్యస్త శస్త్రోహరయే స్వదేహం ఉపాయత్పిండ మివామిషస్య.
(రఘు 2-59)

వేటాడుచు ఒక లేడిని చంపుటకై తరుముచుండెను; అక్కడ దగ్గర నున్న కణ్వాశ్రమమునుండి వచ్చిన శార్ఙ్గరవుడను కణ్వశిష్యుడు "మృదువగు జంతువుల దేహముపైన బాణము వేయగూడదు. అట్టిచర్య పువ్వులలో నిప్పవేసినట్లే"♦ అని రాజును వారించి మృగమును రక్షించెనని శాకుంతలములో కాళిదాసు చెప్పి యున్నాడు.

పూర్వపు సంస్కృతనాటకములో *మృచ్ఛకటికమును అహింసాసందర్భముకలదే. దీని కథానాయకుడు చారుదత్తుడను బ్రాహ్మణుడు. ఇతడు గొప్ప కోస్తావ్యాపారముచేసి, తాను విశేషముగ సంపాదించిన ధనమంతను సత్పాత్రదానమునకు వినియోగించి నాడు ; ఈలోగా వర్తకములో దైవయోగమున అపార నష్టము గల్గినది ; కనుక ఆస్తి అంతయు పోయినది ; ఇతడు ఎవరినీ ఎప్పుడూ బాధపెట్టడు ; అక్కడి "శకారుడు" దుష్టుడు, హింసాపరుడు, గర్వి ; దరిద్రుడైన చారుదత్తునకిప్పుడు మంచి పేరుండుట యితని కిష్టములేదు. ఆపురమందలి వసంతసేనయను సుందరి చారుదత్తుని సద్గుణముల కాకృష్టయై అతని చెలిమిచేసెను; వేశ్య యగు వసంతసేన రాజబంధువగు తననే వరించవలెనని శకారుని పట్టుదల. శకారుని హింసాతత్త్వము హింసకుల దురాచారములును ఈగ్రంథములో చక్కగ చూపినారు. చారుదత్తునింటికి పోదమని వసంతసేన బండి యుంచుకొనెను. ఈబండిలో మరి యొక డెక్కి యెక్కడికో పారిపోవును. అంతలో అక్కడ అట్టిదే మరియొకబండి నిల్చెను. వసంతసేన పొరబాటున ఆబండిలో

---

♦ నఖలు నఖలు బాణః సన్నిపాత్యోఽయమస్మిన్ మృదునిమృగశరీరే పుష్పరాశా వివాగ్నిః । క్వబతహరిణకానాం జీవితం చాతిలోలం క్వచనిశిత నిపాతాః సారపుంఖాః శరాస్తే (శాకుంతల 1 వ అంకం)

* మృచ్ఛకటిక 1 వ శతాబ్దిదని కొందరును 6 వ శతాబ్దిదని కొందరును భావించుచున్నారు, దీనిని శూద్రకుడను రాజు రచించెనని అందులో చెప్పి యున్నది.

నెక్కినది. దానిని శకారునితోటలో చేర్చిరి. అక్కడ వసంత సేనను బాధించి, తుదకామె మెడను నులిమివేసి, చచ్చినదని యెంచి, ఒకమూల నాదేహమునుంచి, అందుపైన ఆకులు కప్పి వెళ్లిపోయి, పైపెచ్చు ఆమెను చారుదత్తుడు చంపెనని ఫిరియాదు చేసెను. బీదవాడుగనుక ఆమె నగలకాశించి చారు దత్తుడిట్లు హత్యచేసెనను ప్రవాదము నతడు పుట్టించెను. ఆకేసు విచారణ విచిత్రమైనది. చారుదత్తుడు నిర్దోషినని నిదర్శనము చూపలేదు. ఇతడు ఖూనీచేయగా చూచితినని శకారుడే సాక్ష్యమిచ్చెను. ఇంతకుపూర్వము చారుదత్తుని ముద్దుల కొడుకు పక్కయింటి బాలుని ఆటవస్తువులనుజూచి తనకును కావలెనని యేడ్చుచుంటే వసంతసేన తన బంగారువస్తువుల నాబాలునకు ప్రీతితో నిచ్చెను. వసంతసేన కనబడలేదని ఖూనీకేసు వచ్చినదని నగరమందు ఆందోళన గల్గినది. చారుదత్తుని మిత్రుడగు మైత్రేయుడు ఆవస్తువులను చంకలో నుంచుకొని, ఆదారిని వచ్చెను. ఈకేసు సంగతి తెలియకయే ఆతడు జనులు గుమిగూడియున్న రాజసభలో ప్రవేశించెను; అక్కడ శకారునితో వాదించుచు కోపముతో నతడు చేతినెత్తెను; అప్పుడు చంకనుండి ఆభరణములు నేలపైన జారెను ఆవస్తువులు చారుదత్తునింటనుండి మిత్రుడు తెచ్చుట, అవి వసంతసేనవేయగుట, గట్టి నిదర్శనములు; కనుక, చారుదత్తుడే దరిద్ర్యాశచే వసంతసేనను చంపెనని, అధికారి భావించి చారు దత్తునికి ఉరిశిక్ష విధించెను.

ఇంతలో చచ్చినదనుకున్న వసంతసేన దేహమును, అంతకు ముందు ఆదయాళువుచే నుపకారమొందిన బౌద్ధశ్రమణకుడుచూచి, అహింసాపరుడుగనుక ఆమెకెట్లో చికిత్సచేసి బ్రతికించెను. ఆమెకు క్రమముగ ఊపిరివచ్చెను. తెప్పరిల్లినమీదట శ్రమణకుడామెను నెమ్మదిగ చారుదత్తునింటికి జేర్చుటకు రాజవీధిని తీసుకొనివెళ్లెను. వసంతసేన బ్రతికివచ్చిన సమయమందే రాజ్యక్రాంతి కలిగి, వెనుకటి పాలకుడు భ్రష్టుడుకాగా "ఆర్యకు"డను సత్పురుషుడు

(చారుదత్తుని మిత్రుడు) రాజయ్యెను. శిక్షకు మూలాధారమగు ఖూనీ జరగనేలేదు. గనుక అధికారులా మరణశిక్ష రద్దుచేసిరి. ఖూనీ జరిగినట్లు అబద్ధపు ఫిర్యాదుచేసి తప్పుడు సాక్ష్యమిచ్చి నందుకు శకారుని రాజభటులు పట్టుకొనిరి. శకారుడు తప్పు నొప్పుకొనెను. క్షమింపుమని కోరెను. చారుదత్తుడు దయతో అధికారుల నొప్పించి, శకారునికి శిక్ష తప్పించెను.

మానసికహింస తుదకు భౌతికహింసకు కారణమగు సంగతి దుర్వ్యసన దురభ్యాసములు గలవారు హింసాత్మకులౌటయు హింసా అహింసల సంఘర్షపు పరిణామములను, ఈనాటకములో చక్కగ సూచించినారు. ఈనాటకమందు లోకమందలి యథాస్థితియు ఆదర్శతత్వమును ( Realism and idealism ) చక్కగా మిళితములైనవి. అహింసాపరులకు మొదట కష్టము లేర్పడి తుదకు సత్ఫలము గల్గుననియు సూచింపబడినది. పశ్చాత్తాపపరుని దండించక ప్రేమభావము జూపుటే ప్రశస్తమని ఇందు చెప్పియున్నారు.* మృచ్ఛకటికలో సామాన్యుల జీవితము ముఖ్యాంశము. తరువాత ముఖ్యకవి భవభూతి. ఈయన తన ఉత్తరరామ చరితములో ఉన్నత వంశపువారిని ముఖ్యపాత్రలుగ చిత్రించెను.♦ ఇందలికథ శ్రీరాముడు రాజ్యభారము వహించిన తరువాత అయోధ్యలో నెవడో "పరునివశమైన సీతను మరల రాముడు తెచ్చుకున్నాడు. కాని పౌరుషముగల తానట్లు చేయ"నని చెప్పెనట ; ఆ వార్తను చారుడొకడు శ్రీరామునితో జెప్పెను. అట్టి యపవాదమేర్పడుట తన ఆదర్శజీవితముకు తగదనియెంచి, శ్రీరాముడు లక్ష్మణునిద్వారా సీతనడవికి పంపివేసెను. అప్పటికి ముందే సీత గర్భవతియై తనకు ఋషుల యాశ్రమమును జూపుమని భర్తనడిగియుండెను. ఆ పేరుపెట్టి, తీసుకపొమ్మని

---

* శత్రుః కృతాపరాధః శరణముపేత్య పాదయోః పతితః|
శస్త్రేణ నహన్తవ్యః, ఉపకారహతస్తు కర్తవ్యః.
(మృచ్ఛకటిక 10 వ అంకం)

♦ భవభూతి క్రీ. శ. 8 వ శతాబ్దిలో జీవించెను.

చెప్పగా, లక్ష్మణుడట్లుచేసి అడవిలో అసలుసంగతిని సీతతో చెప్పెను. అంతట సీతాదేవి చింతించి మహర్షియగు వాల్మీకి యాశ్రమము జేరి, అందు ప్రసవించి, అడవిలో తన శిశువులగు లవకుశులతో చాల కష్టములు బడెను. వారు వాల్మీకియొద్ద సకలవిద్యల నేర్చుకొనిరి. పిమ్మట శ్రీరాముడు అశ్వమేధము తలపెట్టి, దిగ్విజయ సూచనగ అశ్వమును పంపెను. దానిని వీరు పట్టుకొనిరట. దానిని విడిపింపవచ్చిన లక్ష్మణుని కొడుకగు చంద్రకేతువుతో వారు పోరిరి. తరువాత శ్రీరామునెదుట వీరందరును కలియుదురు. మధ్య అంతర్నాటకము వచ్చును. ఇందలి ముఖ్య కథను కాళిదాసుకూడ (ఉత్తరరామాయణము ననుసరించి) లోగడ తన రఘువంశములో మధుర రసవంతముగ చెప్పినాడు. అయితే భవభూతి రచననాటకము; ఇందు కొన్ని దృశ్యములు కరుణరస వర్ధకములుగ చేర్చబడినవి. ఉత్తరరామచరిత మతివిశిష్టమని ఆలంకారిక భావము.♦ అగ్నిపరీక్షయై, సీత సాధ్వియని తెలిసియు లోకాపవాదమునకు వెరచి సీత నడవికి భ్రమపెట్టిపంపి, అక్కడ విడచుట, సీత దృష్టితో జూచినయెడల, హింసాయుతమని తోచక మానదు. ఇందు భౌతిక హింసకన్న మానసికహింస హెచ్చు. ఆయాక్షేపణ తగ్గుటకు కొంతవఱకు కాళిదాసును, అంతకన్న హెచ్చుగ భవభూతియు, శ్రీరాముడు సీతాత్యాగమునకు తరువాత గూడ ఆమెకై మిక్కిలి తపించుచు విచారించిన సంగతికి ప్రాముఖ్యమిచ్చినారు.* సీతాదేవి ఈసందర్భమున శ్రీరామునికన్నను ఉదారురాలని ఈకథ సూచించుచున్నది. భర్త విసర్జించినట్లు తెలిసిన మీదటను, ఆమె శ్రీరాముని నిందింపలేదు; ఆయనపైన ఆక్షేపణ నితరులతో జెప్పలేదు. మరల నయోధ్యకు వచ్చుటకు యత్నింపలేదు తనకు జరిగిన అన్యాయము

♦ ఉత్తరే రామచరితే భవభూతి ర్విశిష్యతే.

* రఘువంశపు 14వ 12వ సర్గతో రావణవధ పూర్తికాగా 13లో విమానము నుండి భారతదేశపు దృశ్యములను 14 లో పట్టాభిషేకమును, తరువాత 14, 15 లో ఉత్తర రామాయణ కథయు చెప్పబడినది.

నంతను భరించి, ఆమె తుదివరకు ఆదర్శమగు సద్వర్తనముతో నుండి, భారతీయ స్త్రీజాతికి ఖ్యాతి తెచ్చినది. ఆమె ప్రేమతత్వ ముకు మితిలేదు. తరువాత అప్పుడప్పుడు శంబూక వధవంటి హింసాచర్యలు తప్పక పోయినను, మొత్తముమీద రామరాజ్యము దేశమంతటను శాంతిని పరస్పర మైత్రిని ప్రజలలో గల్గించినది. కైకేయీవరసమయమందు రాముని కేర్పడిన రాజ్యశ్రీయు సీతాదేవియు నుండగా, రాజ్యలక్ష్మిని విడచి రాముడడవిలో సీతతో నుండెను. ఇప్పుడు రాజ్యలక్ష్మి కసిదీర్చుకొనుటకు సీత నడవికంపి రాముని ప్రేమాభిమానములను పూర్తిగ తానే వశపర్చుకొనెను. రాముడు మరల వివాహమాడక, ధైర్యముతో, లోకక్షేమపు కృషినే జేయుచుండెను. ఉత్తరరామ చరిత్ర చదువువారికి మాత్రము రాముడు మొదట కఠినుడై తరువాత అహోరాత్రములు సీతాదేవికై వేదనపడుచు శోకమగ్నుడై యుండినట్లును, సీతయు అట్లే పరితపించినట్లును తెలిపినాడు; కనుక భౌతికమగు కుటుంబ ప్రేమాశ వారికి వదలలేదని సూచితము కావచ్చును.

కాని రామచంద్రుడు విశ్వప్రేమమయుడై ప్రజాసేవయందే మగ్నుడైనట్లును, సీతయు వానప్రస్థయై సంతుష్టయైనట్లును సూచించి కాళిదాసు సీతారాముల పాత్రలకు కొంతగాంభీర్యము తెచ్చినాడు * సీత చనిపోయినదేమో యని చాల విచారించి రాముడామెకై శోకించినట్లును, సీతయు చాల దుఃఖములపాలై, తుదకుమాత్రం శ్రీరామునితో కలసినట్లును భవభూతి వర్ణించినాడు. నాటకమునంతను కరుణతో నింపిన భవభూతి యట్లు

---

* సీత యిట్లే భావించెనని, తననిక తక్కిన తపస్వులవలె మాత్రము కనిపెట్టవలెనని కోరినట్లును, కాళిదాసు వర్ణించినాడు. "ఉపస్థితః పూర్వ మపాస్య లక్ష్మీం వనం యయాసార్థమసి ప్రపన్నః. తదాస్పదం ప్రాప్యతయాతిరోషాత్ సోఢాస్మి నత్వద్భవనే వసంతీ ... నృపస్య వర్ణాశ్రమ పాలనం యత్సఏవ ధర్మో మనునా ప్రణీతః. నిర్వాసితాప్యేవమతస్త్వయాహం తపస్వి సామాన్యమపేక్షణీయా." (రఘు 14 వ సర్గ 63, 67 శ్లో)

చేయుటకు నాటకములు శోకాంతము కాకుండు నియమమందు గౌరవమే కారణముకావచ్చు. కాళిదాసును శ్రవ్యకావ్యములో తరువాతి తరముల చరిత్రగూడ వివరించెను గనుక, ఇది గ్రంథ మధ్యమైనది. వాల్మీకి మహర్షి కుశలవులను రామున కొప్పగించి, సీత నిర్దోషిగనుక ఆమెనుగూడ తీసుకొమ్మని కోరెను. సరే తాను నిర్దోషినని బహిరంగముగ ప్రజలు నమ్మునట్లు చెప్పవలెను; అప్పుడామెను గ్రహింతును.* అని రాముడనెను. అంతట మహర్షి వెనుక సీతాదేవి వచ్చి నిండుసభలో నిట్లు చెప్పెను. "భూదేవీ! నేను త్రికరణశుద్ధిగ పతివ్రతనైతే నన్ను అంతర్ధానముచేయుము"♦ వెంటనే ఒక అద్భుతజ్యోతితో నాగసింహాసనముపైనున్న భూదేవి ఒక కన్నమునుండివచ్చి, సీతను తొడపై నుంచుకొని అందరూ వద్దను చుండగనే ఆమెతో కలసి, పాతాళమును చేరెను. ఇది ఉత్తరరామాయణములోని కథ. కాళిదాసును ఇట్లే చెప్పినాడు.* ఎట్లైనను, ఈకథ స్త్రీలవిషయమున పురుషుడు తరుచు చూపు హింసాధోరణికి నిదర్శనము. ఈకథలో అహింసా సత్యపరు

---

* తాః స్వచారిత్రముద్దిశ్య ప్రత్యాయయతు మైథిలీ
తతః పుత్రవతీ మేనాం ప్రతిపత్స్యేత్వదాజ్ఞయా.

♦ వాఙ్మనః కర్మభిః పత్యౌ వ్యభిచారో యథా న మే
తథా విశ్వంభరే దేవి మామంతర్ధాతు మర్హసి
( రఘు 15 వ సర్గ శ్లో॥ 73, 81 )

యథాహం రాఘవాదన్యం మనసాపి న చింతయే
తథా మే మాధవీ దేవీ వివరం దాతుమర్హసి.
(ఉత్తరరామాయణం 97 వ స॥ 14 వ శ్లో)

* భూతలాదుత్థితం దివ్యం సింహాసన మనుత్తమం తస్మింస్తు ధరణీదేవీ బాహుభ్యాం గృహ్య మైథిలీం। తామాసన గతాం దృష్ట్వా ప్రవిశంతీం రసాతలం.
(ఉ. రా. 97 స శ్లో 17, 20)

తత్ర నాగఫణోత్క్షిప్త సింహాసన నిషేదుషీ। సముద్రరశనా సాక్షాత్ ప్రాదురాసీద్వసుంధరా। సా సీతామంక మారోప్య భర్తృప్రణిహితేక్షణాం। మామేతి వ్యాహరత్యేవ తస్మిన్ పాతాల మభ్యగాత్.
(రఘు 15 వ సర్గ [illegible], 84 శ్లో)

రాలగు సీత సంపూర్ణ త్యాగము గావించి ధైర్యముతో వర్తించి ఆత్మగౌరవమును కాపాడుకొన్నది. అంతట శ్రీరాముడు పశ్చాత్తాపమొంది విరక్తుడై, రాజ్యమంతను పుత్రుల కందరికిని విభజించెను. ఇట్లు సీతారాముల అంత్యకాలము సన్యాస త్యాగములతో పూర్ణమై, అవతారమంతమైనది.

*సుమారీకాలపుదే "నాగానంద" నాటకము. ఇది కేవలం అహింసా ప్రబోధమున కుద్దేశించినది.

ఇందలి కథ జీమూతవాహనుని త్యాగమును గూర్చినది. ఈకథ అసలు బౌద్ధజాతక కథలోనిది. బుద్ధుని పూర్వజన్మలలో నొకదానిలో నతడు జీమూతవాహనుడై పుట్టెను; కనుక, అతడు బోధిసత్వుడు, అని బౌద్ధుల సంప్రదాయము. ఈకథనుగుణాఢ్యుడు తన బృహత్కథలో వివరించెను; కనుక, అది కథాసరిత్సాగరములో చేరినది. ఆగ్రంథపు పరిశీలనలో ఈకథను మనము గమనించియే యున్నాము. ఇట్లే నాగానందములో దృశ్యకావ్యమైనది. ఆసందర్భములో విదూషకుడు మొదలగువారును మద్యపానపు నష్టములు బోధించుటకొరకు త్రాగుబోతుచేసిన వింతచర్యలను తెలుపు క్రొత్తపాత్రలు వచ్చినవి. నాటకసూత్రానుసారముగ హాస్యాదిరసములగూడచేర్చి, కథలో కొద్దిమార్పుల జేసిరి. కాని ముఖ్యాంశములో మార్పులేదు. ఆకథ యిట్లున్నది. రాజపుత్రుడగు జీమూతవాహనుడు ధార్మికబుద్ధిగల్గి వైరాగ్యముతో ఆస్తి సంపర్కమంతయు వదలి, అడవికిపోయెను. జ్ఞాతులు ఆరాజ్యమపేక్షించగా, త్యాగముతో దానిని వారికి వదలివేసెను.

---

* నాగానందమును "హర్షచక్రవర్తి రచించినట్లు ప్రసిద్ధి. ఈమహారాజు 7 వ శతాబ్దివాడు, ప్రతిభాయుతుడు. హిందూరాజ్యయుగపు చక్రవర్తులలో నితడే చివరివాడు. ఇతడు బౌద్ధదర్శాభిమానియని చీనా యాత్రికుడు హుయన్ త్సాంగు వ్రాసినాడు. ఈరాజచంద్రుడు నాగానందమును, "రత్నావళి ప్రియదర్శికలను" [illegible] ప్రతీతి కలదు.

"పదార్థముకు దేహమిత్తును, రాజ్యముకై ప్రాణివధము చేయను" అనెను.◆ హిమవత్పర్వత ప్రాంతములో సిద్ధరాజపుత్రి యగు మలయవతి యితని సౌమ్యసౌందర్యమును ఔదార్యమునుగని, అతనిని ప్రేమించెను. ఇద్దరును పెండ్లిచేసుకొనిరి. అక్కడ సమీపమందున్న కొండమీద నే గరుడుడు ప్రతిరోజునను తక్షకరాజు తన జాతినుండి పంపు ఒక్కొక్క నాగమునుచంపి ఆహారముగ దిని, దాని యెముకలాకొండయొద్ద నే విడుచుచుండెను. ఆరోజున ఆహారమగుట కేర్పడిన నాగయువకుడు అతనితో యేడ్చుచు అక్కడికి వచ్చిన తల్లియును ఇతనికంటబడిరి. వారి వృత్తాంతమంతను ఆతల్లివల్ల జీమూతవాహనుడు తెలుసుకొని వారిని వెనుకకు పొమ్మని, వధ్యస్థలమందు రక్తాంబరము కప్పుకొని తానే పడియుండెను. గరుడుడు ఆ దేహమును కొంతపొడిచి, తరువాత కనిపెట్టి, అంతదయార్ద్ర హృదయుని హింసించినందుకు క్షమార్పణ చెప్పుకొనెను. ఈలోగా జీమూతవాహనుని తల్లిదండ్రులు వచ్చి, కొడుకు మరణించెనని యెంచి, మిక్కిలి విచారించిరి. సత్యశాంత్యాది ధర్మము లేకపోయినది గనుక జగత్తే శూన్యమైనదనిరి‡ వృద్ధులగు తమ విషయమున బాధ్యతవదలి, ఒకనాగముకై కొడుకు ఆత్మార్పణము చేయుట వారిమనస్సుకు కష్టముగ తోచియుండును; కాని జీమూతవాహనుడు జీవించుటజూచి తల్లిదండ్రులు సంతోషించిరి. ఇంతలో ప్రజలు జీమూతవాహనునే రాజుగ కోరుకోగా అతనికి పాలనబాధ్యత యేర్పడినది. గౌరీదేవివచ్చి సంతోషించి

---

◆ స్వశరీర మపి పరార్థే యః ఖలు దదామి యాచితః కృపయా
రాజ్యస్య కృతే స కథం ప్రాణివధ క్రౌర్యమనుమన్యే.
(నాగానందం 3 అంకం 17 వ శ్లో)

‡ నిరాధారం ధైర్యం కమివ శరణం యాతు వినయః
క్షమః క్షాంతిం వోఢుం క ఇహ విరతా దానపరతా
హతం సత్యం సత్యం వ్రజతు కృపణా క్వాద్య కరుణా
జగజ్జాతం శూన్యం త్వయి తనయ లోకాంతరగతే.
(నాగానందం 5 వ అంకం 31 వ శ్లో)

అతని కోరికపైన నాగజాతి నుద్ధరించి, జీమూతవాహనునికి వరమిత్తు ననెను. అతడు (నిజమైన అహింసాపరుడు గనుక) స్వలాభమేమియు గోరక లోకహితమును, జనులు పరహితపరులు కావలెననియు, అందరూ సుఖించవలెననియు, కోరెను.◆ గౌరీదేవి "తథాస్తు" వాక్యముతో కథ ముగిసినది.

నాగానందంద్వారా అహింసాతత్వము నాటకపు ముఖ్యరసమైనందుకు, అలంకారికులలో కొంతసందడి యేర్పడినది. సాధారణముగ వీరశృంగారములే నాటకముకుముఖ్యరసములుగ వారంగీకరించిరి ; కథానాయకుడు ధీరోదాత్తుడు కావలెను. భాసుని "చారుదత్త"లోను, శూద్రకుని మృచ్ఛకటికలోను కొంత శాంతరసమేర్పడెను. నాగానందపు కథానాయకుడు కేవలం ధీరశాంతుడు ; ఇందు శృంగారాదులున్నను, అహింసారూపమగు శాంతమే దాని ముఖ్యరసము. "మొత్తం రసములు ఎనిమిదే. శాంతమొకరసముకాదు అని ఒకపక్షము. రసములు 9. శాంతమును ప్రత్యేకరసమని మరికొందరు. వారివాదముకు నాగానందము ముఖ్యోదాహరణము. ఎనిమిదే రసములను పక్షమువారు "వీరులలో యుద్ధవీరులు, దానవీరులు, ధర్మవీరులు నుండవచ్చును. జీమూతవాహనుడు ధర్మవీరుడుకనుక నాగానందము వీరరసప్రధానము" అని సమాధానము చేసుకొనిరి. అహింసారసపు మొదటి నాటక కర్త గొప్ప మహారాజని ప్రసిద్ధి యేర్పడుట గమనించదగినది.

పిమ్మట కొన్ని శతాబ్దములతరువాత మరల శాంతరసప్రధానమగు నాటకము వచ్చినది. దీనిని ప్రబోధచంద్రోదయమనుపేర క్రీ. శ. 11 వ శతాబ్ది కృష్ణమిశ్రుడు సంస్కృతములోనే

---

◆ శివమస్తు సర్వజగతాం, పరహిత నిరతాభవంతు భూతగణాః
దోషాః ప్రయాన్తునాశం, సర్వత్ర సుఖీభవతులోకః.

(నాగానందం భరతవాక్యం)

రచించెను. ఇది విచిత్రమైనది. నాగానందములో నున్నట్లు దీనికథలో నిజమగు నరులు లేరు. ఇందలి ముఖ్యపాత్రలన్నియు గుణములు. వివేకునికిని "మహామోహు"నికిని ప్రజల మనస్సు వశపరచుకొనువిషయమై సంఘర్షణమేర్పడినది. మహామోహుడు రాజు. కామక్రోధాదులతనికి సహచరులై యుందురు. రతి, హింస తృష్ణ వారికి ప్రియురాండ్రు. (ఇందు క్రోధునికి హింస ప్రియురాలగుట గమనించదగును) వీరికి దంభాదులు తోడైరి. "మిథ్యాదృష్టి" వీరికందరికి యిష్టురాలు. వీరందరును కుట్రచేసి, పరస్పర సహాయముతో వివేకు నోడింపజూచిరి. నిశ్శ్రేయసరాజ్యమును పురుషునికి నిల్పుటకై, వివేకుడు అహింసా శాంతి శ్రద్ధల సహాయమునొంది, ఉపనిషద్దేవి సహాయమునుగూడ తీసుకొని, యుద్ధ సన్నద్ధుడాయెను. ఆయుద్ధములో మహామోహుని పరివారమోడినది. పురుషునికి ప్రబోధము కలుగకుండ చేయుటకు వారు చాల కుట్రలు కల్గించిరికాని అవి విఫలమై, వివేకుడు జయమొందినాడు. అంతట పురుషునికి "ప్రబోధ చంద్రోదయము" కల్గినది. అహింసా శాంతి శ్రద్ధాదుల సాయముతోనే పురుషునికి జయము గల్గినదని మనమీసందర్భములో గమనింపవలసియున్నది. ఈనాటకములో యుద్ధముగూడ కథాభాగమైనది. కాని అది కేవలం ఆధ్యాత్మికము.

ఇట్టిదే ఆధ్యాత్మికనాటకము 14 వ శతాబ్దిలో నింకొకటి వెలువడినది. ప్రబోధ చంద్రోదయము అద్వైత సిద్ధాంతపుది. జీవేశ్వరుల ఏకత్వమును జ్ఞానమే మోక్షమునకు ముఖ్యసాధనమనియు ఈకథలో సూచితము. "విష్ణుభక్తి" స్థానము గౌణముగనున్నది. 14 వ శతాబ్దిలో వేదాంత దేశిక కవి రచించిన "సంకల్పసూర్యోదయము"లో నున్న కథయు యీరీతిదే. అందులోను ధర్మాధర్మములకు, గుణములమధ్య గొప్ప సంఘర్షముగల్గి, తుదకు కామ

క్రోధాదులోడిపోయి, శాంతి సత్యాదుల సాయముతోను, భక్తి సహకారముతోను, వివేకునికి జయముగల్గినది. కాని ఈరూపకము విశిష్టాద్వైత సిద్ధాంతము కనుకూలమగునట్లు వ్రాయబడినది. ఇందులో భక్త్యాదుల కెక్కువ ప్రాముఖ్యమిచ్చిరి.

## అధ్యాయము 25.

### —• ఆంధ్రదేశంలో అహింసావ్యాప్తి •—

మన ఆంధ్రప్రాంతపు పూర్వస్థితి నిప్పుడు సూక్ష్మముగ గమనింతము. లోగడ మనము చర్చించినది చాలావరకు మన ప్రాంతమునకును అన్వయించును. వేదకాలమందును అంతకు పూర్వమును ఆంధ్రప్రాంత మెట్లుండెనో తెలియదగిన సరియైన నిదర్శనములు లేవు. కాని ఇదిచాలవరకు మహారణ్యమై భీకర సర్ప మృగాదులతో సంకులమై యుండెనందురు. ఆదిమవన్య జాతులును ఇందు వసించుచుండిరి. ఈ మహా గహనములలో వ్యాఘ్రములు ఇప్పుడు లేని మహాసర్పములు ప్రబలియుండెను. ఈయాటవిక జనులు క్షుద్రదేవతలను అమ్మవార్లను పూజించుచు, జంతుబలినిచ్చుచు, తక్కిన ప్రాంతపు ఆదిమజనులవలె నుండిరి. వారి భుజబలము మాయాశక్తి అద్భుతములు. వీరు నరాశనజాతి యని యూహ. వీరుగాక, "నాగు"లను జాతివారు సర్పపూజకులు ప్రాచీనకాలమందీ దేశవాసులై యుండిరి. వారి భౌతిక నాగరికత చాల గొప్పది. నాగజాతి కొన్ని యితరప్రాంతములందును వ్యాపించియుండిరి.•

• కొందరార్యులు నాగస్త్రీల వివాహమాడి వారిచే సంతానము గనిరని ఆస్తీక గుణాఢ్యాదుల సందర్భములలో చూచియున్నాము.

ఈ యాంధ్రివాసులు అతిప్రాచీనకాలమందే సముద్ర వ్యాపారమును జేయుచుండిరని తోచును. విశ్వామిత్రుని కుటుంబమువగైరాలు ఈప్రాంతమువచ్చి, ఇక్కడి ఆర్యేతరులతో సంపర్కములు పెట్టుకొన్నట్లు ఐతరేయబ్రాహ్మణము సూచించును. అగస్త్య విశ్వామిత్రాదులు ఈప్రాంతపు జాతులకు ఆర్యనాగరికత సంపర్కము గల్గించిరి. రామాయణకాలముకు ఈప్రాంతంలో అక్కడక్కడ ఋషులు వలసల నేర్పర్చుకొని శాంతజీవనము చేయుచు వసించుచుండిరి. వారికీప్రాంతపు ఆటవికులతో సంఘర్షముగల్గెను. శ్రీరాముడు శరభంగాగస్త్యాది ఋషుల ఆశ్రమములకువచ్చి, అక్కడ నరాశనులైన విరాధాదుల సంహరించినట్లు రామాయణమునుండి కనబడును. తరువాత శ్రీరాముడు సీతాదేవితో చిత్రకూటంవద్ద పంచవటిలో కొంతకాలముండెను.

ఇది గోదావరీ తీరము. భద్రాచలప్రాంతమని కొందరియభిప్రాయము. రామాయణమందు చెప్పిన మార్గవర్ణనను బట్టియు, మన భద్రాచలప్రాంతమందు వ్యాపించియున్న ఐతిహ్యమును బట్టియు, అట్లేతోచును. (కొందరు పంచవటి మహారాష్ట్రపు నాసికకు సమీపములో నున్నదందురు) రావణుని బంధువు సేనాని అగుఖరుని సేనాశిబిరస్థలమైన జనస్థానము దక్కను ప్రాంతమే. అంతకుపూర్వము ఋషులద్వారాను శ్రీరాముని తర్వాతను ఈప్రాంతమందార్య సంస్కృతి వ్యాపించెను. ఇతిహాసాలలోను విష్ణుపురాణాదులలోను ఆంధ్రప్రాంతమందు బలీయులగు జాతియుండినట్లు చెప్పినారు. క్రీ. పూ. 3 వ శతాబ్దిలో అశోకుడీ ప్రాంతముపైన దాడిచేసెను. తీవ్రనిరోధము జరిగి ఘోరరక్తపాతముగల్గి, తుద కశోకుడేగెల్చి గోదావరివరకు మగధసామ్రాజ్యములోచేర్చి, ఇక్కడగూడ గట్టిగ అహింసా

తత్వపు ప్రచారమారంభించెను.♦ ఈలోగా మరొక శతాబ్దియగు నప్పటికి ఆంధ్రరాజులే మగధరాజ్యమును జయించి, కొన్ని శతాబ్దులు మహాసామ్రాజ్యమేలిరి. శాతవాహనులక్రింద, మనదేశమున్నతస్థితిలో నుండినది. అంతకు పూర్వపు మతములకు బదులు, అప్పుడు బౌద్ధజైనమతము లీప్రాంతమంతటను జనులలో వ్యాపించినది.* చాలమంది బౌద్ధవిద్వాంసులీ ప్రాంతములో ధర్మప్రచారము చేసిరి. సుప్రసిద్ధ విద్వాంసుడు బౌద్ధప్రచారకుడు నగు "నాగార్జును" డీప్రాంతములో కొంతకాలమున్నట్లు తోచును. అప్పుడీ ప్రాంతమునుండియు, కొందరు బర్మా సింహళములకు ప్రాచ్యద్వీపములకు వెళ్ళి, అక్కడ అహింసాధర్మమును భారతీయ సంస్కృతి వ్యాపింపజేసిరి. ఆర్థికముగను మనదేశ మున్నతస్థితిలో నుండెను మన రేవులనుండి, చాలదూరము సముద్రవ్యాపారము జరిగినట్లు పూర్వపు కథలు చరిత్రలు తెలుపుచున్నవి. అప్పటి ఆంధ్రుల శిల్పము ఉన్నత సంస్కృతిని తెల్పును. గొప్ప బౌద్ధచైత్యములు విహారములు స్థూపములు వగైరాలు ధరణికోట, భట్టిప్రోలు, అమరావతి, జగ్గయ్యపేట వగైరాలలో నిర్మితములైనవి. అందు చాలామంది శ్రమణకులు విద్వాంసులు వసించుచు, అహింసాధర్మపు ప్రచారమును జరిగించుచుండిరి. "ద్రాక్షారామ" వగైరాలు ఆకాలమందు బౌద్ధారామములై యుండినట్లుసూచనలున్నవి. దరిమిలాను ఈమనప్రాంతపుబౌద్ధనిర్మాణములు భగ్నములై చెడిపోయినవి. అమరావతిప్రాంతపుశిథిల శేషము

---

♦ అశోకుడు "కళింగ" దేశమును జయించినట్లు చరిత్రకారులు చెప్పినారు. అప్పుడు కొంత ఓఢ్రప్రాంతమును ఆంధ్రప్రాంతమునుగూడ "కళింగ" అనుచుండిరి. రఘు మహారాజు వంగదేశమునుండి వచ్చుచు, ఉత్కళులుదారి చూపగా, కళింగదేశమువైపు వెళ్ళినట్లు కాళిదాను చెప్పినాడు. "ఉత్కలైర్దర్శిత పథః కళింగాభిముఖోయయా" (రఘు 4వ సర్గ 38వ శ్లోకం)

* క్రీ. శ. 5వ శతాబ్దిలో చీనా యాత్రికుడగు "ఫాహియను" వ్రాసిన సంచార గ్రంథమును బట్టియు ఈప్రాంతమందు అహింస బౌద్ధధర్మము వ్యాపించినట్లు తెలియును

లివ్పాడులండనులోను, కొన్నిటిని మద్రాసులోను, అమరావతియొద్దను భద్రిము చేసినారు. పిఠాపురం మున్నగు చాలచోట్ల బౌద్ధజైన విగ్రహములు నేటికిని నిల్చియున్నవి. అవి అప్పటి ఆంధ్రుల శిల్ప ప్రజ్ఞనుగూడ తెల్పును. ఆవిగ్రహములు శాంత గంభీరరూపము లును అహింసాతత్వము అప్పటి ప్రజల కాకర్షకమైనట్లు స్పష్టము చేయును. ఇవిగాక ఇప్పటి నిజాం సంస్థానములోని "ఎల్లోరా" గుహలలోను వాటికి సమీపములోనేయున్న "అజంతా" గుహల లోను ఆకాలమందు నిర్మించి చిత్రించిన వివిధ విహారములును అహింసావీరులగు బుద్ధాదుల చరిత్రములను విశ్వప్రేమగాథల నుదహరించి తెల్పు చిత్రములునుగూడ ఉదారమగు శాంత గంభీర భావములుగల్గి మనపూర్వికుల అద్భుతశిల్పప్రజ్ఞను సూచిం చును. మరియు ఆకథాచత్రిములుగూడ అహింసాతత్వపు మూర్తి భావమును సూచించును. ఒక్కొక ప్రాంతములో బౌద్ధజైన హిందూవిగ్రహములు చిత్రములు పరస్పరం పొరుగుననే ఉన్నవి. కనుక అప్పుడు ఆయా మతస్థులకు పరస్పరమైత్రి యుండెననియు, సూచన గాంగరాజులు వగైరాలు రెండుమతములందును సమ దృష్టిగల్గియుండిరి. ఈలోగా ఆపస్తంబబోధాయనులు♦ ఆంధ్ర దక్షిణ ప్రాంతములలో తమస్మృతి గ్రంధములద్వారా చాతు ర్వర్ణపు సంస్కృతిని బలపర్చిరి ; తరువాత వచ్చిన చాళుక్య రాజులు అప్పటి బౌద్ధ జైన మతములందిష్టము లేక, పౌరాణిక మతమునే ప్రోత్సహించిరి. సాంప్రదాయిక హిందూమతము ప్రబల తీవ్రసంఘర్షము గల్గినది. అప్పటి జైన బౌద్ధ సంస్థలను కట్టడములను సాంప్రదాయిక హిందూరాజులు బుద్ధిపూర్వకంగా నాశము చేసిరనియు కొందరి యభిప్రాయము ఈవినాశమప్పు డారంభించి ముస్లిములపాలనకాలముకు పూర్తిమైయుండును. ఆంధ్ర

♦ బోధాయనుడు "వృత్తి" యను పేరున నొక భాష్యము రచించినట్లును అది తరువాత ... ... తెల్పియున్నారు.

దేశమందు బౌద్ధజైనమతములు, వాటి వాఙ్మయ శేషమును, లేకుండాపోయినవి. ఆధునికహిందూమతముతో రాజులలోను ప్రజలలోను వర్ణ విభేదములు, సంఘర్షము, హింసాసూచకమగు నిరంతర కలహములును, వృద్ధియైనవి.

## అధ్యాయము 26.

## దాక్షిణాత్యసంస్కృతి.

ఇక దక్షిణప్రాంతపు పూర్వస్థితిని జూతము. ఇదియు, సింహళమును, మొదట రాక్షసులను బలీయుల యధికారమందుండెను. వారి నరాశనత, క్రవ్యాదత, మున్నగు హింసాత్మకత చారిత్రికకాలమునకు పూర్వమే తగ్గినవి. వారిలో లింగపూజ విస్తారముగ నుండినది. దక్షిణాగ్రప్రాంతంలో పాండ్యరాజ్యము, పడమట కేరళము ఉత్తరభాగమందు చోళరాజ్యమును వ్యాపించినవి. ఇవి కొంత నాగరికములే. శ్రీరామకాలంనాటికే అగస్త్యాది ఋషులిక్కడ ఆర్యద్రావిడ సంస్కృతులకు సమన్వయ మారంభించిరి.* అశోకుని కాలమునుండి యిక్కడగూడ బౌద్ధజైన సంస్కృతి వ్యాపించినది. అక్కడి కొందరురాజులు నామతముల స్వీకరించిరి. ఇక్కడ విశేషముగనుండిన హింసాతత్వమపుడు క్రమముగ తగ్గినది. ఈ ప్రాంతమును అశోకుడు భౌతికముగ జయించలేదు. కాని ఆయన ఉద్దేశించినట్లు, అహింసాసంస్కృతికి విజయము సిద్ధించినది. ఇంతలో వేలకొలది ఆర్యులు ఈప్రాం

* కాళిదాసును దక్షిణమనుటకు బదులు అగస్త్య చరితమైన దిశయన్నాడు. "అగస్త్య చరితామాశా మనాశాస్య జయో యయౌ" (రఘు. 4 వ సర్గ)

తంలోను వేదసంస్కృతిని బౌద్ధజైన సంస్కృతిని వాటితో ప్రేమ తత్వమును వ్యాపింపజేసిరి.♦

క్రొత్త 3 వ శతాబ్దినుండి ఈ ప్రాంతమందిట్టి సంస్కృతి చిహ్నములు అప్పటి వాఙ్మయములోను కనబడును. ఇందు మొదటి ప్రసిద్ధగ్రంథపు లేఖకుడు నేతవృత్తిగల నిమ్నజాతీయు డగుట విచిత్రము. ఈతడే తిరువళ్ళూరు. ఇతడు రచించిన "తిరుక్కురళ్" ఉత్తమ నీతిబోధకము. ఇది ఆప్రాంతీయులకప్పుడు సుబోధమైన అరవములో వ్రాయబడినది. ఇందులో అహింసను పరస్పర ప్రేమను అందరు నాచరించవలసినదిగ చెప్పినారు. ఈగ్రంథమునందరును ప్రశంసించినారు. తిరువళ్ళూరు సోదరి యగు "అవ్వయార్" వచనములును అట్టివే. దీని పశ్చిమ ప్రాంతమందాకాలమందు వలసకువచ్చిన "సిరియను క్రైస్తవు"ల లోను యూదులలోను అహింసాతత్వమును ఈ ప్రాంతపు సంస్కృతితో సమన్వయమును కల్గినవి. దక్షిణములో పూర్వము నుండి లింగపూజ, సర్పపూజ, శైవ దేవాలయములు, జనాదరము నొందినవి. పిళ్ళయార్ (విఘ్నేశ్వరుడు) ఆరుముగం (కుమారస్వామి) సుబ్రహ్మణ్యుడు వగైరాల గుడులు ప్రతిగ్రామంలోను అప్పుడే వెలసినవి.

చిదంబరం, మధుర మున్నగు శివాలయములకు స్థలమాహాత్మ్యపు వర్ణనలప్పటి గ్రంథములలో విరివిగనున్నవి. శైవధర్మమే విశేషముగ వ్యాప్తమైనది. మనప్రాంతములోవలె, ఇక్కడను శైవమతముతో బౌద్ధ జైనమతములకు సంఘర్షముకల్గెను. కాని కొంత బౌద్ధ జైన వాఙ్మయము అరవభాషలో నిప్పటికినియున్నవి. 8వ శతాబ్దినుండి ఆమతము లిక్కడను క్షీణించినవి. అంతట

♦ ఇటీవల కంచిదగ్గర జరిగిన పురాతత్వజ్ఞుల పరిశోధనవల్ల అకాలపు బౌద్ధ శిథిలములక్కడ వెలికిని [illegible] తెలిసినది.

పౌరాణిక హిందూమతము ప్రబలినది. ఆకాలమందరవ ప్రాంత మున మంచి భక్తి వాఙ్మయమేర్పడినది. శివభక్తి బోధకము లగు గ్రంథములను "అప్పర్, సంబాధర్, మణిక్కవాచకర్" మొదలగు మహాభక్తులు స్వభాషలో రచించిరి. ఈవాఙ్మయము 12 వేల పద్యముల గ్రంథమున్నది.

అప్పటి మహాభక్తులలో నొకడు "నందనారు" ఈ ఆది హిందువు మహాభక్తుడు, నీతిమంతుడు, యోగ్యుడు, ఆదర్శజీవనుడు అనుపించుకొనెను. ఈతడు ఒక బ్రాహ్మణునికి పాలికాపుగనుండి ఎన్నియో బాధల సహించుచు శాంత స్వభావుడైయుండెను. చిదంబరపు నటరాజదేవాలయమునకు చాలసార్లు పరితపించి, తుద కెట్లో ఆపురిజేరి నందుడాలయముబయట ఈశ్వరుని ప్రేమగీతముల బాడుచుండెనట. కాని అప్పటి బ్రాహ్మణార్చకు లాపంచము నాలయములోనికి రానీయలేదు. అతడు అవమానముల పాలై నాడు; ఎన్నియో కష్టముల సహించినాడు; అగ్నిపరీక్షకు తాళి నాడు. అంతట నటరాజమూర్తి అర్చకులకు ప్రత్యక్షమై, ముందుగా బయటనున్న నందనారునులోనికి రప్పించి, అతని గీత ముల నాలయములో పాడింపజేసెనట! అతని భక్తిగీతము లిప్ప టికిని ప్రసిద్ధములు. అతని పవిత్రచరిత్రను ఆప్రాంతపు సపర్ణ లును హరికథగ జెప్పుకొనుచున్నారు.

సుమారీ కాలముననే, దక్షిణప్రాంతమందు వైష్ణవభక్తులు నుదయించిరి. వీరి గీతములలో విష్ణువు అవతారముల వర్ణించుచు దేవుడు ప్రేమస్వరూపుడు, కరుణామయుడు, జగత్పిత, అనియు వివరించిరి; మానవులందరు సోదరులు, కనుక పరస్పర ప్రేమ గల్గి యుండవలెనని అహింసాసిద్ధాంతము బోధించిరి. విష్ణుభక్తులగు పన్నిద్దరాళ్వారుల నాల్గువేలపై పద్యములుగల భక్తిగ్రంథము "నాలాయిరం" అని ప్రసిద్ధము. ఈభక్తులు చాలవరకు శ్రీకృష్ణుని ఇష్టదేవతగ జేట్టుకొని కృష్ణావతారపు లీలలను తమ గీతములలో

విశేషముగ వర్ణించిరి. శైవభక్తులలోవలెనే, ఈఆళ్వారులలోను కొద్దిమందియే బ్రాహ్మణులు. అందరిలోను ముఖ్యుడగు "నమ్మాళ్వారు" శూద్రుడు. ఇతడు శైశవమునుండియు ధ్యానమగ్నుడై బాల్యచేష్టలీలలు లేక తలితండ్రులచే త్యక్తుడై, ఏకాకియై, పరమశాంతుడై అరణ్యములో నొక చింతచెట్టుక్రింద వసించుచు, చాలమందికి భక్తిని విష్ణుప్రేమతత్వమును బోధించెను. ఈయన జీవితము అహింసామయము. ఈయన రచించిన వేయి పద్యముల "తిరువాయి మొయ్" గ్రంథము వైష్ణవ వాఙ్మయములో ప్రధానమై, భక్తిప్రేమ ప్రేరకమై యున్నది.‡

ఈఆళ్వారులలో కులశేఖరుడు క్షత్రియుడు. ఏడవ శతాబ్దిలో తిరువాన్కూరు రాజ్యపు పాలకుడై, దానికి "ధర్మరాజ్యమని ప్రసిద్ధిగల్గించెనందురు. ఇతడు సంస్కృతములో "ముకుందమాల" ను అరవములో గొప్పభక్తిగీతములను రచించెను. తరువాత ఆండాళ్ అను స్త్రీయు గొప్ప భక్తురాలై, ప్రేమగీతముల రచించెను. తిరుమంగయాళ్వారను నింకొక ఆళ్వారు నిమ్నజాతీయుడు. ఈయన అసలు పాండ్యరాజ్యపు సేనానియై గొప్పశూరుడైయుండి, తరువాత భక్తిపూరితుడైనాడు. చాలకాల మితడు సరియైన అహింసాపరుడుకాడు. శ్రీమంతులనుండి బెదరించి, నిర్బంధముగ సొమ్ము లాగుకొని అందుతో బీదలగు భక్తులను పోషించుచుండెను.

ఇంకొక ఆళ్వారు తిరుప్పాణాళ్వారు హరిజనుడు. ఈయన ధార్మికుడై కావేరీగట్టున నుండి తన పవిత్ర జీవనమును ప్రేమ భక్తులతో ఋషివలె గడపెను. అంతట శ్రీరంగనాథస్వామి ఆజ్ఞాపైన మధురకవియను నొక వైష్ణవముని ఆయనను భుజముపై

‡ ఈగ్రంథములభాష శెందమిళ్ అనబడు ప్రాచీన తమిళము. నమ్మాళ్వారు క్రీ. శ. 5-7 శతాబ్దుల మధ్యవాడు. తామ్రపర్ణీతీరమున కురుకాపురి (ఆళ్వారుతిరున్నగరి) లో నీయన జన్మించెను. (ఇప్పుడు [illegible] శకటకోపుడు)

నెత్తుకొని శ్రీరంగనాథుని ఆలయములోనుంచి గౌరవించెను. ఆయన గీతములను భక్తిప్రేమలతో విష్ణుభక్తులగు బ్రాహ్మణులు గృహములలో ఆలయాలలోను ఇప్పటికిని కీర్తింతురు. నందనారు వలెనే ఆయన తుదకు అన్నిజాతుల సన్మానమొంది ఋషిగ నెంచబడుట అప్పటి జనుల అహింసా భావముకు నిదర్శనము. అప్పటికింకను శైవులకు వైష్ణవులకు బౌద్ధజైనులకు మధ్య సంఘర్షము విరోధము లేదు. అప్పటి వాఙ్మయములోను పరస్పర దూషణము లేకుండుటయు విశేషము. అశోకాదుల కృషివల్ల దక్షిణ ప్రాంతంలోను బౌద్ధజైనమతములును అపుడు వ్యాపించి యుండెను.

తరువాత దక్షిణదేశమందే మనప్రాంతమందున్న మత త్రియపు ప్రవర్తకు లుదయించిరి. వీరి జీవితమును బోధలును ఆధునిక హిందూసంస్కృతికి (ముఖ్యముగ ఆంధ్ర తమిళ ప్రాంతీయుల సంస్కృతికి) కొంతవరకు కారణములు. కనుక వాటిని సూక్ష్మముగ పరిశీలింతము.

## —♦ శంకరాచార్యులు. ♦—

శంకరులు ఎనిమిదవ శతాబ్దిలో మళయాళములో (ఇప్పటి ఉత్తర తిరువాన్కూరులోని "కలడి" గ్రామములో) జనించె నందురు. ఈయన ఏడేండ్ల వయసుకె విద్వాంసుడై, వేదాంత మతమును పునరుద్ధరించెను. అప్పటికి బౌద్ధజైన మతములు వికృత రూపములై, పూర్వపు పరిశుద్ధసిద్ధాంతములుమారి, ఆమతస్థులు, ముఖ్యముగా శ్రమణకులు, అనేక దురాచారముల పాలైరి. వారిలో నొకపక్షమువారు కేవలనిరీశ్వరవాదులైరి. దేవుడు లేడని బుద్ధుడెక్కడను చెప్పకున్నను, వీరు బుద్ధుని బోధల కపార్థము గల్పించిరి. శూన్యవాదాది వితండ వాదములు ప్రబలినవి. తార్కిక చర్చలు హెచ్చినవి. ఇట్లే మరొకమూల పూర్వమీమాంసకులు ఈశ్వరాస్తిత్వముమొప్పుకొనక జ్ఞానపరతను అహింసను

భక్తిని మూలద్రోసి, యజ్ఞయాగాది కర్మకాండకే ప్రాముఖ్య మిచ్చిరి. ఇట్టి అవిద్యావ్యాప్తి నెదుర్కొనుటకు, జ్ఞానసంపాదన మోక్షమున కతిప్రధానమని శంకరులు బోధించెను. "ఈకనబడు భౌతిక ప్రకృతిస్వరూపము మిథ్య. ఇది యంతయు బ్రహ్మ స్వరూపమే. మన అజ్ఞానమువల్ల ప్రకృతియే స్థిరప్రపంచమని మనము భ్రమించుచున్నాము. మన మందరమును పరమాత్మ స్వరూపమే కనుక పరస్పర ద్వేషములేకుండ, కామ క్రోధ హింసలను కర్మలను విడిచి, సరియైన జ్ఞానులు కావలెను. అందు వల్లనే మోక్షము కలుగును.* అని శంకరులు బోధించెను; అప్పటికి నిజముగ హింసాపరులు నాస్తికులుగమారిన బౌద్ధులతోను పూర్వమీమాంసకులతోనువాదించి అప్పటిఆమతస్థుల సిద్ధాంతము లను శంకరులు ఖండించెను; తనసిద్ధాంతముల వివరించుచు "ప్రస్థా నత్రయముపైన వ్యాఖ్యానము వ్రాసెను. దేశమంతయు తిరిగి నాల్గుదిశలను తనశిష్యులనిల్పి, మతప్రచారమునకు మఠముల స్థాపిం చెను. దీనికి "అద్వైతమత" మని పేరు.

తండ్రి శైశవమందే చనిపోగా విద్వాంసుడైన శంకరుడు లోకసేవకనువుగ బాల్యమందే సన్యసింపదలచెను, కాని తల్లి అంగీ కరింపలేదు. ఒకనా డుభయులు గ్రామాంతరము వెళ్లిరి. దారిలో నొకనది దాటవలసివచ్చెను. సగముదారిలో నీటిలో ఒక మొసలి వచ్చి హఠాత్తుగ ఆబాలుని కాలుపట్టుకొనెను. నీటిలోని మొసలి పట్టు వదలించుకొనుట కాతడెంతో ప్రయాసపడెను; కాని లాభింపలేదు. ఆయాసము హెచ్చినది. అంతట శంకరుడు నిరాశుడై "అమ్మా! ఇక నేను జీవించునట్లులేదు; సన్యాసినై మరణించిన నాకు మోక్షముండును; కనుక, ఇప్పుడైనను సన్యసించుట కనుజ్ఞ నిమ్మ"ని కోరెను. ప్రాణాపత్తులోనున్న బాలునికోరిక నామె మన్నించి, సన్యాసము నంగీకరించెను. శంకరుడు వెంటనే "నేను

* తస్మాద్గీతాశాస్త్రే కేవలాదేవ తత్వజ్ఞానాన్మోక్షప్రాప్తిః న కర్మసముచ్చితాదితి నిశ్చితోఽర్థః" శంకరుల గీతాభాష్యః

సన్యసించినా"నని ప్రకటించెను. ఆక్షణమే శంకరునిధైర్యమును అంత శ్శక్తియు హెచ్చి, తుదకతడు మొసలినోటినుండి బయట పడెనట♦ ఉన్నతజ్ఞానముగల్గి సౌమ్యజీవులగుటే భాగ్యమని బోధించి ఆయన మహావేదాంతిగ కౌపీనధారిగ కాలము గడిపెను*

అప్పటికాయన బాలుడైనను, అద్భుతధీశక్తిగలిగి, హిందూ మతపునరుద్ధారికుడనుపేరు పొందెను. కాని, ఆయన తన 32 వ యేటనే కాలధర్మమొందెను. కనుక సామాన్యజనుల కష్టసుఖ ముల ననుభవముననే గ్రహించి లౌకికసమస్యల బహిష్కరించుట కాయన కవకాశముండ లేదు. ఆయన శిష్యులు మాయావాదాది సిద్ధాంతబేధములకును తార్కిక చర్చలకునే కాలము వినియో గించిరి. శంకరుడు చాతుర్వర్ణ్యాది నియమముల స్థిరపరచెను. ఈమతత్రయాచార్యులును శృతి స్మృతుల ప్రమాణమే ముఖ్య మన్నారు. అహింస ముఖ్యధర్మముని అంగీకరించినారు. శంకరు డొకసారి కాశిలో గంగనుండి వచ్చుచుండ ఒక అంత్యకులస్థుడెదు రాయెనట. ఆయన వానిని "నీవు పంచముడవు. చండాలుడవు. దూరముగ తప్పుకోఅనెను." ఉభయులదేహమూ అన్నమయమే; ఆత్మసాక్షియే. ఇందొకరు శుచి రెండవవాడు అస్పృశ్యుడని పొమ్మనుట తగదు" అని యతడు పల్కెను.‡ అతడు గొప్పజ్ఞాని యని శంకరుడుగ్రహించి "జ్ఞానియైనవాడు చండాలుడైనను నాకు

---

♦ సన్యాస నిశ్చయమురాగానే అహింసాతత్వము పూర్తియగు. పూర్తియైన అహింసాపరుని హింస్ర జంతువులును హింసింపవని సిద్ధాంతము. కనుక అప్పుడు మొసలి పట్టువీడుట అహింసా సూత్రమునకు సరిగనేయున్నది.

* వేదాంత వాక్యేషు సదారమంతః......కౌపీనవంతః ఖలుభాగ్యవంతః స్వానందభావే పరితుష్టిమంతః సంశాంత సర్వేంద్రియదృష్టమంతః | ఆహర్నిశం బ్రహ్మణి యేరమంతః కౌపీనవంతః ఖలుభాగ్యవంతః॥ (యతిపంచకం)
ఇందు కౌపీనము బ్రహ్మచర్య చిహ్నముగను సూచితము.

‡ భిద్యేతాऽన్నమయాత్తోऽన్నమయంకిసాక్షిణశ్చ్యయతి పుంగసాష్ట
...శుచిర్ద్విజోऽహం శ్వపచశ్చేతిమిధ్యాऽగ్రహస్తే మునివర్యకోऽయం
సంతం శరీరేష్వ శరీర మేకమపేక్ష్య పూర్ణం పురుషంపురాణం
(మాధవాచార్యుల శంకర విజయం)

గురుసమానుడే” అని జబాబిచ్చి అతని నాదరించెనట.* నిశ్శ్రేయస సాధనకు కర్మవిడువవలె. త్యాగము జరిగినప్పుడే జ్ఞానముకల్గును. అదియే మోక్షసాధనమని ఆయన తేల్చెను. లోకము బంధకమై హానికరమైన కర్మలను అహంకార చర్యలను మానవలసినదే; కాని విశ్వప్రేమతో లోకకల్యాణముకై కర్మలజేసినప్పుడు లోకోపకారము జరుగును. అట్టి కర్మలనుగూడ త్యజించుట శంకరుని మతముకాదని తోచును, కాని శంకరులతరువాత అద్వైతులలో మాయావాదులు మొదలగు కొన్ని పక్షములు బయలుదేరినవి. అన్నికర్మలను త్యజించవలెనని చాలమంది బోధించిరి.

—♦ రా మా ను జా చా ర్యు లు ♦—

ఇట్లు మూడుశతాబ్దులు జరుగునప్పటికి శంకరునిశిష్యుల ప్రచారప్రకారం, “వీలైనంత త్వరలో కర్మలన్నిటిని వదలి లోకసంబంధమువదలి, స్వీయమోక్షముకే ఎవరికి వారు యత్నింపవలెను. సోఽహం (=నేను పరమాత్మనే) అను భావమే మోక్షమిచ్చును. దేవుడు నిర్గుణుడు.‡ జగత్తంతయు మిథ్య, మాయ; కనుక నిష్కర్ములై ఐహిక సంబంధము వదలుకొనుటే బుద్ధిమంతుల కర్తవ్యము,” అను భావము మనదేశమందన్ని ప్రాంతాలలోను వ్యాపించినవి. అప్పుడు రామానుజులు వీనిని నిరోధించెను. ఈయన 11 వ శతాబ్ది ఆరంభంలో శ్రీపెరుంబూదూరు గ్రామంలో జనించెను; బాల్యమందే సంస్కృతపండితుడై వేదాంతమందు ప్రత్యేక కృషిచేసెను. పూర్వపు ఆళ్వారులు, యామునాచార్యులు వగైరాల ద్రావిడ సంస్కృత విజ్ఞానమును బోధాయన మహర్షి రచించిన గ్రంథములను ఆలోచనచేసి, ఆపద్ధతిని, విశిష్టాద్వైతమను సిద్ధాంతమును ప్రచారముచేసెను. “ఈ

* బ్రహ్మైవాహమిదం జగచ్చ సకలం చిన్మాత్రవిస్తారితం । సర్వంచైతదవిద్యయాత్రిగుణయాశేషం మయాకల్పితం । ఇత్థంయస్య దృఢామతిస్సుఖతరే నిత్యేపరే నిర్మలే । చండాలోఽస్తుసతుద్విజోఽస్తు గురురిత్యేషా మనీషామమ। (మనీషాపంచకం)

‡ శంకరులు నిర్గుణ బ్రహ్మవాదిరైనను ఆయన రచించునట్లుచెప్పు కొన్ని స్తోత్ర గ్రంథములు కొన్నిచోట్ల దేవుని సగుణత్వమునుగూడ సూచించును.

జీవులును ప్రకృతియు అసలులో బ్రహ్మలోనివే. కాని తరువాత ప్రత్యేకముగ పరిణమించినవి. ఇవి ఈశ్వరునికి దేహములు. దేవుడు అన్నిటిలోను అంతర్యామిగ నుండును. జీవులు తమ చర్యలకు బాధ్యులు. వారు జ్ఞానులు కావలసినదే. ఏకర్మయును స్వలాభముకై చేయరాదు. కాని జ్ఞాన భక్తులతో బాటు ఈశ్వర ప్రీతికరమైన లోకహితచర్యల నెప్పుడును చేయుచునే యుండవలె. కర్మల నసలే వదలుట తప్పు. భగవంతుడు ప్రేమమయుడు. నరులు భగవంతునిపైనను, అన్యోన్యముగను, ప్రేమగల్గియుండవలె" అని యీయన సిద్ధాంతము. అద్వైతులది "వివర్తవాదము" ఈయనది "పరిణామవాదము ♦ శంకరుని అహింస (హింసింప కూడదనుట) అభావ స్వరూపము (Negative) లని తోచును. రామానుజుని అహింసలో భావస్వరూపము (Positive aspect) ప్రేమతత్వము ప్రధానము. ఉభయుల దృక్పథములో కొంచము భేదమున్నది. శంకరులవలెగాక రామానుజుడు విష్ణుభక్తికే ప్రాధాన్యమిచ్చెను. శివకేశవులును బ్రహ్మయు ఒకే ఈశ్వరునికి స్వరూపములు; అందు భేదము లేదని సృష్టిలో లయమునుండునని రామానుజులు ఒప్పుకొనును. కాని లయసంహార స్వరూపుడగు శివస్వరూపముకు ప్రాధాన్యమిచ్చుట కొప్పుకోరు. లయమూర్తికి ప్రాధాన్యమిచ్చుట హింసాతత్వవ్యాపకము కావచ్చు. దానికన్న విష్ణుస్వరూపము (స్థితి రక్షకరూపము) నే ధ్యానించి సేవించుట జీవ రక్షణపైన శ్రద్ధగల్గించును. అది లోకమున కెక్కువ క్షేమకరము అని ఆయనభావము. బ్రహ్మ (ఈశ్వరుడు) అసలునిర్గుణస్వరూపమని శంకరులు. అది సగుణస్వరూపమై ప్రేమాది కళ్యాణగుణయుతమని రామానుజులు. తనలీలచేలోకమునట్లు పరిణమింప* జేసి భగవంతుడీ లోకములో ప్రేమతత్వమును వ్యాపింపజేయునని భావన.

♦ వివర్తము అనగా ఈలోకమనేది జీవుని భ్రమవలన తన మనస్సులో ఏర్పడుననుట. అట్లుగాక పరిణామమనగా ఈశ్వరలీల వలన ప్రకృతిలో క్రమముగ మార్పుజరుగుట

* "లోకవత్తులీలాకైవల్యం" బ్రహ్మసూత్రము 2-1-33

సాంఘికముగ ఆయాజాతులు మధ్య అనుకూల్యముకును, నిమ్నజాతుల అభివృద్ధికిని రామానుజుడు ప్రత్యేక కృషి జేసెను. వారికి ఆర్యధర్మమును మతభావములును బోధించి ప్రచారము చేయుచుండెను. శంకరులవలె, రామానుజుడును, అఖిలభారత దృష్టితో స్వయముగ సంస్కృతభాషలోనే గ్రంథముల రచించెను. కాని ప్రజల వాడుకభాషలో మతప్రచారము జరిగించెను. ఆయన సత్ప్రవర్తనగల జ్ఞానులగు శూద్రులను తనయింట బ్రాహ్మణులతో సమముగ ఆదరించి సత్కరించుచు కొన్నియేండ్లు గృహస్థుడైయుండెను. తరువాత ఆయన సన్యసించి దేశమందంతటను వైష్ణవమతమును విశిష్టాద్వైతమును వ్యాపింపజేసెను. రామానుజుని బోధవలన వైష్ణవులన్నికులములవారికి బోధజేసి వారిలో కొందరిని శిష్యులుగ తయారుచేసిరి. హరిజనులలోను విష్ణుదాసు లేర్పడిరి. ఆయన దీర్ఘకాలము జీవించి చాలామంది విద్వాంసులను సదాచారులైన ధర్మప్రచారకులను ఆయాప్రాంతములందేర్పర్చెను.

ఆయన ఉదార జీవితపుచర్యలును విశిష్టమైనవి. శ్రీరంగములో ఆయన విద్వాంసులగు బ్రాహ్మణులతోకలసి, ప్రతిరోజును కావేరికివెళ్లి ఆనదిలో స్నానమై తిరిగి వచ్చునపుడొక హరిజన విద్వాంసుని భుజముమీద చేయివేసి అతనితోకలసివచ్చి కోవెలకు బోవుచుండెను. ఆచర్య అనాచారమని తమ కగౌరవమని, సహచరులగు ఆ బ్రాహ్మణులు ఆక్షేపించిరి. "ఈబ్రాహ్మణుల కన్న ఆ పంచముడెక్కువజ్ఞాని, పరిశుద్ధుడు, ఉత్తముడు. స్నానమునకు ముందెవరిని స్పృశించినను, స్నానముచేసినతరువాత పరిశుద్ధహృదయుడు ప్రేమపరుడు అగు పంచమసోదరుని స్పృశించినందున పవిత్రుడనై స్వామిప్రార్థన జరుపుట ప్రశస్తము" అని ఆయనే తనచర్యను సమర్థించి అట్లే చేయుచుండెనట. చోళదేశపు అప్పటి రాజు శైవుడు. రామానుజుని వైష్ణవమత ప్రచార మాయనకిష్టముకాక దానిని మానుమని ఆరాజు రామానుజుని తొందరచేసి తుదకు [illegible] ఆయన సత్యముని నమ్మినదాని

నెట్టి కష్టములలోను మాన లేదు. కాని నిర్బంధములు క్రమముగా హెచ్చినవి. చివరకాయన యీబాధలవలన శ్రీరంగమువిడిచి, మైసూరు ప్రాంతమునకు చేరెను. అక్కడ తీవ్రముగ వైష్ణవ సిద్ధాంతముల ప్రచారముచేసెను అక్కడి జైనవిద్వాంసులతో వాదించి విశిష్టాద్వైతమును ఆ ప్రాంతమున స్థాపించెను; అవకాశము దొరికినపుడెల్ల హరిజనులు వగైరా దీనుల నుద్ధరించుట కాయన పూనుకొని, వారిలో చాలమందికి జ్ఞానమును సదాచారమును విష్ణుభక్తినినేర్పి వారికి సత్ప్రవర్తన గల్గించెను. ఆయనను జైనులు బాధించినప్పుడా హరిజనులాయనకు సాయపడుచుండిరి. అందుకు కృతజ్ఞతగను ఔదార్యమువలనను అక్కడి తిరునారాయణపురము (మేల్కోట) లోని సుప్రసిద్ధ దేవాలయములోకి ఆయన వారికి ప్రవేశము కల్పించెను. అందుకు స్మారకముగ ఇప్పటికిని ఆ ఆలయములో సాలీనా కొన్నిరోజులలో హరిజనులు బాహాటముగవచ్చు సాంప్రదాయమున్నది.

అద్వైతులు యజ్ఞములను, అందులో జీవహింసనుచేయు ఆచారమున్నది. రామానుజు లందుకిష్టపడ లేదు. ఆయన ప్రాణివధను నిషేధించెను. నేటికిని వైష్ణవులలో "తెంగల"వారు యజ్ఞములు అసలే చేయరు. "వడగల"లు యజ్ఞమును చేసినను జంతువులను హింసింపక, అందు పిష్టపశువులనే (అనగా పిండి బొమ్మలనే) ఉపయోగింతురు. (విష్ణుభక్తులగు మాధ్వులును పిష్టపశుసంప్రదాయమునే అవలంబించినారు.)

అప్పుడు మధురలో గోష్ఠీపూర్ణుడను గొప్పయోగీశ్వరుని యొద్ద గొప్ప ఆధ్యాత్మికశక్తి మంత్రబలము నుండెనట. దాని నెవ్వైన గ్రహించుట కితరులే కాక రామానుజులు చాలసారులు యత్నించెను. ఈపనికై ఆయన మధురకు శ్రమపడి తరుచు వెళ్లుచుండెను. ఇట్లు పదునెనిమిదిసారులాయన తిరిగి సేవించిన



శంకరాచార్యులు.



రామానుజాచార్యులు.



రామానందుడు.

మీాదట ఈరహస్య మింకెవరికిని జెప్పక గూఢముగ నుంతుననని ప్రమాణము చేయించుకొని, ఆతిరుమంత్రవు రహస్యమును తుద కెట్లో రామానుజునకు గోష్ఠీపూర్ణుడుపదేశించెను. అంతట దానిని తాను పూర్తిగ నభ్యసించి, రామానుజుడు శ్రీరంగమునకు మరలి వచ్చి భక్తబృందము నంతను వెంటనే యొక మహాసభలోనికి రప్పించి తానెంతో శ్రమపడి రహస్యముగ నేర్చుకొన్న ఈ యమూల్య మంత్రమును వారికందరకును జెప్పి వెల్లడించెను. ఆ సంగతి తెలిసి గోష్ఠీపూర్ణుడాయనపై నాగ్రహించి, రహస్యముగ నుంతునన్న ప్రమాణము తప్పెనని, ఆయనను దూషించెను. అప్పుడు రామానుజుడు "మనస్వంత ఘనతకన్న ఎక్కువమంది జనులకు, సంఘమంతటికిని క్షేమముగల్గుటే నాకిష్టము. మహాపవిత్రమగు ఆయాధ్యాత్మిక రహస్యపు లాభమెంత హెచ్చుమందికి గల్గిన నంతమంచిది. ఇట్లు చేయుటలో గురువాక్య ధిక్కారము, వాగ్దానభంగము కల్గినమాట నిజమే. అందువల్ల నేనధోగతికి పోయినను సరే. నావ్యక్తి మోక్షముకన్న జనులందరికి బంధ విముక్తి గల్గుటే నాకు నూరురెట్లెక్కువ సంతోషకరము." అని గోష్ఠీపూర్ణున కాయన జబాబుపంపెనట. ఆచరణలోను రామానుజునకు విశ్వప్రేమయు స్వార్థత్యాగము నుండినటు లిందువలన స్ఫురించుచున్నది. రామానుజుడు 120 యేండ్లు జీవించెనందురు. ఈదీర్ఘాయువు నాయన సంఘసేవకే వినియోగించి, కాశ్మీరాది దూరప్రాంతములకుగూడ వెళ్లి, పండితులతో వాదించి, విష్ణు ప్రేమమును ప్రజాహితకార్య పరత్వమును బోధించెను.

వైష్ణవులలో ప్రపత్తి సిద్ధాంతము కలదు. దీనిప్రకారము స్వతంత్ర విచక్షణయు, జ్ఞానమును చాలదని తోచినపుడు దేవుని వైపునే పూర్తిగా భారమువేసి సంపూర్ణభక్తిగలిగి, ఈశ్వర ప్రీతి కరమైన కర్మలు మాత్రము చేయదగును. మనస్సు నీశ్వరునందు పూర్తిగ లగ్నముచేసి పరిశుద్ధహృదయముతో సేవించినప్పు డీశ్వరుడే మనకు సత్కార్యములను యుక్తాలోచనలను, తోపించి,

మనచే నట్లు చేయించునని ప్రపత్తికిని, శరణాగతి సిద్ధాంతముకును, తాత్పర్యము. అహింసాపరుల కీసిద్ధాంతమును ముఖ్యమే.

—§ మ ధ్వా చా ర్యు లు §—

ఈ మతత్రియములో మూడవదగు మధ్వమత ప్రవర్తకులు శ్రీమధ్వాచార్యులు. ఈయనది కన్నడప్రాంతము. కర్నాట దేశము జాలవరకాంధ్రప్రాంతమువలె మొదటి చాలకాలము మహారణ్యమయమై, హింసాప్రవృత్తిగల ఆటవికజనుల కావాసమై యుండెను. తరువాత క్రమముగ ఆప్రవృత్తి తగ్గి, నాగరికత వ్యాపించినది. కొంతకాలము కక్కడ బసవేశ్వరుడను మహనీయుడు వేదప్రామాణ్యమును చాతుర్వర్ణపద్ధతిని నిరసించి, వీర శైవమతమును వ్యాపింపజేసెను ఇదియు భగవద్భక్తి ప్రధానము. ఇందు శివుడనుపేరనే ఏకేశ్వరుని భజింతురు. ఈ వీరశైవుల కీప్రాంతపు బౌద్ధజైనులతో విశేష సంఘర్షణము కలిగి, రాజులును వీరశైవ మతస్థులైరి. అపుడు వీరశైవభక్తులు కొందరాంధ్ర దేశమందును విశేషముగ వ్యాపించి ప్రాచీన కన్నడ భాషలో కొంచెముగ జైనవాఙ్మయమును, విశేషముగ శివభక్తిపోషక మగు వీరశైవ వాఙ్మయము నుత్పన్నమై, ఇప్పటికిని నిల్చి యున్నది. ఈసిద్ధాంతరీత్యా సర్వజనులు సమానులు; కాని, రాజావలంబముతో వారిలో అహంకారము, హింసయు ఏర్పడి నవి. అప్పుడు మధ్వాచార్యు లుదయించిరి * వీరిమతప్రకారం "ప్రకృతియు జీవులును ప్రత్యేకవ్యక్తులే! వేదముల పరమప్రామాణ్యము వీరు నంగీకరింతురు. జీవులందరును పరమాత్మకు దాసుల వంటివారు. యజమానియగు భగవంతునియందవ్యాజభక్తియే ముఖ్యమగు మోక్షసాధనము'' ఈశ్వరుడొక్కడే సృష్టిస్థితిలయ

* మధ్వాచార్యులను "ఆనందతీర్థుడు" అనియు నందురు. ఈయన దక్షిణకన్నడపు ఉడిపిగ్రామంలో జనించిరి. 13 వ శతాబ్దిలో జీవించిరి.

ముల జరిగించుననిని, మధ్వాచార్యులు ఏకేశ్వరత్వమొప్పుకొందురు. కాని, రామానుజునివలె, మధ్వాచార్యులును విష్ణుస్వరూపమునే భజించుట ప్రశస్తమని భావించెను.

ఇట్లేర్పడిన మతత్రయపు సిద్ధాంతములు భారతదేశమంతటను క్రమముగ వ్యాపించి, కొంతకాలము ఆధ్యాత్మిక భావముల వ్యాప్తికి, పరస్పర సహృదయతకును ఉపకరించినది. కాని, తరువాత, వీరిశిష్యులు అసలు ప్రవర్తకుల యుదారభావముల స్తుతించుచున్నను, ఆయాదార్యపద్ధతిని, ప్రేమభావమును సహనశీలతను నిలుపుకోలేదు. కొంద రపార్థములజేసిరి. ఆయాకులముల మధ్య అంతర్విభేదములు దినదినమును వృద్ధియైనవి. అందువల్ల ఆచరణలో అహింసకుబదులు పరస్పర ద్వేషము ప్రబలెను.

14 వ శతాబ్దిలో "వేదాంత దేశికుడ" ని ప్రసిద్ధిజెందిన వెంకట నాయడను విద్వాంసుడు విశిష్టాద్వైతమును బలపరచుచు సంస్కృతములోను అరవములోను గొప్ప వేదాంత గ్రంథములను స్తోత్రములను వ్రాసెను; "సంకల్పసూర్యోదయము"ను అహింసా పోషకము భక్తిబోధకమునగు పెద్ద నాటకమును సంస్కృతములో రచించెను.*

16 వ శతాబ్దిలో నుండిన అద్వైతి అప్పయ్య దీక్షితుడను గొప్ప భక్తవిద్వాంసుడు. దరిమిలా యీకాలపువారి గ్రంథములలో స్వచ్ఛమైన అహింసాతత్వమును ప్రజాక్షేమకరమగు ప్రేమ భావవ్యాప్తియు, కనబడదు. సాంఘిక కలహము హెచ్చుచుండెను. పామర జనులలో మూఢత్వము పోగొట్టి వారిలో దురాచారము తొలగించి ప్రేమభావము వృద్ధిచేయుటకు తగు ప్రయత్నము జరుగలేదు. ఆయామతగ్రంథములలోను నీతికి సత్ప్రవర్తనకును ప్రాధాన్యమీయక తార్కిక చర్యలకును

* పౌరాణిక సంస్కృత కావ్య వాఙ్మయపు అధ్యాయము.

పూర్వాచార రక్షణపేర ఉన్న విభేదముల స్థిరపరచుకాలము గడిపినారు. ఈకాలపు గ్రంథములలో పరస్పర ద్వేషముగ భక్తి ప్రేమవిషయములలోను స్తనశల్య పరీక్షతో తర్కవాదములును♦ దూషణలును, ఆరంభించినవి. శైవాభిమానులగు రాజులచే వైష్ణవులకును, వైష్ణవాభిమానులచే శైవులకును, హింసలు జరిగినవి. స్మార్తులలో వైదిక నియోగిభేదములు, వైష్ణవులలో తెంగల, వడగల భేదములు శూద్రులలో కాపు కమ్మ రెడ్డి వగైరా భేదములు, ఇట్లు కులకక్షలు విభేదములు వృద్ధియైనవి. వాటి ఫలితములు ఉత్తర దేశమందువలె దక్షిణప్రాంతమందును, అన్నిటికిని (తుదకు రాజకీయరంగములోను) వినాశకరముగ పరిణమించినవి.

---

♦ ఈతర్కవాదపు వైషమ్యము కేవల ప్రేమతత్త్వపు ప్రపత్తి సిద్ధాంతములోగూడ పెట్టుట విచిత్రము. భక్తితో ప్రపన్నుడగు జీవుడు స్వప్రయత్నము గూడ చేసినప్పుడే భగవంతుడు మోక్షమిచ్చునని వడగలవైష్ణవులందురు. (ఇది మర్కట కిశోర న్యాయమందురు) జీవుడు భారమంతయు నీశ్వరునియందే యుంచి పరిశుద్ధభక్తిగల్గియున్న చాలును. తన ప్రయత్నమేమియు లేకుండనే జీవునకు భగవంతుడు మోక్షమిచ్చునని తెంగలలందురు. (ఇది మార్జాలకిశోర న్యాయము) పిల్ల తన దేహమును పట్టుకొన్నమీదట మర్కటము పిల్లను మోసి రక్షించుట, మార్జాలము తన పిల్లలను తానే పట్టుకొనిపోవును రక్షించునని తార్కిక సమయము.

## అధ్యాయము 27.

### —♦ బౌద్ధ సంస్కృతి క్షీణదశ ♦—

ఇట్లు, తరువాత మన దేశపు సంస్కృతిలో మార్పు జెందినది. అహింసాతత్త్వమునకు బౌద్ధధర్మమెంతో దోహదమిచ్చెనుగదా! వేయేండ్లు దేశమంతటా వ్యాపించి, ఈలోగా బౌద్ధ ధర్మము బర్మా, చీనా, సింహళ, టిబెత్తు వగైరాలలో ముఖ్యమత

మైనది. అక్కడ నేటికిని బౌద్ధధర్మము ప్రముఖమై నిల్చియున్నది.‡ మాతృదేశంలోమాత్రం బౌద్ధమతము నామావశిష్టమైనది. (జైన మతమూ వెనుకటివ్యాప్తిలో లేదు) ఇట్లగుటకేమికారణం ? అందువల్ల అహింసాతత్త్వము మన సంస్కృతినుండి పోయినట్లేనా ? ఈసమస్యల నిప్పుడు పరీక్షింతము.

ఈ క్షీణతకు బ్రాహ్మణుల అసూయకారణమని శ్రీ వెల్సు వగైరా కొందరు విద్వాంసులు తెలిపినారు. ముస్లిములతో సంఘర్షణయే కారణమని కొందరన్నారు. ఇవియు కొంతవరకు కావచ్చు, కాని, అప్పుడు ముఖ్యకారణములు వేరు బుద్ధుడు మరణించి 5 శతకములైన తరువాత (క్రీ. శ. 1 వ శతాబ్దినుండి) దాని తగ్గుదలకు సూచనలారంభించినవి. రాజసహాయము బౌద్ధధర్మపు వ్యాప్తికి మొదట కొంత సహాయకమైనది. రాజులు బౌద్ధశ్రమణకుల సదుపాయముకై, విశేష ద్రవ్యముతో దేశమంతటను చక్కని ఆరామ విహార చైత్యములను కట్టించిరి. ఆసంస్థలకై స్థిరవసతికని చాలా రొఖమును భూముల ఆదాయమును వీటికర్పించిరి. బౌద్ధ భిక్షువులు విశేషగౌరవము నొందుచు, ఈమహాభవనములలో విహరించుచుండిరి. తరువాత వారిలో కొందరు వాటిపేర యింకను ద్రవ్యార్జన జేయుచు, బుద్ధుడు నిషేధించిన "తణ్హా" (తృష్ణ)కు లోనైరి.♦ పరిశుద్ధభావములు విడచిరి. కొందరు అహంభావముగల్గి బౌద్ధధర్మము హిందూమతముకు వ్యతిరిక్తమనిమెంచి సాంప్రదాయిక హిందూ మతస్థులను ద్వేషించిరి. కామక్రోధయుతుల కహింసాతత్త్వము

‡ అక్కడగూడ బుద్ధుని అసలుసిద్ధాంతముల ప్రకారం లేకుండా, చాలా వికృతికిలోనై విచిత్రపరిణామమొందినది. అక్కడ ప్రస్తుతస్థితినిబట్టి బౌద్ధసిద్ధాంతముల సత్యతను బరిశీలించవీలులేదు.

♦ నేడును హిందూ సంస్థలలో కొన్ని గొప్ప పీఠములలోగూడ ఇట్టి స్థితి యుండుట విచారకరము. ఆకాలమందు ఒక్క కాశీపురిలోనే 80 గొప్ప విహారములుండేవట.

నిల్చుట కష్టము. వీరిలో కొందరు అహింసను నోటితో చెప్పుటే గాని, ఆచరణలో లేదు. పరస్పర కలహములు, అంతర్వివాదములు నేర్పడెను. అంతకుపూర్వము ఆధ్యాత్మికచర్చలలో విద్వాంసులు తార్కిక కలహములకు లోనగుచున్నారనితలచి, బుద్ధుడు భగవంతునిగూర్చి ప్రకృతి సంబంధమునుగూర్చి లేనిపోని కుతర్కములవద్దని, సత్ప్రవర్తనగల్గి, లోకుల దుఃఖమును బోగొట్టుట కర్తవ్యమని బోధించెను.

3 శతాబ్దములైనతరువాత బౌద్ధమతములో మహాయానము హీనయానము అని శాఖలేర్పడినవి. మరికొంతకాలమునకు కొందరు విద్వాంసులు తమ శుద్ధమతమును వట్టి తార్కికచర్చలలోదింపిరి. శూన్యవాదము, విజ్ఞానవాదము ఇత్యాదుల తర్కప్రజ్ఞ ప్రదర్శించుచు, ఆవిద్వాంసులు బుద్ధుని ముఖ్యబోధలను వెనుకకు త్రోసిరి. కొందరు బుద్ధుని భగవంతునిగ నెంచిరి. మహాయానికులన్నిచోట్లను బుద్ధుని శిలావిగ్రహముల బెట్టి పూజించిరి. బోధిసత్వమూర్తుల నర్చించిరి. చివరకీమతము మూఢవిగ్రహారాధనగ పరిణమించినది. ఇంతేకాదు దరిమిలాను బౌద్ధశ్రమణకులును విహారములలో మాంసభోజనము జేయుచుండిరి. ఇదిగాక కొందరు బౌద్ధ సన్యాసినులు సన్యాసులు స్వైర విహారములోదిగి, దుర్వృత్తి నారంభించిరి. స్త్రీలకు సన్యాసాధికారమిచ్చుటకు ముందు బుద్ధుడు నీతిరక్షణకు కొన్ని కట్టుబాటులేర్పర్చెను. ఆ నియమములను శ్రద్ధతో పాటింపకుంటె బౌద్ధధర్మము 5 శతాబ్దములలో క్షీణించునని బుద్ధుడు చెప్పెను; తరువాత అట్లే జరిగినది. ఆనియమములు లక్ష్యపెట్టనందున, బౌద్ధారామములలో అవినీతి యేర్పడి శ్రమణకులు విషయలోలురు దురాచారపరులునైరి. పతనము పూర్తియైనది.

ఇంకొకవిషయము :— ముఖ్యమైన ధార్మిక గ్రంథములన్నిటిని దేశపు వాడుకభాషలోనే వ్రాయించుట, దానిలోనే

ప్రచారకులు సామాన్యులకు తెలియునట్లు బోధజేయుట, బుద్ధుడేర్పర్చిన ప్రత్యేకతలోనివి. అవి సామాన్యుల కుపయోగించును. అట్లు జరిగినంతకాలము బౌద్ధమతము వృద్ధిలో నుండినది. తరువాత బౌద్ధులు తార్కికచర్యలలోబడి గర్వించిరి. ఆవిద్వాంసులు తమ ముఖ్య గ్రంథములను పాండిత్యప్రదర్శనకై సంస్కృతములో వ్రాసిరి.*

అశ్వఘోషుడు, బుద్ధఘోషుడు, దిఙ్నాగుడు, అమరసింహుడు, నాగార్జునుడు, వగైరా బౌద్ధ విద్వాంసులు తాము రచించిన వాఙ్మయమునకు సంస్కృతమునేవాడిరి. వారి రచన లాభము సామాన్యులకు లేకుండెను.

ఇట్లు "బౌద్ధమతము" స్వదేశములో నశించుట విచారకరమే. కాని ఒకసంగతి బుద్ధుడు అసలు స్వతంత్రమతం స్థాపింప నుద్దేశించలేదు. సనాతన హిందూమతమునే (అందేర్పడిన లోపముల సంస్కరించి) పునరుద్ధరించదలచెను. ఆయుద్దేశమీడేరినది. బౌద్ధమతము మంచి వృద్ధిలోనున్నప్పుడది హిందూమతపు సరిస్కరణ శాఖగనే యుండెను. అందలి అహింసా సిద్ధాంతమును ధర్మప్రచారపు ప్రాముఖ్యమును సత్ప్రవర్తనావశ్యకతను మహాభారతాది గ్రంథములలో చేర్చినారని గమనించియున్నాము. అహింసాతత్వ ప్రచారమునకు బుద్ధుడేర్పర్చిన నియమములను సనాతనులును చాలవరకు గ్రహించిరి; మద్యమాంసముల నిషేధము, సహనము, సన్యాసపద్ధతి, మఠములు, వాడుకభాషలో మతప్రచారము, నైతికవర్తనము, కర్మపరత్వము, కొంతవరకు సాంప్రదాయిక మతములలోను భాగమైనది. కనుక ప్రత్యేకమతపు అవసరముపోయి, అప్పటి బౌద్ధులు మరల తల్లిమతమగు సనాతన

---

* ఇటీవల కలకత్తా విశ్వవిద్యాలయము, విశ్వభారతిసారనాథము వగైరాలతో బౌద్ధధర్మపు బోధలను వాఙ్మయమును పునరుద్ధరణ చేయుచున్నారు. మహాబోధిసంఘము ప్రత్యేక కృషి చేయుచున్నది.

ధర్మములో జేరిపోయిరి. ఇట్లు సమన్వయము జరిగి, ఉపనిషత్తులు సూచించిన అహింసాతత్వము మరల హిందూమతములో ముఖ్య సూత్రముగ నిల్చినది.

## అధ్యాయము 28.

### —• పురాణసంస్కృతి •—

అహింసా భావపు పరిణామము. జైనబౌద్ధ సంస్కృతి క్షీణతతో సంప్రదాయ హిందువులకు ప్రాబల్యమేర్పడినది. క్రీ. శ. 4 వ శతాబ్దినుండి మగధసామ్రాజ్యపు గుప్తవంశ రాజులు సంప్రదాయ హిందూసంస్థకేతోడ్పడిరి. తరువాత ఆంధ్రరాజులు నట్లుచేసిరి. అప్పటిభాసకాళిదాసాది కవులును ఈసంస్థలకు రామకృష్ణాది అవతారములపూజకు ప్రాముఖ్యమిచ్చిరి. క్రమముగ బౌద్ధులపైన ద్వేషము ప్రబలినది. ఆర్యేతరులందరికిని సంప్రదాయ హిందూమతములో స్థానమేర్పర్చిరి. కాని, అట్లు చేయుటలో తరువాత బ్రాహ్మణులు క్షత్రియులు తమకు ప్రత్యేకతను, గౌరవాధిక్యమును పెట్టుకొనిరి. వర్ణములకు స్థిరత్వము కల్పించిరి. ఆర్షకాలమందువలె నైతికమానసిక వృద్ధిద్వారాను త్యాగము ద్వారాను బ్రాహ్మణ క్షాత్రత్వములకు పరిణామములందు అవకాశము తొలగించిరి. శూద్రులసంఘము చాల పెద్దదై, అందులోను లెక్కలేని అంతర్విభాగము లేర్పడినవి. ఆర్య ద్రావిడుల ప్రత్యేక సంస్కృతులమధ్య కొంత సమన్వయము జరిగినవి. ఆదిమ ద్రావిడ జాతులజనులలో హింసాతత్వము అట్లే ఉండిపోయినది.

వర్ణభేధమువల్ల ఆయాజాతులమధ్య సంయోగము లేక, ఈ ద్రావిడ నాగరికత నేటికిని నిమ్నజాతులలో హీనస్థితిలోనే యున్నది. కాని, దేవుడు ప్రేమస్వరూపుడు లోకరక్షకుడు, సర్వభూతసముడు అను ఆర్యసిద్ధాంతము వ్యాపించినది. దాక్షిణాత్యులలోను బౌద్ధులలోను వ్యాపించినమూర్తి పూజాపద్ధతి పామరరంజకమగుటచూచి, ఆర్యులు తమ పౌరాణిక సంస్కృతిలోను విగ్రహారాధనను పెట్టి విస్మరింపజేసిరి. బోధిసత్వునికి బదులుగ, ఈశ్వరుని కెన్నియో పూర్వావతారములు వర్ణింపబడినవి. బుద్ధుడు విష్ణుదేవుని దశావతారములలో నొకడుగ ఒప్పుకొనిరి. రామకృష్ణాదులు విష్ణుని ముఖ్యావతారములని విశేషమగు వివరములతో కథలు విష్ణుభాగవతాది పురాణములలో వ్రాయబడి, ఆప్రకారమక్కడ చిత్తరువులు దేవాలయములు దేశమందన్నిప్రాంతాలలోను నిర్మించిరి. దక్షిణదేశమందెక్కువ వ్యాప్తిలోనుండిన శివునికి అమ్మవారికి వేదములోని రుద్రదేవునికని తీవ్రత్వము కొంత సంహారకరత్వమున్నది. కనుక, వీరికేకత్వమేర్పడి, అమ్మవారు శక్తి శివునిభార్య, పిళ్ళయారు (విఘ్నేశ్వరుడు) శివునికొడుకు, వృషభము వాహనము సర్పమాభరణము, ఇత్యాది సిద్ధాంతములు అందుతో చాల గాధలును కొన్ని పురాణములలో చెప్పబడినవి. శివావతారములును వివరింపబడినవి. ఇట్టిపద్ధతిని ఆధునిక పరిశోధకులు థియోక్రసీ (దేవసమన్వయం) అందురు. ఇట్టిస్కాందాదులు శైవపురాణములు వేదకాలపు వరుణుడు, మిత్రుడు, అగ్ని, ఇంద్రుడు వగైరాలకు ఇప్పుడు సర్వేశ్వరస్థానముపోయినది. మరియు ఉపనిషత్తులందలి అమేయుడగు భగవంతుడు కేవలం సగుణుడై, సాకారుడైనట్లు పామరుల కాకర్షకముగ పురాణములందు వర్ణించిరి. దేవాలముల నిర్మాణములకు అర్చనాదులకు వివిధాగమము లేర్పడినవి. కాని, భగవంతుని యేకత్వముకు భంగము లేకుండ, భగవంతుని సృష్టి స్థితిలయరూపములు వివిధావతారములని నిర్ణయింపబడినది ఇది విద్వాంసులకు తెలిసినదే; కాని, సామాన్యులలో

అజ్ఞానముగల్గి, శైవ వైష్ణవులమధ్యను, హిందూజైనాదులమధ్యను ఆయావర్ణములమధ్యను విభేదముగల్గి, హింసాభావము నకంకురము గల్గినది. ఇంతకన్నను ముఖ్యము బ్రాహ్మణులు యితరవర్ణముల వారిని, ముఖ్యముగ పంచములను ఉద్ధరించి, వారిలో మద్యమాంస ముల దొలగించుటకు జీవహింసాబుద్ధి బోగొట్టుటకు మాలమాదిగ లనబడు హరిజనులు యీఆర్య సంస్కృతిని బాగుగ వ్యాపింపచేసి వారి దురాచారముల బోగొట్టుటకు బాధ్యులైయుండియు అట్టి యేర్పాటులజేయలేదు. పైగా వారల అస్పృశ్యతయు, ఆగమ ములు వారికి దేవాలయప్రవేశము లేకుండాజేయుటయు, ఆయా సంఘముల హృదయములో క్రోధాదులను విభేదమును, హింసా భావమును, రగులజేసినవి. ఇవి క్రమముగ సంఘమంతటిలో ఐకమత్యమును చెడగొట్టి, క్రమముగ దుర్బలముగజేసినవి వీటి ఫలమును దరిమిలాను దేశమంతయు అనుభవించినది. అప్పటి నుండి అహింసాతత్వము క్రమముగ సడలిపోయినది. కాళిపూజ కులు, కాపాలికులు మతముపేరట జీవహింసను మద్యపానము చేయుచుండినట్లు భవభూతి మాలతీమాధవములోను, కృష్ణమిశ్రుని ప్రబోధచంద్రోదయములోను, సూచించినాగు. అప్పుడే కుమారిల భట్టుప్రభాకరాదులు యజ్ఞయాగాదుల కర్మకాండను పూర్వ మీమాంసాశాస్త్రముద్వారా పునరుద్ధరించిరి. వారు ఉపనిషన్మ తమును పూర్వపక్షము జేసిరి ;స్వతంత్రాలోచనకు బంధముగల్గజేసి వేదములు విధిప్రమాణములుగనుక, అందు చెప్పిన అశ్వమేధచయ నాదులను విధిగ (జంతువధతోసహా) జరిగించవలసినదే అని నిర్ధా రణచేసిరి. "యజ్ఞ" మనగా త్యాగము పరోపకారము అను మూలసూత్రము మూలబడినది. వేదము ప్రభుసమ్మితము; కనుక, ఇప్పుడు శాకాహారులమే అయినను, యజ్ఞములో జీవహింస జరిగిం చదగినదే అనిరి ; వీరినిజూచి శూద్రాదులు తమ జాతరలకును ధార్మికాధిక్యతయున్నదని భావించి, వాటికిశిష్టాచారమారోపించుట సహజము.ఇట్టి వేదవిహితకర్మలగుయజ్ఞములకు వేదప్రామాణ్యమొప్పు

కోలేదు గనుక బౌద్ధులు, జైనులు నాస్తికులని వీరు నిరసించిరి.* పరస్పరం అసహనము ఆరంభించినది. అంతవరకు మనదేశమందు మతభేదముకు ఒకరినొకరు హింసించు రివాజులేక, ఔదార్యముండెనుగదా. ఇప్పుడు పరస్పరహింసాభావము వృద్ధియైనది. ఆదరిమిలా కాలపు కొందరి మతగ్రంథములలో పరస్పర నిందదూషణ హెచ్చుగనున్నది. బౌద్ధులంతరించి జైనమతము క్షీణదశకు వచ్చినతరువాత, సాంప్రదాయపు హిందువులలోనే హింసాతత్వము బాగుగతలయెత్తి శైవులను వైష్ణవులును, వైష్ణవులను శైవులును, నిందించదొడగిరి. వారు తమకుండు రాజావలంబనమును భిన్నమతస్థులహింస కుపయోగించినట్లును, దరిమిలా చరిత్రవల్ల తెలియుచున్నది వీరి ప్రమాణపురాణములను వారును వారి ప్రమాణపురాణములను వీరును తామసపురాణములని నిందించినారు ♦

ఈహింసాభావము సాంఘిక విషయములలో వ్యాపించి, అనేక దురాచారములు, పరస్పరవిరోధములును, తలయెత్తినవి. లోగడ మనము చూచిన శ్రుతి స్మృతులు ప్రమాణములన్నను వాటి మూలసూత్రములు మరచిరి. స్త్రీల హక్కులు తగ్గింపుఅయినవి. తరువాత బాల్యవివాహములును, సహగమనపు క్రూరాచారమును, కొన్నిచోట్ల ఘోషాపద్ధతులును ప్రబలినవి. దేవాలయపద్ధతిలోను మొదట ఔదార్యమేఉండి, తరువాత తగ్గినది. ఇవి ముఖ్యముగ దక్షిణప్రాంతపు ఆలయములు. విశాలభావముతో ఏర్పడినవి. ఇందు జాతి కుల విభేదములు లేకుండ సంఘమంతయు సమావేశమై సమిష్టిప్రార్థన జరుపవలెను. ఇక్కడనే పురాణకాలక్షేపాదులద్వారాను ఉపన్యాసాది బోధలవల్లను బాలురకు విద్యాబోధవల్లను జనులందరును కలిసి జ్ఞానబోధనందుచుండిరి. ఇంతేకాదు వైష్ణవ దేవాలయములలో చాలచోట్ల దేవుని ప్రసాద

* ఈపూర్వమీమాంసకు ఈశ్వరాస్తిక్యము పెట్టుకోలేదు అయినను వీరు బౌద్ధజైనుల నాస్తికులనుట విచిత్రము.

♦ ఇట్టి [illegible]

ముగ అందరికిభుక్తి కాహారమిచ్చుపద్ధతి వచ్చెను. ఈకలయము లలో అట్టి పంక్తిభోజనములలో మొదట జాతి కులభేదములు పాటించనట్లు తోచును. (ఇప్పటికిని ప్రసాదమిచ్చుటలోను తినుట లోను ఆదేవాలయాలలో దృష్టిదోషము స్పర్శదోషము పాటింప కూడదనియే సంప్రదాయము.)

ఇట్లు దేవాలయముల ద్వారా సాంఘిక సంఘటన, సమీ కరణము గ్రామజనుల అభివృద్ధియు జరుగుచుండెను. కాని దరి మిలా విభేదములు కలహములు హెచ్చినవి. అందు ద్రవ్య మును ఆభరణములును నిలవచేసి వాటి ఆస్తిని అధికారమును వ్యక్తులు స్వార్థమునకు వినియోగింపజొచ్చిరి. అంతటితో వాటి సందర్భములోను హింసాతత్త్వ మంకురించినది.

కాని, హింసాతత్త్వము హానికరమని అప్పుడును కొందరు విద్వాంసులు కనిపెట్టిరి. పురాణములలోను కొన్ని అహింసా ప్రబోధకమగు గాథలున్నసంగతి చూచియున్నాము. వీటిలో పరోపకారము బోధించుటచే ముఖ్యోద్దేశమని కొందరి యభిప్రా యము♦ హింస పాపకార్యమని హింసించువారు పరలోకమందు నరకమనుభవింతురని, చాలా పురాణములలో జెప్పినారు. సామా న్యులలో మాత్రం ఔదార్యము అహింసాతత్త్వము తగ్గినవి. అం దుల రాజకీయఫలితమును తరువాత చూతుము.

♦ అష్టాదశపురాణేషు వ్యాసేనకథితం పురా
పరోపకారః పుణ్యాయ పాపాయ పరపీడనం॥

# అధ్యాయము 29.

## ముస్లిములదాడి, హింసాఫలం.

11, 12 వ శతాబ్దులందు వాయవ్యదిశనుండి ఆఫ్గనుముస్లిములీదేశము ప్రవేశించిరి. అప్పుడు రెండుజాతుల మధ్యను సంస్కృతుల మధ్యను రాజులమధ్యను తీవ్రసంఘర్షము కలిగి, భారతీయ సంస్కృతిలోను పాలనలోను క్రొత్తపరిణామమేర్పడినది; ఆనందర్భము గ్రహించుటకు, అందు అహింసాతత్వ మెట్టిస్థితిలోనుండెనో తెలియుటకును, మనమిప్పుడు అప్పటి రాజకీయరంగమువైపు మన దృష్టిని మరల్పవలెను.

8 వ శతాబ్దికే "మహమ్మద్ ఖాసిం" అను అరబువీరుడు సింధుదేశముపై దండయాత్రచేసి, ఆప్రాంతమును వశము చేసుకొనెను; కాని అతడితరప్రాంతములకు వ్యాపించలేదు. పిమ్మట 11 వ శతాబ్ది ఆరంభమున "మహమ్మదు ఘజనీ" అను ఆఫ్గను రాజు హఠాత్తుగా ఒక్కొక్క ప్రాంతముపైన దాడిచేసెను; ఈతడు హిందూదేవళముల విగ్రహముల బగులగొట్టి అందును భూమిలోపలను దాచియుంచిన విశేషద్రవ్యముల దోచుకొని, అడ్డువచ్చినవారి నోడించి, లక్షలకొలది రూపాయల కిమ్మతు బంగారుతోను అమూల్యమైన రత్నాదులతోను మరలిపోవుచుండెను. తరువాత కొంత కాలమునకు "మహమ్మదుఘోరీ" వాయవ్యదిశనుండియే ఈదేశము చేరి దండయాత్రచేసెను. ఒకసారి పృధ్వీరాజు (ఢిల్లీ ప్రభువు) నోడించెను. మరొకసారి జయచంద్రుని (కన్యాకుబ్జరాజును) జయించెను. తుదకార్యావర్తమందు ముస్లిం రాజ్యపాలన మారంభించెను. "హిందువులు అహింసాతత్వపువారు, వీరు హింసాపరులైన ముస్లిం వీరులకోడిపోయి, దేశరక్షణ ఆత్మరక్షణ జేసుకో

లేకపోయిరి ; కనుక రాజకీయములలో అహింసాతత్వ ముపయో గించదు" అని ఈసందర్భముగూర్చి కొందరు నీతి చెప్పుట కలదు. కాని, ఆపరిస్థితులను బాగుగ పరీక్షించి చూడవలెను. ధననిధుల నిల్పి విగ్రహముల కమర్చుట నిజమైన ధార్మికతకు, ఏకేశ్వర పూజకు వ్యతిరేకములని ఘజనీ (మహమ్మదీయ సిద్ధాంతప్రకారం) తనసైనికులకు బోధించెను. ముస్లిములకు విగ్రహారాధన, గుడు లలో ధనముపోగుచేయుట గిట్టదు. ఆ "దుష్కార్యము"ల రూపు మాపి, పామరుల మూఢభావముల బోగొట్టుట సరియైన ధర్మ ప్రచారమున కవసరము ; అట్టి నిజమైన మతము నీదేశమున స్థాపించి, ఈశ్వరేచ్ఛ నెరవేర్తుమను దీక్షతోను, వీరావేశముతోను ముస్లిములు పోరుచుండిరి. ఆముస్లిము సైనికులలో పరస్పరం కులద్వేషముగాని, విభేదములుగాని లేవు. వారు పరస్పర ప్రేమతో సహాయముచేయుచు, ఐకమత్యముతోను, తమలో ప్రేమభావము తోను ఉత్సాహముతోవచ్చి, యుద్ధము సాగించిరి. హిందువులకో నిజమైన వ్యక్తిపౌరుషమున్నను, వారిలో పరస్పరప్రేమ అంత శక్తి అప్పటికి క్షీణించి, నిరుత్సాహులై, ఉన్నతాశయములు పొంది తమలో పరస్పరము మానసిక హింసవల్ల ఐకమత్యము లేక, ముస్లిములధాటి నాపలేకపోయిరి.

నిజమైన అహింసాతత్వ మీదేశమందు వ్యాపించియుండి నప్పుడు, మనదేశమితరులకు లొంగక, ప్రపంచపు నాయకమణిగ నుండినది. తరువాత, పరస్పర కలహములు ప్రబలినవి. నైతిక ధార్మిక సాంఘిక విషయములందు హింసాతత్వము అసహనము బాగుగ తలయెత్తినది. దీనిఫలము రాజకీయములలోను కనబడినది. 7 వ శతాబ్దివరకు బలీయమైన సామ్రాజ్యములుండినవి. ఆధ్యా త్మికముగ అహింసాతత్వము క్షీణించినతరువాత, రాజకీయముగను ఏకీభావముపోయి, ఉత్తర మధ్యదేశములందు చిన్నచిన్న రాజ్యము లేర్పడి వీటి రాజులమధ్యను రాజుకు ప్రజలకు మధ్యను అసహనము ద్వేషము నిరంతర కలహములును జరిగినవి. వీటివలన శాంతి

పోయి సేనలు పరస్పర వినాశము చేయుటచే, కలత వృద్ధియై ఆరాజ్యములు భౌతికముగను దుర్బలములైనవి; నైతిక దౌర్బల్యము నేర్పడినది. ఇట్లే సాంఘికముగను ఆయా వర్ణములమధ్యను, వీరికి అవర్ణులకు మధ్యను సహనము లేక, కలతలు వృద్ధియైయుండినవి. అట్టి విభేదములతో కప్పల తక్కెడగనుండి, నిరాదర్శులై, అసంతృప్తి జెందియున్న హిందూ సైనికులలోను, వారి నాయకులగు ఆయారాజులలోను, నిజమైన అహింసాభావము అప్పుడు క్షీణించియుండెను. కార్యశూరతయుపోయెను. నిజమైన బలమున్నప్పుడే అహింస బాగుగనుండును. అధోగతిలోని నిమ్నజాతీయులును పొరుగురాజుల పై ద్వేషము కలవారును విదేశీయులపైన సహజముగ సంపూర్ణ త్యాగముతోను ఐకమత్యముతోను పోరలేదు. బ్రాహ్మణ క్షత్రియులు తమ ఆధిక్యమునే కోరిరి. గాని సంఘక్షేమముకు త్యాగపరులు కాలేదు. ఆయా దేవళములందు విగ్రహారాధన బలమై, అగణ్యమగు స్వర్ణ రత్నాదులు దేవాలయములందుంచబడీ, వారితృష్ణకు పేరాసకు ప్రత్యక్ష నిదర్శనమైయుండెను. ఈ విగ్రహారాధనలో క్రమంగా మూర్ఖతయేర్పడి చాలమందికి నిజమగు యీశ్వర ప్రేమపోయి, అజ్ఞానము మూఢభక్తిగ నుండెను.

ఈ ముస్లిముల దాడికాలముకు హిందువులలో పూర్వపు ఉత్సాహశక్తియు ధైర్యమును క్షీణించినట్లు సూచనలున్నవి. ఇదివరలో ధైర్యోత్సాహములతో దూర దేశములకు వలసబోయి ఉన్నత సంస్కృతి వ్యాపారమును వ్యాపింపజేసినవారి సంతతి సముద్రయానమునే చేయకూడదను నిషేధముకు లోబడిరి. విదేశీయులపైన క్రమముగ ద్వేషమును వారి సంపర్కమంటే భయమును యేర్పడినది. పూర్వము యవనులతో సంబంధముంచుకొని వారి గ్రంధముల జ్ఞానమునుగూడ ఆచార్యులు గ్రహించిరి.* శకయవ

---

* మ్లేచ్ఛాహి యవనాస్తేషు సమ్యక్శాస్త్రం వ్యవస్థితం|
ఋషివత్తేపి పూజ్యంతే, కింపునర్దైవ విద్విజః||

(వరాహ మిహిరుని బృహజ్జాతకం)

నాదులను ధారాళముగ హిందూమతములో గలుపుకొనిరి. కాని, 8 వ శతాబ్దినుండి విశ్వప్రేమను, ఆసాహార్ద్రిమును, కాలానుగుణముగ సంఘస్థితిని సంస్కరించుటయు జ్ఞాన పిపాసయు క్షీణించినవి. అప్పుడు ముస్లిములలో నవ్యోత్సాహమును, జ్ఞానేచ్ఛ, అభివృద్ధి వాంఛయు మనలోకన్న హెచ్చుగనుండినవి. అప్పటికి హిందువులు కూపకూర్మములు కాజొచ్చిరి. భావస్వాతంత్ర్యము, జ్ఞానపిపాస క్షీణింప నారంభించినవి. ధార్మికప్రచారమందుత్సాహముతగ్గి, అన్యమతస్తులను హిందూసంఘములో చేర్చుట స్పృశించుటకూడ మానుకొనిరి; మ్లేచ్ఛులతో నెట్టి సంపర్కమున్నను తమకు హాని కల్గునని భయముగల్గినది. ఇట్లు వారిలో కొంత పిరికితనము గర్వము అంకురించినవి. రాజులలోను ఐకమత్యము లేనట్లు 11 వ శతాబ్దినుండి దరిమిలా చరిత్రలో ప్రతిముఖ్య ఘట్టమును ఘోషించుచున్నది. ఇందుకొక ఉదాహరణ చాలును మహమ్మదు గోరి దేశమును వశపర్చుకొనుటకు మహాసేనతో వచ్చినప్పుడు ఢిల్లీశ్వరుడగు పృథ్వీరాజు గొప్ప సేనను సిద్ధముచేసి మొదటిసారి అతనినోడించెను. కాని, మహమ్మదుగోరి అంతటితో నిరుత్సాహికాక, ఇంకను పెద్ద సేనను తరిఫీయతుచేసి, సైనికులకు ధార్మికోత్సాముగల్గించి, ఎక్కువ జాగ్రత్తతో తయారైవచ్చి, మరల యుద్ధమారంభించెను. అప్పుడు పొరుగురాజ్యపు పాలకుడు తనకు మామగారునైన జయచంద్రునికి పృథ్వీరాజీవార్తను తెలిపెను. ఈసందర్భములన్నియు తెలిసియు జయచంద్రుడు పృథ్వీరాజు ప్రాబల్యముకు అసూయాగ్రస్తుడై, అసహనపూరితుడై, అతనికి సహాయముచేయ నిరాకరించెను. శత్రువగు మహమ్మదుగోరీకే తననైతికసహాయమిచ్చెను. ఆమహాయుద్ధమందు పృథ్వీరాజోడి, చనిపోయెను. గోరీ ఢిల్లీరాజ్య మాక్రమించుకొనెను. కాని మరుసంవత్సరము తనకు మిత్రుడైన జయచంద్రునిపైకి తరలివచ్చి పోరెను. జయచంద్రుడు తాను క్రిందటిసాలున చేసిన దేశద్రోహమునకు ఫలమనుభవించెను. ఇట్లు [illegible] జయచంద్రుని

కన్యాకుబ్జరాజ్యమును గూడ ముస్లింవీరుడు తనరాజ్యములో చేర్చుకొనెను. ఘజ్నీ చేసిన దాడిలోను ఎప్పుడును అందరూ సంప్రదించుకొని కలియరైరి. పై అన్ని సందర్భములబట్టియు, 11, 12 శతాబ్దులలో హిందువుల ఓటమి అహింసాతత్వపు ఓటమి కాదని, తమలో పరస్పరమునుండిన వివిధరీతుల హింసాతత్వపు ఫలితమే యనియు విశదము. మరియు ఆధ్యాత్మిక సాంఘికములం దేర్పడు హింసాతత్వముచే రాజకీయముగను దుష్ఫలిత మేర్పడునని వాటికి రాజకీయములకు పరస్పర సంబంధముండుననిగూడ, పై సంగతులు తెలుపును, నాయకులు రాజులు వ్యక్తులుగూడ తమ స్వార్థము నేచూచుచు సంఘక్షేమము పాటించనప్పుడు, ఆసంఘములో తక్కిన వారికిని, తరువాత ఆవ్యక్తులకుగూడ నష్టమే గల్గుననియు స్పష్టము. మరియు క్రొత్తభావము లవలంబించి సమన్వయించుకోక పోవుటవల్లను హిందువులు వెనుకబడినారు.‡

సాంఘిక ధార్మికములలో హేతువాదమును స్వతంత్రవిచారణను మాని పూర్వపు శబ్దప్రమాణమే తీసుకొన్నట్లు యుద్ధములలోను సంప్రదాయపద్ధతులే హిందూయోధులు పెట్టుకొనిరి, నవ్య పద్ధతులను ద్వేషముతో నిరసించిరి.

ముస్లింనాయకులు తమ సైనికులను చక్కని ఆశ్వికదళములుగ తయారుచేసి, తుపాకులు మున్నగు నవ్యాయుధముల ధరించి క్రొత్తవ్యూహములు పెట్టి ముట్టడించుటచూచి ఆ అనుభవము కలిగినతరువాతకూడ, హిందూరాజులు తరువాత యుద్ధములలోను తమ పూర్వపు సంప్రదాయపద్ధతులే మంచివని వాటినే సులభముగా చలించ వీలులేని గజరథాదులవల్లను అనుచిత పద్ధతుల

---

† ప్రాతదైనంత మాత్రమున మంచిదనుట తప్పని కాళిదాసు 5 వ శతాబ్దిలోనే ఇది హెచ్చరించినాడు. పురాణమిత్యేవ నసాధు సర్వం నచాపి సర్వం నవమిత్యవద్యం । సంతః పరీక్ష్యాన్యతరద్భజంతే మూఢః పరప్రత్యయనేయబుద్ధిః॥
మాళవికాగ్నిమిత్రం.

వల్లను తమకే హాని తెచ్చుకొనుచుండిరి. దేశకాలానుసారమగు మార్పులు చేసుకొనుభావ స్వతంత్రతయు నవ్యతయు ఉండుట అవసరమనుసంగతి మరచిరి.

## అధ్యాయము 30.

## ధ ర్మ ప రి ణా మ ము.

క్రీ. పూ. ౫ వ శతాబ్దినుండి వేయేండ్లవరకు మనదేశమందు అహింసాతత్వము వ్యాపించి జనుల ఆర్థిక సాంఘిక రాజకీయస్థితియు ఘనమైయుండెనని, చూచియున్నాము. తరువాత గొప్పపరిణామ మేర్పడినది. జనులలో ఉద్యమశీలత, ఉత్సాహము సాహసము సరస్పరమైత్రి, అనుకూల్యము చాలవరకు తగ్గినవి. ఆయాకులములమధ్యను ఆయాప్రాంతముల చిన్నచిన్న రాజ్యముల మధ్యను, పరస్పర కలహము లేర్పడినవి. ఈస్థితిలో విదేశీయులు దాడిచేసిరి. హిందూరాజులును సైనికులును కలయిక లేక, వేర్వేరుగ ముస్లిముల నెదిర్చిరి. వారును వారి సైనికులును వ్యక్తివీరత కనపర్చినను, సేనలో నవ్యతయు కట్టుబాటును ఏకీభావమును ఉత్సాహమును లేక, ఓడిపోయిరి. ముస్లింరాజులు పాలించదొడగిరి. ఈ రెండు సంస్కృతుల సంఘర్షములో హింసాతత్వము ప్రబలినది. దేశములో పరస్పర సంఘర్షములు ద్వేషములు రాజకీయముగనే గాక, సంస్కృతిలోను పొడచూపినవి. హిందువులలో కొందరు ముఖ్యముగ అవర్ణులు ముస్లిములైరి. టర్కీ పారసీకాదులలోవలె కాక ఈదేశపు సంస్కృతిమతము వాటి ప్రత్యేకత కొంతవరకు నిల్చినవి. కాని హిందువులలో సహనశక్తితగ్గి (ఆత్మ రక్షణకు కావచ్చు) హిందువులు అన్యులతో సాంఘికాది సంబంధము మానుకొనిరి. హిందూమతములో చేర్చుకొనుట నిరాకరించిరి; కాలాను

కూలముగ సంఘక్షేమముకు అవసరమగు మార్పులు జరిగించలేదు. తరువాత వచ్చిన వాఙ్మయములోను నిజమైన అహింసాప్రబోధము బొత్తిగా తక్కువయే. ఆధ్యాత్మికముగను తార్కికపరీక్షలును పరస్పరదూషణయు ప్రబలమైనవి. విగ్రహారాధన సందర్భములోను ఆయాశాఖలమధ్య హింసాతత్త్వము ప్రబలినది. కాని, తరువాత ప్రతిశతాబ్దిలోను అక్కడక్కడ భక్తులుదయించిరి. వారు బుద్ధుడు జినునువలె నైతికోద్ధరణను దేశమంతటను కల్గింపలేకపోయిరి; కాని, వారిభక్తిబోధలో కొంత ప్రేమతత్త్వముండెను. ఈభక్తులలో చాలమంది ఉద్దేశము ఆధ్యాత్మికమే; వారిబోధలు జనసంఘములో వేరుబారియున్న హింసాతత్త్వమును సాంఘిక వైషమ్యములను పెకలింపలేకపోయినను, అందుకై వారు ధైర్యముతో చేసిన కృషియు ప్రశంసాపాత్రములు. ఉపనిషత్తులలోను గీతలలోను, అంతకన్న దృఢముగ బౌద్ధబోధలలోనుచెప్పిన విశ్వమానవ సమత్వమును, అహింసాతత్త్వమును ఈభక్తులబోధలలో ప్రత్యక్షముగలేదు. ఈభక్తితత్త్వము చాలవరకు ఈశ్వరప్రేమరూపము. వారు రామకృష్ణాది అవతారములలోని లీలలను వృత్తాంతములను వివరించుచు, తమకు భగవంతునికి భార్యాభర్తల సంబంధమో, కొడుకు తండ్రి సంబంధమో, దాసప్రభు సంబంధమో భావించుకొని ఈశ్వరుని మహాత్మ్యమును స్తుతించిరి.

వీరు రచించిన శ్లోకములు గీతములు చాలవరకు సగుణుడగు పరమేశ్వరు నుద్దేశించినవి. ఈమతము భాగవత* రూపము; విశ్వరూపుడగు భగవంతునియందుండు ప్రేమతో మానవుల అన్యోన్య సోదరతకు సంబంధముతప్పదు. ఈభాగవత తత్త్వము ఉత్తరదేశమందు పురాణములతోను దక్షిణమునందు శైవభక్తులతోను

---

* ఈభజనలు స్తుతిరూపములుగనున్నను, భగవంతుని కీర్తనము ప్రభువు దాసుడు పొగడినట్లుకాదు. అందు అతిశయోక్తిలేక, స్వభావోక్తిగనే యెంచవలెను. విష్ణుస్తోత్రముగూర్చి కాళిదాసు యిట్లన్నాడు. "భూతార్థ వ్యాహృతిస్సాహి, నస్తుతిః పరమేష్ఠినః (రఘువంశం 10—33)

ఆళ్వార్లతోను ఆరంభమై, తరువాత ఈభక్తులద్వారా వ్యాపించి నది. కనుక వీరిలో కొందరు శ్రీరాముని, కొందరు కృష్ణుని, తమప్రేమ బోధకాలంబముగ జేసుకొనిరి. దక్షిణమందేర్పడిన మతత్రయాచార్యులును నింబార్కుడు వల్లభుడు ఆధ్యాత్మిక తత్వ ముల చర్చలోకి దిగుచుండిరి. ఈభాగవతభక్తులట్లు చర్చలకు దిగ లేదు. ప్రదేశములోను కాలములోను అప్పటికుండిన పరిస్థితినిబట్టి ఆయాభక్తుల బోధలలో కొంతభేదముండెను. కాని ఈభక్తుల జీవితములు ప్రేమభావపూరితములు అహింసాయుతములు సంస్కృ తివర్ధకములు. కనుక వరుసగ ఆభక్తవరుల జీవిత వృత్తాంతములు మనము క్లుప్తముగ పరికింతము.

## అధ్యాయము 31.

## రామానందుడు.

ఈభక్తుల పరంపరలో మొదటివాడు రామానందుడు, ఆయన 14 వ శతాబ్దిలో కాశీప్రాంతమందు నివసించెను. 8 వ శతాబ్దినుండి ఉత్తరదేశము అశాంతమైయుండెను. ఈలోగా అక్కడనుండి క్రిందకు వ్యాపించిన ఆర్యసంస్కృతి దక్షిణదేశంలో లోగడచెప్పిన మహాభక్తులద్వారా వర్ధిల్లినది. శంగరులును రామానుజులును స్వయంగా ఉత్తరభారతంలో తమ సిద్ధాంతా లను బోధించి, అక్కడ కేంద్రస్థలాలలో తమ శిష్యుల పీఠము లేర్పరిచిరి. మనప్రాంతంలోవలెగాక ఉత్తరమందు విష్ణుభక్తియే యెక్కువ జనాదరమొందినది. శంకరరామానుజులు తమ వేదాంత గ్రంథములను దేశమంతట వ్యాప్తికై సంస్కృతంలోనే వ్రాసిరిగదా. ఆధ్యాత్మిక భావములను తార్కిక క్లిష్టతలేకుండ సుబోధముగ జేసి వానిని పామరులకును తెలియునట్లు రామానంద

దుడు తన ప్రాంతంలో వాడుకభాషయై ప్రాకృతభాషా పరిణామమైన హిందీలోనే గీతములుగ వ్రాసెను. అవి అప్పటి జనులకు ధర్మము, ఉదారమైననీతి తెలియుట కుపయోగించినవి. రామానందుడు విద్వాంసుడు, భక్తవరుడు, ఆయన సర్వజనులందును సమానాదరముగల్గి, అందరిని ప్రేమించెను. ఆయన జన్మచే బ్రాహ్మణుడుకాని, తన బోధలలోను ఆచరణలోను కులభేదములను పాటించలేదు. జ్ఞానులగు శూద్రులను ఆయన తనతో సమముగ ఇంటనాదరించుటచూచి, కొందరు అహంకారయుతులగు బ్రాహ్మణులాయనను మొదట బహిష్కరించిరట. అంతట ఆయన అసలే కులభేదములు వదలి, అన్నిజాతులవారిని జన్మతః సమానులుగ భావించెను. ఆయన ముఖ్య శిష్యులలో కొందరు బ్రాహ్మణులు, కాపులు, సాలీలు, ముస్లిములు, మాలలు నుండిరి. కొందరు స్త్రీలుగూడనుండిరి. ఆయన స్త్రీలకు పురుషులకు సమాన మర్యాద నిచ్చెను.

దక్షిణమందలి నమ్మాళ్వారు వగైరాలు సాధారణముగ కృష్ణభక్తులు. వారి రచనలు చాలవరకు కృష్ణావతారమునే కీర్తించెను. కాని, రామానందుడు శ్రీరాముని గూర్చియే మనోహర గీతముల రచియించి, శ్రీరాముని ఆదర్శజీవితము ననుకరించుమని శిష్యులకు బోధించెను. ఆయన శాస్త్రజ్ఞుడు, విద్వాంసుడు అయితే మతవిషయమందు తార్కికచర్చల వదలి, జనులుభక్తియు సత్ప్రవర్తనయుగల్గి శాంతభావముతో నుండవలెనని బోధించెను. సామాన్యజనులను మూఢవిశ్వాసములనుండి యుద్ధరించి, వారిలో మానవత్వమును భ్రాతృభావమును హెచ్చించుటకు యత్నించెను. ఆయన తన శిష్యులకు సంఘసేవాసక్తిని గల్గించెను; ఆయన తరువాత శిష్యులాయన భావనప్రకారం భారతసంస్కృతి నుద్ధరించుటకు విశేషకృషి చేసిరి.

## అధ్యాయము 32.

### ర వి దా సు.

రామానందుని ముఖ్యశిష్యులలో నొకడు; ఇతని "రాయిదాసు" అనియు చెప్పుదురు. ఇతడు దక్షిణదేశపు తిరుప్పాణాళ్వారు, నందనారులవలె, హరిజనకులపుభక్తుడు. బాల్యమునుండి విష్ణువునందపారప్రేమ గల్గియుండెను; కులవృత్తిగ చెప్పులు కుట్టుచు, అతడు దానిమూలంగానే కొంతకాలం జీవనంచేయుచుండెను. కాని తరువాత అతడు తోడిభక్తులందరికిని చెప్పుల నుచితముగ నిచ్చుచుండెను. సహజముగ మొదట సవర్ణులు యవర్ణుని చిక్కులు పెట్టుచుండిరి. తరువాత బ్రాహ్మణులును ఆతని శాంతతను, భక్తిని, ఆదర్శనీతిని గమనించి, అతనిని ఆదరించిరి. కేవల మానవప్రేమవల్ల ఆయన బ్రాహ్మణులచే గౌరవింపబడెను.

తన చమారువృత్తిలో మంచి నేర్పరియైనను, రవిదాసు ద్రవ్యసంపాదనకు ప్రయత్నించక పొట్టపోషణతో తృప్తినొంది, తనగురువువలెను, సహాధ్యాయియగు కబీరునివలెను, దరిద్రుడుగనే జీవించెను. రవిదాసును పరీక్షించుటకెవరో ఒకసాగి అమూల్యమగు మణినొకదానిని అతనికీయబోయిరి. అతడు మొదట నిరాకరించెను. కాని, ఆయన పట్టుపట్టినందున, తనకుటీరపు చూరులో పెట్టుమనిచెప్పి, తన పనిధోరణిలో నుండెనట. ఆయన యట్లే చూరులోదోపి వెళ్లెను. కొంతకాలమైనమీదట ఆయన దాసు నింటికివచ్చి చూచెను. ఇతడెప్పటివలె దరిద్రుడుగనుండెను. "ఆమణి నుపయోగించుకోలేదా? అది యేమైనది" అని యాయన యడిగెను. "ఏమో, దానిని ముట్టదలపలేదు. నీవెక్కడ పెట్టితివో అక్కడనే యుండవలెను." అని రవి దాసనెను. అంతట ఆమణి నాయన వెదకి తాను పెట్టిన స్థలమునుండి తీసికొనిపోయెను.

(భగవంతుడే భక్తునట్లు పరీక్షించుటకు చేసెనని కొందరి నమ్మిక) అప్పటినుండి రవిదాసు ఆత్మజ్ఞానమును సంతృప్తియు ఇంకను హెచ్చినవి. ముఖ్యముగ ఆప్రాంతపు హరిజనులలో రవిదాసువల్ల అద్భుత ప్రబోధముగల్గినది. వారికందరికినీ రవిదాసు దురాచారముల మాన్పించి, జాతరలు వగైరాలు జీవహింస మద్యపానము లేకుండ జేసి, ప్రేమమయుండు జగత్పిత అగు భగవంతుని ఉపాసన కలుగ జేసెను. ఇప్పటికిని ఆప్రాంతపు చాలమంది హరిజనులీ తెగవారున్నారు.

## అధ్యాయము 33.

### —• నరసింహామెహతా •—

15 వ శతాబ్ది చివరనుండిన నరసింహామెహతా జీవితము ను స్మరణీయము. ఈతడు గుజరాతు ప్రాంతీయుడు. కాతియవాడులో "జనాగడ్" పురమితని జన్మస్థలము* ఈయన బాల్యమునుండియు సాధుజనుల సహవాసము గల్గి మహాభక్తుడైనాడు; రాత్రిపగలు ఎప్పుడును శ్రీకృష్ణ స్మరణ చేయుచుండెను. (ఈయన పినతండ్రి పర్వతవైష్ణవుడును గొప్ప విష్ణుభక్తుడై, ప్రతిరోజును 50 మైళ్లు నడచి ద్వారకకు తులసిమాలతో భజనచేయుచు వెళ్లి వచ్చుచుండె నట) నరసింహామెహతా బాల్యమందొక శివాలయములో దీక్షతో తపస్సుచేసి, మంచి నిగ్రహం సంపాదించి, తరువాత గృహస్థుడయ్యెను. అప్పుడు, ఆయన భక్తిపరుడై పరోపకార ప్రవృత్తిలో కాలము గడుపుచుండెను. ఆయన భక్తిభావశుద్ధివల్ల దేవుడు

* గాంధిమహాత్ముని జన్మస్థలమగు పోరుబందరు దీనికి దగ్గరనేయున్నది. బాల్యమందు గాంధిగారు నరసింహామెహతా గుజరాతీలో వ్రాసిన భక్తిగ్రంథముల జదివి అందువల్ల చాల ఉపకారం పొందినారు.

ఆయనను కష్టములనుండి స్వయముగా తప్పించేవాడని ప్రసిద్ధికలదు. తరువాత ఆయన భార్యయు కుమారుడును మరణించుట తటస్థించెను. అంతటినుండి ఆయన గ్రామములందు తిరుగుచు, జనులకు పవిత్రభక్తిని జీవరక్షణపరతను భక్తిని బోధించుచు, ఆప్రాంత మంతటను భక్తిప్రచారమును చేయుచు, చాలమందిని సత్పురుషులుగ జేయగల్గెను.

ఆయన స్వభాషలో భక్తిని విశ్వప్రేమను బోధించుచక్కని గీతములు వ్రాసెను. అవి ఆప్రాంతపు ప్రాచీన పశ్చిమ హిందీ శాఖ అనగా ప్రాచీన గుజరాతిలోనున్నవి. (అప్పటి గుజరాతి పశ్చిమహిందీ కొక శాఖగ నుండెను) అవి అందరికిని సుబోధవిశ్వప్రేమకములై, అహింసకు బోధకములైయున్నవి. వీటిలో నొకటి గాంధీమహాత్మునికత్యంతప్రియమై, ఆప్రాంతమందేగాక దేశమంతటను ప్రసిద్ధమైనది.*

---

* వైష్ణవ జనతోతేనేకహియే, జోపీడపరాయీ జానేరే । పరదుఃఖే ఉపకారకరేతోయే, మన అభిమానన అణారే॥ సకలలోకమాసౌ నే వందేనిందాన కరేకేనీరే । వాచకాఛ మననిశ్చలరాఖే ధనధన జననీతేనీరే॥ సమదృష్టీనేతృష్ణత్యాగీ పరస్త్రీజేనేమాతరే । జిహ్వాధకీ అసత్యనబోలే పరధననవఝాలేహాథరే॥ మోహమాయావ్యాపే నహిజేనే దృఢవైరాగ్య జేనామనమారే । రామనామనుతాలీలాగీ సకలతీర్థతే నాతనమారే॥ వణలోభీనే కపటరహితఛే కామక్రోధ నివార్యారే। భణేనరసైయోతేనుందర్శన కరతాంకుల ఏకోతేర్ తార్యారే॥ (ఇతరుల దుఃఖముల గ్రహించి, వారికి తోడ్పడుచు ఎవరినీ హింసింపక, నమ్రుడై ఎవరినీ దూషింపక, మనోవాక్కాయము నిశ్చలముగజేసి, తృష్ణాదులులేక, కామక్రోధములు వదలి, త్రికరణశుద్ధిగల్గి, రామనామస్మరణ చేయువాడే నిజమగు వైష్ణవుడని దీని భావార్థము,)

## అధ్యాయము 34.

### —♦ ముస్లిం సంస్కృతి. సూఫీమతం ♦—

తరువాత కొందరు భక్తులు ముస్లిం సిద్ధాంతముల సంపర్క మొందినారు ; కనుక ముస్లిం సంస్కృతి యెట్టిదో దాని ప్రభావ మెంతవరకు తగిలినదో మనమిప్పుడు గ్రహింపవలెను. భారత దేశమందిప్పుడు హిందువులతరువాత హెచ్చుమంది ముస్లిములు. వీరు మొత్తం జనసంఖ్యలో సుమారు నాల్గవవంతు ఉన్నారు♦ కనుక ఇప్పటి భారతీయ నాగరికతలో ముస్లిం సంస్కృతికిని ఉచితస్థానమున్నది. దానితో సంపర్కమువల్ల హిందూ సంస్కృతిలో కొంత పరిణామము కల్గినది. అట్లు కలుగక తప్పదు. కనుక ఆమతస్థాపకుని జీవితము సిద్ధాంతములగూర్చి తెలుసుకోవలెను.

ఈ మతస్థాపకుడు హాజరత్ మహమ్మద్. ఈయన క్రీ. త. 29-8-570 తేదీని అరేబియా దేశపు ముఖ్య నగరమైన "మెక్కా" లో పుట్టెను. అప్పటికి "మెక్కా" యూరపుకు భారత దేశముకు వ్యాపారపు కేంద్రముగనుండెను. ఈయన తండ్రి "అబ్దుల్లా" యీయన పుట్టకముందే మరణించెను. ఈయనబాల్యమందే తల్లి "అమీనా" చనిపోయెను. మహమ్మదు బాల్యమునుండి చాల శ్రమపడి, సత్యవ్రతుడై, కష్టజీవియై, నీతిమంతుడై, పరోపకారబుద్ధిగల్గియుండెను. ఆ దేశములో చాలభాగము విదేశ రాజుల పాలనలో నుండెను. ఈ అరేబియను లప్పటికి మూఢవిశ్వాసములు గల్గి, గ్రామదేవతలను పూజించుచుండిరి. సంస్కృతియు లేకుండ పరస్పరం కలహించుచు, అనేక దురాచారములతోనుండిరి ; వేర్వేరు తెగలై తరుచు తమలో పోరుచు, శిలావిగ్రహముల యెదుట జంతుబలి నరబలిగూడ యిచ్చుచు, త్రాగుచు, జూద

---

♦ బర్మాకాక మనదేశపు సంఖ్య సుమారు 33 కోట్లు అందులో సుమారు 28 కోట్లు హిందువులు ; 8 కోట్లు మహమ్మదీయులు.

మూడుచు హింసాపరులై యుండిరి. వీరు రాళ్లను రప్పలను పూజించుచుండిరి. స్త్రీలను హీనముగ జూచిరి. బానిసను అమ్మువ్యాపారముండెను. మహమ్మదు ఈ స్వజాతీయులకు ధార్మికబోధచేసి, వారిలో ఐక్యమును సంఘీభావమును పరస్పరప్రేమను కల్గించెను. వారిమూఢవిశ్వాసముల బోగొట్టెను. "ఈశ్వరుడొక్కడే ; ఆయన అదృశ్యుడు ; ఆ యేకేశ్వరునే అందరును భక్తితో ఆరాధించవలెను. రాళ్లను విగ్రహములను మూఢముగ పూజింపకూడదు'' అని వారికి మహమ్మదు బోధించి, వారినందరి నుద్ధరించెను. మహమ్మదు ఈనవ్యమతమారంభించగా జనులు శిలలకు మొక్కుట మానిరి ; అక్కడిమెక్కా వగైరా నగరములందలి విగ్రహారాధనవల్ల ఇదివరలో జనులనుండి మొక్కుబడిసొమ్ములు వసూలుచేసి తద్వారా శ్రీమంతులై ప్రబలురైనవారు ఆయనవల్ల తమ రాబడి పలుకుబడి పోవుచున్నదని యెంచి, ఆయనకు విరోధులై మహమ్మదును హింసించి చంపదలచి, చాల బాధలబెట్టిరి. ఈమెక్కా అధికారులు బలీయులు. కనుక మహమ్మదు అక్కడనుండి క్రీ. త. 622 సం॥ లో మదీనా నగరమునకువచ్చి, అక్కడ తన ఆదర్శ జీవనముద్వారా చాలమంది అనుచరులను సంపాదించెను. ఆయన సౌమ్యజీవనము, శాంతస్వభావము, విశ్వజనప్రేమ, ఆయన మహానీయుడని వ్యక్తముచేసినవి.

అక్కడగూడ మహమ్మదు తన ధర్మప్రచారము మానలేదు కనుక శత్రువు లాయనను వెంబడించి మదీనాపైనగూడ దాడిసల్పిరి. కనుక తన నవ్యమతస్థుల రక్షణకై తనయనుచరులను శక్తివంతులగు యోధులుగజేసి వారిచే యుద్ధముచేయించి దుష్ట శత్రువులనుండి వారిని కాపాడుట మహమ్మదు కవసరమైనది.* అతడు వారిని వీరులుగజేసి తానే నాయకుడై ప్రబలురు శూరులు అగు శత్రువుల నెదిర్చి అరేబియాలో నవ్యమతమును దృఢముగ స్థాపించు

* తరువాత మనదేశమందును సిక్కులకట్లే జరిగి, వారును గొప్ప యోధ ధార్మికులైరని చూడగలము.

అరబు తెగలుకు ఐకమత్యమును మంచి సంస్కృతిని యువకుల కుత్సాహముగల్గించి ఏకజాతిగ తయారుచేసెను. తన జీవితాంతము వరకు ఆయన యీశత్రుసంఘముల దాడినుండి తన ముస్లిం సంఘమును రక్షించుటకు పోరి స్వదేశముకు స్వాతంత్ర్యము సంపాదించెను. అంతట అరబులందరును మహమ్మదీయులైరి. ఈమతమును ముస్లిం మతమనియు చెప్పుదురు.

మహమ్మదు క్రీ. శ. 632 లో చనిపోయెను. ఆయన జనులలో జీవహింస త్రాగుడు వడ్డీవ్యాపారము జూదమువగైరా దురాచారముల మాన్పించెను. ఆయన అనంతరం ముస్లింవీరులు తమ్ము హీనదుర్దశనుండి యుద్ధరించిన మహమ్మదు బోధల నితర దేశీయులకును వ్యాపింపజేసిరి. ఆచుట్టుదేశములవారును అప్పుడు హీనసంస్కృతిలోను దురాచారములతోను, విభేద యుతులుగను ఉండిరి. అరబ్బులు తమ సత్య ధర్మము నేర్పు దృఢావేశముతో తమ యెడారి దేశమునుండి అన్ని దిశలకు వేర్వేరు సేనలుగ బయలుదేరిరి.‡ ఒక సేన పశ్చిమదేశములకు వ్యాపించి అక్కడి తుర్కులను, మిశ్రిదేశీయులను ముస్లిములజేసిరి. వారు యూరోపులోగూడ కొన్ని దేశములు జయించిరి. అక్కడి క్రైస్తవులప్పటికి క్రీస్తుబోధించిన అహింసాతత్వము మరచి, కర్మకాండలనే గమనించుచుండిరి. ఒక ముస్లిందళము పారసీకములో జొరబడెను; వారు పూర్వమహత్వమును గోల్పోయియున్న అక్కడి సామ్రాజ్యమును కుప్పగజేసిరి; అరబ్బులు వీరావేశముతో జరిపిన ప్రచారమువల్ల, పారసీకులందరు ముస్లిములైరి.* ఇట్లే ఆఫ్ఘనిస్థానమందు జరిగినది. అంతటితో యీదాడి తాత్కాలికంగా నిల్చినది. 8 వ

‡ అప్పటికి యూదక్రైస్తవ పారసీక మతస్థులలోను చాలవరకు హిందూ బౌద్ధులలోనుగూడ మూఢ దురాచారములు ప్రాముకొన్నవి. వాటికన్న ఇస్లాము పవిత్రమని అరబ్బులు భావించిరి.

* కొద్దిమంది "పారసీలు" మాత్రం స్వమత రక్షణకప్పుడాదేశం వదలి ఓడలద్వారా [illegible] మనదేశం చేరినారు.

శతాబ్దిలో సింధు ఆక్రమణ, 11, 12 వ శతాబ్దులలో మహమ్మద్ ఘజనీ గోరీల దండయాత్రలు, తుదకు ఈ దేశమందును మహమ్మదీయ సామ్రాజ్యమేర్పడుటయు, అందరికీ తెలిసిన చారిత్రిక విషయములే. ఇప్పుడీ దేశపు ముస్లిములలో పైనుండి వచ్చిన ఆఫ్ఘనులు పారసీకులు అరబ్బులు, వారివంశపువారు కొద్దిమందియే. అంతకన్న చాలరెట్లు ఈ దేశపు హిందువులు క్రమముగా అప్పుడప్పుడు ముస్లిం మతం స్వీకరించినారు. అందువల్లనే ఈ దేశమందిప్పుడు ఇంతమంది మహమ్మదీయులున్నారు. టర్కీ పర్షియా ఆఫ్గనిస్థానాదులలోవలెగాక. మన దేశమందు హెచ్చుమంది స్వదేశపు మతములోనేయున్నారు.

ఇప్పుడు ముస్లిములకు హిందువులకు మధ్య తరుచు సౌహార్ద్యము లేకున్నది. అందరి మత సిద్ధాంతము లొకరీతివే, వాటి ఉద్దేశమొకటే అని గ్రహింపక ఇతరుల ప్రస్తుతాచారములను సహింపలేకున్నారు. అందువల్లనే సంఘర్షము హెచ్చినది. ముస్లిముల మతపద్ధతులు గోమాంస భక్షణాదులు హిందువులకు కొత్తవి. విజాతీయములుగ తోచినవి. పూర్వమందు ఇతరులతో కలిసి మెలిసి, వారిని స్వేచ్ఛతో హిందూమతములో చేర్చి, తాము విదేశములకు వెళ్లి, ఆ దేశీయులతో ఉదారంగా వ్యవహరించిన హిందువులు 10 వ శతాబ్దినాటికి సంకుచితభావులై విదేశయానము నిషేధించినారు. యవనులు మ్లేచ్ఛులు అస్పృశ్యులు అని వారిపైన న్యూనభావమును ద్వేషమును రేపుకొనిరి. తమ ప్రస్తుతాచారములకు వ్యతిరేకులైనంత మాత్రమున ముస్లిములు దుష్టులని యెంచిరి. దేవాలయాలలోని ద్రవ్యము హరించుట విగ్రహములబగులగొట్టుట రాక్షసకృత్యమని వీరికి తోచినది. అయితే వేదసంస్కృతిలో విగ్రహారాధన పద్ధతియే లేదు. ఇది పామరులకే మొదట ఉద్దేశింపబడియుండును. గుడులు మతములు ఖజానాలుగ జేయకూడదు అని వీరికి తోచలేదు. వర్ణాశ్రమ విభేదమును హరిజనుల అస్పృశ్యతయు శ్రుతుల యాధారముమీద ఏర్పడినవి

కాక, తరువాత కాలోచితముగ గల్గినవని, వాటి నవసరమైన ప్పుడు సంఘక్షేమముకై మార్చుట న్యాయమే, అనియు వీరికి తోచలేదు. సవర్ణులచే బాధితులైన నిమ్నజాతీయులలో చాల మంది ముస్లిమ్ మతస్థులైరి.* అంతట వారు సవర్ణహిందువులపైన ప్రబలద్వేషులైరి. గోవధవగైరా కొన్నియంశములగూర్చి అనవసరముగ సాంఘిక ద్వేషము పెంచుకున్నారు. అరబ్బులు మొదట అనాగరికులై, విగ్రహారాధనమును మూఢముగ జేయుచు, తెగల మధ్య విభేదములచే కలహములపాలై యుండిరిగదా? వారి నుద్ధరించుటకు మహమ్మదు వారిలో మూర్తిపూజాపద్ధతిని సంఘములో తెగల విభేదమును పూర్తిగ నిషేధించెను. అట్టివాటి నీదేశమందు చూడగనే, వాటిని ధ్వంసము చేయుట ధార్మికోన్నతి కవసరమని అరబు అనుభవమునుబట్టి వీరావేశములతో నుండిన అప్పటి ముస్లిములనుకొనియుందురు. హిందువులలో హెచ్చుమంది అదివరకే మంచి నాగరికులు, వీరు విగ్రహములే దేవుళ్లని తలచు అనాగరికులు కారని, వర్ణభేదములు అసలు వృత్తిసంఘర్షమూ, జాతిసంఘర్షమూ తత్కాలమందు లేకుండుట కుద్దేశించినవనీ సానుభూతి ఉదారదృష్టి ముస్లిములకు లేకుండెను. కొంతకాలమైనమీదట కొందరు మహనీయులు ఈరెండుమతముల మూలసిద్ధాంతములను పరీక్షించిరి. నిజముగా అసలు సిద్ధాంతములలో భేదము లేదు. "సర్వేశ్వరుడు సర్వవ్యాపి సర్వజ్ఞుడు, సర్వశక్తుడునైన ఒకే భగవంతుడనే మనము మనస్ఫూర్తిగ ఆరాధించవలెను. మానవులందరును భగవంతునిబిడ్డలు, వారందరును సోదరులు" అను సిద్ధాంతములీ రెండుమతములకును ముఖ్యములే, ముస్లిములలోను ఉపనిషత్తులలో చెప్పిన సిద్ధాంతమున్నది. అన్యమతములలోను గొప్ప ప్రవక్తలుండిరని మహమ్మదు చెప్పెను. సాధారణంగా వీరులను పూజించుటవల్ల కొంతకాలముకు వారి నవతారముగ

* ప్రస్తుతమును చాలమంది హరిజనులే హిందూమతము విడిచి, ఇప్పటి ప్రభుత్వమతమైన క్రైస్తవమతమును స్వీకరించియున్నారు.

భావింతురు. ఒక్కొకపూర్వవీరు నొక్కొక్క శాఖవారవతార ముగ భావించుటచే, ఆయాశాఖలలో విభేదము తప్పదు. ఇందు వల్ల పౌరాణికకాలముతరువాత శాఖోపశాఖలేర్పడి కలహములు గల్గినవికదా! కనుక, మహమ్మదు విగ్రహములను అవతారము లనుకూడ పూజింపకూడదనెను. తాను మతకర్తయైనను, మత స్థాపకులగు ప్రవక్తలిదివరలో అన్నిదేశాలలోను ఉండినారని* తానును వట్టిప్రవక్తనేగాని అవతారముకానని నరమాత్రుడ నగు తన్నెవరును పూజింపకూడదని భౌతికరూపమేమీలేని ఏకేశ్వ రునే ప్రార్థింపవలెనని ఆయన విధించెను; కనుక, ఆయుదారుని దూరదృష్టివలన నేటికిని ముస్లిములలో ఏకేశ్వరత్వజ్ఞానము పామ రులలోను మారలేదు. సాంఘిక వైషమ్యమును తక్కువ. ఐక్యమే ముఖ్యసూత్రము. భక్తియు ప్రార్థనయు హిందువులవలె ముస్లి ములకు ముఖ్యమే. ముస్లిములు రోజుకైదుసారులు ప్రార్థన చేయవలెను. వారు మసీదులో సమావేశమై, వీలైనంతవరకు కలిసి, సాంఘిక ప్రార్థననే జరుపుదురు. అందు నగలు విగ్ర హములు వస్తువులు నుంచరు.♦ మన హిందూదేవాలయములును అసలు సమిష్టి ప్రార్థనలకును, సమిష్టి జ్ఞానోపదేశమునకునే ఉద్దే శించినవి. కొంతకాలంవరకు చాల దేవాలయములలో కులభేద ములు లేకుండ కలిసి గోష్ఠిచేయుటయు, విద్యను పాఠములను చెప్పుటయు, అక్కడనే గ్రామస్థులకు పెద్దలు పురాణ భార తాదులు చదివి జ్ఞానముపదేశించుటయు నుండెను. ద్రవ్యాశ

---

* కురాను, 35—25

,, 16—86.

♦ హిందూ దేవాలయములు (ముఖ్యంగా లోపలిభాగము) కిటికీలు ద్వారములు సరిగలేకుండుటకు, అందు విగ్రహముల ఆభరణములుంచుటే అసలు కారణము కావచ్చు. మసీదులు విశాలములై గాలి వెల్తురు సమృద్ధిగల్గి చాలమంది జనులుకూడి చాలసేపు సుఖముగ సభచేసి యానందముతో నుండుటకు వీలుగ కట్టబడును. హిందూదేవాలయములు లోపలిభాగము అనారోగ్యకరము, సాంఘిక సమావేశములకంతగా వీలుగానివి.

వగైరాలును కులకక్షలును ఏర్పడినమీదట అసలుఉద్దేశం మరుగు పడినది. సహనము గల్గియుండవలెనని ఆత్మరక్షణముకు తప్ప రక్తపాతము చేయకూడదని జనుల ప్రేమింపుమని మహమ్మదు చెప్పెను. తనమతముకాయన "ఇస్లాం" అని పేరిడెను. "ఇస్లాం" అని అరబికుపదముకు "శాంతి" అని అర్థము. ఆయన దుష్టులకును మంచినే చేయుమనెను.* హింస కూడదని ప్రకటించెను.‡ అన్య మతముల ప్రాచీన గ్రంథముల సిద్ధాంతములను కురాను ఆమోదించునెను§ ముస్లిములలోను వేదాంతపు అనగా ఉపనిషత్తులరీతి మతమేర్పడి, జీవులు సర్వవ్యాపియగు భగవంతుని దేహములు, ఉభయులకు భార్య భర్తలకు, కొడుకుకు తండ్రికి, ఉండు ప్రేమ సంబంధమున్నదని సిద్ధాంతమేర్పడినది. దీనినే "సూఫీ" మత మందురు. ఈసూఫీలలో ముఖ్యుడు "జలాలుద్దీనురుమి." ఇతడు గొప్పప్రేమి, తత్వవేత్త. ఇతడు ప్రేమసౌందర్యముల ఉపాసకుడు, విశ్వమండలి మానవకోటినంతను ప్రేమమయముగ పాటించెను.

సూఫీలలో "రబియా" అను స్త్రీ గొప్ప భక్తురాలు. ఆమె అనేక కష్టములు సహించి, సత్సంగముద్వారా జ్ఞానము సంపాదించి, ఈశ్వరోపాసనతో జీవనమును గడపెను. ఈమె బసా ప్రాంతీయురాలు. "హాఫిజ్" అను యింకొక సూఫీ సాధువు సామాన్యులలో ప్రేమతత్వము వ్యాపింపజేసెను. క్రోధమును హింసాతత్వమును మానవలెనని గట్టిగ బోధించెను; ఇతనిబోధ వైష్ణవుల ప్రపత్తిసిద్ధాంతపురీతిగ నుండును. "సాదీ" యను గొప్ప సూఫీకవి పండితుడు, ఇతని పారసీ గ్రంథములకు గొప్ప ప్రసిద్ధి యున్నది. ఇతడు మన దేశములోను తిరిగి, గొప్ప విద్వాంసులతో

కురాను 17-7, 8-39, 2-190, 6-88

* ,, 41-34

‡ ,, 5-32, 8-128.

§ ,, 8-2.

స్నేహముచేసి విశేష జ్ఞానము సంపాదించెను. ఇతడు నరులందరి సత్ప్రవర్తనకు ప్రాముఖ్యమిచ్చెను. ఈపారసీకు లేగాక, ఈ దేశములోను కొందరు సూఫీ అభిమానులేర్పడినారు ఇట్లు సూఫీలు మంచి ఆధ్యాత్మికభావములను ముస్లిము మతములో బాగుగ వ్యాపింపజేసినారు. వీరి బోధలవల్ల ముస్లిం సంస్కృతిలోను అహింసాభావమును ప్రేమతత్వమును వ్యాపించినవి. ప్రస్తుతము వలె హిందువులు ముస్లిములుగూడ తమ బాహ్యచిహ్నములకు కులాచారములకు మూఢవిశ్వాసముల కే ప్రాముఖ్యమీయక, సిద్ధాంతములకు సదాచారములకు ప్రాధాన్యమిచ్చినయెడల, ఈ రెండు మతముల ముఖ్యసూత్రము లొకటేఅని, రెంటి సంస్కృతులకు సమన్వయము సులభమే అనియు స్పష్టమగును మన దేశంలో ఈ రెంటిలోను కబీరునానకువంటి కొద్దిమంది మహనీయులు అహింసాసిద్ధాంతపు పునాదిమీదనే ఈ రెంటిమధ్య సమన్వయం చేయబూనిరి. ఆసంగతి ముందుచూడగలము.

## అధ్యాయము 35.

### —♦ కబీరు ♦—

రామానందుని శిష్యులలో రవిదాసుకన్నను ప్రసిద్ధుడు కబీరు. అతడు 15వ శతాబ్దిలోనుండెను. అతడు అసలు హిందువేకావచ్చు ; కాని "నీరూ" అను ఒక ముస్లిముసాలీ అతనిని బాల్యమునుండి తన కొడుకుగ పెంచుకొనెను. అరబ్బీలో "కబీర్" అనగా మహనీయుడు. అతడు బాల్యమునుండి మిక్కిలి బుద్ధిమంతుడై, నేతవృత్తిని బాగుగ నేర్చుకొని, అందుతో జీవనము చేయుచుండెను. అతడిట్లు శ్రమజీవియై స్వయంకృషివల్లనే కొంతజ్ఞానము సంపాదించి, క్రమముగ భక్తుడైనాడు. తరువాత

అతఁడు రామానందుని ప్రసిద్ధివిని, ఆయనవల్ల గురూపదేశము పొందదలచెను; ఆయన దర్శనముకై బయలుదేరి, వారణాసిని చేరెను. కాని, అతడు తురకబిడ్డయని తెలిసి, రామానందుని శిష్యులతనిని రామానందుని సన్నిధికి చేరనీయలేదు; అతని కబురును గురువు కందనీయలేదు; అంతట కబీరుకేమీతోచలేదు. సాంప్రదాయిక హిందూమతపు కేంద్రమగు కాశిలో నితని నెవరు నాదరింపలేదు. తుదకతఁడు విసిగి బీదతనముచే నిలువనీడలేక, గంగకుపోయి నీరుత్రాగి, రాత్రి ఆమెట్లమీదనే పండుకొని నిద్రబోయెను. రామానందుడు బ్రాహ్మముహూర్తమందే లేచి, అరుణోదయముకుముందే గంగకు వెళ్లుట మామూలు, ఆప్రకారం రామానందు డక్కడకు వచ్చెను; అయితే, ఇంకను చీకటిగనున్నందున, దృష్టియానక కబీరు వీపుమీద ఆయన పాదము పడినది. వెంటనే రామానందుదులికిపడి తొక్కినందుకు "రామరామ" యని యుచ్చరించి, వంగిచూచెను. కబీరు వెంటనేలేచి, "ఆహా నాకిప్పుడు గురువుగారి మంత్రోపదేశము జరిగినది; ధన్యుడనైనాను" అని నమస్కరించెను "అయ్యో, నేనుపరాకున తొక్కినాను. నీవెవరు?" అని రామానందుడడిగి, కబీరు వృత్తాంతమతని నోటనే తెలుసుకొనెను. కబీరు తననుండి ధార్మికబోధ నొందుటకు కనిపెట్టియున్న సంగతివిని, వెంటనే అతనిని తీసుకొనిపోయి, తన శిష్యునిగ జేసి, అప్పటినుండి కూడ నుంచుకొనెను; అతనియందు ప్రేమగల్గి ప్రత్యేక శ్రద్ధతో నతనికి వేదాంతమును ఉత్తమనీతులను రామానందుడు బోధించెను; కబీరును శ్రద్ధతో గురువునుండి ధార్మిక రహస్యములను నత్ప్రవృత్తి పద్ధతిని నేర్చుకొనెను. అంతట కబీరు ముస్లిములలో ప్రసిద్ధ సూఫీ విద్వాంసుడగు ఫకీర్ షేక్ తకీనుండి ముస్లిం మతపు ముఖ్య సిద్ధాంతములను గ్రహించెను. ఉభయమతముల సంప్రదాయము లును తెలిసినవాడు, కనుక అతడు ఉభయజాతులమధ్యను ఉండుచున్న విరోధభావమును కలతలను తగ్గించి, మైత్రి గల్గించుటకు

తన జీవితమును వినియోగించెను; ఈరీతిగ అహింసాతత్వమును అమలుజరిపి, కబీరు ఉభయజాతుల ప్రేమకును పాత్రుడైనాడు. భారతదేశమునకు సాంఘికముగను, రాజకీయముగను ముఖ్య సమస్య ఆయాసంఘముల విభేదములు పోదలచెను. మన ముఖ్య సంఘము లగు హిందువులకు ముస్లిములకు మధ్య మైత్రి. వీరు పరస్పరం సహనభావం లేక యున్నందువల్లనే, దేశమంతయు హీన స్థితికి వచ్చుచున్నది. కాని, ముస్లిం సంస్కృతికాధారమగు మహమ్మదు వారి బోధను వారి సంప్రదాయమును హిందువులు గ్రహించ లేదు ; అధికారమందున్న ముస్లిములు సాధారణంగా హిందూ సంస్కృతిలోని నిజస్వభావము తెలుసుకోలేదు. ఇట్లు పరస్పరం దురభిప్రాయమేర్పడుటే ద్వేషకారణమైనది. ఉభయమతముల మూల సిద్ధాంతముల సమన్వయించి కబీరు అట్టి సిద్ధాంతములనే జనులకు బోధించెను; "భగవంతుడు అద్వితీయుడు ; ఈయేకే శ్వరునందరు నారాధించవలెను. భగవంతునెదుట అందరును సమానులే. దేవుడు నిర్వికారుడగు ఆనందస్వరూపుడు. అకుం ఠితభక్తియు, విశ్వప్రేమయు, జనులపై సోదరభావమును సత్ప్రవర్తనమునే మోక్షకారణములు" అనుభావము లాయన బోధ లలో ప్రధానములు. రామ, రహీములకు శబ్దభేదమేగాని వాస్తవభేదములేదని, ఆయన చాలసార్లు హెచ్చరించెను. సాంఘిక మైత్రికి భంగముచేయు విభేదములు తగ్గించుకొని పరస్పర ప్రేమ తోనే మెలగవలెనని, ఆయన ఆచరణలోను కనపర్చెను. ఈరెండు మతములకు సామరస్యము తెచ్చెను.‡ కబీరు ఇట్లు తన బోధల నందరికి క్షేమకరముగాను, తార్కికమగు క్లిష్టతలేకుండను చేసెను.

అతడు అప్పటి వాడుకభాషయగు హిందీలోనే రసవంత ములు భక్తిపూరితములు అగు గీతములు రచించెను. అవి సామాన్యజనులవాడుకలో నేటికిని ఉన్నవి. ఈ గ్రంథమును

‡ దుయిజగదీశకహాంసే ఆఫ కహుంకోనే ఘరమాయా, అల్లారామ్‌కరీం కేశవహరి హజరత్ [illegible]యా, వహీ మహాదేవ వహీ మహమ్మద్, బ్రహ్మ ఆదంకహింకోయి, హిందూకోయి, తురుక్ కహా వై పర్, జమీకా పర రహీ...

"బీజక్" అని పేరు. రవీంద్రనాథువంటి మహనీయులును ఈ గీతములు ప్రశస్తములని మెచ్చుకొన్నారు. వాటిలో సోదర భావమును ప్రేమను బోధించునవి చాలగలవు.* కబీరు వర్ణభేదముల నిరసించి, ముస్లిములలో నేర్పడిన అహంకారాదులగూడ ఖండించెను. అందువల్ల రెండుమతములలోను మూఢవిశ్వాసములతోనుండు కొందరు స్వార్థపరులు కబీరును హింసించిబాధించిరి.

అయినను యితడెట్లో శాంతములోను అహింసాతత్వముతోను వాటిని సహించెను; ఆవిరోధులకు తానెట్టి అపకారమును తలపెట్టలేదు. కాశీలో విగ్రహారాధనచే ద్రవ్యలాభ మొందువారు సహజముగ అతనిమూర్తి పూజానిరసనచే దుష్టులైరి. ఇట్లే ఇతడు అహంకారిగర్వితుడు అని అప్పటి ఢిల్లీ పాదుషాయగు ఇబ్రహింలోడీతో ముస్లిము లెవరో చాడీలు చెప్పిరి. అంతట అతనిని రప్పించుటకు పాదుషానుండి హుకుం జారీఅయినది. వెంటనే కాశీనుండి ఢిల్లీలోని దర్బారులో నతనిని హాజరు పరిచిరి. అతడు సభలో నూరక నిలబడెను. "అతడు జోహారుచేయలేదు; అతనిగర్వమును రాజధిక్కారమును చిత్తగించుడు" అని రాజాశ్రితులనిరి, అంతట పాదుషా అతని నందుకు సమజాయిషీ యడిగెను. కబీరు "నేనిదివరకెట్టి రాజసభకును పోలేదు; నే నెప్పుడును బీదరయితులతోను పనివాండ్రతోను తిరుగు సామాన్యుడను. రాజుల యెదుట యెట్లు నడుచుకోవలెనో నాకు తెలియదు; నాకీ సంప్ర దాయము బోధకానందున, నేనేమియు చేయలేదు." అని జవాబిచ్చెను. మొదట కోపించినను, అతని మృదుత్వమును ఋజుభావమును గ్రహించి, పాదుషా అతని నాదరించి వదలెను. "నేను ఏకేశ్వరునకే నమస్కరింతును, రాజులవలన నాకెట్టి లాభము నక్కరలేదు" అనియు కబీరు స్పష్టరెచెను.

* ప్రేమ, ప్రీతిసేజోమిలై, తానేమిలియేధాయ్। అంతరరాఖేజోమిలై తానే మిలైబలాయ్!

గుప్త ప్రగజహై ఏకై దుధారా కైసేహిందూ, బ్రాహ్మణ్; శూద్రాఝూటీ గరబీ భూలై మతి కోయిహిందు తురుకీ ఝూటీ కులదోయి;

కబీరు వేదాంతియైనను, సన్యాసిగనుండక గృహస్థుడై పిల్లల బోషించుకొనుచుండెను. అతడితరులపోషణను గ్రహింపక నేతవృత్తితోనే కుటుంబజీవనము జరిగించుకొనెను. ద్రవ్యము నిలవ జేయుటకతడెప్పుడును ప్రయత్నింపలేదు.

అతనిని భ్రమపచ్చి యింద్రియలోలునిగ జేయుటకొకసారి కొందరతడొంటిగనున్నప్పుడొక సుందరియగు కామినిని రహస్యముగబంపిరట, అతడామెనుజూచి, కామవశుడుకాకుండ, మనస్సు దృఢపర్చుకొని, ఆమెనాదరించి, హితబోధచేసి, ఆమె ప్రవర్తన నవరింపజేసి భక్తురాలినిగ జేసెనట, ఆమెయు అతనియందు కృతజ్ఞురాలై, అప్పటినుండి సదాచారురాలైనది.

కబీరు మరణముగూర్చి చిత్రకథ కలదు. అతడు తన 119 వ యేట మరణించెను. అప్పుడు అతని హిందూభక్తులును, ముస్లిం భక్తులునుగూడ, మరణానంతరమతని దేహమునొద్దజేరిరి. ఆదేహమును తమ సంప్రదాయప్రకారం ఖననముచేసి పాతిపెట్టవలెనని ముస్లిములు, చితిపైన దహనం జరిగింతుమని హిందూ శిష్యులును, తగువుపడిరి. తుదకు తీవ్రకలహము కలుగునట్లుండెను. అంతట నొకరు దేహముపైన కప్పియున్న పంచనెత్తి తొంగి చూచిరి. లోపల కళేబరము కనబడక, దానిస్థానే పుష్పముల పోగుమాత్రం కనబడెనట, అంతట ఉభయపక్షములవారును ఆశ్చర్యపడి, గురువుగారి అద్భుత మహనీయతను గ్రహించి అట్టి ఉదారునిగూర్చి కలహించినందుకు సిగ్గుపడి, ఆపుష్పములను రెండు పక్షములును పంచుకొని, తమ ఆచారప్రకారం ఖననమూ దహనమూ జరిగించుకొనిరట. ఆహా ; సాంఘికమైత్రికై జీవితమర్పించిన పుణ్యపురుషుని మరణముగూర్చిన యీకథ మనోహరముగనున్నది. కబీరు హిందూముసిములమధ్య సామరస్యము గల్గింప

కృషిచేసి గానముచేసెను.* కబీరు బోధలు సామాన్య జనులలో మంచి జ్ఞానముగల్గించినవి. అప్పుడు చాలమంది ఆయన శిష్యులైరి, నేటికిని చాలమంది "కబీరు పంథీ"లు ఉత్తరదేశమందున్నారు. వారు కబీరుగీతములను ధార్మిక గ్రంథముగ జదింతురు. మనజీవితములన్నియు ఈశ్వరుడిచ్చిన మహాదానములు, వాటిని దుర్వినియోగము చేయకూడదు. పరస్పర వైరమెంత మాత్రమునుకూడదు; సహనమును భూతదయయును మనలను తరింపజేయును. ఇదే కబీరు పంథీల ముఖ్యసిద్ధాంతములు.

---

* యార్జాన్‌కహా యారహీంకహా దోనోంకీ ఖుదా అల్లానేహై!
యాఇన్‌కహా యాపేసన్‌కహా మతలబ్‌తో ఉసీకీ చంపానేహై! .........
క్యా ఆపస్‌మేం లడ్‌కర్ మరజాతాలిబ్ యహీకురాన్‌కిహై ?......,

అధ్యాయము 36.

## —• మీ రా బా యి •—

"మీరాబాయి" అను భక్తురాలి చరిత్రి అద్భుతమైనది. ఆమె రాజపుత్రస్థానపు చిత్తూరు మహారాణావారికోడలు. ఆమె భర్త యామె బాల్యమందు చనిపోయెను. ఆమె అప్పటినుండి తన జీవితమును ఈశ్వరభక్తిలోనే గడపెను. తనలో పవిత్రి ప్రేమనే వృద్ధిజేసుకొనెను. ఆమె బాల్యమునుండి శ్రీకృష్ణుని చరిత్రగ్రంథముల జదివి, విశేషభక్తితో కృష్ణగీతముల నెన్నిటినో వ్రాసెను. శ్రీకృష్ణుడే తనభర్తగ వీటిలో నుద్దేశించి, తానొక గోపికగ భావించుకొనెను:

లోగడ మనము చర్చించిన రవిదాసు మహాభక్తుడని పవిత్ర చరిత్రుడని తెలిసి, ఆమె రవిదాసు దర్శనముచేసి, ఆయన శిష్య

రాలైనది. ఉన్నతవంశమని గర్వముగల గొప్ప క్షత్రియస్త్రీయు రాజకుటుంబపుదియు అయినను పూతచరిత్రుడగు ఒక హరిజన భక్తునికై వెదకుకొని ఆయనకు శిష్యురాలగుటబట్టి, ఆమె ఔదార్యమును ధీరతను గ్రహింపవచ్చును. ఈసౌమ్యురాలు అనేక క్షేత్రములనుగూడ చూచి దేశసంచారముచేసెను. ఆమె గృహమునకు మరలివచ్చినతరువాత ఆమె భక్తిగీతములు రచించెను. అవి ఆప్రాంతమంతటను ప్రసిద్ధమైనవి.

చాలమంది సాధువులును ఫకీరులును ఆమెయున్నతాదర్శములను గ్రహించి తరింతమని చిత్తూరుకు వచ్చుచుండిరి. కాని మామగారగు రాజు ఆమె సాధ్వియని యెరిగియుండియు, ఇతరులామెనద్దకు రానీయకను, ఆమెభజనల జేసుకొనుటకు తగు అవకాశమీయకయు, ఆమెననేకవిధముల బాధించెను. ఆమెను చంపుటకును చాలసార్లు రాజు యత్నించెనట ; కాని ప్రహ్లాదుని వలె, ఆమె విషము త్రాగియు, పాముకాటునొందియు, కృష్ణభక్తి మహిమవల్ల జీవించియుండగల్గెనందురు. ఆమె పవిత్రహృదయమును నైతికశక్తియు అద్భుతములై యుండును.

ఆమె మహాత్త్వముసంగతి అప్పటి ఢిల్లీ పాదుషాయగు అక్బరు చెవులలోను పడెనట. రాజపుత్రస్థానమందితరరాజులు అప్పుడు అక్బరు సామ్రాజ్యముకు లోబడిరి ; కొందరాయనకుటుంబముతో సంబంధములగూడ చేసుకొనిరి. కాని చిత్తూరు రాణా మాత్రమెంతమాత్రమును లొంగక, అక్బరును తక్కినరాజపుత్ర రాజులను నిరసించుచుండెను ; కనుక చిత్తూరును ముట్టడించి పట్టుకొనుటకప్పుడు అక్బరు గట్టి ప్రయత్నముజేసెను. కాని అక్బరు ఉదారుడు, చాలమంది సాధువులు, ఫకీరులు, మీరాబాయి భక్తి మహాత్త్వములగూర్చి చెప్పు వార్తలవిని, ఆమె యున్నంతకాలమును చిత్తూరును ముట్టడించుటకు తాను జంకెనట. (ఆమె విడిచిపోయిన తరువాత అక్బరు చిత్తూరును ముట్టడించి పట్టుకొనెను.) మామ

గారింకను బాధించుచుండినందున, ఆమె తరువాత బృందావనము కును ద్వారకునువెళ్లి అక్కడ వసించుచు చాల మనోహరములు ప్రబోధకములునగు గీతములు రచించి, అక్కడనే మరణించెను. ఆమె గీతములు హిందీభక్తి వాఙ్మయములో ప్రసిద్ధమైనవి.

## అధ్యాయము 37.

### —♦ తులసీదాసు ♦—

తులసీదాసు మనదేశపు గొప్ప భక్తులలో నొకడు. అతడు మతస్థాపకుడుకాడు, కాని మహాకవి, తులసీరామాయణము హిందీప్రాంతమందేగాక మనదేశమంతటను ప్రఖ్యాతమైనది.

ఈయన బాందాజిల్లాలో రాజాపురగ్రామములో 16 వ శతాబ్ది ఆరంభంలో జనించెనందురు. ఈయనతండ్రి "ఆత్మారామ్" అను బ్రాహ్మణుడు ; ఈయన అసలుపేరు "తులారామ్'' బాల్య మందొక సాధువువద్ద నీతడు సంస్కృత సాహిత్యమును శాస్త్రము లనుకూడ నేర్చుకొనెను.

ఈయనభార్య "విద్యావతి" సార్థకనామ ; కుమారుడు "తారకు"డు ; తరువాత తులసీదాసు సన్యాసియై, హిమాలయ పర్వతమును, అయోధ్య, జగన్నాథం, రామేశ్వరం, ద్వారక వగైరా పుణ్యక్షేత్రములను దర్శించి, దేశమంతటను మంచి యనుభవము సంపాదించెను. మహాభక్తుడై, అతడు చిత్ర కూటములో కొన్ని భక్తిగ్రంథముల రచించెను.

పిమ్మట అయన కాశీనగరములో వసించి "రామచరిత మానస" మును వ్రాసెను. ... దీనినే (తులసీరామాయణ

మందురు) ఈయన భక్తిని ప్రజాప్రేమను చాలమంది శిష్యులకు బోధించెను. సామాన్యుల వాడుకభాషయైన సులభహిందీలో చాలగ్రంధముల రచించెను. అవి అన్నియు మృదువులు రంజకములునై చాల ఆకర్షకమగు భక్తిరసమును వెదజల్లునట్లుండును.

ఈరచనలలో తులసీరామాయణము చాలపెద్దగ్రంధము. ఇది వాల్మీకి రామాయణంపలె ఆకర్షకమై చక్కని వర్ణనలతో నుండుటేగాక, అందులోలేని చాల ఉపాఖ్యానములు భక్తిగాధలు జేరి, భాగవతసారమును నీతిబోధలును ఇందులో కలుపబడినవి. కనుక తులసీరామాయణము కోట్లకొలది బీదలకు శ్రీమంతులకు విద్వాంసులకు, అజ్ఞానులకుగూడ పారాయణ గ్రంధమైనది. దీనిలో అహింసా, సత్య, శౌచాది సత్ప్రవర్తనగూడ బోధింపబడినది. దీనికున్న ప్రసిద్ధివ్యాప్తి మనవాడుకభాషలలో మరియే గ్రంధమునకును లేదని చెప్పవచ్చును. ఈయన వ్రాసిన "వినయపత్రిక" కేవలం భక్తిబోధకము. ఈలోకమం దిప్పుడున్న సాంఘిక లోపములను, దురాచారములును శ్రీరామునికి వినిపించి, శ్రీరాముని అనుగ్రహమును దయను కోరుచు వ్రాయబడినది.

"గీతావళి" అను పుస్తకములో శ్రీరామకధను రంజకంగా వర్ణించినారు. ఇది గానరూపమైన సంస్కృతశబ్దములతో నిండియుండును.

"దోహావళి" అనేక విషయములగూర్చి, తులసీ దాసుగారప్పుడప్పుడు వ్రాసిన పద్యముల సంగ్రహము. ఇవి సుందరమగు సరళశైలిలో నీతిభక్తి బోధకములుగ వ్రాయబడినవి.

తులసీదాసు యువకుడైనప్పటినుండి, విశ్వప్రేమకు ప్రసిద్ధికెక్కెను, అక్బరు ప్రసిద్ధమంత్రులగు, రాజామానసింగు, రాజాతోడరుమల్లు, కొందరు ముస్లింవిద్వాంసులు మధుసూదన సరస్వతి వగైరా పండితులును ఆయనకు మిత్రులైయుండిరి. ఆయన



వల్లభాచార్యులు.



నానకు.



తులసీదాసు.

సంస్కృతములోనే వ్రాసియుంటే, ఆయన ప్రసిద్ధి దేశమంతకూ వ్యాపించును. కనుక అట్లు చేయుమని చాలమంది మిత్రులాయన పాండిత్యము గ్రహించి ప్రోత్సహించిరి. కాని, అట్లుచేయక తులసీదాసు నాకు ఖ్యాతి అక్కరలేదు; కొద్దిమంది మహనీయుల కొరకని నేను వ్రాయను. కోట్లకొలది బీదలు, అజ్ఞానులు, అంధ స్థితిలో నున్నవారునగు సామాన్యులు విశ్వప్రేమగల్గి, సచ్చరితము కలవడి తరించుటే నేగోరు ప్రతిఫలము.'' అని జబాబిచ్చెను. అట్లే ఆయన గ్రంథములు కోట్లకొలది దీనులను జ్ఞానదాయకమై, తరతరములుగ లక్షలకొలది జనులకు పవిత్రప్రేమను నేర్పి, వారినుద్ధరించినవి. ఈయన గ్రంథములు ఉత్తరప్రాంతపు సంస్కృతిలో పరిణామమునకు కారణమైనవి.

తులసీదాసు ఇంటికి ఒకసారి దొంగలు వచ్చి లోపలకు ప్రవేశించబోయిరి. (శ్రీమంతులు చాలమంది ఆయనయింటికి తరుచు వచ్చుటజూచి, ఆయనవద్ద కొంత ద్రవ్యనిధి యుండునని వారూహించియుందురు) కాని, ఇంటికున్న రెండుగుమ్మముల యొద్దను ఎవరో కావలాయున్నట్లు, రాత్రి చీకటిలో చిహ్నము తోచెను. మరునాడును అట్లే జరిగినది. కనుక వారు సాహసింపక, మరలివచ్చిరి. తులసిదాసు సాధువులందరితోను చనువుగ మాటాడును. వీరాయనయొద్దజేరి, "అయ్యా, నిన్న మొన్న రాత్రి తమ యింటిగుమ్మముల యొద్ద యిద్దరు మనుష్యులుండిరి; వారెవరో" అనిరి. ఈజనులు దొంగజట్టువారని తులసీదాసుకు తెలియును. భగవంతుడు వారలకట్టిదృశ్యము తోపించియుండునని యూహించి ఆయన తనయింట భక్తులు శిష్యులు, అర్పించిన వస్తువులను వారికిచ్చి వాటిననుభవింపుడని చెప్పెను. ఆయన ప్రేమకు, దయాశీలతకు ఆశ్చర్యపడి, వారు సిగ్గుపడి, నమస్కరించి ఆవస్తువులు దీసుకొని కృతజ్ఞతతో వెడలి, తరువాత నీతిపరులైరి. ఇట్లు ఆయన ప్రేమ ఆచరణలోను తెలియుచుండేది.

## అధ్యాయము 38.

### —♦ వ ల్ల భ మ త ం ♦—

ఆకాలములో ఉత్తర హిందూస్థానమందింకొక భక్తవరుడు ప్రేమసిద్ధాంతము ప్రచురముచేసెను. ఈయన వల్లభాచార్యులు. ఈయన తండ్రియగు లక్ష్మణభట్టు ఆంధ్రబ్రాహ్మణుడు, తెలుగు ప్రాంతము విడచి కాశిలోనుండెను. అప్పుడు కాశిలో హిందూ ముస్లిములమధ్య సంఘర్షము హెచ్చియుండెను. అట్టిపరిస్థితులం దక్కడనుండుటకిష్టము లేక, ఆయన కుటుంబముతో తూర్పుగబయలు దేరెను. విదేహరాజ్యపు చంపారణ్యమందు తన రెండవ కొడుకగు వల్లభుడు జనించెను. హిమాలయ సమీపమందు క్రూరమృగ ములతో నిండిన ఆమహాటవిలో నీశిశువును తమచేతులతో రక్షిం చ లేమని తల్లిదండ్రులధైర్యపడి, దానినొక మహావృక్షముక్రింద చల్లని యాకులతో కప్పివిడిచిరట. వారు కొంతదూరము తిరిగిరి ; ఇంతలో కాశీప్రాంతము శాంతపడినదని తెలిసి, మరల ఆప్రాంత మునకు వచ్చునప్పటికాశిశువు కలకలలాడుచు నుండెనట. వారా శిశువుతో కాశికి జేరిరట. ఆ యాంధ్రబాలుడు కుశాగ్రబుద్ధియై వేదశాస్త్రముల నవలీలగ నభ్యసించెను. అతడు విష్ణుభక్తుడై కాశిలో గొప్ప విద్వాంసులతో తీవ్రమగు శాస్త్రచర్చ జరిపి, గెలుపొందెనట. ఆయన సంస్కృతములో గొప్ప వేదాంత గ్రంథముల రచించెను. తరువాత వల్లభుడు తన పూర్వుల జన్మ స్థలమగు ఆంధ్రరాష్ట్రమునకువచ్చెను. ఇక్కడ బలీయముగ వ్యాపించియున్న శైవమతపు ప్రచారకులతో వాదించి, ప్రేమ సిద్ధాంతప్రతిపాదకము, ప్రజాక్షేమరక్షణకు ప్రాధాన్యమిచ్చునదిగ వైష్ణవమతమును జనులకు బోధించి, ఆంధ్రదేశమందు వైష్ణవ మతవ్యాప్తి నారంభించెను. (ఇది 16 వ శతాబ్దిమధ్య జరిగినది) తరువాత వల్లభుడు తన మాతామహ స్థలమగు విజయ (విద్యా) నగరము జేరెను. అది యప్పుడొక సామ్రాజ్యపు కేంద్రము.

దానికప్పుడు పాలకుడు శ్రీకృష్ణదేవరాయలు. తక్కిన ఆంధ్ర ప్రాంతములోవలె ఆయన యాస్థానమందప్పటి కద్వైతసిద్ధాంత ముకును శివపూజకును ప్రాబల్యముండెను. అందు జ్ఞానము కేగాని కర్మపరత్వముకును ప్రేమతత్వముకును తగు స్థానమీయలేదట, వల్లభుడు రాజసభలో విశిష్టాద్వైత ప్రేమమతముల విశేషములను ప్రాధాన్యమును బోధించగా, చాలమంది, ముఖ్యముగ మహా రాజును, ఆసిద్ధాంతము లవలంబించిరట. అప్పుడే, ఆయనకు "ఆచార్య" బిరుదమువచ్చెను. అంతట "వల్లభాచార్యులు మహా రాష్ట్రముద్వారా పశ్చిమప్రాంతముకు వెళ్లి అక్కడ మతవ్యాప్తి చేసి, మరల ఉత్తర హిందూదేశమందు ప్రచారమందుకొనెను; గోవర్ధనగిరియొద్ద "శ్రీనాథ" దేవాలయము స్థాపించెను.

వల్లభమతము చాలవరకు రామానుజసిద్ధాంతమువంటిది. "ఈశ్వరభక్తియు, ఈశ్వర తృప్తికై లోకహితకార్యముల జేయు టయు మోక్షసాధనములు, అహింసాప్రేమములు, సత్యశౌచ ములు మున్నగు సద్గుణములు లేకుండ, వట్టిజ్ఞానముద్వారా మోక్షప్రాప్తిగల్గదు. "పుష్టిమార్గము" (అనగా భగవదనుగ్ర హము నొందుట) భక్తిమార్గమును నిశ్రేయసమునిచ్చును. భగవ దవతారము:లలో శ్రీకృష్ణునిపూజ ఎక్కువ ప్రశస్తము" ఇవే వల్లభమతపు ముఖ్య సిద్ధాంతములు. అప్పటి శైవులలో సన్యాసపద్ధతి చాలయధికముగ నుండెనట. స్త్రీలు సహగమనము చేయుటయు సదాచారముగ నెంచబడి స్త్రీవర్గము చాలబాధల నొందుచుండిరి.

వేలకొలదిగ ప్రతిచోటను జనులు సన్యసించి, సోమరితనము ప్రబలి జనుల ఆర్థికస్థితిలో కల్లోలము కల్గించుట సహజము. న్యాయమగువృత్తుల జేయుచు కుటుంబపోషణ చేయుటే అనగా గృహస్థధర్మమే సామాన్యులకు సన్యాసముకన్న ప్రశస్తమని వల్లభుడు బోధించెను ; సంఘసన్యాసమును భిక్షాటనమును పవిత్ర

మను భావమును ఖండించెను. స్త్రీలు తమ మృతభర్తల దేహముతో చితియందు సహగమనమగుట దురాచారమని యతడు బోధించి, అట్టిచర్యల నివారించుచుండెను. సహగమనములో "సతీత్వ" మిమిడియున్నను, అది కేవలము హింసాతత్త్వము దారుణమునని యెంచక తప్పదు. ఈ రెండువిషయములందును వల్లభాచార్యులు భారతీయ సంఘముకు ముఖ్యంగా అహింసాతత్త్వముకును సహాయకుడాయెను.

వల్లభుని తరువాత, రెండవకుమారుడు విఠలనాథుడు గొప్ప ధార్మిక ప్రచారకుడై, బిజాపురమువద్దనున్న పండలీపురమందు గొప్ప యాలయము నిర్మించి. పశ్చిమదేశమందు పవిత్రసిద్ధాంతముల ప్రచారము సాగించెను. చాలమంది వారి శిష్యులైరి. తరువాత వల్లభమతపు మఠములకు, గొప్ప భూవసతు లేర్పడినవి. ఆపిమ్మట ఆమతసంస్థలలో విగ్రహారాధనము, గురుపూజయు వృద్ధియై, ఆమతపు వర్తకులలో దురాచారములు ప్రవేశించినవి. అనర్హులందును వంశానుపూర్వివలన గురుపరంపర హక్కు ఉండుపద్ధతి యేర్పడెను. కొందరు ద్రవ్యమత్తులై గురువులు అవినీతిపరులు భోగలోలసులైరి. అందువల్లను, వల్లభమతముకు తరువాత అప్రతిష్ఠగల్గినది. వల్లభుడు విఠలనాథుడు బోధించిన అహింసాప్రేమసిద్ధాంతములు తరువాత ద్రవ్యాశ భోగవాంఛలలో మరుగుపడిపోయినవి. గురువుల యాచరణ సరిగ లేనప్పుడట్టి మతము చెడుట సహజముగదా!

# అధ్యాయము 39.

## —• గు రు నా న కు •—

15 వ శతాబ్దిలో ఇంకొక ప్రవక్త జనించెను. ఈయన సిక్కుమతస్థాపకుడైన "నానక్" ఈయన పంజాబుప్రాంతపు లాహోరు జిల్లాలోని "తలవండి" గ్రామములో 1469 సం॥ లో పుట్టెను.

ఈయనతండ్రి క్షత్రియుడు, అక్కడి గ్రామకరణము ; బాల్యమునుండి "నానకు" శాంతుడై, దయాళువై, ధ్యాన మగ్నుడై యుండెను చిన్నతనంలోనే ఈశ్వరునిపైన ప్రేమ గీతముల వ్రాయదొడగెను. అందువల్ల అతడు కరణీకముకు పనికి రాక "చెడు"నని భీతిలి, తండ్రి అతనిని "వ్యవహర్త" గ చేయ యత్నించెను, కాని, అతడు భక్తిధోరణి మానలేదు ; గ్రామపు నౌకరులకు సహచరులకు అతడు భక్తిమార్గము నేర్పుచుండెను.

క్రమంగా ధార్మిక ధోరణిహెచ్చి, కొంతకాలముకు నానకు తన కుటుంబమును ఉద్యోగమును విడిచి, హరిద్వారము కాశీ వగైరా క్షేత్రములకేగి, అక్కడితో నిలువక, దక్షిణదేశముకు సింహళరాజ్యముకును వెళ్లెను ; హిందూ, బౌద్ధ, ముస్లిం మతముల ప్రమాణగ్రంథముల జదివి, వాటిసిద్ధాంతములను పూర్తిగ నేర్చు కొని తిరిగివచ్చెను. తరువాత అతడు ముస్లింమతపు కేంద్రమైన మెక్కాకును వెళ్లి, ఆమతపు అసలు సిద్ధాంతములను, ఆచారము లను, గ్రహించెను. "ఈమతములన్నియు అహింసా సత్యముల మీద నేర్పడినవే. సర్వరక్షకుడగు ఏకేశ్వరునిపైన భక్తివీటి అన్నిటి మతములకును ముఖ్యలక్షణము," అని గ్రహించి, ఆసిద్ధాం తములను ప్రచారముచేసెను. సాంఘిక విభేదము లన్నిటిని నానకు గట్టిగ నిరసించెను. అప్పుడాయన యుండిన పంజాబులో

హిందూముస్లిములమధ్య సంఘర్షం హెచ్చైయుండెను. నానకు పారసీలోని సూఫీ విద్వాంసుల గ్రంథములకూడ చదివి వాటిలోని ప్రేమతత్వమును ఆధ్యాత్మికసూచనలను నేర్చుకొనెను. అప్పు డాయన హిందీలో గీతముల రచించి వాటిని శిష్యులకు నేర్పెను. ఆయన సాంఘిక ధార్మిక శుద్ధికి ప్రాముఖ్యమిచ్చెను. చాలవరకు కబీరు రచించిన గీతముల నవలంబించెను. జనులలో నుండు మూఢాచారములను ఖండించెను. నరులు పరస్పర ప్రేమ గల్గి యుండవలెనని, అన్నిమతములు తెల్పు దేవుడొకడే, భగవద్భక్తి అన్నిమతములవారికి ముఖ్యమే ; కనుక అంధవిశ్వాసములను విభే దములుగల్గించు మూఢాచారములనుమాని, జనసామాన్యమున కుపకారమై బీదల రక్షించు పనులనే చేయవలెను అని ఆయన బోధించెను ; తాను అట్లు స్వయంగా ఆచరించుచుండెను.

కొన్ని ఆచారముల అంతరర్థము గ్రహించక, కేవలం బాహ్యమగు ఆచారకర్మలచే పుణ్యమొందుదుమను భావము నాయన నిరసించును.

ఒకసారి నానకు హరిద్వారమువెళ్లి, అక్కడ గంగానదిలో స్నానముచేయుచుండెను. అప్పుడక్కడ బ్రాహ్మణులు రివాజు ప్రకారం పంచయజ్ఞముపేర తూర్పువైపుకు గంగోదకము నంజ లితో విసురుచు, అందుకితరు లడ్డమురాకుండ తొందరచేయు చుండిరి. నానకు తానును గంగలోనిల్చి నీళ్లు పడమటివైపునకు విసరిపోసెనట. అదియేమని ఆబ్రాహ్మణులు జనసంప్రదాయము నకు భిన్నంగా చేసినాడని నానకు నాక్షేపించిరట; తూర్పువైపుకే మీరెందుకు విసురుచున్నారు“ అని నానకు అడిగెను. “ఓహో, తూర్పువైపు మేము పితృతర్పణము చేయుచున్నాము. స్వర్గస్థు లైన పితృవులు అందువల్ల తరింతురు” అని వారనిరి. “ఎన్నడో చనిపోయి లెక్కలేనన్ని మైళదూరపు స్వర్గంలోఉన్న పితృవుల కంటె, ఇక్కడకు పదిమైళ్లదూరములోఉన్న మాస్వగ్రామమందలి

జనులబాధ తీరుట ఎక్కువ ముఖ్యము. వారి పొలములు నీరులేక యెండిపోవుచున్నవి. ఆజనులును స్నానపానములకును నీరులేక తల్లడిల్లుచున్నారు. మీతర్పణపునీరు వేలకొలది మైళ్లదూరము లోని మృతులకు చేరగల్గితే, దగ్గరనే బ్రతికియున్న తోటినరుల కెందుకు చేరకూడదు? ఈపొలములు ఇక్కడకు పడమటనున్నవి; కనుక వారికి నీళ్ళు లభించవలెనని ధ్యానించుచు ఈదిశకే జలాంజలిని అర్పించుచున్నాను" అని యతడు జబాబు చెప్పెనట. పూర్వ కాలపు ఆచారచర్యల అసలు ఉద్దేశము ప్రాణిరక్షణ ధర్మమును జ్ఞప్తికి తెచ్చుట; ఆసంగతిని గ్రహించక రీతిరివాజులను బట్టుకొని, అంతటితో కృతకృత్యులమైనట్లెంచుట భావ్యముకాదు; చనిపోయిన పితృవులకై తాపత్రియ పడుటకన్నను, ప్రస్తుతపు సోదర సంఘపు బాధల దీర్చుటకే యత్నింపవలెనని ఆపూర్వాచారముల భావార్థమునే గ్రహింపవలెననియు నానకు బోధించెను.

నానకు అన్నిమతముల శాస్త్రములలోను గొప్ప విద్వాంసుడు, కనుక ఆయాముఖ్యమైన ఆచారసమస్యలగూర్చి, సిద్ధాంతములగూర్చియు, తరుచు శాస్త్రచర్చల సాగించి, ఇతర పండితుల నొప్పించి జయించినట్లును కథలుగలవు. నానకు ప్రసిద్ధి ఆప్రాంతమందు వ్యాపించెను.

ఆకాలమందే బాబరు భారతదేశముకు దాడివచ్చి, వాయవ్యప్రాంతమును జయించి, మొగలుసామ్రాజ్యము స్థాపించెను. అప్పుడు నానకుకు పంజాబులో ఆయనతో పరిచయమేర్పడినది. ఆసందర్భములోను నానకు ప్రవర్తనయు అతని అహింసాభావమును, ఔదార్యమును స్పష్టపడెను. అప్పుడు దండయాత్రకై వచ్చుటలో బాబరుసైనికులు లాహోరు ప్రాంతంలో నానకును మరికొందరిని పట్టి బంధించిరి. నానకు గొప్ప విద్వాంసుడు ధార్మికుడు నని పిమ్మట కనిపెట్టి అతనిని విడిపించి, బాబరు తన యొద్ద నుంచుకొనెను. అతనితో సలహా చేయుచు, ధార్మిక

చర్చలు చేయుచుండెను. అంతట నానకుయందు గురుభావము గల్గి "మీ కేమికావలె, ఇత్తును" అని బాబరు ఆయన నడిగెను. "నా కేమియు నక్కరలేదు. కాని, ఈ ప్రాంతములలో మీరు పట్టి బంధించినఖైదీలందరిని విడువవలె "అని బాబరుచేత వారిని వారిజవ్రుఆస్తులను విడిపించివేసెను. నానకు స్వార్థహీనతను, భక్తిని ఔదార్యమును పాండిత్యమును గ్రహించి, ఆయనను బాబరు తన ఉపదేశకునిగ జేసుకొనెను. తన శిష్యుడగు బాబరు ఢిల్లీశ్వరుడుకాగానే, అతడు మద్యపానముచేయకుండాను, జూద మాడకుండాను, సాధ్యమైనంతవరకు హింసలను మానునట్లును, తీర్పులిచ్చుటలో న్యాయముగనే గమనించునట్లును, బాబరుచేత నానకు ప్రమాణముచేయించెను. అంతవరకు కౄరుడనిపించు కున్న బాబరు అంతటినుండి దురాచారముల మానెను. తన పూర్వికుడగు తైమూరు చాల కౄరుడు; అతనివలె తీవ్రహింస లను బాబరు జేయనందుకు, నానకు ప్రబోధమే కొంతకారణము. భారతచక్రవర్తియైన బాబరును సచ్ఛీలునిగ చేయుటలో నానకు స్వదేశముకెంతేని యుపకారియైనాడు.

తనకు శిష్యులర్పించు గురుదక్షిణ సొమ్ములను స్వసౌఖ్యము కుపయోగించుకొనక, వాటితో నానకు బీదలకు సత్రముల గట్టించెను. ఒకప్పుడు జనులు గుంపులుగజేరి మూఢభక్తితో నానకును దేవునివలె పూజింపబోయిరి. నన్ను ఇంకేనరులనుగూడ, మీరు పూజింపవద్దు. మీరు ధీరులై సర్వవ్యాపియగు భగవంతునే స్మరింపుడు. విగ్రహములను చిత్రవులనుగూడ అర్చింపవద్దు. ఆత్మగౌరవము నిలుపుకొనుడు. అహింసాసత్యముల నెప్పుడును తప్పకూడదు. తోడి జనులందు ప్రేమగల్గి యుండుడు" అని వారికాయన సందేశమిచ్చెను.

నానకు వృద్ధుడగుసరికి, ఆయనకొడుకు విద్వాంసుడై భక్తుడైనాడు. కాని, తనతరువాత గురువుగ ఆతనిని నియమించక

నానకు మరియొక ఉదారుడగు గొప్ప భక్తు నేర్పర్చెను. అహింసా పరునకుండవలసిన ధైర్య త్యాగము, జ్ఞానభక్తులుగూడ నానకులో నుండెను. అట్టివారే దేశసంస్కృతి నుద్ధరింపగల్గుదురు.

## అధ్యాయము 40.

### —♦ సిక్కు సంస్కృతిపరిణామము. ♦—

నానకు శిష్యులు "సిక్కు" లని పేరుపొందిరి; వారి కేర్పడిన గురునానక్ అనంతరం, ఒకరితరువాత నొకరు వరుసగా తొమ్మండుగురు ప్రసిద్ధగురువులు పంజాబు ప్రాంతమందు భారతీయ సంస్కృతి నుద్ధరించి, ఉత్తమస్థితిలో నుంచయత్నించిరి వారిలో మొదటి నలుగురును కేవలము అహింసా సత్యశాంతులను బోధించిరి. ఆప్రాంతమందు హిందువులకు ముస్లిములకు సంఘర్షము కలిగినది. ముస్లింరాజులు అసలు విదేశీయులైనందున రాజకీయముగ అధికారము నిమిత్తం ఉభయజాతులమధ్య కొంత సంఘర్షం తప్పదు. కాని అంతకన్నను ముఖ్యంగా ఉభయుల సంస్కృతిలోను పరిశుద్ధ మతభావములు క్షీణించి, పండితులును, మౌల్వీలును, బాహ్యచిహ్నములనే పట్టుకొనిరి; ఆధ్యాత్మిక సిద్ధాంతముల మరచి హిందువులుకట్టు, జుట్టు, బొట్టు, విగ్రహపూజ, మూఢాచారములను ప్రధానముగనెంచిరి. కొందరు ముస్లిములును హిందువుల ప్రత్యేక సంస్థల రూపుమాపుటే కర్తవ్యమనుకొనిరి. అక్బరు తరువాత ముస్లిమురాజులు మతావేశమున మూర్ఖులైన మౌల్వీలకు క్రమముగలొంగి ముస్లిములసంఖ్యను దండోపాయముచే హెచ్చింపబూనిరి. అప్పటికి చిరకాలముగ హిందూసంస్కృతికి కేంద్రమైన కాశ్మీరమున కీఘాటి గట్టిగ తగిలినది. హిందువులును తగువుకు కారణమైన అనవసరమగు ఆచారముల మాన లేదు; దేశకాలాను సారముగ మతాచారముల సవరించుకో లేదు సిక్కు

గురులీకార్యము దలపెట్టిరి. వారీయుభయ సంస్కృతులలోను ఉన్న పరిశుద్ధమగు ఏకేశ్వరధ్యానమును, సర్వజనోపకార ధర్మమును ప్రేమభావమును నేర్పిరి. ఇది కొంత వ్యాపించినది. కాని ముఖ్యంగా రాజకీయాధికారపు తగువునుండుటచే ఉభయజాతులలో నప్పటికి హింసాబుద్ధియుండెను. హిందూ నిమ్నజాతీయులు ముస్లిములలో చేరినమీదట హిందువుల నింకను గట్టిగ ద్వేషించిరి. ఈస్థితిలో, మొదటి సిక్కు గురువులు, మొగలురాజులతో సంఘర్షము లేకుండ, జీవింపగల్గిరి. వారి యాదరమొంది, వారికి హితోపదేశము చేసిరి. అయిదవ గురువగు "అర్జున దేవుడు" అమృత సరములో స్వర్ణదేవాలయపు నిర్మాణ మారంభించెను. ఇందులో హిందువులు ముస్లిములు వగైరా అన్నిజాతులు దేవ ప్రార్థన చేయవచ్చును. తరువాత అర్జున దేవును మొగలు చక్రవర్తి బంధించి చంపించెను.* అంతట ఆరవ గురువగు హరిగోవింద శింగు" కాలమునుండి సిక్కులకు ముస్లింరాజులతో సంఘర్షమేర్పడినది. షాజహాను చక్రవర్తి కొడుకులలో జ్యేష్ఠుడు ధార్మికుడునగు "దారాషికో"ను అప్పటి సిక్కుగురువు రక్షించెనని ద్వేషముతో ఔరంగజేబు తొమ్మిదవ గురువగు శ్రీ తెజ్బహదూరుసింగును బలవంతముగ జంపించెను. ఆయనకొడుకు పదవ గురువు (గురుగోవిందసింగ్) సిక్కులందరు ఆత్మరక్షణచేసుకొనుట అవసరమని నిశ్చయించి అందునిమిత్తం ఆయుధధారణగూడ విధించి తనశిష్యులందరిని శూరులుగజేసెను. అయితే వారు బలీయులుగ నుండవలె, కాని ఆశక్తిని ఆత్మరక్షణకే వినియోగింపవలెనని ఇతరులను అక్రమముగ బాధించకూడదని నిర్ణయించెను. అప్పటినుండి ప్రతి "సిక్కును"

---

* గురు అర్జునదేవుపైన ఆయన అన్న "పృధాచంద్" వగైరాలు అసూయ వహించి ఆయనపైన నిందారోపణలజేసిరి; జహంగీరు చక్రవర్తికపుడు అక్బరు కింకొక కొడుకగు ఖుస్రోతో మొగలు సామ్రాజ్యపు హక్కుగూర్చి యుద్ధమగు చుండెను. ఓడిపోయి, నిరాధారుడై పరుగెత్తుచున్న ఖుస్రోకు దాక్షిణ్యబుద్ధితో గురు అర్జున దేవొకరోజున అన్నము పెట్టినందుకు, పితూరీమాటలువిని, అర్జునదేవును బంధించి, పిమ్మట చంపించెను.

సర్వకాల సర్వావస్థలయందును మొలలో "కృపాణ్" (చిన్నచాకు) ధరించును. ఈ కొద్దిమంది సిక్కువీరుల నణచివేయుట కౌరంగజేబు వగైరాలెన్నివిధములనో యత్నించిరి. కాని, అట్లుచేయ సాధ్య పడలేదు. మొదటి గురువులు ఒకశతాబ్దిలో నేర్పిన అహింసా తత్వము సిక్కుజాతిలో రూఢమైనది. తరువాత వారాయుధ పాణులైనను, క్రోధముతో వ్యర్థహింసజేయు తత్వము కలవడక తమ ఆత్మబలము వృద్ధిజేసుకొని ఆత్మరక్షణకును స్వజాతిరక్షణ కునే తమ ఆయుధములుపయోగించిరి. ఇది పూర్తిఅయిన అహింసకాదు. కాని దీనిలోను పునాది అహింసాభావమే. వారి ధార్మికబుద్ధి నేటికిని చెడలేదు. అహింసాపరులు దుష్టత నెదిర్చి సంఘమును రక్షింపవలసినదే. పూర్తిఅయిన అహింసావాది అట్టిస్థితిలో సత్యాగ్రహియై, ఆత్మశక్తితోనే ప్రతికక్షిని నిరోధించ వలెను. కాని ఆసిద్ధాంతమప్పటి కెవరును ఏర్పరచలేదు. అప్ప టిలో భయగ్రస్తులై అవినీతికిని దుష్టతకును లొంగుటకన్న ఆయుధ ధారణచేసి స్వసంఘమును రక్షించుటే మంచిది.

ఆనాటినుండియు సిక్కులందరు ధర్మపరులై ఐకమత్యముతో గురుబోధప్రకారము సంఘములో బలీయులైనారు వీరిభుజశక్తియు నైతికశక్తియు పరస్పరసహాయకములైనవి. హిందూ ముస్లిము ధర్మముల రెంటిలోని సుగుణములను వీరు గ్రహింతురు. ఐక్య భావము, పరస్పరప్రేమయు, ఏకేశ్వరభజనయు సిక్కుధర్మపు ముఖ్యసూత్రములు. వారిలో జాతికుల విభేదములు లేవు. వీరి గురువు లప్పుడప్పుడు చేసిన బోధల సంపుటియగు "గురుగ్రంథ సాహెబు" ను వారు వేదముగ భావించుచు, నిత్యపారాయణ జేయుదురు. హిందూ ముస్లిము మతముల రెండింటి సిద్ధాంతము లలో సమన్వయము జేయుట సిక్కుమతపు ముఖ్యాదర్శము.

## అధ్యాయము 41.

### —• మ హా రా ష్ట్ర ప్రాం త ము •—

15—17 శతాబ్దులమధ్య మహారాష్ట్రమందును కొందరు మహనీయులేర్పడి, ఆప్రాంతములో ప్రేమతత్వము వ్యాపింపజేసిరి. 15 వ శతాబ్దిలోనుండిన "నామదేవు" గొప్ప విష్ణుభక్తుడు. అతడు "దర్జీ" కులపు శూద్రుడు. బాల్యమునుండి భూతదయగల్గి, దాంపత్యాశలేకుండి, పండరీపురమందలి శ్రీవిఠల దేవాలయంలో సదా భజనచేయుచుండెను. తల్లిదండ్రులే గాక, ఆయింటిదాసి యగు "జనాబాయి" యు మహాభక్తురాలు. నామదేవు బాల్యమందాతని భక్తిసాధనలో నీమె చాల తోడ్పడుచుండెనట. పూర్వము బౌద్ధాలయమైనను, ఆనాటికే యది విష్ణుక్షేత్రమైనది.

నామదేవు కుటుంబము పెద్దది. ఐనను; ఆయన కుటుంబ బాధలో బడక, లోకప్రేమప్రచారములో కాలముగడుపుచు, ఉత్తరహిందూస్థానములో యాత్రచేసి, చాలమంది భక్తులతో సహవాసము చేసెను. మొదట కొందరు బ్రాహ్మణభక్తులాయనతో పంక్తిభోజనము చేయక నిరసించిరట. కాని, తరువాత, అతని భూతదయ భక్తిరసమువల్ల ప్రఖ్యాతి హెచ్చగా, వారాయనను గౌరవించిరి. కొందరు బ్రాహ్మణవిద్వాంసులు నామదేవుకు శిష్యులైరి. అతడు గోదావరీతీరమందు వసించుచు మరాటీభాషలో అభంగులనుపేర గొప్పభక్తిగీతముల రచించెను. అవి ఆవాఙ్మయంలో ప్రసిద్ధిజెంది, సంఘములో నుజ్జీవనగల్గించినవి. తన శిష్యులలో కొందరు కుమ్మరులు హరిజనులు వగైరాలునుండిరి, వారినందరిని నాయన సమభావముతో నాదరించెను. 16 వ శతాబ్దిలో, ఆప్రాంతంలోనే 'తుకారాం' అను గొప్పభక్తవరుడు బీదవాని అకళంకమగు భక్తిప్రేమలొల్కు గీతములను రచించెను. ఈతడును శూద్రుడే; తనప్రజ్ఞావిశేషమున బ్రాహ్మణులనుండి చాల గౌరవమును పొందెను.

పిమ్మట 17 న శతాబ్దిలో ' సమర్థరామదాసు ' అను ప్రసిద్ధ విద్వాంసుడు వెలసెను. ఈబ్రాహ్మణుడు పంజాబు హారిద్వారాదులలో చాలయేండ్లు ప్రేమతత్వము బోధించి, గొప్పగీతముల రచించెను; సంఘమునుద్ధరించుటకు చాలకృషిచేసి, తుదకు కృష్ణానదీ తీరముచేరి, అక్కడ స్వభావలో చాల ధార్మికగ్రంధములను రచించెను. వీటిలో నెక్కువ ప్రసిద్ధమైనవి ' దాసబోధ. ' ఇది గొప్ప నీతులబోధించు, మనోహరగ్రంధము, మరాటీ వాఙ్మయముకొక యలంకారము.

అప్పుడాప్రాంతపు జనుల రాజకీయస్వాతంత్ర్యమును సంస్కృతిని రక్షించుటకు మొగలుచక్రవర్తియగు ' ఔరంగజేబు ' సేనానుల దండులను మహారాష్ట్రవీరుడగు శివాజి యెదుర్చుచుండెను; శివాజి యీరామదాసును దర్శించి, ఆయన నైతిక ధార్మిక ఘనతకు ముగ్ధుడై, రామదాసుకు శిష్యుడైనాడు. తరువాత శివాజీ ఛత్రపతియై, మహారాష్ట్రరాజ్యము స్థాపించెను. అప్పుడును రామదాసుయందు గురుభావమేగల్గి, నీతితోనే ప్రజలబాలించెను; స్త్రీలను దుర్బలులను ఎప్పుడును బాధించలేదు; సామాన్యజనుల క్షేమమును ముఖ్యముగ గమనించెను. హిందువుల ధర్మమును సంస్కృతిని పునరుద్ధరించెను; వారిలో ఐకమత్యమును పరస్పర ప్రేమను వృద్ధిజేసెను; ఆయన ముస్లిములను ద్వేషింపలేదు; వారిని అనాదరణచేయలేదు. మొత్తముమీద శివాజీపైన రామదాసు కుండిన ప్రభావము ఆప్రాంతపు సామాన్యజనుల క్షేమము కుపయోగపడినది. శివాజీ తరువాత ఆనైతికోత్సాహము బాగుగ నున్నంతవరకు మహారాష్ట్రరాజ్యము వృద్ధిలో నున్నది. తరువాత కులవిభేదములు పరస్పరద్వేషములు అవినీతి హెచ్చినమీదట, ఆరాజ్యము విచ్ఛిన్నమైనది. పీష్వాలు, ఆయన సేనానులు కలతలుపడి, ప్రత్యేకరాజ్యములు స్థాపించిరి. వారిలో కొందరు స్వమతాభిమాన ఆవేశమున ముస్లిములపైన ద్వేషపూరితులైరి; మరియు ఐశ్వర్యలోలురు స్వార్థపరులునై; అనవసరమగు రక్తపాత

ముకును ఆరంభించిరి. "మరాటి దండు" లో కొంతకాలముకు శివాజి యేర్పర్చిన నియమములు క్రిమశిక్షయపోయి, పరస్పర కలహములు పెరిగినవి.

## అధ్యాయము 42.

### —• వంగప్రాంతము •—

16 వ శతాబ్దిలోనే వంగరాష్ట్రమందు చైతన్యు దుద యించి, ఆప్రాంతమందు విష్ణుప్రేమనువ్యాపింపజేసెను. తులసీదాసు కిష్టదైవము శ్రీరాముడు, చైతన్యుడు శ్రీకృష్ణరూపముగనే భగ వంతుని భజించెను. ఆంధ్రదేశమందమ్మవార్ల పూజవలె, వంగ రాష్ట్రమందు సామాన్యజనులు విశేషముగ దుర్గపూజ చేయుట చిరకాలానుగతముగ నున్నది. కాళీదేవికి కాలభైరవాదులకును ప్రతిగ్రామమందు గొప్పగుడులేర్పడి, అందు చాల జంతువులను బలియిచ్చుచుండిరి. అప్పుడు మద్యపానమును విరివిగ జరుగుచు, చాల దురాచారములుండెను. మొత్తముమీద వంగరాష్ట్ర మందు హింసాతత్వపు బలిమి మొదటినుండి హెచ్చు. అక్కడ 11 వ శతాబ్దినుండి అవిచ్ఛిన్నముగ 7 శతాబ్దులు ముస్లిం నబా బులే రాజులైరి. వారిక్రింద అక్కడక్కడ కొందరు హిందూ సామంతులున్నను, వీరిలో నెవరును మన కృష్ణదేవరాయులవంటి యౌన్నత్యముకుదాలేదు. అక్కడి జనసామాన్యపు సంస్కృతి హీనస్థితిలో నుండినది. బ్రహ్మకైవర్తపురాణమున కాప్రాంత మందు వ్యాప్తియుండినది. ఇందులో రాధయను స్వతంత్రస్త్రీ శ్రీకృష్ణుని విశేషముగ ప్రేమించినట్లు శృంగారగాథ చెప్పబడినది. తరువాత 13 వ శతాబ్దిలో ఉత్కళమందు జనించిన వంగవాసి యగు జయదేవుడు తన గీతగోవిందమందు రాధాకృష్ణులప్రేమ నాలంబముగ జేసి, ఆగీతములద్వారా జనులలో భక్తికల్గించినాడు!

ఇట్టిపరిస్థితిలో చైతన్యుడనబడు గౌరాంగుడు 15 వ శతాబ్ది చివర జనించి 16 వ శతాబ్దిలో మహాభక్తుడై ప్రేమతత్వమును ఆధ్యాత్మికతను బోధించెను, రాధాకృష్ణమతమును ప్రచారము చేసెను. ఈయన నవద్వీపవాసి. సుప్రసిద్ధుడగు గదాధరభట్టుని సహాధ్యాయి. వంగీయుల సహజగుణములగు ఉత్సాహమును ఉద్రేకమును బాల్యమునుండి యీయనలోను అధికములు. తరుచు భక్తిపరవశుడై, గౌరాంగుడు అశ్రువుల విడుచుచు, నృత్యము చేయుచు, తన్మయుడగుచుండెను. తనను రాధగ భావించుకొని శ్రీకృష్ణునియందు సంతతప్రేమను ప్రకటించుచుండెను. ఒక్కొకప్పు డావేశముగల్గి, తానే శ్రీకృష్ణుడనని, బోధచేయుచుండి, స్మృతితప్పి పడుటయు నుండెను. కొంతకాలమునకాయన (24 ఏండ్ల వయస్సున) కుటుంబమువిడచి సన్యసించి, శ్రీకృష్ణ చైతన్యుడను పేరుతో మిగిలిన 24 ఏండ్ల జీవితమంతను రాధాకృష్ణమతపు ప్రచారముకే వినియోగించెను. ఆయన 1628లో కాలముచేసెను.*

ఈమతమందలి ముఖ్యసిద్ధాంతము కృష్ణప్రేమ భాగవతమందు గోపికలు వేలకొలదిగ గోపికలు శ్రీకృష్ణప్రేమచే మోక్షమొందినట్లు భాగవతము చెప్పబడినదిగదా! జీవాత్మలన్నియు గోపికలు, పరమాత్మయే కృష్ణుడుఅను అంతరర్థములో, ఇది జీవపరమాత్మల ప్రేమగ భక్తులు వివరించినారు.♦ బెంగాలులో రాధనే గోపికలస్థానమున చెప్పు ఆచారముండుటవల్ల, గౌరాంగుడు బోధించిన రాధాకృష్ణమతము జీవపరమాత్మల పరస్పరప్రేమునే తెలుపునందురు. చైతన్యుని మతము బెంగాలు ఒరిస్సాలలో

---

* చైతన్యుడు అలౌకికమగు శక్తిగల్గి కొన్ని లోకోత్తరమగు అద్భుత చర్యల జేయగల్గెనట, ఆయన కొందరు దుష్టులను యోగ్యులు అహింసాత్మకులుగ మార్చినట్లును గాథలు గలవు.

♦ పోతన రచించిన ఆంధ్రభాగవతమందిట్టి భక్తితత్వము మాధుర్యయుక్తమై మనోహరముగ వివరింపబడినది. వేదమందును జీవేశ్వర సంబంధమును స్త్రీపురుష ప్రేమలో పోల్చినారు. ఉ॥ "తద్యథా ప్రియయా స్త్రియా సంపరిష్వక్తః...... లోకాంతరం" (బృహదారణ్యకోపనిషత్తు)

విశేషముగ వ్యాపించి, అక్కడ నేటికిని అధికజనుల మతముగ నున్నది. ఇట్లు చైతన్యుని బోధవ్యాపించగా అప్పటి కాప్రాంతము లందు విపరీతముగా నాటుకొన్న శాక్తేయ కాపాలికమతములందు శక్తి తృప్తికని జరుపు జాతరలను జీవహింసను మద్యపానాది దురాచారములన్నీ చాలవరకు తగ్గినవి. ఆవిధంగా అక్కడ హింసా తత్వముతగ్గి కొంత ప్రేమభావము వ్యాపించుటకు చైతన్యమత ముపయోగించినది.

కాని ఆయన జీవితము తరువాత, ఈమతపు పరిశుద్ధత చెడినది. వెంటనే చైతన్యుని శ్రీకృష్ణావతారముగనెంచి, జను లాయన విగ్రహముల బూజింపసాగిరి. ప్రేమతత్వముపేర స్త్రీ పురుషులలో కొందరు పామరజనులు అవినీతి నారంభించిరి. అప్పటి కాప్రాంతమందు శాక్తేయులలోను ఇట్టి దురాచారము లుండినవి. అవి కొంతవరకు ఇక్కడి చైతన్య వైష్ణవులలోను వ్యాపించి, క్రమముగ ఆప్రాంతపు వైష్ణవమతమునకు అప్రతిష్ట గల్గించినవి కాని చైతన్యుని వైష్ణవమతము మన బెంగాలు ఒరిస్సా లలో కృష్ణభక్తి హెచ్చి, కాళీవిగ్రహముల యెదుట విపరీతముగ జాతరలుపేర జీవహింసచేయు దురాచారము కొంతవరకు తగ్గినది.

## అధ్యాయము 43.

### —• మొగలు సామ్రాజ్యపుస్థితి •—

మనమిప్పుడు వెనుకకు మరలి ఆకాలపు రాజకీయ సాంఘిక రంగములస్థితిని చూడవలెను. 12 వ శతాబ్దినుండి 18 వ శతాబ్ది వరకు పంజాబు ఢిల్లీ ఆగ్రాలలోనేగాక, క్రమముగ ఉత్తర హిందూ స్థానమంతటను, ముస్లింరాజత్వము, అందుతో కొంత ముస్లిం

సంస్కృతియు వ్యాపించినవి. ఈ కాలమందు మొత్తం మీద హిందువులలో పరస్పర ద్వేషము సంఘవిషయములందు విభేదములు హెచ్చినవి. ఆధ్యాత్మిక స్థానమున బాహ్యాచారములను కర్మకాండను గమనించుటే మతధర్మముగ నెంచిరి; మాంద్యమును దురాశయు వ్యాపించినవి. ముస్లిములు నవ్య విధానమందాసక్తిగల్గి ఉత్సాహులు, దీక్షాపరులునై, ఐకమత్యముగలిగి, పోరి, యుద్ధములందు గెల్చి రాజ్యముల స్థాపించిరి. తరువాత 15, 16వ శతాబ్దాలో కొందరుహిందూమతబోధకులయత్నములు జనులలో కొంత సంస్కరణను కల్గించినది. కాని, మొత్తము మీద యుద్ధములు హింసాభావమును హెచ్చుగనేయుండినవి. రాజవంశములందును కుట్రలు పరస్పరహత్యలు నుండినవి. అప్పటికి పరస్పర సమావేశముతగ్గి ఆయాప్రాంతపు భాషలలోను కొంత విభేదము పెరిగినది. ఆయాప్రాంతముల వేరు వేరు రాజ్యములేర్పడి, వాటిరాజులు తమ రాజ్యవృద్ధికై పరస్పరము పోరుచుండిరి. ఈ స్థితిలో తురుష్క వంశీయుడు నానకు మిత్రుడు నగు బాబరును పారసీకప్రాంతమునుండి భారతదేశముపైకి దండెత్తి రమ్మనిపిల్చుటకు కొందరు భారతీయులు (తమలో తాము పగతీర్చుకొనుటకై) సంసిద్ధత జూపిరి. అప్పటికి, కొన్ని ఖండరాజ్యములను ఆఫ్ఘనులు, మరి కొన్నిటిని రాజపుత్రహిందువులు, ఆప్రాంతమున పాలించుచుండిరి. అంతట 1525 స॥ రంలో బాబరు పారసీక ప్రాంతంనుండి మనదేశమువైపు దండెత్తి వచ్చెను. ఇతడు అంతకుపూర్వం హఠాత్తుగా దాడిచేసి విశేషద్రవ్యమును తీసుకొనిపోయిన తైమూరుగారి వంశీయుడే. వీరు మంగోలు జాతీయులు; వీరిని మొగలులని మనదేశీయులనిరి. తైమూరువలె బాబరును గొప్పశూరుడు. వెనుక మహమ్మదు గోరీకాలములోవలె, బాబరు వచ్చినప్పుడును మనదేశీయులు విభేదయుతులై, పరస్పర కలహములతోను కక్షలతోను తగువుపడుచు ఐకమత్యము లేకుండిరి. మరియు, తమసాంఘికము లందువలె యుద్ధమందును పూర్వపు వ్యూహపద్ధతులే యవలంబించి పెద్దయేను

గులను రణరంగములో ముందు పెట్టుకొని యీకాలమునకు సరిపడని యోధపద్ధతులతో తమలో క్రమశిక్షణ లేకుండ పెద్దమందగ సిద్ధమైరి. బాబరు నవ్యములగు తుపాకులను అశ్వికదళముతో పక్కల నుండి ముట్టడించు పద్ధతులను పెట్టెను. ఘజనీ గోరీలతో యుద్ధములో తామోడుటకు కలిగిన కారణములను భారతీయులు సంఘటనమును చేసుకోవలసియుండెను. కాని, అట్లు గ్రహించి సమయాను కూలమగు మార్పులను చేసుకోలేదు. రాజులలోను ఉన్నత నిమ్నజాతులమధ్యను సమయమునకు తగిన సహకారమును లేదు. అప్పటి ఢిల్లీసుల్తానులు ఆయన సైనికులును భారతవాసులే కాని వారికిని తక్కిన ఇరుగుపొరుగువారికి మధ్య ఆనుకూల్యము లేదు. వారితో చాలామంది హిందువులు యుద్ధములో కలయక వ్యతిరేకించిరి. ఢిల్లీరాజు ప్రజల బాలించుటలో వారి సహకారమును అభిమానమును సంపాదించుటకు తగు కృషి చేయక, ద్వేషకరమగు చర్యలనే జేసెను. బాబరు ఢిల్లిరాజగు "ఇబ్రహీంలోడి" నోడించుచున్నప్పుడు, చాలమంది "రాజపుత్ర" రాజులు దేశరక్షణకు రాక, తమ రాజ్యములందే యుండిరి. "లోడి" పతనమున కానందించిరి. పైగా, భారతీయసేనలో నాయకులకు సైనికులకు అన్యోన్యత సానుభూతి చాలలేదు. పిమ్మట, బాబరు రాజపుత్రుల గూడ ఎదుర్కొని, వారినోడించి, మొగలు సామ్రాజ్యము స్థాపించెను. ఇట్లు పరస్పర ప్రేమయు ఔదార్యమును లేకుండా తమలోనే తోటివారియందు హింసాభావముతో నున్నందుల ఫలితమును భారతీయులు మరల అనుభవించిరి. బాబరు మనుమడగు అక్బరు విచిత్రవ్యక్తి; అతడు మొగలు సామ్రాజ్యమును వృద్ధిచేసి బాగుగ దృఢపర్చెను. అక్బరు బాల్యమందే రాజయ్యెను. అప్పుడు తన చుట్టుస్థితి కల్లోలముగనున్నను, అతడు అద్భుతమగు నిదానముతో నుండెను. ఆయన రాజ్యపరిపాలనలో సంఘమందు మైత్రి గల్గించు సంస్కరణల జేసెను. ఆచర్యలు $1\frac{1}{2}$ శతాబ్దివరకు మన సంస్కృతిని కొంతవరకు సుస్థితిలో నుంచగలిగినవి.

అక్బరు తండ్రినుండి అతనికి చిన్నరాజ్యమే దఖలుపడినది. శత్రురాజులు ప్రబలురై యుండిరి. తన చిన్నరాజ్యముతో తృప్తి నొందక, అతడు ప్రక్కరాజ్యముల రాజులతో తీవ్రముగపోరెను. అతడు శూరుడు, ప్రజ్ఞావంతుడు, యుక్తిపరుడు, అధికారాశగలవాడు; గొప్పసేనలు వృద్ధిజేసి, ఎన్నియో యుద్ధములు జరిగించి హిమాలయగిరులనుండి గోదావరీనదివరకు దేశమంతటను ఏకరాజ్యమును స్థాపింపగల్గెను. అతని నశోకునితో పోల్చుటకలదు. అశోకుడు మొదట నొకటి రెండు యుద్ధములు జరిగించినను, తరువాత రక్తపాతములేకుండనే ఆగొప్పరాజ్యమంతను పాలించెను. అక్బరు అశోకునివలె కేవలం అహింసాపరుడుకాడు. తన సామ్రాజ్యపు బయటిరాజ్యములందును అశోకునియందు అపారమగు గౌరవము అతని కంతటను పలుకుబడియునుండెను. కాని అప్పటి కాలపరిస్థితి వేరు.*

తన రాజ్యము విస్తరింపజేయుటకు భౌతికబలముపైనే ఆధారపడిన అక్బరుకు యిరుగుపొరుగు రాజులతోను, తన సామ్రాజ్యములోని రాజపుత్రులతోను చాలయేండ్లు పోరుజరుగుచునే యుండెను. కాని, ఇతరవిషయములందు అశోకునికి అక్బరుకు చాలపోలికయున్నది. ఇద్దరును ప్రజాక్షేమమును కోరిరి. ప్రజల ప్రేమసహాయములపైననే తమ రాజ్యమును నిల్పుకొందలచిరి. జనోపయోగులు శాంతి స్థాపకములు నగు కార్యములెన్నిటినో చేసిరి. కళాశిల్పములను వాఙ్మయమును వృద్ధినొందించిరి. ప్రజల ప్రయాణాదులకు మంచిరహదారు లేర్పరచిరి, సామ్రాజ్యమును దృఢపర్చిరి.

---

* అశోకుడు రాజగునప్పటికి ఆర్యావర్తమంతయు సామ్రాజ్యములో చేరియే యుండెను. అక్బరుకు చిన్నరాజ్యమే యుండెను అప్పటి హింసాసంప్రదాయ ప్రకారం తక్కిన రాజ్యములన్నిటిని అతడు స్వయముగా యుద్ధముద్వారా జయింపవలసివచ్చెను.

అక్బరును వ్యర్థపింపన కవకాశమీయలేదు ♦. తోటి ముస్లిం మంత్రులు రాజులు మతవిషయములలో హింసాపరులైనను, అక్బరు ధైర్యముతో వారి నణచియుంచి, హిందూ మతస్థులకును సమాన ప్రోత్సాహమిచ్చెను; వారి నాదరించెను; అన్ని విషయము లందును ఉదారుడై రాజ్యాధికారములోను అన్ని మతములవారికిని అవకాశమిచ్చి, ప్రేమాదరములజూపెను ఇదివరలో కొందరు ముస్లింరాజులు హిందువులపైన విధించిన "జిజియా" (ముస్లిములు కాని వారిపైన తలపన్ను) ను తీర్థయాత్రికులపైన పన్నును రద్దు చేసెను, దేశభాషలందలి వాఙ్మయముకు విశేష ప్రోత్సాహ మిచ్చి వృద్ధిచేయించెను. మతమూర్ఖులను దూరమందుంచి, ముస్లిములలో "సూఫీ" లు హిందువులలో "సంస్కర్త"లు, వేదాంతులు. ఇట్లే ఉదారులగు జైనులు బౌద్ధులు క్రైస్తవులు, ఇట్టి వారిని సమకూర్చి సభలలో ఆయామతముల పరిశుద్ధమగు మూల సిద్ధాంతములగూర్చి ఆధ్యాత్మిక చర్చలు చేయించెను. నానకు తులసీదాసు వగైరా విద్వాంసులను గౌరవించెను. "వ్యాప్తిలో నున్న గొప్పమతములన్నిటి ఉద్దేశము, సూత్రములు, ముఖ్య సిద్ధాంతములు నొక్కరీతివే. మతముకై పరస్పరము కలహించుట తప్పు. ఒకమతమువారి నింకొక మతమువారు బలవంతముగ తమలో చేర్చుకొన యత్నింపకూడదు" అని ఆయనకు దృఢ విశ్వాస మేర్పడినది. సర్వసమ్మతమగు సూత్రములతో సమన్వయకరమైన కొత్తమతము స్థాపింపదలచెను.

ఆయత్నము విఫలమైనది, కాని, ఆయన వేదాంతులతోను మతసంస్కర్తలతోను స్వయముగను ఆధ్యాత్మికచర్చ చేయుచునే యుండెను. ఆయామతస్థులమధ్య పరస్పర కలహములు హింసాతత్వము గల్గించును. అందువల్ల ప్రజలకు రాజ్యముకు గూడ

♦అక్బరు బాల్యమందు రాజ్యాధికారమునకురాగనే, కొందరు విప్లవము సాగించిరి. వారిని తన సేనాని బైరంఖానుఅణచి, విప్లవనాయకుడగు "హేము"ను పట్టితెచ్చి, అతనిశిరస్సు ఖండింపుమని అక్బరును కోరెను. ధీరుడు ఉదారుడువగు అక్బరు బందియై నిరాయుధుడగు వానిని (శత్రువైనను) హింసింప నిరాకరించెను.

చాలా నష్టముగల్గును. కనుక నైతికముగను రాజ్యక్షేమముకును పరస్పర సహనమును ప్రేమభావమును స్థాపించుటకే అక్బరు తన జీవిత శేషమును వినియోగించెను. హిందూ ముస్లిముల మధ్య సాంఘిక విభేదముల గల్గించుచుండిన కొన్ని బాహ్యాచారములు మాన్పించి, వారి మనోభావములలో పరిణామము గల్గించుటకు సాంఘిక మైత్రి నేర్పర్చుటకును అక్బరు యత్నించెను. వల్లభుడు మున్నగు హిందూ సంస్కర్తల బోధల సహాయముతో హిందూ స్త్రీల భర్తృసహగమనాది క్రూరదురాచారముల నక్బరు నిరోధించెను. అప్పటి తక్కిన రాజులవలె గాక, ఉద్యోగాధికారములందు, న్యాయము నమలుజరుపుటలోను, మతభేదముల పాటింపు లేకుండ జేసెను. సాంఘికైక్యము గల్గించి భారతజాతిని, సంస్కృతిని, దృఢపర్చుటకై, అక్బరు హిందూ ముస్లిములమధ్య పరస్పర వివాహముల జరుపుటకును ప్రోత్సాహమిచ్చెను. తనకుటుంబములో స్వయముగాను నట్టివివాహముల జరిగించెను. ఇందుకు ఔదార్యములేని కొందగు ముస్లిము మౌల్వీలును హిందూప్రముఖులును వ్యతిరేకులైరి. మహమ్మదీయాస్థానీకులు తమ ప్రాబల్యము తగ్గుటకిష్ట పడుటలేదు; ముఖ్యముగ రాజపుత్రులు కొందరు గర్వపూరితులై, అట్టి సంబంధములు చేసుకొన్న తోటిరాజులను బంధువులను బహిష్కరించి వారిని ధర్మభ్రష్టులని యవమానించి, వారిపైన కత్తి కట్టిరి. శిష్టాచారముపేర గల్గిన ఇట్టి దంభహింసాహంకారముల ఫలితముగ, రాణాప్రతాప మహారాజు రాజా మానసింగును ద్వేషించుట, అందువిూద గల్గినయుద్ధములో చిత్తూరు రాజ్యము విధ్వంసమగుటయు చరిత్ర ప్రసిద్ధములు.* ఈ ప్రతిబంధములవల్ల అక్బరు ఉద్దేశముకు స్థిరమైనఫలము కలుగలేదు. కాని తరువాత ఒకశతాబ్దివరకు శాంతియు సంపదయు దేశమందునిల్చి రాజ్యము స్థిరమైయుండుట కాయన పద్ధతియు ప్రణాలికయు కారణములు

---

* రాణాప్రతాపాది నాటకము లందిప్పటికిని ఆ హిందూరాజులచర్య ఘనమని శ్లాఘింపబడుమాట నిజమేకాని, పరిశుద్ధమగు అహింసాదృష్టిని చూచినచో వారిచర్య సమర్థించుటకు వీలులేదని తోచును.

విదేశములలోవలె, మన దేశమందును అప్పటికి యుద్ధపు ఖైదీలను బానిసలను అమ్మివేయు పద్ధతి యుండెను. ఈ బానిస పద్ధతి ఆ దాస జనులకు హింసాకరము, వారి మానవత్వముకు భంగకరమునని అక్బరు బానిస పద్ధతిని తొలగించివేసెను.

మతవిషయములందేగాక, ఆయా సంస్కృతుల సమన్వయము కితర విధములను అక్బరు ప్రోత్సాహమిచ్చెను. ముస్లిం మత గ్రంథములను మన దేశభాషలలోనికిని హిందూమతగ్రంథములను పారశీ తర్జుమా చేయించెను. సంస్కృతముకు దేశభాషల వాఙ్మయముకు విశేషమగు నుత్తేజన మిచ్చెను. చిత్రలేఖనము వాస్తువిద్య, శిలాశిల్పము, సంగీతము ఇత్యాదులలోను పారసీకత్తుకు హిందూపద్ధతికిని మేళనము జరిగించుట కారంభించినది అక్బరే. అతడు ఆగ్రా ఫతేపూర్ సిక్రి మున్నగుచోట్ల గంభీరమగు సుందర భవనముల నిర్మించెను. ఈరీతిగా దేశములో సంఘటించిన వేర్వేరు సంస్కృతుల ప్రత్యేకత వైరకారణమగుటకు బదులు, జనులలో సామరస్యముకు, కళాభివృద్ధికి ఔదార్యముకు పోషకములగునట్లుచేసెను. ఆయా తెగల వారిలో పరస్పరసౌహార్ద్రము పెంపొందింపజేసెను. భారత జాతీయతను జనులలో సౌజన్యమును బలపర్చి, తనసామ్రాజ్యమందు ప్రీతిని స్థిరశాంతినికల్గించుటకే అక్బరీ సంస్కరణలన్నిటిని పెట్టెనని ఇదిసామ్రాజ్యపురాజనీతి దృష్టితో చేయబడెనని కొందరు చారిత్రికులన్నారు. అందువల్ల సాంఘిక రాజకీయములలో మంచిఫలముగల్గి సామ్రాజ్యముకు బలముకల్గెను; నిజమే; కాని నైతికఫలములును స్పష్టములే. తన సామ్రాజ్యవ్యాప్తి కతడు యుద్ధమునే యుపయోగించినను అక్బరేర్పరచిన సామ్రాజ్యములో సామంతులమధ్య కలహముల బోగొట్టు నైతిక వృద్ధి ఐకమత్యము పరస్పరప్రేమ వ్యాపించుటకే అక్బరును అతని సలహాదారులగు అబుల్ ఫజల్, రాజామానసింగ్ తోడర్ మల్ వగైరాలును కృషిచేసిరి. అక్బరు తన 40 సం॥ ల (1565—1605) పాలనలో ఆర్థిక రాజకీయ సంస్కరణలకూడ దేశ

మంతటను ప్రజాక్షేమమును శాంత పరిపాలనకు ననుకూలమగు సంస్థల నేర్పర్చెను; మతముతో నిమిత్తము లేకుండ సమర్థులు ఉదారులు ప్రజాక్షేమపరులు అగువారికే ఉన్నతోద్యోగములిచ్చి, వారిలో పరస్పర సహకారమును ప్రోత్సాహమిచ్చెను. ఆనీతి ప్రకారమాయన మంత్రులును అబుల్ ఫజల్, రాజామానసింగ్, రాజాతోడర్ మల్ మొదలగు మహనీయులు అప్పుడు శాంతిక్షేమములు గాపాడి భూమిపన్ను విధానపు సంస్కరణ వగైరాలద్వారా ఆర్థికస్థితి బాగుచేసిరి. కనుకనే, అప్పుడు భారతీయ వాఙ్మయమును కళాశిల్పములు ఉన్నత వికాసమొంద వీలైనది, మొత్తముమీద ఆయనపాలన పద్ధతి ఇప్పటి ముస్లింరాజులకు మార్గదర్శకమని చెప్పదగును.

అక్బరు ఉదారపద్ధతులవల్ల తరువాత రెండుతరముల రాజులు (అక్బరు కొడుకును మనుమడును) అంతగా ఉదారులు సమర్థులు కాకున్నను, 17 వ శతాబ్దిలోను మనదేశపు నాగరికత యభివృద్ధిలోనే యుండినది. ముఖ్యముగ కళలును చక్కని భవనములును దేశీయ వాఙ్మయమును నిర్మితములైనవి. కాని, రాజకుటుంబములో రాజ్యాశస్పర్ధయు కుట్రలును హెచ్చినవి. అక్బరు కొడుకగు జహంగీరుపైన అతనికొడుకు షాజహాను తిరుగబడుట. జహంగీరుఖైదు, అట్లే తరువాత షాజహాను కుటుంబములో సంఘర్షమును, చరిత్ర ప్రసిద్ధములు.

షాజహాను కొడుకులలో 'దారా' యును 'ఔరంగజేబు'ను ముఖ్యులు వారిలో జేష్ఠుడగు 'దారా' సజ్జనుడు, ఆయన హిందూ ముస్లింమతములందు సమభావముగల్గి, ఉభయమతములవారికిని మైత్రిని పెంపనుద్దేశించెను. అతడు తత్త్వవేత్త కాని, అప్పుడు ముస్లిములలో మతౌదార్యములేని మౌల్వీలు సామంతముస్లిములు తరువాత జరిగిన భ్రాతృయుద్ధములో ఔరంగజేబుకే సహాయులైరి. హిందూరాజులును దారాకు తగుసాయమీయలేదు. ఔరంగ

జేబు కుటిలవల్లను చాతుర్యంవల్లను 'దారా' ఓడిచనిపోయెను. ఔరంగజేబు మొగలచక్రవర్తియైనాడు. అందుతో అక్బరు ఆరంభించినపద్ధతి సీదాగారద్దుచేయబడినది. ఔరంగజేబు సామర్థ్యము గొప్పదే. అతడు వ్యక్తితయా అక్బరుకన్నను సమర్థుడై శ్రమపడెను. మాల్వీలబోధప్రకారమే నడుచుకొను భక్తుడై బలీయుడైయుండెను. శ్రద్ధతో పాలించెను, మొగలుసామ్రాజ్యమును కృష్ణాతీరమువరకును వ్యాపింపజేసెను. కాని, అతనిపద్ధతి మొత్తముమీద ఆసామ్రాజ్యము శిథిలమగుటకును, దేశముకల్లోలములోబడుటకును, కారణమైనది. అందుకు ముఖ్యకారణము గమనింపదగును. ఔరంగజేబుకు ప్రజాప్రేమ లేదు.

ఆయన రాజనీతి వక్రమైనది. ఆయనకు సమభావమను లేదు. ద్రోహబుద్ధి హెచ్చు. ఆయన అతిధార్మికుడువలె పైకికన్పించుచుండెను; ఔదార్యము లేక, ముస్లిముల ఆధ్యాత్మికాశయముల విడచి, వారి బాహ్యాచారముల కత్యంతప్రాముఖ్యమిచ్చెను; అక్బరువలెగాక, హిందూమతస్థుల ననేకవిధముల హింసింపదొడగెను. వారిపైన తలపన్నుపెట్టి, వారిమతబోధల కవకాశముతగ్గించి, హిందువులలో నిర్బంధముగ యీముస్లింమతము వ్యాపింపచేయబూనెను. గొప్పదేవాలయముల బడగొట్టి వాటిపరికరములను సౌధముల కుపయోగించి, వానిద్రవ్యము దుర్వినియోగముచేసెను. ఆయన హృదయములో హింసాతత్వము హెచ్చుగనుండెను. అందువల్ల మతమూర్ఖతగల్గి అట్టివారిసలహాలే అంగీకరించుచు విమతస్థులపైనను, ముస్లిములలోగూడ సూఫీలు షియాలువంటి ఉదారులపైనను, అసహనముగల్గి, వారిని హిందువులను నమ్మక వారిని బాధించుచుండెను. తన యుద్యోగులపైన శంకయు అనుమానమును గల్గియుండెను. ఇట్లు పరస్పరద్వేషము వృద్ధియైనది. ప్రేమ ప్రేమనే పురికొల్పును. మనద్వేషముచే ఇతరులలోను ద్వేషభావమేర్పడును. అంతట పరస్పర హింస చెలరేగును. అక్బరు ప్రేమభావము సౌహార్ద్రమువలన, చాలమంది రాజపుత్రులు

మున్నగు హిందూరాజులును ప్రజలును ఆయనపైన ప్రీతిగల్గి యుండిరి. అక్బరు ఆరంభస్థితిలో చాల కష్టస్థితిలోనుండెను; అప్పుడు హిందువులు ఉదారులగు ముస్లిములు నతని కెంతయో సాయపడిరి. ఔరంగజేబు ద్వేషభావమువలన హిందూరాజులును కొందరు ముస్లిములును ఆయనపైన తిరుగబడిరి. రాజపుత్రులు, సిక్కులు, శివాజీనాయకత్వమున మహారాష్ట్రులు, మొగలురాజ్యపు విరోధులైరి. వారినణచుటకు ఔరంగజేబు తనశక్తినంతను విని యోగించవలసివచ్చెను. ఆయన హింసాచర్యలవలన ప్రజల కాయనపైన ద్వేషమేర్పడెను. కనుక, శివాజీ మహారాష్ట్ర రాజ్యమును సులభముగ స్థాపించుకొనెను. ద్వేషపూరితుల కితరులకు తనమిత్రులపైన సహచరులపైనగూడ నమ్మికయుండదు. ఔరంగజేబు తన సేనానాయకులను మంత్రులనుగూడ నమ్మక, తరచు వారిని మార్చుచు తన యనుచరులలో ఐకమత్యము లేకుండ జేసుకొనెను. ముస్లిములలోను ఉదారులు ఆయన అల్పబుద్ధికి ద్వేషముకు గురియై అసహ్యపడిరి. ముస్లిములలో సున్నీ, షియా, అని రెండు తెగలున్నవి. సున్నీపక్షమవలంబించిన ఔరంగజేబు కొందరు సున్నీమౌల్వీలు చెప్పినట్లెల్ల జేయుచు, షియాముస్లిము లను బాధించుచుండెను. దక్కనులోనున్న షియాసుల్తానులతో మిత్రత చెడగొట్టి, ఆరాజ్యముల రూపుమాపబూనెను. ఇట్లే, పంజాబులోని నానకు శిష్యులగు సిక్కులను చిక్కులుపెట్టి వారి మతగురువును హింసచేసెను. అంతట, అంతవరకు అతిశాంతులైన సిక్కులు ఆత్మరక్షణకై ఆయుధములబట్టి, గురుగోవిందసింగు నాయ కత్వమున ఔరంగజేబుకు ప్రబలవిరోధులై తరువాత మొగలు రాజ్యముకు ప్రక్కలో బల్లెమైరి. ఔరంగజేబు జీవితాంతము నాటికి, తిరుగుబాట్లు హెచ్చినవి. ఆయన సేనలలోను ఉద్యోగుల లోను అసంతృప్తి చెలరేగెను కొడుకులును కలహించిరి. ఇట్లు ఔరంగజేబునాటి నహింసాబీజము దేశమంతటికి హింసాఫలమునే యిచ్చినది. తనకును హింసాఫలమే గల్గినది. సామ్రాజ్యము

శిథిలమైపోయెను; చిన్నచిన్న స్వతంత్రరాజ్యము లేర్పడి, వారిలో పరస్పరయుద్ధములు కుట్రలు సాగినవి. దేశమందు శాంతి చెడి పోయినది. ఆయాసంఘములవారి మధ్య కలహములు హెచ్చినవి. అందువల్ల ఔరంగజేబునాటి నహింసాగ్నిచే ఆయనవంశమును బాగు పడలేదు. ఆయనసంతతిలోను కలహములు హెచ్చి, ఇతరులకు దురాదర్శమేర్పడినది. ముస్లిముల లాభమున కాయన జరిగించిన చర్య వారికిని అనగా తుదకన్నిసంఘములకూ హానిచేసినది. సహన ప్రేమములే క్షేమకరములు; హింసయు పరమతద్వేషమును హాని కరములు; అనునీతికి అక్బరు ఔరంగజేబుల జీవితపద్ధతుల ఫలిత ములు మంచినిదర్శనములు. రాజకీయములలో నిట్టివెన్నియో కలవు; కాని, నిదర్శనమునకివి చాలు. ఈవిషఫలమువల్ల 17, 18, వ శతాబ్దులలో మనదేశపు రాజకీయజీవితము కల్లోలములో బడినది. సామ్రాజ్యము ఛిన్నభిన్నమై, అంతఃకలహముల వల్ల రాజులును ప్రజలను దుర్బలులైరి. సంఘమందు దురాచారములు విపరీతముగ వ్యాపించినవి. అట్టిస్థితిలో విదేశీయులు మనదేశమును వశపర్చుకో గల్గుట, మనజాతి పరధీనమగుటయు సహజమే.

## అధ్యాయము 44.

### —• ఆంధ్రప్రాంతంలో పరిణామము •—

ఇతరప్రాంతాలలోవలె ఆంధ్రదేశమందును 8 వ శతాబ్ది తరువాత బౌద్ధజైన సంస్కృతి క్షీణించి, పురాణసంప్రదాయపు సంస్కృతి వ్యాపించినది. దక్షిణప్రాంతంనుండి శంకరరామా నుజమధ్వులారంభించిన మత సిద్ధాంతములు కొన్ని ఆచారములు ఆంధ్రులు నవలంబించిరి. మొత్తముమీద అద్వైతసిద్ధాంతమునకు శైవపూజకు మనప్రాంతములో ప్రాముఖ్యమేర్పడినది. రామా

నుజుడు ప్రత్యేకశ్రద్ధతో తిరుపతికివచ్చి, అక్కడ ఆలయంలో విష్ణుపూజను ఖాయపర్చెను. తరువాత ఆంధ్రుడగు వల్లభాచార్యుడు ఆంధ్రదేశంలోను కొద్దిచోట్ల అట్లుచేసెను, తక్కిన ప్రాంతాలలో శైవసంస్కృతి వ్యాపించినది. కొన్ని ముఖ్య ప్రాంతములు కొండయడవులతో నిండినవి. వీటినిగూర్చి నాగరికులెవరును శ్రద్ధవహించనందున, అవి నేటికిని అనారోగ్యమై వన్యజనులకు క్రూరమృగములకు ఆవాసముగ నిల్చియున్నవి. ఇక్కడ సంస్కృతి వృద్ధిలేదు ఇది యిప్పుడు "ఏజెన్సీప్రాంతము" మన్యము అనబడుచున్నది. ఇక్కడి భౌతిక సంపదకు తగు వినియోగము లేదు. ఇక్కడ తగు సంస్కృతి వ్యాప్తి లేకుండుట ఆంధ్రుల ఆర్థికాభివృద్ధికి నైతికాభివృద్ధికిగూడ అడ్డమైనది.

చాళుక్యరాజులు బౌద్ధస్థలములైన దాక్షారామాదులలో శైవాలయముల స్థాపింపజేసిరి‡ ఈసంస్కృతి పరిణామము ఆంధ్రప్రాంతములో యెక్కువ తీవ్రహింసాయుతముగ జరిగినట్లు సూచనలున్నవి. శాశ్వతకీర్తి తేదగిన అద్భుతశిల్ప సౌందర్యము నాగరిక సౌకర్యములు గల చైత్యవిహారాదులు ధ్వంసము చేయబడినవి. పామరుల హింసాతత్త్వము చోళ విద్వాంసులకు మతమూర్ఖతయేర్పడి ప్రకోపించినది. ఇది వాఙ్మయరంగమునకును సోకియుండెనని కొందరిసూచన. ఆకాలపు బౌద్ధజైన గ్రంథములు తమిళ కన్నడములలో కొంతవరకైన మిగిలినవి; కాని తెలుగులో అసలే లేవు. ఇట్లు 10 వ శతాబ్దివరకు ఇతరప్రాంతాలలో వెలసినరీతి అహింస ప్రేమవాఙ్మయము ఆంధ్రభాషలో లేకుండుటవల్ల ఆంధ్రులలో దృఢమైన అహింసా సంప్రదాయము లేకపోయినది. ఇది విచారకరము. ఆ ప్రాచీనగ్రంథములు బౌద్ధజైనులవై యుండునని, వాటినన్నిటిని చాళుక్యరాజులు మతద్వేషమున రూపుమాపిరని కొందరియూహ. లేక ఆపూర్వకాలంలో పైశాచివగ్రా రాభాషలలోనే

‡ తిరుపతియు ఒకప్పుడు బౌద్ధస్థలమై పిమ్మట శైవాలయమై, తుదకు విష్ణుపూజాలయమైనదని కొందరియూహ. పడమట పండరిపురమందును తూర్పున జగన్నాథమందును బౌద్ధాలయములుండి ఆస్థానమున విష్ణుపూజ యేర్పడినదందురు.

గ్రంథములను వ్రాయుచుండిరేమో, పండితారాధ్యుడు పాల్కురికి సోమనాథుడు నన్నెచోడుడు వగైరా విద్వాంసులు వీరశైవ మతము నీప్రాంతమంతటను వృద్ధిజేసిరి ; వీరు శైవసంస్కృతి వర్ధకమగు "బసవపురాణం శివతత్వసారం, కుమారసంభవం" మున్నగు గ్రంథములవ్రాసి ప్రచురించిరి. వీరును బసవేశ్వరుని వలె వేదప్రామాణ్యముకు వ్యతిరేకులు ; చాతుర్వర్ణ్య విభజనను విభేదమును అంగీకరించరు. వ్యక్తిభావము లెట్లున్నను, 11 వ శతాబ్దినుండి కొందరురాజులు శైవ వైష్ణవ భేదములేకుండ సంస్కృతవాఙ్మయపు ముఖ్యమైన ఇతిహాసపురాణములను, కావ్య గ్రంథములనుగూడ మహాకవు లాంధ్రీకరించుటకు సాయపడిరి. రాజమహేంద్రవరములో రాజరాజనరేంద్రుని ప్రోత్సాహముతో నన్నయార్యుడారంభించిన ఆంధ్రమహాభారతమును తరువాత తిక్కనామాత్యుడు పూర్తిచేసెను.*

ఇతడు హరిహరనాథుని దైవతముగ నారాధించెను. ఇది శైవవైష్ణవ సమీకరణమును సూచించును. ఇట్లే నాచనసోముని ఉత్తర హరివంశాదులును విష్ణుభక్తిని బోధించును. ఇట్టిగ్రంథములు అహింసాది నీతులు ఆర్య సంస్కృతియు సామాన్యులలోను వ్యాపించుటకు సహకారులైనవి. భాస్కర రామభద్రాదులు రామాయణకథను తెలుగుప్రబంధరూపముగ ప్రచారము చేసినారు.♦ కొందరు ముఖ్యపురాణములను, ముఖ్యమైన సంస్కృతకావ్యములనుగూడ తెలుగులో వ్రాసినారు. ప్రహ్లాద హరిశ్చంద్రాదుల

* ఇందు అరణ్యపర్వమునలో లోపించిన భాగమును యెర్రాప్రగడకవి భర్తీచేసి హరివంశముగూడ తెలుగుచేసినాడు ; విష్ణుభక్తికి ప్రేమతత్వమునకు పోషణమిచ్చినాడు.

♦ భాస్కరాదుల రచనలు వాల్మీకికి సరియైన తర్జుమా కావు. అట్టిసరియైన తెలుగు తర్జుమాను వ విలకొలను సుబ్బరావుగారు రచించిరి. రామభద్రకవి రామాభ్యుదయము [illegible] ప్రబంధకావ్యము. రంగనాథ రామాయణమను ద్విపదయు, మొల్లరచనయును సామాన్యులలో వ్యాపించినవి.

కథలు ఆంధ్రమున ప్రబంధములుగ వ్రాయబడినవి. ఈరీతిగ లోగడ మనము చర్చించియుండిన అహింసాబోధకమైన సంస్కృత వాఙ్మయపుసారము ఇక్కడి భాషలోనికి మార్చబడి మధ్యవర్గపు ఆంధ్రజనులలో వ్యాపించినది.

ఈలోగా సాంఘిక రాజకీయములందాందోళన గనే యుండినది. చాళుక్యరాజ్య మంతమొంది, కాకతీయ సామ్రాజ్యమేర్పడినది; ఇట్లు 12, 13 వ శతాబ్దులలో ఆంధ్రసంస్కృతికి కేంద్రము రాజమహేంద్రవరమునుండి, ఓరుగల్లుకు మారినది. కాకతీయులు మొదట జైనులైనను తరువాత శైవులైరి. అసలు శైవసిద్ధాంత ప్రకారమును హింసాచర్యలుదుష్యములే; కాని, మూర్ఖభావముతో గణపతి దేవాదులు జైనులను చాల హింసపెట్టిరి; శైవ పౌరాణిక వాఙ్మయమును వృద్ధిజేయించిరి. ఇట్లు కులతత్వపు ధోరణియు ప్రబలినది. అంతట, ఈసామ్రాజ్యము తుదకు ముస్లిములదాడిచే, 14 శతాబ్ధిలో భగ్నమైనది.

ఈసందర్భములో మనము గమనించవలసినది, దీనిరాజులు అనుచరులును తరుచు మహావీరులైనను, వీరిలో తరుచు హింసాబుద్ధియే ప్రబలమైనది; అంతఃకలహములును పొరుగువారితో సంఘర్షమును వీరిని తుదకు నిర్వీర్యులనుగ జేసెను. అప్పుడు ఢిల్లీ చక్రవర్తియైన అల్లాయుద్దీన్ ఖిల్జీ "మాలిక్ కాఫరు అను బానిసను తన సేనానిగ జేసెను; ఇతడు అసలు హరిజన హిందువు. తక్కిన పంచములవలె తానును సవర్ణహిందువులనుండి అవమానమొంది, ముస్లిము మతములో చేరినాడు; అంతట ఉన్నతహిందువులపైన ద్వేషము వహించినాడు. తన యజమాను నొప్పించి మాలిక్ కాఫర్ అలాయుద్దీను కావేశము గల్గించి, వీరావేశముతో హిందూ రాజ్యముపైన దాడి జరిగించెను; ఈదండయాత్ర మొదట పశ్చిమ హిందూరాజుపైకి సాగెను. ముస్లిమ్ సేనలు బలీయములైనను, హిందూరాజులు కలసి యెదిర్చినప్పుడు మొగలుసేనల నోడించి;

జయమొందిరి; కాని పిమ్మట తక్కినరాజులపైన అనూయతో దేవగిరి రాజగు రామచంద్రదేవు తరువాత మొగలుసేనలు మరల చేసిన దండయాత్రలో తప్పుకొనెను. అంతట "మాలిక్ కాఫర్" జయశీలుడై, త్రిలింగరాజ్యముపైకిగూడ వచ్చెను. ఇక్కడ కూడా మొదటిదాడిలో హిందువులైకమత్యముతో పోరిరి; అప్పుడాంధ్ర రాజుసేనలు గెల్చినవి; కాని మాలిక్ కాఫర్ యుక్తిపరుడు. హిందూ సంఘపు కులములలో పరస్పర ద్వేషమును, త్రిలింగదేశములో రాజువలన జైనులు బాధపడుటను కనిపెట్టి, వారిలో ఐకమత్యము చిరకాలముండదని, యూహించి, మాలిక్ కాఫరు మరల సేనతో వచ్చి కొన్ని కక్షలతో రహస్యపు రాయబారముచేసి, అంతట ముట్టడించెను. హిందువులలో ఆయా సామంతులమధ్యను సనాతనులకు నిమ్నజాతీయులకు మధ్యను ద్వేషభావముండెను. అప్పుడు హిందూసేనలో సహకారము లేకుండ, విభేదము వెల్లడియైనది. ఇట్లు తన యోధశక్తిలో దౌర్బల్యమువల్ల ఓడి, ఆంధ్ర చక్రవర్తి ముస్లిములకు లొంగి, రాజీచేసుకొనెను. ఈలోకువ కనిపెట్టి, ముస్లింరాజులు మరలవచ్చి, విభేదముతో నిరుత్సాహులైన హిందువుల పూర్తిగ నోడించిరి; ప్రతాపరుద్రుని పట్టుకొని, కాకతీయరాజ్యము నశింపచేసిరి; అంతటితో తృప్తినొందక, అంతవరకు తమకు కానట్లు నిర్లక్ష్యముగచూచు చోళ పాండ్య రాజులపైకిని వెళ్లి, మాలిక్ కాఫరు దక్షిణదేశపు పురములను పట్టుకొనెను. వెనుక పడమటినుండి ముస్లిములు ఢిల్లీరాజ్యముపైన దాడిచేసిన సందర్భములో చూచిననీతియే యిక్కడను మనకు తేలును.

అంతకుపూర్వము అక్కడి సమీపమందే (కృష్ణకావలి యొడ్డున) పల్నాడులో పాలక జాతిలో వీరవరులు పరస్పరము కలహించి ఘోరయుద్ధము చేసుకొనినట్లు, "పల్నాటివీర చరిత్రము"

వలన కనబడును.‡ ఆకాలపు రాజకుటుంబంలోను జరుగుచుండిన కుట్రలు, పరస్పరద్వేషము, హింసాభావము ఇందు వెల్లడి చేయబడినవి. భారతములో జూదమువలె, కోడిపందెములు వగైరాలు తీవ్రకలహములకు దీర్ఘవనవాసముకు కారణమగుటయు క్రోధాగ్ని చెలరేగుటయు ఈగ్రంథములో వర్ణింపబడినవి. మహాభారత నీతినే ఈకథనుండి మనము నేర్చుకోవచ్చును. సంఘములో అంతఃకలహములు కలిగితే, అవి సంఘమంతకు హానికరములు. కనుక అట్టి తగువులేర్పడినను పరస్పరసఖ్యముతోను రాజీద్వారాను పరిష్కరించుకొనుటే ప్రశస్తము. భారతములో సంజయుడు కృష్ణుడు జరిపినట్లే పల్నాటిరంగమందును బ్రహ్మనాయనిదూత గురజాలలో "నలగామరాజు"తో రాయబారము జరిపెను. తమలో పరస్పరము పోరుటయు హింసయు వ్యక్తులకేగాక, దేశముకూ ప్రజలందరికీ ఎట్లు అన్నివిధముల అనర్థకరమో కవిరాజా రాయబారిచే జెప్పించినమాటలు అహింసాతత్వపు సారమును చక్కగ స్పష్టపరుచును.*

కాని ఆరాజు దుర్యోధనునివలె నడుచుకొనెను. తరువాత రాజుతరపుననున్న నాయకురాలును "కోటకేతరాజుచేత రాయబారము పంపెను. కాని యీసారి బ్రహ్మనాయనికొడుకు ధూర్తత వల్ల రాజీ చెడినదట. మహాభారతములోవలెగాక, ఇక్కడ ఉభ

---

‡ ఈ ద్విపదకావ్యము మహాకవి శ్రీనాథుడు రచించెనని కొందరి యభిప్రాయము; అది శ్రీనాథునిరచనకాదని మరికొందరియూహ.

* పోరుమంచిదికాదు భూమినెక్కడను, పాడౌనుదేశంబు పగమించునేని ప్రజలెల్ల నశియించి పారిపోవుదురు...... మైకొని మీలోను మీరుపోరాడ, జూచెడివారికి జులకనయౌను. (కోరిశాత్రవులు మీగుట్టెరుందురు.) పలువలుమిమ్ము జేరి పగజావనీక, చెప్పుచుందురుమీకు చెనటివాక్యముల, నైకమత్యముచెడు నర్థానితోడ, చెడును బలంబును చెడును భాగ్యంబు చెడును యశమ్మును చెడును శౌర్యంబుచెడును రాజ్యమ్మును చెడ్డపిమ్మటను దేశంబు పరనృపాధీనమౌనమ్మ.

పల్నాటి వీరచరిత్ర.

యపక్షములలోను యుద్ధబాధ్యత సమానమేయైనది. బ్రహ్మనాయడు నాయకురాలికన్న చాల విషయములలో యోగ్యుడు, ధీమంతుడు. సాంఘికముగను పంచమ బాలుని పెంచుకొనియాదరించిన ఉద్ధారుడు. కాని అతనిలోను దోషములున్నట్లు కనపర్చబడినవి. తుదకైనదేమి ? ఆమహారణములో భారతయుద్ధములోవలె ఉభయపక్షముల వీరులును నశించిరి, "నాగులేరు" రక్తప్రవాహముతో నిండెను. తుదకు రెండుపక్షములూ నీరసించి దుర్బలములైనవని కవీశ్వరుడు కనపర్చి, హింసాతత్త్వంవల్ల యుద్ధంవల్ల గెల్చినవారికిగూడ తుదకు హానియే కలుగునను నీతిని తేన్చినాడు. శ్రీనాథుడు కాశీఖండం, భీమేశ్వరీయం మొదలగు శైవపురాణగ్రంథములనుగూడ రచించెను. ఇవి భక్తిప్రధానములు.‡

సుమారీకాలమందే జీవించిన పోతనామాత్యుడు గొప్ప భక్తుడు. కాని ఇద్దరితత్త్వములోను భేదమున్నది. శ్రీనాథుడు లోకానుభవముగల్గి దేశసంచారియై, అనేక ప్రభువుల నాశ్రయించి వారికి కృతులనిచ్చి, కొంతకాలమైశ్వర్యమనుభవించెను. అతడు విషయాసక్తుడని శృంగారలోలుడని వాడుక. కాని తుదకతడు దైన్యమొంది, ఋణగ్రస్తుడై, జైలులోబడి నిర్వేదముతో మృతినొందెను. పోతన గొప్ప నిగ్రహముగల్గి పవిత్రజీవనముతో ఆదర్శపురుషుడనిపించుకొనెను. "రాజసన్మాన మిప్పింతును. ప్రభువులకు నీగ్రంథము కృతినిమ్మ" ని శ్రీనాథుడు సూచించినను పోతన యందుకంగీకరింపక తనగ్రంథములను "శ్రీహరి"కే అంకితముచేసెను. రాజులకంకితముజేయగనే వారి రుచికనుకూలముగనే వ్రాయవలసియుండును.♦ తన అపారశక్తి ప్రేమలను శ్రీమం

‡ శ్రీనాథుడు 14 శతాబ్దిచివర 15 శతాబ్దపు పూర్వార్ధపువాడని చాల విమర్శకుల యభిప్రాయము.

♦ అప్పటిరాజులకు నిజమైన ధార్మికత లేదని పోతన యనుమానించెనని తోచును. రాజులకంకితముచేయుట "కావ్యకన్యకం గూళలకిచ్చి యప్పడుపుకూడు భుజించుట'' ను [illegible] చినాడు.

తులకు కాక దరిద్రనారాయణులకే పోతన తనశక్తిని ధారపోసెను. ఇతడు జీవిత నిర్వాహణముకై స్వయంగాకృషిచేసి, బీదల కష్టసుఖములను స్వయముగా అనుభవించెను. ఈతని గ్రంథములలోనెల్ల ముఖ్యము "ఆంధ్రభాగవతము" సంస్కృతభాగవతమునుగూర్చి ఇదివరలో చర్చించినాము. ఇందులో భారతం హరివంశం విష్ణుపురాణం వగైరాలలోని శ్రీవిష్ణువు అవతారగాథలు వివరింపబడి భక్తిబోధ చేయబడినది. పోతన సంస్కృతమూలముకన్నను ఎక్కువ విపులముగ ఆంధ్రములో రచించి రసవత్తరముగ జేసినాడు. కొన్నిఘట్టములు చదువునప్పుడు పోతన వాటిని వ్రాయుటలో భక్తిప్రేమలచే పరవశుడైనట్లు తోచును. మూలమందలి తత్వవేదాంతచర్చను కాపాడుచునే భావములు సామాన్యులకు బోధపడునట్లు వ్రాసినందుకును గ్రంథకర్త ప్రశంసాపాత్రుడు *. మూలగ్రంథపు గాంభీర్యము రాబట్టుటకీతడు సహజముగ చాలవరకు సంస్కృత భరితమగు నారికేళ పాకములోనే తన గ్రంథమును వ్రాసెను. భాగవతమునందు కృష్ణుని లీలలకును మాహాత్మ్యమునకును విశేషప్రాముఖ్యమున్నది. ఆభాగములను పోతరాజు తదేకదృష్టితో చక్కగ పోషించి అనన్యభక్తునివలె వివరించెను. కాని, రామకృష్ణావతారములగూర్చి సమదృష్టి యుండుటయు గమనింపదగినది. శ్రీరాముడే తనను భాగవతము నాంధ్రీకరింపుమని ప్రేరించెనని చమత్కృతితో గ్రంథాదిని రామకృష్ణులిద్దరియందును తనభక్తి వెల్లడించినాడు ♦ మరియు మనస్ఫూర్తిగ శివుని బూజించి హరిని భజించుచు, భూతదయ సత్యము గమనించు

---

* అరయ సమస్తభూతహృదయమ్ములయందు వసించి యేకమై పరగి సుహృత్క్రియానుగుణభాసిత ధర్మమడవుగా బరావరేశ్వరుడవు నైతివఱ్చుచు నసజ్జన దుర్లభమైనయట్టి సుస్థిరమగు సర్వభూతదయచే బొడగానగవత్తువచ్యుతా.

అహింసకు భక్తికి సంబంధముచెప్పు నిట్టి పద్యములనేకములు భాగవతములోనున్నవి.

♦ పలికెడిది భాగవతమట పలికించెడివాడు రామభద్రుండట. నేబలికిన భవహరమగునట పలికెద వేరొండు గాథ బలుకగనేలా.

వాడే ధన్యుడని తన జీవితాదర్శముగూడ తెల్పుట ఆయన అహింసాభావమును హరిహరస్వరూపములోను సమభావపు విశాల దృష్టిని సూచించును* ఇతడు వీరభద్ర విజయమను శివభక్తియుత మగు గ్రంథమునుగూడ రచించెను. ఆంధ్రములోని భక్తిరస ప్రబంధములలోనెల్ల పోతన భాగవతమే ఎక్కువ ప్రశస్తము, ప్రసిద్ధము.

ఇట్లు 14 వ శతాబ్దికి ప్రాచ్యాంధ్ర రాజ్యములు విచ్ఛిన్నమై ప్రజలును అశాంతిలోనుండిరి. అంతట పశ్చిమాంధ్రమందు వీరి సంస్కృతికి నవ్య కేంద్రమేర్పడినది. ప్రతాపరుద్రుని అర్ధసచివు లగు హరిహరి బుక్కరాయలను సోదరులిద్దరు తుంగభద్రాతీర మలదు "విద్యానగర"మను పురమును నిర్మించి, అక్కడ రాజ్య స్థాపన చేసి, పాలనమారంభించిరి. వీరిరాజ్యము క్రమముగ ఆంధ్రకన్నడ ప్రాంతములందు వ్యాపించెను. వీరు బలీయులై అన్నిమతములందును సహనముగల్గి ప్రజలందరియందును దయా భావముతోనుండిరి. వీరికి మంత్రియైన విద్యారణ్యుడు గొప్ప విద్వాంసుడు, జ్ఞాని ; ఈయనతరువాత మాధవాచార్యులనుపేర సన్యసించి, సంస్కృతములో ఆద్వైతపు వేదాంతగ్రంథములను భక్తిభరితమైన స్తోత్రములను రచించెను. సర్వభూతదయయే శక్తిస్వరూపిణియని ఆయన స్పష్టపరచెను.‡ ఈయన సోదరుడు సాయణాచార్యుడు, వేదసంహితలకు విపులమగు వ్యాఖ్యానమును పీఠికను రచించెను. ఈరాజ్యమే తరువాత విజయనగర సామ్రా

---

* చేతులారంగ శివుని బూజింపడేని
నోరు నొవ్వంగ హరికీర్తి నుడువడేసి
దయయు సత్యంబు లోనుగా దలపడేని
గలుగ నేటికి తల్లుల కడుపుచేటు

ఆంధ్రభాగవతము (పీఠిక పద్యములు)

‡ యాదేవీసర్వభూతేషు దయారూపేణసంస్థితా నమస్తస్యైనమస్తస్యైనమోనమః
(దేవీసప్తశతి)

జ్యమను పేర ప్రసిద్ధమైనది. 16 వ శతాబ్ది యారంభమునకు ఆంధ్ర రాష్ట్రమంతయు, చోళ పాండ్య దేశములు చాలవరకును ఈయాంధ్ర సామ్రాజ్యములో జేరినవి. అప్పటి ముఖ్యరాజు శ్రీకృష్ణదేవ రాయలు. ఈయన వీరుడు చతురుడునేగాక గొప్ప విద్యాభిమాని జ్ఞానవంతుడును. ఈయన మొదట శైవసంస్కృతియందభిమానియైనట్లును తరువాత తాతాచార్యులకు వల్లభాచార్యులకు శిష్యుడై విష్ణుభక్తిగల్గియున్నట్లును చెప్పుదురు. ఈయన సమత్వ బుద్ధితోనుండెను. తనరాజ్యమందు ప్రజలందరిలో పరస్పర ప్రేమ భావమును, ఆర్థికోన్నతిని వృద్ధిపరచెను. ఈయన పాలనలో జనులు శాంతులై సుఖపడిరి. దక్షిణ దేశమును జయించివచ్చిన మీదట కృష్ణదేవరాయలకక్కడి వైష్ణవ వాఙ్మయముపైన రుచి గల్గినది. విశిష్టాద్వైతపు భక్తి ప్రపత్తులకు ప్రాముఖ్యమిచ్చుచు ఆయన స్వయముగ భక్తికథయగు "ఆముక్తమాల్యద" అను విష్ణుచిత్తీయ ప్రబంధము నాంధ్రములో రచించెను. ఆయన విద్వాంసుల ప్రజ్ఞను స్వయముగ పరీక్షించి పండిత సభలజరుపుచు ప్రోత్సాహమిచ్చెను. ఆంధ్రకన్నడములలో చాల గ్రంథముల వ్రాయించెను. ఈయన యాస్థానమందు దిగ్గజములని పేరొందిన విద్వత్ కవులనేకులుండిరి. వీరిలో తెనాలి రామకృష్ణకవి వ్రాసిన "పాండురంగ మాహాత్మ్య"మును భక్తిప్రేమల బోధించు ప్రబంధమే; అల్లసాని పెద్దన, నంది తిమ్మన్న, రామరాజభూషణాదులు వ్రాసిన ప్రబంధరత్నములు పురాణాదిగాథలపై నాధారపడినవి. శృంగారరస ప్రధానములు, ఇట్లు శ్రీకృష్ణదేవరాయలకాలమందు సంస్కృతి వికాసమున కాలంబముగ మంచి సాహిత్యమును కళా శిల్పములుగూడ మనప్రాంతమంతటను వృద్ధినొందినవి. కాని పామరజనుల సంస్కృతిలో మాత్రమున్నతి కలుగ లేదని తోచును.

కృష్ణదేవరాయలతరువాత అట్టి ప్రజ్ఞౌదార్యముగల రాజులు లేకపోయిరి. మంత్రులలోను దుస్తంత్రములేర్పడినవి. మరల అంతఃకలహములును విరోధములును ప్రబలినవి. ప్రజలను పాల

నలో బాధ్యత, హక్కు, లేకపోయెను. సంఘములో పరస్పర వైషమ్యము హిందూముస్లిములమధ్య సాంఘిక విభేదమును చెల రేగినవి.‡ ఈస్థితిలో ముస్లిమ్‌రాజులమధ్య అసూయలుండినంత కాలమే హిందూరాజ్యము నిలిచినది. అదిల్షానిజాంషాలు దక్కనులో తుదకు మైత్రిచేసుకొనిరి. అంతట దక్కనులోని ముస్లిములతో ఈహిందూరాజ్యముకు ఘోరయుద్ధము జరిగినది. ముస్లిములలో సాంఘికైక్యమును, ధార్మికోత్సాహమును హిందువులలో కన్న హెచ్చు. హిందూరాజ్యపు సామాన్యజనులలో ఐకమత్యము ఉత్సాహము లేనిలోపము వెల్లడియైనది. అందువల్ల యుద్ధకాలమందు ముస్లింసేనలతికోత్సాహముతో పోరుచుండగా విభేదయుతులై ఏకాదర్శము సంఘటనములేని హిందువులాధాటికి నిలువలేదు. 1565 సం॥ లో తాలికోటరంగములో హిందూసేనలు చెల్లాచెదరై ఓరుగల్లులోవలెయిక్కడను సామంతులును ముఖ్యనాయకులును చెరియొకదారిబట్టిరి. ఇట్లు కృష్ణదేవరాయలు గతించిన 45 ఏండ్లలోగా విజయనగరపు విచ్ఛేదముగల్గెను. మరియు ఆమహానగరమును ధ్వంసముచేయబడి నామమాత్రావశేషమైనది.*

సుమారీరీతినే త్వరలో పాశ్చాత్యాంధ్రదేశమందును మరొక తీవ్రదండయాత్రలో హిందువుల రాజకీయస్వాతంత్ర్యము నశించినది. 1571 లో దక్కన్ ముస్లిముల దాడిసమయము కిక్కడను పరస్పరవిభేదములు కలహములు బయలుపడినవి. అప్పటి పాలకుడైన గజపతి మహారాజుకు మంత్రియైన "వత్సనాయముసలి" ఆంతరికద్వేషమున స్వామిద్రోహముచేసి శత్రుపక్షముకు సాయపడెను. అంతట తూర్పుజిల్లాలు గోల్కొండనబాబుల కధీన

‡ కృష్ణదేవరాయలకాలమందారాజ్యములో ఆంధ్రకన్నడ తమిళభాషిక ప్రాంతములుండెను. కాని, రాజ్యప్రజలకు సామాన్యభావ లేదు. అట్టి పరస్పర ప్రేమబంధము లేకుండుటయు లోపమైనది.

* చిరకాలము రెండుమతముల రాజ్యములమధ్యనుండిన విరోధభావపు ఫలితముగ అప్పుడు వర్ణనాతీతమైన హింస జరిగినది.

మైనవి ; వారిసామంతులుగ ఆయాప్రాంతపు సర్దారులైన "వత్స రాయ" రావు, పీసపాటివగైరాలు తమలో తరుచు కలహించుచు స్వలాభప్రధానులై యుండిరి. ప్రజలలోను నిజమైన శాంతి లేకుండెను. ఈ దేశమందు ముస్లిములప్పటికి చాల శతాబ్దులనుండి భారతీయులే; అయినను ముస్లిములు తమ చెరువులనీను ముట్టకూడదని, సాంఘికముగ తమను స్పృశింపకూడదని కలియకూడదని, హిందువులు మతాభాసపుతగవులు పెట్టిరి ; హిందువులహంకారులై తమపైన విరోధము వహించిరనియు విగ్రహారాధనాదుల విభేదము వ్యాగ్రూపమగు నిరసనలవల్లను ముస్లిములును హిందువులపైన ద్వేషపరులేమైరి. దూరదృష్టిలేని సాంఘికద్వేషము రాజకీయ ద్వేషముకు తోడైనది.

ఆకాలమందేర్పడిన గ్రంథములలో కొన్ని నీతిబోధకములగు ప్రహ్లాదకథ, హరిశ్చంద్రకథ వగైరాలు పురాణములనుండి గ్రహింపబడినవి. ఇందును అహింసాసత్యములను బోధించు సూక్తులక్కడక్కడగలవు. కొన్ని రామాయణ భారత భాగవతములనుండి గ్రహింపబడినవి. ఈయన్నియు సంస్కృతవాఙ్మయ సందర్భమున చర్చింపబడినవి. కనుక మరల విమర్శించుటలేదు. తెలుగు వాఙ్మయములో చాలవరకు యక్షగానములవగైరాల రూపమందుండి పామర జనుల కాహ్లాదకరముగ వ్రాయబడినది. అందు ప్రాంతీయగాథలుగూడ కలిపి "చంచీత" మున్నగు పాత్రలు చేర్చబడినవి. మొత్తముమీద వీటిలో కృష్ణప్రేమపు పురాణ గాథలకు ప్రాముఖ్యమిచ్చిరి. ప్రబంధగ్రంథములలో పింగళి సూరన కళాపూర్ణోదయమువంటి మంచి స్వతంత్రగ్రంథములలో అక్కడక్కడ కొన్ని నీతివచనములున్నవి. కాని మొత్తముమీద చాలవాటిలో శృంగారవర్ణనలే ప్రధానములు. కొందరు వీరరసముపేర యుద్ధాదుల వర్ణనకును ప్రాముఖ్యమిచ్చిరి అట్టిగాథలే కథా వస్తువులగుట సంప్రదాయమైనది. తంజావూరు మధుర మొదలగు చోట్లనుండిన ఆంధ్రసామంతరాజులప్పుడు స్వతంత్రులైరి.

ఆంధ్రవాఙ్మయము పూర్వపుసంస్కృతిని కొంతవరకు వీరు ప్రోత్సహించిరి. కాని ఆంధ్రరాష్ట్రమందు ఆయారాజులమధ్యను ప్రజలమధ్యను అన్యోన్యభయమును కలతలును, అసూయయు హెచ్చినవి. వీరందరును గోల్కొండనబాబుకధీనులై పికికితస మబ్బి భయగ్రస్తులైయుండిరి. క్రిందిజాతుల సామాన్యజనులలో పరిశుద్ధ సంస్కృతి వ్యాపింపలేదు.

భక్తిగ్రంథములు దేవుని సర్వవ్యాపకత్వముకు విశ్వజన కత్వము ప్రేమతత్వముకు బదులు ఆయాస్థలమాహాత్మ్యమునే వర్ణించుచుండెను. ఆంధ్రవాఙ్మయపు ఆరంభమునుండి అప్పు డప్పుడు శతక గ్రంథములేర్పడుచున్నవి. వీటిలో ననేకములు శృంగార వైరాగ్యప్రధానములు, సుమతీశతకము మొదలగు కొన్ని నీని ప్రధానములునుగలవు. వీటిలో అక్కడక్కడ అహింస పరోపకారబుద్ధి ప్రశస్తములని చెప్పబడినవి. కాని అవి అక్క డక్కడ చెదిరి దృశ్యాదృశ్యములరీతినున్నవి. సర్వేశ్వరశతక, దాశరథిశతకం వగైరాలలోని కొన్ని పద్యములలో భగవద్భక్తి ని నీతిని కలిపినారు. కాళహస్తీశ్వర శతకాదులలో శాంతరసము స్వాతంత్ర్యప్రోత్సాహమును కలవు. కాని వీటిలోను అహింసా తత్వబోధనమంతగా లేకుండుట విచారకరము. ఈప్రతి శతక ములోను ఏదో ఒకే వృత్తములో సుమారు నూరు పద్యము లుండుట రివాజు. వీటికి చతుర్థపాదమొకే మకుటము రీతిగ నుండును. కొందరు దశకములు అష్టకములు మాత్రము వ్రాసిరి. కాని కొందరు మత సంస్కర్తలు సంఘ సంస్కర్తలును శతకముల రీతి సహస్రములను వ్రాసినట్లు కనబడును. ఇట్టివారిలో ముఖ్యులు పండితారాధ్యుడు, వేమన. పండితారాధ్యుడు గొప్ప విద్వాం సుడు. వీరశైవాచార్యులలో నొకడు. ఈయనయు బద్దెనయు* ఇట్టి సహస్రికములనుగూడ ముఖ్యముగ శైవధర్మ ప్రచారముకు

* ఈబద్దె భూపతియే సుమతీశతకము రచించెనని కొందరియూహ

నీతిబోధకు వినియోగించెను. కాని ఇట్టి రచయితలందరిలో ముఖ్యుడు వేమనయోగి. వేమన మనమిదివరలో చర్చించిన ఇతరప్రాంతపు గొప్ప భక్తవరులవంటివాడు. నీతివర్తనమే ప్రధాన ధర్మము. ఈమహనీయుడు తనజీవితమును గూర్చి వివరముల జెప్పలేదు. ప్రామాణికమైన చరిత్రయు కాలనిర్ణయమును ఇంకను కాలేదు. 16 వ శతాబ్ది ప్రాంతపువాడు కావచ్చును. 16 వ శతాబ్దిలో ఉత్తరదేశమందక్బరువలె మనప్రాంతమందు శ్రీకృష్ణదేవరాయలు తన సామ్రాజ్యమును పాలించుచు ప్రజలకు శాంతిగల్గించి, వారిలో జ్ఞానాభిలాషను గల్గించెను; మంచివాఙ్మయ మును ఉత్తమకవులచే వ్రాయించెను. తానును సాహిత్యవృద్ధిలో పాల్గొనెను. ఇట్లు విజ్ఞాన వాతావరణమేర్పడిన కాలములోనే* వేమనయోగి, రామదాసు, పోతవరపు వీరబ్రహ్మం మొదలగు భక్తవరులు బయలుదేరి, నైతికప్రవృత్తికి ప్రోద్బలమిచ్చియుందురు.

వేమన రెడ్డివంశములోనివాడు. కొండవీదులో జనించెను; తుదిరోజులలో రాయలసీమ వాసియైనాడు* ఈయన బాల్యమందు స్వేచ్ఛాచారియని కథగలదు; కాని, తరువాత స్త్రీలోలత వగైరాలు లేవు. అతడు గొప్పయోగియనుటకు సందేహము లేదు. అతడు పండితుడు కాకున్నను విశేషముగ లోకానుభవముగల్గి, లోకస్వభావమును బాగుగ గ్రహించెను; ఈయన అనుభవముతో వ్రాసిన పద్యములు ఆంధ్రదేశమంతటను ప్రసిద్ధిజెందినవి. ఇవి సరళమై పామరులకును తెలియు ఆటవెలది కందము మున్నగు చిన్న చిన్న పద్యములుగ సులభశైలిని వ్రాసినవి. కనుక చదువు లేనివారును గ్రామములందీ పద్యములను పాడుచుందురు. భర్తృహరివలె, వేమన చాలరకముల భావములదెల్పెను. ఆకాలమందు

---

* వేమన 15–17 శతాబ్దులమధ్య నెప్పటివాడో విమర్శకు లంగీకరింప లేకున్నారు.

* వేమన పద్యములలో నొకదానిలో నతడు తుదను "కటారిపల్లె" లో నుండినట్లున్నది.

వ్యాపించిన సాంఘిక హింసాతత్త్వము నతడు గట్టిగ ఖండించెను. ముఖ్యముగ అతడు విగ్రహారాధన మున్నగు మూఢాచారము లన్నింటిని దుష్ప్రవర్తనలను గట్టిగ నిరసించెను; నీతికి సద్వర్తనము నకును ప్రాధాన్యమిచ్చెను. అతడు శైవుడు; చాలపద్యములందు శివుని స్తుతించెను* కాని కొన్నిటిలో భగవంతునికి త్రిమూర్తిత్వమున్నదని చెప్పెను‡ లోకులు సర్వసములుగనుండి నీతిమంతులు కావలెనని యుద్బోధించెను. అప్పటి కాంధ్రదేశమందు యజ్ఞ యాగములును, అందు జీవహింసయును చెలరేగుచుండుట చూచి, వేమన ఇట్టిచర్యలను తీవ్రముగ ఖండించెను.§

అతని ఖండనలు కొన్నిచోట్ల సౌమ్యములుకాక చాల తీవ్రములై ములుకులవలె నుండును. తిరువళ్ళూరు కబీరులబోధల యంత సౌమ్యముగ మృదువుగలేవు. దురుసుగ ప్రత్యర్థులను పరిహసించునట్లుండును. జీవహింస చెడ్డదని అహింస ప్రశస్తమని ఆయన స్పష్టముగ తెల్పెను. ఇప్పటి ప్రచురిత పద్యములలో కొన్ని అక్కడక్కడ నున్నవి.♦ మాంసభోజనము హానికరము హింసాద్యోతకముకనుక యెవరును మాంసభోజనము చేయుట

---

* సకలధర్మములకు శంభుడె యధిపతి; శంభువెనుక ముక్తి సౌఖ్యమేది; తెలుచు ద్రోవతిరిగి తాభ్రష్టులౌదురు విశ్వదాభిరామ వినరవేమ॥

‡ అఖిలజీవములను నజుడవై పుట్టించి, విష్ణువై దానిని వెలయజేసి, శివుడవై సకలము శిక్షించుచుందువు విశ్వదాభిరామ వినరవేమ.

§ పేరుసోమయాజి పెనుసింహబలుడాయె మేకపోతుఁబట్టి మెడలు విరచు క్రతువుచేయు ఫలము కామంబుకే గద విశ్వదా........

♦ జీవి జీవిజంపి జీవికి వేయగా జీవివలననేమి చిక్కియుండు, జీవహింసకులకు చిక్కునా మోక్షంబు విశ్వదా......

జీవిజీవిజంప శివుదయజంపుట జీవుధరసిచూడ శివుడుగాడె, జీవుడే శివుడని సిద్ధంబు తెలియరా విశ్వదా......

చంపదగినయట్టి శత్రువు తనచేంత, జిక్కెనేని కీడుజేయకుండ, పొసగ మేలుచేసి పొమ్మనుటేచాలు, విశ్వదా......

మంచిదికాదనియు వేమన అక్కడక్కడ తన పద్యములలో దెల్పినాడు.* యోగియనగా జీవములందు సమబుద్ధిగలవాడేఅని, సత్యము ముఖ్యముగ పాటించవలెననిగూడ దెల్పి, అహింసకవసరములగు భూతదయ సత్యము ఈరెంటిగూర్చియు వేమన ఉద్బోధించియున్నాడు♦ వేమన శిష్యులగు పోతవరపు వీరబ్రహ్మం మొదలగు కొందరు శివభక్తులును తరువాత భూతదయకు ప్రాముఖ్యమిచ్చినారు; నిస్సారమైన బాహ్యకర్మలను తగ్గించి, సర్వాంతర్యామియగు ఈశ్వరునే భజింపవలెననిరి. వారి కీర్తనలిప్పటికిని సాధువులు బైరాగులు వగైరాలలో విశేషముగ వ్యాపించియున్నవి.

ఆంధ్రభక్తులలో నింకొకడు "రామదాసు" ఇతనిపేరు ఆంధ్రదేశమంతటను వ్యాపించినది. అతని అసలుపేరు కంచర్ల గోపన్న. రామదాసు 17 వ శతాబ్దివాడని చాలమంది భావము. అతడు భద్రాచలమందు గోలుకొండ నబాబుగారి తరపున తహసీలుదారుగనుండి, తాను వసూలుచేయు దస్తును ప్రజల భక్తి వ్యాపింపజేయుకొరకే వినియోగించుచుండెను. అతడు శ్రీరామ భక్తుడై భక్తిపారవశ్యమున భద్రాచలములో గొప్ప దేవాలయములు కట్టించెను. అయితే కొన్నిలక్షలరూపాయల సర్కారు దస్తుకూడా అక్కడ దేవాలయపు నిర్మాణము కుపయోగించెను. ఆప్రాంతపు లోకులందరిలో ఈశ్వరప్రేమ కల్గించుటే ముఖ్యమని చూచుకొనెను. కాని అక్కడ పాలకుడు గోలకొండ నబాబు. ఆయన విగ్రహారాధనకు వ్యతిరేకియగు మహమ్మదీయ మతస్థుడు. ముందుగా ఆఖర్చుకు యజమానుల అనుజ్ఞను రామదాసు పొందలేదు.

---

* నోరెరుగు తాము రేమియు, సేరని జంతువుల జంపి నెమ్మది దినుచ్రక్రూరపు సంకరజాతుల మారణమేమందు నింక మహిలో వేమా.

♦ సకలజీవములందు సమముగానుండెడి, యతని క్రమము తెలియునతడె యోగి, అతడు శివ యగుదు వస్యుండు గాడయా విశ్వదా......

నిజములాడువాడు నిర్మలుడైయుండు నిజములాడువాడు నీతిపరుడు, నిజముపల్కకున్న నీచుండాలుండు విశ్వదా......

గోలుకొండ ఖజానాకు ఆబాపతు సొమ్ము పంపనందున నేర మేర్పడినది. కనుక సహజముగ విగ్రహారాధన మూఢత్వమును హెచ్చించుచునని నమ్మి నబాబు "తానీషా" రామదాసును జైలులోనుంచెను; ఉద్యోగులతనిని జైలులో బాధపెట్టినప్పుడు అతడు శ్రీరామస్తవము జేయుచు రచించిన కీర్తనలును, ఇతడు రచించినట్లు చెప్పు దాశరధిశతకమును ఇప్పుడాంధ్రదేశమంతటను వ్యాపించియున్నవి. ఈశ్వరప్రపత్తి నీకీర్తనలు బోధించును. తాను ఖర్చుచేసిన సొమ్మును సర్కారుకు జమకట్టుటకు రామదాసుకు శక్తిలేదు. రామదాసు జైలులో కొన్నియేండ్లు కఠిన శిక్ష ననుభవించెను. ఇంతలో ఒకరోజున రాత్రి నిద్రించు తానీషా కిద్దరు యువకులు కనబడి రామదాసు తరపు జవానులమని చెప్పి ఆయనతరపున ఆసొమ్మునంతను వసూలుయిచ్చిరట, కాని వెంటనే అదృశ్యులైరట. ఆశ్చర్యమొంది, తానీషా మరునాడుద యమే రామదాసుకు రసీదునిచ్చి, ఆయనను విడుదలచేసి, ఆయన దైవభక్తికి ప్రశంసించెనని కథగలదు.

♦ఈరామదాసు తంజావూరు ప్రాంతమందు శ్రీరాముని గూర్చి చక్కని భక్తిగీతములరచించిన త్యాగరాయస్వామియు అహింసాతత్వమాచరించినవారే. త్యాగరాజుకీర్తనలు సంగీత శాస్త్రప్రకారం వ్రాయబడి మధురములై విద్వాంసులకు అజ్ఞానులకుగూడ ఆదరపాత్రమైనవి.

17 వ శతాబ్దిలో నుండిన అనంతామాత్యుడు భోజరాజీయమను మనోహరమైన ప్రబంధకావ్యమును రచించెను. ఇందు ఒకటిరెండుచోట్ల అహింసాబోధకములగు విషయములున్నవి.

---

♦ దాశరధిశతకములోని యీ క్రిందిపద్యము "దయా సత్యప్రేమపరులే భూమిని భరించుచున్నది; పరోపకారభావమవసరమని యితరులును గ్రహింపవలెనని సూచించును.

సూరిజనుల్ దయాపరులు సూనృతవాదులు లుబ్ధమానవుల్, వీరపతివ్రతాంగనలు విప్రులు గోవులు వేదశాస్త్రల్ మహీభారము దాల్పగా జనులు పావనమైన పరోపకారసత్కారము మానంగ లేరకట దాశరధీకరుణాపయోనిధీ.

ఇందలి కథానాయకుడగు ధారాధిపతి భోజరాజు వేటకేగి, ఒక మహాటవిలో నద్భుతమై యతి విశాలమగు నొక వటవృక్షమును చేరెనట. ఆచెట్టుకొమ్మలలో నొకదానికి కాళ్లుతగిలించి, ఒక మునీశ్వరుడు వ్రేలాడుచు, తలక్రిందుగ తపస్సు చేయుచుండెనట. భోజుడాయనతో పరిచయము చేసుకొనెను అంతట నాసిద్ధుడు హితబోధచేసి, ధర్మమును అహింసాదులును ముఖ్యగుణములనియు, ఆ యోగ్య గుణములతనియందు స్థిరముగనున్నవని చెప్పి ప్రోత్స హించెనట.*

ఈసిద్ధుడు కొంతకాలమైనమీదట భోజరాజుకు నీతిబోధక మైన అనేక కథలు చెప్పెనట. ఆ నీతికథలలో కొన్ని అహింసా భావమునుబోధించునవి. అందీక్రింది కథయున్నది.

## —• బ్రహ్మరాక్షసునికథ •—

రత్నమండనుడను రాజపుత్రుడడవిలో విహరించుచుండ, ఒక బ్రహ్మరాక్షసుడతని చంపబోవును. అంతట రాజపుత్రుడు తనకై తల్లిదండ్రులు భార్యయు కనిపెట్టియుందురు ; వారికి తెలిపి మరల వచ్చెదననును. "ఆపదదాటి తప్పించుకొన్నవారు మరల ప్రమాదస్థలముకురారు, అట్లు చేతుమని మాట చెప్పినను నమ్మరాదు" అని బ్రహ్మరాక్షసుడనెను. కాని, ఆతడు గోవ్యాఘ్ర సంవాదాది కథలుచెప్పి, సత్యము తప్పనని మాటయిచ్చెను. అతడు నీతిపరుడని యూహించి, బ్రహ్మరాక్షసుడాతని నింటికి విడిచి, త్వరగ మరలి రమ్మనెనట ; రాజపుత్రుడు నగరుకుపోయి, బంధు మిత్రులకు జరిగిన సంగతి తెలిపి, మరల ఆయడవికి పోవుటకు శలవువేడెను. ఏకపుత్రునివిడుచుట సహజముగ రాజదంపతులకు

---

* ఏతన్మాత్రమహీపతి వే తగుచును ధర్మమును నహింసారతియు నీతియు నవగలుగు గుణజాలము నీయందుగాదె శాశ్వతమయ్యె.

( భోజరాజీయము 2వ అశ్వాసము )

కష్టమైనది. కాని, రత్నమండనుడు "ఏకపుత్రునికన్నను సత్యమును నిల్పుట వేయిరెట్లు మంచిదని చెప్పెను.‡ అప్పటికి 39 రోజులక్రిందనే వివాహమైన భార్య పుష్పగంధియు అందుకొప్పుకోక తప్పలేదు.

అతడిట్లు మరల రాగా సంతుష్టుడై బ్రహ్మరాక్షసుడతనిబట్టి భక్షింపబోయెను. కాని ఈలోగా రత్నమండనుని భార్య పుష్పగంధి రహస్యముగా నడచి అక్కడజేరి ఈతరుణమందే బ్రహ్మరాక్షసునికగపడి వరము వేడెను. ఆధీరాంగననుజూచి ఎవరో యనుకొని రాక్షసుడు ముందుగ వరమిచ్చుటకొప్పుకొని మీ కేమి కావలెననెను. "ఈయన నాభర్త, పతిభిక్షయిమ్ము" అనగనే బ్రహ్మరాక్షసుడు దిగ్భ్రమముచెంది, తుదకతనివిడిచెను. రాజపుత్రుని అహింసాసత్యభావములును పుష్పగంధి యాదర్శవర్తనములును ఆతని హృదయమును కరగించి మార్చివేసెను; బ్రహ్మరాక్షసుడు తానోడినట్లంగీకరించెను.* అంతట హింసాచర్యమాని అతడు వెంటనే దేవత్వమొందెను. ఇందు, ముందుగా సంభాషణలో రాజపుత్రుడు ఒప్పించుటకై బ్రహ్మరాక్షసునితో చెప్పినకథ ఈక్రిందిరీతిది.

## —♦ గోవ్యాఘ్ర సంవాద కథ ♦—

ఒక విప్రుని హోమధేనువు మిక్కిలి సాధువు, వృష్టిధారవలె పాలిచ్చునది, సౌమ్యమూర్తిగనుండెను. అది యడవిలో పచ్చిక మేయుచుండ నొకనాడొక బెబ్బులి చాటునుండివచ్చి తటాలున దానిమీదబడెను. అంతట, ఆవు నిదానముతో "ఉండుముందుము. నీకాహారమగుదును; కాని నాకొకచనువిమ్ము" అనెను.

---

‡ శశికూపాదిక దీర్ఘికాశతవాప్యేకంపు క్రతువు శతయజ్ఞ సమున్నతుండు దత్సుతశతకంబునకన్న నొక్క సత్యోక్తి నృపా.

* భోజరాజీయం, షష్ఠాధ్యాయం 115 వ పద్యం.

పులి యాశ్చర్యమొంది నిల్చి, అదేమని యడిగెను. "నాకొక దూడ 8 రోజులక్రిందనే పుట్టినది ; గడ్డి యింకను మేయదు. నీకు నామాంసమేకద కావలసినది నేబోయి దానికి పాలిచ్చి వచ్చెద ; పోనిమ్ము ; నీకు చాల పుణ్యముండును"‡ అని తనదూడ అసహాయస్థితిని తలచుకొని విచారించును. "బలవన్మరణమునుండి తప్పించుకొన్నప్రాణి మరల చావవచ్చుట లోకానుభవములోలేదు ; అట్టిది జరుగునన్నను నమ్మవీలులేదు. కనుక నేను నమ్మను" అని యొక బ్రాహ్మణుడు వరాహజన్మనెత్తి, దానిని విడుతునని నమ్మించియు వదలకపోయినకథను వ్యాఘ్రము చెప్పెను. కాని, ఆగోవు సత్యముపైననే లోకమాధారపడియున్నదని, సత్యవాక్పాలనవల్ల మదనలేఖయను రాజపుత్రి తనమాటను మానమును కాపాడుకొనుటేకాక, ఒకరాక్షసునికాహారమగుటకు సిద్ధపడి అతని హృదయమునుమార్చి, సత్యమును అహింసను తప్పక పాటింపుమని హితము బోధించిన* కథను ఆమె సోదరుడగు పావకలోమునికథను చెప్పి, ఆవ్యాఘ్రిని హృదయమును కరగించెనట "మాటతప్పకుందువా" అనివ్యాఘ్రిమడుగగా,† "అబద్ధమాడువాడే చండాలుడు" అని గోవు నమ్మించి యొట్టుపెట్టుకొనెను. అంతట ఆవు విడుదలయై గ్రామమందు దూడయున్న తన యజమాని యింటికివచ్చి, దానికి స్తృప్తిమితముగా పాలిచ్చి, యింటివారు తన మిగతపాలు పితుకుకొ

‡ గుమ్మెడుపాల నానుతునకుం బరితృప్తి జనించుకాని మాంసమ్ము సమస్తముం గొనక చాలదు నీయుదరాగ్నికైన నిక్కమ్ముగ నిందులో బ్రథమకార్య వినిర్గతి నీవెఱుంగవే, పొమ్మనవన్న వ్యాఘ్రికులభూషణ, చయ్యన పోయివచ్చెదన్.

( ,, ,, 140)

,, ,, 144, 156)

* బొంకకుమెన్నడున్ దనుజపుంగవ శాంతి వహించియుండు మేవంకను జీవబాధలగువానినొనర్పకు, శాచివై గతాహంకరణుండవై ఘన దయామతివై విజితేంద్రియుండవై పంకజనాభ దివ్యపదపంకజభక్తి పరాయణుండవై.

( ,, ,, ,, 339)

† అడి తిరిగిన దండాల్పుడండ్రుగాని కులమున చండాలుడైనను కొంతలేదు.

(శ్వే-6-8)

నిచ్చి, విచారించి తనదూడ దుస్సహవాసములకు దురభ్యాసములకు ప్రమాదములకు పాలుకావద్దని దానికి హితము బోధించి, దాని నోదార్చి, మరల వనముజేరెను.

ఈలోగా అడవిలో పులి యాతురపడుచు ఆలస్యమగుచున్న దని ఆవు తనను మోసగించినదని భావించుచు గాండ్రించుచుండెను. ఈస్థితిలో ధేనువు తత్తరపడు పులిని చేరెను. "నేను ప్రేమ భావముతో నాత్మ సమర్పణము చేసుకొన్నాను. నన్ను భుజించి నాకు పుణ్యగతి కల్పింపుము.§ అనుచు ఆవు ధీరతతో సమీపించి, తన మొగమును పులినోటి కందించుచుండెను. అంతట వ్యాఘ్రము ఇట్టిధోరణిని తనజన్మలో నెన్నడును చూడనందున తెల్లబోయెను. ఇంటినుండి తనంతనే తనమాట నిలువబెట్టి దేహమర్పించుకొను ధేనువుచర్యజూచినమీదట వ్యాఘ్రపు హృదయము మెత్తబడి, చిత్తవృత్తి మారనారంభించినది. ఇట్టివారిని చూడలేదు. ఇట్టి మహనీయులకు హింసచేయలేను. అట్లుచేసి పాపమొడిగట్టుకోలేను. సత్యము ధర్మము నిన్ను కాచినవి. నిన్ను చంపి తినుటకు నామన సొప్పుటలేదు పొమ్ము"♦ అని పులి జబాబుచెప్పి, వెనుకకుతగ్గెను. ఆవు తనను పగలింటికిపోయి రానిచ్చినదే చాలు వెంటనే తినుమని వాదించి మరల దగ్గరజేరెను. కాని పులి హృదయపరిణామ మీలోగా పూర్తియైనది. గోవుశీలమద్భుతమని గ్రహించి, పులి దానిని చంప నిరాకరించెను. ఈవాదమునుజూచి దేవతలు సంతో

§ నామనసాక్షికోటియయ్యెను నీమనసారగ భుజింపు, నీకే నధికప్రేమ మున సమర్పించితి, నామేనిదె, పుణ్యగతికి నను బుచ్చవనా.

♦ ఇట్టి మహానుభావులకు హింసయొనర్చి దురంతదోషముల్ గట్టుకొనంగ జాల, మటికల్గవె మాంసములొండుచోటు, లీపుట్టువునందు ముందునను పుట్టగజేసిన యట్టి దైవమీపట్టున బూరిమేపెడినె ప్రాణములింతనె బోవుచున్నవే.

అని యాధేనువు జూచి, నీయమల సత్యప్రాభిఖకిన్ మెచ్చవచ్చె నిహం జంపగజాల, నీవు తలగాచెన్ ధర్మమీపొద్దు పొమ్ము నిజావాసము చేర, నీసఖులు సమ్మోదంబునం బొంద నీతనయుండత్యనురాగమును బొరయ జిత్తప్రీతిమై నొందగన్.

( ,, 6-64, 65)

పించిరట ; విష్ణువు వారిద్దరి హృదయముపైన ప్రత్యక్షమై, వారికి సద్గతి నిప్పించెనట. వ్యాఘ్రమంత క్రూరజనులుగూడ మనస్ఫూర్తియగు అహింసను చూపినప్పుడు, అందువల్ల సహజముగ దుష్టులనబడువారిమనస్సులును కరుగును. నిష్కల్మషులైన అహింసావృత్తులు తమను ఆత్మార్పణ చేసుకొన్నప్పుడు, వారిని హింసింప హృదయమొప్పదు, చేతులురావు అనియు, సత్యపరత్వము అహింసావృత్తులగు సాధువుల కత్యావశ్యకమనియు, ఈకథ సూచించుచున్నది.

19 వ శతాబ్ది చివరను 20 వ శతాబ్ది యాదినుండియు మన దేశమందన్నిప్రాంతములవలె ఆంధ్రప్రాంతపు సంస్కృతికిని సంఘర్షముతోబాటు ఉత్తేజనముగల్గినది. వాఙ్మయమందు చాల క్రొత్త రచనలేర్పడినవి. ఈకాలమందు అహింసాబోధకములగు సంస్కృతగ్రంథములును కొన్ని బౌద్ధవాఙ్మయపు పాలీగ్రంథములును తెలుగులోనికి తర్జుమాయైనది. ముఖ్యంగా, ఆధునికాంధ్ర వాఙ్మయపు నిర్మాతయగు కీ. శే. శ్రీ వీరేశలింగం పంతులుగారు సాంఘిక విభేదములు దురాచారములు పోగొట్టి సంస్కరించుటకు విశేషకృషి చేసినారు ; భూతదయ ముఖ్యధర్మమని జనులకు బోధించును విశ్వమానవసౌభ్రాతృత్వము ఇహపరసాధనమని వివరించుచు చాలరచనలవ్రాసి ఆంధ్రజాతికుపకార మొనర్చినారు. కాని ఇప్పుడు హింసామయమగుచున్న ప్రపంచములో అహింసా వ్యాప్తికవసరము తగ్గక హెచ్చుచున్నది.

ఇట్లు ప్రాచీనకాలమునుండి తరుచు యుద్ధములు వగైరా హింసాకృత్యములు జరుగుచు పరస్పర సంఘర్ష మేర్పడియుండగా, ఈ దేశమందు ఉపనిషత్తులు వగైరాలవల్ల అహింసాతత్వపు పునాది యేర్పడినది. తక్కినచోట్ల హింసాతత్వమే బలీయముగ వ్యాపించి దాని తరంగములీదేశమునను వ్యాపించుచున్న సంగతినిజమే. తక్కిన ప్రపంచమును హింసాతత్వమువలన నేమి మాడనున్నదో

తెలియదని అక్కడి ధీమంతులు భయపడుచున్నారు. అది యెట్లున్నను మన దేశపు ప్రత్యేక పరిస్థితులనుబట్టి ఇక్కడ అన్ని విధములను అహింసాతత్వమే నిశ్శ్రేయసకరమనుట నిర్వివాదమైనది. మన ప్రాచీనాంధ్ర వాఙ్మయమునుండి అహింసా ప్రబోధమగు మరికొన్ని పద్యవచనములతో మన యీ చారిత్రికరూపమగు చర్చను ముగింతము.

క॥ అలిగిన నలుగక యెగ్గులు వలికిన మఱి విననియట్లు ప్రతివచనంబుల్ వలుకక బన్నమువడియెద దలపకయున్నతడెచూవె ధర్మజ్ఞుడిలన్॥

ఆ॥ సర్వభూతదయకు సత్యవాక్యమునకు నుత్తమంబు ధర్మువ్రెం డెరుంగ నొరులనొప్పి కొండకుపతాపమొనరించునదియు కడు నధర్మమనిరి బుధులు॥

క॥ తనువున విరిగిన యమ్ముల ననువున బుచ్చంగవచ్చు నతినిష్ఠురతన్ మనమున నాటిన మాటలు వినుమెన్ని యుపాయములను వెడలునె యధిపా॥

క॥ పురుషుండు రెండుదెరగుల, ధరనుత్తముడనగంబరగు దానేవ్యోడలన్, బరుసములు బలకకునికిని దురితంబులు వ్రేరయు పసుల దొరగుట కతనన్॥

గీ॥ ఎగ్గుచేసినవారికి హితముసేత యార్యజనములు గీర్తింతు రన్యదోషకారి దీనపాపముల దాన కాలిపోవు వేరవానికి గీడు గావింప నేల॥

ఆ॥ వినుమహింసధర్మవితతి కెల్లను మేటియదియు సత్యయుక్తమైన వెలయుననఘ శిష్టచరితలందు సత్యంబు కడునధికమనిరి శ్రుతుల నరసిచూడ (మహా. భా. అరణ్యపర్వం)

క॥ ఒరులేయవియొనరించిన, నరవరయప్రియము తన మనంబునకగుదా, నొరులకు నవిసేయుకునికి ప్ర, రాయణము పరమధర్మపదములకెల్లన్॥

బ్రహ్మచర్య మహింస నాబరగు పరమధర్మములు రెండు సువ్వె యుత్తమతపంబు, దానిగలవాడు నిర్మల జ్ఞానయోగ వంతుడై చూడనేర్చు సర్వంబుననఘ

( మహా. భా. శాంతి పర్వంబు )

ఆ॥ అన్యమాంసమున నిజాంగమాంసంబు బోషించుననుటకంటె జెట్టలేదు, మాంసభక్షణంబు మానుటకంటెను మేలు లేదు కర్మ జాలకమున॥

గీ॥ వినుము దానంబు దపమును వృద్ధసేవనము నహింసయు నియత కృత్యములు సర్వజనుల కిమ్మహాగుణములు మనమునందు దృఢ ముగా నిల్చినడపుము ధీరవర్య ( మ. భా. అనుశాసనపర్వం )

క॥ మనమున మాటల గర్మంబున బ్రాణుల హింసనేయబూనిన వారల్ విను నరకము బ్రాపింతురు తనర నహింసయ విశేష ధర్మంబరయన్॥

క॥ క్షమయు నకార్పణ్యము శౌచము ననసూయయును నానృశం స్యము సంతోషమును నహింసయు విను సత్యము నెనిమిది వలయు గుణము లఖిల జనులకున్॥ (మార్కండేయ పురాణము)

గీ॥ ఆత్మవత్సర్వ భూతాని యను పురాణవచనమూని బహుపాణి వత్సలుడయి సుఖము దుఃఖము సమముగాజూచికొనుచు దేహి పరలోకచింత కీర్తింపవలయు॥ (పంచతంత్రం చై. క.)

గీ॥ కడక మానసవాక్కాయకర్మములను సర్వకాలంబు మరి సర్వ జంతువులను బాధలొనరింపకయె ప్రీతిబలుకుచుండు సరణి మెచ్చంగ గడు నహింసాక్రమంబు॥ (ఒడయనంబివిలాసము)

క॥ పరమెరిగి నరు డహింసానిరతుడు గావలయు వినుము నిఖిల నదులు సాగరుజేరుభంగి ధర్మము లురుపుణ్య మహింసయందు నొప్పగ నుండున్॥ .. (జాహ్నవీమాహాత్మ్యం)

క॥ తనకోపమె తనశత్రువు, తనశాంతమె తనకురక్ష, దయచుట్టంబౌ
తన సంతోషమె స్వర్గము, తనదుఃఖమె నరకమండ్రు తథ్యము
సుమతీ॥ (సుమతి శతకము)

క॥ మనమున వాక్కున కర్మంబున నొకరికి జేయదలప బోకుండు
టయే తనర నహింస యనందగు మనుజేంద్ర యహింసకును
సమానముగలదే॥ (విశ్వకర్మ పురాణము)

భవదీయార్చన జేయుచో ప్రథమ పుష్పంబెన్న సత్యంబు రెండవపుష్పంబు దయాగుణంబతివిశిష్టంబేక నిష్ఠాసనోత్సవ సంపత్తి తృతీయపుష్పమది భాస్వద్భక్తి సంయుక్తి యోగవిధానంబవి లేని పూజలు మహింగైకొవు సర్వేశ్వరా! (యథావాక్కుల అన్నమయ్య రచితమగు సర్వేశ్వర శతకము)

45 అధ్యాయము.

# దరిమిలా పరిణామము.

18, 19 శతాబ్దములలో మనదేశమందలి ఆ యా చిన్న రాజ్యములు తమలో తాము విశేషముగ కలహించినవి. అంతట క్రమముగ దేశమంతటను బ్రిటిషుకంపెనీవారి పాలన వ్యాపించినది. దేశీయరాజ్యములలో కొన్ని అసలే పోయినవి. తక్కినవి బ్రిటిషు "కంపెనీ సర్కారు"కు లోబడి, సామంతరాజ్యములైనవి. ఇట్లు క్రొత్తగ విదేశప్రభుత్వము దేశమందేర్పడినది. ఈరాజకీయ పరిణామపు సమయమందే సాంఘిక నైతిక స్థితులలోను మార్పు గల్గినది. చిరకాలమునుండి తలయెత్తుచున్న హింసాతత్వము సంఘమంతటను చెలరేగినది. సంఘాచారములు మత సంస్థలు జనుల భావములుకూడ వికృతినొంది, అనూహ్యాచారములాచరించుటే మతధర్మమని జను లెంచసాగిరి. సాంఘిక జీవితము చెడి, గ్రామములందును శాంతజీవనము కష్టమైనది. ధార్మిక పరిశుద్ధి లేకుండబోయినది; అవినీతి హెచ్చినది. జనులకు కూపకూర్మతత్వము బాగుగ నాటుకొన్నది.

ఇట్లు కలుషితమైన మన ప్రాచీన హిందూ సంస్కృతి పున రుద్ధరించుటకు 19 వ శతాబ్ది ప్రారంభమునుండి కొన్ని యుద్యమము లేర్పడినవి. వాటివల్ల హిందూ సంఘమందు కొంతయుత్తే జనముదయించి అందువల్ల ప్రస్తుతస్థితిలోను కొంతమార్పుకల్గినది. కనుక, వాటినిప్పుడు సూక్ష్మముగ పరిశీలింతము

వీటిలో మొదటిది "బ్రాహ్మసమాజ"మనబడినది. దీనిస్థాప కుడు శ్రీరాజా రామమోహనరాయలు. ఈయన "పూర్వాచార" నిష్ఠులగు బ్రాహ్మణ కుటుంబములో జనించెను. ఈ ధీమంతుడు బాల్యమందే సంస్కృతములోను పారసీలోను ఆంగ్లమందునుగూడ విద్వాంసుడైనాడు. ధర్మాధారములగు ముఖ్యమైన అసలు మత గ్రంథములన్నిటిని శ్రద్ధతో చదివి, అన్నిమతములు సత్యము విశ్వ ప్రేమ మానవసౌభ్రాతృత్వము బోధించుననిగ్రహించినాడు; సత్య పరుడు తన నిశ్చితభావముల నాచరణలో పెట్టుట ముఖ్యావశ్యక మని గ్రహించినాడు; ఆసందర్భములో తండ్రి మొదలగు బంధు వులు మిత్రులు వ్యతిరేకించినను, ఎన్నికష్టము లేర్పడినను సహించి నాడు. అజ్ఞానమువలనను నైతికధైర్యము లేకయు జనులు పరి శుద్ధభక్తి గోల్పోయి విగ్రహారాధనాదులు మత ధర్మముగ నెంచుట నాయన తీవ్రముగ నిరసించినాడు; ఇటీవలి కర్మకాండకు బదులు ఉపనిషత్తులలోని వేదమతమునే అందరు నాచరింపవలెనని బోధించినాడు. శుద్ధ బ్రహ్మము నారాధించుటే ఇందు ముఖ్య సూత్రము కనుక దీనికి "బ్రాహ్మసమాజ" మని పేరువచ్చినది. హిందువులు ముస్లిములు క్రైస్తవులుగూడ అసలు తమ ప్రవక్తల శుద్ధబోధల మరచినారని, బాహ్యాచారములే మతస్థానమందారా ధించుట తప్పని చూపి, ఈమతములన్నియు పరిశుద్ధమగు ఏకేశ్వర భక్తి సత్యప్రేమములు వీటిపై నాధారపడివవని శాస్త్రచర్చ ద్వారా చూపినాడు. ఇట్లు సర్వమత సామరస్యముకు నవీనులలో నీతడే మార్గదర్శకుడైనాడు. ఉపనిషత్తులలో చెప్పిన సచ్చిదా నంద స్వరూపుడు సర్వజనకుడునగు సర్వలోకేశ్వరు నిర్మలభక్తితో

నారాధించుట బ్రాహ్మసమాజపు ముఖ్యసిద్ధాంతము. సర్వమానవ సోదరత్వమును రామమోహనుడంగీకరించి, జనులు పరస్పర ప్రేమతో మెలగవలెనని బోధించెను. ఇందు కడ్డము గల్గించు ఆయామతస్థుల మూఢాచారములు దరిమిలా నేర్పడినవే గాని అసలు ప్రవర్తకులు దేశించినవి కావని, ఆయన శాస్త్రాధారములతో నిరూపించెను

అప్పటికి సంఘములో కలహమునకు కారణములైన జాతి కుల విద్వేషములను తగ్గించుటకును రామమోహనుడు ప్రయత్నించెను; తన ప్రాంతపు వాడుక భాషయగు బంగాళీలోను ఆంగ్ల పారసీలందును వార్తాపత్రికలను ప్రచురించుచు, వాటిలో ధార్మిక సాంఘిక సమస్యలను ఉదారభావముతో సహేతుకముగ చర్చించి, సాంఘికముగ ఆదిహిందువులు వగైరా నిమ్నజాతీయులకు స్త్రీలకు జరుగుచుండిన అన్యాయమును దొలగింపవలెనని ప్రజలకు తెలిపెను. అస్పృశ్యత, జీవహింస, మద్యపానము ఇట్టివాటిని నివారించుటకతడు కృషిచేసెను. ఆయనప్రతిభవల్ల ఆకృష్టులై చాలమంది ఆంగ్లోద్యోగులాయనకు మిత్రులైరి. తానును సర్కారులో జిల్లా శిరస్తాదారుగ పనిచేసి, అధికారులచే గౌరవింపబడెను. క్రైస్తవ మిషనరీలును రామమోహనుడు తన హిందూధర్మవాదములో కనపర్చు విద్వత్తుకు హేతువాదనమునకు ఆశ్చర్యపడుచుండిరి. ఇట్లు కలిగిన తన పలుకుబడినంతను రామమోహనుడు సంఘక్షేమము సాధించుటకే వినియోగించెను; చాలమంది సంఘసేవాపరులను తయారుచేసెను. పాశ్చాత్య విజ్ఞానవ్యాప్తివల్ల ప్రజలలో నుత్తేజనము త్వరలో కలుగవలెనని తానాంగ్లపాఠశాలను స్వయముగ నడిపెను; ఆయన ప్రోత్సాహంవల్లనే ప్రభుత్వమువారు ఆంగ్లపాఠశాలలు బెట్టిరి. హిందువుల రాజకీయోన్నతిని ఆత్మగౌరవమును క్రైస్తవ మిషనరీలనుండి హిందూమత స్వతంత్రతను రక్షించుటకును రామమోహను డద్భుత సాహసముతో పనిచేసి ప్రజల కుపకారమొనర్చెను.

అప్పటికి హిందువులలో వ్యాపించిన దురాచారములలో నొకటి "సహగమనము." భర్త చనిపోగా, వెంటనే ఆభర్త కళే బరముతో భార్యయు దహనము చేయబడుటను "సహగమనము" అందురు. ఇందు "సతీ" త్వము వెల్లడియగునట. బుద్ధిపూర్వకముగనే ఈ "సతీ" చర్యను చేసినను ఏసందర్భములోను ప్రశంసార్హముకాదు; వితంతువు జీవితమును ఇంద్రియలోలతకు వినియోగించకూడదు; కాని నిగ్రహవతి లోకసేవాపరురాలు కావలెను. అంతేకాని బలవన్మరణము తప్పు. పైగా వారసత్వపు ఆశ వగైరాలవల్ల బంధువులు దుఃఖమగ్నురాలైన భార్యను తొందర చేసియు సహగమనము చేయించుచుండిరి. ఇట్టి దుశ్చర్య అప్పటి సంఘమందు సదాచారముగ భావింపబడెనంటే, సాంఘిక మన స్తత్వము హింసాధోరణిలో నుండెననుట కిదియు సూచకము. రామమోహనుడు శాస్త్రవాదముద్వారా ఇది కేవలం అధార్మికము నీతివిరుద్ధము దురాచారమునని రుజువుచేసి, అప్పటి "బెంటింకు" ప్రభుత్వముచేత చట్టముద్వారా నిషేధింపచేసెను. ఇట్లు దానిని రూపుమాపుటవల్లహిందూసంఘముకొకకళంకముపోయినది.

ముఖ్యముగ స్త్రీలలో నప్పటికి రూఢమైన దురాచారముల బోగొట్టి వారికి విద్యబోధించి, స్త్రీసంఘము నుద్ధరించుట కాయన తీవ్రకృషిచేసి, స్త్రీల బాధలవైపు ప్రముఖులదృష్టి నాకర్షించెను. అప్పటి కంపెనీవారి 'చార్టరు' సవరణ సందర్భమున, భారతీయుల రాజకీయ స్వత్వపు రక్షణనుగూర్చి ఇంగ్లండులోను తీవ్రప్రచారముచేసి రామమోహనుడు 1833 సం॥ ఆంగ్లదేశపు "బ్రిష్టలు"లో మరణించెను. ఈయన బోధనలు సర్వమత సమత్వపు ఆచరణ పాశ్చాత్యవిద్వాంసులలోను చాల సంచలనము గల్గించినవి. తరువాత మహర్షి దేవేంద్రనాథ టాకూరును, అంతట బ్రహ్మానంద కేశవ చంద్రసేనును ఈయుద్యమము నింకను వృద్ధిచేసిరి. ఇట్లు బ్రాహ్మసమాజసిద్ధాంతములు అప్పటి విద్యాధికులలో కొంత వ్యాపించినది. కాని, పిమ్మట దానిలోను విభేదములేర్పడినవి.

తరువాత హిందువులలో సాంఘిక ద్వేషమును దురాచారములను త్యజించి, హిందూసంఘటన గల్గించుటకు, మన దేశపు పశ్చిమ ప్రాంతమందొక యుద్యమమేర్పడినది. దీనిని "ఆర్య సమాజ"మందురు. దీనిస్థాపకుడు శ్రీస్వామి దయానందసరస్వతి. ఈయన ఘూర్జర ప్రాంతపు "మోర్వి" సంస్థానములో ఒక శైవ కుటుంబములో జనించెను. ఈయన అసలుపేరు మూలశంకరుడు; బాల్యమునుండి జపములును విగ్రహారాధనను జేయుట కలవడెను. ఒక శివరాత్రిరోజున కులాచారప్రకార ముపవసించి తాను శివాలయంలో జాగరణచేయుచుండెను. అర్ధరాత్రిదాటగా తక్కినయందరును నిద్రించుచుండిరి. ఆబాలుడుమాత్రం నిద్ర రాకుండునట్లు కంటికి నీళ్ళు వ్రాసుకొనుచూ, ఎట్లో మేల్కొని యుండి, తెల్లవారువరకు నిలుచుండెను. ఇంతలో నొక యెలుక ఆగుడిలోని శివలింగముమీదికెక్కి అక్కడి "ప్రసాదము"ను తినుచుండెను. అంతట మూలశంకరుడందుకు విచారించి, ఈయపవిత్రతనుగూర్చి మరునాడు తండ్రికి దెలిపెను; లింగము నెలుకయెట్లు ధిక్కరించెనని సందేహము సూచించెను. "శివలింగమా యెలుకను ఆపలేనిమాట వాస్తవమే. అదియు మామూలు శిలయే; కాని పామరుల కేకాగ్రత భక్తి గల్గుటకై అందీశ్వరుని ప్రతిష్ఠ జరిగినట్లు భావింతుము. కనుక దానిని పూజింపుము" అని తండ్రి సమాధాన మిచ్చెను కాని, "ఈ మూర్తి పూజవల్ల లింగములోనే దేవుడున్నాడని, అది దేవుని ప్రత్యేకమూర్తియని, పామరులు భ్రమించుటలేదా? మూఢుల అజ్ఞానము పోగొట్టుట కుద్దేశించిన విగ్రహారాధన దానిని మరింత హెచ్చించుటకును కారణమైనది" అని ఆయన అవ్వృత్తిని విడువ నిశ్చయించి, విగ్రహారాధనమాని, నిర్మలజ్ఞానముకై కృషినారంభించెను; కనుక లింగార్చకవృత్తిజేయుతండ్రి యాజ్ఞని దూషించెను. రామమోహనునివలె, మూలశంకరుడు మనస్స్వాతంత్ర్యముకై తండ్రిని [illegible] దేశమంతట జ్ఞానార్జనకై తిరిగెను.

ఆయన గొప్పసన్యాసుల నాశ్రయించి, వేద శాస్త్రములందు మంచి పాండిత్యము సంపాదించి, విద్వాంసుడాయెను; వివాహం చేసుకోకుండనే, తుదకు సన్యసించి, "దయానంద సరస్వతి" అయ్యెను. అప్పుడు (ఉత్తర) మథురలోనుండిన శ్రీస్వామి "విరజానంద సరస్వతి" అను అంధసన్యాసి వేదార్థ విజ్ఞానమందఖండ పండితుడై యుండెను. హిందూసంఘములో వ్యాపించిన దురాచార మాలిన్యమును వేదజలముతోనే పోగొట్టదమనియెంచి, దయానందుడు విరజానంద సరస్వతియొద్ద మూడేండ్లు శిశ్రూష చేసి వేదముల యర్థమును పూర్తిగ గ్రహించెను. అంతట ఆయన కాశి, ప్రయాగ, కలకత్తా, బొంబాయి, పంజాబు మొదలగు ప్రాంతములంతటను హిందూసంస్కృతిని పరిశుద్ధము చేయుటకు, వేద విజ్ఞానమును ఆర్య సంస్కృతిని పునరుద్ధరించుటకును, చాల ఉపన్యాసములిచ్చియు పత్రికల బ్రచురించియు, మంచి శిష్యులకు బోధించియు, విశేషకృషి చేసెను. ఆయన తాను స్థాపించిన ఆర్యసమాజము కధ్యక్షుడు కాలేదు. మతప్రవర్తకు లధ్యక్షులు కాగానే, వారు అవతారమో ఈశ్వరుడో అని జనులు భావింతురు. అందుచే చాల హానిగల్గునని ఆయన సామాన్య సభ్యుడు గనే యుండెను. ఆయన ముఖ్యసిద్ధాంతము లిట్లున్నవి. "(1) పరమాత్మ జ్ఞానాధారుడు, సత్యానందస్వరూపుడు, సర్వజ్ఞుడు, సర్వవ్యాపి, సర్వశక్తుడునగు ఏకేశ్వరునే జ్ఞానులు భజింపవలెను. వేదములే ప్రమాణ గ్రంథములు; కాని ప్రతివారూ వాటి నిజమైన భావమును సరిగా అర్థము చేసుకోవలెను. అందరును సత్యవ్రతులై, అందరును అహింసాధర్మము లాచరించవలెను. ప్రతివారును ప్రేమతో వర్తించి, న్యాయమే జరిగింపవలెను. ప్రతివారును స్వలాభముకై కాక, సంఘమంతటి క్షేమముకు సర్వజన లాభముకునే కృషి చేయవలెను. నిజముగా సంఘక్షేమములోనే వ్యక్తిక్షేమమును చేరియుండును. జ్ఞానవ్యాప్తికి ప్రతివారును యత్నించవలెను."

"చాతుర్వర్ణ్యము గుణకర్మములబట్టియేగాని, జన్మనుబట్టి యుండకూడదు. మాంసాహారమెవ్వరును తినకూడదు, యజ్ఞములలోగూడ జీవహింస చేయకూడదు'' అని ఆయన ప్రచారము చేసెను. చాలమంది హిందువులు ఒత్తిడివల్లగాని, ఇతర కారణాంతరములవల్ల అన్యమతములలో ప్రవేశించుటను, హిందూధర్మము శిథిలమగుటనుచూచి, ఆయన హిందూ సంస్కృతిని రక్షించుటకు ఆర్యసమాజముద్వారా ప్రత్యేక కృషిచేసెను. ప్రస్తుతమున్న దురాచారములు వేదచోదితములు కావని, వేదము అహింసాసత్యములనే బోధించును అని కనపర్చుచు, ఆయన "సత్యార్థప్రకాశ" అను గ్రంథములో వివరించెను. సంస్కృతమందఖండవక్తయైనను, మనదేశపు సామాన్యభాషయగు హిందీద్వారానే దేశమంతట నీయన ప్రచారముచేసెను. జాతీయపద్ధతిని విద్య వ్యాపింపజేయుటకాయన గురుకులాశ్రమము స్థాపించి, అందు హిందీలో విజ్ఞానమును, చేతిపనులద్వారా కర్మవిద్యలనుగూడ, నేర్పించ నిశ్చయించెను.

సంస్కృతి రక్షణకు పరిశుద్ధికి జాతీయ స్వాతంత్ర్యమవసరిమనియు దయానందుడు గుర్తించెను; మొదటి "స్వరాజ్య" నిర్వచనమును దయానందసరస్వతి తన సత్యార్థప్రకాశలో చేసెను. ఆయన 1883 లో చనిపోగా, ఆయన సహచరులు శిష్యులు నిప్పుడా సంస్థలనడుపుచున్నారు. ఈ ముఖ్యసూత్రము లిప్పుడు గాంధిమహాత్ముని కార్యక్రమములో జేరియున్నది. ముఖ్యముగా హిందూసంఘమును పరిశుద్ధముచేసి సంఘటనము గల్గించి, జాతీయాభివృద్ధికిని ఆర్యసమాజము తోడ్పడుచున్నది. వీరి బోధనలును అహింసాసత్యములపైనే ఆధారపడి వాటివ్యాప్తి కుపకరించుచున్నవి. అయితే, ఆర్యసమాజమునారు సాగించు "శుద్ధి" ఉద్యమపు సందర్భములో అన్యమతస్థులతో సంఘర్షమును కలహములును కలుగుటయు కలదు. స్వమతస్థుల సంఖ్య హెచ్చునట్లు అన్నిమతములలో జేరిన హిందువులను మరల "శుద్ధి"జేసి హిందు

వులుగ జేయుటే శుద్ధియుద్యమముగ నున్నది. హిందూసంఘము లోనేయున్న నిమ్నజాతీయులను గోమాంసభక్షణ మద్యపానముల నుండి శుద్ధిచేసి, అస్పృశ్యతను పోగొట్టుటకెక్కువ కృషిచేయుట అహింసావ్యాప్తికి హిందూ సంఘబలముకును ఎక్కువ సహాయక మగును.

"రామకృష్ణ పరమహంస" శాఖవారును హిందూమత మందు ప్రేమతత్వమును వ్యాపింపజేయుటకు యత్నించినారు. శ్రీ "రామకృష్ణ పరమహంస" భక్తాగ్రేసరుడు. ఆయన కలకత్తా సమీపపు దక్షిణేశ్వరమందలి కాళికాలయమందర్చకుడై యుండెను; బాల్యమునుండి ఈశ్వర ప్రేమలోనే తన జీవితమును గడపెను. ఆయన భక్త్యుద్రేకము చుట్టుపట్లనుండు జనులందరికిని ప్రేమా వేశము గల్గించుచుండెను. ఆయన జీవితము నిష్కళంకము. ఆయన కాళీదేవికి జంతుబలి లేకుండజేసి, జీవహింసమాన్పించెను. ఆయన ఈశ్వరుడు భూతదయగలవారినే ప్రేమించుననని తరుచు బోధించెను. ఆయన నిగ్రహియై తరుచు సమాధిలోనుండుచు, దివ్యదృష్టిగల పూర్వపు మహర్షులవలె ఈశ్వరసాక్షాత్కారము చేయగల్గెను. అట్టి సమయములలో దేవుని ప్రార్థించునప్పు డాయన కానందము పొర్లి వచ్చుచుండెను. ఆయన విశేషవిద్య లేని అర్చకుడైనను, అత్యుదారుడై, అందరియందును సమభా వముగల్గి ఆత్మసాక్షాత్కారము జేయుచు మూఢవిశ్వాసముల నిరసించి, శిష్యులందరిలోను విశ్వప్రేమను గల్గించెను. ఈబ్రాహ్మ ణుడు నిరాడంబరజీవియై అన్నిజాతుల మతములవారికిని అన్నివిధ ముల సేవచేయుచుండెను; ఏకులమునను జనోపయోగి యగు కృత్యములేవియు నీచము కావని నిశ్చయించెను. పగలు తన శిష్యులాటంకముచేయుదురని, సాధనకై ఒకరాత్రివేళ ఆయన తోటి త్రొట్టి తీసుకొని, స్వయముగ పాకీదొడ్లు తుడిచివచ్చెను. ఆయన గొప్ప వేదాంతి, తన శిష్యులను గొప్ప వేదాంతులుగ జేసెను. ఆయన కోరికప్రకారం, వారిలో కొందరు మన దేశం

లోనేగాక దేశాంతరాలలోను సంచరించి, అక్కడ వేదాంత మతమును సర్వభూత సమత్వమును మానవ సోదరత్వమును బోధించియున్నారు. వారిలో ముఖ్యుడు శ్రీ వివేకానంద స్వామి. ఆయన రామకృష్ణుని సిద్ధాంతముల నములులోపెట్టి, వాటి నమెరికావగైరా విదేశములందును ప్రచారము చేసినారు. రామకృష్ణ సంఘపు కొందరు శిష్యులిప్పుడు చాలచోట్ల విద్యాలయముల స్థాపించి, ధార్మికవిద్యను వెదజల్లుచున్నారు. మనజనులలో కోట్లకొలది జనులు వృత్తిహీనులగుటవలనను జీవనాధారము లేకయు, అజ్ఞానులు మూఢులు, దుర్బలులు అయినారు; కొందరు తరుచు, చోరీ మొదలగు హింసాచర్యలకు సిద్ధమగుచున్నారు. కనుక రామకృష్ణమిషనువారు ఆర్యసమాజికులవలె తమ పాఠశాలలలో కర్మవిద్యల నేర్పుచు, స్వతంత్రము ఉపయోగకరమునగు జీవనముకు విద్యాస్థల దయారుచేయుచున్నారు. రామకృష్ణ వివేకానందుల మతము అద్వైతసిద్ధాంతములరీతినుండును. నీతివర్తనకును భూతదయకును ప్రాముఖ్యమిచ్చును.

వాయువ్య ప్రాంతమందు శ్రీరాధాస్వామివారును విశ్వ ప్రేమసిద్ధాంతము నుద్ధరించెను; బీదల యుద్ధరణకై ఆయనయు కర్మవిద్యలకు ప్రాముఖ్యమిచ్చి, ఆగ్రాదగ్గర "దయాల్బాగు" లో పరిశ్రమ నిర్మాణమేర్పర్చి, ఆధ్యాత్మిక ప్రేమకు బీదల నుద్ధరించు ఆర్థికసిద్ధాంతములతో సమన్వయము గల్గించెను. వీరి సమాజమునకు "సత్సంగ" మని పేరుకల్గినది.

19 వ శతాబ్ది ప్రారంభంనాటికి మన దేశపుస్థితి అల్లకల్లోలముగ నుండినదిగదా! రాజులు యోధులుగూడ నీతిరహితులై, స్వార్థపరులై తమలో వైరము పెంచుకొని విదేశీయులగు ఇంగ్లీషు వారితో ఘర్షించివారితో తోడ్పడిరి; నిరంతరము రక్తపాతము జరుగుచుండెను. సహగమనము, తగ్గులహత్య వగైరాలను కొందరు ఇతరమహారాష్ట్రరాజులు నిషేధించియుండిరి. కాని దరిమిలాను హిందువుల పరస్పర ద్వేషమును ప్రజాసహకారము లేకుండు



దయానందసరస్వతి.



రామకృష్ణపరమహంస.



వివేకానంద.

టయు, జనులను అరాజక స్థితికి తెచ్చినవి. ఇందుకు ఆంగ్లేయుల "చాతుర్య"ము తోడై, బ్రిటీషురాజ్యమేర్పడినది. ప్రజలయందు ప్రేమగల్గి ప్రజాక్షేమముకొరకే పాలించిన (ఇందోరురాణి) అహల్యాబాయి మున్నగువారు నిర్భయముగను శాంతముగను పాలించిరి. కాని చాలమంది ప్రజాప్రీతిని పొందకుండను, ప్రజాక్షేమము గమనించకను, పాలించి క్షీణించిరి.

19 వ శతాబ్దిలో కొందరు సంస్కర్తలు ఆధ్యాత్మికముగను దేశమును పునరుద్ధరింపబూనిరిగదా! దాని ఫలితముగ కొందరు విద్యావంతులలో కొంత అన్యోన్య ప్రేమ మరల అంకురించినది. అట్టి ప్రజాభిప్రాయబలము రాగనే "సహగమన"మువలె థగ్గు హత్యలు వగైరా దారుణ హింసాచర్యలను ప్రభుత్వము తొలగించిరి. "థగ్గు" లను తెగవారు కాళీదేవి తృప్తికని పిచ్చి నమ్మికతో ప్రయాణికులను ఏకాంతస్థలమందు బట్టుకొని, హఠాత్తుగా రుమాళ్ళతో గొంతుక బిగించి నులిమి చంపివేసి, ఆశవముల రహస్యముగ పాతిపెట్టి, ఆబాటసారుల ద్రవ్యమును హరించుచుండిరి. దేశ మశాంతస్థితిలోనుండెను. జనులలో భయము పిరికిదనము అవినీతి హెచ్చినందున, నిరాతంకముగ థగ్గులు అట్టి దారుణ హింసల జేయగల్గిరి. ప్రజలలో నైతికశక్తి మరల నారంభించగనే, ప్రజానాయకుల ఆందోళనవల్ల సంస్కరణ యారంభించెను. థగ్గుల దండులనుగూడ ప్రభుత్వమువారుపట్టి యణచివేసిరి. బానిస వ్యాపారమును నిషేధింపబడినది.

కాని, ఈసమయమునకు దేశమంతటను దాస్యము విదేశపాలనము నేర్పడి, తద్వారా కొత్త సమస్యలు వచ్చినవి. తమ స్వాతంత్ర్యము రాబట్టుకొనుటకు 1857_58 లో కొందరు యోధులు యత్నించిరి. కొన్ని నెలలు వారికి కొంత జయము గలిగినట్లుండి, తుదకాపోరు అణచివేయబడినది. అందు చాలమంది యోధులు మరణించిరి. ఆపరాజయమునకు కారణముల గమనింపదగును. కొందరు ఉద్యోగులు సిపాయీలు స్వార్థపరులై, తమ యధికారమునే మరల

స్థాపించుకొనుటకు ఆంగ్లేయుల పైన ద్వేషముసాధించుకొనుటకు ఆయుద్ధము సాగించిరి. అందుకు ప్రజాశక్తి తోడ్పడలేదట. జనులలో ఐకమత్యము యోధశక్తి శాంతత లేవు. ఆయోధులు కేవలం ఆంగ్లేయుల హత్యారూపమైన హింసాచర్యలనే చేసిరి. శాంతధిక్కారపద్ధతి యప్పటికిలేదు. ఆయోధులలో తగు సహకారమును మైత్రియులేదు. నైజాముసేన సిక్కులసేన వగైరా లాంగ్లసేనలకు తోడ్పడి, ఆయోధవర్గముల నణచివేసిరి. మరియు వారిలో ముస్లిములు కొందరు శత్రువులుకాని హిందువులను దొమ్మిగ హింసించిచంపిరి; ఇట్లే కొందరు హిందూయోధులు సరియగుఆదర్శము ఉద్దేశమును లేకుండచేసిరి. మతశాంతియు వారిలో చాలమందికి లేదు. ఆసిపాయీ యోధులు కొందరు యుద్ధసంబంధము లేని శాంత పౌరులనుగూడ దారుణముగ చంపి కేవలం హింసాతత్వపరులైరి. ఇట్లు విద్వేషము చెలరేగినందున, సహజముగ దానికి సాంఘికరూపమేర్పడి, హిందూముస్లిముల మత కలహములుకల్గినది. కొన్ని నెలలైనమీాదట దేశములోని ప్రజాభిప్రాయము వారికెదురుతిరిగి బ్రిటిషు ప్రభుత్వముకే తోడ్పడినది. ఆయుద్ధమువల్ల ప్రజలలో ఐకమత్యమును మన జనులలో సాంఘిక శాంతియు ఉన్నతాదర్శనములును లేవని తేలినది. ఆతిరుగుబాటు అణగి, బ్రిటిషుప్రభుత్వము దేశమంతటను బాగుగ దృఢపడినది. అంతట, పాశ్చాత్యుల వస్తువులు, పద్ధతులు, సంప్రదాయములు, ఆసంస్కృతి భావములును, మనదేశపు మారుమూాల గ్రామములలో గూడ వ్యాపించినవి. గ్రామజీవనములోగూడ చాల మార్పు గల్గినది. అందుతో అహింసా సిద్ధాంతపు అమలులో కొత్త సమస్యలేర్పడినవి. అయితే, అవి ప్రస్తుతపు జాతీయజీవనమును సంబంధించినవి. ఆకొత్త సమస్యలు విశాలములు; వాటిచర్చ వివాదాస్పదము. కనుక, వాటి పరిశీలన వేరుగను వివరముగను జరుగవలసియుండును.

---

# పండుగలు, వ్రతములు.



ప్రతిదేశపు పండుగలు ఆజాతి సంస్కృతితత్వమును సూచకములు మన భారతీయులలో చాల పండుగలు వ్రతములు చేయు ఆచారమున్నది. అవి ధార్మికము లను భావన యేర్పడినది. పండుగలు తరుచు యేదో పూర్వవృత్తాంతముకో ఐతిహ్యముకో స్మారకములు. ఆచరణలో, ఈపండుగలలో ఉత్సవములు వేడుకలు నే కనబడును; అసలు భావార్థములు చాలమందికి వెల్లడికావు. వాటిని, మూలసూత్రములను, సంగ్రహముగ మన మిప్పుడు పరీక్షింతము.

## —: 1. శ్రీరామనవమి :—

సంవత్సరాదిమొదలు నవమివరకు శ్రీరామనవరాత్రపు ఉత్సవములు జరుగును. చైత్రశుద్ధనవమి శ్రీరాముని జన్మదినము. (సీతారాముల వివాహోత్సవమును చైత్రశుద్ధనవమి నే కొందరు జరిగింతురు.) శ్రీరాముడు చారిత్రకముగ మధ్య దక్షిణహిందూదేశముల క్రూరజాతులను జయించి, ఆసేతుహిమాలయ మేకజాతిగ జేసెను; అనగా ఏకజాతిత్వ మేర్పడినది; కాని సామంతులగు సుగ్రీవవిభీషణుల ప్రాంతాధికారమును భంగము కల్గించలేదు; నైతికంగా, శ్రీరామునిది ఆదర్శజీవితము. ఆయన ధీరోదాత్తుడగు ఉత్తమపురుషుడు; ఆయన 'పురుషోత్తముడు' అనగా విష్ణువు అవతారమనియు చెప్పబడుచున్నది.

ఆధ్యాత్మికముగ, రామాయణకథలో జీవాత్మ సత్వగుణసహాయముతోను జ్ఞానాదిసద్గుణములతోను, రజస్తమస్సుల జయించి, పరమాత్మను సాక్షాత్కరించుట అంతరర్థమనియు విద్వాంసుల అభిప్రాయము; మరియు ఆసుర రాక్షసప్రకృతిపై నదైవప్రకృతి విజయమునకును చిహ్నము. శ్రీరామజీవిత మన్నివిధములను ప్రాముఖ్యము గలది. శ్రీరామనవమి ఉత్సవము జరుపుటలో, ఆరోజున శ్రీరామకథను స్మరించుటలో, పైన చెప్పిన ధార్మికవిశేషములను మనము జ్ఞప్తికి తెచ్చుకొనుచున్నాము.

## —: 2. వైశాఖపూర్ణిమ :—

ప్రతిసంవత్సరం వైశాఖమాసపుపౌర్ణమిరోజున ఉత్సవము జరుపు రివాజుకలదు. చాల గ్రామములలో ఆరోజున విష్ణుదేవాలయాలలో స్వామివారి కళ్యాణోత్సవముజరుగును; రమారమి అన్నిగ్రామాలలోను వైశాఖపూజచేసి, యోగ్యులకు విప్రాదులకు ఫలాదులిచ్చి సత్కరింతురు. ఆచతుర్దశి ప్రహ్లాదునికి నరసింహుడు సాక్షాత్కరించిన దినము. మరియు వైశాఖపూర్ణిమరోజుననే గౌతమబుద్ధుడు గయాక్షేత్రమందు జ్ఞానోదయముగల్గి, బుద్ధుడై, అహింసాధర్మమును బోధించుట కారంభించెనట. కనుక ఆరోజు అహింసాసిద్ధాంతపు ప్రాముఖ్యమును జ్ఞాపకమగు దినము.

## —: 3. శ్రావణపూర్ణిమ :—

ప్రతిసాలున శ్రావణమాసపుపౌర్ణమిరోజున ద్విజులు కొత్తజందెములు వేసుకొందురు. ఇది విజ్ఞానమునకు, అధ్యయనమునకు, అహింసాధర్మమునకును సూచకము. అహింసాప్రేమములు బ్రాహ్మణుల ముఖ్యధర్మముగదా ! జందెపునూలు తాము స్వకీయముగ వడకినదిగ నుండవలెనని సంప్రదాయము. కాని, ఈపండుగరోజునాటి తంతు మరికొంతయున్నది. ఆరోజు ఉదయమే ఒకజపము చేయవలెను. గతసంవత్సరంలో అంతవరకు తనప్రవర్తనలో కల్గినలోపములు తలచుకొని, ఆలోపములు తన కామక్రోధములవల్లగల్గినవి, అనగా దురాశ హింసాభావమును ఆలోపములకు కారణములు, అని ఉదయం 108 సార్లు ఆమంత్రము 'కామోఽకార్షీత్ మన్యురకార్షీత్ నమోనమః' అని ఆరోజున తప్పక జపించవలెను. ఆరోజున విజ్ఞానపూజగ కాండర్షితర్పణమును, అధ్యయనహోమమును జేయుదురు. ముఖ్యవేదవేదాంగములను ఆరోజున అందరును కలసి పఠించి, అందుచెప్పిన నీతిని ధర్మమును జ్ఞప్తికి తెచ్చుకోవలెను. మరియు అందరును మరునాడు పవిత్రమగు గాయత్రీమంత్రమును 1008 సారు లుచ్చరించవలెను. ఇదినిత్యగాయత్రికిత్రోడు. శ్రావణికంగము. "మన

యందరికిని మంచిజ్ఞానాదులను ప్రసాదించు సృష్టికర్త (లేక సూర్యుని) యొక్క మహాతేజస్సును సేవింతము" అని గాయత్రీశబ్దార్థము.† మనయందరి జ్ఞానాదు లీశ్వరుని తేజస్సునుండియే వచ్చుచున్నవి, కనుక, ఈశ్వరప్రీతికరము లోకక్షేమకరముగ సత్ప్రవర్తన గల్గియుండవలెనని గాయత్రి సూచించుచున్నది.

కామక్రోధములు తగ్గించి, అహింసాపరులు కావలెనని, పవిత్ర మగు ఈశ్వరతేజస్సు సేవించి, మనలో సద్గుణముల వృద్ధిజేసుకొనవలె ననియు, శ్రావణపౌర్ణమిచర్యలు ఏటేటను మనకు జ్ఞప్తికి తెచ్చును.

—: 4. కృష్ణాష్టమి :—

శ్రీకృష్ణుని జయంతి శ్రావణబహుళాష్టమి (వైష్ణవులు సింహ బహుళమున రోహిణి నక్షత్రప్రవేశమున) జరిగింతురు. ఇది శ్రీకృష్ణుని పుట్టుటకు జ్ఞాపిక. పూర్వము కంసుడను క్రూరరాజు చాలమంది ననేక విధముల బాధించెను. హింసాత్మకుల కెట్లో కీడు మూడును; కనుక, తన సోదరియగు దేవకీదేవికి 8 వ శిశువగువాడు తనను చంపునని ఆకాశవాణి ప్రచురించెను. ఆదుష్టప్రవృత్తిని మార్చుకొనుటకు బదులుగ కంసుడు తనసోదరిని ఆమెభర్తను ఖైదులోనుంచి, ఆమెశిశువులందరిని చంపుచు, తన హింసాచర్యల హెచ్చించెను. అష్టమగర్భమగు మోక్షదేవుడు జైలు లో దాస్యమందే జనించెను; కాని, ఈశ్వరేచ్ఛవలన కంసునికి వశము కాకుండ బృందావనముకు మార్చబడి, తరువాత కంసు డెన్నిమారణోపా యములు జేసినను లొంగక, హింసాచర్యలజేయు కంసాదులనశింపజేసెను. భారతయుద్ధములో శ్రీకృష్ణుడు యోధుడు కాలేదు, కాని యుద్ధరంగమం దర్జునుని ప్రోత్సహించెను. మహాభారతయుద్ధముకుముందు ఆయన స్వయ ముగ సంధియత్నము చేసెను. అది కుదరనప్పుడుదుష్టులు లోకకంటకు

---

† ఈగాయత్రీమంత్రములో ఇంకను చాల గూఢార్థమున్నదని విద్వాంసుల అభి ప్రాయము. "ఓంభూర్భువస్సువః, ఓంతత్సవితు ర్వరేణ్యం భర్గోదేవస్యధీమహి, ధియో యోనః ప్రచోదయాత్." అనిమంత్రము.

లునగు దుర్యోధనాదులజయించుట కప్పటిసంప్రదాయప్రకార మాయన యుద్ధముకు ప్రోత్సహించి, అర్జునునికి సారథియైనాడు; కాని ఆయనబోధ యగుగీతలో అహింసాప్రబోధమున్నది. శ్రీకృష్ణజయంతి శ్రీరామనవమి పండుగవలె ఆదర్శజీవితముకు సత్ప్రవర్తనకు బోధకముగ నుద్దేశించినది.

శ్రీకృష్ణుడు శైశవమునుండి గ్రామపరిసరములలో పెరిగి బాల్యమునుండి గోసంరక్షణచేయుట విశేషము. ఇంద్రుడు గోపజాతిని వశపర్చుకొన దాడిసల్పగా శ్రీకృష్ణుడు గోవర్ధన మెత్తి గోవులను గోపాలజాతిని రక్షించెనని, శ్రీకృష్ణుడే మొదట గోమేధము మాన్పించెనని, లోగడచూచినాము. గోక్షీరము ఆరోగ్యకరమగు సాత్వికాహారము; గోవులు అహింసాభావప్రపమూర్తులు. మనదేశముకు గోవులు ముఖ్య సంపద; కనుకను, గోపాలకృష్ణుని జన్మదినము పవిత్రమైనది.

—: 5. వినాయకచవితి :—

ఇది గణేశునికి స్మారకము. పూర్వం 'గణం అనగా' ప్రజాసత్తాకసంఘమనియు అర్థముండేది. గణేశపూజయనగా ప్రజానాయకుని గౌరవించుటయనియు అర్థము. గణేశుడు గజముఖుడందురు. అనగా గంభీరుడు, సాధువు, అహింసాస్వరూపుడు. ఆయన ఆకారము ఓంకారస్వరూపమనియు ప్రతీతి. ప్రతికార్యపు అరంభమందును గణేశపూజ చేయుదురు.

పూర్వ మొకప్పుడు వినాయకుని విగ్రహపుష్టిచూచి, అసూయతో చంద్రుడు పరిహసించెనట; అంతట పార్వతి చంద్రుని శపించెనందురు. పరిహసించుట వాగ్రూపమగుహింస; కనుక క్రియాహింసయేగాక మనోవాగ్రూపమైనహింసయు కూడదనిసూచించు ఈకథ నారోజున అందరు చదివి విందురు. ఆరోజున యితరులు తిట్టినను, హింసించినను, శాంతితత్వము నలవర్చుకొని, అహింసాపరత్వ మభ్యసింతురు.

—: 6. నవరాత్రి, విజయదశమి :—

ఆశ్వయుజ శుద్ధ పాడ్యమి మొదలు దశమివరకు ఉత్సవదినములు. విజయదశమి శ్రీరాముడు రావణుని సంహరించి విజయమొందిన రోజు

దురు. అనగా ఆరోజు తామసప్రధానమైన రాక్షసప్రవృత్తివినాశముకును
భారతదేశ మొకేమహాసామ్రాజ్యమై ఏకజాతీయత కారంభమైనందున
కును జ్ఞాపకము. అది సాధారణముగ మనరాజులు స్వదేశరక్షణకై
బయలుదేరురోజు. అనగా స్వగ్రామరక్షణకు స్వరాజ్యపురక్షణకు మన
బాధ్యతను ఆరోజున మనముస్మరింపవలె. మనక్షత్రియులిప్పుడు స్వదేశరక్ష
ణచేయలేకున్నను ముందట్లురక్షింపగల్గుటకైనను, ఆనవమిరోజునజరుగు
ఆయుధపూజ జ్ఞాపికకావలెను; వర్షకాలమై, ఇక జైత్రయాత్రకారంభ
మనియు సూచకదినము. గ్రామములపొలిమేరరక్షణకై ఆరోజున దేవు
నూరేగించుక పొలిమేరకు వెళ్ళుదురు. పూజకు 'ఆయుధములు' అనగా
శిల్పపుపనిముట్లు అని కొందరందురు. అట్టి శిల్పముతో నేర్పడిన చిత్రవిచి
త్రమగు బొమ్మలను బాలు రారోజులలోచేర్చి పూజింతురు. అట్టి యా
చరణలు శిల్పకళలో రుచికల్గించును. ఇదిగాక గౌతమబుద్ధుడు విజయ
దశమిరోజుననే పుట్టెను. అహింసాతత్వస్థాపకుడగు బుద్ధదేవుని జన్మదిన
ము మనయందరికిని పరమపవిత్రము.

పూర్వము మహిషాసురు డను క్రూరరాజు లోకకంటకుడై తన
హింసాచర్యలతో జనుల వేధించుచుండెను. కాళిశక్తియతనితో ఈ 9 రో
జులు పోరి, నవరాత్రులైనమీదట విజయదశమిరోజుననే మర్దించెను.
అనగా ఆసురశక్తిని దేవశక్తి జయించినరోజు. (వీటిస్వభావము గీతాచర్చ
97 వ పుటలోచూచియున్నాము.) కనుక ఈరూపముగను విజయదశమి
అహింసాతత్వపువిజయముకే స్మారకము. వ్యవసాయకార్యములు జరిగి
కొన్ని మొదటిపంటలందుటకును విజయదశమి చిహ్నము. మనదేశము
కృషిప్రధానము. పంట శాంతజీవనము కాధారము. కనుక కృషివిజయ
ముకును, గ్రామాభివృద్ధికినిగూడ, ఈపండుగచిహ్నమే.

ఈనవమి మహార్నవమి. ఈతుదిమూడురోజులును సరస్వతికి ప్రతి
నిధిగ బ్రాహ్మణు లందరు తమగ్రంథముల బూజింతురు. ఆపూజ విజయ

దశమితో అంతమగును. యుక్తజ్ఞానమును అహింసావ్యాప్తికి తోడ్ప డును. సరస్వతీపూజాదినములు పండుగరోజులగుట న్యాయ్యమే.

శ్రీరాముని ప్రపితామహుడగు రఘుమహారాజు పూర్వము దేశ మంతను జయించి, తనకు వచ్చిన కానుకలను నిలువధనమునుగూడ విశ్వజిద్యాగమున పంచిపెట్టెను. అప్పుడు కౌత్సు డను విప్రకుమారుడు గురుదక్షిణకై యాచింపగా, అతనికి 14 కోట్ల స్వర్ణముల సమకూర్చుటకై, కుబేరునిపైకి రఘువు దాడివెడలెను. అంతట కుబేరుడు విజయ దశమిరోజున చాలసొమ్ము ఒకజమ్మిచెట్టుపై వర్షించెనట. అందు కౌత్సునికి 14 కోట్లు పోగా, మిగిలినసొమ్మంతయు రఘుమహారాజు ప్రజలందరకు పంచిపెట్టెనట. సొమ్ము కావలసినప్పుడు ప్రజల హింసింపక రాజు కుబేరులయొద్దనే సొమ్ము దెచ్చి ప్రజల కిచ్చిన దీరోజున గనుక రాజు ప్రజలపై ప్రేమను, త్యాగమును చూపినరోజు. ఇట్లనేకవిధములుగ ఇది అహింసాప్రియులకు ఉత్సవదినము.

## —: 7. దీపావళి :—

దీపావళిరోజున చాలదీపముల బెట్టి టపాకాయలు కాల్చుచున్నాము; ముందుగ అభ్యంగనము చేయుదుము. అతిదుష్టుడై చాల మంది స్త్రీల చెరబట్టి క్రూరుడైన నరకాసురుని శ్రీకృష్ణులు చంపినందుకు యీపండుగ యేర్పడెనందురు. చాలచోట్ల ఆకథ నప్పుడు పఠింతురు. నరకునివధవలన ఆబంధితస్త్రీలకుగల్గిన స్వాతంత్ర్యము కలది జ్ఞాపిక. ప్రజలకు శాంతియు, భద్రతయు, ఏర్పడినందు కుత్సవము చేయుట సహజము. పూర్వము బలిచక్రవర్తి ఉదారపాలనలో మనదేశమందు పంచ మహాపాపములు లేకుండ సుభిక్షముగ నుండెనట. అప్పుడు ఆశ్వయుజ అమావాస్యరోజున బలిచక్రవర్తి తన సామ్రాజ్యమునంతను విష్ణువు కోరికప్రకార మాయనకు సమర్పించివేసెను. అదే వామనుని త్రివిక్రమావతారము. బలిచక్రవర్తి మహాత్యాగమునకు సంతోషించి సాలీనా అందుకు జనులు ఉత్సవము చేయవలెనని విష్ణువు శాసించెనట. అప్పుడు

త్రివిక్రముడు మూడడుగులతో లోకమంతట వ్యాపించె నందురు. ఇక్కడ వామనుడు అనగా మానవజాతి అనుకొన్నచో, మొదటి అప్పటికి మనవారికి తెలిసిన నరజాతులు మూడు నేకమై లోకమంతటను వ్యాపించిరను భావము గల్గును అనగా 'దీపావళి' మానవజాతి పరస్పర ప్రేమ గల్గి సంతోషముతో వ్యాపించినందుకు సూచకము.

పూర్వము వ్యాపారాదులకై దూరప్రయాణములు జరిగి ఆశ్వయుజ అమావాస్యకు జనులు స్వస్థలము జేరి మిత్రుల కలుసుకొని ప్రేమోత్సవము చేయుచుండిరనియు చెప్పుదురు మరియు ఆశ్వయుజం వరకు వర్షము లుండి గ్రామములలో బురదవల్ల నరకమువలె దుర్వాసన లేర్పడెను. ఆనరకము అనగా వ్యాధులు దుర్వాసన లేకుండుటకు అభ్యంగముద్వారా దేహమును, బాణసంచాద్వారా వాయువును, శుద్ధిచేయుచుండిరట. ఆరోజున పురాణశ్రవణంద్వారా అందరు సద్బోధలొందుటయు కలదు. దీపకాంతి జ్ఞానమునకును సూచకము; కనుక ఆరోజున దీపములు పెట్టుట. ఇది శ్రీకృష్ణుడర్జునునకు గీత బోధించిన రోజునట. ఇది లోకమునకు కాంతి యేర్పడినట్లు సూచన యనియు ఒకరు సూచించిరి. గీతలో పొడుగునను అహింసాతత్వము బోధింపబడిన దని లోగడ చూచియున్నాము.

—: 8. నాగచతుర్థి :—

ఆంధ్రద్రావిడ ప్రాంతములలో కార్తిక శుద్ధ చవితిరోజున పాములకు పాలుపోయుట కలదు. ఈయాచారమును సామాన్యజను లెక్కువ పాటింతురు. దక్షిణదేశములందు నాగసర్ప విగ్రహములు దేవాలయములున్నవి. అక్కడ పూజజరుగును; ఉత్తరదేశంలో పంచమిరోజున యుత్సవము చేసి నాగపంచమి కుత్సవము జరుపుదురు. ఇది అసలులో కేవలం ద్రవిడజాతి ఆచారమని, పూర్వము వీరిలో సర్పపూజ విశేషముగా నుండేదని, అది భయజనితమని, కొందరిభావన. కాని, ప్రాచీనార్యగ్రంథములలోను సర్పములకు కొంతస్థానమిచ్చినారు. శేషసర్పము భూభారము

వహించునని, విష్ణువు నాగశయనుడని, శంకరుడు సర్పభూషణుఁడని, పురాణగాథలున్నవి.

సర్పములును నిజముగ మన మనుకొనునంత దుష్టములుకావు. అవి సాధారణముగ నరులజోలికిరావు; తమ ఆహారముకొరకే అవి క్రిములు వగైరాల బట్టుకొనును. మనుష్యులు వాటికంటబడినను అవి తప్పించుకొనుటకే ప్రయత్నించును. నరులు వాటిని చూచి ఆందోళన పడి వాటిని హింసింపజూచినప్పుడు, తమకు ప్రాణభయము కలిగినప్పుడు మాత్రం అవి జనులకు కాటువేయును. ఆత్మరక్షణనిమిత్తం భగవంతు డిచ్చిన విషము నట్లవి యుపయోగించుట సహజమే. అహింసాపరులగు నరులను పాములు బాధింపవందురు పూర్వకాలమందు ఋషులు సన్న్యాసులు నెందరో సర్పమయమగు మహారణ్యములలో తపస్సుచేయుచుండినను, వారికి సర్పబాధ యంతగా కల్గినట్లు కనబడదు. ఇప్పటికిని దక్షిణ దేశపు నాగర్కోయిల్ మొదలగు దేవాలయముల గర్భగుడివద్ద గొప్ప త్రాచులున్నవనియు, కాని అవిమనుష్యులనెవరిని బాధింపవనియు, చెప్పుదురు కొందరికి పాములు పులులుగూడ మచ్చికయై సాధువులుగ చరించుట చూచుచున్నాము. ప్రకృతిలో కేవలం హింసాపరమగు ప్రాణులు లేవనియు, హృదయపూర్వకమైన అహింసాపరత క్రూరులన బడు జీవులలోను అహింసాతత్వమును కల్గించుననియు, కనుక అన్నిభూత ములందును నరులు దాక్షిణ్యముగల్గి యుండవలెననియు, నాగచతుర్థి సూచించును.

## —: కార్తికపూర్ణిమ :—

కార్తికమాసపు పౌర్ణమిని వ్రతదినముగ నెంచుదురు. ఆరోజున కొందరు ఉపవాసముండియుందురు, అందరుచు పూజ దీపారాధనసేయుదురు. వైష్ణవులీరోజు ప్రత్యేకపవిత్రముగ నెంచుదురు ఇది ప్రబంధ పఠనపు చివరరోజు అని సంప్రదాయము. దీనిని కొందరు కృత్తికా నక్షత్రం రోజున మరికొందరు [illegible] అనగా రోహిణిరోజునను జరిగింతురు.

ఇందొకవిశేషము. ఈ కృత్తికరోజున ఆళ్వారు లనబడు ద్రావిడ ఋషులలో నొకనీచ (ఈడిగ) కులస్థుడగు తిరుమంగయాళ్వారు పుట్టిన రోజు. ఈయన గొప్పవిష్ణుభక్తుడు. తిరుప్పాణాళ్వారు అను మహొకఋషి యీ రోహిణి రోజునే పుట్టెను. ఈయన కేవలం నిమ్నజాతీయుడు, హరిజనుడు, మహాభక్తుడు; తన విశ్వప్రేమ భక్తి ప్రభావమువల్ల మధుర కవియను గొప్ప బ్రాహ్మణ విద్వాంసునిచే గూడ పూజింపబడి, ఋషి యనిపించుకొన్న మహనీయుడు; ఈయన రచించిన స్తోత్రములను వైష్ణవులు విష్ణ్వాలయములలోను, తమగృహములలోను, దేవారాధనలో గూడ, కీర్తించుచు గౌరవింతురు. అహింసకు ముఖ్యమగు, సర్వవర్ణ సామ్యముకు, సాంఘికమైత్రికిని, అస్పృశ్యతానివారణకు అట్టి మహనీయుని జన్మదినోత్సవము తోడ్పడును.

## —: 10 ముక్కోటియేకాదశి :—

సాధారణముగ ఏకాదశిరోజున ఉపవాసముండి దీక్షతో హరిభజన చేయవలెనను సంప్రదాయమున్నదిగదా. అహింసనభ్యసించువారు ఇంద్రియనిగ్రహముగల్గి యుండవలెను. పక్షముకొకనోజు నిరాహారులై, ఏకాగ్రులగుట అహింసాప్రవృత్తికి మంచిసాధకము. కాని, ధనుర్మాసపు శుద్ధైకాదశి ముక్కోటియేకాదశి అందురు. అది ఎక్కువపవిత్రమట.

ధనుర్మాసము శీతకాలమందువచ్చును. అది మనమార్గశీర్షముకు సుమారుగ సరిపోవును. మన యుష్ణదేశమందు మార్గశిరము ఆరోగ్యసాధనకు మనస్సును స్వభావమును పవిత్రము చేసుకొనుటకును చాల మంచిది. మాసములన్నిటిలో మార్గశిరములో నేను హెచ్చుగనుందునని శ్రీకృష్ణుడు గీతలో చెప్పెను.

† మాసానాం మార్గశీర్షోహం (గీత 10-35)

ముక్కోటియేకాదశిలో విశేషముండుటకు కారణముగ రుక్మాంగదాది గాథలు చెప్పుదురు. కాని తెలియదగిన విశేషమింకొకటియున్నది. ద్రవిడఋషులలో ముఖ్యుడగు 'నమ్మాళ్వారు' (శఠకోపయతి) ఆరోజున వైకుంఠసాయుజ్య మొందెను. ఈయన శూద్రుడు; సహజప్రజ్ఞచే గొప్ప జ్ఞానియై విద్వాంసుడైనాడు. ఆయన తమిళములో వ్రాసిన 'తిరువాయిమొఝి' ఇత్యాదులలో వేదసారమును భాగవతసారమునుగూడ యిమిడి భక్తిప్రేమలు నిండియుండును. ఆమహాగ్రంథమారోజున శ్రీరంగాదులలో చెప్పబడును. అది అందరికిని సత్ప్రవర్తన బోధించును.

## —: 11. మకరసంక్రాంతి. :—

మకరసంక్రాంతి సూర్యుని ఉత్తరాయణ ప్రవేశము కారంభము. అప్పుడు సమృద్ధిగ పొంగలిమొదలగు మధురపదార్థములజేసి విందు చేయుదురు. ధనుర్మాసమందు జనులు ప్రేమభరితులై భక్తితో దేవునికి విశేషభజన చేయుటగలదు. † అది యారోజున సమాప్తియగును, ఆరోజున పశువులకు పక్షులకుగూడ చిత్రాన్నము పెట్టు ఆచారము కలదు. జంతువులకు బాధలేకుండ రెండురోజులు బండ్లువగైరాలు నిలిపివేసి భూతదయ నందరును ఆపండుగలో కనపర్చవలెను. అయితే, ఆసంగతి మరచి, ఇప్పుడు చాలమంది పామరులు కోడిపందెములు వగైరా దుశ్చర్యలకు లోబడుచున్నారు.

## —: 12. శివరాత్రి. :—

మాఘబహుళ చతుర్దశిరోజున మహాశివరాత్రి; ఆరోజున శివభక్తులు ఉపవసించి, శివలింగపూజచేసి, ఆరాత్రి జాగరణచేయుదురు. పూర్వమొకప్పు డారోజున ఈక్రింది వృత్తాంతము జరిగెనని పురాణగాథ. ఒకవ్యాధుడు అడవిలో వేటాడి, ఆమృగమాంసముతో కుటుంబము పోషించుచుండెను. ఒక మాఘబహుళ చతుర్దశిరోజున అత డడవినంతను గాలించినను జంతువేదియు దొరకలేదు. ఎండవేడికి డస్సి, అతడు

† ఇది వైష్ణవసంప్రదాయములో ముఖ్యము.

తిరిగి వచ్చెను; రాత్రియైనది. వట్టిచేతులతో నింటికిపోలేక, ఆరాత్రి అత డడవిలో నొక మారేడుచెట్టెక్కి, మృగాలనిమిత్తం, పై నుండి ఆకులను జారవిడుచుచుండెను. ఆబిల్వపత్రముల దినుటకొక యాడలేడి వచ్చెను. దాని నతడు వేటాడబోయెను. అప్పు డాలేడి పైకిచూచి, వద్దని యరచెను, వ్యాధుడు "నాకుటుంబపోషణ కీవేళ నీమాంసమే ఆహారము, కనుక నిన్ను చంపుదును" అనెనట. ఆలేడియు నరభాషతో "నాకును కుటుంబమున్నది, వారికష్టస్థితిచూచి, వారి నొప్పజెప్పి వచ్చెదను, నన్ను నమ్ముము" అని జవాబిచ్చెను. అత డాశ్చర్యపడి, ఆలేడి మాటనమ్మి, రాత్రివచ్చున ట్లొప్పించి, దానిని వదలెను; అదివెళ్లెను. పిమ్మట వ్యాధుడు సందేహగ్రస్తుడై క్రిందికి చూచుచుండెను. అర్ధరాత్రికక్కడ దాని మగలేడివచ్చెను. దానికిని అతడు ఆకును జారవిడిచెను. దానిని తినుటకది రాగానే, అతడు విల్లునెత్తెను; ఆమగలేడియు "నాకుటుంబపుస్థితిని సరిచూచి, ఉదయంలోగా వత్తును. ఇప్పటికి విడువుము." అని ఒప్పించి, తన వసతికేగెను. వ్యాధు డట్లేమేల్కొని వేచియుండెను. మూడుజాములవేళ పిల్లలేడి వచ్చెను. మరల వ్యాధు డట్లే చేయగా, ఆపిల్లయు తల్లిదండ్రుల నొప్పించి ఉదయములోగా వత్తునని వెళ్లెను. తెల్లవారబోవుచున్నది. బాసచేసినలేళ్లు యింకనురాలేదని వ్యాధుడు చూచుచుండెను. ఆమూడు లేళ్లును (ఒకేకుటుంబమువిగనుక) కలసి ఆవ్యాధునొద్దకు తూర్పు తెల్లవారుచుండగా వచ్చెను. స్వయముగ తమదేహము లర్పించుటకు తమ పాలిటి యముడగు తనవద్ద కవి రాగానే, ఆబోయహృదయము కరగి, మనస్సు మారినది. వాటినికొట్ట చేతులాడక,. అతడు 'నేనుచంపన'ని, తనమొగము రెండవవైపు త్రిప్పుకొనెను. ఇంతలో రాత్రియంతయు తన రాకకెదురుచూచి, ఏమిప్రమాదము జరిగెనోయని ప్రేమచే అడవిలో వెదకుచున్న తనభార్యయు ముద్దుకొడుకును అక్కడజేరి, ఈవైపునవచ్చి చేరిరి. అంతట వ్యాధునికి అహింసాతత్వము పూర్తిగా బోధపడెను; తన కుటుంబమువంటిదే ఆలేళ్లకుటుంబము నని తట్టినది. తమ్ముచంపి తినుమని

తేల్లుకోరినను. అతడు నిరాకరించెను. ఈస్థితిలో మహాదేవుడు సాక్షాత్క రించి, ఆరెండు కుటుంబములను విమానముపై నెక్కించుకొని, శివసాయుజ్య మిచ్చెనట. చిన్న జంతువులకును గల్గిన ఆత్మార్పణబుద్ధిని అట్టిస్థితిని చూచినప్పుడు వ్యాధులవంటి క్రూరనరులకును అహింసాభావమేర్పడి హృదయము మారినదని శివరాత్రికథ తెలుపుచున్నది. అట్టిపరిణామమును స్మారకమగు శివరాత్రి పరమపవిత్రమనియెంచుట న్యాయమేగదా.

ఇట్టివార్షికోత్సవములేగాక, అప్పుడప్పుడు జరుపు సత్యనారాయణవ్రతమువంటివియు సత్యము అహింసాభావము ప్రబోధించునవే.

ఇట్లే మహమ్మదీయులకును సాలీనా కొన్ని పండుగలున్నవి. వీటి ఉద్దేశము గమనింతము.

—: 13 మీలాదున్నబి. :—

వీటిలోనొకటి 'మీలాదున్నబి'. ఇది మహమ్మదు ప్రవక్తకు స్మారకము (మహమ్మను జననతిథినే మరణము జరిగెనందురు, కనుక అది జయంతి, వర్ధంతియు, అగును) ఆరోజు మొదలు 12 రోజులు పవిత్ర దినములను కారణమున 'బారావఫాత్' అనియు చెప్పుదురు. మతస్థాపకులందరు ఉదారులై, లోకక్షేమకరమగు సిద్ధాంతములే బోధించినారు, కనుక వారుపుట్టినరోజులు పవిత్రముగ నెంచుట సహజమే.

—: 14 బక్రీదు. :—

ముస్లిముల మరొకపండుగ 'బక్రీదు ఇది హిందువులలో యజ్ఞమువలె' త్యాగసూచకమగు పండుగ. పూర్వమొకప్పుడు అరేబియాలోని, ఇబ్రహీం అను ప్రవక్తకు రాత్రి కలలో దేవుడు ప్రత్యక్షమై, ఆయనకు ప్రియమైన ప్రాణిని యాగముచేయుమని కోరెనట, ఆయెడారిదేశంలో అన్నిటికన్న ప్రియము ఒంటె; దానిని ఇబ్రహీం యాగపశువుగ జేసి, దానిమాంసముతో బీదలకన్నముపెట్టెను. కాని, తరువాత రాత్రి కలలో "ఒంటెకన్న నీకు ప్రియప్రాణి నీకొడుకు 'ఇస్మాయిలు'; అతని నర్పింపుము" అని దేవుడు సూచించెను.

అంతట భక్తాగ్రగణియగు ఇబ్రహిం విచారించి, కొడుకుతో సంప్రతించెను. "దేవు డట్టియజ్ఞము కోరెను గనుక అవశ్యం అట్లు చేయుము, ఆత్మార్పణకు నేను సిద్ధము" అని కొడుకు జబాబిచ్చెను. అంతట పొర్లివచ్చు కన్నీటి నాపుకొని, కొడుకు నతడు శాస్త్రప్రకారం యజ్ఞపశువుగ వధించ నేర్పర్చి, అతని మెడపైన ఇబ్రహిం కత్తి విసరెను. కాని, అది తెగలేదు. అంతట ఆశ్చర్యపడు ఆభక్తులిద్దరికి దేవుడు ప్రత్యక్షమై, "మీ త్యాగపరతను పరీక్షించుటకే ఇట్లు కోరితిని. నేను సంతోషించితి. ఆత్మార్పణకు సూచకముగ సాలీనా ఈరోజున మీ రేదో శుభ్రమైనజంతువును యజ్ఞముచేసిన చాలును." అని జబాబిచ్చెనట* ఆప్రవక్తల మహాత్యాగము ధ్యానించి యనుకరించుటకు, సాలీనా ఆరోజున మేకను యజ్ఞముచేసి దాని మాంసము చాలవరకు నిరాధారులకు ఆహారముగ నిత్తురు. వేదకాలమం దార్యులవలె నేటికిని ముస్లిములెప్పుడును మాంసాహారులు. 'ఆయెడారిలో గింజలపంటలేదు.' కనుక, ఆరోజున బీదలకన్నదానము కంగముగ ముస్లిములు జంతుయజ్ఞము చేయుచున్నారు. అయితే, మనదేశమందు బక్రీదురోజున ముస్లిములు గోవధచేయుట, అందుకు హిందువు లాక్షేపించుట, అంతట సాంఘికకలహము, పరస్పర హింసలు, జరుగుచున్నవి. ఇందుకు ఉభయసంఘములలోను ఇప్పుడున్న విరోధభావము కారణము. 'బక్రీదు' శబ్దపు అర్థము 'మేకను యజ్ఞము చేయుట' ఇతర ముస్లిముదేశాలలో ఏదోయొకజంతువును జంపుటే గాని గోవునేచంపు రివాజులేదు. అయితే మేక నొకేవ్యక్తి చంపును. పెద్ద జంతువగు గోవు నైదుగురుకలసి చంపిన, ఆయజ్ఞఫల మైదుగురకును కల్గుననని సంప్రదాయ మేర్పడినది. గోవునే చంపుమని శాస్త్రము విధించకున్నను, కొందరు ముస్లిములు గోవునే ఊరేగింపుచేసి యజ్ఞముచేయుట కలదు. గోవును ముందుగా ఊరేగించుట, అప్పుడు హిందువులతో తీవ్ర సంఘర్షముజర్గుట మామూలు. ఇందు ఉభయుల చర్యయు ఆక్షేప

* ఈగాథ శ్రీమహమ్మదుకును పూర్వము జరిగినది.

ణీయమే. హిందువులు ఉద్రేకపడి ఆగోవధమాన్పుటకని కొట్లాడి అవస రమైతే నరహింసకును సిద్ధముగుట ధర్మరక్షకము కాదు. మనదేశంలో గోవులుఆర్థికవృద్ధి కవసరమైనవి. వ్యవసాయపుదూడలబెట్టుటకు పాలకును అవి మన కుపయోగకరములు. ఇట్టి, అందఱికి వర్తించు ఆర్థికకారణ ములను ముస్లిములును హర్షించకతప్పదు. కాని, దాని నొక మతసమస్య గనే యెంచి, రెండుపక్షములు తగువులాడుచున్నారు. ఇప్పుడు యూరపి యనులకై (ముఖ్యంగా ఇంగ్లీషుసేనకు) ఈదేశములో ఎన్నియో గోవుల జంపుచున్నారు; గోజాతి, మహిషాలను యెడ్లను క్రైస్తవులు, హిందు వులలో హరిజనులును,చంపుదురు;వాటికి హిందువు లాందోళన చేయుట లేదు. గోరక్షణ హిందూధర్మము లోనిదే; కాని, వట్టిపోయి ముసలివై కొద్దిలో చావబోవు గోవులజంపినను గొప్పనేరమనుట సబబుకాదు; హిం దువు లడ్డుపడుచుంటే, పంతముకనియైన ముస్లిములు గోవధకు పట్టు పట్టుచున్నారు. త్యాగముకు లోకసేవకు ఉద్దేశించినట్లు పవిత్రదిన మిట్లు పరిణమించుట విచారకరము.

వేదకాలమం దార్యులును గోమేధము చేయుచుండిరిగదా. ఇప్పుడు ఉభయపక్షములును హింసాతత్వమువదలి ప్రీతితోనుంటే,బక్రీదు పండుగవల్ల యిట్లు తగువులు కూనీలు జరుగవు.

—: 15. మొహరం :—

'మొహరం' కూడ ముస్లిముల పండుగ. దీనినే పీర్ల పండుగ యందుము. ఇందులో చిత్రవిచిత్రమైన పులివేషములు, వినోదములు హిందువులకు తెలిసినవి. కాని, ఈపండుగకుండు ఐతిహ్యమును గ్రహిం చుటలేదు. మహమ్మదుగారు పోవునప్పటికి తనప్రాంతముకుఅధికారియా యెను. తరువాత ఆయన స్థానీయులకు 'ఖలీఫా' లని పేరువచ్చెను. ఈయ ధికారమునే 'ఖలాఫత్' అందురు. కొంతకాలముకు శాస్త్రప్రకార మీయధికారము అరేబియావాసి (మహమ్మదు కల్లుడు) అగు 'ఆలీగా'కి దఖలుపడినది. కాని 'సిరియా' ప్రాంతపుపాలకుడను 'మావ్యా' అలీని

ధిక్కరించి, తానే ఖలీఫానని ప్రకటించి, కయ్యముకు సిద్ధపడెను. తనహక్కు నిలుపుకోవలెనంటే ఘోరయుద్ధము చేయకతప్పదని ఆలీ కనిపెట్టెను; అతడు అహింసాపరుడు; జనసష్టం తప్పించుటకై 'ఆలీ' తన ఖిలాఫత్తు అధికారం చలాయించుట మానెను. ఈస్థితిలో వీరిద్దరును కాలధర్మ మొందిరి.

మావ్యాకొడుకు 'యజీద్'; ఆలీకొడుకు 'హుసేన్'. ఈయిద్దరిలో నెవరు 'ఖలీఫా' కావలెనని మరల తగాదా వచ్చెను. అన్నివిధములను హక్కును అర్హతయు హుసేన్ కే ఉండినవి కనుక ముస్లిముల ప్రజాభిప్రాయము హుసేన్ వైపే ఉండెను. యజీదుపోరుకు తలపడెను. ప్రజల కోర్కెపైన హుసేన్ తరపువారు యజీదుపక్షముతో గొప్పయుద్ధము చేసిరి. వీరుడగు హుస్సేను ధర్మయుద్ధమే చేసెను, న్యాయముకు కట్టుబడెను; కాని యజీదును అతనిపక్షమును ఎన్నియోకుట్రలు దుర్మార్గములు జరిగించి, హుసేనును ఓడించి, చంపించిరి. ఈదారుణయుద్ధము మహాభారతసమరం వలె రెండుపక్షముల వినాశముకు కారణమైనది. మహాత్ముడగు హుస్సేనుని ఆత్మార్పణకును అప్పుడుపోయిన వీరపితృవులకును జ్ఞాపకము మొహారం.

మొహారంలో మరొక అంతరర్థము నున్నది. పూర్వము మహమ్మదు అప్పటి స్వజాతీయుల మాఢ్యమును మూర్ఖమగు శిలాపూజలను దురాచారములను హింసాచర్యలను మాన్పి, వారిలో సద్ధర్మమును ఐక్యమును స్థాపింపబోయినప్పుడు, కొందరు ప్రబలురు 'ఈనవ్యమతవ్యాప్తి వల్ల, ఆవిగ్రహాపూజలను మానితే, తమద్రవ్యలాభమును పోవు' నని యెంచి, మహమ్మదును చంపయత్నించిరి. అప్పుడు ఆత్మరక్షణకై మహమ్మదు మక్కావిడచి, మదీనాపురముకు వచ్చి, అక్కడనుండి ఇస్లాం మతస్థాపన మారంభించెను. అదే మహమ్మదీయశకము కారంభము. (క్రీ. త. 622) సం॥ ఆతేది ముస్లిముల సంవత్సరాది. అందు మొదటి నెలపేరు 'మొహారం'. కనుక మొహారంనెల మొదటిపదిరోజులు ముస్లిం

మతస్థాపనకు హుస్సేన్ వగైరాధర్మాత్ములు *'శహీదు' అయినందుకును స్మారకము.

—: 16. రంజాన్ :—

ముస్లిముల వేరొకపండుగ రంజాన్. మహమ్మదీయుల పంచాంగప్రకారము ఒకనెల పేరు రంజాన్. ఇది ఉపవాసమాసము. నరులు హింసాప్రవృత్తి వదలి సత్పురుషులు కావలె, అందుకు ముఖ్యంగా నిగ్రహము గలిగియుండవలెనని మహమ్మదును కనిపెట్టెను. ఆహారములోను నిగ్రహం కల్గియుంచుట చిత్తశుద్ధి కవసరమని అన్ని మతముల వారుగుర్తించినారు కనుకనే హిందువులకేకాదశికుపవాస ముండదగునను ఆచారమున్నది. కొందరు శూద్రాదులును ప్రతిశనివారం మాంసాదులు మాని, ఒకపూట ఉపవసించుట కలదు. శివరాత్రి వగైరాలలోను కొందరు ఉపవసింతురు; కనుక మొత్తంమీద సాలుకు సుమారొకనెల ఆచారనిష్ఠులగు హిందువు లుపవాస ముందురు. ముస్లిములును సాలుకొకనెల యుపవసింతురు అయితే విడిరోజులకుబదులు సాలీనా రంజాన్ నెలయంతయు ఉపవాస ముందురు.

నెలరోజులు అసలే నిరాహారులగుట సామాన్యులకు సాధ్యము క్షేమకరము కాదు. కనుక, ఆనెలలో పగలేమియు తినక, రాత్రివేళ ఫలాహారం గ్రహింతురు, మాంసము ముట్టరు. ఆనెలరోజులును అందరు కలసి విశేషప్రార్థనలు చేయుదురు. తమ వేదగ్రంథమగు "కురాను" ను అదనంగా రోజు కొక అధ్యాయం చొప్పున యావత్తు గ్రంథమును పారాయణ జరిగించి, అందుపైన వ్యాఖ్యానము వినిపించుటయు కలదు. (హిందువులలోను కొందరు కార్తికమాసమును, కొందరు మార్గశీర్షము, లేక ధనుర్మాసమును అధికపవిత్రముగ భావించి, ఆనెలలో ప్రార్థనాదులు విశేషముగ జరిగింతురు) ముస్లిములిట్లీనెలలో జ్ఞాననిగ్రహముల సంపాదించి, నెలాఖరున ఉత్సవప్రార్థనల జేసి, పారా

---

* ధర్మముకై ప్రాణ మర్పించినవానిని 'శహీద్' అందురు.

యణ' జేతురు. అదే 'రంజాను' పండుగరోజు; కనుక, అది అహింస కవసరమగు ఆత్మనిగ్రహమూ, జ్ఞానమూ సంపాదించుటకు సూచక దినము. ఇట్లు ముస్లిముల గొప్పపండుగ లన్నియు అహింసాతత్వవర్ధకమగుటకో అందుల జ్ఞాపికలుగనో ఉద్దేశించినవని తేలినది.

---

# క్రైస్తవుల పండుగలు.

---

మలయాళప్రాంతపు పూర్వపు సిరియనుక్రైస్తవులే గాక, మిషనరీలప్రచారంవల్ల ఇటీవలను కొందరు హిందువులు (ముఖ్యంగా నిమ్న జాతీయులు అటవికులు) క్రైస్తవులైనారు. క్రైస్తవమత మిప్పు డీదేశములో ప్రభుత్వమతము. కనుకనే, ప్రతిఆదివారమును క్రైస్తవులముఖ్యమైన పండుగలకు మనపబ్లికుకార్యాలయాలన్నిటికీ సెలవు లున్నవి. ఆ పండుగలవిశేషమేమో కనిపెట్టుదము.

ఈశ్వరప్రార్థన ఆత్మశుద్ధికవసరమని క్రైస్తవులు భావింతురు. దానిని సమిష్టిగజేయుట ప్రశస్తమని వారిమతము. జనులు లౌకికకార్యములలో మగ్నులైనను, ఒక విశ్రాంతిరోజున సంఘప్రార్థనకే వినియోగించుపద్ధతి బెట్టినారు. ఆరోజుననైనను జనులు తమధర్మమును నైతికాదర్శములను స్మరించవలెనని తాత్పర్యము.

—: 17. క్రిస్టమసు :—

వీరిపండుగలలో ముఖ్యము 'క్రిస్టమసు'. అది క్రీస్తు జన్మదినమును జ్ఞాపిక. క్రీస్తు యూద దేశములోజనించి, అచ్చట పరిశుద్ధధర్మమును స్థాపించెను. ఆయనయీశ్వరునవతారమని క్రైస్తవులవిశ్వాసము. ఆయన మతబోధలో ముఖ్యసిద్ధాంతము అహింసాతత్వము; "ఒక చెంపను శత్రువు కొట్టినను (ఆతనిని కొట్టక) నీరెండవ చెంప కనపర్చుము." అను ఆయన బోధలోను హింసచేయుక, లోకులందరిపైన ప్రేమగలియుండుమ

నియే ఉద్దేశించెను. ఆయన 'టెన్ కమాండ్ మెంట్సు' అను ప్రసిద్ధిగలపది ఆజ్ఞలిచ్చెను. వాటిసారమును అహింసాబోధయే. చాలమంది క్రైస్తవరాజ్యములవారిప్రస్తుతప్రవర్తన హింసాపూరితమేమైనను, క్రైస్తవమతపుఅసలుసారము అహింసాసిద్ధాంతమే. సాలీనాడిసెంబరు ఆఖరువారములో ప్రవర్తయగు క్రీస్తుపేర ఉత్సవములు జరుపుదురు. క్రైస్తవులందరు అప్పుడు వేడుకలతో సంతోషింతురు.

ఈఉత్సవములలోను ఈముఖ్యసిద్ధాంతమును వారి ప్రముఖులు సాధారణంగా స్మరించకుండుట విచారకరము.

—: 18. ఈస్టరు :—

ఇదిగాక 'ఈస్టరు' అను మరొకపండుగ కలదు. అందుకు మూడు నాల్గు రోజులు సెలవులుకల్గి క్రైస్తవు లుత్సవములుజేతురు.† ఈ రోజులలో 'గుడ్ ఫ్రైడే' అను శుక్రవారం క్రీస్తు మరణదినపురోజు; తరువాత సోమవారమున ఆయన పునర్జీవితు డాయెనందురు.*

క్రీస్తు జీవించినకాలమందా ప్రాంతము (యూదదేశము) రోమనులపాలనలో నుండెను. ఇట్లు యూదులు రోమనులకు పరాధీనులై యుండిరి. ఈయన నవ్యమతమును బోధించినప్పుడు ఆయూదుల ధార్మికోత్సాహము కొంతస్వాతంత్ర్యసంరంభముగను పరిణమించెను. నిజమైన అహింసాతత్వము జనులను బలీయులు ధీరులుగ జేయును.

కేవల మాధ్యాత్మిక ప్రవృత్తితో నున్నను ఇప్పటి గాంధిమహాత్మునివలె, అప్పుడు క్రీస్తును తన దేశీయులకు సరియైన ఆత్మవికాసమును ఆధ్యాత్మికవృద్ధియును రాజకీయస్వాతంత్ర్యమును అవసరమనియెంచి

---

† ప్రస్తుతపు క్రైస్తవనాయకుల చర్యలు యిందుకు వ్యతిరేకముగ నుండుచే మనకు కనబడుచున్నది. అందువల్ల వీరిమతము అహింసాప్రధానము కాదేమో అని ఇప్పటివారికి అనుమానముతోచుట సహజము.

* ఈస్టరు మైకల్మసుపండుగలు చాంద్రమానప్రకారం లెక్కవేయుదురు; కనుక వాటి ఇంగ్లీషు తేదీలు సాలీనా మారుచుండును.

ఉద్బోధించియుండును. ఎట్లైననేమి? ధార్మికప్రవక్తయగు క్రీస్తుపైన రాజద్రోహపునేరముమోపి, రోమను అధికారులాయన తనసవ్యబోధలవల్ల యూదజనులతో స్వాతంత్ర్యావేశముగల్గించు బోధచేసెనని నిర్ణయించి, ఆయనకు మరణదండన నిచ్చిరి. అంతట, అప్పటి రివాజుప్రకారం క్రీస్తు దేహము గోడకుచేర్చి చేతులకు మేకులుదిగగొట్టి, మరణశిక్ష నమలు జరిపిరి. ఈరీతిగ క్రీస్తు తనప్రజలకై ఆత్మార్పణచేసెను. లోకులందరి ధార్మికోద్ధరణకొరకును క్రీస్తు చనిపోయెనని, తరువాత ఆయనదేహము భూస్థాపితమైన చోటునుండి అద్భుతముగ పునర్జీవితుడైవచ్చి, ఆయన మానవలోకము నుద్ధరించెనని, క్రైస్తవులలో ఐతిహ్యమున్నది. అది యెట్లున్నను, మనకిప్పుడు కావలసినది, స్వదేశీయులకు అహింసాసిద్ధాంతమును బోధించి దానివ్యాప్తికై ఆయనతోడిజనులలో ధైర్యస్వాతంత్ర్య భావముల ప్రోత్సహించి, ఆసందర్భములో తనజీవితమును ఆహుతిచేసుకొనెను. జనులు అహింసావ్యాప్తికి ధైర్యసాహసవంతులు స్వతంత్రులు కావలెనని, అందుకై అవసరమైన ఆత్మార్పణచేయుట లోకముకు క్షేమకరమని ఈస్టరు పండుగ మనకు జ్ఞప్తికితెచ్చెను.

## —: 19. మైకల్మసు :—

క్రైస్తవులుచేయు 19 మైకల్మసుయందొక పండుగ సెప్టెంబరులోని 'మైకల్మసు'. మైకేలు అను క్రైస్తవఋషి దైవాంశతోనుండి, అసురతత్వవర్ధకుడగు సైతానును అణచివేసి, జనులలో సాత్వికతను వృద్ధిచేయించెను. కనుక, అది రాక్షసప్రకృతిపైన దైవీప్రకృతివిజయము కుత్సవము.

## —: 20. ఇతరులవి :—

ఇక బౌద్ధమతపుపండుగలు ఉత్సవములు ముఖ్యంగా బుద్ధదేవుని జీవితపు ముఖ్యవృత్తాంతములకు సంబంధించినవి. అవి అహింసాప్రబోధ

కములని వేరుగచెప్పనక్కరలేదు. పారసీజనుల ముఖ్యాచారములు వేద మతము ననుకరించునవి; కనుక, అవియు ప్రేమతత్వవర్ధకములే.

ఇట్లు మనదేశమందేగాక, ప్రపంచమంతటను వ్యాపించిన ముఖ్యమగు పండుగలు వాటిఆధారమగు ఐతిహ్యములును అహింసాతత్వపు సూచకములని తేలినది. వాటిభావమును సరిగాగ్రహించి, మన జీవితమందు ఆచరణలో బెట్టుట సంఘమంతటికి మంగళప్రదము.

---

# సవరణపట్టిక.

| పుట. | పంక్తి. | తప్పు. | సవరణ. |
| --- | --- | --- | --- |
| 1 | 15 | మిశ్రమము | మిశ్రణము |
| 7 | 14 | వారిచి | వారిని |
| 9 | 8 | (మాత్స్యన్యాయ) | 'మాత్స్యన్యాయ' |
| 10 | 5 | బాక్టిలు | డాక్టిలు |
| 12 | 23 | దరా ? | దరా |
| 15 | 21 | హత్యాహి | హత్యాఽహి |
| 18 | 2 | ◆ | ◆ ఈయన |
| 20 | 15 | ఔన్నత్యా | ఉన్నతా |
| 21 | 12 | రస | రసము |
| | 25 | భుశం | భూతాం |
| 24 | 21 | ప్రత్వేక | ప్రత్యేక |
| 34 | 23 | నావిరరో | నావిరతో |
| 35 | 13 | చెప్పెడి | చెప్పెః— |
| | 20 | ధర్మప | ధర్మస్య |
| 39 | 1 | వసిష్ట | వసిష్ఠ |
| 40 | 19 | ధిక్పలం | ధిగ్బలం |
| 42 | 22 | మనస్య | మనుష్య |
| 43 | 8 | హింప | హింస |
| 47 | 11 | అహిం | అహిం |
| 47 | 12 | గ్రత | గ్రతతో |
| 50 | 25 | రాజి | రాజ్ఞి |
| 51 | 5 | మర్జుని | మర్జునుని |
| 54 | 2 | అనత్యము | అసత్యము |
| 57 | 18 | డీను | జీను |
| 58 | 7 | ప్రభ | ప్రధ |
| | 10 | కోసిన | ఇతరులుకోసిన |
| 60 | 14 | మనోభ | మనోభి |
| | 28 | స్తసాత్మా | స్తస్మాత్ |

| పుట. | పంక్తి. | తప్పు. | సవరణ. |
|---|---|---|---|
| 257 | 6 | ర్పడిన | ర్పడిన పేరువారి |
| 258 | 16 | తారా | దారా |
| | 26 | యిుస్రో | ఖుస్రో |
| 260 | 22 | బీరు | బీటు |
| 265 | 4 | బాహ్యా | బాహ్యో |
| 271 | 3 | కొడకు | కొడుకు |
| 272 | 2 | మొగల | మొగలు |
| | 4 | మను | మును |
| 274 | 4 | నాటిన | పెట్టిన |
| 277 | 10 | దువ్యము | దూవ్యము |
| 279 | 24 | సులుమీగుట్టెరుం | పులుమీగుట్టెరుంగు |
| 280 | 9 | తేన్చి | తేల్చి |
| 281 | 13 | సజహ | సహజ |
| 282 | 17 | అద్వై ్వత | అద్వైత |
| 284 | 10 | లతికో | లధికో |
| 285 | 2 | రాయు | వాయు, |
| 286 | 12 | నీని | నీతి |
| | 24 | రాధ్యు | రాధ్య |
| 290 | 13 | అదృశు | అదృశ్య |
| 294 | 11 | త నే | త నేవచ్చి |
| 295 | 18 | చును | చుచు, |
| 298 | 4 | జేయదలప | నెగ్గుజేయ |
| 299 | 8 | నంఘ | సంఘ |
| 301 | 28 | చినది | చినవి |
| 304 | 16 | సరి | సర |
| | 21 | యున్నది | యున్నవి |

# భారతీయనాగరికత,

## అహింసాతత్త్వము.

### రెండవభాగము.



కొమాండూరి శఠకోపాచార్యులు,
కాకినాడ.

# ఉపోద్ఘాతము.



ఈప్రపంచమునం దిప్పుడు జీవయాత్రసలుపు మనకర్తవ్యమేమి? ఒంటిపాదముననడచు ధర్మమును రూపుమాపెదమా, అహింసమాటయే తలపక హింసకు ప్రబలనిచ్చెదమా? లేక, ధర్మమును నాలుగుపాదములమీద నడపెదమా, హింసనుమాన్పి, అహింసావ్యాప్తికి తోడ్పడెదమా? రాజ్యము అహింసాసిద్ధాంతమును ఆశ్రయించుకొనవలెనన్న, సంఘములో అహింసను వ్యాపకముచేయవలె. సంఘముచే నిర్ణయింపబడ్డ సిద్ధాంతములను ప్రవర్తనపద్ధతులను ఆచరణకు వచ్చునట్లు నిర్బంధించునదే శాసనము, రాజ్యము. ఈసిద్ధాంతములును పద్ధతులును బహుజనుల కనుకూలమైనప్పుడు రాజశాసనముగ మారును. అట్టిధర్మములు, సిద్ధాంతములు, విధానములు కొందరు వ్యక్తులచే సమర్థింపబడి అవలంబింపబడుచుండవలె. ఇట్టి అవలంబకులే మార్గదర్శులు, నేతలు, నాయకులు, ధర్మసంస్థాపకులు అగుదురు. కావున అహింసాధర్మబీజములను నాటుటకు తగినక్షేత్రము వ్యక్తిజీవనము. వ్యక్తిజీవనమునందు ఈబీజము మొలకెత్తవలె నన్న బాల్య యౌవన కౌమార, వార్ధక్యములందు అహింసా విషయములనే వ్యాపకము చేయుచుండవలె.

చిన్నప్పుడు చీమలను, కప్పలను, తొండలను చంపవలదనియు, ఎదిగినకొలది కేవలము హింసావలంబనము కావింపకుండుటయే కాక అహింసా సూత్రములను పాటించవలెననియు, రానురాను అపకారికి నుపకారము నెపమెన్నకచేయుచుండ వలెననియు, విద్య వినయమునకు కారణభూతము గావలెననియు, కక్షను చంపి, క్షమను పెంపొందించుచుండవలె ననియు,

సర్వేఽపి సుఖినః సంతు, సర్వే సంతు నిరామయాః
సర్వే భద్రాణి పశ్యంతు, మాకశ్చిత్ దుఃఖ మాప్నుయాత్,

అను స్వస్తివాక్యములను కేవలము పౌరాణికుల ముఖము నుండియే కాక, పౌరుల జీవనమందుఁకూడ విరాజిల్లుచుండవలెననియు, వేరుగ చెప్పనక్కరలేదు. ఇట్టి మహాదాదర్శములతోఁగూడిన మార్పులు ఒక్క నాడు- ఒక్కముహూర్తమునందు- హఠాత్తుగ పుట్టుకొని వచ్చునవి కావు.

ఇట్టి ప్రవర్తనములకు పురోగాములేర్పడి, మార్గమును సిద్ధపఱచి, సంఘుపుద్మష్టిని నూతనపంథకై త్రిప్పి, వ్యక్తి, సంఘము, రాజ్యాంగముల యొక్క ఆదర్శములను మార్ప యత్నింపవలెను. ఇట్టి మహాత్కార్యమునకు ఇంచుక సహాయభూతముగ నుండగలందులకుగాను ఈచిన్న పొత్తము ఆంధ్రరాష్ట్రకాంగ్రెసుకమిటీవారిచే సంకల్పింపబడెను.

జనుల యాదరణ పూర్ణముగ వచ్చుచో, ఈ సంకల్పము ఇచ్ఛగ మారి, యత్నరూపము దాల్చి, జయము నందగలదు.

భో॥ పట్టాభిసీతారామయ్య.

---

# పీఠిక.

---

భారతీయసంస్కృతిలో అహింసాతత్వపు పరిణామమను గూర్చిన యీరచన మొదటిభాగము 4 నెలల క్రిందట ప్రచురితము. ఈరెండవ భాగము ఈకాలపు మనజాతీయ జీవితముకు సంబంధించినది. కాని, విదేశజాతుల సంస్కృతి గూర్చియు ప్రస్తుతపరిస్థితినిబట్టి కొంతవరకు ఇప్పటి మహాయుద్ధము గూర్చియును చర్చజరిగినది. అయినను, పుస్తక పుశీర్షిక నట్లేయుంచినాను. గత మార్చిలోనే యీభాగమును వ్రాసియుంటిని; కాని తగుకాకితము దొరకకయు కారణాంతరాలవల్లను ముద్రణలో ఆలస్యమయినది. లోకమంతటను తీవ్రసంచలనము జరుగుచున్నది; రోజురోజును గొప్పమార్పులగుచున్నవి. అచ్చులోనుండగా కొన్ని అత్యావశ్యకమగు సవరణలజేసితిని; కాని విశేషమగు మార్పుకు వీలుకాలేదు. కనుకను, ఇట్టి క్రాంతిసమయంలో ప్రచురించుటవల్లను, ఇందులో చాల లోపము లేర్పడినవి. కొంత పునరావృత్తియు కల్గినది. పాఠకులు సహృదయులై మన్నించి, విషయమునే గ్రహింపగోరెద.

ఈపుస్తకంలోని కొన్నిభావములు చర్చాస్పదములు; వాటిని గూర్చి భేదాభిప్రాయముండుట సహజము. తగుసూచనలతో పాఠకులు పంపు విమర్శలన్నిటిని కృతజ్ఞతతో స్వీకరింతును. ఇందలి యుపోద్ఘాత వాక్యములను 1 వ భాగపు ఉపోద్ఘాతశేషముగ శ్రీ డా॥ పట్టాభిగారు బందరునుండి 17-3-41 తేదీని నాకుపంపిరి. కాని మొదటిభాగ మప్పటికే ముద్రితమైనది; వారు మరునాడే ప్రభుత్వము కతిథులై నిర్బంధితులైనారు. కనుక ఆభాగమునట్లే దీని యుపోద్ఘాతముగ చేర్చినాను.

కాకినాడ,
31-7-41. } కొ. శ.

# రెండవ భాగము.



## విషయ సూచిక.

# భారతీయ నాగరికత, అహింసా తత్వము.



## రెండవ భాగము.

---

### 1. ప్రస్తావన.

మనదేశపు ప్రాచీన సంస్కృతి యెట్టిదో, దానిలో దరిమిలాను పరిణామము లెట్లుగల్గెనో, చూచియున్నాము. లోకమంతటను ఆదిమ జనులు చాలవరకు పశుతుల్యులై హింసాపరులై భీరువులై యుండిరి. మనదేశంలో వేదకాలపు ఆర్యజనులలో విశ్వప్రేమభావ మంకురించినది; బౌద్ధయుగములో వికసించి వృద్ధియైనది. దీని ఫలితము దక్షిణపు ఆంధ్ర ద్రవిడములకును సోకినది. మరియు అహింసాధర్మము క్రీ పూ. 3 వ శతాబ్దినుండి క్రీ. శ. 6వ శతాబ్దివరకు ఆసియాఖండపు ఇతరదేశాలకును వ్యాపించినది. అంతట ఆప్రాంతాలలో అహింసాసూత్రపు ఆధారముతోనే క్రైస్తవ మహమ్మదీయాదిమతము లుత్పన్నమై, ఇతరఖండములకును వ్యాపించినవి. మన దక్షిణదేశంలో శివభక్తులును, ఆళ్వారులును, ఆపిమ్మట శంకర రామానుజ మధ్వులును దేశకాలోచితమగు బోధలతో లోకకల్యాణము చేసిరి. ఈలోగా ఉత్తరప్రాంతములో ప్రేమభావము చెడి, సాంఘిక రాజకీయాలలో కలుషతయేర్పడినది. అప్పుడే ముస్లిముసంస్కృతితో గట్టి సంఘర్షము కల్గినది. రాజకీయవిరోధములవల్ల ధార్మికకలహము మరింత హెచ్చినది. ఈ బాధలు తగ్గించి జనులలో ప్రేమగల్గించుటకు రాజకీయముగ అక్బరు ఇత్యాదులును ధార్మికముగ కబీరు నానకు వగైరాలును తీవ్రకృషి చేసిరి; భాగవత తత్వముద్వారా జనులలో ప్రేమ భావమును పునరుద్ధరించుటకు పూనుకొనిరి. కాని, అది జనసామాన్యములో పూర్తిగ వ్యాపించలేదు. రాజులలోను ఆయాసంఘములమధ్యను ప్రాంతీయులమధ్యను కలతలు పెరిగినవి. ఈస్థితిలో ప్రాశ్చాత్యజాతులవారు మనదేశముకువచ్చి వ్యాపారమును రాజ్యమును స్థాపింపదొడగిరి. బ్రిటి

షువారు రాజ్యాధికారము స్థాపించిరి. పిమ్మటగూడ, రామమోహన దయానందాదులు సంస్కృతిలో నేర్పడిన వికృతినిపోగొట్టి శుద్ధిపరుప జూచినారు. అందులో కొత్తపరిస్థితి కలిగినది. ఈ ఆధునిక జీవితపు సమస్యలను వాటి పరిష్కారసాధనములను మన మిప్పుడు పరిశీలింతము. 1857-58 సం॥రం సిపాయీ యుద్ధము సమాప్తమగుటతో మనకాధునికయుగ మారంభించినదనుకోవచ్చును. అప్పటితో బ్రిటిషుసామ్రాజ్య మిక్కడ గట్టిగనాటుకొన్నది. అంతట గొప్ప పరిణామము కల్గినట్లు తేలినది. ముఖ్యముగా రెండు కొత్తపరిస్థితులు వచ్చినవి.

1. మనదేశమిప్పుడు పరాధీనమైయున్నది. భిన్నసంస్కృతిగల విదేశపువారు మనల బాలించుచున్నారు. అందువల్ల మనసంస్కృతి వికాసములో మార్పులుగల్గి సంఘర్షమునేర్పడినది. 2. అంతర్జాతీయ సంబంధమిప్పుడు చాలహెచ్చినది. రైళ్ళు, స్టీమరులు, తంతి, విమానములు' సినెమా, రేడియో వగైరాలేర్పడి, దూరదేశాలతో రాకపోకలును భావప్రచారమును చాలత్వరగను సులభంగాను సాగుచున్నవి.

ఈరెంటికిని కొంత సంబంధమున్నది. ఆర్థికాది విషయములందు మనఅంతర్జాతీయ సంబంధము బ్రిటిషువారిద్వారానే (వారి రాజనీతికిలోబడి) జరుగుచున్నది. ఈరెంటిప్రభావము మనజాతీయ జీవితపు అన్ని శాఖలకును ప్రసరించినది. ఆర్థిక సాంఘిక రాజకీయములకు సహజముగ నుండు పరస్పరసంబంధమిప్పుడు చాలహెచ్చినది. కనుక వాటినన్నిటిని అంతర్జాతీయస్థితినిగూడ చర్చింపవలెను. అహింసాసమస్య అసలునైతికమైనను గహనమైనది. కనుక అన్నిశాఖల విశాలవిమర్శ అవసరమైనది.

ఈ సంఘటనవల్ల మనజాతీయ జీవితముకు క్లిష్టస్థితి కల్గినది. ప్రముఖమగు ఇతరదేశాలలో నిప్పుడున్న ఉద్రేకము యాంత్రికసంస్థలు మనదేశీయులస్థితిని అయోమయము చేయుచున్నవి. ఇప్పటి యీరెండు సంస్కృతుల మంచిచెడ్డలను కనిపెట్టి, ఆఫలితమును బట్టి మన సంస్కృతిని బాగుచేసుకోవలె.

## 2. పాశ్చాత్యసంస్కృతి ప్రారంభము.

పాశ్చాత్యనాగరికత యూరపులో జనించినది. అక్కడి జనులా కారమున తెల్లగ నుందురు. వీరి నాగరికత యిప్పు డన్నిఖండములకును వ్యాపించినది. వీరిలో నొకశాఖయగు బ్రిటిషువారిద్వారా దాని ప్రభావము మనకు గట్టిగ తగులుచున్నది. ఈ సంస్కృతిస్వరూపము గ్రహించుటకై దీని యుత్పత్తి పరిణామముల బరీక్షింపవలె.

యూరపులోను ఆదిమజనుల సంస్కృతి ఇక్కడివలె హింసాప్రధానమే. మన వేదమతము బౌద్ధధర్మమువంటి ప్రేమమయమగు మతము యూరపియనులలో స్వతః జనింపలేదు. వారి కాగ్నేయదిశను, హిందూ బౌద్ధవిద్వాంసులు అహింసాధర్మప్రచారము చేసియుండిన పశ్చిమాసియాలోని యూదదేశములో ఏసుక్రీస్తుద్వారా నవ్యమతము కల్గినది. ఇదియు అహింసాప్రధానము; ఇదిక్రమముగ యూరపుకు వ్యాపించినది. కాని,త్వరలోనే దీనిపరిశుద్ధత కొంతచెడినది. ఆయాప్రాంతపు సంప్రదాయములు మూఢాచారములుదీనిలోజేరినవి. గ్రీకు రోమనుల సంస్కృతి చాల ఉన్నతము. కాని అది భౌతికప్రధానము; దానితో సంబంధము వల్లను, యూరపులో క్రైస్తవసంస్కృతికొక ప్రత్యేకత గల్గినది. ఈ క్రైస్తవపీఠపు ముఖ్యాధికారి రోమువాసియగు 'పోపు'. ఈయన యేర్పరచిన మఠములద్వారాను, సన్యాసులగు మత బోధకులద్వారాను యూరపులోను కొంచముగ ధార్మికత గల్గినది. హున్నులు వాండలులు మొదలగు సంచారిజాతుల క్రూరత తగ్గి, ఆయా దేశములలో కొంత శాంతి గల్గినది. కొంతవిద్యాప్రచారము జరిగినది. కాని సామాన్యజనుల స్థితి అంధకారమయముగనుండినది. పోపు అనుయాయులలో చాలమంది మూఢభక్తివలన చాల ఆస్తులను ఈ 'కాథలికు' పీఠమునకు దఖలుపర్చిరి ఈ రీతిగ 'పోపు'ను ఆయాప్రాంతాల బిషప్పు ఇత్యాదులును, విలాసులు, కొంతవరకు అధికారమత్తులు, ధనకాంక్షయుతులు నయిరి.

ఈ స్థితిలో అరేబియాలో నుదయించిన ముస్లిముమతమును అరబ్బులు, తురుష్కులు, పశ్చిమముగ ఉత్తరాఫ్రికా అంతటను, యూరపు టర్కీలోను, ఇంకను పశ్చిమముగను వ్యాపింపజేసిరి. ఈ ముస్లిమువీరులు ధార్మికావేశముతో బాటు, విజ్ఞానమందును ప్రీతిగలవారు; కనుక భారతీయుల తత్వజ్ఞానమును, విజ్ఞానమును, శిల్పకళలనుగూడ తాము బాగుగ నేర్చుకొని, తాము జయించిన యూరపియను జాతులకును బోధించిరి; చాలచోట్లవిశ్వవిద్యాలయములు స్థాపించిరి. వీరుజనులలో స్వేచ్ఛాసక్తిని పరిశోధనాశనుగూడ వ్యాపింపజేసిరి. ఈ రీతిగ నేర్పడిన విజ్ఞానపు పునాదిపైన కొందరు క్రైస్తవులు మూఢభక్తిని విడనాడి, స్వతంత్రాలోచనపరులై, మానవులకు భావస్వాతంత్ర్యముకలదని, వారు కాతలికు పీఠమునకు రాజులకుకూడ దాసులు కానక్కరలేదనియు, గ్రహించిరి; ఇట్లు కొందరు యూరపియనులు జనులకు స్వతంత్రజ్ఞానము బోధింపసాగిరి. పోపు చలాయించు సంప్రదాయాధికారములు నిరాధారములని ప్రజలకు చూపుటకు సంస్కర్తలు బైబిలు మున్నగు మతగ్రంథములను జర్మను, ఇంగ్లీషు మొదలగు ఆయా వాడుకభాషలలోనికి తర్జుమా చేసిరి. అప్పుడు అచ్చుకూటములును అమలుకు వచ్చినవి. జనులలో విద్యయు, స్వాతంత్ర్యవాంఛయు హెచ్చినవి. అంతట పశ్చిమీయు లనేకులు స్వతంత్రముగ భారత, చీనాదేశములతో వ్యాపారము చేసి లాభమొందుటకు దూరసముద్రప్రాంతములకు బయలుదేరి, విశేషానుభవమును ద్రవ్యమును సంపాదించిరి. మధ్యతరగతిజనులకు స్వేచ్ఛ హెచ్చినది.

ఈ స్థితిలో రాజుల నిరంకుశపాలనను తొలగించుట కింగ్లండు ఫ్రాంసులలోను,తీవ్రయత్నము జరిగి, కొంత రక్తపాతమైనమీదట ప్రజాయత్తపద్ధతి యేర్పడినది. బ్రిటనులో రాజవంశము విచ్ఛిన్నమైనది. జర్మనీ నుండి తెచ్చుకొన్న జార్జివంశరాజులు బ్రిటిషుపార్లమెంటు చెప్పినట్లే నడుచుకొనుచున్నారు. ఫ్రాంసులో విప్లవముకలిగి, రిపబ్లికు యేర్పడినది, మధ్యవర్గపు ప్రవాసియూరపియనులు ఆయాప్రాంతముల విశేషములను

జనుల తత్వములను గ్రహించి, తమ దేశీయులకు తెలుపుచు, విజ్ఞానవృద్ధికి తోడ్పడిరి. త్వరలోనే వీరు జ్ఞాతప్రపంచమంతటికి వెళ్లుటేగాక, అమెరికాలో ప్రవేశించి, తమ నాగరికత నక్కడ వ్యాపింపజేసినారు.

అయితే ఆపాశ్చాత్యుల సంస్కృతి భౌతికప్రధానము; వారికి స్వతంత్రమగు ధర్మబీజము లేదు. మరియు మనదేశములోనుండినరీతి గ్రామపంచాయితీసంఘములు, వృత్తినియమపద్ధతియు, వారిలో లేవు. అందువలన వారిసంస్కృతిలో ధార్మికనీతి ప్రధానము కాలేదు. గ్రామఘ్నే మముకన్న వ్యక్తిలాభముకు ప్రాముఖ్యమేర్పడినది. మరియు వ్యక్తిస్వాతంత్ర్యమును వ్యక్తిలాభమును చాల ముఖ్యములను భావమేర్పడినది. వీరు ఉత్సాహపరులై స్వేచ్ఛాపరులై, ఎవరికిష్టమగువృత్తిని వారవలంబించు రివాజు ఏర్పడినది. అందువల్ల మనలోనుండిన ఆనువంశికవృత్తి, కులభేదములనుబట్టి భోజనవివాహాదులసంబంధము మానుకొనుట, ఇట్టి చీలికలేర్పడలేదు. కొంత కులీనతగౌరవమున్నను, అది ముఖ్యముగ ధనాఢ్యతనుబట్టియుండునదేగాని, కులవిభేదములు అందునుబట్టి ద్వేషము లుండుటయు లేదు. ద్రవ్యముకుమాత్రం పూజ్యతప్రాముఖ్యము హెచ్చు.

ఇంకొకసంగతి: మనదేశమందార్యులు ద్రావిడులు ఆదిములు కొంతవరకు మొదటనే కలసిపోయిరి. కాని అందుకిష్టపడనివారు తమ సంస్కృతిని నిల్పుకొని వేరుగ్రామములలో నివసించుచుండిరి. వారిప్రత్యేకతకు భంగము చేయుటకు వారిజాతిని నశింపజేయుటకు తక్కినప్రబలురు పూనుకోలేదు. పాశ్చాత్యదేశములందో ఆర్యజాతులనబడిన కెల్టులు, ట్యూటనులు, లాటినులు వగైరాలు ఆయాప్రాంతీయుల ప్రత్యేకతను నిలువనీయక తమలో కలుపుకొనివేసిరి. లేదా ఆదిమవాసులను నాశము చేసి యూరపుఆర్యులు అమెరికాలోను చాలవరకిట్టినీతినే అవలంబించిరి. ఇందువలన వారిసంఘము బలపడినవి. కాని, వారియాత్మలందు కాఠిన్యము స్వార్థపరతగూడ ఏర్పడినవి. వీటిప్రభావము ఇప్పటిలోకజీవితముపైనను బాగుగ ముద్రితమైనదని చూడగలము.

## 3. ఇప్పటి పాశ్చాత్యసంస్కృతి.

17 వ శతాబ్దమునుండి పశ్చిమయూరపువాసులు వ్యక్తి వికాస ము ఉత్సాహముగల్గి, ద్రవ్యార్జనకై విదేశములకు వ్యాపింపసాగిరి. అంతకుపూర్వము ఖండాంతరములలో కష్టస్థితిలోను వ్యాపారవస్తువులను సంస్కృతిని ప్రపంచమునకు వెదజల్లిన ఆసియావాసులప్రగతి తగ్గుటయు, పాశ్చాత్యులవిజృంభణ మారంభించుటయు, ఇట్లొకసారియే జరిగినవి.

మన భారతదేశమందు అంతఃకలహములు హెచ్చి, సంస్కృతి కలుషితమై వికృతినొందియుండగా, ఫ్రెంచి, బ్రిటిషు, డచ్చి వగైరాలు ప్రగతిపరులైరి; వారి జ్ఞానాపేక్షకు ద్రవ్యాపేక్ష తోడైనది. వారు ధీరులుసాహసులునై, నవ్యావిష్కారముల సాయముతో ఖండాంతరము లందును వ్యాపించియున్నారు.

అక్కడ వారు తామార్జించిన భౌతికసంపత్తుతో బాటు తమ అను భవవిజ్ఞానమును స్వదేశీయులకు తెలియునట్లు స్వభాషలో గ్రంథస్థము చేసి నారు. ఇట్లు నవ్యవాఙ్మయ మేర్పర్చి ప్రముఖులు యూరపు అమెరికా లలో విశ్వవిద్యాలయములను, పరిశోధనశాలలను స్థాపించినారు; వ్యా పారవృద్ధిద్వారా ఆదేశాల ఆర్థికసంపత్తు హెచ్చినది. ఈదేశమునుండి చాలధనము చేరినది. ధనికులగు మధ్యవర్గమునకు అధికారము గల్గినది, వారు మనప్రాచ్యుల శిల్పశక్తి జూచి తమదేశములలోని జనుల కున్నశి శిల్పము నేర్పిరి; ఉపయుక్తమగు చౌకవస్తువులను బహుళంగా సృజించు పద్ధతులను కనిపెట్టినారు; ప్రకృతిశక్తుల రహస్యముల గనిపెట్టి దీర్ఘ కృషి చేసిరి. అవసరమునొద్ది కొత్తఆవిష్కారముల చేసిరి. దీర్ఘప్రయా ణమునకు వస్తూత్పత్తికి వీలగుకొత్తవైజ్ఞానికపద్ధతులు గనిపెట్టబడి, కంపసు ఆవిరియంత్రము వాస్తుయంత్రములు, మిల్లులు, దుర్భిణి, విద్యుచ్ఛక్తి, మోటారు, విమానములు, గ్రామఫోను, సినీమా, శస్త్రచికిత్సాయు

ధములు, ఫిరంగులు, జలాంతర్గాములు, ఇట్లు అద్భుతమైన భౌతికావిష్కారములు దినదినము వృద్ధియైనవి.

ముఖ్యమైన కొన్ని యావిష్కారముల వివర మీక్రింద నీయబడినది.

| వస్తువు. | ఆవిష్కర్తపేరు | దేశము. | సాలు(క్రీ.శ) |
| --- | --- | --- | --- |
| ఆవిరియంత్రము. | వాటు | ఇంగ్లండు | 1765 |
| స్టీమరు | ఫుల్టను | అమెరికా | 1807 |
| రైలు | స్టైఫెన్సను | ఇంగ్లండు | 1829 |
| విద్యుత్తంత్రి | మార్సు | అమెరికా | 1835 |
| ఫోటోగ్రఫీ | డాగరు, నీప్జ్ | ఫ్రాంసు | 1837 |
| టెలిఫోను | బెల్ | అమెరికా | 1875 |
| గనులలోవాడుభద్రదీపం | డేవీ | ఇంగ్లండు | 1815 |
| ఫోనోగ్రాఫు | ఎడిసను | అమెరికా | 1876 |
| చలనచిత్రము | ,, | ,, | 1893 |
| వైర్లెసు(వాయువార్త) | మార్కొని | ఇటలీ | 1895 |
| (జగదీశవసుగారును అప్పుడే దీనిని కనిపెట్టినారు) | | | |
| నూలువడుకుమరయంత్రం | హార్గ్రీవ్సు | ఇంగ్లండు | 1764 |
| కుట్టుయంత్రము | థిమనరు | ఫ్రాంసు | 1830 |
| డైనమో(విద్యుజ్జనకములు) | ఫారడే | ఇంగ్లండు | 1831 |
| ఎక్సురేయంత్రము | రోంగ్టెను | జర్మనీ | 1895 |
| రేడియం | కరీసతి | ఫ్రాంసు | 1903 |
| విమానము | రైటుసోదరులు | అమెరికా | ,, |
| ,, | జెపెలిను | జర్మనీ | 1098 |
| టెలివిజను(పరోక్షదృష్టి యంత్రము) | బైర్డు | ఇంగ్లండు | 1926 |
| మోటారు | డీసెలు | జర్మనీ | 1893 |

| | | | |
|---|---|---|---|
| ఎలెక్ట్రాను(పరమాణు భాగము) | థాంప్సను | ఇంగ్లండు | 1897 |
| బైసికిలు | మాక్మిలను | స్కాట్లండు | 1840 |
| థర్మామీటరు (ఉష్ణమాపకయంత్రం) | ఫారన్ హీటు | ఫ్రాంసు | 1721 |
| దుర్భిణి | గలీలియో | | 1593 |
| ఉక్కుతయారుయంత్రం | బెస్సెమరు | ఇంగ్లండు | 1858 |
| అగ్గిపెట్టె(భాస్వరం) | సారియా | ఫ్రాంసు | 1831 |
| టైపురైటరు | షోల్సు | ఇంగ్లండు | 1873 |

ఇట్లీచిత్రవిచిత్రమగు యంత్రాలద్వారా నరుల బాహ్యశక్తి యద్భుతముగ హెచ్చినది. దిక్సూచితో స్టీమర్లతో దీర్ఘప్రయాణములు సుకరమైనవి. పూర్వమింగ్లండునుండి యోడలపైన ఆఫ్రికానుచుట్టి యీ దేశము చేరుటకారు నెలలుపట్టేది. ఇప్పుడో క్రొత్తగత్రవ్విన సూయెజుకాలువద్వారా పెట్రోలుయింజనులు విద్యుచ్ఛక్తి సౌకర్యముగలమహానౌకలలో మూడు వారాలలోను,విమానాలలో రెండు రోజులలోను,సుఖముగ జేరవచ్చు. వార్తలు రేడియోలో గంటలోనే లోకమంతట వినవచ్చును. భూతలమంతయుపరిశోధితమై, అమెరికా, ఆస్ట్రేలియాఖండాలు వెల్లడియై పాశ్చాత్యులవశమైనవి. ఇప్పుడు విమానాలద్వారా లోకమంతయు నొక వారంలో చుట్టిరావచ్చును. గొప్ప వంతెనలు కట్టినారు; అగాధపులోతులగనులనుండి తెచ్చినలోహములతో మహాయంత్రములను ఏబది అరువది అంతస్తుల ఉక్కుమేడలను నిర్మించినారు. రైళ్ళమీదను మోటారులలోను గంటకేబది అరువది మైళ్ళ చొప్పున పోవచ్చును.

పూర్వపు హిందూ భారతీయులు ప్రేమపరులై ఉత్తమసంస్కృతిని. ధర్మమును యోగశక్తిని ఉపకారకములగు కళాశిల్పములను మాత్రమే స్వదేశములోను దేశాంతరములలోను వ్యాపింపజేసిరి; స్వదేశము కావల తమ భౌతికాధిపత్యమును స్థాపింపబూనలేదు; అన్యదేశముల

బీడించ లేదు. ఇక ముస్లిములాయుధధారులై దాడిచేసి విదేశములందు రాజ్యములను తామునమ్మిన ధర్మమును స్థాపించిరి, నిజమే; కాని, అట్టి వారు తరుచు తాము పాలించు ఆ క్రొత్త దేశములందే వసించుచు, క్రమంగా ఆదేశీయులుగ నుండిపోయి, వారు తమవంశీయులుసహా అక్కడి సామాన్యులతో కలిసి వారి కష్టసుఖములందు పాల్గొనిరి. వారు తమమతవ్యాప్తికై ఆయాప్రాంతీయులను పట్టుదలతో తొందర జేసినను, మొత్తముమీద ఆయా దేశవాసులను వారివృత్తులను బాగు చేసిరి ఆదేశీయుల క్షేమమే తమ క్షేమమని వారెంచినట్లు తోచును. పాశ్చాత్యులో అట్లుకాక ఇటీవల క్రొత్తపద్ధతి పెట్టినారు. ఇందు కొంత రోమకసంప్రదాయమున్నది. వారు అమెరికా, ఆస్ట్రేలియావగైరాలలో వలసకుచేరి, అక్కడి దేశవాసులను నణచి, వీలైనచోట్ల రూపుమాపి, సర్వాధికారం వహించినారు. తమకన్న చాలహెచ్చుమంది ప్రజలున్న చోట్ల వారిని నశింపచేయలేక అణచి, తమదాసులుగ జేసి, వారిని అక్కడి ప్రకృతిసంపదనుగూడ తమసొత్తుగ నెంచి, స్వలాభము కుపయోగించుకొన్నారు. భారతదేశపు జనులు బ్రిటిషువారికన్న చాలరెట్లు హెచ్చుమంది; ఇక్కడచిరకాలపు నాగరికశిల్పము లున్నవి, పాశ్చాత్యులిక్కడ యుక్తితో ప్రాబల్యమొంది, మనశ్రమను, సంపత్తును వారిలాభముకు వినియోగించుకొన్నారు. వారిక్కడ స్థిరవాసులగుట కిక్కడి మైదానముల యుష్ణస్థితి సరిపడదట; వారికిస్వదేశభక్తి, సహకారము, సంఘటనము కార్యపరతవంటి మంచిగుణము లున్నవి; కాని స్వలాభము భౌతికబలముఅధికారము నే వారిముఖ్యోద్దేశములు. వారి సంస్కృతిలో నిజమైన ధార్మికతయు లేదు. జనుల నిగ్రహమును నైతికశక్తిని వృద్ధిచేయుటకు బదులు, వారు తమసుగుణములను, విజ్ఞానమును తత్వశాస్త్రమును రాజనీతినిగూడ తమ భౌతికప్రాబల్యముకే వినియోగించినారు. ప్రకృతిశక్తులను వశపర్చుకొన్నందుకు వారు గర్వించి అహంకారులై నారేగాని, నైతికత్వవృద్ధికి, ఆత్మవికాసముకు, ఇంద్రియనిగ్రహముకు, హృదయనిర్మ

లతకు ఎట్టి కృషిని చేయలేదు. వారు మతధర్మమునుగూడ స్వలాభము కే వినియోగించుచున్నారు. వారి కళలలో బాహ్యసౌందర్యమే ముఖ్యము. శిల్పములోను స్థైర్యము సర్వోపయోగముకన్న తత్కాలలాభము, ఇంద్రియాకర్షణము స్వార్థమునే ముఖ్యోద్దేశములు. విలాసమే వారికెక్కువప్రధానము. అందరిశ్రేయస్సును నైతికోన్నతిని కోరుట ప్రాచ్యుల యాదర్శము. ఇట్లు దృక్పథములోను భేదమున్నది. నరులు కర్మఫలమనుభవింపవలె. హింసవల్ల పాపము దోషముగల్గి ఆఫలము హింసకుడనుభవించునని ప్రాచ్యులు. 'క్రీస్తును నమ్మితేచాలు, ఆయన నమ్మినవారి పాపముల హరించును, కనుక పాపభయము లేద'ని పాశ్చాత్యక్రైస్తవులు.

ఇక యూరపియనుల వ్యాపారవృద్ధిని దాని ఫలితములను పరీక్షింతము. 15 వది మొదలు 18 వరకు శతాబ్దులలో వెనీసువర్తకులు దక్షిణ యూరపియనులు భారతదేశము, చీనా ఈరెంటినుండి బట్టలు, మిరియము, పరిమళవస్తువులు వగైరా చక్కని సరకులను ఆసియామైనరు మధ్యధరా సముద్రములద్వారా తెచ్చి, చాల లాభము గడించేవారు. వీరికి పోటీగ అట్లాంటికుసముద్రముద్వారా భూమిని చుట్టి చీనాను భారతదేశమును చేరి, వ్యాపారలాభమును రాబట్టుటకే కొలంబసు పశ్చిమముగ బయలుదేరెను. అయితే మధ్యను అమెరికాఖండము తగిలెను.† పిమ్మట వాస్కోడగామావగైరాలు దక్షిణాఫ్రికాను చుట్టి మన దేశము చేరి, ఈదేశముతో సముద్రవ్యాపార మారంభించిరి. ఈలాభకారి వ్యాపారముతో క్రమంగా బ్రిటిష్, ఫ్రెంచి, డచ్చి, పోర్చుగీసువారి కంపెనీలమధ్య పోటీతగిలినది. భారతదేశముతో వ్యాపారము ఆకంపెనీలకు

† అప్పు డక్కడివారిని ఇండియనులనియే భావించిరి. ఇప్పటికిని వెస్టు ఇండీస్, 'రెడ్ ఇండియను' వగైరాపేర్లు నిల్చియున్నవి. (అయితే చారిత్రిక కాలమునకు చాలపూర్వమే భారతీయులలో కొందరు అమెరికాకు వెళ్ళి అక్కడ తమ పూర్వసంస్కృతిని వ్యాపింపజేసిరని అదే ఇప్పుడక్కడ 'మయ' సంస్కృతి యనబడినదని ఒకవాదమున్నది' 940 సం॥రం జూను మాడరన్ రివ్యూలో శ్రీ చమన్‌లాలుగారి వ్యాసముచూడుడు.

వారి దేశముకును లాభకారి. ఈపోటీ ఆరాజ్యాలమధ్య యుద్ధముల కొకకారణమైనది. వారి ప్రభుత్వము లాకంపెనీలకు మద్దతుచేసిరి. ఇట్లు ఆయాదేశాలమధ్యను తీవ్రయుద్ధము సాగినది. దూరసముద్రములపైన శత్రునిరోధము లేకుండ రాకపోకలు సాగించువారికే ఖండాంతరవ్యాపారము సామ్రాజ్యమును నిల్చును, గనుక నౌకాబలము కెక్కువప్రాధాన్య మేర్పడినది. అందులో ఇంగ్లీషువారిది పైచేయియైనది. ఫ్రెంచి, డచ్చివగైరాలస్థానే బ్రిటిషుప్రాబల్యము హెచ్చినది.† 19 వ శతాబ్దిలో వ్యాపారముతోబాటు రాజకీయాధికారమువచ్చి, తద్ద్వారానుమనదేశము నుండి కోట్లకొలది రూపాయలసొమ్మును అమూల్యరత్నాలును బ్రిటిషు వారికి చేరినవి. వారాసొమ్మును కేళీవిలాసాలకుకాక, మనదేశంలో స్వతంత్రంగా పరిశ్రమలస్థాపనకే వాడినారు.

అప్పుడే ఇంగ్లండులో ఆవిరియంత్రము మరనూలుయంత్రము, మరమగ్గములు నిర్మితమైనవి. గనులనుండి నేలబొగ్గుతో లోహపుపాడిని కరగించి పెద్దయింజనులును, యంత్రములను జేయనేర్చిరి. వాటితో మిల్లులు కట్టి, అందు బట్టలను, నూలునుబహుళోత్పత్తిచేయుట గ్రహించిరి; అందుకు సొమ్ము పెట్టుబడికావలెను. సకాలంలో మనదేశమునుండి వచ్చిన సొమ్మే చాలవరకందుకు పట్టుబడిగ ఉపయోగించినది. ఆమిల్లులసరుకులు మొదట బాగుగ లేక వ్యాపించలేదు; మనదేశపు బట్టలసరుకులు ఇంగ్లండుకు రాకుండ అక్కడి ప్రభుత్వమువారు పన్నులద్వారాను నిషేధాజ్ఞలద్వారాను నిరోధించినారు. ఆమీదటనే ఇంగ్లండులో మిల్లులు ప్రబలినవి; ఈమిల్లులవల్ల ఇంగ్లండులో గృహపరిశ్రమలు దెబ్బతిన్నందున, మిల్లుల నాపుచేయించుమని అప్పుడక్కడి చేనేతవాండ్రు వగైరా వారు కోరిరి.

† అప్పుడు మనదేశీయులిక్కడ నిర్మించిన నౌకలను బ్రిటిషువారు, యూరపు ప్రాంతపు వ్యాపారంలోను యుద్ధంలోను ఉపయోగించుకొన్నారు.

కాని శ్రీమంతులు ప్రబలురునగు మిల్లుయజమానులు పాలకుల నుండి తమమిల్లులకు రక్షణలాభమును పొందినారు. తమగృహపరిశ్రమలునశించుకొలది బ్రిటనులోను చాలమంది నిర్వ్యాపారు లేర్పడినారు. పారిశ్రామికులు వ్యయప్రయాసలతోను విజ్ఞానసహాయంతోను పరిశోధనలు చేయించి కొత్తయంత్రాలతో మిల్లుపరిశ్రమ బాగుచేయించిన మీదటనే సాఫగు సన్నబట్టలను వాటివలె తక్కిన ఫాక్టరీసరుకులను సమృద్ధిగ తయారుచేసి చౌకగ అమ్మగల్గిరి. వాటిద్వారా బ్రిటిషువారు ప్రబలుటజూచి, ఫ్రెంచి జర్మను అమెరికను వగైరాలును ఇట్లే ఫాక్టరీల పరిశ్రమ లారంభించిరి. అయితే ముందారంభించి నందున ప్రాబల్యము గల్గి బ్రిటిషువారికి సౌకర్యములుహెచ్చు. వారు తమసరుకు లుత్పత్తి కాగానే, వాటిని తమమహానౌకలలో మనదేశంలోను చీనావగైరాల లోనుదింపి, మననేతబట్టలపోటీ చంపి, వాటికన్న చౌకగ అమ్మించిరి.

ఈయాంత్రికోత్పత్తికి కొద్దిమంది పనివాండ్లుంటే చాలును. కనుక కార్మికుల జీతపుఖర్చు తగ్గి సరుకులు చౌకయగును. మనదేశపు మధ్యలో రైల్లురోడ్లువేసినమీదట ఆవిలాయతీ సరుకులు రేవులనుండి అన్నిప్రాంతాలకుతెచ్చి దుకాణములలోపెట్టి, పల్లెటూళ్లవీధులలోను త్రిప్పియు, వర్తకులమ్మసాగిరి. ఆయాగ్రామముల నాటుసరుకులకు చలా మణిపోయినది. అంతవరకు ప్రతిగ్రామములోను జీవనాధారమైన వడుకుట, నేత ఇత్యాదులు నశించినవి. ఎగుమతులు లేవుసరిగదా, మనదేశం లోను వాటిఅమ్మకము పోయినది. ఇట్లు, జనసమ్మర్దముగల యీప్రాచ్య దేశాలలో ఆబ్రిటిషుసరుకులు అమ్ముడై, బ్రిటిషుమిల్లుదార్లకు వచ్చు లాభంవల్ల కొందరు కోటీశ్వరులై ప్రబలులైనారు. వాటిపోటీవల్ల వృత్తిపోయినవారు మిల్లులలో కూలీలైనారు, వాటితో లోహపరిశ్రమ మరికొన్ని సహాయపరిశ్రమలు నేర్పడినవి. ఇంగ్లండులో ప్రత్తిపండదు, దూదిబట్టలు కట్టరు. కనుక, విదేశాలనుండి దూదితెచ్చి మిల్లుబట్టలు చేసి పంపుదురు. ఇదివిదేశాలనుండిలాభములాగుటకేచేయువ్యాపారము.

సరఫరాచేయుటకు జనుల రాకపోకలకు నౌకలవ్యాపారము సాయపడి నది. ఇప్పుడు మోటారు యింజనులతోను విద్యుద్దీపాదులతోను ఉక్కు నౌకల నడుపుచున్నారు. ఈనౌకానిర్మాణము బ్రిటనులో గొప్పవ్యాపారము. వీటిమూలముగ గనులపరిశ్రమ లోహాయంత్రములవని వృద్ధియైనవి. వీటియన్నిటిలో లక్షలకొలది కూలీలు పని చేయుదురు. ఇట్లే మిల్లుపరిశ్రమ వల్లఎన్నియో అనుబంధపరిశ్రమ లేర్పడినవి బాంకులు ఇన్స్యూరెంసులును వీటికి సహకారులు, బ్రిటనులోనే పరిశ్రమలధికంగా నుండినప్పు డాసరుకులకు విదేశములంతటను చలామణిజరిగి, వాటికి విశేషలాభములు, క్రొత్త కంపెనీల కార్మికులకు పనియు, ఉండెను. కనుక అప్పుడు ఇంగ్లండులో నిరుద్యోగబాధ లేదు. జర్మనీ అమెరికావగైరాలలోను ఫాక్టరీలు స్థాపించగ స్థితిమారినది. యంత్రవస్తువులు బహుళోత్పత్తి చేసినప్పుడే చౌకగ అమ్మను; అప్పుడే లాభమువచ్చును. కనుక పోటీపడి బహుళోత్పత్తి హెచ్చించిరి. ఈపోటీసూత్రము బట్టలమిల్లులకేగాక, ఫాక్టరీపద్ధతికంతకు వర్తించును. బ్రిటిషువారు ఇందువల్ల తామే ప్రాబల్యంసంపాదించి లాభము రాబట్టుచున్నారు.

ఈలోగా వీరితో జర్మనీ జపానుల పరిశ్రమల పోటీకల్గింది. ఈదేశములన్నిటిలో ఈధనాడ్యులకు తమరాజ్యపుపాలనలో పలుకుబడి యుండును. అమెరికా బ్రిటనువంటి ప్రజాతంత్రక రాజ్యములలోను పాలనలో వీరిదే పలుకుబడి. కార్మికులకు వోటుహక్కులున్నను, వారు చాలవరకు తమయంత్రయజమానులమీదనే ఆధారపడక తప్పదు. లేని యెడల యజమానులు వారి నేదోరీతిని బాధింపవచ్చు, ప్రజాభిప్రాయపు వార్తాపత్రికల వశపర్చుకోవచ్చు, మరియు కంపెనీలకు హెచ్చు లాభమున్నప్పు డీపనివాండ్రకు మంచిజీతము సౌకర్యములు ముట్టును. ఆప్రజలు యజమానుల దాసులే. కనుక 'కార్మిక' ప్రభుత్వపురోజులలోను బ్రిటిషుపార్లమెంటు బ్రిటిషువ్యాపారస్థుల లాభముకు వ్యతిరేకించలేదు. ఇట్లు ప్రతినాగరికరాజ్యమును తమదేశపు ఫాక్టరీలలో బట్టలు,

ఇనుపవస్తువులు, చెప్పులు, కాగితములు, పెన్సిళ్ళు, ఆటవస్తువులుకూడ చేసి, ఆసరుకులవ్యాపారమునంతటను సాగించుటకు విశ్వప్రయత్నముల జేసినవి. తుదకు వీరిననుసరించి ప్రాచ్యదేశాలలోను యాంత్రికపరిశ్రమ తలయెత్తినది. ఈదేశములపైన తామే రాజకీయాధికారము సంపాదించుట కాయాపాశ్చాత్య రాజ్యముల మధ్య 19 వ శతాబ్దిలో పోటీ తీవ్ర యుద్ధములునుజరిగినవి. ఈయధికారకాంక్షనే సామ్రాజ్యతత్వమందుము. తుదకు సామ్రాజ్యముగల బ్రిటిషు ఫ్రెంచిరాజ్యములపైన అట్టిసదుపాయములేని జర్మనీ, ఇటలీ, జపానుల కసూయగల్గినది. అమెరికా సంయుక్తదేశము బహువిశాలము, వారికి తక్కిన అమెరికనురాష్ట్రములపైన అపారప్రాబల్యమున్నది. మరియు సజాతీయులగు సంయుక్తదేశీయులకు ఈరీతినే ఆంగ్లేయులును తమసామ్రాజ్యములో సౌకర్యముల జేయుచు, వారిప్రేమాభిమానముల సంపాదనకే ప్రయత్నింతురు. కాని, యాంత్రికవిజ్ఞానములోను నిర్మించు శక్తిలోను వారినందరిని జర్మనులు తలదన్నిరి. అమెరికను సహాయముగల ఆంగ్లఫ్రెంచి పక్షమునకును జర్మను పక్షమునకును తమయాంత్రిక వస్తువుల విక్రయమునకు తద్ద్వారా ధనప్రాబల్యముల సంపాదనకునే పోటీ హెచ్చినది; ఆయారాజ్యములు సేనాబలము క్రొత్తరకపుయంత్రములను వస్తువులను హెచ్చించియు, తమకధీనదేశముల సారములాగియు, హెచ్చుధనము ఆయుధములు కూర్చినవి, తమయోధశక్తిని దీక్షతో హెచ్చించినవి. పోటీరాజ్యములను తమ అధీనజాతులను అణచియు హింసించియు నేతమప్రాబల్యమునుయాంత్రికశక్తిని కాపాడుకోగలమని వారికి తెలియును. కనుక యాంత్రికవృద్ధికై శస్త్రాదిరూపమగు హింసాశక్తిని, హింసాతత్వమును హెచ్చింతురు. ఫ్రాన్సు జర్మనీవగైరా కొన్నిదేశములందు కార్మికాది సామాన్యజనులకు సైనికత్వమును కొన్ని యేండ్లు నిర్బంధముగ నేర్పుదురు. ఇంగ్లండులో వ్యాపారనౌకలలో లక్షలకొలది నావికులై, అవసరమైనప్పుడు యుద్ధనౌకలుగ మార్చి, నౌకాయోధులుగ బనిచేయుదురు. గొప్పగొప్ప లోహయంత్రములను రసా

యనవస్తువులను ఆయుధసామగ్రిని తయారుచేయ వీలుగ సిద్ధపర్చుదురు విమానములకు నిల్లే మారణహోమపుపద్ధతుల గనిపెట్టుటకై అక్కడి గొప్పవై జ్ఞానికులు తమ యావచ్ఛక్తిని వినియోగించుచున్నారు. అందుకు వారిప్రభుత్వములు, యంత్రయజమానులును సాలీనా విశేషద్రవ్యమును విజ్ఞానశాలలను అమర్చి, సాయపడుచున్నారు. ఇట్లు వారి అందరి ప్రయత్నముతో కొత్తమారణయంత్రము లేర్పడినవి. వాటిని హెచ్చు సొమ్ముకు ఆ యా ప్రభుత్వములు తమయుద్ధశాఖకు కొని రహస్యముగ సృష్టిచేయుచున్నవి. వ్యక్తులు కంపెనీలును ఈవ్యాపారముచాలలాభకరమని కనిపెట్టినవి; కొత్తఆయుధములతో ఆయాజాతులమధ్యహింసాబుద్ధివిపరీతముగ హెచ్చుచున్నది. ఇంకు కాయాపత్రికల విషప్రచారము అయుధనిర్మాతల అసత్యబోధలునుతోడై, హింసావేశమును పెంచుచున్నవి.

విజ్ఞానముద్వారా గల్గిన ఈయద్భుతశక్తులను పరస్పరవినాశములకు 'నాగరిక' ప్రముఖులే యుపయోగించుట శోచనీయము. మానసికంగాను తమదేశపు పద్ధతులు చర్యలు న్యాయములని తమ ప్రత్యర్థులవి అన్యాయములని వారు తమచరిత్రలలోను రాజనీతిగ్రంథాలలోను

---

† హింసాచర్యల కుపయోగించు కొన్ని నవ్యావిష్కారముల వివరమిక్రింద తెలుపబడినది.

| వస్తువు | ఆవిష్కర్త | దేశము | సంవత్సరము |
|---|---|---|---|
| రివాల్వరు | కోల్టు | అమెరికా | 1837 |
| డైనమైటు | నోబెలు | స్వీడను | 1867 |
| విషజ్వరక్రిమి | జెన్నరు | జర్మనీ | 1880 |
| నవ్యవిమానము | జెప్పలెను | ,, | 1908 |
| మరతుపాకీ | లూయీ | | 1912 |
| టాంకు | స్వింటను | ఇంగ్లండు | 1914 |
| విషవాయువు | | | 1915సుమారు |
| జలాంతర్గామి | | | |

వ్యాపారాదులకని మొదట ఆవిష్కృతమైన విమానాదులను కొత్తమార్పులతో నిప్పుడు యుద్ధరంగమందు దారుణ హింసాచర్యలకు వాడుచున్నారు.

బోధించిప్రచారంచేయుట మామూలైనది. స్వజాతిగర్వమును పరద్వేష మును విపరీతంగా ప్రబలినవి. ఇట్లీసంస్కృతి సామ్రాజ్యతత్వముకు హిం సాధోరణికి కారణమగును; ఈసంగతి యూరపు అమెరికాలకు జపానుకు ను (ఇటీవల కొద్దిగా సోవియటు రష్యాకునుగూడ) తప్పలేదు. జనులు ముందుగా భౌతిక నిగ్రహమును జ్ఞానముతో బాటు నీతిని వృద్ధిచేయక, సౌమ్యత నేర్చుకోక, అహంకారముతో ఇతరులపీడించి స్వలాభము పొం దుటనే కోరినందు కిట్టిఫలితము గల్గినది. జపాను తన మిల్లుసరకులు వగై రాల విక్రయములకు (ఆయంత్రాలకు వలయుముడిదినుసులు చౌకగ కొను టకును) పాశ్చాత్యరాజ్యాలతో పోటీపడినది; జపాను నడ్డగింపుచు పాశ్చా త్యులు హెచ్చుసుంకముల వేసిరి; జపాను తనయోధబలమును హింసా తత్వముచు హెచ్చించినది, అయితే బలీయములైన రష్యా, బ్రిటను అమెరికాలతో వెంటనే పోరుకుజాకి, జపాను వీటితో సంఘర్షము తగ్గి పుకొని, ఆసియాలో తన కందుబాటులోనున్న చీనాసామ్రాజ్యపు కొరి యా మంచూరియా ఆగ్నేయమంగోలియా ఉత్తరచీనాలను క్రమక్రమం గా జబర్దస్తీతో ఆక్రమించినది. ఇట్లు చీనులతో జపానీయులు యుద్ధము సాగించుటకు ముఖ్యకారణము తమ యాంత్రికపరిశ్రమల వ్యాప్తికోరు దురాశయే. బ్రిటిషు వారీదేశములో చేసినట్లే తాము చీనాలో చేయ దలచినారు ఇదియంతయు యాంత్రికసంస్కృతి సంఘర్షణ ఫలము.

ఆహారవస్తువులనుగూడ అమెరికావగైరాలలో ట్రాక్టర్లు, రసా యనపు ఎరువులు వాడి యాంత్రికంగా బహుళోత్పత్తి జేసినారు. ఒక్కొ క్క కోటీశ్వరుడో చిన్నసమితియో లక్షలకొలది యెకరములభూములను వశపర్చుకొని యంత్రసహాయముతో హెచ్చుపంట పండించి చౌకగనే అమ్మి లాభము గాబట్టును. వీరితో చిన్నభూస్వాములు రయితులు పోటీ చేయలేక తమ భూములను వీరికమ్ముకొందురు; ఆపెద్ద కమతములలో కూలీలుగ చేరుగతిగల్గును. ఎందరో మామూలువ్యవసాయదారులుతూగ లేక నష్టపోయి నిరుద్యోగులు నిరాధారులునై, అన్నము బట్టలేక అల్లా

డుచున్నారు; ఈకోటీశ్వరులు తమ సరకులను వాడికీయరు. తాము స్వలాభదృష్టితోనే సరుకు ఉత్పత్తిచేతురు. సరుకుల హెచ్చువల్ల ధర తగ్గగా, మరల ధరపెరుగుటకై కొంత నిలవపంటను సరకులను తగుల బెట్టుటో లేక సముద్రములో పోయుటో కలదు. ఇట్లా కమూాల హెచ్చు దినుసులు నిలవయై తగినంత కొనువారు లేక నాశముచేయబడుటయు, ప్రక్కనే లక్షల కొలది బీదలు అన్నముబట్ట లేక మాడిచచ్చుటయు, ఈయాంత్రిక సంస్కృతియొక్క హింసాతత్వముకు దాని విషఫలితముకు నిదర్శనములు.

వేలకొలది మనుష్యులస్థానే ఈకార్ఖానాలమూలంగా అయిదారు గురిచేతనే పనిచేయించి పనివాండ్రకయ్యే జీతాలఖర్చు తగ్గించుటే యాంత్రికపద్ధతి ముఖ్యసిద్ధాంతము. కనుక యంత్రములసంకను సవ్యముగా చేయుకొలది పనివాండ్రసంఖ్య తగ్గుచు, నిరుద్యోగతయు, బాధయు హెచ్చును. ధనాఢ్యులకు బీదలపైన సహజంగా ఉండవలసిన దాక్షిణ్యము ప్రేమభావము ఈయాంత్రికతవల్ల నశించి, హింసావృత్తి యేర్పడినది. కార్మికులకును ఆత్మవిశ్వాసము స్వతంత్రత పోయినవి. యాంత్రికతవలని అంతర్జాతీయ ఫలములు మున్ముందు చర్చింపబడును.

బ్రిటిషువారి పాశ్చాత్య సంస్కృతిలో సుగుణములు నున్నవి. కాని దానితో మనకుగల్గిన సంఘర్షములో గుణములకన్న అవగుణములే పరాధీనులగు మనకధికంగా అబ్బినవని ముందు తెలియును.

# 4. పరాధీనత ఫలము.

18, 19 వ శతాబ్దులలో మనదేశంలో కేంద్రరాజ్యము విచ్ఛిన్నమై, ఆయాప్రాంతీయులమధ్యను, సాంఘికంగా ఆయాజాతులమధ్యను, కలతలు హెచ్చినవి. ఆసమయములలోనే పాశ్చాత్యవర్తకులు ప్రవేశించి, క్రమంగా వ్యాపారసదుపాయములను రాజ్యాధికారమును వినియోగించసాగిరి. ఆఫ్రికా, అమెరికా, ఆస్ట్రేలియాలలోవలెగాక, భారత చీనాలలో ఉన్నతమగు ప్రాచీననాగరికత యుండెను; కనుక ఇక్కడ ఆంగ్లాదులు వేరుపద్ధతు లవలంబించిరి; ఇక్కడి దేశీయరాజులను సామంతులను మంచిమాట చేసుకొని, వారిలోగల కలహములు వృద్ధిచేసిరి; బ్రిటిషువారొకపక్షము, ఫ్రెంచివా రొకపక్షము వహించుచు, దేశీయ రాజుల ద్రవ్యసేనలసాయముతోనే తమ అధికారమును ప్రాబల్యమును హెచ్చించుకొనిరి. ఈసందర్భమున ఫిరంగులు మొదలగు నవ్యాయుధములేగాక, కూటనీతి, మిత్రభేదము మొదలగు కొత్తపద్ధతులగూడ వినియోగించిరి. క్రైస్తవమతప్రచారమును, మద్యము నందించుటయు సేనలును (Bible, Bottle and Brigade) పాశ్చాత్యులసామ్రాజ్యసాధనము లనువార్త యీదేశములోను నిజమయినది. నయముననుభయమునను చిత్రవిచిత్రమగు ఆకర్షణలద్వారాను తమ మతము సంస్కృతి, వస్తువులు, తమజాతి, ఇక్కడివాటికన్న ఉత్తమములను భావము నిక్కడిజనులకు కల్గించిరి. అప్పటి ప్రతిముఖ్యయుద్ధములోను ఈదేశపు నాయకులలో పరస్పరద్వేషమేర్పడి, అహింసాఫలముగ భారతీయుల యోధశక్తివ్యర్థమై ఆంగ్లేయులకు జయము కల్గెనని, చరిత్రలవల్ల స్పష్టమైనది. ఈశోకకథను వివరించుట యనవసరము.

ఇట్లు తమ కధీనమగుచున్న ప్రాంతాలలో బ్రిటిషువారీదేశీయుల పరిశ్రమలకు బదులు, తమ వస్తువుల వ్యాపింపజేయుటకు అన్ని సాధనములను వినియోగించినారు. అందువల్ల ఇక్కడి జనులకు కార్యపరత

ఆత్మగౌరవము నశించినవి. ఆర్థికముగ, ఆధ్యాత్మికముగ, సంస్కృతిలో గూడ పరాధీనతగల్గి, ఇవి రాజకీయపరాధీనతను దృఢపఱ్చినవి.

బ్రిటిషువా రీదేశములో నవలంబించిన పాలనపద్ధతులవల్ల, అనువంశికమగు వడుకుట నేత, కమ్మరం, వడ్రం, వగైరా గ్రామవృత్తులన్నియు క్షీణించినవి. లక్షలకొలది గ్రామములు హీనదశబట్టినవి. బ్రిటిషువారి రాజ్యముకు వ్యాపారముకు కేంద్రములైన కలకత్తా, బొంబాయి, మద్రాసువంటి కొద్దినగరములు వృద్ధికివచ్చినవి. ఇక్కడి మన 'నాగరికులు' దేశశాంతికి, పాలనకు, వ్యాపారముకు, భాషకుగూడ, బ్రిటిషువారిపై నాధారపడుచు, వారు దుభాషలు, బోకిరులు, పాశ్చాత్యానుసారులునై, ప్రముఖులు ప్రజానాయకులు ననిపించుకొన్నారు. ఆంగ్లవిశ్వవిద్యాలయము, హైకోర్టులు, పాలకవర్గములు నేర్పడి, వాటి శాఖోపశాఖలద్వారా, పాశ్చాత్యపద్ధతు లీదేశములో జిల్లాజిల్లాలంతటకును వ్యాపించినవి. క్రైస్తవమతవ్యాప్తికి ద్రవ్యాది సహాయ మీయబడినది. ధర్మభ్రష్టులకు కుటుంబపుసొత్తు చెందదని. హిందూధర్మశాస్త్రంలో నియమమున్నది. దానిని తొలగించి పతితునకి మతాంతరము జేరినవానికిగూడ ఆస్తిహక్కులు పోకుండ చట్టమేర్పడినది †. జనులాయుధముల ధరించుట నేరమని ఇంకొకచట్టము, అబ్కారీ ఉప్పునిబంధనలును చేయబడినవి. జాతీయరక్షణ మానుకొని రాజులందరూ సామంతులో జమీందార్లో అయినారు. ఇదివరలోని స్వతంత్రవృత్తులు క్షీణించగా, ధైర్యముచెడి, ఆంగ్లవిద్య నెట్లో నేర్చుకొని, విదేశప్రభుత్వము క్రిందనో, బ్రిటిషు కంపెనీలలోనో, చిల్లరయుద్యోగాలకై మధ్యవర్గపువారాశించినారు. సామాన్యజనులు కూలిదొరికితే చాలునని పాకులాడు చున్నారు. శాంతియు ప్రయాణాది సౌకర్యమును విదేశవస్తువుల ద్వారా

† ఇండియన్ ఆర్మ్స్ ఆక్టు (1870) ఇండియన్ యూనివర్సిటీస్ ఆక్టు (1860) కాస్టుడిజబిలిటీసుఆక్టు (1856).

సమృద్ధియు సౌకర్యములును గల్గినవని మొదట దేశము సంతృప్తమైనట్లు తోచినది.*

దేశీయులందరు పరవశులై సములైనారు, కనుక పూర్వమునుండినరీతి ప్రాంతీయ వైషమ్యములు ఆయారాజుల నబాబులమధ్య అసూయలు అణగినవి. నిరాయుధులము అనాథులముఅయినను, మరాటీదండు థగ్గులు వగైరాల బాధపోయి, ఒకరీతి శాంతికల్గినది దేశమందన్ని వర్గములవారికిని సమానముగ న్యాయసౌకర్యము లేర్పడినట్లును, బాధలు తగ్గి సౌఖ్యము కల్గినట్లును, కనిపించినది. అయితే కొన్ని దశలు గడువగనే, ఈశాంతిసౌఖ్యములు బాహ్యములేనని, ఈసమత్వమనేది దాస్యపుదేయనియు, తెలిసినది. బాధ, పిరికితనము, నిరాశ, వైకల్యమును, దారిద్ర్యమును, వ్యాపించినవి. నిర్వ్యాపారతవల్ల, జీవించుటకు మనలో పరస్పర స్పర్ధ కలహము హెచ్చినవి.

ఒకదేశము నింకొకదేశపువారు నిరంకుశంగా పాలించుటే ప్రకృతి విరుద్ధము. అది హింసాకార్యము, అనర్థకరము. మనుష్యులు పశుపక్షులును ఎన్నిసౌకర్యములున్నను బంధంలోబడినప్పుడు వ్యధగల్గి, క్రమంగా నీరసించును, మంచియాహారాదులు లేకున్నను స్వేచ్ఛతో తిరుగునప్పుడే హృదయవికాసముగల్గి ఉత్సాహముతో వర్ధిల్లును; కనుక స్వతంత్రత స్వర్గలోకమందురు; ఇది వ్యక్తులకెట్లో జాతికినట్లే అవసరము. పరాధీనజాతి హింసావశమై, తనలోనే విచ్ఛిన్నమై, క్షీణింపకమానదు. ఇందుకన్ని దేశముల చరిత్రయు నిదర్శనమే కనుకనే, అనాగరిక జనులును స్వేచ్ఛకై శక్తికొలది పోరుదురు. పాశ్చాత్యదేశములు చిన్నవియు స్వాతంత్ర్యరక్షణకెంతో త్యాగము, ఆత్మార్పణము చేయుచున్నవి. అయితే, పెంపుడు చిలుకవలె పరాధీనులై జనించిన ఇప్పటిహైందవులలో చాలమంది స్వాతంత్ర్యపు ఘనతను గ్రహింపక నిరాశులైనారు. నరులు ప్రకృతిలో

* తంతివగైరాల 'సౌకర్యము' లన్నియు లోకముకు ఆధునికములు. అట్టివి ఇప్పుడు నాగరిక రాజ్యములన్నిటిలోను అక్కడిప్రభుత్వపు అజమాయిషీని నిర్మితమైనవి.

జంతువులనుండి పరిణమించినవారు; ఆజంతుస్వభావమును, హింసాబుద్ధియు సమయము దొరికినప్పుడు ప్రకోపించును. కనుక నరులు స్వలాభముకై పశుతత్వము చూపుట మామూలైనది. బ్రిటిషువారు మనపై సాగించుపాలనము ఎట్టిరీతిదో సూక్ష్మపరీక్షపైన విశదమగును.

ఇప్పుడు మనచట్టముల నియమములు, పన్నుపద్ధతియు చాలవరకు బ్రిటిషుప్రభుత్వము నిర్మించినవి. వాటిపైన మనప్రజలకు పూర్తి హక్కులీయులేదు. సర్కారుసిబ్బందియంతటి జీతములు వగైరా ఖర్చులకగు సొమ్ము పన్నులద్వారా మనలనుండియే వసూలుచేయబడును. ఆనియమములు చట్టములు జనులకిష్టము కాకున్నను బాధకమైనను మన మనుసరించితీరవలెను; వారు విధించినపన్ను లిచ్చితీరవలెను. వీటిఖర్చును విధానమును బ్రిటిషుప్రభుత్వపు యిష్టమే. ఇప్పుడున్న కోర్టులను ఉద్యోగుల ఆజ్ఞను వ్యతిరేకించినను, పోలీసువారు నేరముమోపి దండింపగలరు. కోర్టులు శిక్షించును. కల్లుపాకల నిరోధకులకు జరిగిన లాఠీప్రయోగములు కోర్టుశిక్షలు నిందుకు నిదర్శనములు. పోలీసుచర్యను గూడ ధిక్కరించితిమా, వెంటనే పటాలములువచ్చి తుపాకుల ప్రయోగించి యణచివేతురు. ఇట్లీదేశములో బ్రిటిషుపాలన తుదకు హింసాధారముపైనే జరుగుచున్నది. స్వతంత్రదేశాలలోను పోలీసులుసేనలు ఉండుమాట నిజమే. కాని వారు పైయధికారులుగూడ అక్కడి ప్రజాప్రతినిధులకు లోబడి, ఆప్రతినిధులుచేయు చట్టప్రకారమే అమలుజరుపవలె; మరియు స్వతంత్రదేశాలలో నిరంకుశులైనను పాలకులుప్రజాభిప్రాయమునకు చాలవరకు లోబడుచుందురు. ఆపాలకులకు స్వకీయప్రజలపైన ప్రేమయునుండును. విదేశపాలకులకట్టి బాధ్యతయు మనపై ప్రేమయునుండవు. బ్రిటిషుపాలకవర్గమునకు మనమొరవినబడదు. సామ్రాజ్యతత్వమే అసలు హింసాభూయిష్టము. కనుక భారతజాతియంతయు పరోక్షహింసకు లోబడినది. ఇప్పుడేర్పడిన శాంతిఅనేది నిస్తేజతను తామసత్వమును ప్రజలచైతన్యహీనతను తెల్పును

ఈసామ్రాజ్యపద్ధతి ఆర్థికముగను బాధకమే. నరులదేహమును రక్తమెట్టిదో, దేశపుఆర్థికక్షేమమునకు ద్రవ్యమట్టిది. మనదేశపు ద్రవ్య మీ 200 ఏండ్లనుండి నిరంతర మింగ్లండుకు పోవుచున్నది. రక్తస్రావమువల్ల నరుడు నీరసించి నిశ్చేష్టుడగును. అట్లే పూర్వం లోకమంతటికి ప్రముఖమైన మనదేశమిప్పుడు నాగరికదేశాలన్నిటిలో వెనుకబడి దరిద్రమై అజ్ఞానదుర్దశలో నున్నది. అయినను, ఇక్కడివైస్రాయి, గవర్నర్లు, జిల్లాకలెక్టర్లు వగైరా పెద్దయుద్యోగులకు బ్రిటిషుసైనికులకు మరియెక్కడను చెల్లించని హెచ్చుజీతములను పెద్దబత్తాలను ఇచ్చుచున్నారు. ఈగొప్పయుద్యోగులు తరుచు విదేశీయులు. ఆసొమ్మును హెచ్చుగవిదేశములకు పోవును.† బ్రిటిషువా రీదేశమునకు వచ్చినతరువాత ఈదేశపాలనకని ప్రభుత్వము మొత్తం సుమారు వేయికోట్లరూపాయలు ఋణము చేసినది; అందు చాలభాగము బ్రిటిషువారి రాజ్యవ్యాప్తికి వారి లాభమునకు చేయబడినదే. కాని దానిని తీర్చుబాధ్యతమాత్రం మనదట. అందుపైన వడ్డీవగైరాలు మనము చెల్లించుపన్నులనుండి యిత్తురు. ప్రత్యేకసదుపాయములతో బ్రిటిషుకంపెనీలు తమ పరిశ్రమలవృద్ధిచేయించి ఇక్కడ పోటీగ అమ్మటవల్ల, మనజాతీయపరిశ్రమ లణగినవి. ఇటీవల బ్రిటీషువా రీదేశమందును చాలకంపెనీ లేర్పర్చి, దేశీయపరిశ్రమలతో పోటీ చేయుచున్నారు. జాతీయప్రభుత్వముంటే అది స్వదేశీయవ్యాపారమును రక్షించును. ప్రత్యక్షమగు రక్తపాతముకన్న పరోక్షమగు ఆర్థికశోషణమే ఎక్కువహింసాకరము. ఇది జలగవలె పైకి తెలియకుండనే జనులసారమును పీల్చి సంఘమును క్రుంగజేయును.

భారతీయపాలన విషయములో బ్రిటిషువారి ఆర్థికనీతికొక్క యుదాహరణము చాలును. పూర్వ మీదేశమందు నౌకాపరిశ్రమ ఉన్నతస్థితిలో నుండేది. బంగాళము, ఆంధ్రదేశము, గుజరాతువగైరాలలో గొప్ప

---

† ఈపెద్దయుద్యోగులు ప్రభుత్వమునకు విశ్వాసముతో సేవచేయుదుమని కవెనెంటు అనే ఖరారు వ్రాసియివ్వవలె. అందులో దేశసేవ ప్రజాసేవ చేయుదుమని — షరతులేదు.

రేవుస్థలములందు గట్టి సముద్రనౌకలు నిర్మించేవారు, ఆయోడలందు దూరదేశాలతో అఖండవ్యాపారము సాగించేవారు. ఇంగ్లీషు ఈస్టిండియాకంపెనీవారును ఈదేశపునౌకలను ఇంగ్లండువరకు వ్యాపారము కుపయోగించేవారు ఇక్కడి నౌకలెక్కువ ప్రశస్తములని బ్రిటిషు చారిత్రకులును శ్లాఘించినారు. అయితే 19 వ శతాబ్దిలో బ్రిటిషుప్రభుత్వము తమదేశమందు పెద్దనౌకల గట్టించనారంభించినారు. అంతట వారు మనపరిశ్రమను నిరుత్సాహపరచినారు. ఈకాలపు నౌకానిర్మాణముకు నౌకాపరిశ్రమవృద్ధికి చాలవిధముల ప్రభుత్వసహాయ ముండవలెను. వ్యాపారవృద్ధికి దేశరక్షణకుగూడ ఇంగ్లండు, ఫ్రాన్సు, జర్మనీ, అమెరికా, జపానువగైరా నాగరికరాజ్యము లన్నియు తమ జాతీయనౌకలను ప్రోత్సహించి వృద్ధిజేసి వాటిపైనే రాజ్యపు కోస్తావ్యాపారం వగైరాలు సాగింతురు.† కాని మన ప్రభుత్వము బ్రిటిషునౌకలనే ప్రోత్సహించుచున్నారు. ఇట్లు క్రమంగా మన నౌకాపరిశ్రమ క్షీణించినది. ఈకాలపు దీర్ఘమహానౌకల నిక్కడ నిర్మించుటకు వలయు సౌకర్యములను మన ప్రభుత్వమింకను చేయలేదు. మనదేశీయవర్తకు లెవరైనను నౌకలుకొని తెచ్చినను, బలీయులగు బ్రిటిషుకంపెనీవారు భారతీయవ్యాపారులపైన కత్తికట్టి ఆపోటీయున్నచోట్ల మాత్రం ఓడకేవులు విపరీతముగ తగ్గించి, మన కంపెనీలకు రవాణా లేకుండజేసి, బాధించుచున్నారు. ఉభయులు పోటీచేసుకోవలెనని సర్కారువాదము. కాని నౌకానుభవము గల్గి, అర్బుదములకొలది ద్రవ్యమిదివరకే సంపాదించి లోకమంతటను ఇప్పటికి నట్లు లాభములీయు బ్రిటిషుకంపెనీలతో నిరాధారులగు మనకుకల్గుపోటీ మహాసురునికి మరిగుజ్జుకుమధ్య ద్వంద్వయుద్ధమువంటిది. మననౌకలుతిరుగు భారతప్రాంతమందుమాత్రం బ్రిటిషుకంపెనీలు తమనౌకలుకొంతకాలం కేవులు లేకుండనే వ్యాపారముకు తిప్పవచ్చు. అంతట, కొద్దిద్రవ్యముతో సాగించు

† ప్రపంచంలో 33 దేశములకు మంచి నౌకావ్యాపారమున్నది. వాటిలో 27 తమతీరవ్యాపారముకు విదేశనౌకలురాకుండ అసలే నిషేధించి యున్నవి.

మనకంపెనీ దివాలాతీయును; వెంటనే, వారు రేట్లుబాగుగ హెచ్చించి వెనుకటి నష్టము పూడ్చుకొందురు.* ఇట్లు ఎన్నియో స్వదేశీయ నౌకా సంఘములుచెడి, దేశీయులు బాధల పాలైరి. ప్రభుత్వమువారు విదేశపు తపాలు వగైరాల కంట్రాక్టులను బ్రిటిషుకంపెనీలకే గుత్తకిచ్చుచు, తద్ద్వారా ద్రవ్యసహాయము చేయుచున్నారు. ఈనౌకానష్టము మన విదేశవ్యాపారము కంతకును నిరోధకము. ఇందువల్ల జపానువగైరాలతో జరుగు పోటీలోను మనవెగుమతులకు నష్టముకల్గుచున్నది †

ఇట్లే సామానులరైల్వే రేట్లువగైరాలలోను దేశీయవర్తకముకు అన్యాయము గల్గుచున్నది. ఇట్లు మన యితరపరిశ్రమలును చెడినవి.

ఇట్లే ఆంగ్లవిద్య, ఆంగ్లసంస్థలు జనులలో భావదాస్యము తెచ్చి పెట్టినవి. మద్యపానవృద్ధి నీతిని చెడగొట్టినది. జనులకు స్వతంత్రతతో బాటు విచక్షణయు, పరస్పరౌదార్యమును క్రమంగా పోవుచున్నది. దీని ఫలితముగ స్వార్థపరత వర్గసంఘర్షమును, సామాన్యజనులలో అజ్ఞాన వ్యాధులు దైన్యమును హెచ్చియున్నవి. ప్రభుత్వపు చట్టములేకాక ఉద్యోగుల ఆజ్ఞలు హుకుములుగూడ తరుచు ప్రజాభిప్రాయమునకు వ్యతిరేకముగ నున్నవి. సర్కారు ఉద్యోగులు తాము "పబ్లికుసర్వెంట్లు" (=సంఘపునౌకర్లు) అనుసంగతిని మరచుచు, బ్రిటిషుపాలకులకు సేవ చేయుటే తమ ధర్మమనుకొన్నారు. తమ జీతములు బత్యములు ఈదేశపుసొమ్మే; స్వదేశీయులక్షేమ మారయుటే యుద్యోగులధర్మము కావలె. ఇతరదేశములందట్లే తలతురు. మన ప్రభుత్వపు ప్రేమరాహిత్య మిందులోను స్పష్టమగుచున్నది. మొత్తముమీద ఆర్థికనైతికసాంస్కృతిక రాజకీయరంగముల నాల్గింటిలోను బ్రిటీషువారి ప్రాభవము మనదేశమును బాధించుచున్నది.

---

* 50 ఏండ్లక్రిందట తాతాకంపెనీకి, 32 ఏండ్లక్రిందట చిదంబరం పిళ్ళెగారి స్వదేశీకంపెనీకిని బ్రిటిషుకంపెనీవారితో పోటీవల్ల అట్లు జరిగినది. ఇటీవల సిందియాకంపెనీకి గూడ కొన్నిసారులు బాధగల్గినది.

† ఇప్పటికిని మనతీరవ్యాపారములో నూటికి 25 మాత్రం ఈదేశీయులది. తక్కినదియు విదేశాలతో వ్యాపారమంతయు గూడ, విదేశీయులే సాగించుచున్నారు.

# 5 మొదటి ప్రజాధోరణి.

సాంఘికంగాను ధార్మికంగాను ప్రేమతత్వము బోధించుటకు 19 వ శతాబ్దిలో రామమోహన దయానంద రామకృష్ణాదులు మాతృభాషద్వారా గట్టికృషినిచేసిరి; కాని ఇప్పటిస్థితిలో సాంఘిక కృషివల్లనే తగుఫలముండదని, ఆర్థికరాజకీయాభివృద్ధిగల్గినప్పుడే జనులసాంఘికనైతిక సంస్కృతి బాగుపడి జనులుతలయెత్తగల్గుదురని కొందరు కనిపెట్టి; కొన్నిప్రాంతీయ సంఘముల నందునిమిత్తంస్థాపించిరి. పిమ్మట దేశమంతటి జాతీయాభివృద్ధికై 1885 లో 'కాంగ్రెసు' ఏర్పడినది. * భారతీయ ప్రముఖులు కలసి తమ రాజకీయాది బాధలను సాలీనా చర్చించి వాటిపరిహారము గోరుచు కొన్నితీర్మానములను ప్రభుత్వముకు పంపసాగిరి. ప్రారంభమందు ఆంగ్లవిద్యాధికులగు కొద్దిమంది మాత్ర మీసభలలో కూడి, అప్పటి పాలనలోని కొన్నిలోపములను సవరింపగోరిరి; దేశీయులకున్నతోద్యోగములు, న్యాయశాఖవిభాగము, ఇట్టివానిని కావలెనని కోరిరి. కాంగ్రెసు కాయారాష్ట్రములందును శాఖాసభలారంభించినవి. కాంగ్రెసుతోబాటు సంఘసంస్కరణసభలు జరుగుచు, కొన్ని సాంఘిక బాధల నివారణకు తీర్మానములు జర్గుచుండినవి. హిందువులలో వితంతు వివాహము, వర్ణాంతర వివాహము, మితపానము, అంతర్జాతీయ భోజనము, స్త్రీవిద్య, ఇట్టివానిని కోరుచుండిరి. పిమ్మట పారిశ్రామిక సభలును వీటితోసహా జరుపనారంభించిరి. వాటిలో పాశ్చాత్యదేశాలలోవలె మన దేశంలోను యంత్రము లభివృద్ధిచేసి బహుళోత్పత్తి జరిగించి, తద్ద్వారానే-దేశీయపరిశ్రమలస్థాపించవలెనని ఉద్దేశించిరి. సభాకార్యమంతయు ఆంగ్ల భాషలో జరుగుచుండెను. విద్యలోను ఆంగ్లపాఠశాలలు హెచ్చింప బూనిరి. ప్రభుత్వమువారును తమరాజ్యశాఖల నిర్వహణము కవసరమగు

---

* 'కాంగ్రెసు' (ఆంగ్లము) అనగా మహాసభ. అమెరికాలోని సంయుక్తరాజ్యమువారు బ్రిటిషుసామ్రాజ్యపు ఆధిపత్యమునుత్రోసివేసి స్వతంత్రపాలనను స్థాపించుకొన్న సభకీపేరు మొదటవచ్చినది; అక్కడప్రజాపాలక సంస్థ కిప్పటికీ అదేపేరు నిల్చియున్నది.

నుద్యోగులు తయారగునట్లు కొందరు భారతీయుల కాంగ్లవిద్య నేర్పిరి; కొన్ని పెద్దయుద్యోగములు భారతీయులకిచ్చి, ఆందోళకులను తృప్తిపరుప జూచిరి. సామాన్యులలో మాత్రము జాతీయోద్యమము వ్యాపించనీయ లేదు. ప్రారంభవిద్య వ్యాప్తికి తగుకృషి జరుగలేదు. దేశభాషాపత్రికల మీద ప్రత్యేక నిర్బంధము లేర్పరచిరి. ప్రభుత్వముపైన జనుల కసంతృప్తికల్గించుట 'రాజద్రోహ' పు నేరము; బ్రిటిషు సర్కారుపైన తిరుగబడుట అన్నిటిలో గొప్పతప్పుగ నిర్ణయించిరి. సాంఘికంగాను ఒక్కొక్క జాతిపై నింకొకజాతికి ద్వేషముగల్గించుట నేరమనియు చట్టముచేసిరి* అయితే యీనిబంధనల నమలుచేయుట కేవలం సర్కారువారి యిష్టము. క్రియలో, ఇక్కడి ప్రభుత్వంపైన యూరపియనులపైన భారతీయులకు కల్గుద్వేషమునణచుటకే తరుచు ఈచట్టములను ప్రయోగించినారు, ఈచట్టములక్రింద కొందరు జాతీయవాదు లరెస్టుఅయి దండింపబడిరి. విచారణ లేకుండనే అనిష్టనాయకుల నిర్బంధించుటకును నిబంధనలుంచినారు. కాని, దేశద్రోహము ప్రజాద్రోహము నేరములనలేదు. యూరపియనుల కిక్కడ ప్రత్యేకాధికారము లీయబడినవి. అప్పుడాంగ్లేయులిప్పటికన్నను భారతీయులను నీచముగ జూచుచుండిరి. ప్రజలకు స్థానికసంస్థల కొద్దిపాలనను 1884లో వైస్రాయియగు రిప్పనుప్రభువుగా రిచ్చిరి. తరువాతవచ్చిన వైస్రాయీలు కేవలం సామ్రాజ్యధోరణి వారే. మరియు మనదేశమందుండు కొందరాంగ్లేయులు భారతీయులను తృణీకరించుట అవమానించుటతో, పరస్పర హింసాధోరణి వ్యాపించినది. క్రమంగా, ఈదేశీయులలో కరువుబాధయు హెచ్చినది పూర్వకాలమందును కరువులు వచ్చేవి, ఆబాధలవల్ల ఒకప్రాంతమందు పంటలుపోగా, అక్కడజనుల కవసరమైనంత ఆహారము లేకపోయేది. ఆకాలమందు (లోకమంతటను) ఒక ప్రాంతపు పంటలనింకొక పాంతముకు చేరవేయుట కష్టమయేది. కాని, ఈకాలపు కరువులు వేరు.

---

*ఇండియన్ పీనల్ కోడ్డు 124 ఏ. 153 ఏ సెక్షనులు. ఈసెక్షనులు 1897 లో పెట్టినారు.

ఇప్పుడు అన్ని దేశాలలోవలె ఇక్కడను రైల్లువగైరాలవల్ల సరఫరాకు లోటులేదు. ఒకప్రాంతములో చెడినను ఈదేశములో మొత్తముమీద మనదేశీయులందరికి చాలునంత పండుచునే యున్నది. నాలుగైదిగుమతికిని వీలున్నది. కాని జనులలో హెచ్చుమంది వృత్తిలేక గర్భదరిద్రులైనారు; వారికుండినద్రవ్యము పోయినది. వారికిప్పుడు ప్రతిసాలునకరువే వారన్నము, బట్టలేక అల్లాడుచున్నారు. ఇట్టిస్థితిలోను కోట్లకొలది రూపాయల గింజలు, దూది బట్టలు విదేశీయులిక్కడనుండి కొనివిదేశములకు తెచ్చుకొనుచున్నారు. ఈమాయకరువుమనదేశంలోకొందరికిస్థిరవాస మేర్పరచుకొన్నది. తక్కిన నాగరికదేశాలన్నిటిలోను జనులకు వృత్తిగల్పించియో, ద్రవ్యమిచ్చియో, ప్రభుత్వము పోషించును. వారు జనులందరికిని నిర్బంధముగ ఉచితవిద్య జెప్పింతురు. మనదేశమందు సర్కారువారట్టిబాధ్యతలు వహింపరు, మద్యపానము చేయుటకు బిచ్చమెత్తుటకునో ప్రభుత్వము ప్రజలకు స్వాతంత్ర్యము నిచ్చుచున్నారు. పెద్ద వ్యాపారములు తరుచు బ్రిటిషువారే నడుపుచున్నారు. విభజించి పాలించుట అనగా పాలితజనులలో విభేదములు కల్పించి, అందుచే దుర్బలులజేసి, వారినణచియుంచుట మన బ్రిటిషుసామ్రాజ్యపు నీతి; ఇది కేవలం హింసాపద్ధతి; ఇందువల్ల ఆయాసంఘములమధ్య కలతలు పెరిగినవి. అది పిమ్మట సర్కారుపైనను పరస్పరమును హింసాధోరణిరూప మెత్తినది. అందువల్ల ప్రజల అంతశ్శక్తి క్షీణించుచు, దాస్యము దృఢమగుచున్నది. సంస్థానములలోను ప్రజలబాధలు హెచ్చినవి. ఇట్టిస్థితిలో జనులకు స్వల్పమగు తత్కాలసదుపాయములవల్ల తగు చికిత్సకలుగదని ధీమంతులకు స్పష్టమైనది. ప్రభుత్వము ప్రజలలాభముకే పాటుపడినట్లున్నను, క్రియలో అట్లులేదు. అప్పటిమితవాదులగు మన రాజకీయనాయకులు ఉప్పుపన్ను, అడవినిబంధనలు, భూమిపన్నుపద్ధతి వగైరాలమార్పు కోరి, క్రియలో సాలుకొకసారి యట్టితీర్మానముల జేసి అర్జీలపంపుటే జరిగేది. అట్లుకాక ఇంగ్లండుతో రాజకీయసంబంధము వదలి పోవలెనని కొందరు విద్యావంతులకు తోచినది. ఇట్లు జాతీయోద్యమ మంకురించినది.

# 6. జాతీయోద్యమపు వికాసము.

ఇట్లు జనులకు స్వాతంత్ర్య మవసరమని తోచి, 'స్వరాజ్యము' కావలెనని కాంగ్రెసువారు సాలీనా తీర్మానింపసాగిరి. కాని, వారప్పు డుద్దేశించిన స్వరాజ్యము బ్రిటిషుసామ్రాజ్యములోనే ఉపనివేశముల కుండిన 'కలోనియల్' ప్రభుత్వము. అయితే, బ్రిటిషువా రట్లీయలేదు. ఆందోళనకు ప్రతిక్రియగ దమనము సాగించిరి.

ఈశతాబ్దపు ఆరంభమందు వైస్రాయి (=రాజప్రతినిధి) యైన కర్జను ప్రభుపు ప్రత్యక్షముగనే భారతీయనాగరకతను నిరసించి, పాశ్చాత్యసంస్కృతి నుగ్గడించి, పైపెచ్చు భారతీయుల నిందించెను; బ్రిటిషు పాలకు లట్లు తమధోరణి వెల్లడించిరి; ప్రజాభిప్రాయము ధిక్కరించి వంగవిభజనాదులు జేసిరి; ఈదేశంలో హిందూ ముస్లిములమధ్య విభేదములు హెచ్చించుపద్ధతు లవలంబించిరి. కాంగ్రెసులో మితవాదులగు మెహతా, రానడే, బెనర్జీ, గోఖలే ఇత్యాది నాయకులు బ్రిటిషుపాలకులు మొత్తంమీంద సదుద్దేశయుతులు త్వరలో నీదేశముకు 'కాలనీల స్వరాజ్య' మిప్పింతురని ఆశపడిరి. దేశములో 'సాంఘికసంస్కరణ'కు వెంటనే కృషి చేయవలెననిరి. వారు నగరజీవితముకే అలవడినవారు. అతివాదులు అనగా జాతీయవాదులు బ్రిటిషుపాలన ఈదేశముకు మొత్తంమీద బాధకమైనదనిరి. వెంటనే రాజకీయస్వాతంత్ర్యము రావలెనని వీరి సిద్ధాంతము. వీరి ముఖ్యనాయకుడు శ్రీ బాలగంగాధర తిలకు. ఈయన గొప్పవిద్వాంసుడు, మహారాష్ట్రుల చారిత్రకకేంద్రమగు పూనాలో కొంతకాల ముపాధ్యాయుడై, విద్యాభివృద్ధికై కృషి చేసెను, పిమ్మట కేవలం దేశసేవాపరుడాయెను. కర్మలన్నిటిని వదలవలెనను అద్వైతసిద్ధాంతమును తన గీతాభాష్యములో ఖండించి, నరులు నిరంతరంలోకహితకరమైన కర్మల చేయుటవలననే మోక్షమొందగలరని వివరించెను. ఈసిద్ధాంతమును ధర్మయుద్ధమెప్పుడును కర్తవ్యమను భావమును, ఆయన రాజకీయములకు నన్వయించెను. "స్వరాజ్యము ప్రజల జన్మహక్కు, సురాజ్యముకన్నను స్వరాజ్యమే ముఖ్యము" అని యిప్పటి

నాయకులలో శ్రీ తిలకుగారే మొదట తన యుపన్యాసాలద్వారాను తన ఆంగ్ల మరాటీపత్రికలగు, "మరాటా కేసరి" ద్వారాను ధైర్యముతో బోధించిరి; ఈయన మూడుసార్లు రాజద్రోహబోధకై నిర్బంధితులై స్వాతంత్ర్యయుద్ధముకు మార్గదర్శకులైరి. సాంఘిక విషయాలలో మన ప్రాచీన సంప్రదాయముల నుద్ధరింపబూనిరి.

1906 ప్రాంతమందు వంగీయవిద్వాంసుడగు అరవిందఘోషును దేశమాత నారాధించుడని యుద్బోధించి, దేశభక్తినొక తాత్విక సిద్ధాంతముగ బోధించెను; ఈయన తనబాల్యము నింగ్లండులో గడిపి, ఆంగ్లభాషాసాహిత్యములలో గొప్ప ప్రతిభ సంపాదించెను. తిలకువలె ఈయనయు, పంజాబునుండి లాలాలజపతిరాయియు, ధర్మయుద్ధము చేయుట విధియని గీతార్థము చెప్పినారు.‡

ఇట్లు మన జాతీయరంగములో నప్పుడు రెండుపక్షము లేర్పడినవి. ఈరెంటి మధ్యను 1906 ఆఖరున శ్రీ దాదాబాయి నౌరోజీ తత్కాలము కెట్లో సమన్వయము చేసెను. ఈయన మనరాజకీయపితామహుడు, గొప్పమేధావి, అత్యల్పసంఖ్యాకమగు పారసీజాతికి చెందియు భారతీయు లందరికి ప్రేమాస్పదుడైనాడు; ఈయన ప్రజాప్రేమనే ఆదర్శముగ నెంచుకొని యువకులకు పెద్దలకుగూడ తనకార్యపరత్వముతోను ఉదార భావములతోను ఆదర్శపురుషుడైనాడు. ఈయన బరోడా సంస్థానపు దివానుగనుండి దానిని ప్రజారంజకముగ పాలించి, గొప్ప సంస్కరణల జేసెను. పిమ్మట ఇంగ్లండుకువెళ్లి, తనప్రేమతత్వముతో బ్రిటిషువారి ప్రేమ జూరగొని బ్రిటిషుపార్లమెంటులో సభ్యుడైనాడు, ఆంగ్లేయుల కభిమతుడాయెను; ఉభయజాతులమధ్య సౌహార్దము గల్గింప బూనెను. ఇంగ్లండులో మనదేశపు సమస్యలనుగూర్చి తీవ్రప్రచారము చేసెను; అర్థశాస్త్రమందు ద్రవ్యవ్యాపారసమస్యలందు మంచి జ్ఞానానుభవములుగల వాడు. ఉదారము ప్రశస్తమని శ్లాఘింపబడే బ్రిటిషుపాలన మాదేశము

‡ కాని, లాలాజీ ముఖ్యముగ సంఘసంస్కర్త, రాజకీయాలలో మితవాది.

నకు ఆర్థికంగా హింసాకరమైనదని, ఇది పరోక్షమైనను ప్రత్యక్షహింస కన్నను బాధకమనియు, శాస్త్రీయహేతువాదముతో నొకగ్రంథములో నిరూపించెను† భారతీయులలో పరస్పరమును, బ్రిటిషువారికి భారతీయులకుమధ్యను మైత్రిబలపర్చుట యీయన యుద్దేశము.

ఈయన 80 ఏండ్ల వృద్ధుడైనను (1906 సం॥లో) 3వ సారి కలకత్తాలో కాంగ్రెసు కధ్యక్షుడై, అందుండి స్వరాజ్యసందేశము ప్రజలకిచ్చెను; దానికి స్వదేశి, విదేశవస్తు బహిష్కారము, జాతీయవిద్యాసాధనములని నిరూపించెను. తరువాత కాంగ్రెసులో రెండుపక్షములవారు 1907 లో సూరతుకాంగ్రెసులో ప్రత్యక్షముగ కలహించిరి. పరస్పరసహనభావమును రెండుపక్షములును చూపలేదు. సర్కారుపద్ధతియు ఈవిభేదము పెరుగుటకు కారణమైనది. సర్కారు 'అతివాది' పక్షీయులపైనసాగించిన అప్పటిదమనచర్యకు మితవాదులు అర్ధాంగీకారముజూపిరి. అతివాదులలో చాలమంది ప్రజలలో పరస్పరప్రేమ పెంచు నిర్మాణపు కార్యములుచేయుటకుబదులు విదేశీయులపైన క్రోధముచూపి, బ్రిటిషు వారిని దూషించి వాచికహింసకు పాలైరి. మితవాదులును ప్రజలలో జీవశక్తిని ధైర్యోత్సాహములను గల్గించలేదు; అతివాదులనుమాత్రము నిందించిరి. వారిలో కొందరు సర్కారునుండి గొప్పగొప్ప యుద్యోగములు పొందిరి.

అప్పుడు మనసంస్కృతిని కాపాడుచునే ఈరెండుపక్షములకు మధ్యగ జాతీయతను పోషించుట కింకొకపక్షమును శ్రీ ఆనీబెసంటుగారు స్థాపించినడిపిరి. ఈమె జీవితమద్భుతము, ఈమె జన్మతః ఐరిషు స్త్రీ; చాలకాల మింగ్లండు అమెరికాలలో వసించి, గొప్పనాయకులతోను అనేకోద్యమములతోను పరిచయము కల్గించుకొనెను, ఆనువంశికమగు క్రైస్తవమత ప్రచారకులలో నావహించిన మూఢవిశ్వాసముల జూచి, ఆమతము వదలి, 'చార్లసుబ్రాడ్లా' ఇత్యాదులతో కలసి నాస్తికతను బోధించెను; అంతట హిందూమతము వగైరాల నభ్యసించి, లోక

† Poverty and Unbritish Rule in India.

మతములన్నియు సర్వమానవసౌభ్రాత్రముకు ఈశ్వరుని జనకత్వమును బోధించునని నిశ్చయించి, థియాసఫీమతస్థురాలై, పిమ్మట దానికధ్యక్షురాలై, పై సిద్ధాంతములను బోధించదొడగెను. ఈమె తుదకు మనదేశమందే కాశీ అడయారు (మద్రాసు)లలో నివసించు భారతీయ సంస్కృతిలోని విశేషములను వివరించెను; ఈమె రాజకీయరంగమందు ఐరిషు పద్ధతిని 'హోంరూలు'సంఘమును స్థాపించి, తీవ్రప్రచారము చేసి, సర్కారువల్ల నిర్బంధముగూడ అనుభవించెను. ఈమె అప్పటి కొందరు యువకులు సాగించు హింసాచర్యలను తీవ్రముగ ఖండించెను.

సుప్రసిద్ధ ఠాకూరువంశీయుడు ఆధునిక కవిసార్వభౌముడు కళాభిజ్ఞుడునగు రవీంద్రుడును అప్పటికే బెంగాలులో కొందరు యువకులును ప్రభుత్వమును సాగించు హింసాచర్యలను తీవ్రముగ నిరసించెను. అంత ర్జాతీయతను విశ్వప్రేమను భక్తిని స్వభాషలోను ఆంగ్లములోనుతనయద్భుతరచనలద్వారా బోధించుచున్నాడు, జాతీయతను స్వరాజ్యాసక్తిని సాంఘికోన్నతిని కోరుచు, ఎందుకును ద్వేషభావము చూపుటకిష్టపడక, అట్టిధోరణి నరికట్ట యత్నించినాడు. ఈమహనీయుడు బెంగాలులోని బోల్పురములో శాంతినికేతనమును విశ్వభారతియను సర్వకళాపరిషత్తును స్థాపించెను* ప్రపంచపు ఉన్నత సంస్కృతులను, మతకళాదులను అభ్యసించి, వాటికి సమన్వయము చేయుట కిప్పుడు రవీంద్రుడు తనజీవితమును ధారపోయుచున్నాడు; ఇట్లు అధునిక కాలంలోను కొందరు అహింసకు తాత్త్వికంగా ప్రాముఖ్యమిచ్చినారు. కాని వారందరు నగర జీవితమును విద్యావంతులనే తమదృష్టిలో నుంచుకొన్నారు. అందువలన సామాన్యజనులలో (ముఖ్యంగా స్త్రీలలో యువకులలో) తగు సంచలనము కలుగలేదు. ఈలోగా ద్వేషపూరితమైన విప్లవోద్యమము లోలోపల వ్యాపించుచు, అప్పుడప్పుడు రాజకీయహత్యవంటి వివిధ హింసలద్వారా తలయెత్తుచునేవచ్చినది.

---

* 'యత్రవిశ్వం భవత్యేకనీడం.' అను వేదవాక్యము నీమహాసంస్థకు మకుటముగ పెట్టుటనుబట్టియే, ఆయన విశ్వప్రేమాదర్శము స్పష్టము.

# 7. విప్లవపక్షము.

ఈశతాబ్దిలో పాశ్చాత్యసంపర్కమువలన మన జాతీయజీవితము చెదిరి, చాల మార్పులజెందినది. సాంఘికముగను ఆర్థికముగను స్వార్థపరతపరస్పరద్వేషము హెచ్చినవి. రాజకీయముగ నాయకులసంగతి చూచినాము. మధ్యవర్గములో కొందరు భయస్థులు రాజభక్తులునైనారు, కొద్దిమంది యువకులు హింసావాదులైనారు. వీరిదే విప్లవోద్యమము.

1904 లో యుద్ధమున జపానీయులు రష్యానోడించిరి. ఇందువల్ల బలీయమగు పాశ్చాత్యసామ్రాజ్యమును క్రియాశక్తిగలప్రాచ్యులోడింపవచ్చునని ఈదేశపుయువకుల కుత్సాహము కల్గినది. కొందరనునట్లు తెల్లజాతివారు అజేయులనుసంగతి నిజముకాదని తేలినది. అయితే నవ్యవిద్యవల్ల కొందరు భారతీయులకుగల్గు జాతీయభావమును సమన్వయించుటకు బదులు సర్కారుతమశక్తితో అణచదొడగిరి. ఇట్టిదమనపద్ధతి యూరపులోను కొన్నిరాజ్యాలలో జరుగుచుండెను. రష్యాలో 'జారు'చక్రవర్తి తన సామ్రాజ్యప్రజల బీడించుచుండెను. (జర్మనీ రాజు 'కైజరు' బిరుదుతో మధ్య యూరపులో కొంతవరకిట్లే పాలించెను.) మరియు యాంత్రికవ్యాపారపు యజమానులగు కొద్దిమందిధనాఢ్యులవల్లను బీదకార్మికులకు బాధకలిగినది. అధికారమత్తులగుసామ్రాజ్యవర్గము పుంజీపతివర్గముతో చేతులు కలిపిరి. ప్రజానాయకులు కొందరిట్టి ప్రభువర్గము నెట్లైన కడతేర్చదలపెట్టిరి. వారు చాలవరకు యువకులు, ఉద్రిక్తులు, సాహసులు; ప్రభుత్వములు నీతికిలోబడక, భౌతికశక్తితోనే పాలించిరి; ఆ ప్రభుత్వములు విజ్ఞానప్రకారం గొప్పఫిరంగులను రివాల్వరులను పోగుచేసి ఆయుధాగారములనింపిరి. వారికి ప్రజాప్రేమ ధార్మికనీతిలేవు. వారిని ఆయుధములతో బహిరంగముగ నెదుర్చుటకు అవకాశము లేనందున, హింసాభావముగల క్రాంతికారులు విజ్ఞానసహాయముతోనే గూఢముగ బాంబులను పిస్తోలు వగైరాలను తయారుచేసి వాటితో నిరంకుశప్రభువులను

హూనీ చేయబూనిరి. ఇట్టి గూఢహత్యలు రష్యా జర్మనీ వగైరాలలో జరుగుచుండెను. స్వదేశములనుండి ప్రవాసితులై యీ క్రాంతికారులు లండను పారిసుపురములందుండుచు కుట్రలు సాగించిరి; ఈవిప్లవతత్వ మును ప్రస్తుతించుచు కొన్ని గ్రంథములును జారీయైనవి. ఈస్థితిలో ఉన్నతవిద్యకై యూరపుకు వెళ్ళిన మనదేశపుయువకులు కొందరీరచన లజదివి, ఆవిప్లవకారులతో కలుసుకొనిరి; యూరపులోని స్వేచ్ఛావా యువులతో బాటు, జాతీయస్వాతంత్ర్యమును హింసాచర్యలతో సాధించు ప్రవృత్తినిగూడ నేర్చుకొనిరి; వీరక్కడిరహస్యపు ఫ్యాక్టరీలలో బాంబు లు చేయు పద్ధతులను గ్రహించిరి. స్వదేశముకు మరల రాగానే ఈయు వకులు తాము మొదట నుద్దేశించిన వృత్తులుమాని, దేశస్వాతంత్ర్యము సంపాదించుటకే జీవిత మర్పింపనిశ్చయించిరి. అయితేమనదేశదాస్యముకు కొందరాంగ్లేయులు వారినాశ్రయించు 'రాజభక్తు' లగు మన దేశీయో ద్యోగులునే కారకులనుకొని, అట్టివారిని చంపితే స్వరాజ్యము కలుగు నని భ్రమించిరి. వీ రీదేశపుయువకులలో చాల రహస్యప్రచారము చేసి, గూఢ సమితులను స్థాపించి, దౌర్జన్యపద్ధతులతో పాలకులను కొందరిని చంపి, మిగిలినవారిని భయపెట్టజూచిరి. వీరు దేశభక్తులు, సాహసులు; సర్కారుకు తమసంగతి తెలిసిన తమకు ఉరితప్పదని వీరికి తెలియును; కనుక దేశముకై సర్వస్వము (ప్రాణముగూడ) అర్పించుటకు వీరు సిద్ధులే; కాని, ఈహింసాపద్ధతి మనదేశపు సంస్కృతికి వ్యతిరిక్తము, వీ రెంతప్ర చారము చేసినను, యుక్తులుపన్ని సమర్థతతో నిర్వహించినను, మనదేశపు జనసామాన్యము వీరిపద్ధతులను హర్షించక వ్యతిరేకులేయయిరి. మరియు వీరిహింసాసిద్ధాంతములును సరికావు; ఇట్లు కొందరిని రహస్యముగ చం పుటవల్ల తక్కిన సర్కారుఉద్యోగులు భయపడుదురనుటయు వట్టిభ్రమ. వీరిచర్యవల్ల కొద్దిమంది బ్రిటిషుఉద్యోగులు (కొందరు మనదేశపు పోలీ సువారుగూడను) ఎట్లో బాంబులు పిస్తోలుదెబ్బలు తగిలి మరణించిరి. గరుచు దైవముననో పొరబాటునో గురితప్పుట ఇతరులు హతులౌటయు

 

జరిగెను. ఆహింసాచర్యవల్ల క్రాంతికారులకు దేశముకుకూడ లాభించక నష్టమేకల్గినది. బ్రిటిషువారు నిదానముగల ధీరులు, చాలయుక్తిపరులు, అనుభవజ్ఞులు. వారు అప్రమత్తులై, పోలీసుసిబ్బంది హెచ్చించి, ఎక్కువసొమ్ము ఖర్చుతో సమర్థులగు భారతీయులనే గూఢచారులుగ బెట్టిరి. విప్లవకారులు దాదాపు అందరూ హిందువులు, సిక్కులు; ఈవిప్లవము బెంగాలు పంజాబులలోనే కొంచమైనను వ్యాపించినది. అక్కడ ముస్లిములు హెచ్చు. బ్రిటిషుప్రభుత్వమువారంతట ముస్లిములను చేరదీసిరి. ఇట్టి కొన్నిచర్యలవల్ల సాంఘికవైషమ్యము చెలరేగి హెచ్చినది. క్రాంతికారుల బట్టుటకు మేధావులగు పోలీసు లేర్పడిరి; వీరిలో చాలమంది ముస్లిములు. పట్టుకొనువారి కున్నతోద్యోగములు బహుమతులు సర్కారువారిచ్చిరి. గూఢచారులు తాముసు క్రాంతికారులవలె నటించి, నమ్మించి, ఎట్లో వారిజాడలు రహస్యముగ తీసి, బాంబుకార్ఖానాలను జూచి, అంతట రహస్యముగ సర్కారుకు వారి గుట్టు తెల్పుచుండిరి. పోలీసువారు హఠాత్తుగ గూఢముగవచ్చి దాడిచేసి, కొందరు క్రాంతికారులను బాంబులను పట్టుకొనిరి; న్యాయనియమములు సవరింపబడి, ప్రత్యేకపు రూలు ప్రకార మాయువకుల విచారణజరిగి, కొందరికి ఉరి, మరికొందరికి ద్వీపాంతరవాసమును జరిగినవి. తరువాత, అనుమానమున చాలమంది నరెస్టుచేసి, వారిని పోలీసులు బాధించుచుండిరి; జాతీయసంస్థల నణచివేయుచు, జనులకు భీతిని దిగులును గల్గించుచుండిరి. ఆక్రాంతికారుల ఆదర్శమెట్టిదైనను, వారిచర్యలబట్టి ప్రజలకు వారిపై క్రోధముగల్గెను. ప్రజాసానుభూతి లేక, ఏయుద్యమమును కొనసాగదు. ఆక్రాంతిపరులు తమచర్యల కవసరమగు ద్రవ్యము రహస్యముగ సంపాదింపవలె; అందుకు గూఢముగ శ్రీమంతులను ఆయుధములతో బెదిరించి, హింసించి దోచుకునేవారు. వీటివల్ల ఆయామతస్థులుకులములు వర్గములు వీటిమధ్యవిరోధములు హెచ్చి, సాంఘికస్థితియు చెడినది. ఐనను మధ్యవర్గపు యువకులు లా యుద్యమంలో

చేరుచునే యుండిరి. ఇప్పటి బలీయమగు సర్కారును అట్టి హింసాచర్యలతో సాధింప వీలు లేదని ఇక్కడి ప్రజాసామాన్యము స్వాతంత్ర్య సాధనకైనను హింసాపద్ధతిని హర్షించరని దానిఫలితముగ తేలినది.

ఏ వ్యక్తులపైనను మనకు ద్వేషముండకూడను. మరియు, రాజకీయపు దోపిడులజూచి, కొందరు మధ్యవర్గపు నిర్వ్యాపారులును ధనికుల యింట గూఢముగ సాయుధులై జొరబడి దోపిడులు సాగించిరి. బెదరింపులుజరిగెను. వీటిలో నేది రాజకీయమో ఏది ఆర్థికమో, తెలియుటయు కష్టమైనది. ధనాఢ్యవర్గములో కల్లోలము బయలుదేరినది.

ఈస్థితిలో ప్రపంచయుద్ధపు రూపమున లోకమంతటను హింసాజ్వాల వ్యాపించి, సంఘస్థితిని తారుమారు చేసినది.

# 8 మొదటి ప్రపంచయుద్ధము.

ఆమహాయుద్ధము 1914 సం॥రం జూలైలో ఆరంభించి, 1918 సం॥రం నవంబరులో అంతమైనది. పూర్వపుయుద్ధములకన్న నదియెక్కువ భయంకరము, హింసాయుతము. ప్రకృతివిజ్ఞానము వృద్ధియై, కొత్తకొత్త శస్త్రాస్త్రము లేర్పడి, వాడుకకువచ్చినవి. వాటిద్వారా విపరీతమగు వినాశము జరిగినది. ఆయుద్ధపుకారణమును ఆరాజ్యముల యుద్ధాతురతను సూచించును. యూరపులో ఆస్ట్రియాయువరాజును దాని దక్షిణమందలి సర్వియాలో నెవరోచంపిరి. అందుకేదో పరిహారమేర్పర్చుకొని, తేల్చుకోవలసినది. ఆవిషయ మారెండు రాజ్యములకే వదిలియుంటే, అల్లేజరిగియుండవచ్చు. కాని ఆయాపెద్దరాజ్యములు డీకొనుటకు వేరే ప్రబలకారణములుండెను. యూరపులో ముఖ్యజాతులమధ్య యాంత్రిక పరిశ్రమల వృద్ధికి తద్ద్వారా ద్రవ్యసామ్రాజ్యబలము కు పోటీ నానాటికి హెచ్చినది. పాలకులు తమదేశపు పరిశ్రమల సరుకుల నితరదేశాలలో అమ్మించి, అవసరమైన ముడిసరుకుల నందుండి తెప్పించునిమిత్తం తమ సామ్రాజ్యమును బలపర్చిరి, తక్కిన విదేశాలలోను ప్రాబల్యమును హెచ్చించుకొనిరి. అందు నౌకలను సేనలను పెంచిరి; ఈపోటీలవల్ల పరస్పరం సంఘర్షము కలతలుపెరిగినవి. మరియు నల్లజాతులసారము లాగుటలో శ్వేతజాతులమధ్య పోటీహెచ్చినది. ముఖ్యముగా బ్రిటిషు సామ్రాజ్యము జర్మనీ ఈరెండురాజ్యాలమధ్య స్పర్థపెరిగినది. 1910 నుండి తగువులేర్పడుచు, దినదినగండముగ నుండెను. ఆధునిక యుగంలో యుద్ధము జరిగితే ఘోరహింసయు అమితనష్టమును తప్పదని గ్రహించి, రాజనీతిజ్ఞులు తత్కాలము కెట్లో సవరించుచువచ్చిరి. కాని, అహంకారములు, అసహనము, విరోధభావములు క్రమంగా మరింత హెచ్చినవి; రకరకముల మారణసాధనములతో ప్రత్యర్థినణచి విజృంభించు సమయముకై ఈపాలకులు వేచియుండిరి. ఇట్టిస్థితిలో శస్త్రనిర్మాతలును స్వలా

భముకై రాజ్యాలమధ్య కలతపెంచిరి. కడుపుతో నున్న యామె కనక మానునా? హింసా తత్వ గర్భితులై హుంకరించు రాజ్యాలమధ్య యుద్ధము రాకమానదు. ఎండిపోయిన కారడవులవలె, యూరపుదేశములు దాహ్యస్థితిలోనున్నవి. అప్పు డాఆస్ట్రియా యువరాజు హత్యయను రవ్వ తగిలి భగ్గుమని త్వరలోనే దావానలమైనది. ఆస్ట్రియాను సాధించుటకు రష్యాప్రభుత్వము సర్వియనులకు తోడైనది. రష్యాపైన విరోధముగల్గి సజాతీయమైన జర్మను ఆస్ట్రియను లేకమైరి.

ఆయారాజ్యములలో ప్రబలురు తమ రాజ్యరక్షణకు ప్రజాక్షేమముకును వెంటనే యుద్ధమవసరమని అసత్యప్రచారములతోను ప్రజల భ్రమపెట్టిరి. ఇట్లు మహాయుద్ధము చెలరేగినది. జర్మనులు సమర్థులు. వారి సేనాబలమును నిర్మాణశక్తియు గొప్పవి. ఇదివరలో ఫ్రెంచి బ్రిటిషురాజ్యములు పరస్పరం విరోధముతో నుండేవి. కాని జర్మనురాజ్యపు ప్రాబల్యము తగ్గించుటకై, ఈరెండు రాజ్యములు మైత్రిచేసుకొన్నవి. జర్మను ఫ్రెంచిరాజ్యములమధ్య పూర్వ విరోధముండెను. 1870-71 సం॥ యుద్ధములో తమవల్ల జర్మనులు రాబట్టిన అల్సెసులోరైను జిల్లానురాబట్టుకొనుటకు, తమసామ్రాజ్యబలము హెచ్చించుటకు, ఫ్రెంచిప్రముఖులు నిశ్చయించిరి. జర్మనుల వ్యాపారపుపోటీని సైనికశక్తిని అణచివేసి తమ యాధిక్యము నిల్పుకొనుటకు బ్రిటిషుపాలకులును తరుణముకై వేచియుండిరి. ఇట్లు ఆంగ్లఫ్రెంచి ప్రభుత్వములు రష్యాతో చేతులుకలిపిరి. జర్మనులు భౌతికవిజ్ఞానముద్వారా విమానములు, విషవాయువులు వగైరాల సృజించి వాడుటలో దిట్టలు. స్వతంత్రతలేని మనదేశమునుగూడ బ్రిటిషు సామ్రాజ్యము వారాయుద్ధములో దింపిరి. ఇట్లాప్రచండయుద్ధములో ముఖ్యరాజ్యములన్నియు చేరినవి. బ్రిటిషువారప్పుడు 'టాంకు'లు సృజించిరి.

శత్రువినాశమే యుద్ధపుటుద్దేశ్యము. అందులో రెండుపక్షాల ఆస్తులు జనులు నశించుట తప్పదు. ఆయుద్ధములో విపరీతనష్టము కల్గినది. రణరంగమునకావలను, నిరాయుధులను, చంపకూడదనే ధర్మయుద్ధ

పునియమముల కిప్పుడు తావేలేదు. ఏదోరీతిని జయించుటే ముఖ్యోద్దేశము. తటస్థులహక్కులు లక్ష్యపెట్టుటలేదు. క్రొత్తరకపు మరఫిరంగులు, షెల్లులు, జలాంతర్గాములు, విమానపుబాంబులు, ఇత్యాదులను రెండు పక్షములును వాడిరి. నవ్యయంత్రములద్వారా మహాదుర్గములను జర్మను లవలీలగ పట్టుకొనిరి. అప్పుడు మనధనమును జనులను బ్రిటిషువారన్నిరంగములం దుపయోగించిరి; అందుతో పశ్చిమరంగములో జర్మనుల మొదటిధాటినాపిరి. యూరపులో నిర్బంధశిక్షణ కలదు. ఆసైనికులు కందకములలోను, శిబిరాలలోను ఏండ్లకొలదిగ సాయుధులై పోరుచుండిరి. వారికై నవ్యాయుధములను, సామగ్రులను తక్కినప్రజలు రాత్రింబవళ్లు తయారుచేయుచుండిరి. ఆమహాయుద్ధములో కోటిజనులు నశించిరి. ఇంకనెందరో వికలాంగులైరి. వారందరు యువకులు నడివయస్సువారు. బ్రిటిషుమిత్రమండలికే ద్రవ్యజనసంపత్తు హెచ్చు. కాని వైజ్ఞానికప్రాబల్యము గల్గి, వీరావేశముతో బోరు జర్మనుల రణరంగమం దోడించుట దుస్సాధ్యమయినది. జర్మనుల కాహారాదిసామగ్రి పోకుండ మిత్రమండలి తమ నౌకాబలముతో పెద్దబంధము వేసి, తటస్థరాజ్యాల నౌకలగూడ నిరోధించిరి. జర్మనులకు నౌకాబలము చాలదు. కనుక ప్రతిక్రియగ బ్రిటిషు ఫ్రెంచివారల నౌకలను నడుసముద్రములో జలాంతర్గాముల ద్వారా జర్మనులు పొడిచి ముంచుచుండిరి. ఈజలాంతర్గాములను నవ్యాయుధములతో సజనముగ నశింపజేయ బ్రిటిషువా రుద్యమించిరి. ఇంగ్లండులో జనులు కోట్లకొలది నవరనులఆస్తియు నీటగలసెను. జనులు వినాశకార్యమగ్నులై, జనపోషకవస్తువుల యుత్పత్తితగ్గినది. ధాన్యము, బట్టలు కిరసనువగైరాలధరలు విపరీతముగ పెరిగి, బీదజనులెన్నియో బాధల పాలైరి. యుద్ధారంభమందే అహింసతోబాటు జాతులలో సత్యశీలములు హతమైనవి† రణరంగములో విషవాయువులకంటెను తీవ్రంగా ద్వేష

* The first casuality of a war is truth అను ఒక రాజనీతిజ్ఞుని సూక్తి పూర్తిగ యథార్థమైనది.

నలము బయట తంతివార్త ఇత్యాదుల ప్రచారమును పత్రికలద్వారా లోకమంతటను వ్యాపించినవి. వాఙ్మనఃకాయములహింసలు పరస్పరము తోడ్పడునుగదా! శత్రుసాధనములు తగ్గించుటకని వైమానికులాగ్నేయ గోళము లుపయోగించసాగిరి. అమితజననాశనమువల్ల బుద్ధివచ్చియు క్రాంతిగల్గియు రష్యా యుద్ధమును మానుకొన్నది. కాని, అమెరికా ఆలోటుతీర్చినది. క్రిమిప్రయోగంవల్ల జలాశయములు చెడినవి. జనులు ఉద్రిక్తులై ఉన్మత్తులబోలిరి. క్రొత్త అంటువ్యాధులు చెలరేగినవి. అంతట జర్మనుపక్షము ఆర్థికబాధకు తాళలేక లొంగి రాజీకోరిరి. ఉభయ పక్షములును 1919 లో వర్సాలేవద్ద సంధిచేసుకొనిరి. 'ఇంఫ్లుయంజా' వ్యాధి అప్పు డన్నిదేశాలలోను వ్యాపించి, కోట్లకొలది జనుల బలిగొన్నది. (1919 లో ఒక్క భారతదేశములోనే ఈవ్యాధివల్ల సుమారు 70 లక్షల జనులు చచ్చిరి, ఇంకను చాలమంది దుర్బలులైరి. ఆమహా యుద్ధాగ్నివల్ల అపారనష్టము కల్గినది. నిత్యజీవితంలో హింసాతత్వపు పరిష్కారములు ప్రత్యక్షముగ అందు పాల్గొన్నవారికిని పరోక్షముగ లోకమంతటికిని హానికరమని, యుద్ధములో హింసాచర్యలకు మితియుండ దనియు, తేలినది. కాని, ఆగుణపాఠము వ్యర్థమైనది. సామ్రాజ్యతత్వపు హింసాప్రభావ మీదేశంలోను వ్యాపించి, ఇక్కడి ప్రజలదశ అంధకార మయమైనది. అయితే, దానిని ప్రేమతత్వముతో ఎదుర్కొనునట్లు మన దేశమాతకు పుత్రరత్నమగు గాంధిమహాత్ముడు నవ్యజ్యోతి వెలిగించి అందుల కార్యక్రమము నేర్పర్చినాడు.

# 9. మహాత్మాగాంధి.

ఇప్పుడు ఘోరహింసతో కలుషితమైన జాతీయజీవితపు పునరుద్ధరణకు దారిచూపిన ప్రవక్త మహాత్మగాంధి. అహింసాసత్యవ్రతము ధార్మికముకే గాక ఆర్థికరాజకీయములకు సాంఘికములకుగూడ వర్తింపదగునని, దానిని తన జీవితవృత్తిలో అమలు జరిపి, వ్యక్తికి జాతికి సమన్వయము చేసి, ఆయన అందఱికిని మార్గదర్శకుడైనాడు. ఆయన జీవితవృత్తాంతము లందరును తెలుసుకొని అనుసరింపదగినవి. ఆయాజాతీయసమస్యల పరిష్కారముకు వ్యక్తిప్రవృత్తికి గాంధిగా రవలంబించినపద్ధతులు కార్యక్రమము ఆధునికనాగరికతరక్షణకు నాధారములు. ఆయన సిద్ధాంతములు విచిత్రములుగ తోచినను, నరజాతికి క్షేమకరములు, ముఖ్యంగా భారతజాతీయసంస్కృతి కనుగుణములై యున్నవి. కనుక ఇకముందు ఆయన జీవితసిద్ధాంతముల వివరణద్వారా మన జాతీయజీవితపుసమస్యలను, వాటిపరిష్కారరీతినిగూడ, గ్రహింపగలము. ముందుగా ఆయన జీవితమును మనఃపరిణామమును గమనింతము.

మోహనదాసు కరంచందు.గాంధి† గుజరాతీవైశ్యకుటుంబములో పశ్చిమపు కతియవారులోని 'పోర్బందరు'లో 2-10-1869 తేదీని జనించెను. ఈయనతండ్రి (కరంచందు) అక్కడిసంస్థానముకు దివాను, ధీమంతుడు, ప్రాజ్ఞుడు, అనుభవశాలి. తల్లి పుతలీబాయి మంచి లోకజ్ఞానము ఈశ్వరభక్తియుగల ఉదారురాలు. ఈగుణములన్నియు మన 'గాంధి'కి సంక్రమించినవి. ఈయన బాల్యమందక్కడి బడులలో చదివి, రాజకోటలో మెట్రిక్యులేషను పరీక్షనిచ్చెను. బాల్యమందే తండ్రిమరణించెను. ఉన్నతవిద్య కన్నగా రీయనను బారిస్టరీనిమిత్తమింగ్లండుకంపెను. అక్కడ పరీక్షనిచ్చి వచ్చినను జీవితసమస్య తీరలేదు. బాల్యమందే ఆయనను 'కస్తూరిబాయి'తో వివాహముచేసిరి. (ఆయనకిప్పుడు నల్గురుకొడుకులు;

† 'గాంధి' అనేది వీరివంశనామము; ఈయన స్వంతపేరు 'మోహనదాసు.'

వీరిలో దేశసేవాపరుడగు దేవదాసు నాల్గవవాడు). గాంధిగారాంగ్లవిద్యా పరీక్షలలో ప్రథమస్థానము నొందలేదు; కుశాగ్రబుద్ధియనిపేరు పొందలేదు. నైతికప్రవర్తనలోనే ఆయన జీవితపువిశేషము. హరిశ్చంద్రచరిత్రను, శ్రవణుని పితృభక్తిని తెలుసుకొని, అప్పటినుండి సత్యపాలనకు పితృసేవకు తనబాల్య మర్పించెను. మొదట కొంత విషయాసక్తియుండెను; కొంత దుస్సహవాసము నేర్పడెను. కాని, తనతప్పును వెంటనే గ్రహించి, తండ్రికితెల్పి, పశ్చాత్తాపమొందెను. మొదటినుండి ఆత్మపరీక్ష చేసుకొనుచు తనలోపములు గ్రహించుచు, సత్ప్రవర్తనను తప్పక రక్షించుచుండెను. విద్యార్థిదశలో ఇతరులతో వ్యర్థముగ తిరుగక, ప్రతిరోజును అప్పుడు రోగియైనతండ్రికుపచారము చేయుచుండెను. బారిస్టరుపరీక్ష కాంగ్లదేశముకు వెళ్ళినప్పుడును అక్కడి సాంఘికాకర్షణలకు లోబడక నిగ్రహము గల్గియుండెను ఇంగ్లండులో మాంసమహిళామద్యములను స్పృశించలేదు. మొదట తల్లికిచ్చినవాగ్దానమువల్లనే ఈవ్రతముపట్టెను; కాని, తరువాత ఇట్టివ్రతము నిగ్రహమును సాత్వికతేజమును ధార్మికతను వృద్ధిచేయునని గ్రహించి, బహుళాకర్షణలమధ్యను ఋషిజీవిత మవలంబించి, పిమ్మట తపశ్శాలియైనాడు. పాశ్చాత్యసంస్కృతిలోని విలాసిత, స్వార్థపరత, ద్రవ్యదురాశయు, ఆత్మహానికరములని గ్రహించి, వాటిని విసర్జించెను; కాని ఆంగ్లేయుల మంచి గుణములలవర్చుకొనెను. పరిశుభ్రత, సకాల నియమము, కార్యదీక్ష, సంఘక్షేమపరత, స్వదేశి ఆయన కలవడినవి.

ఇంగ్లండునుండి రాగనే, ఆయనన్యాయవాదియైనాడు; కాని వకీలువృత్తిలో జయ మొదుతత్వ మాయనకులేదు. ద్రవ్యాశ జనాకర్షణ అధికారకాంక్షపోయి, నీతిపరత, శీలరక్షణ, శాంతత, సత్యసంధత, ప్రజాసేవ ప్రవృత్తి ప్రేమపరత ప్రధానమయినవి. అట్టివాడు వకీలు వృత్తిలో ప్రముఖుడు కాకుండుట సహజమే.

ఈస్థితిలో స్వగ్రామవాసి యగు ఒక ముస్లిముకు దక్షిణాఫ్రికాలో నొకవ్యాపారపుకేసుండెను. దానివిచారణలో బ్రిటిషులాయరుకు సాయపడుటకు, వాదితరపున ఆయన 1892 లో దక్షిణాఫ్రికాచేరెను;

అయితే, గుజరాతిలో వ్రాసిన అక్కడి ఉభయపక్షములలెక్క బుక్కు లను పత్రలేఖలను పూర్తిగ అవగాహనచేసుకొని, ఆయన ఉభయపక్ష ములకు క్షేమకరముగా పంచాయతీద్వారా రాజీచేయించెను.

ఆ కేసుకొరకు దక్షిణాఫ్రికాకు వెళ్ళగనే, అక్కడి భారతీయుల పరిస్థితుల జూచినప్పటినుండి, ఆయనకు క్రొత్తసంకల్ప మేర్పడినది. అక్కడి హైందవస్థితి మనజాతీయస్థితికి చిన్నప్రతికృతి. అక్కడ గుజరాతీలు, తమిళులు, ఆంధ్రులు, బంగాళీలు, ముస్లిములు, హిందువులు, పారసీలు, వ్యాపారస్థులు, కూలీలు, ఇట్లు అన్నిజాతులు మతముల వర్గముల వారు నున్నారు. (గొప్ప జమీందార్లు రాజులు మాత్రములేరు, అక్కడి అసలుదేశీయులగు ఆదిమవాసులకు నామరూపములు లేవు. అక్కడికి 18 వ శతాబ్దినుండి వలసవచ్చిన బ్రిటిషువారే అధికారముగల్గి దేశపాలనజేయుచున్నారు. వారిపైన అజమాయిషీగల్గిన లండనులోని బ్రిటిషుప్రభుత్వమువారు దక్షిణాఫ్రికాకు ప్రాంతీయస్వరాజ్య మిచ్చి నారు. అనగా, ఆచరణలో అధికారమంతయు అక్కడి శ్వేతజాతీయులదే. దేశీయులకు భారతీయులకు అక్కడి పాలనలో, వోట్లనిచ్చుటకు, సంఘములో స్వేచ్ఛకు, ఎట్టిహక్కును లేదట! పైగా, అక్కడి భారతీయులను తెల్లజనులు నీచముగ జూతురు. వారిమంచిబండ్లలో మనము వెళ్ళకూడదు. వారు వసించు మంచిప్రాంతములలో మనవారు వసింపకూడదు. స్వేచ్ఛతో వ్యాపారంచేయుటకు ఆస్తిసంపాదనకు ఎన్నియో నిరోధములుపెట్టి నారు. భారతీయులలో విద్యకు ఆర్థికక్షేమమునకు ఆప్రభుత్వము తగుసహాయము చేయలేదు. సాంఘికంగా, ఇక్కడి ఆదిహిందువులను సవర్ణులు చూచురీతినే యూరపియనులు మనవారిని అస్పృశ్యవర్గముగ నెంచుదురు. గాంధిగారక్కడకు చేరగనే, ఆయనకిట్టియనుభవముగల్గి, అక్కడిభారతీయులందరిస్థితి యిట్లేయున్నదనియు, తెలిసినది. ఆయనప్రేమహృదయము కరిగి, వారికై సేవాసక్తి కల్గినది. ఆభారతీయ హీనస్థితిని పోగొట్టుకొనుటకెట్టికృషిని చేయుటలేదు. తాను 'బారిస్టరు' అయినను, వ్యక్తిహోదా వల్ల స్వలాభమునొందుట కొప్పుకొనక, గాంధిగారక్కడి భారతీయసంఘ

మంతటి కష్టములు తనవిగ భావించుకొని, అప్పటినుండి వారిజాతీయ క్షేమముకై తనశక్తినంతను వినియోగించెను.

అక్కడి భారతీయులలో జాతీయ చైతన్యమును, ఐకమత్యమును కల్గించుట అవసరమని గ్రహించి, ఆయన వారికి సమితులేర్పర్చి, హిత బోధచేసి, తమ బాధలు పోవుటకు పత్రికద్వారాను శాసనసభలలోను ఆందోళనచేసెను; తన ప్రవర్తనవల్ల వారికిని సంఘసేవాసక్తిని ఆత్మగౌరవమును గల్గించెను; నైతికతను, పరస్పరప్రేమను కల్గించెను. అధికారులగు తెల్లజాతివారు భారతీయులకు న్యాయము జరిగించక బాధించుచుండిరి. అయినను, ఆయన ప్రజలకు విరోధభావము హింసాప్రవృత్తి కలుగనీయక, భారతీయులు నిగ్రహముగల్గి ఆత్మోన్నతికి కృషిచేయునట్లు కార్యక్రమ మమలుజరిపెను. వారిలో పరస్పరముండిన విభేదములు ద్వేషభావము పోగొట్టి, అన్ని కులములమధ్య సమబుద్ధిగల్గించి, ఐకమత్యము చేకూర్చెను; పరస్పర సమావేశము వీలగునట్లు సామాన్యభాషగ హిందుస్తానీ నేర్పించెను; ధార్మికభావమును ప్రోత్సహించెను. వీరిలో విభేదములు, భయము, అవినీతియు నుండుటవల్లనే శ్వేతజాతీయులు భారతీయులను పశుతుల్యముగ జూచుచున్నారని ఆయనగ్రహించి, ఆత్మగౌరవము, జ్ఞానము దృఢనిశ్చయముగల్గునట్లు బోధించి, నీతిపరులుగ తరిఫీయతుచేసెను. అప్పటికిని యూరపియను అధికారులు వారి కన్యాయము చేయుచున్నందున, ప్రజల మానవత్వమును హక్కులను నిలువబెట్టుట కాయన భారతీయులందరిచేత సాత్వికనిరోధ (Passive resistance) రూపముగ సత్యాగ్రహము చేయించెను. అన్యాయము అవినీతికరము నగు చట్టము నుల్లంఘించుట, సర్కారు ఉద్యోగులెంత దౌర్జన్యము చేసినను, కొట్టినను ప్రతిక్రియ చేయక సహించుట, తమ దృఢవ్రతము వదలక జైలుశిక్ష దెబ్బలనుగూడ శాంతముగ స్వీకరించుట, దీనిముఖ్యలక్షణము.

ఈ రీతిగ గాంధిగారు ఆయన సహచరులు ఇత్యాదులు వేలకొలదిగ ఖైదులోనుండి సకల కష్టములు సహించిరి. వారి యైకమత్య

ము దినదినము వృద్ధియైనది. ఇది అక్కడి భారతీయులందరిని వీరులుగ జేసినది. ఈ అహింసాయుద్ధము ప్రచండముగ వ్యాపించి, ఇంగ్లండులోను ఈ దేశంలోకూడ ఆందోళన కల్గించెను. అప్పుడు ప్రభుత్వము లొంగి, తమ అక్రమ శాసనములు సవరించుకొని, కొంత న్యాయము చేసినారు.

కాని, పూర్తియైన న్యాయమునకు వీలుకాలేదు. అక్కడి భారతీయులు లక్షజనులు మాత్రమే. అది బ్రిటిషుసామ్రాజ్యములో భాగము. ఆ భారతీయుల మాతృభూమియగు మనదేశములో నిక్కడి 35 కోట్ల భారతీయులకు నిజమైన పౌరసత్వము, పాలనహక్కులు లేవు. స్వదేశములోనే గణ్యత గౌరవములేని వట్టి పరాధీనులకు విదేశాలలో గణ్యత గల్గునా? దక్షిణాఫ్రికాలోనేగాక, తూర్పుఆఫ్రికా, ఫిజీవగైరాలలో నుండు వారికిని ఇక్కడివారికినిగల కష్టముల బోగొట్టి భారతీయాత్మ నుద్ధరించుటకై మాతృదేశపు సేవకే యిక తనశక్తినంతను వినియోగింపవలెనని నిశ్చయించి, గాంధిగారు 1914 సం॥రంలో ఇంగ్లండుద్వారా భారతదేశమును తిరిగి వచ్చిరి. అక్కడి సేవానుభవ మిక్కడ బాగుగ నుపయోగించినది.

దక్షిణాఫ్రికాలోవలె, ఈ దేశంలోను ఆయన (అహమ్మదాబాదు దగ్గర 'సబర్మతీవద్ద') ఆశ్రమముపెట్టి, అందులో ఆదర్శజీవితముగల సత్యాగ్రహులను తయారుచేసెను. తనసిద్ధాంతము లందరికిని తెల్పుటకు నవజీవన్ (గుజరాతీ,హిందీ) యంగు ఇండియా (ఆంగ్ల) పత్రికలు నడిపెను; దేశమంతను తిరిగి జనుల కష్టములను, జాతీయసమస్యలను స్వయంగా అవగాహన చేసుకొనెను; రైలులో 3 వ తరగతిలోనే తిరుగుచు సామాన్యజనుల ప్రవృత్తిని, ధోరణిని, మనస్తత్వమును, లోపములను గ్రహించెను. దక్షిణాఫ్రికాలోవలె, ఇక్కడను జనులందరిలో పరిశుభ్రత, నీతి, ఐకమత్యము, కార్యపరత, పరస్పరప్రేమ కలుగునట్లు బోధించుచు, అన్నిమతముల ధర్మగ్రంథములసారమును గ్రహించి, భక్తవరుడైనాడు. ఆయన ప్రతిదినమును శ్రద్ధతో ఈశ్వరప్రార్థన జేయును. అహింస, నీతి, సామ్యత, గల్గి ఆయన ఆధ్యాత్మిక ప్రవృత్తితోనే జీవితకార్యముల జేయు

చుండును. కాని ఆయన తన వ్యక్తిమోక్షముకాక, లోకులందరి నిశ్రేయ సమును కోరును. కనుక మానవజాతి, ముఖ్యంగా భారతజాతి, ఉన్న తమై తరించుటకే ఆయన తన జీవిత మర్పించుచున్నాడు.

అయితే, జాతీయజీవితము సర్వతోముఖము. ఆర్థికసాంఘికాదు లన్నిటిలో నీతిప్రగతి ధర్మబుద్ధిగల్గినప్పుడే జనులకు నిజమగు ఆధ్యాత్మి కతయు సిద్ధించును. కనుక వీటిఅన్నిటివ్యాప్తికిని ఆయన కృషి చేయుచున్నా రు. మరియు మనదేశమిప్పుడు పరాధీనము; 'రాజకీయస్వాతంత్ర్యముసిద్ధిం చనందున దేశీయులకు మతవిషయంలోను సరియైన వ్యక్తివికాసమును, జాతీయాభివృద్ధియు లేవు' అని ఆయన అనుభవమువల్ల గ్రహించి, 1919 నుండి ఆర్థికరాజకీయములలోను కృషి నారంభించినాడు. ఆయాజాతీయ సమస్యలన్నిటి పరిష్కారముకును ఆయన అహింసాపద్ధతినే పెట్టినారు. ఈనవ్యపద్ధతి కార్యక్రమములోను గాంధిగారివ్యక్తిలోనుగల మహత్వ మును, పటేలు, రాజేంద్రప్రసాదు, నెహ్రూ, చిత్తరంజన్, పట్టాభి, ప్రకాశం, రాజగోపాలాచారి మొదలగు జాతీయనాయకులు (కొంతవర కు ప్రజాసామాన్యమును) గ్రహించినారు. †అహింసాసిద్ధాంతమే అన్ని రంగములందు మోక్షసాధనమని దాని మూర్తిరూపమగు నిర్మాణ కార్యము నమలుజరుపవలెనని జాతీయమహాసభయు అంగీకరించి, అప్ప టినుండి అట్లే అనుసరించుచున్నది. ఆయన పరిశుద్ధతవల్ల ఆయన గుణము లన్నియు తక్కిన నాయకులకును జనసామాన్యముకును వెంటనే ఆదరణీ యమైనవి. ఆయన దరిమిలా జీవితమంతయు, అనగా ఆయన నడిపినసత్యా గ్రహములు, నిర్మాణకార్యాంశములు వగైరాలు మన జాతీయజీవితము కంతటికి సర్వస్వముగ నున్నవి. కనుక వాటి చర్చసందర్భములో ఆయన దరిమిలా జీవితమును విశదమగును. 1920 నుండి ఆయన చరిత్రయు మన జాతీయచరిత్రయు మిళితమైనవి.

---

† అహింసాసిద్ధాంతమును కాంగ్రెసుమహాసభ స్పష్టముగా మొదటిసారి 1920 సం॥రం డిసెంబరులో జరిగిన నాగపురసమావేశములో అంగీకరించి తీర్మానించినారు.

# 10. రాజకీయరంగము.

ఆధ్యాత్మికోన్నతి కాత్మవికాసమే ముఖ్యముగ కావలెను. ఆ యాత్మవికాసముకొరకే పూర్వపుమునులు, రాజర్షులు ఆయాసాధకులను తపశ్శక్తిగల్గి కృషిచేయుచుండిరని వినుచుము. కాని, ఆత్మవికాసము స్వతంత్రులకేగాని కలుగదు. పరాధీనజనుల జీవితము సంకుచితమై ఉదారభావములు నశించునని, జీవితము క్షీణించునని యిదివరలోనే చూచియున్నాము. కనుక విదేశీయులపాలనలోనుండుట జాతికంతకును చాల బాధకము. పరపరిపాలన మహాహింసయై, అన్నివిధములను పీడాకరమగును. ఈసంగతిని మనపూర్వులును గ్రహించి, అప్పుడప్పుడు ద్బోధించియే యున్నారు.† ఆధునికజీవితములో పరరాజ్యపాలనము మరింత బాధకమనియు మనము గ్రహించియున్నాము.

అందును బ్రిటిషుసామ్రాజ్యపద్ధతి బహుగూఢమై విచిత్రమైనది. ప్రత్యక్షహింసలేకుండ మనజనుల నిర్వీర్యస్థితిలోనుంచి స్వాతంత్ర్యబుద్ధిని స్వేచ్ఛాతేజమును క్షీణింపజేసి, తమ విజాతీయసంస్కృతి నిక్కడ వ్యాపింపజేసి, ఆర్థికముగను ఈదేశపుసారమును నొప్పితెలియకుండనే నొక్కిలాగుచు, ఇక్కడి సంపదను వీలైనంతవరకు తమ లాభముకు వినియోగించునట్లు తమ సంస్థలేర్పర్చుట సామ్రాజ్యపద్ధతి. ఇట్లు ప్రజానిశ్రేయసమును జనుల ఆత్మోన్నతినికోరు కార్యపరులందరు రాజ

† సర్వం పరవశందుఃఖం సర్వమాత్మవశంసుఖం॥ (మనుస్మృతి 4-159.)

పరాధీనవృత్తిః ... (కాళిదాసు మేఘసందేశం)

పరతంత్రజనముల పాలికష్టములు చెప్పంగవలవియే శివుఃక్షుపైన, పంజరములోని పక్షులరీతి, గంగిరెద్దులవాడు కావరమడచి ముకుతాడుబొడిచిన బోడెద్దులట్లు...... నైజదుర్దాయోహ్యమానస మదివక్కవాక్కాయములు రెండు బంధింపబడును; వసనులో బుట్టిన మంచితలంపు లాచరణమునందు నలవికాకున్న, జన్మఫలంబేమి చచ్చుటే మేలు... పార్థివాయిటువంటిపారతంత్ర్యంబు కటకటా పగవానికైనను వలదు.

(పల్నాటివీరచరిత్రలో 'సందేశము.')

కీయస్వాతంత్ర్యముకై కృషిచేయవలెను. కనుక గాంధిమహాత్ముడును 1919 సం॥రం నుండి ఇక్కడి రాజకీయరంగములో ప్రవేశించి స్వాతంత్ర్య సిద్ధికై తీవ్రయత్నము చేయుచున్నాడు. అప్పటికి గాంధిగారు బ్రిటిషు వారి సద్భావమందు నమ్మికగల్గియుండిరి; కనుక మితవాదులవలె ఉపనివేశస్వరాజ్యమే కోరుచుంటిరి. బ్రిటిషువారిదేశముకు స్వయంనిర్ణయపద్ధతిని బాధ్యతాయుతప్రభుత్వ మిత్తుమని 1917 సం॥రంలో ప్రచురించిరి. కాని, అది యుద్ధకాలపు ఆపత్తు మొక్కువంటిదని పిమ్మట తేలినది. 1919 సం।లో అమలుకు తెచ్చినరాజ్యాంగంలో నేర్పర్చిన శాసనసభలకు మంత్రివర్గముకు నిజమైన రాజ్యాధికారము లేదు. వాటివల్ల కొంతపాలన ఖర్చు ఆడంబరము విస్తరించినవి. మరియు రాష్ట్రములలో మాత్రం ద్వంద్వపాలనపేర కొన్ని శాఖలు మంత్రులకిచ్చిరి; ముఖ్యశాఖలు నిరంకుశుల వశంలో నుంచినారు, మితవాదినాయకులా యుద్యోగముల కాశపడ్డారు. ఈలోగా బ్రిటిషుపాలకులు క్రొత్తనిర్బంధశాసనములు తెచ్చి, ప్రజలకున్న స్వేచ్ఛనుకూడ బెరుకసాగిరి. చాలమందికి నిర్బంధశిక్షలు లభించినవి. యుద్ధములో భారతీయులద్రవ్యము జనులు తోడ్పడినందుకుబదు లిట్లు నిరంకుశతను హెచ్చించినారని జాతీయవాదులు క్రుద్ధులైరి. మరియు, కాసుత్తోమారకపురేటు వగైరాలు తమకులాభకరముగమార్చి, సర్కారు బ్రిటిషువర్తకముకు ప్రోత్సాహమును ఈదేశపు పరిశ్రమలకు వ్యాపారముకు అపారనష్టమును గల్గించిరి. ఈప్రజాందోళనవల్ల, విప్లవోద్యమముకు బలముచేకూరినది, అశాంతి పెరిగినది. ఈస్థితిలో గాంధిగారి సూచనప్రకారం కాంగ్రెసువారు అధర్మముకు సిద్ధపడినప్రభుత్వముతో సహకారముమాని 'అసహకార'ము సాగింపనిశ్చయించిరి. కాని "హింసాతత్వము నిజమైన ప్రజాయత్తపద్ధతికి వ్యతిరిక్తము, అసహయోగపు తక్కిన కార్యక్రమముకు నిరోధకము అనియు తీర్మానించినారు.*

---

* 'The spirit of violance is not only contrary to the growth of a true spirit of democracy, but actually retards the enforcement, if necessary, of the other stages of Non-co-operation.'

నాగపురకాంగ్రెసు తీర్మానము 1920 సం॥రం డిసెంబరు.

ఇట్లు అప్పుడే గాంధిగారి బోధవైన కాంగ్రెసువారు "శాంతన్యాయపద్ధతులద్వారా స్వరాజ్యము సంపాదించుటే కాంగ్రెసు ఉద్దేశము." అనియు తీర్మానించినారు* ఈఅహింసాసూత్రమే అప్పటినుండి మన దేశపు జాతీయకార్యక్రమమంతటికాధారముగ నున్నది. హింసాకరమగు సామ్రాజ్యపద్ధతికి తోడ్పడుట హింసావ్యాప్తికి సాయము చేయుటే; కనుక దానికి నిరోధము తప్పదు. అయితే హింసను హింసతోకాక, అహింసతోనే యెదుర్కొనుట ప్రశస్తమగు సూత్రము ప్రతిపాదితము. అప్పటి 'స్వరాజ్య' నిర్వచనముగూర్చి యొకమాట. బ్రిటిషు సామ్రాజ్యాంతర్గతమగుఉపనివేశపద్ధతియని మితవాదులు, సామ్రాజ్యసంబంధము లేనిపూర్ణ స్వాతంత్ర్యమని జాతీయవాదులును తగువుపడుచుండిరిగదా! అహింసావాదియగు గాంధిగారి రెండుపక్షములను సమన్వయపర్చినారు, అహింసావాది ప్రతిపక్షికి సద్భావ మసలే లేదనడు. సర్వజనాంతర్గతమగు ప్రేమరసము బ్రిటిషువారి హృదయములోను కలదు. కాని, స్వార్థపరతవల్ల ఆవృతమై కలుషితమైనది. మనలో తగినంత ప్రేమ, త్యాగము, ఐకమత్యము, విస్తరించినప్పుడు బ్రిటిషువారిలోను ప్రేమతత్వము బయటకు రావచ్చు; అప్పుడు వారు తమంతట స్వరాజ్యమీయవచ్చు; మతము, భాష, ఆర్థిక క్షేమము, వగైరాలలో భిన్నతయున్నను, బ్రిటిషువారు మనకు స్వరాజ్యమిచ్చుట తమకును క్షేమకరమని గ్రహించి అట్లు జరిపితే, ఉపనివేశ స్వరాజ్యమునే మన మంగీకరింతుము. అట్లు తటస్థింపకుంటే పూర్ణస్వాతంత్ర్యమే మనలక్ష్యమగును† అనగా, సామ్రాజ్యసంబంధము పోగొట్టు బాధ్యత బ్రిటిషువారిపైనే యుంచబడినది.

---

* The object of the Congress is the attainment of Swaraj by peaceful and legitimate means.

నాగపుర కాంగ్రెసు తీర్మానము.

† I would strive for Swaraj within the Empire but would not hesitate to sever all connection if severance became a necessity through Britain's own fault.

1924 బెల్గాంలో గాంధిగారి కాంగ్రెసుఅధ్యక్షోపన్యాసము.

1919-22 లలో జరిగినఅసహాయోగములో బ్రిటిషువారు 'మాంటెగుచెంస్ఫర్డు' చట్టముప్రకార మేర్పర్చిన కొత్తశాసనసభను కాంగ్రెసువారు బహిష్కరించిరి. కాని, ఈయుద్యమపు బలముతగ్గి 1922 లో కాంగ్రెసులో చీలికగల్గెను. ఒకపక్షము శాసనసభాప్రవేశపు కార్యమును 'స్వరాజ్యపక్ష'మను పేరుతో నారంభించి, లోనుండి ప్రతిఘటన మారంభించిరి. అది త్రికరణశుద్ధమగు అహింసాపద్ధతికాదని గాంధిగారు భావించిరి; ఈశాసనసభలు వ్యర్థములని ప్రతిఘటనచేసి ఆర్థికపుబిల్లును క్రూరశాసనములను సభలలో నోడించినను, సర్కారువారు వాటిని చట్టములుగచేసి అమలుజరుపు అధికారము పెట్టుకొని, అట్లు చేసినారు. కనుక ఆశాసనసభలోనికార్యక్రమము వ్యర్థమైనది. ఈకార్యక్రమమువల్ల బ్రిటిషుపాలకులు జాతీయనాయకులలో విభేదము గల్పించినారు. సాంఘికంగాను ఆయాప్రముఖులమధ్య అసూయప్రబలినది. అంతట సభాబహిష్కారపుధోరణి మరల యేర్పడినది.

స్వరాజ్యం నిమిత్త మాతురపడు మన దేశముకిట్లు రాష్ట్రాలలో మాత్రం పనికిమాలిన ద్వంద్వప్రభుత్వమునిచ్చి నిజమైన అధికార మంతను ఢిల్లీలో కేంద్రప్రభుత్వముకిచ్చి బ్రిటిషుసర్కారువారు నిరంకుశంగా పాలించుటను చూచినాము. కాని దక్షిణాఫ్రికా, కనడా, ఆస్ట్రేలియా వంటి తమవలసరాజ్యాలగూర్చి బ్రిటిషుప్రభుత్వపు ధోరణి వేరైనది. వారికిదివరకే చాల యధికారమున్నది. 1926 సం॥రంలో సభచేసి, వారింకను కోరిన పాలనాధికారమంతను వారికి బ్రిటిషుప్రభుత్వము ప్రసాదించినది. కాని అక్కడను తెల్లజాతివారిదే అధికారము; ఆ వలసజాతులది బ్రిటిషుప్రజలది ఒకటే జాతి, భాష, మతము, నాగరికత; వారికి పరస్పర సంబంధబాంధవ్యము లెన్నియో యుండును. కనుక, తమవారికధికారమిచ్చి, మనకు లేకుండ జేసినారు.

మన రాజ్యాంగమును, మన అర్హతను పరిశీలించుటకని తెల్లవారి సంఘమొకటి యేర్పడి భారతీయులహక్కులకు వ్యతిరేకముగ రిపోర్టుచేసి

నది. భారతీయ నాయకులకొక బహుజనాభిప్రాయముంటే అట్లు చేయు టకడ్డము లేదని బ్రిటిషువారు సాకుచెప్పినారు. కాని యిదివరలో భారత శాసనసభ్యు, లోకసారియు నెహ్రూకమిటీరిపోర్టులోనొకసారియు, మితవాదులుసహా అన్నిపక్షముల వారు బాధ్యతాయుత ప్రభుత్వము నేకగ్రీవముగ కోరినారు. కాని వాటినన్నిటిని సర్కారువారు తుడిచిపెట్టినారు. శోషణపద్ధతితో మన దేశమునుండి ఆర్థికంగా సాలీనా కోట్లకొలది సవరనుల రాబట్టి, వివిధ లాభమొందు సామ్రాజ్యపరులు మన ఆర్థిక స్వాతంత్ర్య మీయనొల్లరు. తమకు సంబంధించిన సజాతీయులకేగాని భిన్ననాగరికతగల్గి వేరుజాతిగల భారతీయులకు బ్రిటిషువారు బుద్ధిపూర్వకముగ ఉపనివేశరాజ్యాంగము నివ్వరని స్పష్టపడినది. మరియు వారికి మనకు తత్వము, జాతి, నాగరికత భేదించినప్పుడు డొమినియను స్వరాజ్యము కర్థము లేదు. మనదేశపు ద్రవ్యముసేన ఆర్థికనీతి వీటిని పూర్తిగ మన కొప్పగించిన, బ్రిటిషువారిసామ్రాజ్యలాభముపోవును. వాటినీయనివలసరాజ్యాంగము మనకు వ్యర్థము. సామ్రాజ్యములో బ్రిటిషువారితో సమాన ప్రతిపత్తి మనకుంటే బ్రిటిషుసామ్రాజ్య మంతటిలో హెచ్చు జనసంఖ్యగల మనదేశమే బ్రిటనుకన్నను ప్రముఖమగును; అట్టిస్థితికి వారొప్పుకోరు. కనుక సమానప్రతిపత్తి నీయరు. సామ్రాజ్యములో నున్నంతకాలము వారితో మనకు సంఘర్షముండును. ఈ సందర్భము లన్నిటి నాలోచించి పూర్ణస్వాతంత్ర్యమే కాంగ్రెసు ఆశయమని 1929 సం॥లో లాహోరులో జవాహర్లాలు అధ్యక్షతను కాంగ్రెసువారు తీర్మానించినారు. నేటికిని, ఈయాశయమే భారతీయుల బహుజనాభిప్రాయము

స్వతంత్రమైనను మనదేశము బ్రిటనుతో విరోధపడనక్కరలేదు. ఆ యా దేశపు జాతులు; ప్రభుత్వములు పరస్పరాంగీకారములతో మైత్రితో నుండవచ్చు. కనుక, స్వాతంత్ర్యోద్యమము అహింసా సిద్ధాంతమునకు అనుకూలమేగాని వ్యతిరేకము కాదు.

అయితే, ఈ స్వరాజ్యమును కేవలం శాంత న్యాయపద్ధతుల తోనే సాధించవలెనను సిద్ధాంతమును చాల ముఖ్యము. మన దేశపు ప్రస్తుతస్థితిలో హింసాపద్ధతి ఉపయుక్తముకాదు; పైగా మన యుద్యోగుల దౌర్జన్యమునకును మనలో పరస్పరహింస చెలరేగుటకును కారణమగును; శాంతపద్ధతివల్ల స్వరాజ్యము కొంత ఆలస్యముగ లభించునను కొన్నను ఆ పద్ధతివల్ల మన ఆర్థికశక్తిసంఘటనము బాగుగ దృఢపడుటవల్ల, అది చిరస్థాయియై, లోకమంతటికి క్షేమకరమగును. పూర్ణస్వరాజ్యమును మనము స్వశక్తితో సంపాదించుకోవలెను. పూర్వపు జాతీయవాదులును దానిని తీవ్రకాంక్షతో కోరిరి. కాని, వారు మనకు తగిన ప్రజోపయుక్తమగు కార్యక్రమము పెట్టి అమలుజరుపలేదు. మితవాదులు సర్కారు కర్జీలతోను, అతివాదులు దూషణలతోను సరిపెట్టిరి. ఈరెండును వ్యర్థములే. అందుచే గల్గిన నిరాశవల్లనే విప్లవపక్షీయులై కొందరు యువకులు అధికారులపైన దౌర్జన్యమునకు సిద్ధమైరి. వ్యక్తిహింసవల్ల సామ్రాజ్యసంస్థ యెన్నడును పోదు. దానికి సహాయకమగు సహకారమును ప్రజలీయకుండ, తమ అంతశ్శక్తిని వృద్ధిపర్చు కార్యక్రమము సాగించినప్పుడే సామ్రాజ్యబలముపోయి స్వాతంత్ర్యము సిద్ధించునని గాంధిగారు నిరూపించిరి అంతట విప్లవపక్షీయులు నిరాశను క్రోధమును వదలి, పరిణామమొంది, అహింసావాదులై, కొందరు అహింసా సమరమందు యోధులైనారు. ఈ నిర్మాణకార్యక్రమములో జాతీయ జీవితపు అన్నిరంగములకు తగు ప్రణాళిక యున్నది. ఇట్లు సంఘము నుద్ధరించుటేగాక సత్యాగ్రహముద్వారా ప్రత్యర్థిని లొంగదీయుటకున్ను ఈకార్యక్రమము సాధకము.

# 11. ఆర్థికరంగము.

## 1. ఖదరు.

ఆర్థికముగ మనదేశమెట్టి దౌర్భాగ్యములో నున్నదో అందఱికిని తెలిసినదే. నూరేండ్లక్రిందటివరకు సర్వశక్తిసంపన్నమై తన సన్నబట్టలకు శిల్పకళలకు దేశదేశములందును ప్రసిద్ధిగాంచి నాయకమణియైన దేశమిప్పుడు కోట్లకొలది జనుల కొకపూటయు సరిగ తిండి బట్ట దొరకక తల్లడిల్లుచున్నది. జనులలో చాలమందికి వృత్తులు లేవు. మనదేశమం దిప్పుడు 3/4 వంతు జనులకు వ్యవసాయమే వృత్తియని సర్కారు లెక్కలలో నున్నది కాని, ఇందులో నిజంగా వ్యవసాయవృత్తిగలవారి సంఖ్య మిక్కిలి తక్కువ: ఇందులో నెందరో వృత్తిహీనులు వ్యవసాయకులపై నాధారపడువారు చేరియున్నారు. మనదేశము వ్యవసాయప్రధానమని పరిశ్రమ వస్తువులు విదేశములనుండియే రావలెనను వాదము సరికాదు. ఇదివరలో స్వయంసంపన్నమగుటేగాక, మనదేశ మితరదేశములకు రకరకముల సరకులు పంపేదిగదా! ఇప్పుడు రాజకీయ పరాధీనతతో బాటు విదేశపుసరుకుల దాడివల్లను జనుల రుచిమారుటవల్లను ఆర్థికదౌర్బల్యము గల్గినది. ముఖ్యంగా అన్నము బట్ట గల్గినప్పుడే జనులకు శాంతిస్తిమితము పరస్పరమైత్రి యుండును. మనదేశపు శీతోష్ణస్థితి నేల మంచివి, కనుక పంటకు లోటులేదు. జనులకు వాటిని కొను శక్తియు కట్టబట్టలుమాత్రము కావలె; ప్రజలందఱిబట్టలకు కావలసినంత ప్రత్తి మనదేశమందున్నది. పూర్వం దానినుండి ఇక్కడ చక్కని ఖదరు వస్త్రములు తయారయేవి. కాని పిమ్మట బ్రిటిషు జపాను మిల్లులలో నుండి వచ్చుబట్టలను జనులుధరించుటవల్ల ఖదరు పరిశ్రమమూలబడినది.

ఇటీవల జాతీయవాదులు మనజనులీదేశపు వస్త్రములనే ధరింపవలెనని గుర్తించిరి. కాని ఆర్థికంగా పాశ్చాత్యులవలె మనవారు ఖదరు వ్యర్థమనిమెంచి, ఈదేశమందే మిల్లులుకట్టించి వాటిలో సమృద్ధిగ బట్టలు

తయారుచేసి వాటిని వాడవలెనని కోరిరి. కొందరు శ్రీమంతులు బొంబాయి, అహమ్మదాబాదు వగైరాలలో బట్టలమిల్లులు స్థాపించిరి. వాటిలోనిది ముదుకనూలు. తాతాకంపెనీ వగైరాల మిల్లులలో కొంత వరకు సన్ననూలును తయారైనది. అయితే క్రియలో విదేశవస్త్రముల వాడుక అంతగా తగ్గలేదు. మహాయుద్ధ (1914-18) కాలమందుమాత్రం బ్రిటిషుసరకుల దిగుమతితగ్గి, మనదేశపుమిల్లులు వృద్ధియైనవి. కాని యుద్ధాంతమందు మరల పోటీగల్గినది. ఇంతలో చీనాలోని ప్రకృతి సౌకర్యములు ప్రయోగించి, జపానీయులు తమమిల్లుల చౌకబట్టలతో మనబజారులు నింపివేయుచున్నారు. ఈవిదేశపుసరకుల పోటీవల్ల మనదేశమందు పరిశ్రమ లేక జీవనాధారము క్షీణించి, సామాన్యులెట్లు బాధపడినారో చూచియున్నాము. ఈఆర్థికహింసనాపి, జనులకన్నమిచ్చుటకు స్వదేశి కావలెను. శుద్ధస్వదేశీయే చికిత్స.

ఈదేశపు మిల్లులద్వారానే స్వదేశీని సాధింపగలమా? ఒక్కొక్క మిల్లు స్థాపించుటకు లక్షలకొలది రూపాయలు కావలెను. దీనిని సరిగా నడుపుటకు మరికొన్నిలక్షలు కావలెను. గొప్పశ్రీమంతులే అట్టి మిల్లులుస్థాపింపగల్గుదురు. మనబీదదేశంలో అట్టి పెద్దమిల్లులు నడుపుటకు జనులకు సొమ్ముచాలదు. జాయింటు స్టాకుపద్ధతిని సాగించుటకు తగినంత సంఘటనము సహకారమును కష్టము. మిల్లుయంత్రము లీదేశంలో తయారుకావు. చాలవర కివి ఇంగ్లండు జపాను వగైరాలలో నుండును. ఆదేశీయులు తమతో పోటీగల మనమిల్లుదార్లకు ప్రశస్తమైన కొత్త యంత్రాలీయరు. కేవుసుంకములు ఇత్యాదులవల్ల వాటికికూడ కిమ్మత్తు చాలహెచ్చు. వాటిమరమ్మతుకు పనిముట్లకు భాగములకును తరుచు విదేశములపై నాధారపడవలెను. అందువల్లను చాల చిక్కులున్నవి. (ఇది ఇటీవల రాజమహేంద్రవర పేపరుమిల్లు సందర్భంలో అనుభవమైనది.) ఆధునికవిజ్ఞానము పాశ్చాత్యదేశాలలోను జపానులోను చాలవృద్ధియైనది. చాల ఖర్చుతో గొప్పపరిశోధనశాల లేర్పడినవి. ఇట్లు విదేశపు మిల్లు

లలో ఆయాంత్రికపరిశోధనలద్వారా సాలీనా మార్పులు క్రొత్తసౌకర్యములు, కల్గుచున్నవి. బహుళోత్పత్తి హెచ్చుచున్నది. పరిశ్రమలకు పరస్పర సంబంధమున్నది. యాంత్రిక సంస్కృతి వృద్ధియైనప్పుడే మిల్లులు లాభకారిగ పనిచేయును. అట్టి ప్రశస్తయంత్రముల నాజూకు బట్టలతో మనమిక్కడి మిల్లులద్వారా సర్కారు సహాయము లేకుండా పోటీజేయుట కష్టము. మరియు మనదేశపు ప్రభుత్వపు సానుభూతి బ్రిటిషు పరిశ్రమవైపే యుండును. (ఆసంగతి యిటీవలజరిగిన 'ఇండో-బ్రిటిషు వ్యాపారసంధిలోను బయటపడినది. తుదకు జపానుతో పోటీలోగూడ మనప్రభుత్వమీ దేశముకు తగుసహాయ మిచ్చుటలేదు.) మరియు నాజూకునూలుతీయుటకు వలయు ప్రశస్తమైన పొడుగుపోచగల ప్రత్తి యీదేశపు నేలలో వృద్ధియగుట అరుదు. ఇంతేకాక ఈమిల్లు యంత్రములకొనుబడికి నెంతోసొమ్ము విదేశములకు ధారబోయవలెగదా! ఇట్లు సొమ్మును లంకపైరుకుబదులు విదేశంలోనే బర్మింగుహాము వగైరాలకు పంపుదుము. సన్ననూలు తీయు మనమిల్లులును చాలవరకు విదేశపు దూదినే వాడుచున్నవి. అనగా ఆబట్టలదూదికి సొమ్ము విదేశముకు పోవును. మిల్లుబట్టలనే వాడుటవలన ప్రత్తి సాగుచేయు మనవ్యవసాయకుల దూదికి ఖర్చుతగ్గినది. అనగా వ్యవసాయకులకు నష్టమైనది. మరియు అందువల్ల ప్రత్తిసాగుమాని హెచ్చుమంది మిర్చి, పొగాకు వగైరా హానికరమగు పంటలబెట్టినారు. ఫిటికిబదులు ధాన్యాదులు పెట్టినను ఉత్పత్తిహెచ్చి వాటిగిట్టుబాటు తగ్గును. ఖదరునే వాడితే ఈరయితులు పండించు ప్రత్తికి చలామణికల్గి, వడ్రంగులు వగైరాల శిల్పులకు వ్యవసాయకులకును లాభించును. ఖదరుస్వదేశియని గుర్తించుటయు, సులభము. మిల్లుబట్టలదూదియు, నూలును, విదేశపువో, స్వదేశపువో సాధారణంగా విద్యావంతులును గుర్తింపలేరు ఇక అజ్ఞానులందరి సంగతి చెప్పనక్కరలేదు. మరియు యీదేశంలోను -'కర్నాటికు, బక్కింగ్హాం' వగైరాలు బ్రిటిషువారి మిల్లులున్నవి. వాటిపైన లాభము చాలవరకు

విదేశీయులకు పోవును. మనదేశంలో నూటికి 92 నిరక్షరులు. అట్టిఅజ్ఞానులు భేదముగ్రహించలేక బజారులో వర్తకులపై నాధారపడుదురు. వర్తకులనడిగితే, సహజంగావారు స్వలాభమే ముఖ్యముగ నెంతురు. కొన్ని మల్లుతానులును ముఖ్యంగా రంగుబట్టలును, నేతబట్టలును ఎక్కడివో విద్యావంతులును గ్రహించలేరు.

స్వదేశమిల్లుబట్టలే కొంచమనువారును ఇట్లు క్రియలో తరుచు జపానుబట్టలో కొనుట జరుగును. శీతలదేశపు దృఢగాత్రులు ఫాక్టరీ వాతావరణంలో తయారై విద్యావంతులునగు బ్రిటిషుజపాను కార్మికులతో సరిగా పోటీచేయుట ఇప్పటిస్థితిలో మనకార్మికులకు సాధ్యమును కాదు. వారికున్నట్లు అవసరమగు ప్రభుత్వపుసాయమును లేదు. ఈస్థితిలో మిల్లులద్వారా బట్టలకు పూర్ణస్వదేశిని సాధించుట కలలోనివార్త. ఖదరుద్వారానే పూర్ణస్వదేశీ సాధ్యము. దానికిచ్చు సొమ్మంతయు మన బీదలకే ముట్టును.

స్వదేశీయుద్యమము 1906 సం॥నుండియు సాగినసంగతి నిజమే. దానిని బ్రిటిషువారిని సాధించు హింసాభావముతో జరిపిరి; మరియు, అప్పుడు మనదేశపు మిల్లుబట్టలపై నాధారపడిరి. మిల్లులు కొన్నిప్రాంతాలలోనే యుండును. వాటిని ద్రవ్యలాభముకొరకే ధనాఢ్యులు నడుపుదురు. తమమిల్లుబట్టలకు స్వదేశీవల్ల గిరాకికలుగగనే, వారుసహజముగ ధరలహెచ్చించిరి; కొందరు వర్తకులు విదేశిమిల్లుబట్టలును స్వదేశీయని నమ్మించిరి. ఇట్లాయుద్యమము క్షీణించినది. బ్రిటిషువారి మిల్లుబట్టలవ్యాపారము హింసాధారము. ఖదరువల్ల విదేశీబట్టల కెక్కడ బహిష్కారముకల్గును గనుక విదేశీయులపైన ద్వేషముకల్గదాయని యొక పరీక్ష, అయితే, ఈవిలాయితీ మిల్లుబట్టలవ్యాపారము మనదేశపుద్రవ్యము నన్యాయముగ రాబట్టుట కక్కడిపుంజీపతులు జరుపుచున్నారు గదా! మరియు, ఇప్పుడు బ్రిటనుజపానుల జాతీయసంపదయు జనుల దామాషారాబడియు ఈదేశపుకన్న చాలహెచ్చు, ఆంగ్లేయులు పుంజీపతితత్వము ధనాధిక్యమువల్ల మత్తులైయున్నారు. అక్కడికార్మికులకు

ఇక్కడియుద్యోగు లనేకులకన్నను హెచ్చు జీతము ఉపపత్తికలవు. నిరుద్యోగుల సర్కారుపోషింతురు. ఇక మధ్యవర్గీయుల ఆదాయము ఇక్కడి పైతరగతివారికన్నను హెచ్చు. మనదేశము నాగరికలోకమంతటిలో నతిదరిద్రము. అనగా బ్రిటను అతిభోజనపుబాధవల్లను, హిందూదేశము అభోజనమువల్లను బాధనొందుచున్నట్లున్నవి. ఇంగ్లండు జపానుల నింకను శ్రీమంతము చేయుటకని, మనబీదదేశము నింకను దరిద్రముచేయుట అహింసాపద్ధతియగునా ? అసలు మిల్లులపద్ధతిలో హింసాతత్వమిమిడియున్నది. ఆర్థికంగా మిల్లులవృద్ధివల్ల కొద్దిమందిధనికులు మరింత ధనాఢ్యులౌదురు. కొద్దిమంది కార్మికులు నెట్లో జీవింతురు. కాని, అంతకు నూరురెట్లు బీదల ఏకువడుకు, నేతవడ్రంవగైరా వృత్తులు నశించి అవృత్తుల వారందరును దుర్దశపాలౌదురు. సాధ్యమైనంతవరకు నరులకు బదులు యంత్రములద్వారా ఉత్పత్తిచేయుట యాంత్రికసిద్ధాంతము. పరిశోధనద్వారా కొత్తరకపు యంత్రములు తెచ్చుకొలది పనివాండ్ర అవసరము తగ్గుచున్నది. వాటివల్ల కొంతశరీరశ్రమ కలసివచ్చేమాట నిజమే. కాని, మనదేశంలో పనులు తక్కువ, జనసంఖ్య హెచ్చు. జనులదేహశక్తి పరిశ్రమవల్లనే వృద్ధియగును, అది వినియోగంలేక క్షీణించుచున్నది. కోట్లకొలదిజనులు నిరుద్యోగులైనారు; వీరికికొద్దిజీతముకైన పనికావలె.

ఇక సాంఘికఫలము జూతుము: మిల్లుల కూలీలపేటలు బస్తీలుగ నేర్పడి, బొత్తిగా కిక్కిరిసి తగుగాలివెల్తురు జలసమపాయము లేక, అనారోగ్యముతోనుండును. వీరుపనిచేయు కార్ఖానాయంత్రాలు మహాధ్వనితో నాడులనుద్రేకింపజేసి వేడివల్లను అనారోగ్యకరమై కృత్రిమస్థితిలో నుండును. ఇట్టిస్థితిలో వారు పగలంతయు పనిచేసి కలుషితవాయువుపీల్చి బలువుపనిచేసి వత్తురు; ఇది ఆపరిస్థితులవల్ల కలిగేది. స్త్రీలు పురుషులు నౌకరీకై పరస్పరమును పిల్లలను విడిచియుండురు, రాత్రులును తమయిరుకు కొట్లలో పశుప్రాయముగ వర్తింతురు. స్త్రీలు పురుషులకన్నను చాలబాధపడుదురు; మేస్త్రీలువగైరాలను పోషింపవలె. కూలీలు నెం

త్రములవలెనౌదురు; యజమానులు వీరిని కీలుబొమ్మలవలె నుంతురు. ఇంగ్లండుకన్నను, ఇక్కడి యున్నస్థితిలో కూలీలయవస్థ మరింత దుర్భరము. ఈకూలీలలో వ్యభిచారము త్రాగుడు హెచ్చుగ వ్యాపించి, నైతికముగను ఫాక్టరీలు హానిగల్గించుచున్నవి. ఫాక్టరీపద్ధతి అంతర్జాతీయముగను హింసాకరము. ఆయాదేశముల మిల్లుదార్లమధ్య పోటీవల్ల విరోధములు, యుద్ధములుకూడ కల్గుచున్నవి. మరియు మిల్లుయజమానులు చౌకగ సరుకు లుత్పత్తిచేయుటకై తమ కార్మికులకు జీతమును సౌకర్యములను వీలైనంతతక్కువగనే చేయుదురు. కార్మికులు సహింపలేక మిల్లుదార్లను సమ్మెలద్వారా నిర్బంధముగ సాధింపజూతురు. దౌర్జన్యము జరుగును. ఇట్లు వర్గసంఘర్షమును అందువల్ల హింసాతత్వమును వ్యాపించును. పెట్టుబడిదార్లు తమలాభద్రవ్యమును స్వలాభముకును, అధికారబలముకును కొంతదుర్వ్యసనములకును ఖర్చుచేయుదురు. కనుక మిల్లుల పద్ధతి సర్వవిధముల సంఘర్షముకు హింసకు కారణము. కనుక నిజమైనప్రజాభిమానులు అహింసాపరులును ఖదరునేకొనవలెను.

ఖదరు కట్టిబాధ లుండవు. తకిలీకి చర్కాకు పెట్టుబడి నామమాత్రము, ప్రతివారికి అందుబాటైనది, కనుక స్వగృహములో నేయుంచి పిల్లలు పెద్దలుగూడ పరిశుద్ధపరిసరములో వీలువెంబడిని స్వేచ్ఛతో పని చేయుచు, వడికి నేసుకోవచ్చు. అట్లు తయారుచేయుబట్ట ఆపనివారి స్వంతమగును. దానిని తామే ధరింపవచ్చు, లేదా అమ్మి సొమ్ము చేసుకోవచ్చు. మరియు ఖదరు కొనుటకిచ్చుసొమ్మంతయు దానిని తయారుచేయుబీదప్రజలకే ముట్టును. అనగా, ఖదరుకెక్కువ సొమ్మిచ్చినను దానిద్వారా బీదలను పోషించి ధర్మము చేసినవారమగుదుము.†

యాంత్రికదేశాలలోను రాట్నపుపరిశ్రమ, చేతినేత కొంతవరకు జరుగుచున్నవి. కోట్లకొలది పనిలేక అల్లాడు ఈదేశంలో అట్టి పరిశ్రమ

† శ్రీమంతులు ధనికులను కాక బీదలనే పోషింపవలెనని పూర్వులు చెప్పినారు.
'దరిద్రాన్ భర కౌంతేయ మా ప్రయచ్ఛేశ్వరే ధనం.' (మహాభారతం)

అవసరము. ముఖ్యంగా అనాథస్త్రీలు వగైరాలు స్వతంత్రంగా యింట నుండియే ప్రాణమానముల గాపాడుకొనుట కందరికీ అందుబాటు గల పరిశ్రమ దూదిపట్టుల రాట్నపుపరిశ్రమయే.

మరియు మనదేశంలో ¾ వంతుకుపైగా జనులకు వ్యవసాయమే జీవనాధారము; కాని, తరచు సాలీనా సుమారు ఆరునెలలే వ్యవసాయపు పని యుండును. అప్పటికును ఈవిశాలదేశంలో ఇందరికి వ్యవసాయవృత్తి చాలదు; ఇంతేకాక, అతివృష్టి అనావృష్టి వగైరా యీతిబాధలవల్లను అకాలపువానసష్టమువల్లను కొందరికి నష్టము వచ్చుచునేయుండును.* రాయలసీమవంటి కొన్నిప్రాంతాలలో జలవసతి చాలతక్కువగుటవల్ల క్షామదేవత స్థిరముగ వసించుచున్నది. కనుక మనవ్యవసాయదారులకు వీలైన ఉపపరిశ్రమగూడ ఉండుట చాలఅవసరము. అందుకు అన్నివిధములను తగినది ఏకుట రాట్నపుపరిశ్రమ నేతయునే. ఇందువల్ల వారు పండించు ప్రత్తికి చలామణియు హెచ్చును. దీనిని జనులు నేర్చుకొనుటయు సులభము. ఆబాలగోపాలమును ఎక్కువశ్రమ లేకుండ యీపని చేయగలరు. అద్దకం వగైరాలకును ప్రోత్సాహము కల్గును.

వడకుట, నేయుట మృదువైన దేహపరిశ్రమను గల్గించి, ఆరోగ్యహేతువగును. ఇది శరీరముకు బాధలేకుండునట్లు మితమైన పరిశ్రమనిచ్చునది. నాడులను స్థిమితపర్చి, వాటి ఉద్రేకమును పోగొట్టును. నిగ్రహముగల్గించును. ఉదయము, సాయంకాలము కొంచంకాలం వడికితే విశ్రాంతికాలముకు సద్వినియోగమగును. యంత్రాలలోవలె బడలిక అను లతవల్ల అనారోగ్యముండదు. హితమగువ్యాయామము దేహారోగ్యముకవసరమని వైద్యశాస్త్రము చెప్పుచున్నది.

అట్టిస్త్రీలకు బాలురకు నీరసులకు అనువై ఇంటనే ప్రతివారు చేయదగు ఉత్పాదక పరిశ్రమ నూలు వడకుటే.

---

* కరవులున్నచోట ప్రస్తుతం ప్రభుత్వము నిరుద్యోగులచేత రాళ్ళు కొట్టుట వగైరా బండపనులు చేయించి జీతము లిచ్చుచున్నారు. అవి వ్యర్థములు. వాటికన్న దూది వడికించుట మంచిది.

ప్రతిదినమును సంధ్యావేళలందు నూలువడకుట ఆధ్యాత్మికముగను చాలప్రశస్తము. గీత మొదలగు ధార్మికగ్రంథాలలో బోధించిన ఏకాగ్రత కర్మపరత్వము విశ్వప్రేమభావము ఇందువల్ల కల్గును. అనగా నూలువడకుటవల్ల త్రికరణములద్వారాను ఆత్మవికాసము ఆత్మసాక్షాత్కారమును గల్గును. ముఖ్యంగా నూలువడకువారికి ఖదరుధారులకు సమత్వబుద్ధియు, ప్రేమయు, బీదలపైన సానుభూతియు కల్గునుండును. మరియు ఖదరులో మిల్లుపరిశ్రమలో నున్నంత వ్యాపార లాభతత్పరత మోసపు ప్రవృత్తియు నుండవు. ఖదరుకర్తీ తెలియుటయు సులభము. ఈరీతిగా ఖదరు అహింసకు సత్యముకు వర్ధకము, ధార్మికతకు చిహ్నము.

ఇంకొకసంగతి: మనగ్రామములలో నిప్పుడు సోమరితనము పెరిగి పురుషకారము నశించినది. నిరాశవల్ల అదృష్టంవైపు దృష్టితిరిగినది. 'సోమరిమెదడులో దయ్యాలు పనిచేయున'ని ఇంగ్లీషులో సామెత యున్నది.* అనగా దురాలోచన లేర్పడును. గ్రామాలలో చీట్లాట కక్షలు విపరీతంగా పెరిగినవి. కక్షలతో కోర్టులలో తగువులు పెరుగుచున్నవి. ఇట్లు కాలము శక్తి దుర్వినియోగం కాకుండుటకును మనస్సును సత్కార్యమందు నిలుపుటకును రాట్నపుపరిశ్రమ మంచిసాధనము. ఇదినిగ్రహకరము. దీనివల్ల మనోవికాస మేర్పడును. హస్తపు శిల్పశక్తియు హెచ్చును. గదలు ముద్గరలు డంబెల్సు భౌతికశక్తినే హెచ్చించును. ఇందులోనో జనులందరికీ ఉపయుక్తమగు వస్త్రోత్పత్తిచేసి మంచికార్యము చేసినామను ఆనందము హృదయతృప్తియు నేర్పడును. ఈబీదల కష్టసుఖములు బోధపడి కర్మపరులందు సానుభూతియు సమత్వబుద్ధియు గల్గును. సౌమ్యజీవితమును ఉదారభావమును అలవడును. కొంతవరకు నిత్య ఖదరుదారులకు నిట్టిభావము లుండును.

ఖదరుపరిశ్రమ యాంత్రికోత్పత్తివలె ఇతరులను బాధించేది కాదు. ఈరీతిగా జనులలో అహింసాతత్వము వ్యాపించి దృఢపడును. ఇట్లన్నివిధ

* The idle man's brain is the devil's workshop.

ములను ఖదరు క్షేమకరము. అయితే జనులలో చాలమంది ఖదరును గట్టినప్పుడే ఈపరిశ్రమకు జయముకల్గును కనుక, అహింసాభిలాషులందరును ఖదరు వ్యాప్తిని నియతంగా ప్రోత్సహించవలె.

రాట్నపుకృషి ఆర్థికంగా ఫలప్రదంకాదని కొందరాక్షేపింతురు. కాని, మనదేశమందీయాక్షేపణ సరికాదు. తక్కిన నాగరికదేశాలన్నిటికంటె సగటున మనదేశపుజనుల ఆదాయము చాలతక్కువ. శ్రీమంతులు దరిద్రులు కలిపి దామాషాను జనులకు రోజుకు 1⅜ అణా మాత్రమే ఆదాయము. అనగా ఎందరో కోట్లకొలది జనులకు అంతమాత్రం రాబడియు లేదనిస్పష్టము. బాధలేకుండ రోజు కెనిమిదిగంటలు స్త్రీలు పిల్లలుగూడ వడుకవచ్చును. అందువల్ల రోజుకు 3 అణాలైనను గిట్టును. మరియు, ఏకూలియు లేనప్పుడీపనిచేయుట తప్పక లాభకరము. ముఖ్యంగా స్త్రీ లింటియొద్ద పనికి భంగంలేకుండ అక్కడనే 3 అణాలచొప్పున న్యాయసంపాదన చేయుట కింతకన్న సర్వసామాన్యపువృత్తి మరేమున్నది ?

'మిల్లుబట్టలకన్న ఖదరుకు కిమ్మతుహెచ్చు కనుక కొనలేమ'నుట పరిపాటియైనది. కాని, ఇట్లనువారు తరుచు వ్యర్థమైన ఖర్చులెన్నియో చేయుటయు, హెచ్చుఖరీదుకు జరీపంచలు పట్టుచీరలుకొనుటయుకలదు. ఇదిగాక ఖదరుధర కొంచెము హెచ్చైనను, ఎక్కువ మన్నికకలది, కనుక మొత్తముమీద గిట్టును. ఖదరును బస్తీలలోని కొట్లలోకొనుటకన్న గ్రామములలో కూలికి నూలుతీయించి, అక్కడనే నేయించితే, తక్కువ కిమ్మతుకు గిట్టును. ఆధరకును కొనలేనివారు పెరళ్ళలో ప్రత్తిమొక్కలు మొలపించి ప్రత్తి నిలవయుంచి, ఆదూదితో యింటనే తీరికమైనప్పుడు నూలు తీయుంచవలెను. అప్పుడు నేతకూలిమాత్రమే తగులును. అది చాల చౌకగగిట్టును. ఇట్లు గట్టినిశ్చయముంటే ధర ఆటంకముకాదు. ఖదరే అహింసకు సూచకమని గ్రహించు ప్రతివాడును ఇట్లేదోరీతిని ఖదరు సంపాదించి కట్టుటే న్యాయము.

మిల్లుబట్ట నాజూకు యింపుగనుంచునని, ఖదరు మోటవికృతము, అందు కళ లేదు, అని కొందరియాక్షేపణ. ఇప్పుడు మిల్లుబట్టలు తరుచు ఖదరుకన్న సన్ననునుపు అగుమాటనిజమే. కాని, ఇప్పుడు మిల్లుకున్న విశేషప్రోత్సాహంలో దశాంశమైననుంటే సన్నని వడుకునూలు తయారగును. పూర్వం 'ఢాకా ముర్షదాబాదు' వగైరాప్రాంతాలలో చేతితోవడికిన నూలుబట్టలు ఖండాంతరములలోను ప్రసిద్ధమై రాజాధిరాజుల దుస్తులైనవి; లోకైకసుందరుల దేహములలంకరించినవి. సన్నబట్టలు పదిగజములబట్టయును పిడికిలిలో నిమిడిపోవునంత సన్నముగనుండేవి. ఔరంగజేబు తనకుమార్తె వక్షస్థలము పైకి కనపడుచున్నదని కోపించెను; "అప్పుడామె ఏడుదుస్తులొకదానిపైనొకటి ధరించితిని; వాటి సన్నదనమట్లున్నది" అని జబాబిచ్చెనట. ఇప్పుడును తగుపోషణయుంటే మరల హస్తకౌశలము బాగుపడి, మంచినూలుతో మిల్లుబట్టలకు తీసిపోనిబట్టలు తయారుకావచ్చును. ఇప్పుడు వడుకువారికి ప్రోత్సాహమును తగు అభ్యాసమునులేవు. ఇవిగాక మనప్రాంతంలో మంచి ప్రత్తిసాగుచేసి, ఇంకను చక్కని నూలుతీయవచ్చును. అట్టిది యిటీవలనే సింధుప్రాంతములో వేయబడుచున్నది. మనప్రాంతములోను పరిశోధన జరుగవలెను. మొత్తముమీద ఎర్రిప్రత్తికన్న జడప్రత్తి కంబోడియాప్రత్తి ఇందుకు మంచివని తోచుచు.

రాట్నములలోను పరిశోధనచేసి మంచిరకపు రాట్నములను చేయవచ్చును. ఇటీవల కొన్ని మంచిరకపు రాట్నములేర్పడినవి. కాని ఈ విషయమున నింకను పరిశోధన జరుగవలెను. మరియు కళ చాలవరకు దృక్పథముపైన మనోభావముపైన నిల్చును. కొందరింద్రియాకర్షణనే కోరుదురు. పైకి ఉజ్వలముగ తోచునది నిదానించి చూడగా సుందరము కాకపోవచ్చును. బాహ్యసౌందర్యముకన్న ఆంతరికమే ప్రశస్తము. సరియైనభావములతో చూచితే యాంత్రికములకన్న చేతితోచేసిన వస్తువులే ఇంపగుట అనుభవసిద్ధము. పైకి సుందరమైనదే మంచిది సత్యమని

కొందరందురు. ప్రజాక్షేమకరమైనది ఆత్మవికాసకరమునై సుందరము అని ప్రాక్కులెంచిరి. కనుక పూర్వులు 'సత్యం శివంసుందరం' అని వర్ణించినారు.

ఖదరు శాంతికి విశ్వప్రేమకు సూచకము. హింసాసంస్కృతిగల జర్మనీ జపాను వగైరాలలోను (ఇటీవల కొంతవరకు ఇంగ్లండులోను), జనులందరికిని నిర్బంధముగ సైనికశిక్ష పెట్టినారు. అనగా దేశమందు యువకులను ప్రతివారును కొన్నియేండ్లు సైనికులై హింసాయుధధారణలో తయారై ఆ'మిలిటరి' దుస్తులుంచుకొనవలెను. ఖద్దరుబట్టలు అహింసాసూత్రములో వడుకుట నేసిన ఖదరు ధరించుట మోక్షలక్ష్యమగును. కనుక అన్నివిధములను అహింసాతత్త్వమువల్ల ఖదరుకు ప్రాముఖ్యమున్నది. ఖదరు ప్రేమకు త్యాగముకు ధార్మికతకు సూచకము. నూలువడుకుట యజ్ఞమువంటిది. వడుకుటవల్ల నానందము కల్గును. ఖద్దరులో ఆధ్యాత్మిక విశేషము వున్నది. అది శాంతిసైనికులదుస్తు.

ఈప్రాముఖ్యము గమనించియే అహింసావ్రతము శిక్షణ దాతలైన గాంధిమహాత్ముడు 1927 లో అఖిలభారత చరఖాసంఘమును [illegible] స్థాపించినారు. ఇది ఖదరు ఉత్పత్తి విక్రయములను ప్రచారమును కూడ విశేషముగా కృషిచేయుచున్నది.

* [illegible]

# 12. ఆర్థికరంగము.

## 2. గ్రామపరిశ్రమలు.

ఇంగ్లండు జర్మనీవంటి ప్రసిద్ధ 'పారిశ్రామిక'దేశాలలో హెచ్చు మంది జనులు నగరవాసులు. మనదేశంలోను ప్రాచీనకాలమునుండి కాశి ఉజ్జయినీపాటలీపుత్రాది మహానగరములు వాటిని చక్కగ వ్యవహరించు వ్యవస్థలును గలవు. కాని మొత్తముమీద గ్రామములందే హెచ్చుమంది జనులుండుట రివాజు. పూర్వము గొప్పధీశక్తిగల ఋషీశ్వరులు దీక్షగల విద్యార్థులు అడవులమధ్య ఆశ్రమములందే వసించుచు మహామేధావులగుచుండిరి. ఇటీవల పాశ్చాత్యసంస్కృతితో సంబంధమున కలకత్తా బొంబాయి మద్రాసు మున్నగు పెద్ద పట్టణములు ప్రముఖములైనవి. కాని యిప్పటికిని నూటికి 90 మంది గ్రామవాసులే. కొద్ది సంఖ్య నగరములున్నను ఏడులక్షల గ్రామములున్నవి. మన విశాలదేశమందిట్లుండుట సహజమే పూర్వమునుండియు వనవాసముకు వృక్షాది ప్రకృతి సౌందర్యోపాసనకు పరిశుద్ధజలవాయువులకు సూర్యతేజస్సునకు వివిక్తతకు స్వేచ్ఛకు మనవారు ప్రాముఖ్యమిచ్చినారు. అట్టి గ్రామములిప్పుడు చెడిపోవుచున్నవి. అందుండు జనులు (వ్యవసాయముతప్ప) వృత్తులుపోగొట్టుకొనుటే యిందుకుకారణము. చాలమందినగరములకు జేరుచు, పాశ్చాత్యసంస్కృతిలోలులై, ఎట్లో జీవించుచున్నారు; మిగిలినవారు సోమరులైనారు. పూర్వపు దైనికనిత్యకర్మపద్ధతి చెడినది. కనుకనే ప్రతి గ్రామములోను కాలక్షేపముకని చీట్లాట చదరంగంవగైరాలు విస్తారముగ వ్యాపించినవి. ఇందువల్ల విలువగలకాలము బుద్ధి దుర్వినియోగపడుచున్నవి.జనుల నిర్మాణశక్తి చెడుచున్నది. నిరాశ హెచ్చినది. కొన్నిచోట్ల జూదము త్రాగుడు వంటి పెద్ద దురభ్యాసములును వ్యాపించినవి. ప్రతి గ్రామములోను కక్షలు 'పార్టీలు' ఏర్పడి, కలహకారితనము వ్యాజ్యాల వ్యసనముపెరిగి, విరోధములు పరస్పరవినాశము ప్రబలుటకును, చాలవరకు నిర్వ్యాపారతయు, స్వార్థపరతతో అంకురించే అసూయహింసా

భావము నేకారణములు. పూర్వము గ్రామస్థులు సంఘావసరములకు పరస్పరము సహాయము చేసుకొనేవారు. గ్రామములో ఏదైన లోటో కష్టమో కల్గినప్పుడు అందరునుకలసి మైత్రితోసులభముగ గ్రామకార్యములు చక్కబెట్టేవారు. ఇప్పుడాస్థితిపోయి,స్వార్థధోరణి సహకారసంఘములును కలతలు హెచ్చినవి. సహకారముకు సాధనము లనుకున్న పంచాయతీ బోర్డులును కలహకారణమగుచున్నవి.

ఈలోపములనుపోగొట్టి గ్రామసౌభాగ్యము కల్గింపవలెనంటే గ్రామజనుల కందుబాటగు నిర్మాణవృత్తులేర్పడవలె. సౌమ్యజీవితము నేర్పవలె ఇందుకు ఖదరుపరిశ్రమ చాల ఉపయుక్తమని యిదివరకే చూచియున్నాము దానివల్ల ప్రతిప్రాంతంలోనూ చాలమంది ప్రత్తి పండించు వ్యవసాయదార్లకు, దూదేకులకు, వడుకువారికి, వడ్రంగులకు, కమ్మర్లకు, నేతగాండ్రకు, అద్దకపువారికి మరల వృత్తులేర్పడును. ఇట్టివే బెల్లము, దంపుడుబియ్యము, వంటి అనుబంధపరిశ్రమలు కలవు బెల్లము మనదేశీయులలో వాడుకలోని మంచి ఆహారవస్తువులలో నొకటి. సారవంతమగు భూములన్నిటిలో చెరుకు పండును. దానిని గ్రామములందే గానుగలలోనాడించి బెల్లముచేయుపరిశ్రమ చిరకాలానుగతముగ వచ్చుచున్నది.ఖదరునుగూర్చి లోగడచెప్పిన సంగతులు దీనికిని వర్తించును బెల్లమునుండి చీనా కలకండ వగైరాలు చేయుచుండిరి కాని ఇటీవల జావా వగైరాలలో యూరపియనుధనికులు గొప్ప తోటలు, ఫ్యాక్టరీలు నేర్పర్చి! అందు 'బీటు'దుంప లుత్పత్తిచేసి, వాటినుండి ఫాక్టరీ పంచదారచేసి, మనదేశములోదింపి చౌకగజయులకంటగట్టుచున్నారు. ఇదిమిల్లుపంచవలె చూచుటకాకర్షకము; కాని, బెల్లము చీనాల చెరుకు పరిమళము ఆరోగ్యము ఈఫాక్టరీకిలేవు. అయినను పాశ్చాత్యసంస్కృతి మోహితులై ఇప్పుడు గ్రామజనులును (తమక్షేమము తెలియక) ఫాక్టరీ పంచదారనే వాడుచు, తోటివ్యవసాయదార్లకు తమ ఆరోగ్యముకుగూడ నష్టము గల్గించుచున్నారు. ... దీనినే

వాడుకవ్యసన మేర్పడినది. ఇందువల్ల గ్రామములలో బెల్లముకు చెరుకుకు గిరాకి పోయి, ఆవ్యవసాయదార్లకు బెల్లంవండువారికి ఆవ్యాపారస్తులకు చెరుకు గానుగలు చేయువారికిని వృత్తులు పోయినవి. ఈపంచదారవల్ల దేశీయుల కోట్లకొలది రూపాయలసొమ్ము విదేశాలకు పోవుచున్నది. (ఇటీవల కొన్నిపంచదారఫాక్టరీ లీదేశంలో నేర్పడినవి. కాని, వాటి వల్లను కొద్దిమంది శ్రీమంతులే బాగుపడుచున్నారు; మిల్లులవలని నష్ట ములు వాటికి నున్నవి.)

దేశీయులందరును శుభ్రమగుబెల్లమునే తినుటకు పింపివ టల కును వాడేయెడల, మరల లక్షలకొలది గ్రామస్థులకు వృత్తులు జీవనో పాధి కల్గును. ఇట్లే దంపుడుబియ్యము చాలమంచిది దంపుట స్త్రీలకు వృత్తిగా నుండెడిది. దానికిబదులు అనారోగ్యకరమగు మిల్లుబియ్యం వాడుటవల్ల జట్టులుచు వేలకొలది బీదస్త్రీలకు వృత్తినాశమును గల్గినవి. ఫాక్టరీబియ్యము చూచుటకింపేకాని రోగహేతువని ఘనవైద్యులును తెల్పుచున్నారు. ఇవిగాక ఆయాగ్రామసౌకర్యమునుబట్టి తేనె, కాగిత ములు, మంచిచాపలు, తివాచీలు, వగైరా గృహపరిశ్రమలు పున రుద్ధరింపవచ్చును. మరియు పూర్వం గ్రామాలలోని వడ్రంగులు, కమ్మ రులు, కుమ్మర్లు, చమారులు ఇత్యాదులు చేయువస్తువుల నిప్పటి నవ నాగరికులందరు వాడుట మాని, వారివృత్తులు పోగొట్టినారు. 'కంపెనీ ఫర్నిచరు, విలాయితీ యినుపసామానులు, చీనాప్లేటులు, బాటాకంపెనీ షూలు' ఇప్పుడు చలామణిలో నున్నవి.

ఈరీతిగ ఆయాగ్రామస్థులకు కులవృత్తులు నశించి వారి కొను గోలుశక్తియు పోయినది అందువల్ల ఆనిరుద్యోగులు గింజలు వగైరా లను కొనలేక బిచ్చగాండ్రగుచున్నారు. కనుక గ్రామాలలో వ్యవసాయ దార్లకు అపారనష్టము కల్గుచున్నవి. గ్రామస్థుల యితరవస్తువులను తాము కొంటే, వారును తమవస్తువులు కొందురు. అందుకు కొంత

హెచ్చుసొమ్మిచ్చినను అది గ్రామస్తులకే మిగిలి అన్యోన్యసహాయము జరుగును. ఇందులో సహకార సూత్రమున్నది.

వకీళ్ళు డాక్టర్లు వర్తకులు వగైరాలు నాటుసరుకులనే కొన్న యెడల, తమఖర్చుసొమ్ము వాటినిచేయు ఆచుట్టుగ్రామస్థులకేచేరి, వారు అవసరములకు తమచే తప్ప పనిచేయించుకొన్నప్పుడు; ఆసొమ్ముకొంత తమకీయగల్గుదురు. అనగా, ఆఖర్చుసొమ్ముతమకో తమ వారికో చేరవచ్చు. కనుక ఇందులో ఇంస్యూరెంన్సు (=భీమా) సూత్రమును చేరియున్నది.

ఫాక్టరీపద్ధతిగల దేశాలలోను కుటీరపరిశ్రమల నక్కడి విదేశీయులు ప్రోత్సహించుచున్నారు. మరియు ఈదేశంలో వసించునప్పుడును యూరపియనులు సాధారణంగా తమదేశవస్తువులలో యూరపియను కంపెనీలలోనే కొనుచుందురు. మనభారతీయులు స్వదేశీలలోనైన దేశీయవస్తువులనే వాడి కుటీరపరిశ్రమల ప్రోత్సహించుట దేశమంతటికి క్షేమకరమగును.

మిల్లుపిండి, బిస్కట్లు ఓవల్టెను, జాము, డబ్బాపాలు విలాయతీ వెన్న, మిల్లుసూనె ఇట్టి మరికొన్ని ఫాక్టరీ వస్తువులను మనలో చాల మంది తమఆహారముగ ఉపయోగించు చున్నారు. ఇది అనవసరము, అనారోగ్యకరము, జాతీయంగా హానికరము. వీటి కన్న హెచ్చుపుష్టిని ఆరోగ్యమును తాజాయగు గృహవస్తువులే కల్గించును.

# 13. ఆర్థికరంగం.

## 3 ఇతరవిషయములు.

అంతర్జాతీయసంబంధంవల్ల ఈకాలపు ఆర్థికజీవనము క్లిష్టమైనది. పూర్వము చాలవరకు సాటాబేరము అనగా వస్తువినిమయముతో సరుకుల క్రయవిక్రయములు సాగేవి. ఇప్పుడు ద్రవ్యముప్రధానము. నాణెములు, కర్రెన్సీనోట్లు హుండీలు బాంకుచీటీలు అమలుకువచ్చినవి. వీటి సంబంధమగు ఆర్థికనియమములు ప్రభుత్వము నిర్ణయించును. ప్రతిజాతీయప్రభుత్వమును తనదేశపునాణెముల మారకపురేటు సుంకములను, కర్రెన్సీవిధానమును బాంకునియమములను విదేశములతో వ్యాపార సంధులను తనదేశీయుల వ్యాపారాదులకు క్షేమకరమగునట్లు ప్రజాభిప్రాయప్రకారం నిర్ణయించును. మరియు నాగరిక రాజ్యములన్నియు రక్షణపన్నులు వేసియు సొమ్ము సహాయమిచ్చియు, లాభముకు పూచీపడియు, సౌకాదిసహాయము లిచ్చియు, తమదేశపు పరిశ్రమలకు వ్యాపారముకు సాయము చేయును. కాని మనదేశమిప్పుడు పరాధీనము. మన పాలకుల జాతియగుబ్రిటిషువారి ఆర్థికలాభముకు మనక్షేమముకు తరుచు సంఘర్షమున్నది. అట్టిస్థితిలో బ్రిటిషువారు తమదేశీయులకు లాభకరమగునట్లే ఇక్కడి ఆర్థిక విధానమంతను నిర్ణయించు చున్నారు. రూపాయ విలువ షిల్లింగు 4 పెన్నీలనుండి, షిల్లింగు 6 పెన్నీలు చేసినారు. జర్మనీ, జపాను వగైరాలకంటె బ్రిటిషుసరుకుల దిగుమతిపైన తక్కువ పన్ను వేయు చున్నారు. జర్మనీ వగైరాలతోను ముడివస్తువుల విషయములో మనకు లాభసాటి వ్యాపారం లేకుండ, సామ్రాజ్యపు వారికి సగుపాయము లిచ్చినారు. రక్షణ పన్నులు తమ యిష్టము వచ్చినట్లు మార్చుచున్నారు. రూపాయకు బంగారముతో గాక బ్రిటిషు సవరనుతోనే ముడిపెట్టి హెచ్చురేటు మారకము పెట్టినందున, గత పదేండ్లలో 300 కోట్లబంగారము మనదేశమునుంచి ఇంగ్లండు అమెరికాలకు పోయినది. మన వస్తువ్యాపారము దచ్చినది. దాని పున

రుద్ధరణకు విదేశములలోకి మన నౌకలసంచారముకు తగుసదుపాయములులేవు. సరికదా మనదేశపు తీరములలోను బ్రిటిషుకంపెనీల పోటీవల్లను, వాటికి సర్కారువారిచ్చు సహుపాయములవల్లను మనజాతీయ నిర్మాణము కవకాశములు లేకయు నౌకాది పరిశ్రమవృద్ధి కాకున్నది. రైల్వేరేట్లు, రిజర్వుబాంకు బ్రిటిషుప్రభుత్వమేర్పర్చు నియమము ప్రకారం అధికారి సంఘపువశములోనున్నవి. అవి బ్రిటిషువ్యాపారముకే లాభకరములు. మోటార్లు, విమానములువగైరా జాతీయరక్షణ కవసరమగు యంత్రములనిర్మాణముకు ప్రభుత్వమువా రింతవరకు సదుపాయము చేయలేదు. ఇట్లు రాజకీయమోక్షము కల్గినప్పుడుగాని ఆర్థికకష్టములకు విమోచన సరిగాకలుగదు. ఈలోగా ఖదరువగైరా గృహపరిశ్రమలవల్ల కొంతయుపయోగము కల్గును.

కాని, ఈకాలమందు కలుగు నాగరికావశ్యకత లన్నియు గృహపరిశ్రమలవల్లనే తీరవు. యాంత్రికపరిశ్రమలవల్ల కొంత హానియున్నదని యిదివరలో గమనించినాము. ఇది ముఖ్యంగా సామాన్యజనులకు దైనిక జీవితములో నవసరమగు ఆహారము బట్ట వగైరాలకు వర్తించును. ఇట్టివి కాక, విద్యుచ్ఛక్తి జనకయంత్రములు, వాటిపనిముట్లు, రైళ్ళు, మోటార్లు, కొన్ని లోహవస్తువులు,ముద్రణయంత్రము, ముద్రాపరికరములు ఇట్టివి ఫాక్టరీపద్ధతిపై నేజరుగవలెను. మరియు మనపరాధీనస్థితిలోకాకితపు మిల్లులు వగైరాలు మనము ప్రస్తుతం స్థాపించుకోకపోతే, విదేశీయులే స్థాపించి, ఆవ్యాపారము (కలకత్తా గోనెసంచివ్యాపారమువలె) వశపర్చుకొందురు. కనుక ఇప్పటిస్థితిలో కొంత ఫాక్టరీల పరిశ్రమ మనకు తప్పనిసరియైనది. వీటిని సరియైనమార్గమున జరుపుట, గృహపరిశ్రమలతో టిపోటీరాకుండజేయుట, పెట్టుబడి సరఫరావగైరాలకు ఆర్థికనిర్ణయము కార్మికులవసతికి ఆరోగ్యముకు తగు కట్టుదిట్టము లేర్పర్చుటయు, అవసరము. ఇట్టి వాటి నన్నిటిని నిర్ణయించుటకు శ్రీ జవాహర్లాలు నెహ్రూగారి అధ్యక్షతను విజ్ఞులతో గూడిన మహాసమితిని 'నేషనల్' ప్లానింగు

కమిటీ అనుపేరుతో కాంగ్రెసు కార్యసమితివారు స్థాపింపజేసినారు. ఈ సమితివారు ఉపసంఘాలద్వారా చక్కగ విచారణచేసి తగునియమము లతో జాతీయ క్షేమము పెంపొందించు సూచనలతో ప్రణాళికతయారు చేయుచున్నారు. అధ్యక్షుడిప్పుడు అహింసా యుద్ధములో జైలులో నున్నందున ఆపని నిల్చినది. కాని త్వరలోనే ఈరిపోర్టు వెలువడుట మనపరిశ్రమాదులకు లాభకరము.

కార్మికుల సౌకర్యములు, పెట్టుబడిలో సహకారము, జాతీయో న్నతీసాధనములు, స్త్రీల యభ్యున్నతి, యంత్రములపరిశ్రమకు కుటీర పరిశ్రమలతో సమన్వయము, ఇట్టివాటిని జాగ్రతతో పరిశీలించి 28 ఉప సంఘములు తమ విడివిడి రిపోర్టులు పూర్తిచేసియున్నవి. జాతీయప్రభుత్వ మేర్పడినప్పుడే వీటిని సరిగా అమలుజరుప వీలగును. ఇవి దేశీయరాజ్యము లకును చాల లాభకరములు.

## 14. నైతికరంగము—మద్యనిషేధము.

భారతసంస్కృతికి నైతికంగా చాల హానిచేసినది మద్యపానము. కల్లుసారాయ మొదలైన విదేహముకు మత్తుకల్గించువస్తువులనే మద్య మందుము. నల్లమందు భంగువగైరాలు నిట్టివే. వీటి దుష్ఫలితములను ఈదురాచారము పోగొట్టుమార్గమును ఇప్పుడు పరిశీలింతము.

త్రాగుడు కూడదని, మద్యములు వట్టితామసవస్తువులని, హిందూధర్మశాస్త్రిలలో చెప్పినారు. బౌద్ధముస్లిం గ్రంథాలలోను మద్య పానము నిషేధించినారు, కనుక మతప్రధానులనబడు భారతీయులు మద్యవస్తువుల ముట్టకూడదు. త్రాగుడు అధార్మికము, అవినీతికార్యము అని యిటీవలివరకు జనులు భావించేవారు. చీనులకు నల్లమందువలె, ఈదేశీయులకు కల్లుసారాలు పాశ్చాత్యుల సంబంధంవల్ల విశేషంగా పెరిగి, మనజాతిని నిర్వీర్యులుగ జేసినది; జనుల పరస్పరప్రేమభావము నిది నశింపజేసి, కలతలు హెచ్చించి, అంతశ్శక్తివృద్ధి కాటంకమై, నైతికంగాను రాజకీయంగాను పరవశులుగ జేసినది.

త్రాగుబోతులు మైకములో నున్నప్పుడు, ఒళ్ళు మనస్సువశము తప్పునని అందరికి తెలిసినదే; మత్తుతగ్గినప్పుడును వారు క్రూరులగుదురు. ఉచితజ్ఞత విచక్షణనశించి త్రాగిన కూలిజనులు వగైరాలు సాయంకాలమింటికివచ్చినప్పుడు తమపిల్లలను భార్యను వేధించి హింసింతురు, నిర్దయులై కుటుంబపోషణ మానుదురు. తరుచు మద్యముకు వశులైనప్పుడే చోరీ మానహరణము, దొమ్మి, కూనీగూడ జరుపుటమామూలని తెలిసినదే. మానవసహజమగు దాక్షిణ్యము ప్రేమ ఈమత్తతలో నశించును గనుకనే అప్పుడు పశుతత్వము విజృంభించును. అట్టివారి వీర్యమును, తద్వారా సంతానమును చెడును.

అమెరికా యూరపులలోగూడ ఘనవైద్యులు ఆర్థికనిపుణులును మద్యపానము హానికరమని నిర్ణయించినారు. దానిని సాధ్యమైనంతవరకు తగ్గించుట కక్కడి సంఘతత్వజ్ఞులు విశేషకృషి చేయుచున్నారు.

కాని, ఆశీతలదేశములకన్న మనఉష్ణదేశమందు దాని దుష్ఫలితములు చాలరెట్లుహెచ్చు. ముఖ్యముగ మాలమాదిగలు, శెట్టిగలు, చాకళ్ళు మొదలగు శ్రమికజాతులు త్రాగుడుకులోనై యిళ్ళు వాళ్ళు గుల్లచేసుకొని, నిరాశులు పిరికివారునై హింసాచర్యలకు సిద్ధపడి, కొందరు సంఘమంతటిని బాధించుచున్నారు. మరియు అంటుజాడ్యమువలె నీదురభ్యాసము తక్కినవారికిని వ్యాపించుచున్నది. కనుక, దేశములో అహింసను నీతిని మరలనుద్ధరింపదలచువారు ముందుగా మద్యపిశాచమును పారద్రోలవలెను. త్రాగుడుకు కారణములేవి? కార్మికులు ఫాక్టరీ పనిలో అలసిపోయియు ఇంటిదుర్భరస్థితి మరచుటకును ప్రతిసాయంకాలము త్రాగుదురని చూచియున్నాము. తరుచు నిమ్నజాతీయులు 'అమ్మవార్ల' ప్రీతికిని వివాహాదులలోను అంత్యక్రియలలోను మద్యము సేవింతురు. అది మతకర్తవ్యమట! వీరితో సంపర్కముండు చాకళ్ళు, సాతానులు వగైరాలలోను ఈదురాచారము కొంతవ్యాపించినది. తామసము, అయోగ్యము పాపకరము శాస్త్రనిషిద్ధమునగు మద్యమును దేవతలు కోరుదురనుఊహ వట్టిభ్రమయని వారికున్నతజాతివారు బోధించవలెను, నిరోధించియైనను దీనిని రూపమాపవలెను. మద్యపానము మతమునకు వ్యతిరిక్తమని పూర్వము త్రాగుబోతులను సంఘమునుండి బహిష్కరించేవారు, సురాపానము పంచమహాపాతకములలో నొకటి గదా! మనపూర్వికులలో కొద్దిమంది కొకరీతి మద్యపానముండినది, నిజమే. అదిస్వల్పము, ఇప్పు డట్లుకాదు. ఈనవనాగరికత వ్యాప్తివల్ల పూర్వపుకులపు కట్టుబాట్లు, ఆంక్షలు, ఆహారనియమములు సడలినవి. సంఘబహిష్కారపు భయముపోయినది. 'అగ్రవర్ణ'ముల వారిలో పాశ్చాత్యసంస్కృతి ప్రభావమున విదేశమద్యము వ్యాపించు దుర్గతి గల్గినది.

సర్కారువారిప్పుడు కొన్నికంపెనీషాపులలో పాశ్చాత్యమద్యముల విక్రయమునకు వాటినిపొగడుచు అతిశయోక్తి ప్రకటనలకు తావి

చ్చినారు; గవర్నర్లుగూడ మద్యపానము అతిథి సత్కారముకు సాంఘిక మర్యాదకు చిహ్నముగ నెంచుచున్నారు వారిననుసరించు మనవారు 'తోటివాడు తొడకోసుకొంటే తాను మెడకోసుకొన్న'ట్లు, నియమరహితంగా మద్యంసేవించి ఆత్మహానిపరులై, విదేశపు'వైను'కు ముడుపు చెల్లించుచున్నారు, కొందరు పాశ్చాత్యసంపర్కమతోసమ్మోహితులైరి. మద్యనిషేధ మనేది త్రాగుడు కార్యపుస్వాతంత్ర్యముకు భంగకరము, కనుక మద్యనిషేధము నిరోధమునుకూడ'దన్నారు!

ఇంకలో పాశ్చాత్యుల అభ్యాసము మనకు సరిపడను. వారిసంస్కృతి, ఆదేశపుశీతోష్ణస్థితి, సంప్రదాయమును వేరు. మద్యమును కాశలికులైరి స్తవుల మతోత్సవములలోను వాడుదురు. అక్కడయాంత్రిక సంస్కృతి వేరు బారినది; ఆంగ్లేయులవి శీతలదేశములు, అక్కడిజనులలోచాలమంది భాగ్యవంతులు; అమెరికా సంయుక్తరాష్ట్రపు ప్రభుత్వంవారు లోగడ మద్యపానము నసలేనిషేధించిరి. అప్పుడు జనులనీతి, ఆరోగ్యము, కార్మికులకార్యశక్తియు, హెచ్చినవి. అయితే మద్యవ్యాపారముతో కోటీశ్వరులైన పుంజీపతులు సహజంగా ద్రవ్యాశచే కొందరిని లోబర్చుకొని, ఆనిషేధమును రద్దుచేయించిరి. వారిపలుకుబడి చాలహెచ్చు కొందరు రహస్యముగ మద్యమునుతెచ్చి అమ్ముచుండిరి. ఆంగ్లవర్తకులును సముద్రనౌకలద్వారానుకనడాద్వారాను అక్కడసారాయములను రహస్యముగ జొప్పించిరి. వీరియందరిపోరు పడలేక అమెరికను ప్రభుత్వము మద్యనిషేధము రద్దుచేసినారు. కాని అందుకు అక్కడి ధీమంతులు విచారించుచున్నారు. అవినీతి హెచ్చినది. ఇక్కడనో మతము, నీతి, ప్రజాభిప్రాయమును, మద్యనిషేధము కనుకూలములు. ఇదివరలో పాశ్చాత్యులవలె కొందరు టెంపరెన్సు (మితపానము)కే ప్రచారముచేసిరి. కాని అందువల్ల త్రాగుడు తగ్గలేదు. అదిసహజమే. మద్యాసక్తి మహావ్యాపక ము. త్రాగుబోతులు మూర్ఖులు; వారికిత్రాగుట కాకర్షణగల్గించి అంతట ఆయజ్ఞానులు మితపానమే చేయుదురనుట హాస్యాస్పదము.

మరియు, టోకున మద్యవిక్రయమిప్పుడు ప్రభుత్వంవారి లాభవ్యాపారము. ఆయాప్రాంతపు అధికారులు సాలీనా మద్యవిక్రయపుహక్కును తాలూకాఉద్యోగులద్వారా వేలంవేయుంతురు. పాటదార్లకు పోటీపెట్టి వీలైనంత హెచ్చుగ సొమ్మురాబట్టుదురు. ఇట్లు హెచ్చుగ పాడినయిజారాదార్లు కల్లంగడులబెట్టి హెచ్చుగ మద్య మమ్ముకొందురు. చెట్లగీతకు సర్కారుకు వేరుగ రుసుముకలదు. ఇట్లు సర్కారుకు మన దేశమునీద 17 కోట్ల రూపాయలు మద్యాదాయమువచ్చును. ఉద్యోగులు తామిచ్చులైసెన్సుప్రకారం గ్రామాలలోను కల్లుఅమ్మకమును కాపాడుదురు. మనమద్రాసురాష్ట్రముకు కల్లుయిజారావల్ల సుమారు 4 కోట్లరూపాయయలు రాబడివచ్చును. (అది ఇక్కడిమొత్తపు ఆదాయంలో సుమారు నాల్గువవంతు). ఏటేట హెచ్చురాబడికై సర్కారువారు యత్నించి కల్లుఅమ్మకమును పోటీపెట్టి ప్రోత్సహింతురు. ఈఅన్ని కారణాలవల్ల చాలమందిజనులప్పుడు సిగ్గు భయము వదలి, విచ్చలవిడిగ త్రాగుచున్నారు. 1921, 1930-32 లలో కాంగ్రెసువారు కల్లంగడులవద్ద జనులను త్రాగవద్దని తాళ్ళుగీయవద్దని నిరోధించగా, అట్టిప్రజాసేవకులనుద్యోగులరెస్టుచేసి జైలులోనుంచిరి. ఈమద్యాదాయశాఖను ఆయాప్రాంతపు ప్రభుత్వములకిచ్చిరి. 1937 సం॥రంలో 7 రాష్ట్రాలలో కాంగ్రెసువారే మంత్రులైరి. వారు మద్యనిషేధం అమలుచేయజూచిరి; అందుకు సర్కారు కల్లుపాటలు మానవలె. అందువల్ల సర్కారురాబడిలో 1/4 వంతు పోవును. కనుక ప్రజలలో విద్యావ్యాప్తి ఆరోగ్యంవగైరాలకు రివిన్యూపోలీసుసిబ్బంది వగైరాఖర్చుకు సొమ్ముచాలదు. ఆ ఆదాయం మరొకరీతిగా భర్తి చేయకతప్పదు. కలెక్టర్లువగైరాల హెచ్చుజీతములు తగ్గించియో, సేనలవిపరీతపుఖర్చు తగ్గించియో, ఎగుమతి దిగుమతులపైన పన్నుసరిదియో, ప్రజలకులాభకరంగా సొమ్ము మిగల్చవచ్చు. కాని అట్టివాటిపైన అధికారము నీమంత్రులకీయక, కేంద్రప్రభుత్వంవారు తమచేతిలోనే పెట్టుకొన్నారు. అట్టిపనులను తాము చేయమన్నారు.

కనుక చిక్కువచ్చినది. మద్యనిషేధము అహింసావ్యాప్తికి ప్రజాక్షేమముకు చాల అవసరము, అవసరమైతే కొత్తపన్నులువేసి సర్కారురాబడి భర్తీచేసుకోవలెనేగాని విషాన్నమువంటి మద్యాదాయముతో ప్రజాప్రభుత్వము సాగించుట నీతిబాహ్యము; కనుక కాంగ్రెసుప్రాబల్యంగల ప్రతిరాష్ట్రప్రభుత్వమును కొన్నిజిల్లాలలో మద్యనిషేధం పెట్టినారు. ప్రజలతోడ్పాటుతో ఆజిల్లాలలో మద్యనిషేధము సాగినది. కాని కాంగ్రెసు ఇంతలో అధికారము వదలినందున కొత్తజిల్లాలలో పెట్టక ఆయుద్యమముకు భంగం కల్గించినారు ఇప్పుడు మద్యనిషేధపు జిల్లాలలో చాల మార్పుకల్గి క్రౌర్యము హింసనేరములును తగ్గినవి.

తాడి కొబ్బరి యీతచెట్లరసము నిలవయుండి పులిసినప్పుడే మద్యమగును. గీయగనే వచ్చిన రసము వెంటనే మద్యముకాదు. అతీయనిరసము ఆరోగ్యకరము. కాని పులిసినది హానికరము. కనుక అదియే నిషేధింపబడినది. యూరపియనులకన్న మనదేశీయులు చాల బీదవారు. కోట్లకొలది జనుల కొకపూటమాత్రం తిండి దొరకుచున్నది. వారికిఅన్న వస్త్రములభించుట కష్టము. ఇట్టి బీదపనివాండ్రలోనే త్రాగుడు హెచ్చు. వారికూలి చాలవరకీత్రాగుడుకు ఖర్చుపడి, వారిభార్యకు పిల్లలకు తిండియుండదు. ఈదేశమందిప్పుడు జనులు సుమారరువదికోట్లరూపాయలు మద్యముకు ఖర్చుచేయుచున్నారు. త్రాగుడుపోతే ఈసొమ్ము వారికి మిగులును, వారికుటుంబములును సుఖపడును. నీతియుకొనుగోలుశక్తియు హెచ్చి దేశవ్యాపారమును ఆర్థికస్థితియు బాగుపడును జనులలో కలహతత్వము తామసత్వముపోయి సాత్వికబలము అంతశ్శక్తి హెచ్చును. త్రాగుడు మానవలెనని జనులలో తీవ్రప్రచారముజరుగుట అవసరము

నల్లమందును ప్రజలకు చాలహానికరము. దీనిని ప్రభుత్వమే తయారుచేయించి దుకాణదారులకమ్మి చాల లాభముదీయుచురు. (దీనివల్ల సర్కారుకు సాలుకు సకుటున 30 లక్షలరూపాయలు లాభముండును, ఇదికొద్దిమునికి వృద్ధులకు ఔషధరూపముగ గుణకరమగును. కాని

చాలమంది పడుచువారు దీని నలవర్చుకొని చెడుచున్నారు. కొందరు (ముఖ్యంగా కార్మిక స్త్రీలు ఫ్యాక్టరీలకు పోవునపుడు)ఇంటివద్ద తమపిల్లలు లేవకుండుటకు నల్లమందు నిత్తురు. ఇందువల్ల మత్తునిద్ర కలుగును, కాని నాడులలో ఆరోగ్యము చెడును. బుద్ధిమందగించును. ఇది కేవలం తామస వస్తువు. కనుక దీనినిగూడ బహిష్కరించవలెను. జాతీయశక్తి హెచ్చించి స్వాతంత్ర్యం సంపాదించుటకును మద్యనిషేధమవసరమే ఇందుకొక చిన్నయుదాహరణ. ఇప్పుడు సాగుచున్న మహాయుద్ధములో బలీయమగు ఫ్రాంసు రాజ్యము జర్మనుదాడికి తాళక కూలుట ఆశ్చర్యముకల్గించినది. ఇందుకు, జర్మనుల కాయుధశక్తి హెచ్చు, వారి సేనానిర్వాహపుయుక్తి గొప్పది, అని యేవో కారణములు చెప్పినారు. అవి కావచ్చు;కాని ఫ్రెంచి సైనికబలమును అద్భుతమందురు. ఈ 20 వ శతాబ్దిలో (ముఖ్యంగా ఈ 20 ఏండ్లలో) ఫ్రాంసులో భోగపరత స్త్రీలలోలత మద్య వ్యసనము విపరీతముగ హెచ్చినవి. ఫ్రాంసు రకరకముల వైనుసారాయముల యుత్పత్తికేగాక కొత్తరకముల దిగుమతికిని ప్రసిద్ధము. భోగలాలసనగర ములన్నిటిలో పారిసుపురమగ్రగణ్యమని పేరొందినది. జర్మనులకన్న 7 రెట్లు ఎక్కువగ ఫ్రెంచివారు త్రాగుడుకులోనైనారని లెక్కలవల్ల తేలినది; వారు నీతిని అంతశ్శక్తిని నిగ్రహమును నిరోధకబలమును ఇట్లు పోగొట్టుకొన్నారు. ఇది నిర్వీర్యతగ తమలో కలహశీలతగ పరిణమించి, ఫ్రెంచివారి పతనమునకు తోడ్పడినది. కనుక జాతీయోద్ధరణకోరువారు మద్యనిషేధము సాగింపవలె.

## 15. భాషారంగము.

సంఘమంతటిలో ఐకమత్యము పరస్పరప్రేమ యుండుటకు ప్రతి దేశపు జనులకు సామాన్యభాషయుండవలె. విభేదము కలతలుగల్గుటకు భాషాభేదమునొకకారణము. ఆయాప్రాంతీయులమధ్య సంస్కృతిసమన్వయముకు జాతీయవాఙ్మయవృద్ధికినిగూడ సామాన్యభాషయుపకరించును. పూర్వం సంస్కృతమో ప్రాకృతమో భారతభూమి ఉత్తరమధ్యదేశములంతటా సామాన్యభాషగా నుండేది. పూర్వపు ఆంధ్రరాజులును ప్రాకృతంలో వ్యవహరించిరి. దక్షిణదేశములోను ఒకే ద్రావిడభాష యుండేది. అక్కడను విద్యావంతులకు సంస్కృతజ్ఞాన ముండేది. తరువాత 10 వ శతాబ్దినుండి ఇతర విభేదములతో బాటు ఆప్రాంతాలలో భాషాభేదములు హెచ్చినవి. ఆయాప్రాంతములమధ్య అన్యోన్యత తగ్గి అప్పుడే క్రమంగా శాఖలు స్వతంత్రభాషలుగ మార్పులుపొంది, అందుండి తూర్పుదిశను బంగాళీ ఓఢ్రములును పడమటికొనను మరాటీ గుజరాతీ సింధీలు నేర్పడినవి. ఉత్తర మధ్యప్రాంతపుది హిందీ. అప్పటికే మూల ద్రావిడపుశాఖలు తెలుగు, అరవం, కన్నడం, మళయాళం తుళు అను ప్రత్యేకభాషలైనవి. కానిపిమ్మటను దేశంలో దాదాపు అన్నిప్రాంతాలలోను ఆర్యావర్తపు ముఖ్యభాషయగు హిందీ తెలిసియుండెడిది. ముస్లిములపాలనలో పారసీ రాజభాష, ముస్లిములకు అరబ్బీ ధార్మిక భాషమైనవి. అందువల్ల హిందీభాషలో పారసీ అరబ్బీల పదములు చేరి వ్యవహారంలో నాగరికభాషకు హిందూస్థానియని పేరువచ్చినది దీని ఉపశాఖయే నిజాంరాజ్యములో "దఖని" యనబడును.* తరువాత బ్రిటిషుపాలన మారంభించినపుడు ఆయాప్రాంతములమధ్య విభేదము హెచ్చినది. హిందూస్తానీకి రాజాదరణపోయి, అది క్షీణదశపట్టినది. విదేశీయమగు ఇంగ్లీషు రాజభాషమైనది. ఇది యీదేశీయులకు కేవలం

---

* ఈ 'దఖని' వికృతినే మనప్రాంతపుముస్లిములు తమలో మాటాడుచుందురు.

కొత్తది. అయితే బ్రిటీషురాజనీతిప్రకారం పరిపాలనమంతయు దూర వ్యాపారమును ఇంగ్లీషులోనే యున్నందున దానియందే విద్యావంతులకును విద్యార్థులకును శ్రద్ధ కలిగినది.

దేశమంతటను ఉన్నతపాఠశాలలలో ముఖ్యముగ ఇంగ్లీషును నేర్పుచున్నారు. సర్కారువారు చాలసొమ్ము ఖర్చుపరచి అన్నిప్రాంతాలలోను ఇంగ్లీషు 'స్కూళ్ళు' 'కాలేజీ'లు యూనివర్సిటీలు స్థాపించినారు. తంతి తపాలు, వార్తాపత్రికలు వగైరాలకు ఆంగ్లంలోనే సదుపాయము లెక్కువగ ఏర్పడినవి. కచేరీలన్నిటిలో ఆంగ్లముకే ప్రాముఖ్యము; ఆంగ్లభాషలో బరీక్షసిచ్చువారికే సర్కారులోను బ్రిటిషుకంపెనీలలోను ఉద్యోగములు.†ఇట్లు ఆర్థికముగ కలిగిన విలువవల్ల మనోబాధకు హెచ్చువ్యయప్రయాసలకు ఓర్చి చాలమంది ఆంగ్లభాష నేర్చుచున్నారు. పూర్వపు సామాన్యానుబంధము శిథిలమై, తమిళులు, ఆంధ్రులు, బంగాళీలు, గుజరాతీలు, అని ఆయాభాషికులు వేర్వేరుజాతు లనుకొనుటయు కలదు. సామాన్యభాష లేనందున ఆయాప్రాంతీయులమధ్య వ్యవహారములును సానుభూతియు తగ్గి, ప్రాంతీయతత్వమును అందుతోబాటు సంఘర్షమును వృద్ధియైనవి. ఇది అహింసావ్యాప్తి కడ్డము; ఇటీవల 1935 సం॥రపు చట్టంప్రకారం రాష్ట్రీయస్వాతంత్ర్య మనగా ప్రాంతీయప్రభుత్వముల కధికారమును ప్రత్యేకతయు హెచ్చినవి. అన్నిప్రాంతములమీదను బ్రిటిషుప్రభుత్వపు అధికారము మరింత బలపడెను. ఈదేశీయులకుమాత్రం కేంద్రాధికారము ఏకత్వబుద్ధి క్షీణించినవి.

ఇట్టిస్థితిలో జాతీయమైత్రిని అహింసారూపమగు పరస్పరప్రేమను హెచ్చించి ఆయాప్రాంతాలమధ్య వ్యతిరేకభావము పోగొట్టుటకు,

† భారతీయవ్యాపారస్థులును సౌకర్యముకని వారినుసరించి ఆంగ్లమందే వ్యవహరించుచున్నారు. ఇటీవలివరకు లోకలు బోర్డు మునిసిపాలిటీలన్నిటిలో ఇంగ్లీషు ద్వారానే వ్యవహారము.

మూర్తుల హిందూస్తానీ సామాన్యభాషగ పునరుద్ధరించుటయవసరమైనది.*
గాంధిగారి సూచనపైన దీనినికాంగ్రెసు నిర్మాణ కార్యములో భాగముగ
అంగీకరించినారు. ఇట్లు సంస్కృతిరంగములో అహింసావృద్ధికి నిది సహ
కారకము. అయితే "ఇంగ్లీషునే సామాన్యభాషగ ఎంచుకోకూడదా!"
అని కొందరిప్రశ్న. "ఇంగ్లీషు ప్రపంచమంతటిలో ఎక్కువవ్యాప్తికల
ముఖ్యభాష. దానిసహాయముతో లోకమంతటను వ్యాపారము చేయవచ్చు;
అందులోని ఆధునిక వాఙ్మయము గొప్పది. ఇప్పటి ప్రభుత్వమెట్లును
దానిని నేర్పుచునే యున్నారు. ప్రస్తుతమది ఆయాప్రాంతీయప్రముఖుల
సమావేశము కుపయోగించుచున్నది అది పాశ్చాత్యసంస్కృతిని విశాల
భావములను హెచ్చింపజేయును. కనుకనే, రామమోహనరాయలును
ఇంగ్లీషువ్యాప్తికి తోడ్పడెను," అని వారివాదము. ఇందులో కొంతసార
మున్నది.

మనది ఒకేదేశము, ఒకేజాతి; రష్యాలో, అమెరికా సంయుక్త
దేశంలో ఎన్నియో ప్రాంతీయభాష లున్నను, తమ దేశీయములలోనే
ఒకటి సామాన్యభాషగ అన్నిప్రాంతాలవారును వాడుచున్నారు. మనము
నట్లేకావలెను. (ఆంగ్ల అమెరికనుమైత్రి కింగ్లీషు వాడుకయు కారణము)

ఈవిషయంలో దూరమాలోచించవలెను. బ్రిటిషుప్రభుత్వము
విదేశీయము. అది యీదేశంలో శాశ్వతంగా ఉండేకల్పంలో ఇంగ్లీషునే
మనసామాన్యభాషగ నుంచుటలో అర్థికమున్నది. కాని, ఆ యాధిపత్య
ము ఆర్థికంగాను, నైతికంగాను రాజకీయంగాను, మొత్తమువీద మన
కెంతయో అనర్థకరముగదా; ఇప్పటి పాశ్చాత్యసంస్కృతియు లోపభూ
యిష్టమని గ్రహించియున్నాము. దానికై స్వసంస్కృతిని వదలుటసరి

* స్పెయినులో బాస్కు-బార్సిలోనా కోటలోనియా వగైరా ప్రాంతీయులు
తమ ప్రత్యేకసంస్కృతిరక్షణకనికలహించిరి. ఇటీవలి అంతర్యుద్ధమునాటికివారు వికమత్య
హీనులైరి; ఎవరికివారు తమప్రాంతపు స్వార్థమునే చూచుకొనిరి. ఫ్రాంకోనాయకత్వ.
తోను జర్మను, ఇటలీల సాయంతోను విద్రోహులు వారిని విడివిడిగా జయించివేసిరి.
వేర్వేరు ప్రాంతీయభాషలనే వృద్ధిజేసి సామాన్యభాష నశ్రద్ధజేసి, వారు విభేదపక్షులైరి.

విడచిసాము చేయుటవంటిది. ఆంగ్లము నేర్చుకొని అందలిమంచి గ్రంథములను మనదేశభాషలలోకి తర్జుమా చేసి ఇప్పటివిజ్ఞానమును స్వభాషలలో తెలుపవచ్చు; కాని విజాతీయమగు విదేశభాష మనకు సామాన్యభాష కానేరదు. అమెరికా (సంయుక్తరాష్ట్రం) కనడా, రష్యాలవంటి గొప్ప దేశాలలో ఆయా ప్రాంతాలలో వేర్వేరుభాషలున్నవి. అందులో తమలో హెచ్చువాడుకయున్న స్వదేశీయభాషనే వారు తమ సామాన్యభాషగ జేసుకున్నారు లోకమందెవరికిని విజాతీయభాష సామాన్యభాష కాలేదు. మరియు ఇంగ్లీషు చాల క్లిష్టభాష. 150 ఏండ్లనుండి సర్కారు ఆలంబంతో తీవ్రప్రచారం జరిగినను, ఇప్పటికి మనదేశంలో మొత్తం జనసంఖ్యలో నూటికొక్కరు మాత్రమే ఇంగ్లీషు మాటాడ నేర్చినవారు. అక్షరపదవాక్య నిర్మాణమును మనభాషలలో వేటికిని కలియదు. ఇది మన స్త్రీలలోను గ్రామములలోను వ్యాపించుట దుర్ఘటము. అందుకు యత్నించి జనులను బాధపెట్టినను, అది అంతగాసాగదు. కనుక ఇంగ్లీషునే ఆమోదించితే విద్యాధికులకు విద్యాహీనులకు మధ్యను, నగరవాసులకు గ్రామవాసులకును, విభేదము హెచ్చును. కొంతవరకు స్త్రీ, పురుషుల మధ్య వైకల్యముగల్గును. హిందీ యిదివరకే మొత్తంమీద యీదేశీయులలో దాదాపు సగంమందికి స్వభాష † శీవంతుల జనముకది యిప్పటికి కొంతవరకు బోధపడును. ఇందుకు మరాఠీ, గుజరాతీ, బెంగాలీ వగైరాలకు హిందీతోగల సన్నిహితసంబంధమే కారణము. తమిళులకు దీనిని నేర్పుట కొంచంకష్టము. మనకును అది ఇంగ్లీషుకన్న చాల సులభము. ప్రాచీనహిందీభాషలో ధార్మికమగు సంస్కృతివర్ధకము, హిందూముస్లిముసమన్వయకరము అగు గొప్పవాఙ్మయమున్నది; వైద్యజ్యోతిషాదిగ్రంథములు నున్నవి.

† 1931 సంII రం జనాభానుబట్టి హిందూస్తానీ సుమారు 14 కోట్లు బంగాళీ 5.8 కోట్లు, ఆంధ్రము 2 6 కోట్లు మరాఠీ, తమిళం రెండేసికోట్లు, కన్నడం, గుజరాతీ, మళయాళం, ఓఢ్రం చేరి ఒకకోటి మాటాడుచున్నారు.

తులసీదాసు కబీరు సూరదాసు మున్నగువారి పూర్వహిందీవాఙ్మయము దేశమంతట ప్రసిద్ధము. ఆధునికహిందీవాఙ్మయమింకను బాగుగ వృద్ధికాలేదు. హిందీకేంద్రము మనమాతృభూమి మధ్యభాగమందున్నది. దానికి పాశ్చాత్యసంస్కృతితో సంబంధము కొంత యాలస్యంగా గల్గినది. ఇప్పుడు హిందీవాఙ్మయము చాల వేగముగ వృద్ధినొందుచున్నది. హిందీ-హిందూస్తానీలో ఇప్పుడు ప్రచురితమగుచున్నన్ని గ్రంథములు వార్తాపత్రికలును మాసపత్రికలును మరి యేదేశీయభాషలోను లేవు. కొద్దియేండ్లలోనే దాని ఆధునికవాఙ్మయమును దేశమంతటిలో ప్రాముఖ్యము పొందగలదు. హిందూస్తానీ మనదేశపు ముస్లిములకు వ్యాపారస్తులకు యిదివరకే సామాన్యభాష. దీనివ్యాప్తివల్ల అన్నిప్రాంతాల వ్యాపారము ఆచారములు భావములు నగైరాలలోను సంస్కృతిలోను కొంతసమన్వయము జరుగును. ఆర్య ద్రావిడ సంస్కృతులు రెండును చాలకాలముక్రిందనే మిశ్రితములైనవికదా. కాని, ఇటీవల ఈ రెంటిని ఎట్లో మరల విడదీసి ద్రావిడుల కార్యసంపర్కము పోగొట్టవలెనని కొంతబోధ జరుగుచున్నది. †(ఇది తలక్రిందుల హిట్లరిజం అనవచ్చును) అయినను పరస్పరద్వేషరూపమగు యీ హింసాప్రచారము అంతగా వ్యాపించుటలేదు. ఆయాప్రాంతీయులమధ్యముఖ్యంగా ఉత్తర దక్షిణాల మధ్య అన్యోన్యతయేర్పడుటకు హిందూస్తానీని జనులలో బాగుగ వ్యాపింపజేయుటేచికిత్స. విభేదధోరణిగల 'ద్రావిడ' సిద్ధాంతపు వారు హిందూస్తానివ్యాప్తిని నిరోధించుటసహజమే. కాని యిటీవల తమిళులలోను చాలమంది హిందీనేర్చుకొని అందు ప్రవీణులగుచున్నారు.

హిందూస్తానీప్రచారంవల్ల ప్రస్తుతం కొందరు ముస్లిములుతమకు నష్టమని యనుమానించినారు. ఇది పొరబాటు. ముస్లిములలో కొన్ని

† ఈపక్షమును ధర్మనిరాసకుడగు శ్రీ ఇ. వి. రామస్వామినాయకరుగారు సాయకుడు.

ప్రాంతీయులవారు దానినే స్వభాషకు బదులుగ వాడుచున్నారు * (పంజాబులోని గ్రామీణుడైనను ఒక ముస్లిము కాకినాడకో గుంటూరుకో వచ్చిన, అతడిక్కడిముస్లిములతో హిందూస్తానీలో చనువుతో మాట్లాడి వారియాదరమును బొందును.) హిందువులును హిందూస్తానీని సామాన్యభాషగ నేర్చినయెడల, తమలోను సంఘటనమేర్పడును. హిందూముస్లిముసంఘములమధ్యను మైత్రిగల్గును. ఇందులో కొన్నిసమస్యలేర్పడినవి †

ఇప్పుడు, కొందరు హిందువులు ముస్లిములు గూడ ఈభాషాసమస్యను తమతమ మతముతో ముడిపెట్టుచున్నారు. ముస్లిములు పారసీ అరబ్బీ పదములనే తరుచు హెచ్చుగవాడుచు, పారసీలిపిలోనే వ్రాయుచు, ఈమిశ్రితభాషను 'ఉర్దు' అని, ఈలిపినిగూడ 'ఉర్దు' యనుచున్నారు. ఉర్దు ప్రత్యేకభాషకాక పశ్చిమహిందీకి ఉపశాఖయని భాషాపరిశోధకుడగు శ్రీ జే.సర్. అబ్రహాంగ్రియర్సనుగారు Linguistic Survey of India లో స్పష్టపర్చినారు. ఇట్లే హిందువులలో కొందరు సంస్కృతపదములు హెచ్చుగవాడుచు, దేవనాగరిలిపిలోనే వ్రాయుచున్నారు. తరుచు సంస్కృతమునకు దేవనాగరినే వాడు సంప్రదాయమున్నది. కనుక చాల మంది హిందువు లీనాగరిలిపి పవిత్రలిపియన్నారు. దీనిద్వారా హిందువులు వారిమతమును తమపైని జొప్పించి బాధింతురని కొందరు ముస్లిములు భ్రమించినారు. ఈరీతిగ హిందూముస్లిములమధ్య కొంత అనవసరమైన క్రోధమేర్పడుచున్నది. ఉభయులు సహనబుద్ధిగల్గి ఉదారులైతే,

* గుజరాతు, బెంగాలు, ఆంధ్రం ఈప్రాంతముల ముస్లిముల కీ ప్రాంతీయభాషతే అసలు స్వభాషలు. కాని వారిప్పుడు హిందూస్తానియే స్వభాషయనుట పరిపాటియైనది.

† ప్రస్తుతము ముస్లిములలో కొందరు హిందూస్తానికి సామాన్యభాషకన్న హెచ్చుగ మాతృభాష స్థానమిచ్చినారు. కొందరు హిందువులు దానిని సామాన్యభాషగను నుంచకూడదన్నారు. ఈ అతివృష్టి అనావృష్టి మాని, అందరూ దానిని సామాన్యభాషగ నేర్చవలెను; ప్రాంతీయభాష నెవరును అశ్రద్ధ చేయకూడదు.

ఈసంఘర్షము కవసరమే లేదు. మామూల్, తయార్, జరూర్, సబబ్, సలహా, ఖజానా, వగైరా, వంటి వందలకొలది పారసీ అరబ్బీ పదములు హిందీలోనేగాక మనమిగతా దేశభాషలలోను(ఒకప్పుడుకొద్దిమార్పుతో) వాడుకలోనున్నవి. వాటినితొలగించి ఆస్థానే అంకుశములు క్లిష్టమౌ సంస్కృతపదముల బెట్టుట న్యాయముకాదు. క్లిష్టమైన అరబ్బీ పారసీపదముల జొప్పించుటయు సబబుకాదు. 'హిందూస్తానీ' ఉర్దు, హిందీ, వేరు భాషలుకావు. మన తెలుగులో కొందఱు అచ్చతెలుగుమాటలనుకొందరు సంస్కృతపదములను, (నిజాంప్రాంతస్థులు పారసీలఫ్జులను) హెచ్చుగ వాడుదురు. ఇట్లే భారతములో నన్నయ తిక్కనగార్ల రచనలలోను, వీటికి అచ్చతెనుగు పోత్తములతోను, చాలభేదమున్నది. అట్లని, అవి వేర్వేరుభాషలందురా? ఇంగ్లీషు 'ఆంగ్లోసాగ్జను' భాష; ట్యూటనికు తెగలోనిది. కాని, జాన్సనుమిల్టనుల మహాకావ్యములలో నూటికి 70 కి పైగా పదములు 'లాటిను'నుండి వచ్చినవే. వాటివల్ల ఆంగ్లవాఙ్మయమును భాషయు వృద్ధియైనవేగాని చెడలేదు. ఇట్లే ఈదేశపువారు సంస్కృతపదములను నాగరీలిపిని నిరసించుట (ముస్లిములకును) సబబు కాదు. అవి యీదేశపువి. లిపికినిభాషకును మతముతో సంబంధములేదు. చీనాలోను రష్యాలోను, ముస్లిములు ఆయాప్రాంతపు భాషను లిపిని తమ నిత్యవ్యవహారములకు వాడుచున్నారు. ఈజప్టులో క్రైస్తవులు నట్లే. పంజాబులో కొందరు హిందువులును ఉర్దులిపిని వాడుదురు. ముస్తఫాకెమాలు పాషాగారి సలహాపైన అరబ్బీ, పారసీమాటలను ఆలిపిని సీదాగా తప్పించి టర్కీవారు రోమకాక్షరములను అచ్చటి పూర్వపుటర్కీషు పదములను పెట్టుకొన్నారు. ఇంతవరకు కొందరు హిందువులు ఉర్దూలోను, ఇట్లే ముస్లిములు హిందీలోను, విద్వాంసులై మంచిగ్రంథముల రచించినారు. ఇప్పుడిక్కడి ముస్లిములందరికి మాతృభూమి యీదేశమేగదా!

వీరిపూర్వికులలో హెచ్చుమంది అసలు హిందువులే* వారు పఠాను మొగలు పాలకుల కాలంలో 'ఇస్లాం' మతస్థులైరి † ఇప్పటికిని బెంగాలు దక్షిణప్రాంతం గుజరాతువగైరాల ముస్లిములలో చాలమందికి ఆప్రాంతీయభాష లేగాని, హిందూస్థానీ యేమియు తెలియదు. ముస్లిములలోను అధికజనులకు ఉర్దులిపి తెలియదు. అట్టిస్థితిలో భారతీయముస్లిములు దేశీయములగు సంస్కృతపదములు విజాతీయమనుకొనుట, నాగరిలిపికి జంకుటయు, సవ్యముగాదు. ఐనను నిర్బంధముగ నాగరిని ముస్లిములపైన చొప్పించుటహింసాకార్యమగును, కనుక వారికందరి న్యాయము తోచు వరకు ఎవరికితోచిన లిపిని వారు వాడుటేమంచిది. సౌకర్యదృష్టినే చూచిన, ఉర్దూకన్న నాగరి యెక్కువస్పష్టము, వైజ్ఞానికము, చాలమందికి తెలిసినది, ఈదేశపుఇతరప్రాంతములలిపికి సంబంధించినది. కనుకఅందరికి మంచిది. కేవలం వ్రాతసౌకర్యపు దృష్టితోనే చూచితే, ఈ రెంటికన్నను రోమకలిపి (అనగా ఇంగ్లీషు వ్రాత చిన్నఅక్షరములు) వ్రాతకు అచ్చుకు, టైపు టిలిగ్రాం వగైరాలకును, సులభము. దానిద్వారా బాలురకక్షరములు త్వరలో నేర్పవచ్చును; కాని అందులోను లోపములున్నవి.) ఆ విజాతీయ లిపిని భారతీయులలో ఏపక్షమును సామాన్యలిపిగ స్వీకరించుట కొప్పుకోలేదు.) సైనికులు బ్రిటిషు ఉద్యోగులు మిషనరీలు ఈలిపి ద్వారా హిందూస్తానీ నేర్చుచున్నారు.

ఇక భాష. వాడుకలోనున్న దేశ్యపదములను సంస్కృతపారసీ శబ్దములను ఒకప్పుడు పారిభాషికములకు ఆంగ్లపదములనుగూడ వాడుటేసుకరము. జనులలో అహింసాపద్ధతి సామరస్యమునుంటే హిందూస్తాని కొద్దికాలంలోనే పూర్తిగ సామాన్యభాషయగును. ఈసామాన్య

* ముస్లింలీగు ముఖ్యనాయకులు ఉర్దూవాదులునగు జనాబుజిన్నా, అబ్దుల్లా హారూన్, సికందర్ హయత్ ఖాన్, ఫజ్లుల్ హక్కుగారల అసలు పూర్వికులుహిందువులే లని స్పష్టము.

† ఇప్పుడు చాలమంది నిమ్నజాతిహిందువులు క్రైస్తవులగుచున్నట్లు ముస్లిములకు పారసీలిపి ధార్మికమైతే, క్రైస్తవులకు ఆంగ్ల (రోమక) లిపి ధార్మికమనవచ్చును.

భాషకును ఆయాప్రాంతపు మాతృభాషకును సంఘర్షముకూడదు. సామాన్యభాషావ్యాప్తికి అహింసాసిద్ధాంతమే ముఖ్యసూత్రముగదా! బాలుర విద్యాబోధ యంతయు మాతృభాషలో జరుగవలె. మాతృభాష స్థానంలో హిందీని చొప్పించకూడదు. ఇప్పుడు జనులు చాలవర కనిరక్షరులు; వారి కందరకు ముందుగ మాతృభాషనే నేర్పవలెను. విద్యావంతులే (అందును కొందరుమాత్రం) హిందీ నేర్చుకొందురు. వారు హిందీనుండి మాతృభాషకు, అందుండి హిందీకి, మంచిగ్రంథములను వ్యాసములను తర్జుమాచేయవచ్చును. మనప్రాంతీయసంస్కృతిని విశేషభావములను తెలుపుచు హిందీలో స్వతంత్ర గ్రంథములను రచింపవచ్చును. ఇట్లే ఆయాప్రాంతములసంస్కృతి సమన్వితమగును. గాంధిమహాత్ముడు స్థాపించిన దక్షిణభారత హిందీప్రచారసభవారు మదరాసు రాష్ట్రమంతటకు హిందీ వ్యాప్తినిమిత్తము 1918 నుండి కృషిచేయుచున్నారు. దీనిద్వారా హిందీనేర్చుకొని యిప్పటికి సుమారు 1½ లక్ష మందిహిందీపరీక్షలకువెళ్ళినారు ముఖ్యంగా గ్రామస్థులకును స్త్రీలకును ఇంగ్లీషుకన్న హిందీపైనే యెక్కువ ప్రేమకలదు. ఆంధ్రసంస్కృతముల సంబంధము చిరకాలపుది. క్రీ.పూ. అశోకునికాలమునుండి ఆంధ్రప్రాకృతముల కన్యోన్యతగల్గినది. కనుక తెలుగుభాషలోను వాఙ్మయములోను వేలకొలది సంస్కృతప్రాకృతతద్భవ శబ్దములున్నవి. మరియు మనప్రాంతము కొంతకాలం దక్కనులోని ముస్లిముల యాధిపత్యంలోనుండేది. ఆంధ్రులలో 80 లక్షలమంది యిప్పుడు నిజాంరాజ్యపు ప్రజలు; వారిలో చాలమందికి హిందూస్థానీ తెలిసియున్నది. కనుక వేలకొలది హిందూస్తానీమాటలును మనవాడుకలో చేరి మిశ్రితములైనవి. ఇప్పుడు ఆంధ్రులకు హిందీ తెలియుట సులభము. ఆంధ్రప్రాంతంలో తురకలు, బొందిలీలు, ఇటీవల వ్యాపారంనిమిత్తం వచ్చిన మార్వాడీలు, ఇట్టికొందరు హిందీహిందూస్తానీ తమగృహభాషగ వాడుచున్నారు. మనపూర్వసంస్కృతి సంబంధములబట్టియు ఆంధ్రులు ఉత్తరదక్షిణవాసులమధ్య మైత్రికి, ఈరీతిగ జాతీయసంస్కృతి సమన్వయముచేసి వృద్ధిచేయుటకును, తగినవారు.

# 16. సాంఘికరంగము-మతభేదసమస్య.

మనదేశంలో అనేకజాతులు అనేకమతములు నున్నవిగదా* 10 వ శతాబ్దికిపూర్వం విదేశాలనుండి తండాలుగావచ్చిన ఆయాజాతుల వారు హిందువులలో మిశ్రితులైరి; ముస్లిములట్లు కలిసిపోలేదు. కాలక్రమమున కొందరు ముఖ్యంగా నిమ్నజాతిహిందువులు ముస్లిం మతస్థులైరి; ఇటీవల పంచములలో కొందరు క్రైస్తవులగుచున్నారు. మరియు పార్సీలువగైరా లున్నారు.

ఏకేశ్వరభక్తిని, సర్వమానవ ప్రేమను, అన్నిమతములు బోధించును; కనుక ముఖ్యమతము లన్నిటిసిద్ధాంతములొకరీతివే; కాని, దరిమిలాను ఆచారములు కర్మకాండయుభేదించి, వీటికే జనులు ప్రాముఖ్యమిచ్చి తమతమ ప్రాబల్యముకై కలహించుటకలదు, ఆయాసంఘములమధ్య కొన్నివిభేదములేర్పడి, సాంఘికమైత్రికి జాతీయైక్యముకు భంగం కల్గించుచున్నవి బ్రిటిషువారువాడు భేదనీతివల్ల యీయంతఃకలహములు విస్తరించుచున్నట్లు గట్టి సూచనలున్నవి. మనలో విభేదములు చెలరేగునంతకాలమే మనదేశములపైన పరులు తమసామ్రాజ్యముసాగించిలాభమొందుదురు. అది చిరకాలం సాగుటకునిమిత్తం వారిక్కడిజనులలో భేదపద్ధతినుపయోగించి, మనజాతీయతను దుర్బలముచేసి, తమయాధిపత్యము

* మతమునుబట్టి ఈదేశంలో 1931 సంII పు జనాభాలెక్కప్రకారం

| | | |
|---|---|---|
| హిందువులు | సుమారు | 24 కోట్లు |
| ముస్లిములు | ,, | 8 ,, |
| ఆటవికులు | ,, | 88 లక్షలు |
| క్రైస్తవులు | ,, | 68 ,, |
| సిక్కులు | ,, | 43 ,, |
| జైనులు | ,, | 14 ,, |
| పార్సీలు | ,, | 1 ,, |

ప్రపంచమంతటిలో ముస్లిమతస్థులు సుమారు 21 కోట్లు.

నన్నివిధములను బలపర్చుకోజూచుట సహజమే. ఇది ఒకశతాబ్దినుండి యు వారిరాజనీతిలో భాగము. కాని, అందుకు మన మాంగ్లేయులపైన కోపపడుట అశక్త దుర్జనత్వమే యగును. వారిభేదనీతి ఫలించకుండ మనలో పరస్పరవిరోధపుధోరణి మానుకొని మైత్రి వృద్ధిజేసుకొనుటే చికిత్స. కలహకారణమగు ప్రవృత్తులు మారవలెను. కొంతకాలము బ్రిటిషువారు క్రైస్తవులకు ప్రత్యేకసదుపాయములిచ్చి తమకధీనులుగ జేసుకొనిరి. కాని, సంఖ్యయు విద్యయు హెచ్చినకొలది, క్రైస్తవులు తాము భారతీయులము, కనుక, జాతీయక్షేమమే తమక్షేమమునని ఇప్పడిప్పుడు గ్రహించినారు. పారసీలలోను చాలమంది జాతీయవాదులే. సంఖ్య కొద్దియైనను తమ స్వశక్తివల్లను పరస్పరప్రేమవల్ల భారతజాతిలో అన్నిరంగములందును ఏసంఘపువారైనను ఉన్నతస్థితికి రావచ్చుననుటకు పారసీసంఘపుచరిత్ర నిదర్శనము. ఈకొద్దిసంఘములో ఎందరో జాతీయ నాయకులు వ్యాపారప్రముఖులు, విద్వాంసులునయినారు ఆంగ్లోహైందవులు మిశ్రితజాతి. వారిని బ్రిటిషుసర్కారువారు టెలిగ్రాఫ్ రైల్వేమున్నగువాటి కొన్నిముఖ్యోద్యోగములనిచ్చి బుజ్జగించుట మామూలైనది. ఆ సంఘపుసంఖ్యయు చాల తక్కువ. వారిలోను తాము భారతీయ క్షేమము కోరవలెననుజ్ఞాన మిటీవలనే కల్గుచున్నది.

ఇక హిందూముస్లిములమధ్యనున్న సమస్యప్రధానమైనది. తాము అధికారముకువచ్చినకొత్తలో బ్రిటిషువారు ముస్లిముప్రముఖులకుజాకీ, తమరాజ్యాధికారము నిరాతంకమగుటకు హిందువులనుకొంతవరకభిమానించిరట. కాని, ఇటీవల హిందూప్రముఖులు జాతీయవాదులగుట జూచి ముస్లింప్రముఖులను చేరదీసినారు హిందువులు ముస్లిములు మన దేశమం దన్నిప్రాంతాలలోనున్నారు. ఈశాన్యవాయవ్య భాగాలలో ముస్లిములు తక్కినచోట్ల హిందువులును హెచ్చుసంఖ్యలో నున్నారు. మొత్తంమీద హిందువులు ముస్లిములకు మూడురెట్లున్నారు. కనుక వారు సంఖ్యాబలముతో తమ్మును బాధింతురని, తమసంస్కృతిని ధార్మిక

సాంఘిక రాజకీయరూపమైన హక్కులను నశింపజేతురని, కొందరుముస్లిం నాయకులనుచున్నారు. ఇట్టి భయముకల్గుటకు తగు ఆధారములేదు; వారికి సోదరహిందువులపైన నిజమైన మిత్రభావముండవలె. ఈకాలపు జనులసౌఖ్యము ఆర్థిక రాజకీయములబట్టియుండును; అది మతమునుబట్టి మారదు. ఉ॥ రయితులు సాలీలు ఏమతపువారైనను ఒకే ఆర్థికస్థితిలో నున్నారు, వారిసమస్యలొకేరీతివి. టర్కీ, ఈజిప్టు, అరేబియా, పర్షియా వగైరా విదేశాలలోను ముస్లింమతస్థులున్నారు. ప్రపంచమందలి దేశములన్నిటిలో మనదేశమందే హెచ్చుమందిముస్లిములున్నారు. ఉత్తరపు కొన్నిప్రాంతాలలో ముస్లిములే బలీయులు. జాతీయప్రభుత్వము ముస్లిములకు బాధకరమనుట భ్రమజనితమే, కాని యథార్థముకాదు.

కేంద్రప్రభుత్వములో జాతీయసిద్ధాంతప్రకారం ముస్లిములకన్న హిందువులు హెచ్చుమందియగుట సహజమే. కాని వారిచే పరిష్కరింపబడు ముఖ్యసమస్యలు భారతజాతికంతకు సంబంధించును; కనుక, అవి అందరికి నొకేరీతిగ వర్తించును; ముస్లిములను హిందువులు బాధించుట వారితో కలతలుపడుట హిందువులకు భారతజాతిమొత్తమునకుకూడ లాభకరముకాదు. పరస్పరప్రేమ సహకారముతోనే ఏజాతియు బాగుపడును. అల్పసంఖ్యావర్గము ప్రత్యేకజాతియని, వారిని అధికసంఖ్యాధికులు బాధింతురని, కనుక జాతీయప్రజాతంత్రత కూడదని చెప్పెడువాదము హిట్లరు యూరపులోను తెచ్చిపెట్టి, దానితో యూరపురాజకీయాలలో క్షోభగల్గించినాడు. దానితరంగములే జిన్నాగారివాదములో కనబడుచున్నవి. ఇవి ఈదేశంలో బ్రిటిషుపాలకుల భేదనీతికి సహకారిగనున్నవి. చీనా, రష్యా వగైరాలలో ముస్లిములు అల్పసంఖ్యావర్గమైనను, అక్కడ ఇట్టి విభేదములు లేవు. అట్లే ఈజిప్టులో ముస్లిములు తమ్ము బాధించుచున్నారని అక్కడి క్రైస్తవు లాందోళన చేయుటలేదు.

బ్రిటిషుసామ్రాజ్యంలో దక్షిణతూర్పుఆఫ్రికాలు వగైరాలలో అక్కడి తెల్లవారు భారతీయులను చిన్నచూపుచూచుటసంగతి తెలిసినదే. కాని,

అక్కడి జాతీయప్రభుత్వపుపాలన కెవ్వరు నాటంకము చెప్పుట లేదు. ఈదేశంలో బ్రిటిషువారు మిక్కిలి కొద్దిమంది. (వారు సగటున ఇక్కడి జనాభాలో వేయింటి కైదుగురే యుందురు.) కాని, ప్రభుత్వపుమద్దతు చూచుకొని వారు ఉద్ధతులై భారతీయుల న్యాయతపప్పుటకలదు. ఇట్టిఅన్యాయములను సర్కారు పోగొట్టలేదు. కాని భారతీయులమధ్య నుండు సాంఘికవిభేదములను, వాటిని ఆంగ్లేయులు గోరంత కొండంతలు చేసి తమ ఆధిపత్యముకు సాకుగపెట్టుదురు. ముఖ్యంగా యిటీవల ప్రభుత్వం వారవలంబించు కొన్నిపద్ధతులవల్ల ఆంగ్ల పత్రికల ధోరణివల్లను ఈభేదములు హెచ్చినవి.† సాంఘికన్యాయము కావలసినదే; కాని, ఆపేరున ద్వేషము ప్రోత్సహించుటవల్ల ప్రజలలో పరస్పరం హింసాతత్త్వమధికమైనది.

మతసాంఘికభేదమున్నంతనే ప్రత్యేకజాతులగు, వానిని విడదీసినప్పుడే రక్షితమగునని యిటీవల జనాబ్ జిన్నాప్రభృతు లనుచున్నారు. ఇప్పుడీదేశంలోని ముస్లిములు దాదాపు అందరు భారతీయులే మతమననది వ్యక్తుల ఆత్మసాధనకు సంబంధించినది. అందుల భేదముబట్టి రాజకీయములలో ప్రత్యేకపుహక్కు లేర్పర్చుట న్యాయముకాదు. నాగరిక దేశములలో నెక్కడను అట్టియేర్పాటులేదు. శాసనసభలలో ముఖ్యంగా ఆర్థిక రాజకీయసమస్యలు చర్చకువచ్చును. ఐనను బ్రిటిషుప్రభుత్వము వారీదేశమందు మతమును కులమునుబట్టియే ఉద్యోగములు పంచుచు శాసనసభ్యుల నియోజనగూడ అట్లే చేయనారంభించిరి.

ఎన్నికలలోను, వాటినిబట్టియే ప్రతినిధులసంఖ్యను నిర్ణయించినారు. 1908 సం॥పు మింటోమోర్లే సంస్కరణల నుండియు అందుకు నియోజక వర్గమును మత కులములను బట్టియే ప్రత్యేకించిరి; పర

† లోగడ మన వైస్రాయిలైన డఫరినుప్రభువుగారు ఈభేదములారంభించినారు. సర్కారుసూచనమైన సర్ సయ్యద్ అహమ్మదుఖానుగారు ముస్లిముల దృష్టిని తోటిహిందువులకు వ్యతిరిక్తముగను బ్రిటిషువారి కిష్టముగను త్రిప్పినారు.

స్పరవివాదముల రేపుటకు కారకులైరి; ఇట్లు విషవ్యాప్తిపూర్తియైనది. †
ఇప్పుడుకొన్ని ప్రాంతములందు లోకలుబోర్డులలో మునిసిపాలిటీలలో
గూడ మతమునుబట్టి ప్రత్యేకనియోజకవర్గము లేర్పర్చుచున్నారు ‡
సమిష్టినియోజకవర్గములే ప్రజలలో శాంతిని ఆయామతస్థులమధ్య
మైత్రిని గల్గించునని సింధులోని అశాంతికేంద్రమగు సుక్కూరులో
నిటీవల జరిగిన ఎన్నికల ఫలమువల్ల స్పష్టమైనది.

భారతజాతిలోను ఆయాప్రాంతములోను ఉద్యోగస్థులకు శాస
నసభలకు జాతీయదృక్పథముంటేనే, వారికార్యములు ప్రజలందరికీ క్షేమ
కరములగును. బ్రిటిషువారి యీవిభేదపద్ధతులవల్ల తమతమ కులములకే
లాభముచేయు ధోరణియు ఇతరులపైన ద్వేషమును, బలపడును. ఇట్టి
ద్వేషాగ్ని కాహారమిచ్చినకొలది, అదిమరింత వృద్ధియై హింసాతత్వము
ప్రబలినది.

హిందువులలోను ముస్లిములలోను కులతత్వముకలవారే నాయ
కులనిపించుకొందురు. అట్టివారికే పెద్దయుద్యోగములు లభించుచున్నవి.
అన్నిజాతులలోను జమీందార్లు ధనాఢ్యులు విదేశవ్యాపారముచేయు
వారు నీ కులకక్షలలో నాయకులగుటచు చూచుచున్నాము. ఇట్టిధోర
ణిలో, అట్టియెన్నికవోటరులు మూర్ఖతత్వపువారినే యెన్నుకొనజూతురు.
కులనాయకుల ప్రచారమును అట్లేయుండును. వారు జాతీయసమస్య
లనువిడచి, రయితుల సమస్యవదలి, ఇతరకులములతో పోటీగ తమ
కులముకెక్కువ హక్కుల నిప్పించజూచుట సహజము. యథార్థముకు

† ఇట్లు హిందూ ముస్లిములమధ్య కలతలు హెచ్చించు బ్రిటిషుపద్ధతి కాకతాళీ
యముకాక, బుద్ధిపూర్వకమే అని కర్జను, మింటో, మార్లే, అస్క్విత్తు, మాగ్డొనాల్డుల
ప్రచురితమైన స్వంత ఉత్తరములవల్ల స్పష్టమైనది.

‡ ఇటీవల ఫజ్లుల్‌హక్ గారి ప్రధానిత్వంలో బెంగాలుప్రభుత్వంవారు కలకత్తా
కార్పొరేషనులోను ప్రత్యేకనియోజకవర్గ మేర్పర్చి, ముస్లింసభ్యులసంఖ్యగూడ హెచ్చిం
చినందుకు బెంగాలులో సాంఘికద్వేషము ప్రబలినది.

 

జాతీయవాదులు ప్రతినిధులగుటవల్ల ముస్లిములకు హిందువులకు జీవిత పద్ధతుల కాటంకముకల్గదు, వారిపని నిల్చిపోదు ముస్లిములలో జాతీయ దృష్టి ఇంకను బాగుగ వ్యాపించవలెను. చాలమంది జనులలో అజ్ఞానమును సాంఘికతత్త్వమును భయమును హెచ్చుగనున్నవి.

ఈ అజ్ఞానభయములవల్ల దౌర్జన్యతత్త్వము కొందరిలో ప్రబలినది. ఇందువల్ల హిందూమహాసభ ముస్లింలీగు తామే ఆయాజాతినాయకులమని, జాతీయోద్ధరణ కుపయోగించుకోవలసిన శక్తినంతను పరస్పరం డీకొనుటకువినియోగించుచున్నారు. మసీదులయెదుట సంగీతము, గోవధ, వ్యక్తులమధ్య కలహములు, ప్రబలమతకలహములుగ చూపినారు. పరస్పరహత్యలకు, కొంపలంటించి దుకాణములుదోచుకొని ఆస్తులు నాశనముచేయుటకు, ఉభయసంఘములలోని దుష్టులు తయారగుచున్నారు. కాని,వాయవ్యరాష్ట్రపువారు సింధు ఢిల్లీలలో హెచ్చుమంది ముస్లిములు ఉత్తరదేశపు 'అహరార్' పక్షీయులు జమయత్-ఉల్-ఉలేమా-హింద్ వారుచాలమంది'షియా'లు, మోమినులు ఉదారభావులైనారు,* ఇంతేకాక కాంగ్రెసులో ముస్లిములున్నారు. కనుక ముస్లిములందరు సాంఘికతత్త్వపువారనుట కేవలంతప్పు. ముస్లిములీగు నాయకుల ప్రచండ ప్రచారము వల్లను, జనాబుజిన్నాగారికి లీగుకు ప్రభుత్వము వారిచ్చిన ప్రాముఖ్యమువల్లను, ఇట్టిభ్రమకల్గినది. మరియు, 1937 లో దేశమంతటను జరిగిన 'అసెంబ్లీ' యెన్నికలలో ఏరాష్ట్రమందును ముస్లింలీగు పక్షముకు అధికసంఖ్య రాలేదు † కేవలం ముస్లింలీగుద్వారా ఏర్పడిన ప్రభుత్వము లేదు. అయితే హిందువులకన్నను ముస్లిములలో హెచ్చుమంది చదువులేని

---

* అఖిలభారత షియా మహాసభవారు జిన్నాగారి ముస్లింలీగు సిద్ధాంతములు, సాంఘిక ద్వేషధోరణికి వ్యతిరేకులైనారు; మనదేశపు షియాలు మోమినులు కలిపిన, ముస్లిములలో సగముకన్న హెచ్చుమంది యగుదురు.

† అన్నిరాష్ట్రములలో కలిపి మొత్తం 482 ముస్లిం స్థానముల యెన్నికలలో 108 మాత్రమె ముస్లిం లీగు సభ్యులు గెల్చినారు.

వారు. వారిలో కొందరు పూర్వశతాబ్దులలో హిందూనిమ్న జాతుల వారై బాధితులై ముస్లిములైనవారి సంతతి కావచ్చు. హిందూమతము హీనమని ముస్లింబోధకులు, ముస్లింమతము క్షుద్రమని హిందూబోధకులును ఎంచుటమానవలెను. హిందూమతగ్రంథములను ముస్లిములును ముస్లింమత గ్రంథములను హిందువులును సానుభూతితో చదివి అందలి మంచిని గ్రహించితే, పరస్పరమైత్రి హెచ్చును. హిందువులపండుగలకు ఉత్సవములకు ముస్లిములు, ముస్లిం వాటిలో హిందువులును వెళ్ళి పాల్గొనుటయు పరస్పరమైత్రి గల్గించును. తమమతస్థులే పూర్వాధికారముకు మరల రావలెనని కొందరు తలచుటయు తప్పు; ఇదియు స్వార్థపరతవల్ల మూర్ఖతవల్ల కల్గును.

ఇప్పటిపాఠశాల బోధనవిషయములును విభేదములను హెచ్చించుచు మనదేశపు చరిత్రలో పూర్వం నవాబులు సుల్తానులు తమ హిందూప్రజలను హిందూరాజులు ముస్లింప్రజలను తరుచు హింసించుచుండినట్లు, కొందరాంగ్ల చారిత్రకులు వ్రాసినారు. అట్టిపుస్తకములను నేటికిని విద్యార్థులకు పాఠ్యముగ జేసినారు. కొద్దిమంది ముస్లిములును హిందూరాజులును ఎన్నడో జరిగించిన అత్యాచారముల కెక్కువ ప్రాముఖ్యమిచ్చినారు. (అట్టిచర్యలు ఇంగ్లండు జర్మనీవగైరాలలోను చాలజరిగినవి) వాటిలోకొన్ని తప్పుసంగతులును నేర్పుచున్నారు. హైదరాలీ టిప్పుసుల్తానువంటి వీరులు వట్టిమతమూర్ఖులై హిందువుల బీడించినట్లు,అక్బరువంటి ఉదారమహనీయులు స్వార్థపరులు క్రూరులు వంచకులునైనట్లును, ఇట్టి చరిత్రవ్రాతలు వట్టిఅసత్యములు హైదరుటిప్పూలు శ్రీరంగపట్టణపురంగనాథదేవాలయమును పునర్నిర్మాణము చేసి పోషించి; భద్రాచలదేవాలయము నిజాంసర్కారు ఆదాయపుసొమ్ముచుండియే కట్టబడి, ఆసర్కారు ఖజానాసొమ్ముతో పూజాపునస్కారములు జరుగుచున్నవి. పూర్వపుముస్లిం ప్రభువులెందరో హిందూదేవాలయములకు ధర్మసత్రాలకు పండితులకు నీనాము లిచ్చినారు.

ఉత్తరదేశపు బాబులు చాలవరకు సంస్కృత, హిందీ, బంగాళీ వాఙ్మయముల వృద్ధిజేసినారు. మొగలుచక్రవర్తులు, నవాబులు, ఉపనిషత్తులను భారతపురాణాదులను మహాకావ్యములను పారసీలోనికి మన దేశభాషలోనికి తర్జుమాచేయించినారు. చాలమంది హిందూవీరులను తమమంత్రులుగను సేనానులుగను పెట్టుకొని గౌరవించినారు. ఇట్లే శివాజీ మున్నగు చాలమంది హిందూరాజులును అనాథలగు ముస్లిములను ముఖ్యంగా స్త్రీలను రక్షించినారు; మసీదుమాన్యములను ఫకీరులవసతులను ఇచ్చినారు. కొందరు పైగంబరుల గౌరవించినారు. పారసీగ్రంథములను ప్రోత్సహించినారు. దాదాపు హిందూముస్లింరాజులందరును తమప్రజలనందరిని అభేదముతో పోషించి కాపాడిరి.

ఇట్టిస్థితిలో అసత్యమైన విభేదపువ్రాతలు సత్యమైనను ద్వేషకథలు ఉభయులమధ్య వైరము పెంచును; బ్రిటిషుపాలనను బలపర్చును. ఆయాసంఘాలకు కలిపి సమిష్టివిద్యపెట్టుటవల్లను పరస్పరసహనము మైత్రియువృద్ధియగును. పరిమ ఖులత్యాగభావమును ఇందుకు సహకారి. 1931 మార్చిలో కాన్పూరంలో హిందూముస్లిముల జగడముకల్గి కొన్నివందల జనులు మరణించిరి. అప్పుడు కాంగ్రెసులో యువకనాయకుడగు గణేశంకరవిద్యార్థి ముస్లింసోదరుల రక్షింపబోయి, తానే కత్తిదెబ్బకు గురియై మరణించి ఆదర్శమగు ఆత్మార్పణచేసెను. అంతట ఉభయపక్షములు పశ్చాత్తాపమొందిరి. ఇట్టివీరులు అరుదుగనున్నారు. విదేశాలలోనులనేక మతములవారున్నారు. ఇంగ్లండు అమెరికాలలో యూదులు, కాతలిక్కులు, ప్రొటస్టాంటులు, ప్రిస్బిటేరియనులు, శుద్ధనాస్తికులు ముస్లిములు వగైరాలున్నారు. ఇందు కొందరల్పసంఖ్యాకులు. కాని, వీరిపార్లమెంటులో గాని మరియెక్కడగాని వీరికి వేర్వేరు ప్రతినిధిత్వము మతమును కులమునుబట్టి ప్రత్యేకనియోజకతలు ఉద్యోగాలు పెట్టలేదు. అక్కడ ఆర్థికరాజకీయములబట్టియే ఎన్నికవిభజనలు, ప్రతినిధిపద్ధతి, అర్హతను బట్టియే ఉద్యోగములును ఏర్పడి అమలులోనున్నవి. రష్యాలో చాలమ

తములవారున్నారు. అమెరికాసంయుక్తరాష్ట్రములలోను వివిధజాతులు మతములునున్నవి. అందుచాలమంది ఆంగ్లేయులేగాక ఐరిషులు, జర్మనులు, ఫ్రెంచివారు, ఇటాలియనులు ఇత్యాదులున్నారు. స్వభాషను మాటాడుకొందురు. కాని, వారికి ప్రత్యేకప్రాతినిధ్యము వగైరాలు లేవు ఇట్లు సమిష్టి నియోజకపద్ధతి ఔదార్యము అన్యోన్యతకుసహకారి. సవర్ణహిందువులు తమలోని అవర్ణజాతిపైన అస్పృశ్యతనుపాటించి అకులమును హీనస్థితిలోనుంచుటవల్ల వారుక్రైస్తవ ముస్లిమ మతములలో జేరుటో లేక (అంబేడ్కరుపక్షమువలె) ముస్లిములలో జిన్నాబోలు విభేదకారులకుప్రతిగాములనుసహాయపడుటో జరుగుచున్నది ఇట్లుఅస్పృశ్యతహిందుముస్లిం విరోధముకు పోషకమైనది* ఇట్లే హిందూవితంతువుల కిచ్చు నిరాదరణయు అంతట స్త్రీలపహరించుటయు బొంగాలు వగైరాలలో తరుచ సాంఘికకలహములకు కారణములైనవి కనుక హిందువులు తమలో విభేదములతొలగించుటయుపరస్పరమైత్రికి కారణమగును.

హిందూముస్లిములమధ్యనున్నదనే మతాచారభేదము చాలవరకు బాహ్యమే. మతభేదముతో సంస్కృతిభేదమునున్నదని ఉభయసంఘములు ప్రత్యేకజాతులుగ నెంచవలెనని ఈరెండుసంఘములు ఏకరాజ్యంలో కలసిమెలసియుండుటకు వీలుండదని చెప్పుటయు వారిలో పరస్పరద్వేషము రేపుటకు బ్రిటిషుపాలకుల చిరాధికారముకు కారణమగుచున్నది. కాని నిజంగా అట్టివ్యత్యాసము కవసరములేదు. మతసంస్కృతిభేదముల పేరట గోవధపేరనో మసీదువద్ద సంగీతపుపేరనో కొట్లాటలు జరుగుటకు కొద్దిమంది ప్రోత్సాహమేకారణము అసలు తగువు రాజకీయాధికారం పంచుకొనుటకు కొందరపద్ధతులవల్ల కల్గుచున్నది. ఇప్పటి బాధ రాజకీయపువాటాలకే గాని, ఆర్థికమతసంబంధపుది కాదని ఇటీవల జనాబు

* ఇటీవల గాంధిమహాత్ముడు ఇందునుగూర్చి హెచ్చరించినారు.

I regard untouchability as the root cause of our downfall and of Hindu Muslim discord.

(హరిజనపత్రిక 25-5-40.)

జిన్నాగారే మైసూరులో బయటబెట్టినారు.* అసలు అధికారము బ్రి
టిషువారి హస్తాలలోనే ఉండగ ఈతగువులాడుట అవివేకము.

జనాబు జిన్నాగారు తమవశమగు ముస్లింలీగులో భిన్న రాజ్యతయగు 'పాకిస్తాను'కు అనుకూలంగా తీర్మానించినారు. సంఘీభావమే బలము కదా! ఇట్లు భారతదేశమునంతను జాతిని ముక్కలుగ విడదీయుటవల్ల అన్నిటిలోను అల్పసంఖ్యాకుల రక్షణసమస్యయు, హిందూముస్లిముల సిక్కులమధ్య విరోధములును మరింతప్రబలును. ఈచిన్న రాజ్యాలు ఆర్థిక సైనికరక్షణకు విదేశీయులపైనే నాధారపడవలెను. ఇట్టి విషపు 'స్కీము' అన్ని సంఘములకు బాధకము, ఆచరణలో అసాధ్యమునని ముస్లిములీగులో ప్రముఖులు ముస్లింప్రధానరాష్ట్రముల ప్రధానులునైన సికిందరు ఫజ్లుల్ హక్కుగార్లనుభావించినారు. సింధుప్రధానియు నిరసించినారు ముస్లిం సంఘబలముకని ముస్లింలీగువగైరా లేర్పడినట్లే, హిందూసంఘక్షేమము కని హిందూమహాసభయేర్పడి పనిచేయుచున్నది దానిముఖ్యనాయకులు శ్రీసావరకరు, మూంజీ, పరమానందుగారలు. ఆర్యసమాజమును హిందూసంఘపు లోపములు పోగొట్టుట కుద్దేశించినదే. కాని తరుచు ఈసంఘములకు ముస్లిములీగుకు వ్యతిరేకభావము సంఘర్షము గల్గుచున్నవి. రాజకీయంగా కాంగ్రెసు ఆశయముల నిరోధించుటలోమాత్రం ఈసాంఘిక నాయకులుకలియుచుండిరి. హిందూసంఘములలోని అస్పృశ్యతానివారణ కులతత్త్వధోరణి పోగొట్టుట, స్త్రీలనుద్ధరించుట, వివాహాదుల దుర్వ్యయములు పోగొట్టుట, ఇట్టికార్యముల నీసాంఘికసభలు పరిష్కరించుటకు శ్రద్ధవహించి, శుద్ధరాజకీయములను కాంగ్రెసుకే విడుచుట శ్రేయస్కరము. ముస్లింసమితులు నిట్లే చేయుదగును.

---

* The real causes of our communal troubles are neither economic nor religious, but lie in the sharing of the powers which are likely to be given to Indians in the framing of the new constitution. (Jannab Jinnah's talk at Mysore on 25-5-1941.

(27-5-41 వ తేదీ హిందూపత్రిక చూడుడు)

# 17. సాంఘికరంగం.

## 2. కులభేదము.

హిందువులలో చాలాకులభేదము లున్నవి. ముఖ్యమైన నాలుగు వర్ణాలమధ్య సాధారణంగా వివాహములు భోజనములును లేవు. అట్లు వివాహములు మామూలుపద్ధతితో చేసినను ఇప్పటి హిందూ లా ప్రకారం అవి చెల్లవు. కాని, పూర్వ మట్లు భోజనములు కొన్ని వివాహములుగూడ జరిగినట్లు మన పూర్వగ్రంథములలో నెన్నియో నిదర్శనాలున్నవి. అనులోమవివాహములు చెల్లునని శాస్త్రములో చెప్పినను ఇప్పు డవి ఆచరణలో లేనందున చెల్లవని కోర్టులలో తీర్పుచేసినారు †. వర్ణాంతరాలలో పెండ్లియాడేవారు తాము ముఖ్యమతాలలో వేటికిని చెందమని ప్రకటించితే "సివిలు వివాహపుచట్టము' (1872) క్రింద పెండ్లి చేసుకోవచ్చు. తాము హిందువులమే కామని ప్రకటించుట చాలమంది కిష్టముండదు. ఆర్యసమాజసిద్ధాంతప్రకారం చేయువివాహములు చెల్లుట కొక చట్ట మింటీవల చేసినారు.

ఇట్లు కాక, చాతుర్వర్ణ్యపుమధ్య సాంప్రదాయ హిందువులు చేసుకొన్నను అట్టి వివాహము చెల్లుననుచట్ట ముండుటే మంచిదని కొందరు విద్వాంసుల భావము. అట్టి చట్టమున్నను ఇప్పటిస్థితిలో వర్ణాంతరవివాహము లంతగా జరుగవు. అవి వితంతు వివాహపు చట్టంవలె నుండును. కాని, అందువల్ల ఆటంకము ద్వేషము తొలగి పరస్పరమైత్రి యేర్పడునని కొందరి యూహ.

ఇప్పుడు వర్ణాలలో ప్రతివానిలో అవాంతరశాఖ లెన్నియో కలవు. వేర్వేరుశాఖలవారును సాధారణంగా శాఖాంతరవివాహాలు, (కొందరు భోజనాలుకూడా) చేయుట లేదు. ఈచాతుర్వర్ణ్యము అవాంతర కులములు అసలు ఎట్లేర్పడెనో శిసలుగ తెలియదు. వృత్తిభేదముబట్టి

---

† 53 లా వీక్లీ 693 పుట తీర్పు చూడుడు. అనులోమవివాహము లిప్పుడు చెల్లునని లోగడచెప్పిన ఇం. లా. రి. 52 మద్రాసు 160 తీర్పును దీనిలో రద్దుచేసినారు.

ఏర్పడెనని ఆనువంశికంగా కులవృత్తిలో నేర్పు తమవంశీయులకు నిల్చుటకు వివాహనియమము పెట్టినారని కొందరి యూహ. దీనిలో కొంతసత్య ముండవచ్చు. మరియు, కేవలం సమీపబంధువులమధ్యను గాని, బొత్తిగా తత్వముకలియని భిన్నజాతులమధ్యగాని వివాహములు చేయుట మంచిది కాదని, అట్టివివాహములు సాధారణంగా సుఖకరములుకావనియు, సంఘ శాస్త్రజ్ఞుల అభిప్రాయము. సపిండులమధ్య వివాహముకూడదని కేవలం భిన్నజాతీయులతోనుకూడదని శాస్త్రము విధించుటలో కొంత వైజ్ఞానిక సూత్రముకలదందురు కొన్ని అడవిజాతులలోను ఇట్టినియమము లున్నవి. శాఖాంతరవివాహము చెల్లదని యిదివరలోని కోర్టుతీర్పుల ఆక్షేపణ కోర్టులలో రద్దు అయిపోయినది. పరిశుద్ధి ఇత్యాదుల రక్షణకని ఆయా కులములవారు కొన్ని ప్రత్యేకాచారములు పెట్టుకొన్నారు ముఖ్యంగా కొందరి కాహారనియమము లున్నవి. అవి సరిగాజరిగించు స్థితిలో పరస్పర భోజనము లేకుండుటలో అర్థ మున్నది. కాని, యిటీవల అసలు ఉద్దేశము పోయి, రసముపోయిన చెరుకువలె వట్టియాచారములు, కులవిభేదములు మిగిలినవి; వాటిప్రస్తుతఫలము కులకక్షలు. ఇప్పుడు ఆనువంశిక వృత్తిపద్ధతులును అంతగా లేవు అసలు కులభేదములు సదుద్దేశముతో నేర్పర్చబడి పూర్వకాలంలో సంఘముకు కొంతలాభము చేసినట్లే కనబడును. ప్రస్తుత కాలంలో ఆసూత్రములు ఆచరణలో లేవు.

ఆయాశాఖలమధ్య జాతులమధ్య పరస్పరసమావేశముల కవకాశములు హెచ్చినవి. ఆచారసూత్రములు సంఘస్థితినిబట్టి మారుచుండును. ఇప్పుడు భావసాంకర్యము కల్గుటేగాక, బాహ్యాచరణయు వక్రమైనది "వర్ణాశ్రమధర్మ"మును జాగ్రత్తతో ఆచరించుట శాస్త్రీయంగానడుచుట ఇప్పుడు అరుదు. ఆశ్రమపద్ధతి అసలే చెడినది. వర్ణపద్ధతియు శిథిలమైనది. కులకలహములుపెరిగినవి. బ్రాహ్మణబ్రాహ్మణేతరులమధ్య తగువులు రాజకీయరంగము నెక్కినవి. అప్పటి శాఖాకాలుష్యమును పోలేదు. ఏకాలపువారైనను న్యాయమైనవృత్తి చేయువారు బ్రాహ్మణ

లైనను, శూద్రులైనను సమానగౌరవముకే పాత్రులు కావలె. ఉపశాఖలకు వృత్తిభేదమో ప్రాంతభేదమో కారణము కావచ్చు. నీచవృత్తి యనగా ఆర్థికంగా నష్టకరం, పరిశుద్ధిహీనత, అనుట తప్పు. మోసము దగా అన్యాయముసాగించు వృత్తులే నీచవృత్తులని భావించవలెను.

అప్పుడు సాంఘికవైషమ్యము కొంతతగ్గును. ఇందుకు ఔదార్యబుద్ధి కావలెను. వెలనాడు ద్రావిడ మొదలైనవి అసలు ప్రాంతభేదములు; కాని, ఇప్పుడు అన్నితెగలవా రన్నిప్రాంతాలలో వ్యాపించినారు. ఇంకొకసంగతి: ఇటీవలదేశంలో ఆర్థికదుస్థితియేర్పడి, వృత్తులు ఉద్యోగములు తగ్గి వాటికపేక్షపడు నిర్వ్యాపారులసంఖ్య చాలహెచ్చుగనున్నది. అట్టిస్థితిలో కొందరు స్వబంధువులకు అంతట స్వశాఖీయులకు అంతట స్వకులపువారికి ఉద్యోగాది సహాయమీయ యత్నించుచున్నారు. అట్టి స్వలాభపరతవల్లను కులద్వేషము ప్రబలుచున్నది. అర్హులగువారికే ఉద్యోగములిచ్చుట న్యాయము. అన్నిసంఘాలకును సమానావకాశ ముండుట న్యాయమని, సర్కారువు కులసూత్రప్రణాళికపెట్టి పంచిపెట్టుచున్నారు. ఇట్టివాటిచే తత్కాలముకు కొందరికి సదుపాయముకల్గినను, విద్య వ్యాపించి అర్హులసంఖ్య అన్నికులాలలోను హెచ్చినమీదట దీని లాభమెవరికిని లేక ద్వేషభావముమాత్రం మిగిలినది. ఇట్టి జి. ఓ. ల వల్లను సాక్ష్యము దస్తావేజులు వగైరాలలో జాతికులముల వివరము లీయవలెననియు జనాభాలెక్కలలోను వీటికి ప్రాముఖ్య మిచ్చియు, సర్కారును కులవిభేదములు స్థిరముగనిల్చుటకు కొంతకారకులైనారు. వీటిలో నిట్టి వివరము లిచ్చుట మానితే కులవిభేదపు ప్రాముఖ్యము తగ్గును. విద్య ఔదార్యము హెచ్చి జనుల ఆర్థికస్థితికూడ బాగుపడి నప్పుడు కుల విభేదములద్వేషము అడుగంటును.

 

# 18. సాంఘికరంగము.

## 3. హరిజనోద్ధరణ.

సాంఘికసమస్యలలో మరొకటి దిక్కులేని హరిజనులది. ఇది చాల ప్రధానము. అహింసాభిమానులందరును దీనికై గట్టిగ శ్రద్ధ వహింపవలె సవర్ణులు, ముస్లిములు గూడ ఎందరో బీదలు నిరాధారులు నున్నమాట నిజమే. కానివారిలో మధ్యవర్గపు కొంచంస్థితివంతులు, కొద్దిమంది లక్షాధికారులు, గొప్పభూస్వాములు, రాజులు నబాబులు నున్నారు. కాని హరిజనులుమాత్రం దాదాపు అందరు శుద్ధ దరిద్రులు, అసహాయులు; మరియు వారిని సవర్ణులు అంటక దూరంగా ఉంచుటవల్లను వారిదుస్థితి చాల హెచ్చినది. సవర్ణులయిండ్లలో తిగుటకు వ్యాపారాదులు చేయుటకు వారికి సమానావకాశములు లేవు పెట్టుబడికి అసలేసొమ్ము లేదు; మనదేశమంతటను వారు వేరుగ గూడెములలో వసింతురు. వడకుట, నేత, చెప్పులుకుట్టుట, పుల్లలమ్ముట, వడ్రము, ఇత్యాదికులవృత్తులద్వారా వీరు సవర్ణులతోడ్పాటుతో జీవనంచేసేనారు. ఎందరో ఇదివరలో క్రైస్తవముస్లింమతస్థులుకాగా ఇప్పటికి మిగిలియున్న హరిజనులును హిందూసంఘమంతటిలో దాదాపు $\frac{1}{4}$ వంతు ఉందురు. ఇట్టి మహాంఘులము మనకు దూరులై రోగగ్రస్తులై తిండిలేని అనాధులు దిక్కులేనివారుగ నుంటే హిందూసంఘమంతయు భారతజాతియును ఇప్పుడు హీనస్థితికి వచ్చుటలో ఆశ్చర్యము లేదు.

ఈఆదిహిందువులకు అస్పృశ్యత అనేది ఎప్పుడేరీతిగ వచ్చినదో తెలియదు. వారే ఆర్యసంస్కృతితో కలియుట కష్టపడక, వేరుపడి, తుదకు ఆర్యసంస్కృతియే ప్రబలమై అందువల్ల తామే బహిష్కృతస్థితికి వచ్చినారని యొకయూహ; మొదట గోభక్షణ మద్యపానమువంటి దురభ్యాసములు అపరిశుభ్రతవల్లనిట్లు బహిష్కృతులైనారని మరికొందరియూహ; బ్రాహ్మణస్త్రీకి శూద్రులవల్ల జనించిన మిశ్రితులకు చండాలురను పేరు

మనుస్మృతిలో జెప్పినారు. వీరా సంకరజాతివారేనని ఇటీవల కొందరు 'సనాతను'ల వాదన. వారిశరీరమస్థినిర్మాణము ముఖరూపమునుబట్టియు జాతిశాస్త్రసిద్ధాంతమునుబట్టియు ఇన్నికోట్లమఱియు బ్రాహ్మణస్త్రీల సంతానపువారనుట నమ్మనీలులేదని లోకతత్వజ్ఞులందరి యభిప్రాయము.

కారణమేదైనను, ప్రస్తుతనాగరికస్థితిలో అస్పృశ్యతాపద్ధతి అన్యాయమని అందరు సంగీకరింపవలె. అమెరికాలో నీగ్రోలను, తూర్పుదక్షిణాఫ్రికాలలో కొంతవర కీదేశములోను భారతీయులను శ్వేతజాతీయులు సాంఘికసహవాసముకు అనర్హులుగ నెంచుచున్నారు, నిజమే. కాని, అది అన్యాయము,పాపకార్యము జాతిగర్వజనితము నని మనముచెప్పుచుంటిమి గదా! అట్టి స్థితిలో స్వజాతీయులగు ఈ భారతీయులను స్వదేశంలోనే అంతకన్నను హీనపర్చుట మనసంస్కృతిపైన గొప్పమచ్చ. ఇట్టి స్థితివల్ల అవర్ణులకు సవర్ణులకు మధ్య లోలోన ద్వేషాగ్నిచెలరేగుట సహజము. ఈ దుస్థితి తమగతియని హరిజనులుసహించి బాధలనుభవించుచుండు సంగతి నిజమే కాని, ఇది బ్రిటిషుపాలనలో మనకుకలిగిన శాంతివలె, నిరాశ, పీడకిదనము, చైతన్యక్షీణత వల్ల కలిగినది. ఈహింసాభావమును పరస్పర మైత్రిద్వారా తొలగింపకుంటే, తుదకు వక్రమార్గమున పైకుబికి రెండు సంఘములకు జాతీయతకు గూడ చాల హానికలుగును. ఇట్టి యాచార మిదివరలో నున్నను దేశకాలస్థితిలో మార్పునుబట్టి ఆచారములు నుండ వలెను; మేధావులగు పెద్దలేర్పర్చు నిర్ణయము వేదప్రమాణమువంటిది† అట్లెన్నియో పూర్వాచారములు క్రమముగ మారినవి, మారుచున్నవి. హిందూమతములకు ముఖ్యప్రమాణమైన వేదములందును, ప్రస్థానత్రయములలోను ఈ యస్పృశ్యపద్ధతిని చెప్పలేదు. చండాలురను దూర ముంచుమని మనుస్మృతిలోనున్నమాట నిజము. అయితే బ్రాహ్మణ

† దేశకాలనిమిత్తానాం భేదైర్ధర్మో విభిద్యతే (మ. భా)
సమయశ్చాపి సాధూనాం ప్రమాణం వేదవద్భవేత్.
(ఆదిత్యపురాణ వచనం)

స్త్రీకి శూద్రునివల్లజనించిన చండాలుఁడన్నారు. ఆదిహిందువుల ప్రత్యేక జాతివారు అట్టివారని చెప్పలేదు. పూర్వమొకప్పుడు శ్రోత్రియబ్రాహ్మణులును గోమాంసంతినేవారు; ఇప్పటికిని అన్యమతస్థులు గోమాంసము తిందురు ధారాళముగ వారిని చెరువులు ముట్టనీయకుండుటయు, వారిని దరికి రానీయకుండుటయులేదు. త్రాగుబోతులు పతితులు; అట్టివారికి ప్రాయశ్చిత్తముద్వారా శుద్ధిచెప్పబడినది. మద్యపానమిప్పుడు కొందరుసవర్ణులలోను కలదు. మరికొన్ని స్మృతివిధులును ఇప్పు డాచరణలో లేవు.

ముఖ్యముగ, పరిశుభ్రతలేక ఏదోరీతి అశుచిలో నున్నవారికే సాంప్రదాయికముగ అస్పృశ్యతయుండును,శుద్ధి కలిగినమీదట వారందరును స్పృశ్యులగుదురు. ఇప్పటి హరిజనులకును దురాచారములు మాన్పించి, శెట్టిగ, మేదర, ఎరుకలవంటి శూద్రజాతులతో సమముగ చూచుటకభ్యంతరము కనబడదు† వారిని జంతువులవలె జూచుటవల్ల ఉభయులకు పశుత్వము గల్గుచున్నది. మానవులందరి హృదయమందును భగవంతుడున్నాడు, 'తత్త్వమసి, సర్వంఖల్విదం బ్రహ్మ, సర్వ వ్యాపీ సర్వ భూతాంతరాత్మా, మొదలగు వేదవాక్యము లీజనులకును వర్తించును గదా. అట్టి యుదాగమతపు వారము, మనలో $\frac{1}{4}$ వ వంతు జనులకుమానవత్వము నే నిరాకరించువారికి ఈశ్వరుడు సద్గతినిచ్చునా ?

హిందూసవర్ణ సంఘములో కులభేదములెన్నియో ఉన్నవి; వారిలో చాలమంది పరస్పరభోజనములు వివాహములు చేయుటలేదు, నిజమే; కాని, ఈసమస్య వేరు ఒకజాతిని అసలే సంఘబాహ్యులుగ జేసి, అట్లు శాశ్వతముగ నుంచుట, మనయిండ్లకు చెరువులు నూతులు వగైరాలకు రానీయకుండుట, వారినెన్నడును స్పృశించకూడదనుట వట్టివర్ణ సమస్యకాదు. ఇది మహాపాపము, ఇది పరోక్షహింసయైనను హరిజను

† కేరళంలో చాకలి, శెట్టిగ, ఎరుక వగైరాలు అస్పృశ్యులే, మనప్రాంతాలలో అట్లులేదు. ఇక్కడఉన్నంత తీవ్రత ఉత్తరరాష్ట్రాలలోలేదు. కనుక, ఈ ఆచార మన్ని ప్రాంతాలలో ఒకేరీతిగలేదు.

లందరి ఆత్మవికాసమునకు, సాంఘికోన్నతికి, ఆర్థికక్షేమమునకుకూడ భంగకరమని నిష్పక్షపాతులకు స్పష్టము. మాతృలగు హిందువులందరు హరిజనులను జంతువులకన్న హీనులు లేక పశుతుల్యులుగ చూచినప్పుడు, అట్టిభావమే క్రమముగ ఆజాతిలో గల్గును; ఇది మనశ్శాస్త్రసిద్ధాంతము. అట్టిస్థితిలో ఆదిహిందువులకున్నదనే పశుత్వమునకు, హింసాభావమునకు, అపరిశుద్ధతకు, దురాచారములకు సవర్ణహిందువులును బాధ్యులు. కనుక, వారిదురాచారములు పోగొట్టి, శంకరరామానుజాదులు బోధించినట్లు పరిశుద్ధమగు ధార్మికబోధ చేయించి; వారి నష్టవృత్తులను జీవనాధారములను మరల నిర్మింపజేయుట సవర్ణుల బాధ్యత. పంచముల విషయంలోనేగాక, మతాంతరీయులను మ్లేచ్ఛులని యవనులని సంఘసమావేశముకనర్హులని మధ్యకాలపు హిందూగ్రంథాలలో వ్రాసినారు. అడ్డబొట్టువారి మొగముచూచిన భ్రష్టతగల్గునని కొన్ని వైష్ణవగ్రంథాలలోను, నిలువుబొట్టువారు కంటబడితే పతితులౌదుమని శైవాగమములలోను గూడ, వచనములుకలవు. ఇట్లేకొన్ని ముస్లిముక్రైస్తవగ్రంథములలోను తమమతస్థులుకానివారు కాఫరులు హీథెనులు, నీచులు, వారితో సాంగత్యముకూడదు అని వ్రాయబడినది. మొత్తంమీద ఆకాలమందన్ని దేశాలలోను ఇట్టిమూర్ఖత అసహనము నుండెను. ఆధునిక నాగరికతలో పరస్పర సంపర్కము చాల హెచ్చినది. విశ్వమానవులందరు సోదరులవంటివారు; అందరు నీశ్వరుని పిల్లలే; సిద్ధాంతభావముల సమానత్వము గ్రహించుటే అందరికిని వృద్ధికారణము. అదే ముఖ్యమతములన్నిటిఅసలు సిద్ధాంతమనని యిదివరకే చూచియున్నాము. ఇప్పుడున్న విభేదములు బాహ్యచిహ్నములకే సంబంధించినవికదా, ఇప్పుడు క్రైస్తవులు ముస్లిములు చాలమంది సవర్ణహిందువులు తాకుచు సాంఘికసాంగత్యం కల్గియేయున్నారు ఇట్లు హిందూమతస్థులు కానివారిని తమపేటలకు గృహములకు బావులకు చెరువులు వగైరాలకు రానిచ్చునప్పుడు, తమమతస్థులేయగు హరిజనులు విషయంలో పట్టుపట్టుట అన్యాయము, అవివేకము.

ఇప్పటి బోర్డుపాఠశాలలు నూతులు ఇత్యాదులు దేశంలోని ఆయాప్రాంతీయులకు ప్రయాణికులవంటి యితరులకు అనగా లోకులందరికి ఉపయోగపడవలసినవే. ఇట్టి సార్వజనికములు జీవితావశ్యకములు అగువాటిని హరిజనులుమాత్రము వాడకొనకుండజేయుట కేవలం అధర్మము. సంఘమంతటిలో వారే యెక్కువబీదలు, మూఢులు, నిరాధారులగు అసహాయులు. వారికే యిట్టివాటి అవసరము హెచ్చు. ఈ బహిష్కారముకెట్టి కారణము మనము చెప్పినను ఇదిన్యాయముకాదు. ఈచర్యను సమర్థింపజూచుట మనముచేయు అన్యాయముకుతోడు అవమానమునుచేర్చుటే అన్నమాట. ఇందువల్ల ఈఆది హిందూజాతిలో మనపైన హింసాభావమును సవర్ణులకు వారిపైన అవజ్ఞ క్రోధమును వృద్ధియగుచున్నవి.

అవర్ణులకు ప్రత్యేకపు గుడులను నూతులు వగైరాలును ఏర్పర్తుమని, కనుక సార్వజనికములనుండి వారిని తప్పించినను వారికి బాధలేదని, కొందరు 'సనాతను'లనుచున్నారు. కాని, ఇవి వాదంనిమిత్తం చెప్పుమాటలే, క్రియలో జరిగేవికావు మన బీదదేశంలో చాల గ్రామములలో తగినన్ని పాఠశాలలు జలాశయములు ఆరోగ్యసౌకర్యములు అసలేలేవు, కొత్తవెన్నియో కావలెను, అందుకుసర్కారుకు బోర్డులకు తగుసొమ్ము లేదు. అట్టిస్థితిలో హరిజనులకు కావలసినన్ని ప్రత్యేకంగా ఎట్లు నిర్మింతురు? ఇంకనెన్నియో నిర్మాణకార్యములకును సొమ్ముకావలెను. మరియు, ఈప్రత్యేకతవలన మరింత మనస్సులు భేదించి, విరోధములు పెరిగి, చిక్కులుకల్గును, అవర్ణులు సంఘదూరులగుటవల్ల, వీరి ఆరోగ్యాదులనితరులెవరును సాధారణంగా పరిశీలించుటలేదు అవర్ణుల అద్భుతశిల్పశక్తి యిప్పుడు వ్యర్థమగుచున్నది. మరియు పట్టణాదులలో పాకీపని, వీధుల శుభ్రపర్చుట, గ్రామములకావలి, సరిహద్దుల నిర్ధారణ, ఉప్పులు కోతలు వగైరాలలో శ్రమపడుట, తోళ్ళు చెప్పలుకుట్టుట, వాటిని నేటికిని తరుచు హిందువులలో అవర్ణులే చేయుచున్నారు. కొన్నిచోట్ల నేటికిని వడుకుట నేయుటకలదు. ఇవి సంఘమంతటికి అత్యవసరమైనవి.

వారిశిల్పశక్తికి తగు ఉపయోగము కల్గించవలెను. వీరికి జలవసతి విద్య వగైరాలులేక, అశుభ్రత మూఢత్వమువల్ల, తరుచు వీరిగూడెములలో అంటువ్యాధులు, జాతరలు' జీవహింస, చోరీవగైరాలు జరుగుచు, పిమ్మట త్వరలోనే అవి సవర్ణసంఘములున్న ప్రాంతాలకు వ్యాపించి, అందరిని బాధించుచున్నవి. దేహములో పాదములు వ్యాధిగ్రస్తమైన ప్పుడు, మొదట పాదముకే బాధగనున్నను, క్రమంగా ఆవ్యాధి లోలోన దేహమంతటికిని వ్యాపించి, అంగమంతయు వికలమై, నీరసించి, ప్రమాదించునుగదా! ఆర్థికంగాను అంతే. బొత్తిగా తిండిగడుచుటకు వేరుమార్గము లేనప్పుడు వారిలో కొందరు చోరీలకు బందిపోట్లపనులకు తగువులలో మైమరచి కూనీలకుగూడ సిద్ధమగుట సహజము. హరిజనుల నిట్టి నిరాధారపు తెగింపు స్థితిలోనుంచుట తక్కిన సంఘమంతటి వారి ఆస్తికి ప్రాణముకును హానికరము. హరిజనులకిప్పుడు జలవసతి, బడులు వగైరాలు ఏర్పడినగాని శుభ్రత జ్ఞానము కలుగవు. ప్రత్యేకవసతులేర్ప ర్చుట సాధ్యము, ప్రశస్తముకూడ కాదు. కనుక, మనముసహానముకల్గి ఇప్పుడు గ్రామములోనున్న సామాన్యసౌకర్యములు హరిజనులును ఉపయోగించుకొనునట్లు ప్రోత్సహించవలెను; వారి ప్రేమాభిమానము లను కృతజ్ఞతను సంపాదింపవలెను.

ఇట్లుఅస్పృశ్యతాచరణఅహింసాతత్వముకు వేరుపురుగువంటిది. ఇందు వల్లసంఘమంతటిలోపరస్పరహింస తప్పదు* అందుకు మనమందరమును కొంచమో అధికమో బాధ్యులము. ఇట్లు మానవత్వము నవమానించి అణచుమనము యీరాపిమనులవల్ల అట్టిఅవమానముకేలోనగుట,మనకీశ్వ రుడిచ్చిన శిక్షయని గాంధిమహాత్ముడు చెప్పియున్నాడు. పశ్చాత్తాపము నొంది మనముఆసంఘము నుద్ధరించనియెడల హిందూమతము క్షీణించు

* The existence of untouchability among Hindus is a denial of the doctrine of Ahimsa on which we pride ourselves. We are responsible for the evils among the untouchables.

(యంగ్ ఇండియా. 18-3-1926)

నని, మనదేశముకు మోక్షముకలుగదని ఆయన దృఢవిశ్వాసము.* ఇతరజనుల మానవత్వము చెరుపువారు తమమానవత్వమును పోగొట్టుకొందురు.

అయితే గ్రామాలలోని హరిజనులింక నిమిత్తమాందోళనచేయుచున్నారా,అని ప్రశ్న; చిరకాలము పంజరములోనున్న పక్షి స్వేచ్ఛకు భయపడునట్లు,హరిజనులలో కొందరిప్పుడు అస్పృశ్యత పోవలెనని ఆందోళనచేయకుండుమాట నిజమే. కాని వారిలో స్తబ్ధమై క్షీణించు మానవత్వముకు పునరుద్ధరణమిచ్చు బాధ్యత సవర్ణులది. చెరువులు, బడులు, గ్రామాలలోని వీధులలోకిగూడ హరిజనులను స్వేచ్ఛతో గ్రామస్థులందరు రానిచ్చి, ప్రోత్సహించి, వారికి ప్రేమాస్పదులు కావలె. వీటిబహిష్కారముకు చట్టము శాస్త్రాధారముకూడ లేకున్నను, ఆచారబలమున అట్లు జరుగుచున్నది. ఇది సంఘమంతటి క్షేమముకు వ్యతిరిక్తముగదా! వ్యవహారబాధలేకుండుటకై, అట్టి సార్వజనికస్థలములకు కులజాతిభేదములబట్టి ఎవని రాకుండ ఆటంకపర్చుట నేరమగునని ఇటీవల ఆయారాష్ట్రములలో చట్టముకూడ చేసినారు. కాని, ఆచట్టమునైనను, ప్రజాభిప్రాయము బలీయమై, అమలులో నుంచవలెను. కనుక, దేశమందన్నిప్రాంతాలలోనున్న హరిజనులకు సవర్ణులకు మధ్యసహృదయత పరస్పర సహాయబుద్ధిగల్గి అహింసాభావము బలపడినప్పుడే, సాంఘికముగ ఆర్థికముగ కూడ హరిజనోద్ధరణసాగి కార్యకారియగును. ఇట్లే హరిజనోద్ధరణ బాగుగ సాగినప్పుడే అహింసాతత్వము జనులలో వ్యాపించినట్లెంచవచ్చును.

---

*I consider untouchability to be a heinous crime against humanity (YOUNG INDIA 8—12—1920). This untouchability is a curse that is eating into the vitals of Hindusim...unless we take due precautions and remove this curse from our midst, Hinduism itself is in danger of destruction.

(యంగు ఇండియా. 20-10-27)

# 19. ధార్మికరంగము.

## 1 దేవాలయములు.

చాలకాలమునుండి మనధార్మికజీవనములో దేవాలయములకు
ముఖ్యస్థాన మేర్పడినది.

ముస్లిముల మసీదులు, క్రైస్తవుల చర్చిలుగూడ సార్వజనిక
ములు. వాటిలోని కందరునువచ్చి అక్కడి ప్రార్థనలో పాల్గొనవచ్చును.
మసీదులో నబాబుకు ఫకీరుకు, కులీనునికి భ్రష్టునికిగూడ, ఒకేస్థాన
మర్యాద. క్రైస్తవులలో ప్రొటస్టంటు కాతలికు మొదలగు శాఖాభేద
ములున్నవి. కాని ఎవరినీ బహిష్కరింపరు. వాటిలో తరుచు సమిష్టి
ప్రార్థనలు జరుగును.

వేదకాలమందు దేవాలయము లెట్లుండెనో తెలియదు. ప్రాచీన
స్మృతులు భారతరామాయణములు, వీటిలోను దేవాలయములలో విగ్ర
హములనుంచినట్లు మూర్తిపూజ చేసినట్లు వర్ణింపలేదు. బౌద్ధయుగపు
దరిమిలాకాలములో బుద్ధునివిగ్రహముల పూజయుండేది. దానిస్థానే
వ్యాపించిన పౌరాణిక హిందూయుగంలో దేశమంతటను చాల దేవాల
యములు వాటిలో విగ్రహారాధనయు వెలసినవి. ద్రావిడులలో విగ్ర
హారాధన అనాదిగనున్నది. ఈప్రాంతమందు అద్భుత శిల్పములతో
గొప్ప ప్రాచీనదేవాలయములు నేటికి నిలిచియున్నవి. ఆటవికులు ఆది
మజనులు రాయి రప్పలు పూజించుటయు అతిపూర్వకము. ఈ సంస్కృ
తులన్నిటిసమన్వయంలోను విగ్రహారాధన విస్తరించియుండునని సంఘ
శాస్త్రజ్ఞుల అభిప్రాయము. దేవాలయములు పూర్వం జనులందరిసమిష్టి
ప్రార్థనలకేగాక, విద్యాపాఠశాలలుగను, మతబోధకు ధార్మికోపన్యాస
ములకు, సాంఘికసమావేశములకును, వాడుకలోనుండేవి. మరియు చాల
వైష్ణవాలయాలలో భక్తులందరికి సమిష్టిభోజనాలును జరిగేవి.

వీటిలో నిట్లు సామ్యసిద్ధాంత మమలులో నుండేదని కొందరి భావము. అట్టి దేవాలయప్రసాదము స్వీకరించునపుడు కులవిభేదము దృష్టిదోషముకూడ నేటికిని గమనింపరు. ఇట్టి సార్వజనిక కార్యము లకు వీలుగ విశాలమండపములున్నవి. దేవాలయములకు మతసంస్థలకు జను లిచ్చేద్రవ్యంవల్ల సార్వజనికంగా ప్రజోపయోగము జరిగేది. ఇప్పు డీస్థితి పోయినది. దేవాలయాధికారులును వాటినిద్రవ్యార్జనకు ప్రాబల్యముకు వినియోగించుచున్నారు ధర్మకర్తలు స్వాములవార్లు ఇప్పుడు హిందూ మతసంస్థలలో పరిశుద్ధమతప్రచారము చేయుట విద్యాబోధ ఇట్టివి క్షీణించినవి. వాటిద్వారా కొద్దిమంది లాభగౌరవములుపొందుచున్నారు. బీదభక్తులకు పోషణలేకున్నది. కాశి, తిరుపతి, శ్రీరంగం, జగన్నాథం, మొదలగుచోట్ల ప్రసిద్ధదేవాలయముల కెంతో భూవసతు లుండుటే గాక, వాటికి నేటికిని భక్తులవల్ల నిరంతరంధనప్రవాహము చేరుచున్నది. ఆద్రవ్యములో సగమైనను ధార్మికప్రచారముకు జనులదురాచార ముల నివారణకు ఉత్తమ విద్యావ్యాప్తికిని వినియోగించుట అవసరము. ఆలయాలలో విగ్రహారాధనద్రవ్యసంచయము హిందూముస్లిములమధ్య పోరులకు కారణమైనదని ఇదివరలో చూచియున్నాము. మధ్యకాలంలో కబీరు నానకు ఇత్యాదులేగాక 19వ శతాబ్ది రామమోహనదయానందా దులును మూర్తిపూజను మాన్పింపజూచిరి. నిజమైనభక్తికి ఈశ్వర ప్రార్థనకు విగ్రహారాధన యవసరంకాదని, అదిమంచిది కాదనియు, బుద్ధి మంతు లంగీకరింతురు. పురాణములలోను దేవుడు విగ్రహాలలోనే లేడు సర్వవ్యాపి, అంతరిక్షంలోనుచరాచరములన్నిటిలోను ఉన్నాడని, ఆత్మాం తర్గతుడగు ఈశ్వరుని సేవించుటే ప్రశస్తమని, హిందూమతశాఖ లన్నిటి సిద్ధాంతము *

---

* శివమాత్మనిపశ్యంతి ప్రతిమాసునయోగినః
ఆత్మస్థం యే నపశ్యంతి తీర్థేమార్గంతి తే శివం (శివపురాణము.)
సర్వస్యైవజనస్యాస్య విష్ణురభ్యంతరేస్థితః।
తంపరిత్యజ్య యే యాంతి బహిర్విష్ణుం నరాధమాః॥ (యోగవాసిష్ఠము.)

అయితే ప్రాజ్ఞుల కక్కరలేదు, కాని, మూఢజనులు ప్రారంభ స్థితిలో భక్తినిల్పుటకు విగ్రహారాధన నుపయోగించునని కొందరి భావము. ఇది నిజమే కావచ్చు. ఇదివరలో రాయిరప్పలు పూజించి వాటిలోనే దేవు డున్నాడనుకొను మన్యపుజనులకు నిమ్నజాతీయులకు అజ్ఞానులగు మూఢులకు దేవాలయాలలో విగ్రహము లుంచి పూజించుట దేవునందు మనస్సు లగ్నము చేయుట కుపయోగింపవచ్చు. కాని చాలమంది మూఢులు ఏండ్లకొలదిగ గుడులకు వెళ్లుచున్నారు. వారికి వాటి విగ్రహాలలోనే దేవు డున్నాడను భ్రమ వదలుటలేదు. పై పెచ్చు శిలల ప్రాణప్రతిష్ఠ ఆడంబరపు పూజావిధానము సంప్రోక్షణచర్య ఇట్టి వాటివల్ల పామరుల మూర్ఖభావము మరింత బలపడుచున్నది. ఆలయములలో పూజాసమయమందైనను, ఈశ్వరుడు సర్వవ్యాపి విగ్రహము వట్టిచిహ్నమె అని పామరులకు బోధ జరుగుటలేదు. అట్లుగాక జనులకు పరిశుద్ధజ్ఞానభక్తులు విస్తరింపజేయునట్లుగ దేవాలయాలలో కార్యక్రమమును మార్చుట బోధించుట అవసరము. అప్పుడే హిందూసంస్కృతి సరిగా వ్యాపించును.

ఈసందర్భంలో హరిజనుల కాలయప్రవేశపుప్రశంస కల్గును. ఇప్పుడు మామూలు దేవాలయములలోకి హరిజనుల రానిచ్చుటలేదని తెలిసినదే. బడులు, చెరువులు, నూతులు వగైరాలకు రానిచ్చు సందర్భముగూర్చి చెప్పిన యంశములు దేవాలయప్రవేశమునకును వర్తించును. దీనినిగూర్చి అదనంగా రెండుమూడు విషయములు మాత్రం చర్చించవలెను. ఆధ్యాత్మికోన్నతి ఆత్మవికాసమునే నిజమైన అభివృద్ధికి సూచకము. కనుక, వారికి మతబోధ ధార్మికజ్ఞానము కల్గింపక కేవలం తక్కిన సంస్కరణవల్లనే హరిజనుల నుద్ధరించుట సాధ్యముకాదు. పూర్వం శంకరరామానుజాదులు సమత్వబుద్ధి గల్గి హరిజనులలోను మతబోధ చేసి శిష్యవర్గము కల్గియుండినట్లు వారిలోని జ్ఞానులను గౌరవించినట్లును లోగడ గమనించియున్నాము. కాని, ఇప్పుడు హిందూధర్మప్రచారకు

ఇట్లు చేయుటలేదు. వారి గూడెములలోకి సవర్ణులు వెళ్ళుటే దుర్ఘటము. అట్టిస్థితిలో వారికి హిందూమతాచారములు బోధపడుటకు సమిష్టి ప్రార్థనసమయమందు వారిని సవర్ణులతో కలుపుటే సులభమార్గము. అనగా, హరిజనులకు దేవాలయప్రవేశమిచ్చేయెడల వారికి సత్సహవాసము, ధార్మికబోధయు జరుగును. జ్ఞానము శౌచనియమాలు నలవడును.

అయితే, సవర్ణులప్రతికూలత హెచ్చుగనున్నది. మూఢులకు ధార్మికబోధ చేయవలసిన ధార్మికప్రవరులు 'సనాతనధర్మ' పరులు నీసూచనను వెంటనే నిరసించుట మామూలైనది. కాని, వారీసమస్యను నిదానముతో నాలోచించుచున్నారా యని సందేహము.

హరిజనుల నాలయములకు రానిచ్చితే, వారికి భక్తిప్రేమలు, సద్భావము, అహింసాభావమును కలుగును. ప్రస్తుతము వారు తమ గూడెములలో జరిగించు అమ్మవారిపూజలు, జాతరలు, జంతుబలులు, మద్యపానములు అధార్మికములని, హిందూమతవ్యతిరిక్తమని వారికి బోధపడును. జంతుబలి మద్యపానంవల్ల అమ్మవారికి ప్రీతికల్గునని హరిజనులు ఇత్యాదులకు భ్రమకలదు. ఈదురాచారములకు ధార్మికాధారము లేదని, అట్టిదుశ్చర్యను దేవుడు హర్షింపడని, వారికి దేవాలయసంపర్కంవల్లబోధపడుచు. కనుక, అహింసావ్యాప్తికిని అదిసాధకము. మరియు ఆలయాలలోవిగ్రహాలుంచిపూజించుట పామరులకుసుబోధకొరకుగదా! ఇప్పుడు హిందూమతస్థులందరిలో అతిపామరులు ఆదిహిందువులే. కనుక మూర్తిపూజగల దేవాలయాలవల్ల వారికే ముఖ్యోపయోగముండును. జ్ఞానుల కీగుడులు యవసరమే లేదు. హరిజనులను రానిచ్చినప్పుడు. దేవాలయాలలోనికి హెచ్చుమంది మూఢులువచ్చుట, వాటివల్లవారికినిజమైన లాభమును, కల్గును. ఇప్పుడుమామూలు ఆలయాలకు చాలమంది వెళ్ళుటే లేదు. తీర్థక్షేత్రములకును మూఢభక్తితోనే జనులు వెళ్ళుచున్నారు

తక్కిన హిందువులతో సరియగు ధార్మికసంపర్కము లేనందున అజ్ఞానమువల హరిజనులు సులభముగ క్రైస్తవ మహమ్మదీయ ప్రచారకులకు

లోబడి, లక్షలకొలది జనులు సాలీనా అన్యమతస్థులగుచున్నారు. ఇంక వల్ల మనదేశంలో ఇతరమతస్థులు వృద్ధియగుచుంటే హిందూమతస్థుల సంఖ్య తగ్గుటతప్పదు. సవర్ణులిట్లు తమ్మవమానించి మూఢస్థితిలో నుంచి నప్పుడు, వారితరమతముల కాకృష్టులగుట సహజమే కనుక స్థితిగతులిట్లే యుంటే కొంతకాలముకిట్లీ యారేడుకోట్లవారు నన్యమతస్థులు కావచ్చు. అప్పుడు, ఆర్యధర్మము కావాసమనుకొను భారతదేశంలోనే హిందూ మతస్థుల సంఖ్యాబలముతగ్గి, ఇతరమతస్థులందరి మొత్తపుసంఖ్య హిందూ సంఖ్యకన్న హెచ్చువచ్చు', ఇందువల్ల హిందువులకు ఆలంబముతగ్గి నైతి కపతనమును కల్గును; అప్పుడు సవర్ణులలోను మేదర,ఎరుక, చాకలి, గొల్ల వగైరా నిమ్నజాతీయులకు హిందూధర్మమందు నమ్మికతగ్గి, వారును కొందరు విమతస్థులగుదురు. ఈరీతిగ హిందూధర్మము క్షీణదశపట్టును *

మరియు, ఇది ప్రజాయత్తయుగము: సాంఘిక రాజకీయాదులకు సంబంధము హెచ్చు, వీటిలో సంఖ్యాబలమును బట్టియే ముఖ్యనిర్ణయ ములు జరుగును. శాసనసభలలోను మంత్రివర్గములలోను అధికారుల లోను అన్యమతస్థులే హెచ్చుమంది యుందురు. హరిజనుల బహిష్కరిం చుటవల్లనే సనాతనధర్మము రక్షితమగునను వాదపుపాండిత్య మిట్లు మూలచ్ఛేదియని దూరదృష్టితో నిమర్శించునప్పుడు విశదపడును. మరియు, హిందువులసంఖ్యఇప్పుడు హెచ్చైనను, ఈవిభేదమువల్ల వారిస్థితి దుర్బలమని గ్రహించుటవల్ల ఇటు జిన్నావగైరాలును అటు విదేశప్రభు త్వమును మనల లక్ష్యపెట్టక మనన్యాయమైన స్వత్వములీయక తృణీక రించుచున్నారు ధార్మికైక్యమును భావశుద్ధియునే తక్కినరంగములలో

* హిందూధర్మరాజ్యమనబడు తిరువాన్కూరులో క్రైస్తవుల ముస్లిముల సంఖ్య చాల హెచ్చి కొద్దికాలము కింకను చాలమంది హరిజనాదులు క్రైస్తవులగుదురు అనుస్థితి గల్గినది. అప్పుడు దివానుగారి సూచనపైన అక్కడ పబ్లికు దేవాలయములన్నిటిలో హరి జనులు వచ్చునట్లు మహారాజుగారేర్పర్చినారు. ఈయేర్పాటువల్ల వారు మతాంతరీయుల గుటనిలచి, అక్కడి హిందూధర్మమునకు స్థైర్య మేర్పడినది.

ను విజయముకు పునాదియని చరిత్రవల్ల తెలియుచున్నది హరిజనుల రాకవల్ల దేవాలయంలోని విగ్రహము మైలపడునని కొందరివాదము. ఇది అగ్నికి చెదపట్టునన్నట్లున్నది భగవంతుడు సర్వశక్తుడు పవిత్రత కంతకు ఆధారుడు, దీనరక్షకుడు. దేవాంశ తక్కిన చిదచిత్తులలోకంటే విగ్రహశిలలో హెచ్చుగనున్నదనుట యు అసంగతము, దేవాలయపు వాతావరణమును పరిశుద్ధముగ నుంచుటకు మనపూర్వులు నియమము లేర్పర్చిరి. ఆశౌచములోనివారు పతితులు ఆలయములోకి రాకూడదని నియమమున్నది. కాని, అదిఆదిహిందూజాతి కుద్దిష్టమనికనబడదు శౌచ నియమము కావలసినదే ముస్లిములును ప్రార్థనవేళలందు మసీదులలో ముందుగ హస్తపాదముల ప్రక్షాళనచేయనివారిని లోనికిరానీయరు. పతితులు వికలురు త్రాగుబోతులు రాకూడదని ఆగమములలో జెప్పినారు*

* పతితః పాతకీవాపి కుష్ఠ్వపస్మారరోగవాన్
కాణోవాం ఖళ్ళమూకళ్ళ బధిరోవాం గహీనకః;
పరస్త్రీ గమనాసక్తః......................
శాంతిహోమంతథాచరేత్॥ (ఈశ్వరసంహిత 19 అ. 136-141.)

ఏవిధమైన అంగవైకల్యమున్నవారును పతితులు, పాతకులు, పరస్త్రీగమనాసక్తులును ఆలయములో ప్రవేశించకూడదు. అట్టిది ప్రమాదమున తటస్థించితే, శుద్ధికి హోమాదులుచేయవలెనని అర్థము.

చండాలశ్వపచాద్యాస్తు......తథైవప్రతిలోమాద్యాః......
............సహస్రకలశైః స్నానమత్సవంచసమాచరేత్॥
(ఈ. సం॥ 19 అ. 171-176,)

చండాలశాబరాద్యైశ్చ............సంప్రోక్షణమథాచరేత్
(పురుషోత్తమసంహిత 30—38, 44)

మహాపాతకులవివరం—

స్వర్ణస్తేయీ, సురాపాయీ, బ్రహ్మహా, గురుతల్పగః
మహాపాతకినస్త్వేతే తత్సంయోగీచ పంచమః॥

కనుక జారచోరులు త్రాగుబోతులు వారిసంపర్కముగలవారుకూడ ముఖ్యమైన మహాపాతకులు; వారికేగాక ఇట్టిపాతకులకును దేవాలయప్రవేశము కూడదని ఆగమప్రమాణము.

కాని, ఇప్పుడుసాధారణంగా ఎందరో జారచోరులు త్రాగుబోతులు దురాచారులు రోగులును దేవాలయములకు వచ్చుట కాటంకము లేకున్నది. మరియు, పెద్దఆలయములనుగూడభౌతికంగాను నైతికంగాను పరిశుద్ధముగ నుంచుట అరుదైనది కొందరువ్యభిచార వృత్తిగల భోగస్త్రీల యాటపాటలజూచుటకు విలాసములకును ఆలయముల కేగుటకలదు. ఇట్టియాకర్షణ లుండవలెనని, భోగము మేళముల నాలయాలలో మాన్పించుటకు కొందరుధర్మకర్తలిష్టపడుటలేదు. ఇట్టివిషయములలోశుద్ధి చేయుటమానిరి; నిరాధారమైధార్మికపిపాసగలజాతికిప్రవేశము నిషేధించుట ధర్మమేనా? సవర్ణుల వీధులందుండు దేవాలయములు వారికొరకే యేర్పడినవనియు నొకవాదము. కాని,అట్టినియమము కెట్టి నిదర్శనమును లేదు. గొప్పదేవాలయముల స్థాపనకు నడుపుటకు సంబంధించిన శిలాశాసనము లెన్నియో ప్రకటితమైనవి. వాటిదాతలుగాని అధికారులుగాని మరియెవరు గాని తమధర్మములు ఆలయప్రతిష్ఠలు సవర్ణులకొరకే యని లిఖింపలేదు. భక్తులందరికనియే ఉదాహరణలున్నవి. బదరికాశ్రమము మొదలురామేశ్వరంవరకు ఏప్రాంతపువారైనను హిందూమతస్థులు హిందూదేవాలయములలో ప్రవేశించి స్వామిని సేవించుట కలదు. కనుక, తమప్రక్క మైలుదూరంలోనే యున్న గూడెపుఅవర్ణులకట్టి యాలయములోకి రావీలులేదనుట భావ్యముకాదు. ఒకప్పుడు, దురదృష్టమున హిందూ ముస్లిములమధ్య కలతలుకల్గినప్పుడు ముస్లిములు హిందూదేవాలయముల ముట్టడించి పాడుచేయ బూనుట హాని తటస్థించుటకలదు. ఇది శోచనీయము. కాని, అట్టిస్థితిలో మంచిభౌతికశక్తిగల కార్మికులగు హరిజనజాతి సహాయముంటే, హిందువులు తమయాలయముల రక్షించు కొనుటసులభము. ఆలయములు తమవి, వాటిలో తాము నారాధింపవచ్చునను భావమున్నప్పుడే, హరిజను లుత్సాహముతో యావచ్ఛక్తిని వినియోగించి కాపాడుదురు. హిందూసంఘమన్నివిధములను సంఘటితమై

బలపడును. కనుక స్వలాభముకైనను మందిరప్రవేశము మంచిదనియే విమర్శపైన తేలును.

'హరిజనులు హిందువులేకారు, కనుక వారు దేవాలయములకు రాకూడదు' అను వాదమును కలదు. కాని, ఇదియు సబబైనదికాదు. హరిజనుల ఆచారములు ప్రార్థనలు వగైరాలు హిందూపద్ధతినే జరుగును. హిందూమతస్థులగు చాకళ్ళు మున్నగువారు వారిమతచర్యలలో పాల్గొందురు. వారి వివాహాది సంస్కారములు శూద్రజాతీయులలో వలె జరుగును వారిలో కొందరు సవర్ణుల శిష్యులు వైష్ణవదాసరులు శైవభక్తులుకలరు. కొందరు సవర్ణుల వివాహముల సందర్భమున హరిజన కుటుంబమునకు ముందుగా వివాహము జరిగించు సంప్రదాయమున్నది శూద్రులలో జరుపు గ్రామదేవతల యుత్సవాలలో వీరునుపాల్గొందురు. వివాహము, దత్తత, సమిష్టి కుటుంబపద్ధతి, వారసత్వము ఇత్యాదులు మనహిందూ ధర్మశాస్త్రప్రకారమే వారికిని జరుగుచున్నవి. హిందూ దేవతలపేర్లును వారిలో చాలమంది కుండుచున్నవి. మరియు, కొన్ని కోర్టులలో ఈవిషయము చర్చింపబడి, వీరుహిందువులేఅని శూద్రులలో శాఖయని శాస్త్రచర్చపైన కోర్టులలో స్థిరపడినది*(ఇటీవలనే, హిందూ దేవాలయముల ధర్మకర్తలనెన్నుకొను తెంగల వైష్ణవమతపువోటరులలో వీరుచేరుదురా అనుప్రశ్నవచ్చి, కొందఱు మాదిగవారికట్టి వోటుహక్కు కలదని మద్రాసుహైకోర్టువారు తీర్పునిచ్చినారు.† ఇట్లన్నివిధములను వారు హిందువులే. వారిని దేవాలయములకు రానిచ్చి ధర్మముబోధించి యుద్ధరించుటే సబబుగ తోచును.

---

* ఇం. లా. రి. 33 మద్రాసు 842; 39 లావీక్లీ 439=66 మ. లా. జ 548 ఇం. లా. రి. 52 మద్రాసు 160=28 లావీక్లీ 674. ఇం. లా. రి. 51 కలకత్తా 488 ఇం. లా. రి. 10 లాహోరు 373, ఇం లా. రి. 31 కలకత్తా (ప్రీవీ కౌంసిలు.)॥

† 47 లావీక్లీ 480=1938 (1) మ. లా. జ. 530=1938 మ. వీ నో. 376.

(తిరువల్లికేణి పార్థసారథిస్వామి కోవిల ఎన్నికకేసు.)

అయితే చాల తరములనుండియున్న మామూలు నొక్కసారిగ మార్చుటకు చాలమందిసవర్ణులొప్పుకొనుట లేదనుసంగతి నిజమే. హరిజనులరానిచ్చిన మతముచెడుననుభావమింకనువారికి కలదు. 'కాలానుసారముగ ఆచారములు మారవలె, బుద్ధిమంతులట్లు నిర్ణయించి అమలుజరుపుటకలదు' అని, శాస్త్రములలోచెప్పియున్నారు. ఇట్టికార్యములు సాధ్యమైనంతవరకు ప్రజాభిప్రాయం సుముఖపచ్చి చేయించుటన్యాయము. అదే అహింసాపద్ధతి. కనుకనే సవర్ణులలో హెచ్చుమంది అంగీకరించినట్లు వోటుద్వారా తేలినచోట్లనే పబ్లికుదేవాలయములలోకి హరిజనులను రానీయవలె; లేదా ప్రజాభిప్రాయము సుముఖమైనదని తమకు తోచినప్పుడు ధర్మకర్తలట్లు జరిగించవచ్చునని కాంగ్రెసు అధికారములో మనరాష్ట్రములో చట్టము చేయబడినది. ఇది పరస్పరమైత్రిమీదనే అమలుజరుగదగిన ధార్మికసంస్కరణ. కనుక ఉదారులగు హిందూధర్మక్షేమపరులు దానివిషయమై వెంటనే శ్రద్ధవహించవలసియున్నది. ఏది క్షేమకరమో సరిగా విమర్శజరిగి ప్రచారము జరుగవలె. లోకసంగ్రహమును మానవత్వరక్షణమునుకోరి ఉదారబుద్ధితోకలిసి దీనోద్ధరణకై కృషిచేయుట అవసరము.

'తీర్థస్థలములలో గుడులలోనే దేవదర్శనమగునని పామరులు తలతురు. ధీమంతులు ఆత్మలోనే దేవుని దర్శింతురు† దేవత మృచ్ఛిలలద్వారా కాక ఉదారులగు సాధుపులద్వారానే లోకులను పవిత్రపరచును', అని పురాణముచెప్పుచున్నది ‡ అందరు సద్బుద్ధిని భద్రతను పొంది తరించవలెననియే శాస్త్రము *

---

† అప్సు దేవా మనుష్యేషు, దివిదేవా మనీషిణాం
బాలానాం కాష్ఠలోష్టేషు బుధ స్యాత్మనిదేవతా (అగ్నిపురాణం)

‡ నహ్యమ్మయాని తీర్థాని, నదేవామృచ్ఛిలా
మయాః, తేపునంత్యురు కాలేనదర్శనాదేవసాధవః (భాగవతం)

* సర్వస్తరతు దుర్గాణి, సర్వోభద్రాణి పశ్యతు
సర్వస్సద్బుద్ధిమాప్నోతు, సర్వస్సర్వత్ర నందతు.

# ధార్మికరంగము.

## 2. స్త్రీలు.

ధార్మికసమస్యల చర్చలో గమనించేవిషయములలో నొకటి స్త్రీలస్థితి. మొత్తంమీద 'నాగరికలోకం'లో పూర్వకాలమందు స్త్రీల స్థితి హీనంగా ఉండినది. అనాగరిక జనులలలోనే స్త్రీలకెక్కువ స్వాతంత్ర్యముండేదని చెప్పవచ్చు. ఇందునుబట్టి నిసర్గజీవితంలోకంటె కృత్రిమ సాంఘికజీవితంలో బలీయుడగు పురుషుడు స్త్రీలపైన తన యధికారము హెచ్చించుకొన్నాడని తేలును. అన్నిదేశాలలోను సాధారణంగా పురుషులే స్మృతికర్తలు పురాణనిర్మాతలు, కనుక వారు (స్వార్థపరులై) సంఘనిబంధనలు తమకనుకూలంగా చేసుకొన్నారనియు కొందరిభావన. కాని మనదేశంలో వేదకాలమందు విదేశాలలోకంటె స్త్రీలకెక్కువవిద్య, సాంఘికస్వాతంత్ర్యము, ధర్మపాలన ఆస్తి హక్కులు నుండేవి. దరిమిలాను కొంతస్వేచ్ఛ, ధార్మికత, తగ్గినను, మధ్యయుగంలోను మనదేశపు స్త్రీలకే యూరపుస్త్రీలకన్న స్థితి బాగుండేది. తరువాత స్థితి తారుమారైనది.

పాశ్చాత్యనాగరికతలో స్త్రీలకు విద్య, సాంఘికస్థితి, ఆర్థికస్థితి, ఇప్పుడు బాగుపడి, వీరు వృద్ధికి వచ్చినారు. మనదేశంలో అందుకు భిన్నమైనది. స్త్రీలలో అజ్ఞానము మూఢత్వము చాల హెచ్చినవి. పురుషులలో నూటికి 12 అయినను చదువుకొన్నవారు; స్త్రీలలోనో, ఇద్దరు మాత్రమే అక్షరాస్యలు. చాలప్రాంతాలలో పురుషులకన్న స్త్రీ లెక్కువమంది మరణించుచున్నారు (తక్కినవనాగరిక దేశాలలో స్త్రీల సంఖ్య హెచ్చు, మన దేశంలో పురుషులసంఖ్యయే హెచ్చగుట కిదియు కారణముకావచ్చు.) స్త్రీలు ధార్మికంగాను వెనుకబడినారు.

స్త్రీ పురుషునకర్ధాంగియను ఆర్యోక్తిలోని అంతరర్థమును మనవారంతగా గమనించుటలేదు. కుటుంబజీవితములో దంపతులిద్దరు సహ

స్వరసహాయులు కాకతప్పదు. సంతానమునకు తల్లిదండ్రులిద్దరి గుణగణములు నేర్పడును. ధార్మికంగాను ఆర్థికంగానుగూడ స్త్రీల యున్నతినిబట్టి సంఘపు వృద్ధియుండును. స్త్రీల యుత్సాహసహాయములు లేకుండ ఏమహోద్యమమును నెరవేరదు. స్త్రీలు హీనస్థితిలోనుంటే ఆ భాగముకే కాక జాతీయ దేహమంతకు పక్షవాతము కలిగినట్లెంచవలెను. అందును అహింసాధారమగు సంస్కృతిలో స్త్రీల క్షేమమునకు ప్రత్యేకశ్రద్ధ కావలెను. అహింసావ్యాప్తి స్త్రీలపైన ఎక్కువగ ఆధారపడును. అయితే, నీరసస్థితిలోనున్న దుర్బలులవృద్ధి కితరుల సహాయము కావలె; అట్లే, పరతంత్రలైన అబలల నున్నతికి తెచ్చు బాధ్యతను పురుషులు వహింపకతప్పదు. అందును భారతీయ స్త్రీలు పురుషుల కెప్పుడును విధేయలైయున్నారు. కనుక మనపురుషులు స్త్రీలనుద్ధరించినప్పుడే తాము వృద్ధికాగలరు. స్త్రీలు ప్రగతికి సంస్కరణకు వ్యతిరిక్తలైనందున, పురుషులును తమ సంస్కరణ భావము లాచరణలో పెట్టలేకున్నారు. సహజముగా ప్రేమస్వరూపలైనను సంసారములో తాము హింసకులైనందున, చాలమంది స్త్రీల మూఢ మనస్సులో ప్రతిహింసాభావమేర్పడి, సౌమ్యత చెడుచున్నది; ఇంటిలో వ్యతిరేకతవల్ల నిర్మాణకార్యమునకు వృద్ధిలేకున్నది.

స్త్రీల శరీరారోగ్యముగూర్చి ప్రత్యేకశ్రద్ధకావలెను. పురుషులవలెకాక స్త్రీలు గర్భప్రసవాది శ్రమలను బడవలెగదా. ఉన్నత కుటుంబస్త్రీలు సాధారణంగా బయటతిరుగుటలేదు. ఇంటకొందరికి గృహకృత్యములుండును, కాని, ఆదేహపరిశ్రమ సమముగ నియతముగ నుండదు, చాలమంది స్థితిమంతుల కసలేలేదు. కనుక, ఇంటనే యుండు స్త్రీలు ఏదోయొకవేళ రోజును నూలువడుకుటవంటి పరిశ్రమ చేయవలెను. అందువల్ల వారికి దేహారోగ్యము మనోవికాసము నిగ్రహమును గల్గును. దానిఫలితము సంతానమునకును కల్గును.

స్త్రీల విద్యారోగ్యములు సరిలేకుండుటకు అతిబాల్యవివాహపద్ధతి కొంతవరకు కారణము. జ్ఞానవంతులును సనాతనధర్మముపేర

వివాహములు బొమ్మలపెండ్లివలే చేయుచున్నారు. కాని, కన్య ఋతుమతియైన మీదట 3 ఏండ్లవరకు తండ్రి యింట కనిపెట్టియుండి, ఆపైన వివాహమాడదగునని ప్రాచీనధర్మశాస్త్రవచనము లున్నవి *

ప్రజాభిప్రాయము సరిగ లేనందువల్లనే శారదా చట్టమున్నను చిన్నపిల్లలకు పెండిండ్లుజరుగుచున్నవి. సంస్కృతంలోని వివాహమంత్రములు గృహ్యసూత్రప్రక్రియయు ఆవివాహపద్ధతి వయస్సువచ్చినవారికే ఉద్దేశించినదని సూచించును † శారదాచట్టము నిర్బంధకరమని వ్యక్తిస్వాతంత్ర్యము సడ్డగించునని కొందరి యాక్షేపణ. కాని వివాహమెవరికి? వధూవరులకే; అది తమకుధార్మికజ్ఞానముకల్గు యుక్తవయస్సు వచ్చినమీదటజరుగవలె. తగుసంబంధమును సకాలమున నిర్ణయించుకొనుటకు, ఆవివాహ మంత్రాల ప్రమాణాదులభావము గ్రహించి, విచక్షణతో నడువవలె. ఆవధూవరులకు సహజముగనుండు హక్కును అతిబాల్యవివాహం జరిగించుటద్వారా తల్లిదండ్రులు హరించుటలేదా ? తల్లిదండ్రులు సదుద్దేశముతోనే చేసినను ఈ బాల్యవివాహముల చర్యవల్ల నిజంగా వధూవరులకు మానసికహింస జరుగును. మఱియు బాల్యమందే గర్భము కల్గుటవంటి కారణాల వల్లను ఇది భౌతికహింసకును కారణమగును. 16 ఏండ్లలోపుగనున్న స్త్రీలకు గర్భధారణయుక్తముకాదని మనవైద్యశాస్త్రజ్ఞులును చెప్పినారు. ‡ ఇప్పుడు బాల్యమందే వితంతువులైన స్త్రీలెం

* త్రీణి వర్షా ణ్యుదీక్షేత కుమా ర్యృతుమతీసతీ
ఊర్ధ్వంతు కా లా దేతస్మాత్ విందేత సదృశంపతిః॥ మనుస్మృతి.

† త్రీణి వర్షాణ్యృతుమతీ కాంక్షేత పితృశాసనం।
తతశ్చతుర్థే వర్షేతు విందేత సదృశంపతిం॥ (బోధాయనస్మృతి)

‡ ఊన షోడశవర్షాయాం అప్రాప్తః పంచవింశతిం।
యద్యాధత్తే పుమాన్ గర్భం కుక్షిస్థః స విపద్యతే॥
జాతోవా నచిరంజీవేత్ జీవేద్వా దుర్బలేంద్రియః।
తస్మా దత్యంత బాలాయాం గర్భాధానం నకారయేత్.

దరో ఆజన్మవైధవ్యములో నున్నారు. ఇట్టిది ఇంకేదేశంలోను లేదు— మఱియు ఇప్పటికిని 50 ఏండ్లుదాటినవారును 12 ఏండ్లబాలికను కట్టుకొనుట శోకకరము. ఇదినిజంగా హింసాచర్యయే; గృహస్థధరక్షణకని వర్ణాశ్రమధర్మము పేర ఇట్టిచర్యల జేయుట మరీసంతాపకరము. వీరు వానప్రస్థతకు సన్యాసమునకు పూర్తిగస్వస్తిచెప్పుట యెట్టిఆశ్రమధర్మమో ! ఇట్టిచర్యలవల్ల ఆస్త్రీలకెంతోమనోవ్యధయు ఒకవ్వుదుహింసయుగల్గును, మఱియు ఇట్టి పెండిండ్లవల్ల అవినీతియు వితంతువులసంఖ్యయు హెచ్చినది. అర్ధాంగికి తనకు వయస్సులో విశేషభేదముంటే దేహమనఃపరిణామపు వ్యత్యాసముండి, భావములు భేదించి, కలహమేర్పడి హింసాతత్వమావరించును. ప్రకృతిలో స్త్రీకిదేహవికాసము త్వరలో కల్గుటనిజమే. ఆభేదము నఃపమునట్లు సుమారు పదేండ్లలోపు భేదపు సవయస్క వివాహమే ప్రశస్తమని తోచును.

వితంతువివాహము హిందూశాస్త్రసమ్మతము కాదని కొందరందురు, కాని శాస్త్రీయమయినట్లు కొన్నికారికలున్నవి. అదియెట్లైనను విధవావివాహపు చట్టమేర్పడిన 1856 సం॥ నుండి న్యాయశాస్త్ర ప్రశ్న పోయినది. ఇట్టివివాహములింకను ధారాళంగా జరుగుటలేదు. శాస్త్ర ప్రకారంవిధవావివాహముతప్పుకాదని శ్రీ ఈశ్వరచంద్రవిద్యాసాగరులు ఇత్యాదులు నిరూపించియున్నారు, అందుకు ప్రజామోదము లేకుండుట వల్ల పురుషుల కీవిషయంలో ఉదారత దయాౕరసము సాహసము లేదని, హింసాతత్వముకలదనియు, తెలుపును. భార్యయున్నను, తాముపెద్దలైనను ఎట్టిసబబు లవసరము లేకయు పురుషుడెన్ని వివాహములైన చేసుకోవచ్చు; కాని, * స్త్రీలుమాత్రం, వితంతుబాలికలు, పెండ్లి చేసుకొంటే, పెండ్లి యాడిన వారిని సంఘము న్యూనపర్చును; ఇట్టివి మనహింసాతత్వపు చిహ్నములు కావా?

* వివాహమాధ్యాత్మికము. మనోహృదయములందు పురుషులకు తగినట్లు వికాసము కల్గిన స్త్రీలే సహధర్మచారిణులు కాగలరు.

ఇట్టిదే వితంతువులకు చేయు అనాదరణమును. నిజంగా వితంతువు బ్రహ్మచారిణి సన్యాసినివలె పవిత్రురాలు; నిసర్గముగ సంతతి కనదగిన లక్షలకొలది హిందూస్త్రీలిట్లు వితంతువులై పిల్లలు లేకున్నారు; ముస్లిం క్రైస్తవులలో విధవలేగాక విడాకుపొందియు స్త్రీలు మర లవివాహ మాడి బిడ్డల గందురు. హిందువుల జనసంఖ్యకన్న ముస్లిం క్రైస్తవజన సంఖ్య ఎక్కువవేగముగ పెంచుచున్నది. హిందూస్త్రీల కష్టపరిస్థితు లును ఇందుకు కారణము. * పైనచెప్పిన యంశములన్నియు 'ఉన్నత కుల' స్త్రీల నుద్దేశించినవి. ఇందుకు వ్యతిరేకంగా గొల్లలు, చాకళ్ళు, మాలమాదిగలు ఇత్యాదులలో విశృంఖలతయున్నది. తగినకారణములు లేకయే భార్యభర్త విడిపోయిమారుమనుము కట్టుకొను రివాజువారిలో కలదు. ఇందువల్ల వివాహము విచ్ఛిన్నమైనదో లేదో మనఃపూర్తి శాస్త్రీయత యున్నదో లేదో, పునర్వివాహ మైనదో, ఇట్టి సందేహములు కోర్టుల లోను తేలుట కష్టమగుచున్నది. వీరిలో జరుగు వివాహము కంట్రాక్టు కన్నను హీనముగనున్నది. లిఖితనిదర్శనమరుదు; ధార్మికబుద్ధియుండదు. ఇట్టిహిందూవివాహములు రిజిస్టరు చేయించుటే భావ్యమేమో యనిపించు చున్నది. ఇట్లు హిందువులలోనే కులభేదమునుబట్టి నియమాలలో చాల వ్యత్యాసమున్నది. ఇట్లు కాక, ఏకరూపముగ సంఘమంతటికి సమమైన వివాహనిబంధన లేర్పడవలెను, క్రైస్తవులలోను 'డైవర్సు' (విడాకులు) కు పరస్పరహింసవంటి తగినంత న్యాయకారణము లున్నట్లు కోర్టులో రుజువై, దంపతులమధ్యలాలోచీ లేనట్లు తేలి కోర్టులో తీర్పుజరిగినప్పుడే

*విషమపరిస్థితులలో స్త్రీలకు పునర్వివాహము శాసించుచున్న స్మృతి ప్రమాణము లలో నొక శ్లోకము.

నష్టే, మృతే, ప్రవ్రజితే, క్లీబేచ, పతితే పతౌ ।
పంచ స్వాపత్సు నారీణాం పతి రన్యో విధీయతే॥ (పరాశరస్మృతి)

అనగా వితంతువులేకాక, భర్తయున్నప్పుడును, కొన్ని కష్టస్థితులలో స్త్రీకి వివాహము 'విధించి'నారు.

వివాహ సంబంధము రద్దగును. స్త్రీకి పురుషునకు గూడ పునర్వివాహము కధికారముండును. వారి స్త్రీపురుషులమధ్య మనలోనున్నంత వ్యత్యాసము, నిర్బంధ దాంపత్యమును, లేదు.

వివాహము, దత్తత, సంస్కారములు, వారసత్వం, సమిష్టికుటుంబస్థితి, మనోవృత్తి ఇట్టి అన్నిటిలోను మొత్తంమీద పురుషులకన్న స్త్రీలహక్కులిప్పుడు చాలతక్కువ. ఇందులో కొన్నికష్టములు కొద్దిగనైన తొలగించుట కిటీవల శాసనసభలద్వారా చట్టముల జేయు యత్నముజరుగుచున్నది. జనాభిప్రాయ మనుకూలముగానుంటేనే, ఇట్టిసంస్కరణలు కార్యకారియగును. స్త్రీసంఘపు కష్టములను పురుషులెక్కువ దాక్షిణ్యంతోనివారించుట పురుషులకును మంచిది; అందువల్ల ఉభయత్ర అహింసాభావము హెచ్చును.

బెంగాలు మొదలగు కొన్నిరాష్ట్రాల గ్రామములలో మహమ్మదీయులసంఖ్య హిందువులదానికన్న హెచ్చినది. బెంగాలులో (1881 సం॥ నాటికి ముస్లిములసంఖ్య హిందూసంఖ్యకన్న తక్కువ. 1921 నాటికి మించిపోయినది) అట్టిచోట్ల హిందువుల అనాథస్త్రీయువతులు కొందరు హిందూసంఘంలో బాధపడుచుండగా, వీరిని ముస్లింయువకులు బలవంతముగనో పరస్పరకామమువల్లనో తమదగ్గర దీసినారు. పిమ్మట ఆఅభాగ్యస్త్రీలు ముస్లింకుటుంబములలో నుండుచున్నారు. *

ఇట్లు హిందూస్త్రీలకు జరిగినట్లు తెలిసినప్పుడు ఆప్రాంతపు హిందువులు ముస్లింసంఘముపైన కోపించి, ముస్లిముల దూషింతురు, అంతట హిందూముస్లింకొట్లాట జరిగి దెబ్బలుతగిలి హిందూముస్లిముల మధ్య (హరిజనులమతం మారినప్పుడువలె) విరోధము హెచ్చుచున్నది.

* అట్టిపతితస్త్రీలు స్వసంఘముకెట్లో మరలవచ్చినను తమబంధువులెట్లును సంఘాచారమునుబట్టి అంతుజేసి అవమానింతురను భయమున వారు ముస్లింసంఘములోనే యుండి పోవుచున్నారు.

ఇందు హిందువులలో స్త్రీలపైన నిరాదరణయు కారణము. హిందూసంఘపు శాఖలమధ్య బాగుగ ప్రేమభావ మేర్పడినప్పుడు ఇటుల వల్ల హిందూసంఘము కషాయమునుపోయి పరస్పరమైత్రి యేర్పడి భారతజాతియంతయు బాగుపడును. స్త్రీలకధికారములు కూడదనికొన్నిగ్రంథములలో నున్న సంగతినిజమే; కాని ప్రాచీనగ్రంథాలలో స్త్రీలనాదరింపుమని, అప్పుడే సంఘము బాగుపడునని, లేనియెడల క్షీణించునని, సాధారణంగా పురుషులు అపరాధులు, స్త్రీలు అపరాధినులు కారనియు చెప్పినారు † స్త్రీలకు మృదువగు ప్రేమస్వభావమే సహజము, కర్కశత్వముకాదు. మరియు వారికి లౌకికమగు దురాశలు ఆస్తిసంపాదనపైరాల సంఘర్షమునుండవు, వారు ప్రకృతిలో అహింసారూపిణులుగ నుందురు. కాని, మనదేశములో పైనచెప్పిన సందర్భములలో స్త్రీలు పురుషుల భోగవస్తువలెనుండి విద్యజ్ఞానము లేక, తగుధార్మికవికాసము లేకయున్నారు, ఇటీవల నిర్మాణకార్యక్రమాల ఆచరణలో సహాయము చేసి అహింసను వృద్ధిచేయ, స్త్రీలు గాంధి యుద్యమంలో కొంత తోడ్పడినారు. స్త్రీల నున్నతస్థితికి తెచ్చినప్పుడుఅహింసావ్యాప్తి ఇంకనుసులభమగును. భారతస్త్రీల మానవత్వమును ఆత్మగౌరవమును దేహమనశ్శక్తులును బాగుపడినప్పుడే జాతికంతకు అభ్యుదయము కల్గును.

---

† నాపరాధోఽస్తి నారీణాం, నరయేవాపరాధ్యతి।
సర్వకార్యాపరాధ్యత్వాత్ నాపరాధ్యంతి చాంగనాః॥

మనుస్మృతిలో "పితారక్షతికౌమారే......న స్త్రీ స్వాతంత్ర్యమర్హతి" అను శ్లోకమున్నది. ఇందునుబట్టి స్త్రీలకు స్వతంత్రతకూడదని కొందరు సూచింతురు. కాని స్త్రీల దుర్బలస్థితిని పూజ్యతనుబట్టి, వారిని పురుషులు రక్షించుచుండవలె రక్షణలేకుండ వదలకూడదు అనియే ఈ శ్లోకపుభావమని తోచును. 'యత్రనార్యస్తు పూజ్యంతే రమంతే తత్రదేవతాః' (మనుస్మృతి)

## ధార్మికరంగము.

### 3. మతసూత్రములు.

భారతీయులు మతప్రధానులని, మనయాచారవ్యవహారములు మతసూత్రములనుండి వచ్చినవని చెప్పుటకలదు. దీనిలో కొంతసత్య మున్నది. వేదస్మృతి కాలములందు ఎందరో ఋషులు ప్రకృతిని సృష్టి రహస్యములను ఈశ్వరతత్వమును గ్రహించుటకు ఆత్మదర్శనముకు ఏండ్ల కొలది తీవ్రతపస్సుచేసి, తమజీవితము సంపుకై ధారవోసి, తమయనుభవ ములను లోకోపకారముకై గ్రంథస్థము చేసిరి. గ్రీకు రోమకవాఙ్మయము వలెగాక, పూర్వపు సంస్కృతప్రాకృతవాఙ్మయమంతటిలో ధార్మికత ప్రధానభావము. స్మృతులలోని ఆచారకాండలోను తుదకు ఆస్తులపంప కమువంటి లౌకికములలోను మతాచారముల సంబంధమున్నది. వర్ణా శ్రమముల విభజనలోను వారికృత్యముల విధానములలోను స్మృతులలో విధించిన దినచర్యలలో సంస్కారములలో, వారికి సంఘమియామవల సిన మర్యాదలలోగూడ, ధార్మికత,అహింసాసత్యపరత,సంఘక్షేమమును, లోకసంగ్రహమును మనస్సులో నుంచుకొన్నారు. మరియు, వేదకాలం లోనే జ్యామితి (రేఖాగణితము) నభ్యసించి గణితవిద్య నేర్చుటకు కార ణము యజ్ఞవేదికలను ధార్మికగృహములను నిర్మించుటలో సరియైన సూత్రము లవలంబించుటకే. ఇట్లే యోగశాస్త్రము ఆయుర్వేదనై ద్యము ఇత్యాదులలో ఆత్మశక్తిని ధార్మికతను వృద్ధిచేయుటనే అంత్యాశ యంగా ఉంచుకొన్నారు. స్వరసంగీతమును సామవేదగానము నిమిత్తం మొదటనుద్దేశించినారు. బౌద్ధకాలంలో శిల్పకళలను చిత్రలేఖనమును గూడ దశావతారకథలను బుద్ధునిధార్మిక జీవితపుగాధలను వాటిసేతు లను అందరు సులభంగా గ్రహించవలెనని అపారశ్రమతో వినియోగిం చినారు. ప్రాతఃకాలం మొదలు రాత్రివరకు దైనికమగు జీవితకార్యా లలో స్నానపానాదివేళలందు ఆరోగ్యచర్యలలోను ఈశ్వరప్రార్థనను

ధార్మికమంత్రముల పఠనమును సంప్రదాయముగ జేసినారు; ధర్మము నుండియే అర్థకామములువచ్చును, కనుక ముందుగ ధర్మమునాచరింపవలె నని సిద్ధాంతము † ఇట్లన్నిటివల్ల పూర్వికుల ధార్మికతవృద్ధియైనవి. వారి జీవితమంతయు యోగమయమై, లోకముకై ఉపయోగపడినది. మత ములో ఈశ్వరభక్తికే ముఖ్యస్థానము. మానవులు కించిజ్ఞులు, అల్ప శక్తియుతులు; మనమహాదర్శము లెట్లు సాధ్యమో మనకు తెలియుట కష్టము. మనయత్నమధ్యమందు మార్గమంధకారమయము కావచ్చు. అట్టిస్థితిలో భగవంతునందే భారముంచి, ఈశ్వరుడు మనహృదయంలో తోపించుప్రకారం నడుచుకోవలెను. గాంధిమహాత్ముని యీ అంతర్వాణి చోదనసిద్ధాంతముప్రపత్తిసూత్రమువంటిదే. అట్టిచోదనము ఉత్తమభక్తు లై అహింసాసత్యయుతులైన పరిశుద్ధహృదయులకే తప్పక గల్గును; సర్వ జగన్నియామకుడగు ఏకేశ్వరుడే సకలజీవాధారుడనియు, మాధవసేవకు మానవసేవయే క్రియారూపమనియు, అహింసాసత్యరూపమగు ధర్మమే లోకాధారమనియు దృఢవిశ్వాసముగలవారే ఆస్తికులు. దేశకాల పాత్రానుసారముగ ఒక్కొకమతములో నొకొక్కదానికి ప్రాముఖ్యము వచ్చినది. అరేబియాలో మహమ్మదునాటికక్కడి 'బెడొయినుల'లో రాయిరప్పలపూజ మధ్యపానము హెచ్చి, వాటివల్ల జనులు మూఢులై కలహపరులైయుండిరి; కనుక ఏకేశ్వరత్వముకు విగ్రహవినాశముకు, సత్య మతస్థుల భ్రాతృభావముకును ప్రాముఖ్యమిచ్చిరి. పాశ్చాత్యదేశను ధార్మికతయేలేని జనులమధ్య జనించిన క్రైస్తవమతములో జనులకు మనస్సు సులభముగ లగ్నమగుటకు క్రీస్తు యీశ్వరపుత్రుడని ఆయనను నమ్మితే మోక్షము గల్గునని చెప్పబడినది. హిందూదేశప్రజలకు వ్యవసా యము పానీయములకు గోవు గోక్షీరమును చాల ముఖ్యములు. కనుక హిందువులు తమసంస్కృతిలో గోజాతికంతకు ఉన్నతస్థానమిచ్చినారు బుద్ధడవతరించునాటికి విద్యావంతులు దార్శనికచర్చలుయజ్ఞయాగముల

† ధర్మాదర్థశ్చ కామశ్చ, సధర్మః కింన సేవ్యతే. (మ. భా.)

కర్మ కాండయు ప్రబలినవి. చంటిపిల్ల తల్లిని వెక్కిరించినట్లు నకులీశ్వరుని స్వరూపస్వభావములలో లోపము లెన్నుచుండిరి. తాత్త్వికవిభేదములు హెచ్చినవి. సామాన్యులలో మూర్ఖత జంతుబలి వగైరా మూఢాచారములు అవినీతియు ప్రబలినవి; కనుక, బుద్ధుడు తాత్త్వికచర్చవద్దని, అహింసకు, నీతికి, సత్ప్రవర్తనకు, ప్రాముఖ్యమిచ్చెను. తరువాత శంకర రామానుజ, రామానంద, నానకు, రామమోహనాదులు దేశకాలోచితముగ లోకక్షేమముకై ఆయాసిద్ధాంతములకు ప్రత్యేకతనిచ్చియున్నారని గమనించియున్నాము.

ఇట్లు ప్రతిప్రవక్త బోధించు మతముకు కొంత ప్రత్యేకమగు వ్యక్తిత్వము సంప్రదాయమునున్నవి; కాని ధార్మికత అనేది సర్వమతసారము. ఈసంగతిని గమనింపక ఆయామతములవారు తమప్రత్యేకతకే ప్రాముఖ్యమిచ్చి అన్యమతీయులను నిరసించుచున్నారు. పరస్పరప్రేమకు విశ్వకల్యాణముకు సమీకరణముకు యత్నింపక, ఆయా మతప్రచారకులు పోషకులు మతరక్షణకనియే కలహించుట విచిత్రము. ఆయాసంఘముల ముఖ్యమతములన్నిటికి హిందూమతమే తల్లిమతమనవచ్చును. మఱియు ఇప్పుడాముఖ్యమతములకు కూడలియు పవిత్రభారతదేశములో నున్నది. మతకలహములవల్ల రాజకీయముగనేగాక ఆర్థికసాంఘికధార్మికములందును దేశము మోక్షమునొందజాలకున్నది. ఇట్టిమతకలహములకు కారణములు విచిత్రములు. నిజమైనధార్మికతయున్నప్పుడే అహింసాతత్త్వము వ్యాపించి స్థిరముగ నిల్చును. ధార్మికతలో ముఖ్యమీశ్వరభక్తి. అన్నిమతముల వారునుబయటికిభక్తిప్రదర్శన చేయుచున్నారు; దేవాలయములకు పోవుచున్నారు; ప్రార్థనలు భజనలు జరిగించుచున్నారు; భక్తిపరత యున్నట్లు వేర్వేరు వేషభాషలద్వారాను కర్మకాండలద్వారాను ప్రదర్శించుచున్నారు. స్వమతములోని కితరులనెట్లైనచేర్చిస్వమతస్థులసంఖ్య హెచ్చించుటకు కొన్నిమతముల వారు యత్నించుచు, కొందరాసందర్భమున అన్యాయపద్ధతులు నవలంబించుచు, ఇతరమతస్థుల ద్వేషించుచున్నారు. నిజమైన భక్తి

లేకున్నది. యథార్థముకు ప్రసిద్ధమతములన్నియు మంచివే. ఏమత ములోనున్నను ధార్మికజీవికి మోక్షముగల్గును. కాని, క్రియలో ధార్మికత కుబదులు అధార్మికతయే హెచ్చుచున్నది భగవంతునిభజించి,ఆయన సృష్టిని ప్రేమించి, దానివృద్ధికై యత్నించుటే మతోద్దేశము. కాని, ఇట్లు విశ్వ ప్రేమకు దాక్షిణ్యముకు వర్ధకము కావలసిన మతమును చాలమంది దురుపయోగం చేయుచున్నారని ఒప్పుకోకతప్పదు. మధ్యయుగపు యూరపు క్రైస్తవులలో కాతలికులకు ప్రొటస్టంటులకు ఘోరసంఘర్షము జరిగినది; రాజులు మతాచార్యులును క్రూరులై లక్షలకొలది జనుల 'ధార్మికహత్య'లకు కారకులైనారు తరువాత 'క్రైస్తవ'రాజులు ముస్లింరాజులపైన సాగించిన క్రూసేడు (మతయుద్ధము)లలోను లక్షలకొలది హతులైరి; వాటితో పోల్చితే మనదేశంలో పూర్వం మతవిషయంలో మంచిసహనభావముండెను;కాని, ఇప్పుడెట్లున్నది? పూర్వపుమతయుద్ధములకు వెగటుజెంది, యూరపియనులు దరిమిలాను మతకలహములు వదలినారు. ఇప్పుడు మతకారణములకని పాశ్చాత్యులు కలహించుపద్ధతి లేదు. ఇప్పుడు జరుగుయుద్ధాలకు ఆర్థికములు రాజకీయములునే కారణములు. ఉభయ పక్షములును ముఖ్యంగా క్రైస్తవరాజ్యములే. పైపెచ్చు పాశ్చాత్యులిప్పుడు మతసంస్థలనుగూడ తమ ఆర్థికరాజకీయప్రాబల్యములకు వినియోగించుచున్నారు. ప్రభుత్వమును పుంజీపతులును చాల ద్రవ్యమును క్రైస్తవపీఠములకుమతప్రచారకులకు నిచ్చుచున్నారు. ఇందుకుప్రతిఫలము; ఆయామతాధిపులు చర్చీలలో సామ్రాజ్యజయముకు ప్రార్థనలజేయించుచు, జనులలో రాజభక్తిని నెలకొల్పుచు, పారిశ్రామికసంస్కృతిని స్తుతించుచు, ప్రభుత్వమునకు ధనాఢ్యవర్గముకు తోడగుచున్నారు. మరియు ఖండాంతరములకువచ్చు మిషనరీలు యితరదేశీయులను నాగరికులుగను ధార్మికులుగను చేసితిమనుచున్నారు.

ఇప్పుడు శ్వేతజాతుల ప్రాబల్యముతో బాటు క్రైస్తవమత ప్రచారము లోకమంతటను వ్యాపించియున్నది; అందువల్ల లోకులలో

నిజమైన ధార్మికతమాత్రం కలుగలేదు; ఆఫ్రికా ఆస్ట్రేలియావగైరాల లోని అసలు దేశీయులాటవికులు; వారికి 'నవనాగరికత'ను వారునేర్పిన సంగతినిజమే. అందువల్ల కొందరు వృద్ధియగుటకుబదులు రోగులై క్షీణించిరి. లోగడచెప్పిన ధార్మికాశయాలను క్రైస్తవప్రచారకులే యాదరింపనప్పుడు కొత్తగా మతస్థులగువారి కవియెట్లబ్బుతురు? ఆ యాదిమజనులలో త్రాగుడు, అవినీతి, పిరికితనము, న్యూనభావము, పరాధీనత, వృత్తిహీనత వెనుకటికన్న హెచ్చినవి

ఇక, ప్రాచీనధార్మికతగల మనచీనాభారతములలో విషనుల ప్రచారపు ఫలితము మనకనుభవమే. వారిక్కడ ఆంగ్లపాఠశాలలు వైద్యశాలలు స్థాపించినారు; అందువల్ల కొందరికి విద్యచికిత్సలభించినవి. కాని, ఈమిషనుసంస్థల ప్రవృత్తియు మతప్రచారకుల ధోరణియు తరుచు ధార్మికముగలేవు. వారు అహింసాసత్యధార్మిక సూత్రములకు బదులు హిందూమతదూషణకు క్రీస్తుభక్తిని నమ్మిన మోక్షముగల్గుననుసిద్ధాంతమునకునే ప్రాముఖ్యమిచ్చినారు. మరియు, ఈమిషనులు సామ్రాజ్యపాలన వచ్చినమీదట, జనులలో త్రాగుడు, నల్లమందు, పిరికిదనము, పరస్పర కలహము, వృత్తిహీనతయు ప్రాచ్యదేశాలలో హెచ్చినవని కొందరు గొప్ప చారిత్రకుల అభిప్రాయము; విదేశవస్తువులకు పాశ్చాత్య సాంఘికపద్ధతులకు నిక్కడ ప్రచారము పెరిగినది. మరియు, 'బ్రిటిషుసామ్రాజ్యము అమెరికను సంస్కృతి ఆదరణీయములు, అవిమనకు క్షేమకరములు',అని పాశ్చాత్యమిషనరీలు బోధించుచు, ప్రాచ్యసంస్కృతిని నిరసించుటయు, మనస్వాతంత్ర్యోద్యమమును ప్రతిఘటించుటయు, కలదు. ఇట్లు పాశ్చాత్యుల సామ్రాజ్యతత్వము తన 'ధార్మికశాఖ'యగు మతసంస్థలును బలపర్చుటకు మనఆర్థిక, రాజకీయ పరాధీనతకు తోడ్పడుచున్నవి. ఏసుక్రీస్తు ఈనాడు అవతరించి తనమతబోధచేసేయెడల క్రైస్తవాధికారులాయనను వెంటనే అరెస్టుచేసి, నిర్దయముగ జెయిలులోనుంతురని ఒక మహనీయుడన్నాడు. క్రైస్తవమతసంస్థలు జనసామాన్యపునీతిని మన

స్వాతంత్ర్యమును ఐక్యమును క్షీణింపజేసినవని, ఆమతబోధ నల్లమందువలె మాంద్యజనకమైనదని యెంచి, సవ్యరష్యాలో మతప్రచారకుల ప్రాబల్యమును తొలగించినారు. మనదేశంలో నేటికిని ప్రజలలో హెచ్చు మంది హిందువులు ముస్లిములు. వారి మతసంస్థలకు సర్కారుసాయము లేదు. అయితే, ప్రభుత్వము బ్రిటిషువారిది, వారుసాలీనా కొన్ని క్రైస్తవ పీఠములకు సొమ్మిచ్చి పోషింతురు, ఇట్లు పాశ్చాత్యుల ధార్మిక సంస్థలును దురుపయోగ పడుచున్నవి. పరిశుద్ధమైన క్రైస్తవధార్మికత కీ. శే. ఆండ్రూసుగారు ఫాదర్ ఎల్విన వంటివారి ద్వారా ద్యోతితమైనది, అట్టిమహనీయులకు లోకులందరు కృతజ్ఞులు కావలె. ఇందువల్ల క్రైస్తవమతపు అసలుసిద్ధాంతములలోను వ్యక్తులలోను లోపములేదనియు వ్యక్తమైనది. నిజముకు ఏమతస్థుడైనను ధార్మికపరుడైతే నిశ్రేయసముకల్గును; మతముమార్పించుట అనవసరము. అన్నిమతముల ముఖ్య సిద్ధాంతము లొకేరీతివిగదా!

ఇక్కడ మనలోను ప్రేమభావముకు దాక్షిణ్యముకు ఆంతరిక భక్తికిబదులు బాహ్యాడంబరపు వేషము సంప్రదాయమునే 'సనాతనధర్మమను వాద మేర్పడినది, ఈస్థితిలో ప్రస్తుతం, ప్రతివిషయములోను ధార్మికవిషయాలకు ప్రాముఖ్యమిచ్చుటవల్ల సాంఘికసంఘర్షముకల్గి జాతీయోన్నతికిని హానికల్గుచున్నదని, కనుక మతదృక్పథముతొలగుటే మేలని, ధార్మికతత్త్వమువల్ల హానియే కల్గుచున్నదని, చాలమంది అసలు మతాచరణనుమానినారు. కొందరు ప్రజాక్షేమపరులగు ధీమంతులును నాస్తికులైనారు. ఈమతసంస్థలందేగాక నీటిబోధకు మూలాధరమనే ఈశ్వర నియామకతగూర్చియు, ఈశ్వరుడున్నాడను విషయంలోను నమ్మిక పోయినది. ముఖ్యముగ, ఆధునిక వైజ్ఞానికులు మొదట నిట్లే యభిప్రాయపడినారు. 19 వ శతాబ్దిలో జరిగిన భౌతికపరిశోధనలవల్ల ప్రపంచమంతయు కేవలం భౌతికమని, ప్రకృతిశక్తులవల్లనే స్వాభావికముగ విశ్వమేర్పడి అది నియమహీనంగా మారుచున్నదనియు, సృష్టికర్తయే లేనట్లుతోచుననియు,

వైజ్ఞానికులు భావించిరి. కాని తరువాత, ఇటీవలి పరిశోధనలవల్ల, క్రొత్త దృక్పథ మేర్పడినది. అద్భుతమగు క్రొత్తదుర్భిణులు సూక్ష్మదర్శినులు వగైరాలతో పరీక్షించగా, సూర్యాదిగోళములు మన భూమికన్న లక్షలకొలది రెట్లుపెద్దవి, మహావేగముతో చరించునవి, ఇట్టి మహా తేజో బింబములు లక్షలకొలది మన బ్రహ్మాండము (Galaxy) లో నున్నవి, ఇట్టి బ్రహ్మాండము లింక నెన్నిరో ఉన్నట్లుదుర్భిణులు చూపు చున్నవి, వీటికిని గోచరముగాని వింకను కలవు,ఇవియన్నియు ఏదోమహా శక్తిచే నియమితము లైనవి; అమితవేగముతో ఈమహావిశ్వము అన్నివై పులను వ్యాపించు చున్నది, నిరంతర పరిణామము పొందుచున్నది; ముఖ్యగోళాలలోగల శక్తి తేజస్సు ప్రచండములు. ఇట్లే పరమాణువు నిర్మాణము అతివిచిత్రమైనది. వీటిని సంఘటనచేసి నియమించి శక్తినిచ్చు మహాతేజమున్నదని, ఇదియంతయు ఉద్దేశపూర్వకమనియు, భౌతికలోక మును నిజంగా జ్ఞానప్రధానమే యనియు, ఎడింగ్టను, జీన్సు, ఈన్స్టైను, థాంప్సను, బోసు మొదలగు లోకవిఖ్యాతులగు వైజ్ఞానికు లిటీవల కనిపెట్టినారు. ఈమహాగోళములే నక్షత్రము లనుచున్నాము. వీటిలో మనకతి సమీపమైనవియు అర్బుదములకొలది మైళ్ళదూరమందున్నవి. కనుక, ఆనక్షత్ర కాంతిమనదృష్టికెంతో చిన్నదిగతోచును; కొన్నిటికాంతి మనభూమిని చేరుటకు అతిదూరమువలన కోట్లకొలది యేండ్లుపట్టునట. (కాంతికిరణములు క్షణముకు 186000 మైళ్ళచొప్పున పోవును.)

ఈవిశ్వగోళములన్నిటిని ఏదోమహాశక్తిగంటకు వేలకొలది మైళ్ళ చొప్పున మహావేగముతో నియమితమార్గములోనుంచి, సంఘర్షములే కుండతిప్పుచున్నది. చంద్రుడు భూమిచుట్టు, భూమ్యాదిగ్రహములు మనసూర్యునిచుట్టు, సూర్యుడు మరికొన్ని నక్షత్రములుసహా బ్రహ్మాండ ములో (తామాకాశములో దార్లుచునే) పరస్పరం ఎట్టిసంఘర్షమును లేకుండ ధ్రువతారచుట్టును, విపరీతవేగముతో పరుగెత్తుచున్నవి.*

---

* లోకములు అసంఖ్యాకములని కొన్నిపురాణములును చెప్పుచున్నవి. సంఖ్యా చేద్రజసామస్తి, విశ్వానాం నకదాచన (దేవీభాగవతం (9-3-7)

ఈ బ్రహ్మాండమును స్థిరము కాక ఎక్కడికో సంచరించుచున్న ట్లున్నది. ఆవివరములు గ్రహించు యంత్రములింకను ఏర్పడలేదు. ఆకాశము, కాలము, పదార్థములనేవి, అనంతములై, పారస్పరికము (Relative) గ నున్నవి. వాటి నన్నిటిని మహాశక్తి సర్వవ్యాప్తియై సను అప్రమేయముగ నున్నది. ఇంతటి మహావిశ్వపు 'ఖాళీ' స్థలముల లోను అణుపదార్థములు దృష్టికందక వ్యాపించియే యున్నవి.

ఇటీవల గొప్ప వైజ్ఞానికులు గొప్పసూక్ష్మదర్శని యంత్రములను సూక్ష్మాణువులగూడ భేదించు వైద్యుతాదిశక్తులను కనిపెట్టినారు. ఇంత వరకు అవిశ్లేష్యము లనుకొన్న 'పరమాణువు'లను వీటితో బాగుగ పరీక్షించినారు. అంతట, 'ప్రతి పరమాణువులోను అతిసూక్ష్మమై అగ్రాహ్యమగు వస్తువులుండుచు, అవి అతివేగముతో తిరుగుచు పరస్పరాకర్షణతో నిబద్ధమైయున్నవి, ఇట్లు అతిసూక్ష్మమనబడు పరమాణువను నియమితమైన గ్రహకుటుంబమువంటిది, మరియు ఈసూక్ష్మతమ పదార్థము భౌతికము కాక జ్ఞానరూపమగు శక్తిపుంజమె; వీటినన్నిటిని సమన్వయించి పరమాణువుగ చేయుశక్తియు అస్ఫుటము' అని తేలినది. పరమాణువులోని యీ శక్తిపుంజముల విడిపించి పట్టుటకు వైజ్ఞానికులు లక్షలకొలది యూనిట్ల భౌతికశక్తి నుపయోగించినను సాధ్యమగుటలేదు. ఇట్లు పరమాణుభాగములను బ్రహ్మాండములనుగూడ బంధించియుంచు మహాతేజశ్శక్తి యెట్టిదో! అది అణోరణీయాన్ మహతోమహీయాన్ అని విశ్వాత్మకమని, మన అందరిహృదయములందునుండి జీవులప్రవర్తనను నియమించుచున్నట్లును, మనశాస్త్రజ్ఞులకు ఆధ్యాత్మికశోధకులకు నిదర్శనము దొరికినవి మరియు పరమాణువులు ఘనీభవించిన చేతనశక్తిపుంజములే కనుక ఈవిశ్వము అసలు జ్ఞానశక్తియే; అది ప్రకృతిగ పరిణమించి భౌతికరూపములో నున్నదనుట సవ్యముగ నున్నది. ఈ జ్ఞానప్రపంచమును నైతికసూత్రములగు ప్రేమసత్యములమీదనే వర్ధిల్లుచున్న

దనియు చూచియున్నాము. కనుక విశ్వమంతయు జ్ఞాననీతిప్రధానమే కాని భౌతిక ప్రధానము కాదని తేలినది.

హిందూ ముస్లిములమధ్య అప్పుడప్పుడు జరుగు 'ధార్మికకలహములకు' చెప్పేకారణములు యథార్థంగా ధార్మికములు కావని యిదివరలో చూచియున్నాము. ఈకలహాకులు నిజంగాధార్మికులు కారు. ముస్లిములుబక్రీదులలో గోవధ చేసినప్పుడు, మసీదులయెదుట వాద్యము వాయించినప్పుడు కొట్లాటలు హత్యలుగూడ అక్కడక్కడ జరుగుసంగతి నిజమే. వాటిని ధార్మికకలహములనుట పరిపాటియైనది. కాని, ఇందుకు స్వార్థపరులగు సామాన్యుల మూర్ఖత అజ్ఞానము నే కారణములు.

మనదేశపు సాగుపాలు వగైరా నిత్యజీవితపు అవసరములకు గోజాతి అవసరము. కనుక హిందూస్మృతికర్తలు గోపురక్షణ నొకవిధిగ జేసినారు. ఇదినిజంగా మతవిషయముకాక, ఆర్థికవిషయము. కాని, ధార్మికదృక్పథంవల్ల హెచ్చుశ్రద్ధగల్గును; అహింసామూర్తులగు గోపురక్షణ ధార్మికవిధియన్నారు. ఆరేబియాఅంతటనుఇసుక నేలవల్లవ్యవసాయాదులు లేవు; అక్కడగోప్రశంస లేకుండుటసహజము. కాని, ఇక్కడిము స్లిములకును సాగుకు పాలకు గోజాతి క్షేమకరము, కనుక, ముస్లిములును గోవు నాదరించి రక్షింపవలెను. మఱియు గోవధ ముస్లింమతమున కవసరమును కాదు. హిందువులును ఇదియొక కలహకారణముగ నెంచుట యనవసరమని ఇట్లే మసీదులయెదుట వాద్యము వగైరాలవిషయములు కలహకారణములగుటయు కేవలం అనవసరమే.

హిందూమతనాయకులు ముస్లింమతనాయకులుగూడ నిజమైన మతసూత్రములకు ప్రాముఖ్యమిచ్చుటమాని, బాహ్యములగు వేషభాషలకు లౌకికవిషయములకు ప్రాముఖ్యమిచ్చుట విచారకరము. సనాతన ధర్మము స్థిరసూత్రములుగల్గి సర్వకాలములకు వర్తించుమతము. దాని ముఖ్యసూత్రములు అహింసాసత్య శౌచాదులని చూచియున్నాము. వాటికిబదులు ఇప్పటి మతసంస్థలు 'సనాతనులు'ను కట్టు బొట్టు, జుట్టు,

యాత్రలు, కులకక్షలు, విభేదములు, సాంఘికబహిష్కారములునే, మతాచరణగ నెంచుచున్నారు; ఇవియన్నియు కాలోచితముగ మారవలసినవి. నీరునిలవయైనప్పుడు నాచుచేరి వాసనకొట్టును; ప్రవాహమేపరిశుద్ధికరము. విశాలబుద్ధితోను, సమదృష్టితోను సాంఘికవిషయములు సరుదుకొని భూతదయగల్గువారికే పవిత్రతయేయుండునని యు సూక్తి *

దేవాలయాల ధర్మకర్తలును, మనమతాధిపులును, స్వాములవారును తాము గ్రహించు విశేషద్రవ్యమును ఆస్తులను ధార్మికప్రచారమకు సామాన్యజనుల క్షేమముకును వినియోగించినప్పుడేధార్మికతయేర్పడును. అంతకు వారిలో మనఃపరిణామము ఔదార్యమును కావలెను. ఇట్లే 'వర్ణాశ్రమధర్మ సంఘము'లు 'సనాతనధర్మరక్షణసభలు' హిందూమతసూత్రములగు భక్తిసదాచరణ అహింసాసంస్థ, పరిశుద్ధిపీటికి ప్రాముఖ్యమీయవలెను. వారీరీతిగపామరులనుద్ధరింపవలె. ఇట్లుశుద్ధికి హిందూసంఘటనకు తమశక్తిని వినియోగించవలెను. అన్నికులముల వారును స్వంతలాభపు దృష్టిమాని, సంఘమంతటి క్షేమమునే సాధింప యత్నింపవలె. అప్పుడే హిందూసంఘమును మనమతమును నిజంగాబలపడును.

స్మృతులలో చెప్పినరీతినయితే జీవితంలో ¼ వంతు బ్రహ్మచర్యము, ¼ గృహస్థతయుకాగా మిగతాసగంజీవితమునువానప్రస్థుడుసన్యాసిగనుండవలె; మనజీవితము నూరేండ్లనుకొన్నను 50 ఏండ్లకు వానప్రస్థత యారంభించవలె. కనుక 50 ఏండ్లు వయస్సుమీరినవారందరును† వానప్రస్థులై స్వగృహములువదలి, కుటుంబసంబంధము లేకుండ, సంఘసేవాతత్పరులు కావలె ఇక వర్ణవిషయము; బ్రాహ్మణ క్షత్రియులు లోకరక్షణకు

---

* రుద్రాక్షం తులసీ కాష్టం, త్రిపుండ్రం భస్మధారణం
యాత్రాస్నానానిహోమశ్చ, జపోవా దేవదర్శనం
నైతేపునంతి మనుజం, యథాభూతహితే రతిః.

† వానప్రస్థవిధిః పుత్రేషు దారాన్ నిక్షిప్య వనం గచ్ఛేత్ సహైవవా (మను 6-3)
సన్యాసమయః చతుర్థమాయుషోభాగంత్యక్త్వా సంగాన్ పరివ్రజేత్. (,, 33)

వైశ్యుడు సంపదభివృద్ధికి శూద్రులు సేవకు ముఖ్యంగా కృషిచేయవలె. కాని, ఇప్పుడందరును ద్రవ్యలాభముకు ఉద్యోగసేవావృత్తికిని సిద్ధమైనాము. ఉదారులై అందరును లోకక్షేమముకే తమశక్తిని ద్రవ్యమును వినియోగింపవలె. ఇట్లుమనమెంతవరకు చేయుచున్నామో ప్రతివారునుఆత్మ పరీక్ష చేసుకోవలె. పూర్వపుమహర్షులట్లులోకముకుతమజీవితమర్పించి, రాగద్వేషములువదలి అహింసాపరులై నందువల్లనే అమృతత్వమొందిరి.† ఏగాంధిమహాత్మునివంటి కొద్దిమందియో తప్ప ఇప్పుడు మనమట్లు వర్ణాశ్రమధర్మ మాచరించుటలేదని, ఆత్మపరిశోధన చేయు అందరికిని స్పష్టము. బ్రాహ్మణాదులకు స్మృతిలోచెప్పిన వృత్తులను ఆశ్రమములను అమలులో సరిగ పెట్టగల్గువారు ప్రశంసార్హులే. కాని, అట్లుజరుగుటలేదు.

ఇప్పటి బ్రాహ్మణులలోను స్మృతులలో చెప్పినట్లు బ్రహ్మచర్యం సాగించువారు అరుదు; 24 ఏండ్లవరకు వివాహమాడనివారిసంఖ్యయు తక్కువ. గృహస్థతమాత్రం దాదాపు అందరును అవలంబించుచున్నారు. అందులోను శాస్త్రవిహితమగు బాధ్యతలుజరుపుట ఈకాలంలో తగ్గిపోయినది. పూర్వమెందరో బ్రహ్మచారులుగనేయుండి, లోకసేవాపరులై ముక్తులైనారు. సంతానము కనకపోతే మహానరకము సంభవించునని చెప్పి, అర్హునికి అనర్హునికిగూడ పెండ్లిజేయు రివాజు ఏర్పడినది; అదిసరికాదనిశాస్త్రనిదర్శనమున్నది. మరియు, కొందరుపిల్లలున్నవారును వృద్ధులైనవారును గృహస్థతనిల్పుటకనిమరలపెండ్లియాడుదురు; ఇట్లుమనవారిప్పుడు గృహస్థతహక్కులకు ప్రాముఖ్యమిచ్చి, తక్కినఆశ్రమాలు వదలినారు. గృహస్థబాధ్యతలు నిర్వర్తించుటకన్నివిధములను అర్హతగల్గినప్పుడే ఆంగ్లేయులు వివాహమాడుట మామూలు. పాశ్చాత్యులలోనెందరో విజ్ఞానసేవకులై దేశసేవకునుస్త్రీలుపురుషులును కుటుంబసౌఖ్యం మాని, తమ ఉన్నతాశయములు నెరవేర్చుటకు జీవితమంతను అర్పించి

† ఇంద్రియాణాం నిరోధేన రాగద్వేషక్షయేణ చ
అహింసయా చ భూతానా మమృతత్వాయ కల్పతే (మను 6-60)

ధన్యులై శాశ్వతకీర్తి గాంచినారు. అట్టివారు మనదేశీయులలో శ్రీ ప్రఫుల్లచంద్రరాయివంటివారు చాల అరుదుగనున్నారు.

ఇక వర్ణములసంగతి; ఆయావర్ణములకు విధించినవృత్తులప్రకారం ఇప్పుడు జరుగుటలేదు. అన్నికులములవారు తమకు ఆకర్షకంగాను అందుబాటుగాను ఉండే అన్నివిధాల వృత్తులకు సిద్ధపడుచున్నారు. వ్యవసాయంచేయు బ్రాహ్మణులున్నట్లే ఉపాధ్యాయులగు శూద్రులున్నారు. 'ధార్మికంగా అహింసాయుతంగా జీవింపవలెను; తప్పనియెడల హింసాజీవనం చేయుదురుగాక, కాని ఏసందర్భంలోను స్వవృత్తి (నౌకరీ)కి సిద్ధపడకూడదు' అని స్మృతికారు లన్నారు.† కాని, ఇప్పుడన్నికులాల 'ధార్మికులు' వారును సర్కారునౌకరీకి కంపెనీలలో సేవావృత్తికిని పోటీపడి సిద్ధపడుట విచారకరము. ఏకులపువారైనను యోగ్యులు లోకక్షేమపరులునే ఉత్తములు.

ధర్మతత్వముగూర్చియు ముఖ్యమతముల ప్రధానసూత్రముల గూర్చియు లోగడ చర్చించియున్నాము. అహింసాసత్యాస్తేయశౌచనిగ్రహములే ధర్మసారము* ఆచరణలో ధార్మికతలోని కొన్ని ముఖ్యాంశము లిక్కడ గమనింతము.

'ఈశ్వరభక్తి, ప్రపత్తి, సర్వజనులకు అంతర్యామియగు భగవంతునందు విశ్వాసముంచుట, జగన్నియామకుడగు ఈశ్వరునిసంకల్పమును నెరవేర్చుచు, ఈశ్వరప్రీతికే కార్యములజేయుట, సకలజనక్షేమము' లోకసంగ్రహము, జీవరక్షణయును, ఆసురతత్వముకు బదులు దైవిప్రకృతిని వృద్ధిచేయుటయు, ఈశ్వరుని కిష్టములు 2 స్థితప్రజ్ఞతఅనగా నిగ్రహము

† అనేకాని సహస్రాణి కుమార బ్రహ్మచారిణాం
దివంగతాని విప్రాణాం అకృత్వా కిలసంతతిం (మను 5-159)
ఋతా మృతాభ్యాం జీవేత మృతేన ప్రమృతేనచ
సత్యానృతాభ్యామపివా నశ్వవృత్యా కదాచన. (మను 4-4)
* అహింసాసత్యం, అస్తేయం, శౌచ, మింద్రియనిగ్రహః
ఏతం సామాసికం ధర్మం చాతుర్వర్ణ్యే బ్రవీన్మనుః (మనుస్మృతి)

సర్వసమత్వము కి అరి షడ్వర్గములను జయించి, తద్ద్వారా ఆత్మాను భవమొందుట; అనగా (కామము=ఇంద్రియలోలత) క్రోధము(=హింసా బుద్ధి), లోభము (=అధికద్రవ్యాపేక్ష, పరద్రవ్యాశ) మోహము (అజ్ఞానము, మూర్ఖత) మదము (=మత్తత, తామసత్వము, సాహంకారత), మాత్సర్యము (=ద్వేషాసూయలు) వీటిని నిరసించి యమ నియమాసన ప్రాణాయమాదులద్వారాను జ్ఞాన కర్మ భక్తులద్వారాను యోగివై, ఆత్మలోని ఆనందస్వరూపమును గ్రహించుట, అన్నిమతముల సిద్ధాంతాలను పరిశీలించగా భూతదయ అహింసాసత్యములును నిశ్శ్రేయసమునకు సాధనములని తెలుసు.* వేదస్మృతి పురాణాదులును బౌద్ధత్రిపిటకములును జండవస్తా బైబిలు కొరానుగూడ అహింసాసత్యముల కేముఖ్యమిచ్చినవని లోగడ చూచినాము. మోక్షసాధనకు కొందరు ఆత్మశోషణమును వేదపఠనమును, షడంగాధ్యయనమును బాహ్యవేషాలు భజనలు తర్కచర్చలు వినియోగింతురు. కాని అంతశ్శుద్ధి మంచికార్యాచరణ, దయాపూరితమగు ప్రవర్తన లోకక్షేమ పరతయునే కావలసినవి† మరియు రాజకీయ మోక్షమునకును అంతశ్శుద్ధిభక్తిగల్గి పరిశుద్ధములు అహింసా సత్యాన్వితములనగు ప్రణాళికను సాధనములను ఉపయోగింపవలెను‡ అందువల్ల ఎవరికిని హానిలేకుండబోవును; ప్రజాభిప్రాయము సుముఖమగును! మనస్ఫూర్తిగ మనము చేసినప్పుడు కార్యమును సమకూడును;

గాంధిమహాత్ముడు జన్మచే వైశ్యుడు; కాని అన్నిమతముల సూత్రములు గ్రహించి నిజమైన జ్ఞానము ధార్మికతను గల్గి, వాటి

---

* ఏవంతుపండితైర్జ్ఞాత్వా సర్వభూతమయం హరిం
క్రియతే సర్వభూతేషు భక్తి రవ్యభిచారిణీ. (విష్ణుపురాణం)

† ఆచారహీనం నపునంతి వేదాః యద్యప్యధీతాః సహషడ్భిరంగైః
ఛందాంస్యేనం మృత్యుకాలే త్యజంతి నీడం శకుంతా ఇవ జాతపక్షాః.
(వసిష్ఠస్మృతి)

‡ పఠకాః పాఠకాశ్చైవ యేచాన్యే శాస్త్రచింతకాః
సర్వేవ్యసనినో మూర్ఖాః యః క్రియావాన్ సపండితః (మ. భా. 3-314)

నాచరించి ఇతరులకు బోధించుచున్నాడు, సంఘ మంతటిక్షేమముకే యత్నించుచున్నాడు. ఆ ప్రకారం జరుప లేకపోయినను, స్మృతికర్తల భావము గ్రహించి సంఘ క్షేమమే కర్తవ్యమనుదృష్టితో ప్రతివారును జ్ఞాన, రక్షణ, కృషి, సేవాకార్యములను యథాశక్తిగ కొంతవరకైనను చేసినయెడల, ప్రస్తుతకాలముకు పరిస్థితికితగినట్లు, స్మృతికర్తల యుద్దేశమును నెరవేర్చినప్పుడునే సనాతనధర్మపరులము కాగలము.

మనపూర్వులు వ్యక్తులకై కాక ప్రజలందరికై చేయుదానమును గూడ గొప్పధర్మముగ భావించినారు. వాటిలో రెండువిధము లున్నవి. †ఇష్టములు, పూర్తములు; ఈ రెంటిని శ్రద్ధతో చేయుమని శాస్త్రవిధి. వీటిలో 'ఇష్టము'వల్ల స్వర్గము, 'పూర్తము'వల్ల మోక్షము కల్గునన్నారు‡ కనుక పూర్తమే ఉత్కృష్టమన్నమాట. యజ్ఞసంబంధముగ చేయునవి ఇష్టములు. ఇక పూర్తములు చెరువులు, బావులు త్రవ్వించుట, సత్రము లేర్పర్చుట, దేవాలయనిర్మాణము, రోగులకు వైద్యచికిత్స, ఇత్యాదులు.* ఇట్లు ప్రజలందరి సుఖజీవనము కుపయోగించు నిర్మాణముల జేయుట, వాటిని స్థిరముగ సాగింపజేయుటయు ధర్మములలో భాగము, ధార్మికతకు లక్షణము, అని స్మృతికారుల భావము.

ఇట్లన్నివిషయములను పరిశీలించగా ఆధ్యాత్మికంగాను, ఆభ్యుదయికంగాను లోకులందరిక్షేమమును కోరి అందులో తమ్మొకభాగముగ నెంచుకొని సంఘక్షేమముకై కృషిచేసి తద్వారా మోక్షము సాధింపబూనుటే నిజమగు ధార్మికతసారమని తేలినది. దానిని పరిశుద్ధముగ రక్షించుటకు కృషిచేయువలెను.

---

† శ్రద్ధయేష్టంచ పూర్తంచ నిత్యం కుర్యాతద తేంద్రితః॥ (మను 4-226)

‡ ఇష్టేనలభతేస్వర్గం, పూర్తే మోక్షం సమశ్నుతే॥ (విష్ణుపురాణం)

* వాపీకూప తటాగాది దేవతా యతనానిచ
అన్నప్రదాన మారామః, పూర్తమిత్యభిధీయతే॥ (అత్రిసంహిత.)
రోగిణాం పరిచర్యాచ పూర్తమిత్యభి నిర్దిశేత్. (హేమాద్రి దానఖండం.)

# 20. విద్యావిధానము.

జాతీయసంస్కృతికి విద్యావిధాన మొక ముఖ్యాధారము. కనుకనే, ఇప్పటికి నాగరికదేశాలన్నిటిలోను తమతమ సంస్కృతికి తగినట్లు బాలురందరికిని ఉచితవిద్యగరుపుదురు. ప్రాచీనహిందూ దేశమందు బ్రహ్మచర్యకాలమందు బాలురు విద్య నేర్చుకొనేవారు. శిల్పకళలుపరిశ్రమికజాతులపిల్లలకు బాల్యంనుండినేర్పి తమతమవృత్తులం దుత్సాహం కల్గించి వాటిలో ప్రజ్ఞ గల్గించేవారు ఈ కులవృత్తిపద్ధతివల్ల స్వగృహములో తల్లిదండ్రులే ప్రేమతో బాలురకు వృత్తివిద్య నేర్పుచుండిరి. ఇట్లు యువకులందరికి విద్యలోను శిల్పంలోను కౌశల ముండేది. ఉపాధ్యాయులగు బ్రాహ్మణులు (ద్రవ్యాశ చే కాక) తమ ధర్మము నెరవేర్చుటకు శిష్యులకు వేదశాస్త్రములు ఆయుర్వేదదర్శనాదులు నేర్పేవారు.

ఇప్పుడు నాగరికదేశాల సంస్కృతి యాంత్రికము; కనుక, విదేశాలలో పెద్దయంత్రములజేయుట వాటి నుపయోగించుట పారిశ్రామిక జ్ఞానముకు వ్యాపారపద్ధతులు నేర్పుచున్నారు, బాహ్యజ్ఞానమును విశేషముగ నేర్పుచున్నారు. అది ద్రవ్యమును భౌతికాధికారమును సంపాదించుటకును ప్రయాణాదులుచేసి ఇతరప్రాంతాలనుండి సొమ్ము రాబట్టుటకును పనికివచ్చును.

మనదేశపు ప్రస్తుత విద్యాపద్ధతి పైకి ఆకర్షకమై కొంతకాలము దేశముకు లాభకరమైనట్లు తోచినది. ఇట్లు నూరేండ్లు గడచినమీదట అందలి లోపములు తెలియుచున్నవి. దానిని సంస్కరించి క్రొత్తవిధానము పెట్టవలెనని చాలధీమంతు లంగీకరించినారు .(ఆంగ్లవిద్యావ్యామోహితులు కొందరు మాత్రం సంస్కరణను ప్రతిఘటించుచున్నారు.)

ఇప్పటివిధానములోని ముఖ్యలోపములు:—విద్య పామరులలో వ్యాపించకుండుట. ప్రతివానికిని ఉచితంగా ఆరంభవిద్యనైన నేర్పవలెను. ఇతర నాగరికదేశాలలో నూటికి సుమారు 95 మంది అనగా దాదాపు

ప్రజలెల్లరుపై )మరీవిద్య నభ్యసించిన వారే. ఆదేశాలన్నిటిలోను మాతృ భాషలోనే యావత్తువిద్యనేర్పుచు,మరొక భాషనుగూడ తప్పక నేర్పుదురు. మరియు పారిశ్రామికవిద్యకై మంచి సాంకేతికపాఠశాలలు (Technological Schools) వందలకొలదిగ నుందురు. మనదేశంలో సర్కారు ఆదాయంలో నుండి చాలతక్కువమొత్తంమాత్రం విద్యనిమిత్త మీయబడును. అందులోను కొంతభాగము విద్యాశాఖలో గొప్పజీతములు తీసుకొను ఉన్నతోద్యోగులకు పెద్దపెద్దభవనములకు "ఆఫీసర్ల" ప్రయాణపు ఖర్చులకును, ఆడంబరములకును ఖర్చగును.

అందువల్ల నిజంగా గ్రామజనులకు విద్యనేర్పుటకు తగుఏర్పాటులు లేవు. కొన్నిగ్రామాలలో అసలే బడులులేవు; కొన్నిగ్రామాలవి నామమాత్రములు. ఆయుపాధ్యాయులజీతములు. అతిస్వల్పములు. నూటికి 90 మందికిపైగా జనులు విద్యాగ్రంథమే తెలియనివారు. మనదేశీయులు బొత్తిగా బీదవారు. ఇప్పటిపద్ధతిని స్కూల్లు అన్నిగ్రామములకు పెట్టుటకు అవకాశము లేదు.

ఇప్పుడు బాలురకుచెప్పువిద్య చాలవరకు వారి దైనికజీవితంలో ఉపయోగించనిది, వారిసన్నివేశమును గ్రామజీవితమును సంబంధించనిది అందువల్ల బాలురకు వారిపోషకులకుగూడ ఆవిద్యయందు శ్రద్ధలేదు. సాధారణంగా బాలురను బలవంతంగా బడికిపంపించి వారిని తిట్టి కొట్టియు విద్యనేర్పుట జరుగుచున్నది. పుస్తకములలోనున్న అంశములను విశేషములను వల్లవేసి యొప్పజెప్పుటే చదువనిపించుకొన్నది. మరియు ఉన్నతవిద్యయంతయు ఆంగ్లములోనే చెప్పుటరివాజు. (ఇటీవల సెకండరీబడులలో కొంతమారినది ) చిన్నతనం నుండియు ఇంగ్లీషునేర్పి, అందులో ఉచ్చారణమొదలు గొప్పవాఙ్మయపాండిత్యంవరకు తప్పక బోధింతురు. ఆంగ్లముమనప్రాంతీయభాషలకు సంబంధించనిది,చాలక్లిష్టమైనది. అందులో మంచిప్రజ్ఞకొరకు బాలురెంతెంత కష్టమైన పడుచుందురు. యువకులధీశక్తి, ఆరోగ్యము, శరీరిగ ఉడిగిపోవుచున్నవి. వారు యంత్రే

ములవలె తయారై తరుచు నౌకరీలకే పనికివచ్చుచున్నారు. ఇట్టిలోపముల నన్నిటినితీర్చుటకు గాంధిమహాత్ముఁడు చక్కఁగ ఆలోచించి డా॥ జకీర్ హుస్సేను మొదలగు కొందరు విద్వాంసులసాయముతో ఒక విద్యాప్రణాళిక తయారుచేసినారు. ఇదే 'వార్ధా విద్యా విధాన' మనబడును. ఇందులో ముఖ్యవిషయములు 1. 'బాలురమనస్సుకు బాధగల్గకుండ రాటము మొదలగువస్తువులవాడుచు వాటి ప్రత్యక్షానుభవంద్వారా దైనికజీవితపు సంగతులద్వారానే విద్య నేర్పుట. వల్లింపజేసి మనస్సును పీడించు పద్ధతి యుండదు. 2. ప్రస్తుతపువిద్యవలె వట్టిసాహిత్యప్రధానముగ కాక, చేతిపరిశ్రమలను నేర్పుదురు. ముఖ్యంగా ఏకులు చేయుట, రాటముత్రిప్పుట, నూలుతీయుట, నేయుట, చక్కనిపనిముట్లు వస్తువులుచేయుట, అల్లిక, తేనెపట్టుట, గుడ్డపీలికలుతుక్కు వట్టిగడ్డి వగైరాలను ముద్దచేసి వాటినుండి కాగితములు తయారుచేయుట, ఇట్టి చేతిపరిశ్రమలు నేర్పుదురు. ఇందువల్ల కేవలం పుస్తకవిద్య తగ్గును. మనస్సుకు శ్రమపోవును. విద్యార్థులకు నేర్చుకొనుటకుత్సాహముగల్గును. మంచివస్తువులుస్వయంగా తయారుచేయు ఆసక్తియు నేర్పునుకల్గును. 3. విద్యార్థులు నూలు, కాగితములు ఇత్యాదులు చేయుటవల్లవారికితృప్తి ఆత్మవిశ్వాసముకుగల్గును. తరువాత జీవితవృత్తి యెట్లని నిరాశపడనక్కరలేదు. చేతినాడులకు పరిశ్రమ అభ్యాసమువల్ల ఆరోగ్యమును శిల్పశక్తియు హెచ్చును. 4. ఈబడులలో తయారగువస్తువులను సహజంగా గ్రామస్థులుకొందురు. తద్ద్వారా పాఠశాలలకు కొంతసొమ్ము చేరును. దానితో విద్యావ్యాప్తి కవకాశము హెచ్చును. ప్రస్తుతంవలెసొమ్ములేక బడులునిల్చిపోవుచిక్కులేకుండగ్రామాలన్నిటిలో ఉచితనిర్బంధవిద్యాపద్ధతి దీనిద్వారా అమలు జరుపవచ్చును. 5. ఇట్లు వస్తువులు తయారుచేసి యిచ్చుటవల్ల గ్రామస్థులకు వారిబడికిని సన్నిహితసంబంధమేర్పడి, పాఠశాలలవిషయమై గ్రామస్థులెక్కువ శ్రద్ధ వహింతురు. ఇందువల్ల ఆవస్తువులద్వారా స్వదేశీయు సిద్ధించును.

 

పజేసి, ఆసారంతో తాము బలీయులగుచుండగా, తక్కినవారు భీతులై ఆలాభములలో తమకును వాటాగోరినారు. భారతదేశాదులకు స్వతంత్రత వచ్చినప్పుడు, అన్ని దేశాలును వాటితో వ్యాపారాదులు చేయుటకు సమానావకాశములుండును. సామ్రాజ్యంవల్ల అన్యాయము జరుగుటేగాక, హింసాభావమేర్పడి, శ్వేతజాతులలోను పరస్పర ద్వేషము పెరిగెను. ఇప్పుడు సామ్రాజ్యపాలకులలో ఉదారభావము సమదృష్టి చూపులేవు. శాంతిస్థాపనసభలు ఆలోచనలు ఇట్టిస్థితిలో వ్యర్థమగుట సహజమే. వ్యక్తితత్వమేగాక, జాతీయతత్వమును మారవలెను. అందుకు గాంధిమహాత్ము డారంభించిన అహింసా ప్రచారమే సాధకమగును.

గాంధిమహాత్ముడీ దేశమందు అహింసాపద్ధతిని రాజకీయముల కమలు చేయగనే దానివాసన ఇంగ్లండువగైరాలకు వ్యాపించకుండ అక్కడ ఆటంకములు కల్గినవి; కాని కొంచముగ అది యూరపులోను సోకినది. యుద్ధనివారణకు అహింసయే సాధనమను సిద్ధాంతముతో ఇంగ్లండులో 'శాంతివ్రతసంఘము' (పీస్‌ప్లెడ్జి యూనియన్) ఏర్పడినది. హింసాతత్వముకూడదని క్రైస్తవులలో 'క్వేకరు' శాఖవారును నమ్ముచున్నారు. ఆయుధసామగ్రులు పెంచి, వైరములు రేపి యుద్ధములారంభించుట ప్రజలకు హానికరమని, శాంతికే అందరూ ప్రయత్నించవలెనని, యుద్ధపరత్వము కూడదని, వారుబోధింతురు. ఇట్టి సంఘములు నాగరికదేశములన్నిటిలోను ఏర్పడి కొంతపనిచేసినవి. ఇది లోకమంతటికి సంబంధించినది. కనుక 1921లో War Resisters International (=యుద్ధనిరోధకవిశ్వసంస్థ) ఏర్పడినది. ఇది అంతర్జాతీయము. అన్ని దేశముల 'శాంతివ్రతసంఘము'లు దీనికిశాఖలుగ జేరిరి. ఈసంఘమువారును Fellowship of Faiths అనుపేర మతసామరస్య సంఘమును శాంతి బోధించినారు. కాని, వారికి పలుకుబడిలేదు. హింసా వాతావరణము ప్రబలినది. ప్రతి 'నాగరిక' దేశములోను ప్రభుత్వము వారి

అక్కడిహింసాసంస్కృతికే తగినది. ఈసంగతులను గాంధిగారు వార్ధా విధానపు ప్రారంభసమావేశంలో విశదపర్చినారు.†

దేశభాషలో దిప్పుడు నవ్యవాఙ్మయము వృద్ధిచేయుటయు విద్యాభివృద్ధి కవసరము. దేశభాషలో నిర్మించు వాఙ్మయము కేవలం సామాన్యజనులు మాట్లాడురీతినే యుండనక్కరలేదు; కాని సామాన్యులకును బోధయగు సులభశైలిలో నుండవలె; భావమును చదువగనే స్ఫురించుచుండవలె; మనస్సుకు బాధగల్గింపకూడదు. మరియు, విషయమును కేవలం శృంగారప్రధానము హింసాకలహాదుల నుగ్గడించునదియు కాకూడదు. సౌమ్యజీవితము నాదర్శముగనుంచి, జాతీయనిర్మాణపు ఆవశ్యకతను జనులకు సుహృత్సమ్మితముగనో కాంతా సమ్మితముగనో సూచించునదిగ నుండవలె. అట్టిదే నిజమగు నవ్యవాఙ్మయము. వాఙ్మయరంగంలో నిప్పుడేర్పడిన సంఘర్షమును బోగొట్టి, రెండుకక్షలకు సమన్వయము చేయుటయు ముఖ్యావశ్యకము.

---

† We have to make them representatives of our culture, of our civilisation, of the true genius of our nation. Europe is no example to us. It plans its programmes in terms of violance, because it believes in violance. I would be the last man to minimise the achievement of Russia, but the whole structure is based upon violance. If India has resolved to shun violance, this system of education becomes an integral part of the discipline she has to undergo. We are told that England spends millions on education. America also does so; but we forget that all that wealth is obtained through exploitation. They have reduced the art of exploitation to a science and might well give their boys the costly education they give. We cannot, will not, think in terms of exploitation, and we have no alternative but this plan of education, which is based on non-violance.

# వర్గసంఘర్షము.

## 1. సామ్యవాదము.

సామ్యవాదమనగా జనులందరికి సమమైన హక్కులుండవలెనను సిద్ధాంతము మనదేశంలో కులసాంఘికవిభేదములు హెచ్చు. అట్లు కాక, పాశ్చాత్య విభేదములు ముఖ్యంగా ఆర్థికములు. సామ్యవాదమక్కడ జనించినది; కనుక ఇది ఆర్థికభేదములకు సంబంధించినది. పాశ్చాత్యదేశాలలో యాంత్రికపద్ధతి విస్తరించినదిగదా! అంతట, ఫాక్టరీలయజమానులు పెట్టుబడిదార్లు ధనాఢ్యులై, సరుకులు చౌకగ తయారుచేసి, పోటీలోగూడ మంచిలాభము రాబట్టుటకని పనివాండ్ర కన్యాయము చేసిరి; వారి మానవత్వమునుగూడ గమనించుట కష్టమైనది. అంతట కార్మికపక్షీయులు ప్రత్యేకసంఘము లేర్పర్చినారు. కాని, నిరుద్యోగుల పోటీయున్నదిగదాయని కార్మికులకు హీనమగు జీతములిచ్చుట, తమకు ఏరీతిగనైన అవిధేయులైనవారిని బాధించుట, వారిసంఖ్య తగ్గించి, యంత్రశక్తి హెచ్చించుట, యంత్రయజమానుల మామూలయినది. ఈబాధలుపోవుటకీకార్మికసంఘములు కట్టుగల్గి, కనీసపుజీతములనిర్ణయము, కార్మికుల వసతులు ఆరోగ్యము సెలవురోజులు, భావస్వాతంత్ర్యము మున్నగుహక్కులకై పోట్లాడి కొంత సఫలులైనారు. కాని, క్రమంగా యూరపులోపుంజీపతులకు కార్మికవర్గముకు పరస్పర విరోధము వృద్ధియైనది, కార్మికులు సమ్మె చేయగనే ఫాక్టరీయజమానులకు సర్కారు ఉద్యోగులు సాయపడి సమ్మెనణచి, నిరుద్యోగులగు ఇతరులను పనిలోపెట్టి, పికెటుచేయువారి నరెస్టుచేసి, శిక్షించుచుండిరి. ఈరెండువర్గాలవారు తమ ప్రత్యేకలాభమే ముఖ్యముగ జూచుకొన, ఉభయులమధ్య సంఘర్షము హెచ్చుచు వచ్చినది. సాధారణంగా పుంజీపతివర్గమునకు తమ ప్రభుత్వపు సాయమున్నది పుంజీపతివర్గమును సా

సామ్రాజ్యప్రభుత్వముతోసహా నశింపజేయుటే కార్మికులగు సామ్యవాదుల రాజకీయాశయమయినది.

'ఈరెండువర్గములకు సంఘర్షము తప్పదు; పుంజీపతిసంఘమును నశింపజేసి కార్మికులు పాలనాధికారం వహించుటే కర్తవ్య'మనుట సామ్యవాదుల ముఖ్యసిద్ధాంతము; దీని జనకుడు 'కార్లుమార్క్సు' అను జర్మనువిద్వాంసుడు. మొదట జర్మనీఫ్రాంసువగైరాలలో వర్గసంఘర్షము హెచ్చినది. సామ్యవాదుల ఆందోళన పెరిగినది; వీతో మన మిదివర లో చర్చించిన విప్లవోద్యమమునకు సంబంధమేర్పడినది. బ్రిటనుకు విశాలప్రకృతిసంపదగల సామ్రాజ్యలాభము లుండుటవల్ల సంయుక్త రాజ్యముకు అమెరికాఖండములో వ్యాపారవిషయంలో సర్వాధిపత్యం వల్లను, అక్కడి పుంజీపతులకు ద్రవ్యలాభము విపరీతంగా హెచ్చినది; వారి పెట్టుబడులు లోకమంతటను వ్యాపించినవి. తద్వారా వీనికి నిరంతరం లాభపు ధనప్రవాహము చేరుచుండును. ఈరెంటిలో ప్రజాయత్త రాజ్యాంగమున్నది. కనుక, పాలకవర్గము దూరదృష్టిగల్గి, ఈపుంజీపతుల లాభంలో కొద్దిభాగమువెచ్చించి, కార్మికుల వసతిగృహములు, జీతముల హెచ్చింపు, సెలవుల హెచ్చింపు, జబ్బుకు వార్ధకముకు ఉపకారభృతి ఇట్టి సౌకర్యములు గల్గించి, మొత్తంమీద తమలాభం నిల్పుకొన్నారు. మరియు బ్రిటనులోని చాలమంది నిరుద్యోగులు, కార్మికులు, కనడా, దక్షిణాఫ్రికావంటి కాలనీలలోజేరి, సుఖపడవీలైనది. ఇట్లు సంఘర్షముతగ్గి, అక్కడ కార్మికోద్యమముకు రాజకీయంగా తీవ్రతపోయినది. అమెరికాలోను ఇప్పటికి స్థలవైశాల్యము, అల్పసంఖ్య,లాభాధిక్యమువల్ల ఇట్లేయయినది. ఆంగ్లభాషికులుకాని తక్కిన యూరపియనుజాతులలో మాత్రం సంఘర్షము పెరిగినది. అక్కడివారికిట్టి ప్రత్యేకసమపాయములు లేవు. కనుక, సంఘర్షము తప్పలేదు; మొదట తామే అధికారము వహించుటకు రాజ్యాంగపద్ధతిని కార్మికపక్షీయు లాందోళనజేసినను,అది పాలకుల నిరంకుశతవల్ల వ్యర్థమైనది. సమ్మెలు జరుగుచు భేదింపబడు

చుండెను. ఈలోగా ఆయారాజ్యాలమధ్య సంఘర్షము కల్గినది. అక్కడి కార్మికులలోను కొంతజాతీయభావ ముండెను, తమ పాలకవర్గము నష్ట డే పరిశ్రమ పోరుద్వారా దుర్బలబరచితే జాతీయప్రాబల్యము ఘనత పోవునని, బలీయులు సౌకర్యయుతులు అగు బ్రిటిషుజాతితో పోటీలో నిల్చుటకష్టమని, జర్మనీలో కార్మికవర్గము జంకి సామ్యసిద్ధాంత మమలు పెట్టలేను; తమ పారిశ్రామిక లాంగ్లులతో పోటీలో ఓడితే, పరిశ్రమ క్షీణతవల్ల తమకును నష్టమని గ్రహించిరి. జాతిసంఘర్షము పెరిగినది. ఫ్రెంచివారు జర్మనులపైన కసిదీర్చుకొను యత్నములో నుండిరి. తుదకు 1914-18 సం॥ల మహాయుద్ధమువచ్చినది. తరువాతపరిస్థితులు తారుమారైనవి. ఇందుకు పూర్వం రష్యాలోను చక్రవర్తి పుంజీపతులతోను భూస్వాములతోను కలసి కార్మికకర్షకుల బాధించుచుండెను. వర్గద్వేషము పెరిగెను. ఆమహాయుద్ధంలో రష్యనుసేనలు జర్మనుసేనల ధాటికిని క్షామమువల్లను మిడతలవలె లక్షలకొలదిగ చచ్చిరి. మిగిలినవారు పాలకులపైన అసంతృప్తివల్ల ద్వేషయుతులై ఆయుద్ధము వినాశకరము అనవసరమునని యెంచి, చక్రవర్తిపైనే తిరుగబడిరి. ఇట్లు రష్యాలో విప్లవమేర్పడి, సామ్యవాది ప్రముఖులే రష్యనుసేనలకు నాయకులైరి.

రాజు ప్రభుత్వమంతరించి, కెరెన్స్కీక్రింద మధ్యరకపుసామ్యవాదిరాజ్యమువచ్చి, వెంటనే అదియుపోయి, శుద్ధసామ్యవాది ప్రభుత్వము 1917 సం॥ అక్టోబరులో స్థాపితమైనది. ఇది కేవలం ప్రజాస్వామ్యము. రాజకుటుంబము నశించినది. ధనికభూస్వాములు స్థానభ్రష్టులు ప్రవాసితులునై కొందరు ప్రజలకోపాగ్నికి పూర్ణాహుతియయిరి. అంతట రాజ్యాంగపద్ధతులును మారినవి. రష్యాలోని ఈ 'బోల్షివికు' రాజ్యములో ఆస్తిలేనివారికే వోటింగుకు ఉద్యోగాలకు హక్కు కలదు. ఆస్తిపరులకే మన దేశంలో వోటునిచ్చుహక్కు మర్యాద గౌరవము ఉన్నవి. * ఆస్తి

* ఇటీవల (1937 నుండి) మనదేశంలో విద్యాంతుఃదరఖాస్తునైన వారికిని వోటుహక్కు నిచ్చినారు.

పరులకు స్వార్థపరతయుండునని యెంచి, రష్యాలో స్వంత ఆస్తిలేనివారినే గౌరవింతురు అక్కడవ్యక్తులు ద్రవ్యముభూములు వగైరాలుసంపాదించు కోకూడదు. భూములు ఫాక్టరీలు, వ్యాపారస్థానములు, ఆసంస్థలు ఇత్యాదులుసంఘమంతటివి వాటియాజమాన్యము ప్రజాసభయగు'సోవియటు'ది

అంతట రష్యనుప్రజలలో మంచి అభివృద్ధిగల్గినది. జనులారోగ్య వంతులైనారు. సామాన్యప్రజలకు సుఖము లోకజ్ఞానము ఆత్మగౌరవము హెచ్చినవి. జనులలో విద్యయు, ప్రాంతీయభాషలతోబాటు సామాన్య భాషయగు రష్యనుభాష, అందలివాఙ్మయమును వృద్ధిజెందినవి. ఆయా ప్రాంతాలమధ్య మైత్రియేర్పడినది. ఇప్పుడు నిర్వ్యాపారత రష్యాలో మాత్రమే పోయినది. ప్రతివానికి వృత్తిపోషణ సర్కారునుండి తప్పక లభించును. కొత్తపరిశ్రమలు, జలవసతులు, వ్యవసాయాదికార్యములు చాలహెచ్చినవి. ఆరాజ్యము తమదనుభావ మక్కడి ప్రజలకు గల్గినది. కమ్యూనిజం'అనుపేర నాపద్ధతిని రష్యాలో ప్రతియూరు గ్రామసంఘము లక్కడివ్యవస్థను సాగించును. ఇట్లేప్రాంతీయసభలు, వాటిమహాసమితియు నున్నవి. ఈపద్ధతిని సోవియటు పద్ధతియందురు. ఇది కొంతవరకు ప్రజలకు లాభకరమైనది; అయితే కొంతహానియు కల్గినది.

ఈ బొల్షివికు ఉద్యమమంతయు సంఘర్షసిద్ధాంతంపైన హింసాతత్వంపైనను ఆధారపడినది. ప్రజానాయకులు హింసద్వారానే అధికారం వహించి, దానిద్వారానే బలీయులై, వేలకొలది రష్యనులజంపించి, ధనికులందరి ఆస్తులను నిర్బంధముగ లాగుకొని, లక్షలకొలది రష్యనులను ప్రవాసితులజేసినారు. కార్మికులు నిరాధారులునేకమయి, ఇతరుల ఆస్తులన్నిటిని హఠాత్తుగ వశపర్చుకొన్నారు. ఇట్టి సిద్ధాంతము దారుణమని ఇతరులకుతోచుట సహజము. మరియు ఇదివరలో రష్యాచక్రవర్తి పశ్చిమయూరపులో చేసిన ఋణములను తీర్చమని బొల్షివికులు నిరాకరించినారు. అంతట ఇంగ్లండు ఫ్రాంసు అమెరికావంటి నాగరికరాజ్య

ములు రష్యాపైన కత్తికట్టి, దానిని సాధింప కంకణముకట్టుకొన్నారు. ప్రవాసితులగు తెల్లరష్యనులు వారినందుకు ప్రేరేపించి కోట్లకొలది సవరనులసొమ్ము వారికిచ్చి పోరుసాగించిరి. అయితే రష్యనునాయకులు పౌరులు తమకొత్తహక్కులరక్షణకై శూరతతో పోరితమరాజ్యమును కాపాడుకోగల్గినారు; కాని దేశమంతటను అపారనష్టము కల్గినది.

ఇంతేగాదు, హింసాపద్ధతితో అధికారమునువచ్చిన బొల్షివికు నాయకులు పుంజీపతితత్వపు ఇతరరాజ్యములతో పోరుటలో కేవలం నియంతృపద్ధతినే రాజ్యము సాగించినారు. తరువాత తమలోనే విభేదము లేర్పడినవి. 'ప్రపంచకార్మికులందరు ఏకము కావలెను; ప్రతిదేశంలోను వర్గసంఘర్షమును విప్లవమునుగల్గించి లోకమంతటను పుంజీపతిత్వమును సామ్రాజ్యపద్ధతిని నశింపజేయవలెన'ని, తీవ్రసామ్యవాదులు నిశ్చయించి యత్నించిరి. ఆయాదేశముల ప్రభుత్వము లందువల్ల బెదరి తమదేశాలలో సామ్యవాదులను నిర్దయముగ బాధించి వారివాఙ్మయమును నశింపజేయుచుండిరి; రష్యనుల బొల్షివికుసిద్ధాంతములకు వారిప్రవృత్తికి అపార్థము చేసిరి. లెనిను తరువాత రష్యాలోనే రెండుపక్షము లేర్పడినవి. వర్గసంఘర్షమును విదేశాలలో హెచ్చించి విప్లవము గల్గించవలెనని 'ట్రాస్కీ', అతనిని తరిమి, ఆపక్షమువారిని క్రూరశిక్షల పాలుచేసి, 'స్టాలిను' నాయకుడై, పాలనలో కొన్నిమార్పులు చేసినాడు. అసలు బొల్షివికువాదపుతీవ్రతను తగ్గించి, వ్యక్తులకు కాపురముండుట కిల్లును నిత్యావశ్యకమైన వస్తువులును స్వంతహక్కుగా నుండవచ్చునని కుటుంబముకు తగినట్లు ఆయావ్యక్తులకు స్వంతవ్యవసాయములు జీవనము కవసరమైన చిన్నచిన్న దుకాణములవ్యాపారము నుండవచ్చునని, వ్యక్తులు తమతమ మతాచారములను స్వేచ్ఛతోననుష్ఠింపవచ్చునని, ఇట్టిమార్పులు చేసెను; సోవియటు రాజ్యాంగమును పార్లమెంటరీఎన్నికలపద్ధతి బెట్టి సౌమ్యముగ నుండునట్లు మార్పించెను. కాని, అందుకు పూర్వమే దౌర్జన్యపద్ధతి జనుల కెక్కిపోయి

నది. స్టాలిను ఇతరదేశాలలో విప్లవముగల్గించు ప్రవృత్తిని మానెను. అంతట కొంత శాంతిగల్గినది. అతడు స్వదేశంలోను జాతీయతత్వమును పెంపొందించుచున్నాడు. పుంజీపతిప్రాబల్యముగల నానాజాతిసమితిలోసభ్యత్వమును ఫ్రాంసుతో మైత్రినిరవ్యనులు కొంతకాలమేర్పర్చుకొన్నారు. అవి నిలువలేదు మఱియు విదేశములతో రష్యా కెట్లును సంఘర్షము తప్పుటలేదు. ఆర్థికంగా ఆధునికయంత్రములదెప్పించి సోవియటులు మిల్లులు పెద్దకార్ఖానాలుస్థాపించి యాంత్రికపరిశ్రమలద్వారా బహుళోత్పత్తిజరిగించినారు; ఆత్మరక్షణకని ఆయుధసామగ్రులనుగూడ విపరీతంగావృద్ధిజేసినారు. గోధుమలు ప్రత్తివగైరా పంటవస్తువులకుగూడ ఊడ్పులు కోతలు వగైరాలకు 'ట్రాక్టర్లు'వగైరా మహాయంత్రములుపయోగించి, అమ్మిసొమ్ములు కాబట్టుచున్నారు. బహుళోత్పత్తి చేసినారు. సరఫరాలలో చాలచిక్కులుకల్గినను, తమదేశావసరములకే ఈ ఉత్పత్తి జరుగుచున్నంతవరకు రష్యాలో (ఇప్పుడు సంఘర్షము వచ్చినది) యాంత్రికపద్ధతి యుపయోగించినది. అట్టిలాభము కొంతకాలమైనను పొందుటకు మనము ఫాక్టరీలపద్ధతి పెట్టుట మంచిదని కొందరనుచున్నారు. కాని యాంత్రికసంస్కృతి తుదకు హానికరమగును. మరియు ఈ రెండు దేశాలకు కొంతభేదమున్నది. సోవియటు రష్యాదేశము మన దేశముకన్న వైశాల్యంలో రెండురెట్లు పైగా పెద్దది; అక్కడి జనసంఖ్యమాత్రం మనదానిలోసగమే అక్కడి ప్రకృతిసంపదను పరిశ్రమలను ప్రజావశ్యకతకు తగినట్లు వేగంగా వృద్ధిజేయుటకు (జనశక్తిచాలక) గొప్పయంత్రములుపయోగించినవి. అక్కడి పూర్వసంస్కృతిలో ధార్మికబలమును చేతి శిల్పప్రజ్ఞయు చాలతక్కువ. మనదేశమందట్లుకాదు. ఇక్కడి పూర్వసంస్కృతిలో అహింసాతత్వమును శిల్పశక్తియు చాల హెచ్చు, అనిచూచియున్నాము; జనసంఖ్యయు హెచ్చు. ఇప్పుడు కోట్లకొలది ఈదేశీయులు వృత్తిహీనులై అల్లాడుచున్నారు. ఇట్టిస్థితిలో రష్యాలోవలె యాంత్రికపరిశ్రమలే పెట్టుటవల్ల సామాన్యజనులకు సుఖముకన్న దుఃఖము హెచ్చును. మనదేశము కవసరమగు అన్ని

వస్తువులను ఈదేశమందే గొప్పయంత్రములద్వారా తయారుచేసినను, ఆయంత్రము లన్నిటిద్వారా ఒక్కకోటి కన్న హెచ్చుమందికి పనికలుగదని తేలినది, అప్పుడు సుమారు అధమం 20 కోట్లజనులు వ్యర్థంగా నిరుద్యోగులై యుండవలెను. కనుక పాశ్చాత్యపు సామ్యవాద మీదేశముకు సరిపడదు. మరియు యాంత్రికవృద్ధివల్ల బస్తీలలో కార్మికులుహెచ్చియున్నచోట్లనే సామ్యవాదము సాగును. 1917 నాటికిని రష్యాలో మనదేశంలోకన్న యాంత్రికపరిశ్రమలు హెచ్చుగనుండినవి; ఆప్రజలు సాయుధులు, మనవలె నిరాయుధులు, ఈదేశీయులంతనిరక్షరులు కారు. అక్కడ కార్మికులసంఖ్య దామాషాగా ఈదేశంలోకంటె చాలహెచ్చు. మన దేశంలో పరిశ్రమలు ఇంకా బాల్యస్థితిలోనున్నవి. మనదేశీయపరిశ్రమలు చాలపోటీలోనున్నవి. ఇక్కడ కార్మికోద్యమము బలీయమగుటకు పరిస్థితులు వీలుగాలేవు. రష్యాలో చల్లదనమువల్ల యంత్రోష్ణమిక్కడియంత బాధకరమునుగాదు. ఆప్రాంతీయుల శరీరదార్ఢ్య మిక్కడివారికంటె హెచ్చు.

రష్యాలో ధార్మికత అనగా మతదృష్టిలేదు. కేవలం భౌతికదృష్టితో వారు సంస్కృతిని నిర్మించుచున్నారు. అది యీదేశీయులకు సరిపడదు. మరియు రష్యాలో విప్లవసమయంలో చక్రవర్తి దుర్బలుడు నిస్సహాయుడునైనాడు. అక్కడ క్రాంతిపరులు విదేశమునుండి పాలించు బలీయమగు సామ్రాజ్యమును లొంగదీయుసమస్య కలుగలేదు. జనులకు ఆధ్యాత్మికత వ్యక్తిస్వేచ్ఛ ఇష్టమైన వృత్తి నెన్నుకొనుట ఇప్పుడును లేదు. భావస్వాతంత్ర్యమును తగ్గినది. వ్యక్తి లాభపద్ధతి రష్యాలో లేకున్నను యాంత్రిక పద్ధతిలో సహజముగనే హింసా తత్వమున్నది. బహుళోత్పత్తిని దేశసంపత్తు నింకను హెచ్చించి తమ రాజ్యము నింకను బలీయముగను ధనికముగను చేయుటకు, విదేశాలనుండి యంత్రాముల దిగుమతికిని తమ సరుకులనుగూడ విదేశముల కెగుమతిచేయ దొడంగిరి. అప్పు డితరదేశముల వ్యాపారములో రష్యాకు పోటీ యారం

ఖించినది. ఒకవైపు ఇంగ్లండు జర్మనీలతోను రెండవవైపు జపానుతోను స్పర్థ దినదినమును వృద్ధియైనది. జాతులన్నియు రష్యా తమలోనెప్పటికైన వర్గసంఘర్షముగల్గించునని అది హానికరమని భయపడియున్నారు. ఆయుధసామగ్రిని క్రొత్తరకపు విషవాయువులువగైరా మారణసాధనములను రహస్యముగ నిలవజేసినారు. రష్యాయు వారితో ఢీకొనవచ్చును. ఈరీతిగ రష్యచు బాల్షివిజములోను హింసాతత్వమున్నది. అందువల్లను మారణహోమములు జరిగి, మరల ఆయారాజ్యములమధ్య మహాయుద్ధములుసాగి, లోకము కసర్థము వాటిల్లవచ్చును.

రష్యాకు తూర్పున జపానుతోను యుద్ధము తటస్థించునట్లుండినది. అయితే చీనాయుద్ధంలో జపాను మగ్నమైనందున ప్రస్తుతం రష్యాకా బాధ తప్పినది. ఇట్లే రష్యాజర్మనీల ప్రభుత్వములు తీవ్రంగాదూషణ సాగించిరి; ఈరెండు రాజ్యములకుయుద్ధముజరుగునట్లుండెను. హింసాధోరణి ప్రకోపించినది. అయితే, సమయమునకు పోలండు బ్రిటిషు ఫ్రెంచి సర్కారుల రాజనీతి వక్రమార్గము పట్టినది. అంతట జర్మనులు రష్యాతో సంధిచేసుకొని, బ్రిటిషు ఫ్రెంచివారలతోనే యుద్ధము సాగించుచున్నారు. కాని రష్యనప్రభుత్వమును తూర్పుపోలండు నాక్రమించి, ప్రక్కనున్న బాల్టికురాజ్యముల గలుపుకొని సైనిక సన్నాహముచేసి ఫిన్లండును ముట్టడించినారు ఈయుద్ధం త్వరలో సమాప్తమైనను, జర్మను బ్రిటిషువగైరా రాజ్యములు కలసిపోయి పిమ్మట తమపైకి యుద్ధమునకు వత్తురని రష్యా కనుమానమున్నది. కనుక రష్యను లిపుడును తమసరిహద్దులలో సైనికశక్తిని ఆయుధాలను తీవ్రంగా హెచ్చించుచున్నారు. యూరపు దేశములన్నిటిమధ్యను హింసాభావము హెచ్చుచున్నది. కనుక రష్యాపద్ధతివల్లను తుదకనర్థముగలుగును. ఇట్లు సామ్యవాదపు అసలుసూత్రములు మంచివేయైనను, భౌతికప్రధానమగు హింసాతత్వపు దృక్పథము సరికాదు. మరియు మనదేశపు పరిస్థితినిబట్టి యీ సామ్యసూత్రము అమలులోనికి వచ్చునట్లు ధీమంతులు దేశకాలపరిస్థితులను

బట్టి తమ సిద్ధాంతప్రణాళిక నేర్పర్చుకోవలె. వివిధమతములు, మూఢ భక్తి, సాంఘికవిభేదములు ప్రాంతీయతత్వములు చిరకాలమునుండి నాటి, మన ఆర్థికద్రవ్యరాజకీయవిధానములన్నియు ప్రబలులగు విదేశీయులచే జరుపబడుచు, వట్టినిరాయుధులమైయున్న మనకు రష్యనుసామ్యవాది పద్ధతి అమలుకుపనికిరాదు అక్కడివిప్లవకరమైన పోరాటములు వర్గపోరాటములు చాల హెచ్చుమందికి పనినిచ్చును, గ్రామములలో నవి గృహలక్ష్మివలె మంగళప్రదమగును, అవి అజ్ఞానులకును అందుబాటైనవిసులభగ్రాహ్యములు; పుంజీపతులతో జమీందార్లతో, సంస్థానాధిపులతో, వ్యాపారివర్గము తోగూడ సామ్యవాదముకుంచు సంఘర్షముండదు. ద్వేషభావము హింసాతత్వము శత్రువులతోనేగాక మనలో వివిధపక్షాలమధ్యను చెల రేగితే బాధకముకాకతప్పదు. మరియు, సామ్యవాద మిక్కడి గ్రామజీవితముకసలే సరిపడదు. మధ్యవర్గపుపట్టారయితులును సామ్యవాదప్రక్రియకు వ్యతిరేకించుచున్నారు. కనుకనే, ఈదేశంలో సామ్యవాదులకార్యక్రమము విఫలమైనది. వారు సిద్ధాంతసూత్రముల నరచుచు ఉద్రేకం కల్గించినారు; కానివారికినిర్మాణకరము బీదసాదలకుసహాయకరము ఆయా వర్గములమధ్య సమన్వయకరమునైన కార్యక్రమము లేదు. వారు సాగించిన సమ్మెలవల్లను పారిశ్రామికులలో విదేశీయులకన్న మనదేశీయులకే హెచ్చునష్టముకల్గినది. ఆసమ్మెలను ప్రభుత్వంవారును యంత్రయజమానులును సులభంగా విడగొట్టుటవల్ల సమ్మెదార్లకు నిర్వేదమేగాక అవిధేయతవల్ల కార్మికోద్యమముకును తుదకు నష్టమేగల్గినది. కొందరు తీవ్ర సామ్యవాదులు (అంతర్జాతీయత పేర) జాతీయతకు గాంధివాదముకువ్యతిరేకులై విభేదకారకులైనారు. 1930-32 ల తీవ్రసత్యాగ్రహమందును కాంగ్రెసుమంత్రుల నిర్మాణకార్యసమయములోను తీవ్రసామ్యవాదులు అందుకు వ్యతిరేకులై ఆటంకము చేసినారు సామ్యవాదిసూత్రములను ఈదేశపు పరిసరములను జనుల మన స్తత్వమును మనసంస్కృతి స్వభావమును అనుసరించి క్రియారూపంలో పెట్టుటవల్ల గాంధిమహాత్ముడు వివరించిన నిర్మాణకార్యక్రమ మేర్పడుచున్నది.

# వర్గసంఘర్షము.

## 2. సంస్థానాదులు.

మన జాతీయసమస్యలలో నొకటి దేశీయరాజ్యములది. ఇంగ్లండు జర్మనీ వగైరాలలోని పూర్వపుసామంతరాజ్యపద్ధతి (మధ్యవర్గపు ధనికుల ధాటికి) నశించినది. అది అమెరికావంటి నవ్యరాజ్యములలోను లేదు. జపానులో 'సామ్యురై' అను సామంతులుండిరి. చక్రవర్తి 1867 నుండి నవ్యపాలనమారంభించినప్పుడు వారు తమ దేశక్షేమముకై తమ ఆనువంశికపు హక్కులన్నిటిని వదులుకొని, త్యాగముచూపిరి. చీనాలో సామంతపద్ధతి యుండుటవల్ల కేంద్రబలము క్షీణించి అంతర్యుద్ధములు జరిగినవి;

ఇక మనస్థితి: ఈదేశంలో బ్రిటిషువారధికారమునకు వచ్చునప్పటి కాయాప్రాంతములను వేర్వేరురాజులు పాలించుచుండిరిగదా! వీటిలో కొన్నిటిని బ్రిటిషువారు పూర్తిగ వశపర్చుకొన్నారు. మిగిలినవి ఆయా దేశీయరాజులక్రింద మిగిలినవి. డల్హౌజీప్రభువువంటి కొందరు బ్రిటిషు పాలకులు సాకుదొరికినప్పుడెల్ల ఒక్కొకటిగ రాజ్యములను తమ పాలనలో చేర్పబూనిరి; ఇట్లు ఆరాజ్యములు తగ్గగా బ్రిటిషువారు రాజనీతిమార్చుకొని, మిగిలిన రాజ్యములను నిలువబెట్టి వాటిపైన అజమాయిషీని పెట్టుకొన్నారు. ఇప్పుడున్నవి 562 రాజ్యములు; వీటిలో కొన్ని బొత్తిగాచిన్నవి. ఇప్పుడివియన్నియు బ్రిటిషువారితో వ్యవహారసంధులు కలిగియున్నవి. కాని వాటికి బ్రిటిషువారుచెప్పుఅర్థమే ఖాయము. ఈరాజ్యములలో నేవియు మఱియేయితరరాజ్యములతోను స్వతంత్రముగ వ్యవహరించకూడదట. *పై అధికారమంతయు బ్రిటిషువారిదే. ఆరాజ్యాలలో ప్రజాపాలనసరిగ చేయవలెనని షరతులుండును. కాని ఆచరణలో ప్రజలకుపీడ గల్గుచున్నను, బ్రిటిషు ఉద్యోగుల ప్రీతియున్నంతవరకే బా

---

* ఒక నేపాళమున్నాతము స్వతంత్రమనబడును.

ధయు ఈరాజులకుండను; ఆడుద్యోగులకాగ్రహముగల్గితే, బ్రిటిషుప్రభుత్వమువారీరాజుల నెట్టినేరపురుజువు అక్కరలేకనే తీసివేయవచ్చును. (ఉ॥ ఇందోరు, ఆల్వారు, నాభా వగైరాల రాజులు మన ప్రభుత్వంవల్ల తొలగింపబడిరి.) వారికి బ్రిటిషుప్రభుత్వంవారు పేరుకుమాత్రం 'మిత్రులు', క్రియలో యజమానులు. ఈరాజులు తమప్రజల విషయంలో మాత్రం కేవలం నిరంకుశంగా వర్తింతురు. వీటిలో ప్రజాయత్తతగంధమైనను లేదు. కనుక, దేశీయరాజ్యములని పేరేగాని, అక్కడి ప్రజలకుబదులు ఆరాజులకు (వారిపై నధికారం చలాయించు బ్రిటిషుప్రతినిధులకును) అక్కడ సర్వాధికారము. వీరిద్వారా బ్రిటిషుమిషనరీలు వ్యాపారస్థులుగూడ ప్రాబల్యమును సంపాదించి, తమవృత్తులుయథేష్టంగా సాగించుచున్నారు. అక్కడి రాజులనేకులు భోగపరులై తరుచుఆంగ్ల 'మిత్రు'లసలహాతో ఏయింగ్లండులోనో వసింతురు. వీరిదుబారాఖర్చులు విపరీతములు. సంస్థానాలలో పన్నులు చాల హెచ్చు; సరియగు చట్టములు, న్యాయపరిపాలన, విద్య, ఆరోగ్య సౌకర్యము వగైరాలు మనప్రాంతాలలో కంటెను తరుచు హీనములు. జనులకు వ్యక్తిస్వాతంత్ర్యములేదు. ఉద్యోగులెంత బాధించినను, ప్రజలకు ముక్తిలేదు. ఆర్థిక నైతికశోషణలును హెచ్చినవి. ఈరీతిగ ఈదేశీయరాజ్యము లిప్పుడు హింసాభూయిష్ఠమైయున్నవి.

బ్రిటిషుచక్రవర్తితో తమకు మైత్రిసంధి యేర్పడియున్నదని ఆపరతు లమలుజరుపునిమిత్తం తమ రాజ్యంలో సర్వాధికారము కావలెనని, సంస్థాన రాజులనుటకలదు. కాని, బ్రిటిషు చక్రవర్తియు స్వతంత్రుడు కాడు; ఆతడక్కడి ప్రజాసభవారి యాజ్ఞప్రకారమే నడుచుకోకతప్పదు. ఇక ఈమైత్రిసంధులనేవి యీస్టిండియా కంపెనీతో నేర్పడినవి. ఆయా సంధులషరతు లేకరీతిగలేవు. మరియు సంధిషరతు లెట్లున్నను, బ్రిటిషు ప్రభుత్వము కీరాజులపైన సామ్రాజ్యాధికారమున్నదట! ఇకతమప్రజల విషయంలోనే వీరికి సంధి ద్వారా నిరంకుశత. ఈసంధులలోను సంస్థానాలలో ప్రజాయత్తపాలనపెట్టవలెనని షరతు లేదు. మరియు రాజ్యపు

ప్రజాయత్తత ఆప్రజల జన్మహక్కు. బ్రిటిషు ప్రజలహక్కువంటిదే ఇక్కడిప్రజలది. ఈసంధిషరతులకు సంస్థానప్రజల అనుమతిని పొందను లేదు. (సంస్థానాలలో ప్రజాయత్తపాలనకు రాజులిష్టపడితే బ్రిటిషుప్రభుత్వము కభ్యంతరము లేదని బ్రిటిషుప్రతినిధులిటీవల సూచించినారు) మఱియు సంధిషరతులు శాశ్వతముకావు; సందర్భానుసారము సంప్రతింపులు మార్పు జరుగుచుండును.

ఈరాజులు బ్రిటిషు ఉద్యోగులకు బెదరుచుండుటకు దుష్టపరిపాలనయుతమకు ప్రజలనుండినిజమైనప్రేమయు తోడ్పాటును లేకుండుటయు కారణములు బాలమైనప్రజాభిప్రాయము సంస్థానజనులలో సంఘటనము రాజుకు ప్రజలకు పరస్పరమైత్రియునున్నప్పుడు పరదేశీయులగు బ్రిటిషు ఉద్యోగు లేమిచేయుదురు? ఇప్పుడుప్రజలు పిరికివారై నిరాశులైనారు. ఇటీవల వారిలో కొంతపరిజ్ఞానముకల్గి వ్యక్తిస్వేచ్ఛకొరకును ప్రజాయత్త పాలనకొరకును కృషిచేయుచున్నారు. శ్రీ పట్టాభి, నెహ్రూ, పటేలు మున్నగు కొందరు కాంగ్రెసునాయకులును వారిసమస్యలగూర్చి శ్రద్ధవహించుచున్నారు. ఇప్పటిమర్భరదుస్థితి మారవలసియున్నది. అయితే అది ఎట్లని ప్రశ్న. ఈ రాజత్వపద్ధతినే తొలగించుడని అనగా రాజవంశముల న్నిటిని సీవాగా తొలగించి తక్కినప్రాంతములతో కలుపవలెనని సామ్యవాదులసూచన. అందుకు రాజపక్షీయులును బ్రిటిషువారును విరోధింతురు. దౌర్జన్యమును చెలరేగును. మఱియు చిరకాలపువంశపరంపరపద్ధతి నొక్కసారిగతొలగించుటసబబుకాదు. అప్రాంతీయులింతవరకురాజత్వపద్ధతి కలవడియున్నారు ఇంతేకాక కొన్ని రాజ్యాలలో సాంఘికసమస్యలుండును. హైదరాబాదు భోపాలు ప్రజలలో హెచ్చుమంది హిందువులు. అక్కడి నైజామును నబాబును తొలగించితే ముస్లిములలో చాలమంది తిరుగబడి,సాంఘికద్వేషము పెరుగును,రక్తపాతము జరుగును. ఇట్లే కాశ్మీరంలో మహారాజును తీసివేసిన అక్కడి హిందువులు విరోధింతురు; అధికారము ప్రజాయత్తముకావలె; కాని రాజవంశపు హోదా గౌరవము పోకూడదందురు.

ముఖ్యరాజ్యాలమధ్య కొంత దేశీయసేనలున్నవి; వాటిపైన పరిశీలన బ్రిటిషువారిది. మన బ్రిటిషుప్రభుత్వము వారీప్రజలనణచియుంచుట కీరాజులకు మద్దతుచేతురు. ఇట్లారాజులు దౌర్జన్యముతోనైన 'శాంతి'ని కాపాడి, అధికారమును నిల్పుదురు. కనుక ఇప్పుడీరాజత్వము పోవలెనంటే, బ్రిటిషుసామ్రాజ్యముతో పోరును సాంఘికసంఘర్షమును కల్లోలమును కలుగును. అట్టి హింసాపద్ధతి అసలు సమస్యను మరింత గహనము చేయును. రాజపక్షీయుల హృదయము కరగించియు ప్రజలు నిర్మాణశక్తిగల్గి న్యాయమగు ఒత్తిడిచేసియు, బ్రిటిషుప్రభుత్వపు ప్రాబల్యముతగ్గించియు ప్రజాయత్తపాలన పెట్టించవచ్చునని గాంధిమహాత్ముని ఇత్యాదులభావము. ఈరీతిగా కొంతప్రచారము జరిగినది. ఈపద్ధతియింతవరకు అంతగా ఫలించలేదు. 'ఔంధ్' సంస్థానపురాజుమాత్రం ప్రజాయత్తపాలన నిటీవలపెట్టినారు. మరికొందరిప్పుడిప్పుడే చిన్నసంస్కరణలను పరిశ్రమలను సాగించుచున్నారు. మనబ్రిటిషు ప్రభుత్వమువారు గట్టిగాతలచుకొంటే ప్రజాయత్తతసులభమే. కాని,వారేదో కారణంచెప్పి తప్పించుకొనుచున్నారు. ఇప్పటిసంస్థానపద్ధతివల్ల బ్రిటిషువారినిరంకుశతకు బలము కల్గుచున్నది. ఈసంస్థానములు మొత్తంభారతదేశంలో పరిమితిలో ⅓ వ వంతు, జనసంఖ్యలో ¼ వ వంతుగ నున్నవి. ఈరాజులందరు బ్రిటిషుపాలకులకనుసన్నలప్రకారమే నడుచుకొందురు. ఇటీవల 1935 సం॥రం చట్టంలో మనదేశముకేర్పచ్చిన సమిష్టిపాలన (ఫెడరేషను) రాజ్యాంగంలో చేరుట కీరాజులు తగుదునమ్మాయని సిద్ధపడినారు. దానిసభలలో సంస్థానరాజులకు ప్రాధాన్యమిచ్చినారు. అక్కడి ప్రజలకు మాత్రం అసెంబ్లీలోగాని, కౌంసిలులోగాని ఒక్కప్రతినిధిస్థానమైన నీయలేదు. ప్రతినిధుల నియమించుటరాజుల యిష్టమేనట! క్రియలో వారి బోధకుడగుబ్రిటిషురెసిడెంటుయిష్టమేఖాయమగును. తమనిరంకుశపాలనలో ఫెడరల్ ప్రభుత్వము కల్పించుకోకూడదట. తాముమాత్ర మఖిలభారతపాలనలో పాల్గొందురట. నిరంకుశ[illegible] ప్రజాయత్త[illegible] కనుక దేశీయ

రాజ్యాలనుండి ప్రజాసమ్మతప్రతినిధులే రావలె. అక్కడ ప్రజాయత్తత కావలె. భారతమొకే దేశము; కనుక, ప్రజాతంత్రకమును, సంస్థానరాజ్యమును రెంటిని కలిపే న్యాయమైన ఫెడరేషనుద్వారా సమిష్టిరాజ్యమేర్పడుటకు అహింసావాదులొప్పుకోతగినదే. కాని సంస్థానరాజులు తమ రాజ్యపాలనలోను ప్రతినిధుల యేర్పాటులోను ప్రజలకధికారములేని పద్ధతినే ఫెడరేషను కొప్పుకొను చున్నారు. ఫెడరల్ ప్రభుత్వములోని సంస్థానప్రతినిధులు ప్రజలప్రతినిధులే అయితే అదినిజముగ ఫెడరేషనగును.

ప్రజాయత్తపాలన అనుక్రమతమగు రాజ్యపాలనకు వ్యతిరేకమని కొందరన్నారు. కాని, మనప్రాచీనశాస్త్రములలో వేటిలోను రాజు యథేష్టముగ ప్రజల బాధింపవచ్చునని చెప్పలేదు. పూర్వము చాలప్రాంతములలో గణరాజ్యములు వగైరా ప్రజాతంత్రకములుండినవి. రాజత్వమున్నచోట్లను రాజు విద్వాంసులవల్ల న్యాయనిర్ణయము తెలుసుకొని ఆధర్మముప్రకారమే పాలించేవారు. ధర్మగ్రంథములను లోకక్షేమపరులగు ఋషులు రచించేవారు దేశకాలానుసారముగ ఆ నిబంధనలు అనుభవశాలురగు లోకధర్మజ్ఞులు మార్చేవారు రాజులు ముఖ్యకార్యములు మంత్రిమండలి సలహాప్రకారమే చేసేవారు. ప్రజారంజనమే రాజధర్మము.† హానిలేకుండ ప్రజలను రక్షించుటే నిజమైన క్షాత్రము‡(ఇప్పటివలె) స్వసుఖముకు కాక, లోకులనిమిత్తము రాజు శ్రమపడుచుండినట్లు (దుష్యంతునిగూర్చి) కాళిదాసు వివరించినాడు* రాజ్యపాల

† రాజా ప్రకృతిరంజనాత్. (కాళిదాసు: రఘువంశము.)
ప్రజాః ప్రజాః స్వా ఇవ పాలయిత్వా. „ శాకుంతలం)
‡ క్షతాత్కిల త్రాయత ఇత్యుదగ్రః క్షత్రస్య శబ్దో భువనేషు రూఢః
(„ కుమారసంభవం)వి

* స్వసుఖ నిరభిలాషః ఖిద్యసే లోకహేతోః ప్రతిదిన మథవా తేవృత్తిరేవంవిధైవ, అనుభవతిహి మూర్ధ్నా పాదపస్తీవ్రముష్ణం శమయతి పరితాపంఛాయయా సంశ్రితానాం. నియమయసి కుమార్గప్రస్థితా నాత్తదండః ప్రశమయసి వివాదం కల్పసేరక్షణాయ, అతనుషు విభవేషు జ్ఞాతయస్సంతు నామ, త్వయితు పరిసమాప్తం బంధుకృత్యంజనానాం (శాకుంతలం.)

నమునొక ధర్మమే కనుక రాజులు తమప్రజలకు ధర్మకర్తలుగనే పాలింపవలె. రాజులు ప్రజాప్రతినిధు లేర్పఱ్చు చట్టముల ప్రకారం ప్రజాసభల నాయకులద్వారానే వ్యవహారముల జరుపవలెను. ఈ రాజులందరు ఏ బ్రిటిషురాజుకు 'రాజభక్తి' చూపుచున్నారో ఆయనయు పైరీతిగనే పాలించుచున్నాడు కనుకను, ఇక్కడిరాజులు తమ 'సర్వామాట్టు'అగు బ్రిటిషురాజుకన్న యెక్కువహక్కులుకోరుట సబబుకాదు. 'రాజువిష్ణ్వంశికుడు, ఆయన అధికారము తగ్గింపకూడద'ని ఒకవాదము. 'నావిష్ణుః పృధివీపతిః' అనువాక్యము నీ:కి ప్రమాణము కాని, ఇది పూర్వపు ధర్మశాస్త్రపుది కాదు, ఎట్లైనను ప్రతిరాజుకుదైవాంశ యున్నదనుటకన్న విష్ణువుఅంశ కలవాడే పృధివీపతి కాదగుననుటే దీనికి న్యాయమగు అర్థము (లేనియెడల జారు, కైజరు, హిట్లరును విష్ణుఅంశవారని తేలును) అనగ కేవలం ధర్మాత్ముడు లోకసంగ్రహపరుడునే రాజుగనుండవలె.ని భావము. మరియు విష్ణువు ప్రజలందరిలో అంతర్యామిగనున్నందున, అట్టిప్రజాప్రతినిధియగువానిలోవిష్ణువుఅంశముండును, కనుక అట్టివాడు రాజు కావలెనని యు భావన. వర్గసంఘర్షమువల్ల కాక ప్రచారము ఆందోళన నిర్మాణమువల్లనే సంస్థానముల ప్రభుత్వపద్ధతిని మార్చునుద్దేశముతో ఇటీవల ముఖ్యరాజ్యములన్నిటిలో స్టేటు కాంగ్రెసు ప్రజామండలి బయలుదేరి పనిచేయుచున్నవి. ప్రజలలో అహింసాతత్వమును సంఘటనమును కల్గించుమని, ఈసంస్థలకు గాంధిమహాత్ముడు కాంగ్రెసు ప్రముఖులు సూచించగా, వారు అట్లే అహింసాప్రవృత్తిని నిర్మాణకార్యక్రమమును అవలంబించినారు.

ఈదేశీయరాజ్యములన్నిటిలో ప్రధానము (ఆంధ్రులకెక్కువ సంబంధించినదియు) నిజాంరాజ్యము. కనుక ఇందలి ప్రత్యేకసమస్యలు తెలియుట అవసరము. ఈ సంస్థానపు పరిమితి 82, 698 చ॥ మైళ్ళు; జనసంఖ్య సుమారు 16 కోట్లు. దీనిపాలకులు 'నిజాం' అనబడు నబాబుగారు; వీరిసంస్థానపు సాలీనా ఆదాయము సుమారు 8½ కోట్ల రూపా

యలు. ఇదిగాక ప్రజలనుండి 'నజరానా' ఇతరభూములు వగైరాల ద్వారా ఇంకను చాల ఆదాయమువచ్చునట. మన నిజాంగారిప్పుడు ప్రపంచపుప్రధాన కోటీశ్వరులలో నొకరవిప్రతీతి. అయితే ఆసంస్థానపు సామాన్యప్రజలు మాత్రం దుర్భరదారిద్ర్యంలో మునిగియున్నారు.

వీరికి మైసూరు తిరువాన్కూరు బరోడా వగైరాలలోనున్న రాజకీయ పరిజ్ఞానము, విద్య, నాగరికత, వృత్తులు, లేవు. ఇట్టి 'ప్రధాన' రాజ్యము వెనుకబడియుండుట, అధికారులు కేవలం నిరంకుశంగా పాలించుట విచారకరము. ఆప్రజలలో రమారమి సగముమంది ఆంధ్రులు; తక్కినవారు కన్నడులు, మహారాష్ట్రులు, హిందూస్థానీలు వగైరాలు. వీరికందరికి సామాన్యభాష విద్యసంఘటనములేక, ప్రజోద్యమము వెనుకబడినది. ప్రజలలో నూటికి 88 మంది హిందువులు; అయితే, నిజాముగారు ముస్లిముల విద్యావ్యాప్తివగైరాలకు ప్రత్యేకశ్రద్ధ వహించినారు; కనుక దామాషాను హిందువులకన్న ముస్లిములెక్కువ విద్యావంతులు, హిందూసంఘపుటున్నతికి తగుప్రోత్సాహమీయ లేదు. వారికి పెద్దయుద్యోగము లుండుట అరుదు. చిరకాలమిట్లు పాలించుటవల్ల జనులలో మూఢత్వము, మాంద్యము, నిరాశయు మూర్తీభవించియున్నవి. ఇటీవల కొంతఆందోళన చైతన్యము కలిగినవి.

ఇట్టిస్థితిలో ముస్లిములలో చాలమంది జాతీయతకువ్యతిరేకించిరి, నిజాంరాజ్యము ముస్లిం రాజ్యము అని వాదమారంభించినారు. ఇది 'బ్రిటిషు భారతరాజ్యము క్రైస్తవరాజ్యమను' వాదపురీతిని నున్నది. ఇట్టివారు సర్కారుపక్షమగుట సహజము. వారు జాతీయవాదులను ప్రతిఘటించగా, సాంఘికసంఘర్షము లారంభించినవి. ప్రస్తుతము సర్కారు వారుకొన్ని సంస్కరణలిత్తుమన్నారు; స్టేటు కాంగ్రెసు ఉద్యమమును ఆరంభమందే అణచినారు. సమిష్టినియోజకవర్గము లుండునట, కాని సగంమంది సభ్యులు ముస్లిములేకావలెనట. మరియు, కేవలం ప్రదేశము లనుబట్టి కాక, వృత్తులనుబట్టి నియోజకస్థానములట. ఈరీతిగా, వివిధ

మతస్థులు కులములు వృత్తులు వారిమధ్య విభేదము లేర్పడును; క్రైస్తవులు హిందువులు, జైనులు వగైరాలకు అసంతృప్తి కల్గినది. మరియు, సంస్థానంలో సగంమందికి తెలుగు మాతృభాష. అయినను కొద్దిమందికే మాతృభాషయగు ఉర్దూనే రాజకీయములకు వ్యవహారములకు సర్కారు భాషగ చేసినారు. తెలుగు మహారాష్ట్రం వగైరాలకు తగుప్రోత్సాహము లేదు. ప్రజలకు వాక్స్వాతంత్ర్యము సభాస్వాతంత్ర్యము లేవు. కనుక అసంతృప్తి సంఘర్షము వివిధరూపములుగ తలయెత్తి తుదకు హింసాతత్వము విజృంభించును. అందువల్ల రాజుకు ప్రజలకు కూడ నష్టమే. ప్రజలలో నిజమైన సాత్వికశక్తియు నిర్మాణకార్యవ్యాప్తియు జాతీయతయుప్రబలినప్పుడు పాలకులు ప్రజాభిప్రాయమును మన్నింతురని తోచును. అదిగాక, బ్రిటిషుప్రభుత్వముపైనను అహింసారూపమగు ఒత్తిడి కల్గినప్పు డీసమస్య సామ్యముగనే పరిష్కారమగును. ఇట్లు మనప్రాంతములకు దేశీయరాజ్యసమస్యకును సన్నిహితసంబంధ మున్నది. మరియు, చిన్నవి విడిరాజ్యములుగ నుంచుటలో అర్థము లేదు. ఇవి జమీందారీలగుటయే శ్రేయస్కరము.

సంఘములో వర్గసంఘర్షపు మరికొన్ని సమస్యలు నున్నవి. అందొకటి జమీందారీ సమస్య. జమీందారీలలో రయితులస్థితి కష్టముగ నున్నది. ఈవిషయమందును సామ్యవాదులు నిర్బంధముగ జమీందారీలన్నిటిని తొలగింపవలెనందురు. అట్లుగాక, ఇప్పుడు వారికున్న అన్యాయపు అధికారములు శాసనరీత్యా తొలగించి, వారి 'భూస్వామి'త్వమును గూడ ధర్మకర్తస్థితికి తేవలెను. ఆదాయములో చాలభాగము ప్రజలనిమిత్తం వినియోగమగునట్లును భూముల నీటివసతులు వగైరాలు రయితులకు క్షేమకరముగను సాగించవలెనని, అట్టైన జమీందార్ల సుఖజీవనముకును భంగముండదని, వారి దుబారాఖర్చులు దురభ్యాసములు మాత్రం తగ్గునని, అహింసావాదుల అభిప్రాయము. ఇట్లు ఉభయులకు సమన్వయముచు మైత్రియు కలుగును.

పరిశ్రమలలో కార్మికసమస్యగూర్చియు ఇట్లే. సామ్యవాదులు మహా యంత్రపరిశ్రమలు కావలెనందురు; అయితే అవియన్నియు కార్మిక ప్రభుత్వపు వశమందుండవలెనందురు. రైళ్ళు గొప్పలోహపరిశ్రమలు, గనులు విద్యుచ్ఛక్తివగైరా కొన్ని దేశక్షేమము కవసరమగు గొప్పపరిశ్రమలవసరమే. అవి వీలైనంతవరకు ప్రభుత్వపు అజమాయిషీక్రిందనే యుండవలె. వ్యక్తులు సంఘములునడుపుచున్నను, వాటివ్యవహారములు కార్మికులు వగైరాలకు దేశముకు క్షేమకరమగునట్లును, చేతిపరిశ్రమల నవిబాధించనట్లును కట్టుదిట్టమగు నియమములు విధించి, ఆప్రకారం సాగించవలెను. కార్మికులకు న్యాయమగు కనీసపుకూలి, సెలవులు, నిరుద్యోగపుబీమా, విద్యాదిసౌకర్యములు కాపాడవలెను, అని అహింసావాదులందురు. 1931 లో కాంగ్రెసువారు (కరాచీలో) ప్రాతిపదికహక్కుల తీర్మానంలో ఈసంగతి స్పష్టపర్చినారు. ఇప్పుడు సాగుచున్న నేషనల్ ప్లాంటింగుకమిటీ రిపోర్టులోను ఈపరిశ్రమలగూర్చిన వివిధసమస్యల శాంతపరిష్కారమునకు సూచనలు చేయబడుచున్నవి.

ఇట్లు వర్గసంఘర్షముకలిగే సమస్యలను శాంతముగా ఉభయపక్షములకు సమన్వయకరముగ పరిష్కరించుటే అహింసావాదుల మతము. అదేస్థిరము న్యాయపరిష్కారము నగును.

# 25. వ్యక్తిసాధన

## 1. ఆహార నియమములు.

జనులు అహింసాపరులగుటకు జాతీయసాధనతో బాటు వ్యక్తులు తమదైనిక జీవితంలోను సాధనచేయవలెను. వ్యక్తుల సమూహామే సంఘము. వ్యక్తులు శ్రద్ధతో నిగ్రహము నలవర్చుకొని అహింసాపరులైనప్పుడే, జాతికంతకు అహింసాతత్త్వము వ్యాపించును, స్థిరపడును.

పూర్వఋషులు నిరంతరసాధనవల్లనే అహింసాపరులై లోకోత్తరమైన అద్భుతశక్తు లార్జించిరి. ఆయాచరణను గమనించి ఇప్పటిపరిస్థితులకు దగినట్లు మార్పుతో నిగ్రహసాధనకు యత్నింపవలెను. ఇందుకు తగినకృషి జరుగనందుననేఅహింసాతత్త్వమింకనువ్యాపింపలేదు. ఈనిగ్రహసాధనమార్గములకొన్నిటినిపరిశీలింతము. ఇందన్నిటిలో మొదటిది ఆహారనియమము. మనపూర్వికులేగాక, ఇప్పటి ఆయుర్వేదవైద్యులు, వైద్యశాస్త్రజ్ఞులు, మనశ్శాస్త్రజ్ఞులు, నీతిశాస్త్రజ్ఞులు, ధార్మికులుగూడ దీనికి ప్రాముఖ్యమిచ్చినారు. ఆహారనియమమును గాంధిమహాత్ముడు తన దైనిక జీవితంలో చాలశ్రద్ధతో అవలంబించును; ఆయనలఘువగు సాత్వికాహారమును భుజించును. తన ఆచరణానుభవములను ఆయన హరిజన పత్రికలో చాలసార్లు తెలపి, అట్లు జనులందరు ఆచరింపుడని ఉద్బోధించి యున్నారు.

అందరికీ సరిగా ఒకేరీతిఆహారము కుదరదు. వారివారి దేహతత్వము అభ్యాసము అవకాశమునుబట్టి అహారములో మార్పులుండును. కాని, కొన్నిముఖ్యసూత్రములుమాత్ర మందరు అనుసరింపవలె.

జిహ్వాచాపల్యము వదలినప్పుడే ఆ యింద్రియముతోపాటు తక్కిన యింద్రియములును వశము కాగలవు. మరియు ఆహారతత్వము మనరక్తమును, నాడులకువ్యాపించును; వాటికిమనస్సుతోను హృదయంతోను సన్నిహితసంబంధమున్నది. ఆహారమే రక్తాదులుగమారి, దేహపు

వివిధాంగముల పునర్నిర్మాణము చేయును. వీటినుంచియే, మెదడు హృదయముగూడ పరిణామమొందునుగదా. అన్నపు ప్రాధాన్యమును వేదములందును ప్రశంసించిరి. జ్ఞానసంపాదనకు మోక్షముకును ఆహారశుద్ధియవసరమని ఉపనిషత్తులలో స్పష్టపర్చినారు. †భగవద్గీతలో నుయుక్తాహారవిహారులకు యోగము సరిగనుండునన్నారు*

గీతాకారులు ఆహారము మూడువిధములని విభజించి, అందు సాత్వికాహారమే క్షేమకరమని ఆయుశ్శాదివర్ధకమని సుఖకరమని స్పష్టపర్చినారు; స్నిగ్ధమై, స్వాదువై స్థిరమై హృద్యమైనవే సాత్వికాహారములన్నారు ‡పులుసు కారము ఘాటు, గల్గి ఉద్రేకము శోషణమునిచ్చునవి రాజసములు; అవి దుఃఖము, బాధ రోగముఁగల్గించును. ఇట్లేమాంద్యము మత్తుగల్గించునవి నిలవయుండిచెడునవి తామసములు, అధమములు. అహింసను దైవిప్రకృతిని కోరువారు సాత్వికాహారమునే గ్రహింపవలెను.

§పులుపులో రక్తమును విరుచుగుణమున్నది. కారము, పొగాకు దేహములో మంటను శోషణమును గల్గించును కనుక, వాటిని మనవైద్య

---

† అన్నం బ్రహ్మేతివ్యజానాత్ ...(తైత్తి)...
ఆహారశుద్ధౌ సత్వశుద్ధిః సత్వశుద్ధౌ ధ్రువాస్మృతిః
స్మృతిలాభే సర్వగ్రంధీనాం విప్రమోక్షః (ఛాందోగ్యోపనిషత్తు)

* అన్నాద్భవంతి భూతాని......
యుక్తాహార విహారస్య...యోగోభవతిదుఃఖహా(గీత......)
అథత్వస్య నివృత్యాతు విశుద్ధం హృదయం భవేత్
ఆహారశుద్ధౌ చిత్తస్య విశుద్ధిర్భవతి స్వతః. (పాశుపతబ్రహ్మో)పనిషత్)

‡ ఆయుస్సత్వ బలారోగ్య సుఖప్రీతి వివర్ధనాః
రస్యాః స్నిగ్ధాః స్థిరాహృద్యా ఆహారాస్సాత్వికప్రియాః.

§ కట్వామ్లలవణాత్యుష్ణ తీక్ష్ణ రూక్ష విదాహినః
ఆహారారాజసస్యేష్టాః దుఃఖశోకామయప్రదాః
యాతయామం గతరసం పూతిపర్యుషితంచ యత్
ఉచ్ఛిష్టమపిచామేధ్యం ఆహారం తామసప్రియం. (గీత.)

శాస్త్రజ్ఞులు యోగాభ్యాసపరులు గూడ నిషేధించినారు. ఇంతకన్నవిశే
షము పులుపు కారము లెక్కువ తినుటవల్ల నాడులందుద్రేకమేర్పడును;
అంతట మనస్సుకునిదానమును హృదయపు నిర్మలత్వమును చెడును.
ఉద్రేకము కోపము హింసాబుద్ధి పరస్పరద్వేషము నేర్పడును. రాజస
తామసాహారములవల్ల దేహాంగములలో సంఘర్షముగల్గి, అందలి ఫలిత
ముగ కామక్రోధమదమాత్సర్యాదులు వృద్ధియగును. ఇట్లువ్యక్తులకైన
ట్లే, హెచ్చుమంది రాజసతామసాహారము తినేయెడల, ఈదుర్గుణము
డే సంఘములో పరస్పరద్వేషము హింసాతత్వము రూపముగ వ్యక్తమ
గును. సాత్వికాహారము అలవర్చుకొనివారు అహింసా పరులైనట్లున్నను
దానిని సరిగా ఆచరింపలేరు. కనుకనే ఋషులు యోగులునేగాక, గా
ధిమహాత్ముడు ప్రఫుల్లచంద్రరాయ్ ఇంకను చాలమంది ప్రసిద్ధమహా
నీయులు సాత్వికాహారమునే పాటించు చున్నారు.

ఈసిద్ధాంతప్రకారం పరీక్షించితే మనప్రస్తుతపు ఆహారపద్ధతినిచాల
సంస్కరింపవలెనని స్ఫురించకమానదు. మిరపకాయ, ఆవ, చింతపండు
గోంగూర వగైరాలు విశేషముగ మనవారు వినియోగించుచున్నారు.
మిరపకాయను మనప్రాచీను లసలేవాడలేదని తోచును. *మనలో ఆవ
కాయ గోంగూర వగైరాపచ్చళ్ళు నిత్యాహారంలో జేరినవి. దక్షిణంలో
మిరియమునే హెచ్చుగవాడుదురు. ఉత్తరమందు కారముకుబదులు తీపివస్తు
వులయలవాటు హెచ్చు. బెంగాలులోమాత్రం ఆవఘాటును ఇట్లే ఆజను
లలో ఉద్రేకతత్వమును హెచ్చు. జనులలో హింసాతత్వము వ్యాపించియుం
డుటకు కొంతవరకు మనఆహారవిహారములలోని లోపములు కారణము
కావచ్చు. అహింసాసక్తులందరును వెంటనేమనసంఘపు ఆహారంలో సంస్క
రణచేయుట యుక్తము. అన్నము కూర వంటలో గంజినీరు వార్చివేయు

* పూర్వపుసంస్కృతవాఙ్మయంలోను ప్రాచీనద్రవిడ భాషలలోగూడ మిరప
కాయ అర్థమిచ్చుపదములులేవు. మిరియపుపేరు మిరపకాయకును వచ్చెను. మరీచి మిరియ
అనునదియు మిరియముకే ఉద్దేశించినదే.

అభ్యాసమును నష్టకరము. అంతశ్శక్తిని ఆరోగ్యమును బాగుపర్చు ఆహారము నేతిను అభ్యాసమును వృద్ధిజేయవలెను. మఱియు మనుష్యులదేహములో ద్రవభాగము హెచ్చు; కనుక (ముఖ్యముగ ఉష్ణప్రాంతమందు) ద్రవాహారము నెక్కువవాడిన, దేహాంగములందు సంఘర్షము ఉద్రేకమును లేకుండును. ద్రవాహారము సులభంగాజీర్ణమై త్వరలో రక్తముగ పరిణమించును.

మనయభ్యాసములలో మరికొన్నిటినిగూడ పరీక్షింతము. మాంసాహారముతినుట హానికరమని మనపూర్వికులందరును శాసించినారు. పాశ్చాత్యులలో మాంసముతినువారుక యున్నను, దానికన్న శాకాహారమే మంచిదని వారిలోను ఈకాలపుకొందరు వైజ్ఞానికులు ఘనవైద్యులు, బెర్నర్డుషావంటి విద్వాంసులుగూడ స్వానుభవముతో తెల్పియున్నారు. ముఖ్యముగ మనయున్నదేశములో మాంసాహారము హానికరము. మద్యము కేవలం తామసము బాధకమునని అందరికి తెలిసినదే.

పూర్వము కొందరార్యులు యజ్ఞయాగములందును అతిథులనిమిత్తమును జంతుమాంస మర్పించినట్లున్నది. కాని త్వరలోనే మరల మద్యమాంసములు అయోగ్యములని స్మృతికారులు నిర్ణయించినారు. మాంసాశనంవల్ల జీవహింస హెచ్చుటేగాక మాంస పోషితమగు దేహమనస్సులందుజంతుతత్వముండుటయు నిజము. యథార్థమునకు నరజాతి అసలు జీవపరిణామములో 'ప్రైమేటు' (ప్రథమశాఖది.) ఇది సౌమ్యజాతి. ఈశాఖలోని కోతులు వగైరాలు నేటికిని శాకాహారులే. మఱియునరులదంతములు ఫలశాకములభోజనముకే తగినవి. పులులు, కుక్కలు వగైరాలకున్నట్లు మాంసము కొరుకుటకు చీల్చుటకు పెద్దకోరలు గోళ్ళుగోళ్ళు లేకుండుటనుబట్టియు, నరులు మాంసాహారులగుట సృష్టిసంకల్పము కాదనియు, పండ్లను, ధాన్యాదులు, అన్నమును, దుంపలు, కాయగూరలను దినుటే సహజమనియు, ప్రసిద్ధజీవశాస్త్రజ్ఞులు

తేల్చినారు. మరియు మొత్తంమీద శాకాహారులధీశక్తి హృదయము మాంసాహారుల వాటికన్న ఉత్తమములు.

ఆహారము మంచిదేగాక మితముగ నుండవలె. దేహపోషణకవసరమైనదానికంటె హెచ్చుగ కేవలం రుచికని తినుట దురభ్యాసము. అందువల్ల అన్నకోశము బలువెక్కి ఆయాసమై నాడులకును శ్రమ కల్గును; మరియు తిన్నదానిలో కొంత జీర్ణముకాక తిత్తులలో చిక్కుకొని, దేహంలో మంటను ఉద్రేకమును వ్యాధులను గల్గించును; జీర్ణమైనను హెచ్చు కండపెరుగుటయు ప్రశస్తముకాదు.

అహింసాదృష్టినేగాక, ఆరోగ్యముకును మితభోజనమే. మంచిదని వైద్యశాస్త్రజ్ఞులు ఆరోగ్యవిజ్ఞులును తెల్పియున్నారు†అన్నకోశములో సగముకుసరిపడు భోజ్యములే తిని, ¼ వ వంతుకు నీరుత్రాగవలెనని, శేషించిన ¼వ వంతు వాయుసంచారముకువదలవలెనని, వైద్యాచార్యుల మతము. †అతిభోజనమును అభోజనమువలె హానికరమని, దుఃఖకరము పాపకార్యమనియు శాస్త్రవచనములున్నవి* నరులు 'కడుపునిండ బాగా తినవలె; జీవించుట తినుటకే' (Live to eat) అని కొందరందురు. కాని యిదివిషయలోలతను వృద్ధిచేయునది, అహింసాతత్వముకు వ్యతిరిక్తము. దీనికన్న "జీవించుటకే తినుట" (eat to live) అను సిద్ధాంతమే న్యాయసమ్మతము.

అప్పుడప్పుడు ఉపవసించుటయు మంచిది. మితాహారులకును మిత్రులతోసహా పంక్తివైరాలలో అతిభోజనము జరుగుచుండును. కనుక, పక్షముకొకరోజు లేదా వారముకొకపూట ఉపవసించి, అన్న

† కుక్షేర్భాగద్వయం భోజ్యైః తృతీయే వారిపూరయేత్ ॥ వాయోస్సంచరణార్థాయ చతుర్థ మవశేషయేత్. (సుశ్రుతం)

* నాత్యశ్నతస్తు యోగోఽస్తి నచైకాంతమనశ్నతః । తుల్యాహారవిహారస్య యోగో భవతి దుఃఖహా (గీత).

అనారోగ్య మనాయుష్య మస్వర్గ్యం చాతిభోజనం । అపుణ్యం లోకవిద్విష్టం తస్మాత్తత్ పరివర్జయేత్. (మనుస్మృతి)

కోశముకు మనస్సుకుగూడ విశ్రాంతినిచ్చుట, అప్పుడీశ్వరుని భజించుట, భౌతికముగ, మానసికముగ, (ఆధ్యాత్మికముగను) మంచిది. ఏకాదశి, శనివారవ్రతము మాసశివరాత్రి, ఇత్యాదులం దీసూత్రమిమిడియున్నది. ఉపవాసము చికిత్సకమని, 'లంఘనం పరమౌషధం' అనియు, వైద్యశాస్త్రజ్ఞులు చెప్పినారు. మితభోజనములోను కొంత అట్టి సుగుణమున్నది. హృదయశాంతికి పరిశుద్ధికిగూడ ఉపవాసముమంచిది. దేశమందు సాంఘికహింస రాజకీయప్రమాదము. ఇట్టివితటస్థించినప్పుడు హింసాభావము చెలరేగకుండ హృదయశాంతి సంపాదించుటకై గాంధిమహాత్ముడు అప్పుడప్పుడు దీర్ఘోపవాస మొనర్చుటకలదు†

మనదేశము చాలబీదది. చాలమందికన్నము దొరుకుటే కష్టము; కనుక పాలు వెలగలపండ్లు ఆరోగ్యదములైనను, చాలమందికవి దొరకవు. బీదలకును దొరకు ఆరోగ్యవస్తువులనుగూర్చి ఇటీవల గాంధిమహాత్ముడు దీర్ఘంగా పరిశోధించి కొన్నిసంగతులు కనిపెట్టినారు. కొన్ని చౌకరకపు నారింజ కమలాలవంటి పళ్లును చిక్కుళ్ళవంటి కూరగాయలును కొబ్బరి వేరుసెనగకూడ హెచ్చుకిమ్మతు వస్తువులకన్నను చాల పుష్టిని ఆరోగ్యమును గల్గించును. అయితే, వాటినుడికించి నీరువార్చియు కాల్చియు తయారుచేయుటలో పాడుచేయుచున్నామని ఆయన కనిపెట్టినారు. మరియు, తోటకూర బచ్చలకూరవంటి ప్రతిగ్రామంలో సులభంగాదొరుకు వాటిని, హెచ్చు పులుసు కారం చేర్చకయు, వాటి ఉడుకు నీరువార్చకయు, అవసరమైతే పరిమళవస్తువులతో చేర్చి చాల రుచ్యముగ చేయవచ్చును. అవి దేహమును చాలమంచివి. ఇట్లు గ్రామస్థులు చౌకగనే ఆరోగ్యకరము సౌమ్యమునగు భోజనము చేయవచ్చును. ఇట్టి యాహారము అహింసా వర్ధకము నగును.

---

† 1922, 1924 లలో సాంఘికహింసగల్గినప్పుడు 1932లో బ్రిటిషుప్రధాని హరిజన సంఘమును వేరుచేయజూచి నప్పుడు 1938 లో మరల ఆయనజరిగించినయుపవాసములట్టివే.

ఇట్లే మరబియ్యము ఫ్యాక్టరీపంచదార వగైరాలపద్ధతివల్ల, ఆవస్తువుల జీవశక్తిచెడును; వాటిని తినువారు పైకిపుష్టిగ కనుబడినను రోగయుతులగుట చూచుచున్నాము. దంపుడుబియ్యము బెల్లము ఇత్యాదులు దేహపు జవసత్వములను సౌమ్యతను హెచ్చించును. తామసాభ్యాసములవల్ల యహంకారమును వానిద్వారా దౌర్బల్యమును అశక్తతయు ముక్కోపితనమును హెచ్చును. చుట్టగాల్చి నప్పుడు వచ్చుపొగ చుట్టనున్న మంచిగాలిని చెరుపును; దాని దుర్గంధమును వాయువులో చేరును; కనుకనే చుట్టవాసనను ఆమర్వాయువుచు కాల్చువారితోపాటు చుట్టుపట్లనున్నవారును అనుభవించవలె. అభ్యాసమైనవారికి తెలియకున్నను, ఇది నిజంగా బాధకమే. పొడుముపీల్చుటలో ఇట్టి బాధలు లేవు. కాని పొడుమును పొగాకుపొడియే నాసారంధ్రముద్వారా లోనికెక్కి మెదడుకు ఉద్రేకము గల్గించును; ముక్కుకు సహజంగానుండే వాసనశక్తిని చెరుపును; ఇది ఉత్తేజకము కనుక లాభకరమని కొందరెంచుదురు; కాని అదిభ్రమ. నల్లమందు, చుట్ట వలె పొడుము అభ్యాసమును విడువలేక, అది ఉపయోగకారియని జనులనుకొందురు. పొడుము చుట్టకూడ ఇటీవల మనలో శ్రోత్రియులును స్త్రీలు పిల్లలుకూడ వాడుచుండుటవిచారకరము ఇట్టి దురభ్యాసములు తమతోపాటు పిల్లలకు వ్యాపించును. కొన్ని యితర సూచనలు:—తలంటుకొనెడు నూనె వగైరాలు మంచివిగ నుండవలెను. కుంకుడుకాయలరసము మంట గల్గించునని తెలిసినదే; అది చర్మముకు నాడులకును హానికరము. దానికన్న శీకాయయు, అంతకన్నను బావంచాలపిండియు, సున్నిపిండియు, తలబట్టు రుద్దుటకు ఎక్కువ మంచివి. కుంకుడురసము తలను శుభ్రపర్చినను మెదడుకు నిర్మలత్వమీయదు. ఇట్లే ఆహారవిహారము లన్నిటిని పరిశోధించి, సాత్వికములు క్షేమకరములు అగువానినే వాడుకోవలెను. ఇవి అహింసాతత్వముకు సాధకములు.

# 26. ఉచిత వ్యాయామము.

అహింసాపరులు దేహపరిశ్రమరూపమగు వ్యాయామము చేయ దగునా ? అను ప్రశ్న యిటీవల ప్రాముఖ్యమునకు వచ్చినది. సాంఘిక తత్వముతో తమమతపువారి ప్రాబల్యము నెల్లెడల కాపాడదలచువారు ప్రత్యేకపు వ్యాయామశాల లేర్పరచి, కసరత్తు, కర్రతిప్పుట, కత్తిసాము ఇట్టివాటి నభ్యసించుట కలదు. కొన్ని ముస్లింసంఘములు, తాలింఖానాలు పెట్టినారు. ('తాలింఖానా' అనగా విద్యాశాల; కాని వాటిలో భౌతికబలవృద్ధికే ప్రాముఖ్య మిచ్చుచున్నారు.) ముస్లింలీగువారి సానుభూతితో ఇటీవల దేశమంతట వ్యాపించిన ఖాక్సరుసంఘములు బెల్చాలను తవ్వకోలలవంటి పొడుగు ఇనుప ఆయుధములు ధరించి పటాలములవలె వీథులలో తిరుగుచు నియంతృపద్ధతి ననుసరించుచు, ముఖ్యమైనమసీదులు వశపరుచుకొని దౌర్జన్యపద్ధతు లారంభించినారు. ఇందువల్ల లాహోరు వంటి కొన్నిముఖ్యపురములలో హింసాచర్యలు రక్తపాతకములును కల్గినవి. వీరి భౌతికబలప్రదర్శనము హింసాధోరణి కొన్నిహిందూ సంఘాలకు భీతిని గల్గించినది. దౌర్జన్యముతో హిందువులను ముస్లిములుగ జేయుటకు 'ముస్లింహుకూమతు'ను వ్యాపింపజేయుటకు గూఢయత్నముల జేయుచున్నారని సూచనలు వచ్చినవి. అంతట కొన్నిచోట్ల హిందువులును 'శక్తిదళ'ములు 'వానరసేనలు' స్థాపించి, భౌతికబలములోను కవాయతులోను యువకులను తయారుచేసినారు. ఇట్లు పరస్పరం అనుమానపడి ఒకరినొకరు డీకొనుధోరణిలో దిగినారు. ఇటీవల పంజాబు. ఢాకా, బొంబాయి, అహమ్మదాబాదు వగైరాలలో 'హిందూ ముస్లిముల అల్లరులు', కూనీలు, దోపిడులు జరిగినవి. వీటిలో గుండాలే హింసాచర్యలు చేయుచున్నను, వీరివెనుక సంధానము చేయువారున్నారని సూచనలు కల్గినవి.

ఇట్టి స్థితిజూచి, సాంఘికతత్వపు వ్యాయామశాలలలో అహింసాపరులు కాంగ్రెసువాదులు పాల్గొనకూడదని గాంధిమహాత్ముడు సూచిం

చినారు. మరియు, రాజకీయమోక్షముకై భౌతికబల ముపయోగించుటకు కొందరి కుద్దేశ మిదివరలో కలిగినది. అయితే ప్రభుత్వంవారు భారత జాతినంతను (మొత్తంమీద) నిరాయుధులుగ జేసియున్నారు. ఆయుధము లను జనులు తెచ్చుకోకుండగను వాడకుండను చట్టంద్వారా కట్టు దిట్టములు చేసినారు. కనుక యీయువకులు రహస్యంగా పిస్తోలులు వగైరాలు సంపాదించి వాటి ప్రయోగము కల్గించిరి; ఆయుద్యమము విఫలమైనదని చూచియున్నాము.

ఇట్టి స్థితిలో మనదేశపు అహింసాపరుల కర్తవ్యమేమి ? అహింసాపరు లందరును నియమితముగ వ్యాయామము చేయదగు ననియే తోచును. ఆరోగ్యమును ధైర్యమును అహింసా వృద్ధికి అత్యావశ్యకములు గదా! అట్టివి సామాన్యశక్తియు నీరోగతయు నున్నప్పుడే కల్గును. ధర్మసాధనకు కర్మయోగముకు శరీరారోగ్యపురక్షణ ముఖ్యము. అహింసాసాధన కవసరమగు నిగ్రహమును నాడుల స్థైర్యమును వశీకరణమును వ్యాయామంద్వారా సాధింపగలము. సకాలంలో ప్రతిరోజు వ్యాయామము చేయుటవల్లనే ఆరోగ్యము నిగ్రహధైర్యములును సులభసాధ్యములు. సరియైన వ్యాయామమువల్ల దేహకాంతి, ఆకలి, చురుకుదనము, స్థైర్యము ఓపిక, సహనశీలత, మంచి ఆరోగ్యము ను కల్గునని శాస్త్రజ్ఞులును చెప్పినారు.* అనగా అట్టిగుణము లిచ్చునదే సరియైన వ్యాయామము. వ్యాయామపద్ధతులలో చాలరకములు కలవు. పాశ్చాత్యసంప్రదాయపు డంబెల్సు వగైరా పద్ధతులు కేవలం భౌతిక శక్తిని కండను పెంచి హింసాపరత్వమును తీవ్రతను గల్గించును; అందు వల్ల భౌతికంగా అధికారం చలాయించు వాంఛయు హెచ్చును. అట్లుగాక

---

* శరీరోపచయః కాంతిః గాత్రాణాం సువిభక్తతా ।
దీప్తాగ్నిత్వ మనాలస్యం స్థిరత్వం లాఘవం మృజా ।
శ్రమక్లమ పిపాసోష్ణ శీతాదీనాం సహిష్ణుతా ।
ఆరోగ్యంచాపిపరమం వ్యాయామా దుపజాయతే. (చరక సంహిత.)

మితముగ దేహపరిశ్రమ గల్గించి నిగ్రహమును ఇంద్రియవశీకరణమును పరోపకారబుద్ధిని మనస్సామ్యతను ఆంతరిక తేజస్సును గల్గించునవే ప్రశస్తములు. రాటముపైన సంధ్యవేళలందు రోజును నూలు దీయుట మొదలగు గృహపరిశ్రమలు స్త్రీపురుషులందరికి ఆరోగ్యము కవసర మగు పరిశ్రమ నిచ్చును; అవి హృదయరంజకములు, నిగ్రహశక్తి గల్గించునవి, సమత్వబుద్ధిని జనింపజేయునవి, అనగా త్రికరణములకు కృషినిచ్చి సమన్వయించునవి.

అట్టి పరిశ్రమ పాశ్చాత్యుల వ్యాయామమువలె కాక, ఆర్థికముగను ఉత్పాదకము, ఉపయోగకరము, ఆత్మవికాసకరము. కనుక, అహింసాపరు లిట్టిసమన్వయకరమగు పరిశ్రమను సాగించదగును. ప్రతి దినమును (ముఖ్యంగా ఉదయవేళ) నడచుటయు ఆరోగ్యకరము. ఆయా జనుల ఆవశ్యకతనుబట్టి దూరము నిర్ణయించుకోవచ్చు; అందువల్ల పరిశ్రమగల్గును; ఊరిబయట ప్రశాంతస్థితిలో సూర్యకిరణములు తగులు నట్లు నడచుట గాంధిగారి కభ్యాసము. ఆయన ప్రతిరోజును నూలు వడకును; ఆయన 'దుర్బలు'డైనను మంచి ఆరోగ్యముగల్గి ఇంగ్లండులో అతిశీతమును ఇక్కడి మండువేసవిలో అత్యుష్ణమును సహించుచు, ఎల్లప్పుడు నిరంతరదీక్షతో ప్రజలకై పనిచేయగల్గినారు.

సూర్యకిరణములు మంచి ఆరోగ్య మిచ్చును. భూమిమీదనున్న శక్తియు జీవకళ అంతయు ప్రత్యక్షంగానో పరోక్షంగానో సూర్యకిరణ ములనుండియే కల్గును. అట్టిసూర్యకాంతి ఉదయమే దేహంపైన స్వీకరించి దాని ననుభవించుట లాభకరము. భగవంతుని త్రిమూర్తిత్వము అనగా సృష్టిస్థితి లయశక్తి సూర్యబింబములో నిమిడియున్నది. కనుక ప్రతిరోజును సంధ్యావందనము సూర్యనమస్కారములు చేయుటలో ఆధ్యాత్మికతతో బాటు దేహపరిశ్రమయు చేరియున్నదని పెద్దలభావము.

పూర్వు లేర్పర్చిన మరొక దేహపరిశ్రమ యోగాభ్యాసము; ఇది మూడు విధములది; హఠయోగము భౌతికము; వివిధమైన ఆసనముల వల్ల దేహారో[illegible] వివిధాంగములకు చెమటపట్టి పరిశ్రమ గల్గుటేగాక,

అవి యన్నియు వశమై, హృదయమునకు ఆత్మకు వీటిపైన క్రియాత్మకమైన ఆధిపత్యము చేకూరును, నాసారంధ్రాములద్వారా జలదుగ్ధాదులు పీల్చుటవల్ల ఇంద్రియములును శుభ్రపడి వశమగును; ఇట్లు జ్ఞానకర్మేంద్రియములన్నియు శుద్ధమై, లోపల సంఘర్షము ఉద్రేకము పోవును.

మరియు, దేహంలో ఆయానాడులకు కూడలియగు కేంద్రస్థానములున్నవి. కుండలినీయోగాదులవల్ల ఇట్టికేంద్రములద్వారామనోహృదయములును దేహికి వశమగును. అట్టి మహాయోగులకు అతీంద్రియ శక్తులునుగల్గునని, వారుభూమినుండి తమంతటపైకి లేచి, భౌతికాధారము లేకుండ గాలిలో సంచరించగల్గుదురని, చెప్పుదురు. జ్ఞానయోగము బుద్ధికి ఆధ్యాత్మికతకు సంబంధించినది. ఈశ్వరతత్వము జీవాత్మ వీటికి ప్రకృతికినుండు సంబంధము జ్ఞానసంపాదనము వీటివివరణము జ్ఞానయోగములో కల్గును.

ఇక మూడవదగు రాజయోగము పై రెంటికి సమన్వయమనదగును. ఇందులో యమనియమాసన ప్రణాయామాది అష్టాంగముల ద్వారా దేహము మనస్సు హృదయము కూడ నిగ్రహమునకు లోబడి, అన్నమయము, మనోమయము, ఆనందమయము ఈమూడు కోశములకు పూర్తియగు సమ్మేళనము జరుగును. అప్పుడు ప్రకృతి రహస్యములు తెలిసి దివ్యజ్ఞానము లభించును. ఈశ్వరప్రణిధానము జీవన్ముక్తిగూడ కలుగును. ఈరాజయోగపు మొదటి మెట్టులోనే అహింసాభావమునకు ప్రత్యేకస్థాన మిచ్చినారని యిదివరలో చూచియున్నాము * కాని ఈయోగశాస్త్రపు ప్రక్రియమాతయు అహింసా సిద్ధాంతముపైనే నిర్ణీతమైనవి. త్యాగులు, దయాళువులు, లోకహితపరులు అగు వారికి యోగముద్వారా అతీంద్రియశక్తులు బాగుగ లభించును. స్వార్థపరులకు ఆసురతత్వపరులకు ఇవి ఒకవేళతపోబలమున అబ్బినను స్వలాభోద్దేశమునకు హింసాకార్యమునకు వినియోగింపదలపగనే, ఆతపశ్శక్తి యంతయు హరించిపోవునని యు శాస్త్రములో విధించినారు.

---

* 1 వ భాగం 149 వ పుట చూడుడు.

# 27. బ్రహ్మచర్యము.

అహింసాసాధనకు బ్రహ్మచర్యమును ముఖ్యాధారము. భారతీయ సంస్కృతిలో పూర్వము బ్రహ్మచర్యముకు ప్రాముఖ్యమిచ్చినారు.

సంస్కృతంలో 'బ్రహ్మ'శబ్దముకు ('చర' ధాతువుకుగూడ) చాల అర్థములున్నవి. 'బ్రహ్మచర్య'పదమును ముఖ్యంగా 3 అర్థములలో వాడినారు. 1 ఈశ్వరప్రార్థన 2 వేదసారమగు ఉన్నతవిజ్ఞానమభ్యసించుట 3 స్త్రీసంగమపు విసర్జన. అహింసాసిద్ధాంతప్రకారం ఈ మూటికిని పరస్పరసంబంధమున్నది. కాని, ఈకాలమందు ఈమూడవ అర్థంలోనే ఈపదము రూఢమైనది. అనగా త్రికరణశుద్ధితో స్త్రీపురుష సంయోగమును నిగ్రహించి వీర్యరక్షణచేయుటే బ్రహ్మచర్యము.†

అయితే, బ్రహచర్యపు ఉద్దేశము సంయోగమెవరికిని అసలే కూడదని కాదు. ప్రకృతిలో జీవజాతులవృద్ధికి స్త్రీపురుషసంయోగమవసరము. ధర్మముకై సాధకమగు కామముమంచిదే. అది అవసరమైన సంతానము లభించుటకే ఉద్దేశింపబడినది. సాధారణంగా జంతువులును కొన్ని నియతకాలములందే సంయోగమొందును; గర్భోత్పత్తికాగనే మానివేయును. ఇంద్రియలోలతకు వ్యసనముకు సంగమము చేయుట తప్పని శాస్త్రోద్దేశము.

సంతానముకును మితము తప్పకూడదు. భూమిపైన జంతుజాతులకు, ముఖ్యంగా నరజాతికి లభించుస్థలమును ఆహారాదులును మితములు. అన్నిప్రాంతాలలో వివిధమగు నరజాతులు వృద్ధియగుట . యీశ్వరసంకల్పము. అట్టిస్థితిలో మితిలేకుండ సంతానవృద్ధియగుటవల్ల జనసంఖ్య విపరీతముగ హెచ్చును. ఇప్పుడు భూమిమీద సుమారు 200 కోట్ల నరు

---

† బ్రహ్మచర్యప్రతిష్ఠాయాం వీర్యలాభః (యోగదర్శనం)
కాయేన మనసావాచా సర్వావస్థాసు సర్వదా
సర్వత్ర మైథునత్యాగం బ్రహ్మచర్యం ప్రచక్షతే (యాజ్ఞవల్క్యస్మృతి)

లున్నారు. జనులసంఖ్య దినదినమును పెరుగుచున్నది. కొన్నిప్రాంతాలలో జనాభా దట్టమగుటవల్ల ఆప్రాంతంలో వృత్తులు ఆహారము అందరికి చాలక జనులకు నిరుద్యోగబాధ కల్గినది.

ఇట్లు జనసంఖ్య వృద్ధికి మితితప్పుటవల్ల కొన్ని క్లిష్టసమస్య లేర్పడినవి. కొన్నిప్రాంతాలలోని క్షామమునకును ఆయా నాగరికజాతులమధ్య సంఘర్షణమునకును ముఖ్యంగా యూరపులో సాగుచున్న ఘోరయుద్ధములకును యూరపుదేశాలలో శ్వేతజాతుల జనసంఖ్య విపరీతముగ వృద్ధియగుట ముఖ్యకారణమని కొందరి అభిప్రాయము. ఇప్పుడు 'ఆక్సిస్'వర్గమనబడుజర్మనీ, ఇటలీ, జపాను ఈమూడుదేశాలలోను గత 40 ఏండ్లలో జనసంఖ్య విపరీతముగ పెరిగినది. అందువల్ల స్వదేశములోని స్థలమును ముడివస్తువులును ద్రవ్యమును చాలవనియు వలసదేశములు వ్యాపారస్థలములు గావలెననియు వాదించుచు, ఆజాతులవారు లోకువయైన ప్రక్కదేశాల నాక్రమించుటకు యత్నించి, ఆపనిని దౌర్జన్యముతో సాధించుటకు యుద్ధసన్నద్ధులైనారు. బ్రిటిషు వారిదివరకే కొద్దిజనసంఖ్యగల ఉత్తరఅమెరికాను దక్షిణాఫ్రికాను ఆస్ట్రేలియా ఇత్యాదులును ఆక్రమించి, వాటిని వలసరాజ్యాలుగ చేసుకొన్నారు. బ్రిటనులోని పెచ్చుజనాభా ఆయావలసరాజ్యాలలో సరుదుకొనుచు, అచటి ఆదిమనివాసులను చిరకాలమునుండియున్న భారత దేశీయాసులను అణచి, బాధించుచున్నారు; మరియు భారతదేశాదులనుండి వస్తువులదెచ్చుకొని, తమయాంత్రికపుసరుకు లక్కడదింపి, ఆదేశములసంపత్తును లాగి, బాగుపడుచున్నారు. చీనావిషయంలో జపానును ఇట్లేచేయుచున్నది. ఇట్లెల్లకాలము సాగదు. ఇప్పుడు జ్ఞానముకలిగి, సంతానము తగ్గించవలెనను భావము యూరపియనుల కేర్పడినది.

అయితే సంతాననిగ్రహముకని సంయోగనిగ్రహముకు బదులువారు కృత్రిమసాధనము లారంభించినారు. స్వేచ్ఛాసంయోగముచేయుచునే కొన్ని పరికరము లుపయోగించి వాటిమూలమున గర్భోత్పత్తిని తప్పించు

మార్గములు కనిపెట్టినారు. ఈయంత్రసాధనము లిప్పుడు ఫ్రాంసు అమెరికాలలో, కొంతవరకు బ్రిటనులోను, మరికొన్ని దేశాలలోను, నవనాగరికతతోబాటు వ్యాపించుచున్నవి. ఈసాధనములున్నను సకృత్తుగ గర్భోత్పత్తి కావచ్చును. అదిగాక, ఈపద్ధతి పాశ్చాత్యసంస్కృతికే తగియున్నది. ఇందువల్ల అక్కడిస్త్రీపురుషులలో పశుతత్వము విషయలోలత విచ్చలవిడివిహారము హెచ్చినవి, రాజసధోరణి ప్రబలినది. ఈపద్ధతివల్ల జననేంద్రియములకు నాడులకు ఉద్రేకము హెచ్చును. ఇది ప్రకృతికిని విరుద్ధమని తెలిసినదే. మనదేశంలోను జనసంఖ్య పెరుగుచున్నది మన దేశము విశాలమైనను, ఇప్పుడున్న జనులకును కడుపునిండ తిండియు ఒంటికిబట్టయు త్రాగనీరును లేక కోట్లకొలదిజనులు బాధపడుచున్నారు. ముఖ్యంగా బీదజనులలో జనసంఖ్య వేగముగ హెచ్చుచున్నది. మరియు యూరపులోకంటె మనదేశంలో దామాషాను జననములు మరణములు గూడ చాల హెచ్చు. అందువల్ల జనులఆరోగ్యము త్వరలో క్షీణించును.

సంతానసంఖ్య మితముగ జేయుటకు సహజమార్గము బ్రహ్మచర్యము. సంగమంమానితే గర్భోత్పత్తియుండదు. మనపూర్వికులు సంతానముకావలసినప్పుడే సంగమము జరుగవలెనన్నారు. విషయలోలతతోను కామావేశంతోను సంగమించుటవల్ల ఇంకొక యనర్థము నుండును. తల్లిదండ్రుల రూపరేఖలవలె వారిగుణగణములును సంతానముకు కల్గుట సహజము; కనుక కామోద్రేకము పిల్లలకును సంక్రమించును.

బ్రహ్మచర్య మలవడుటమంచిదైనను దుష్కరమను భావము సామాన్యముగ వ్యాపించియున్నది. ఈసమస్యను కేవలం భౌతికదృష్టితోగాక, నైతికదృష్టితో పరిశీలించవలెను. మత్తుకను ఉద్రేకముచు గల్గించు ఆహారవిహారములు విడువవలెనని, మితమగు వ్యాయామము చేయవలెనని, భక్తిగల్గియుండవలెనని, యోగనిగ్రహము లభ్యసించవలెనని, బ్రహ్మచర్యముకు ఇట్టిసాధనములు మనపూర్వులు నిర్ణయించినారు, వీటిని ప్రీతైనంతవరకు ఆచరణలో బెట్టవలెను. మరియు మనస్సుకు ఇం

క్రియములకు అత్యంతసంబంధమున్నది. మనసులోని తలపులప్రకారమే భావములు, ఇచ్ఛ, అందునుబట్టిమాటలు, ప్రయత్నములు, కార్యములు జరుగునుగదా! మనస్సులో పరిశుద్ధి నిర్మలభావము నభ్యసించితే బ్రహ్మచర్యమబ్బుట సులభము. *కేవలం కామోద్దీపనగల్గించు కథలు కావ్యములు చదువుటను తగ్గించవలెను. మరియు స్త్రీలు తమ ఇంద్రియవాంఛల దీర్చుటకే ఏర్పడినారనియెంచివారిని తమయిష్టప్రకారం వినియోగించుట అనేక పురుషులకుండు అలవాటు. అది పోవలెను. స్త్రీలకు మన స్వాతంత్ర్యము నీయవలెను.

బ్రహ్మచర్యమువలన కలుగు ఉపయోగములు పూర్వగ్రంథాలలో చెప్పబడినవి. దానివల్ల జనుల తేజస్సును జ్ఞానమును నీతియు ఆరోగ్యమును హెచ్చి సంఘమంతయు బాగుపడును. †వ్యభిచారాది దురాచారములు, అందువల్ల కలుగు ఆధివ్యాధులు సాంఘికారిష్టములును పోవును. ఊర్ధ్వరేతస్కులగు పూర్వపు ఋషులకు లోకోత్తరమగు జ్ఞానశక్తులు తేజస్సును గల్గుటకు వారి బ్రహ్మచర్యము ముఖ్యకారణము. మరియు బ్రహ్మచర్యపద్ధతిని సరిగా అమలుజరిపినయెడల ఇప్పుడు ఈదేశములోజరుగు అతిబాల్యవివాహములు, వృద్ధవివాహములు అనేకభార్యాత్వము ఇట్టివిపరీతప్రవృత్తులుండవు. పూర్వసిద్ధాంతప్రకారం ఆశ్రమధర్మముకుబ్రహ్మచర్యసూత్రమే పునాది. పురుషుడు 25 ఏండ్ల వయస్సువరకు

---

* యన్మనసామనుతే తద్వాచావదతి, యద్వాచావదతి తత్కర్మణాకరోతి,
యత్కర్మణాకరోతి తదభిసంపద్యతే॥ (యజుర్వేదబ్రాహ్మణం)
ధ్యాయతో విషయాన్ పుంసః............(గీత)

† కాంతింకాంతిం స్మృతింజ్ఞానం, ఆరోగ్యం చాపిసంతతం।
య ఇచ్ఛతి మహద్ధర్మం బ్రహ్మచర్యం చరేదిహ ॥ (ధన్వంతరి)
ఏకత శ్రుతయో వేదాః బ్రహ్మచర్యం ... (ఛాందోగ్యోపనిషత్తు)

బ్రహ్మచారిగనే యుండవలెను. పిమ్మట గృహస్థుడైనను యుక్తకాల మందు నియమితముగ సంగమించవలెను. అంతట, పౌత్రుడు జనించియో, తల నెరిసియో కాలము రాగనే, వానప్రస్థుడై, బ్రహ్మచర్యము నే తుదివరకవలంబించవలెను † బ్రహ్మచారి హింసాదుల సనలే చేయకూడదు. ‡

ఇట్లు ఆచరించువారికి అహింసాతత్వ మలవడుట సులభసాధ్యము. బ్రహ్మచర్యపు ప్రాముఖ్యమును గమనించియే గాంధిమహాత్ముడును అహింసాసాధనలో బ్రహ్మచర్యావలంబనమునకు ముఖ్యస్థాన మిచ్చినారు; తాను స్వయముగ 30 ఏండ్లవయస్సునుండి బ్రహ్మచర్యమాచరించుచున్నారు. బ్రహ్మచర్యములోనున్నప్పుడు స్త్రీసంబంధమసలే మానుకొనక్కరలేదు. పరస్పరము కామభావము లేకుండ సంఘసేవాపరులై విశ్వప్రేమతో వర్తింపవలెను. కొందరు భీష్మకణ్వ హనుమదాదులు యావజ్జీవము బ్రహ్మచారులయి, చిరాయువులై లోకసేవజేసిరి; కొందరు (శంకరాదులు) బ్రహ్మచర్యమునుండియే సన్యసించిరి. కనుక, ప్రతివాడును గృహస్థుడుకావలెనను నియమము పూర్వం ఆచరణలో లేదు. కొందరు స్త్రీలును బ్రహ్మచారిణులై యుండిరి.

బ్రహ్మచర్యమును అహింసయు శరీరమునకు తపశ్శక్తి గల్గించు

---

† చతుర్థ మాయుషో భాగం ఉషిత్వాద్యం గురౌ ద్విజః। ద్వితీయ మాయుషో భాగం కృతదారో గృహేవసేత్ ।
అవిప్లుత బ్రహ్మచర్యో గృహస్థాశ్రమ మావసేత్ ।
గృహస్థస్తు యదాపశ్యేత్ వలీపలిత మాత్మనః। అపత్యస్యైవచాపత్యం, తదారణ్యం సమాశ్రయేత్॥ (మను) ఋతు కాలాభిగమనం బ్రహ్మచర్యమివోచ్యతే.

‡ వర్జయేన్మధు మాంసంచ.........ప్రాణినాంచైవ హింసనం. (మను)

వని గీతలోను చెప్పబడినది †బ్రహ్మచర్యము మతధర్మములలో నొ॰టిగ మనపూర్వికులు గమనించుటయు వారియుద్దేశ ప్రకారము సరుల జీవితములో దాని ప్రాముఖ్యమును మనకు సూచించుచున్నది. యోగ శాస్త్రమందును యమనియమాస నాదులలో మొదటి అంచెయగు 'యమ'ములోనే అహింసా బ్రహ్మచర్యముల జేర్చినారు. తపో అధ్యయన దేవప్రార్థనాదులను రెండవ యంచెయగు 'నియమ'ములలో జేర్చినారు. ఈ రెంటిమధ్య యమమే నిత్యాచరణీయమని ముఖ్యమని మనుస్మృతి లోను విధించినారు. *కామోద్రేకం కల్గించునవలలు కథలు సినీమాలు స్వైరజీవితము వ్యాపించిన ఆధునిక కాలంలో ముఖ్యంగా యువకులు బ్రహ్మచర్యపు ఆవశ్యకతను గ్రహించి దానినాచరింపవలెను. విద్యార్థి దశలో నెవరును పెండ్లి చేసుకొనకూడదను నియమముండదగును. ఇట్లే ఉద్యోగకాలము పూర్తియైన పెన్షనుదారులు 30 ఏండ్లు వృత్తిగడిపిన వారును కుటుంబము విడిచి ఏదో సంఘసేవ కార్యము చేయుచుండవలె నను నియమముండుటయు మంచిది.

---

† బ్రహ్మచర్య మహింసాచ శారీరంతప ఉచ్యతే ॥
మామూలుతపస్సుకన్న బ్రహ్మచర్యంలోనే హెచ్చు తపశ్శక్తికలదని తంత్రి శాస్త్రవచనము.
నతపస్తపయిత్యాహుః బ్రహ్మచర్యం తపోత్తమం॥
అహింసా సత్యాస్తేయ బ్రహ్మచర్యాపరిగ్రహా యమాః॥ శౌచసంతోష తప స్స్వాధ్యా యేశ్వరప్రణిధానాని నియమాః (యోగదర్శనం)
*యమాన్ సేవేతసతతం ననిత్యంనియమాన్ బుధః । యమాన్ పతత్యకుర్వాణః నియ మాన్ కేవలాన్ భజసన్॥ (మనుస్మృతి)

## 28. నీతిప్రవర్తనము; సత్యము.

అహింసావృద్ధికి జనుల మనఃపరిశుద్ధి యవసరమని గమనించి యున్నాము. అనగా భావములు ప్రవర్తన నైతికములైనప్పుడే అహింసాతత్వమును జనులకు స్థిరపడగలదు. సత్యము, అస్తేయము, సౌమ్యత, నిగ్రహము ఇట్టివన్నియు నీతిలక్షణములే.

కాని నీతిప్రవర్తనవిషయములో తరుచుసందేహముగల్గుటయు కలదు. ప్రతివారును సాధారణముగ తాము సత్పురుషులుగ వర్తించుటకే యుద్దేశింతురు. అయితే క్రియలో ధర్మజిజ్ఞాస యేర్పడును. అప్పుడు నిజమైనభక్తుల కీశ్వరుడే హృదయములో మంచి చోదనగల్గించును.

అయితే ఈకాలములో నిరీశ్వరవాదము, సందిగ్ధతయు ముఖ్యముగ యువకవర్గములో వ్యాపించియున్నది. వారికి నిర్మలమగు కర్తవ్యజ్ఞాన మెట్లేర్పడును? వారీక్రింది స్వర్ణసూత్ర మవలంబింపదగును. అదియే మార్గదర్శకము.

ఏవిషయమందైనను ఇతరులు మన కెట్లుచేయవలెనని మనల గూర్చి యెట్లు వర్తించవలెనని మనము కోరుదుమో, మన మితరుల విషయమున నట్లే చేయవలె, వర్తింపవలె. ఈసూత్రము నన్నిమతగ్రంథములు తత్వశాస్త్రములు నుపపాదించినవి.† పాశ్చాత్యవిద్వాంసులును ఈసిద్ధాంతము సర్వాంగీకార్యమన్నారు. మన ప్రాచీనగ్రంథములలోను ఇట్టిభావము చాలచోట్లచక్కగచెప్పబడినది. అట్లు అందరినితనతోపోల్చి కొని యితరులగూర్చి వర్తించుచు సుఖదుఃఖముల గ్రహించువాడే సరియైన యోగియని గీతలో చెప్పినారు.* 'తనకు బాధకమని తోచువాని

---

† నతత్పరస్యకుర్వీత స్యాదనిష్టం యదాత్మనః।
యద్యదాత్మనిచేచ్ఛేత తత్పరస్యాపి చింతయేత్ (మనుస్మృతి)

Do to others as you would they should do unto you (The Bible)

* ఆత్మౌపమ్యేన సర్వత్రసమంపశ్యతియోర్జున। సుఖంవాయదివా దుఃఖం సయోగీ పరమోమతః।

నితరులకును చేయకూడదు; తనకు మంచిదని కోరువాటినే యితరులకు ను నరుకుచేయదగునని భారతమున చెప్పియున్నారు* ఏపనిని ఇతరులకు తెల్పుటకు తాను చేయుటకు కుతూహలముండునో ఎట్టిదిహృదయశాంతి నిచ్చునో అట్టిది సాత్వికమని స్మృతిలోచెప్పినారు.† సత్ఫలముగోరువారు సత్కర్మపరులు కాదలచువారునుముందుగా ఉత్తమమగు మనస్సంకల్పము నభ్యసించవలెను. సత్యపరత అహింసవలె ముఖ్యావశ్యకము. సత్యమన గా యథార్థత. కాని ఇందును సందేహము లుండును. అత్యధికతమాని మధ్యవృత్తిలో నుండుచు సాధ్యమైనంతవరకు లోకహితముకు యత్నిం చుటే సత్యపరతయని యొకనిర్వచనము‡

అల్లేవాచికనియమమును అహింసకు సాధకము. అతిభాషణవల్ల తరుచు వక్తకు శ్రోతలకుగూడ మనస్సులో కలవరము ఉద్రేకము గల్గును. అందువలన పరులమనస్సు నొచ్చును. తరుచు సంఘర్షము ద్వారా హింసాచర్యలు జరుగును. హింసాత్మకమైన దుర్భాషలవల్ల వ్యక్తులమధ్య సంఘములమధ్యగూడ తీవ్రద్వేషము కొట్లాటలుగూడ సంభవించి రక్తపాతమును గల్గుచున్నది. సౌమ్యత్వముకును మితభాషణ ముపయోగకరము. §మితభాషణ సాధనకై కొందరుజ్ఞానులు మౌనము నభ్యసింతురు. పూర్వపుఋషులు మహాతపస్సు చేయునప్పుడు మౌనులై ప్రకృతిశక్తులను తమలోకి గ్రహించుకొని ఆత్మబలము గల్గి, దివ్యదృష్టి

* ఆత్మనః ప్రతికూలాని పరేషాం నసమాచరేత్ । (మహాభారతం)

† యత్సర్వేణేచ్ఛతిజ్ఞాతుం యన్నలజ్జతిచాచరన్ । యేనతుష్యతిచాత్మాస్యతత్ సత్వగుణలక్షణం. (మనుస్మృతి)

‡ సత్యాన్నాస్తి పరోధర్మః (మ. భా. శాంతిపర్వం 160)
అతిరియేన్మధ్యమాంవృత్తిం అతిసర్వత్ర వర్జయేత్ । యల్లోకహితమత్యంతం తత్సత్యమితి నశ్రుతిః॥

§ యస్యవాఙ్మనసీశుద్ధే సమ్యగ్గుప్తేచసర్వదా। సవైసర్వమవాప్నోతి వేదాంతో పగతం ఫలం (మనుస్మృతి)

సంపాదించుచుండిన ట్లితిహాసపురాణములు తెల్పుచున్నవి. ఇటీవలగూడ కొందరు మహాజ్ఞాను లిట్టిసాధనను కొద్దిగజేయుచున్నారు. గాంధిమహాత్ముడు వారమునకొకరోజున ఎట్టి సంభాషణనుచేయక కేవలం మౌనము వహించియుండును. ఇట్టి యభ్యాసమువల్ల నిగ్రహశక్తి హెచ్చుననని, బాగుగ ఆలోచించియే మాటాడుట యలవడుననని, అహింసాబుద్ధియు వృద్ధియగుననని, ఆయన స్వానుభవముతో తెల్పుచున్నారు. వాచాలత హానికరమని గ్రహించుటకు నిది యుపయోగించును. వాక్శుద్ధియు, మనశ్శుద్ధియు గుప్తవాక్కును నిశ్రేయసమునకును సాధకములని మనువుచెప్పియున్నాడు. ప్రాణులకు హితబోధయు శిక్షయుగూడ అహింసారూపమగు మధురవాక్కులద్వారా జరిగించుటే యుక్తమనియు శాసించినాడు *

మరియు వాఙ్నియమంతో సిద్ధించు భావశుద్ధిలేకుండ, జలమృత్తికాదులతో నట్టి బాహ్యశుద్ధినే చేయువారు సదాత్మకులుకారు, దురాత్మకులు అపరిశుద్ధులుగ నుందురనియు స్మృతులు తెల్పినవి.†

---

* అహింసయైవ భూతానాం కార్యంశ్రేయోనుశాసనం।
వాక్చైవమధురా శ్లక్ష్ణా ప్రయోజ్యా ధర్మమిచ్ఛతా॥ (మను)

† మృత్తికానాం సహస్రైశ్చోదకానాం శతైరపి
నశుధ్యంతి దురాత్మానః యేషాంభావోననిర్మలః (దక్షస్మృతి)

# 29. త్రికరణపరిశుద్ధి.

సంఘర్షమువల్లనే హింసకలుగును. వ్యతిరేకుల సాంకర్యము మలినసంపర్కమును సంఘర్షముకు కారణము. వాని స్పర్శ్యతొలగించుటేపరిశుద్ధి. దీనినే శౌచమనియు పూర్వులనుచుండిరి. శౌచము అహింసాపోషకము సాత్త్వికలక్షణమునని వచించి, ఋషులు శౌచమును శ్రద్ధతోనవలంభించి, ముందుతరములవారికిని అందుగూర్చి దీర్ఘనిబంధనలేర్పర్చినారు; పరిశుద్ధిమనోవాక్కాయములను త్రికరణములందు నుండవలెను. స్నానామలతోను, పరిశుద్ధాహారములను శుభ్రవాయువును స్వీకరించియు, దేహశౌచమును కాపాడుకోవలెను. అట్లు పరిశుద్ధమైనప్పుడే మనదేహము ఆత్మకును అందులోనున్న అంతర్యామియగు భగవంతుని తేజస్సుకును వాసయోగ్యమై ప్రేమస్వరూపముగ నుండగల్గును. కనుకపరిశుద్ధత అహింసాతత్త్వము వృద్ధినొందుటకవసరము. అయితే, దేహవాక్కులలోను మనస్సులోను పరిశుద్ధతగల్గి యుండవలెను. ఈ మాటని నిగ్రహములోనుంచుటే త్రిదండిత్వము.† దుష్టవాక్కు వచింపకుండుట, ఇతరులపైన ద్వేషమును దురాశను మనస్సులో సంకల్పించకుండుటయు, అవసరము. వాఙ్మనఃకాయము లన్నిటిలోను శౌచము సమభావమునున్నప్పుడే పూర్తియైన శౌచముగల్గి మహాత్ములు కాగలరు. అట్లుకాక మనస్సులోనొకటిచేయునదొకటియునై, బాహ్యశౌచమునవలంబించియు, దురాలోచనలుగల్గి పరులబీడించువారు నిజముగా దురాత్ములగుదురు*

శౌచమును రక్షించుటకే స్మృతులలో ననేక నిబంధనలు ఆచారములు చెప్పబడినవి. కాని, కాలము గడచినకొలది వాటి ఆయా

---

† వాగ్దండోఽథ మనోదండః కాయదండస్తథైవచ
యస్యైతే నిహితాలోకే త్రిదండీతి సఉచ్యతే (మను)

* మనస్యేకం వచస్యేకం కర్మణ్యేకం మహాత్మనాం॥
మనస్యన్యద్ వచస్యన్యత్ కర్మణ్యన్యద్ దురాత్మనాం॥ (మహాభారతం)

యుద్దేశములు మరపుకువచ్చి, పైకిఆనియమములను మాత్ర మిప్పుడర్థము లేకుండనే అనుసరించు చున్నాము. అపరిశుద్ధులు మద్యమాంసాదిలో లురు మహాపాతకులు మున్నగు వారితో సంపర్కము కూడదని పూర్వ శాస్త్రములందు చెప్పిరి. కాని ఇప్పుడవి కొన్నికులముల బహిష్కార ముకే వినియోగమగుచున్నవి; బహిష్కరించవలసిన మద్యాదిపాత కములు దురాచారములు 'శిష్ట' జాతులనబడు వారిలోను వ్యాపించుట, అట్టివారు శిష్టులుగనే యెంచబడుటయు, జరుగుచున్నది. శౌచము కాపా డుటకని ప్రతిమతమువారు నేర్పర్చుకొన్న నిబంధనలు (అప్పటి ఉద్దేశము జనులకు మరపుకు వచ్చి), అత్యావేశమువల్ల ఆయాశాఖలమధ్య ఎడ తెగని విభేదములకు స్పర్ధలకు కారణమగుట శోచనీయము. త్రికరణము లందు నిజమైన పరిశుద్ధి గలవారందరును సంఘసంపర్కము కన్నివిధ ములను తగినవారే. ఈ సిద్ధాంతమును ప్రతిముఖ్యమతమును గౌరవిం చుచున్నది. ఆచరణలో ప్రతిమతమువారు స్వమతస్థులే పరిశుద్ధులని యెంచుట జరుగుచున్నది. ఇందు హిందువులెక్కువ కఠినమగు నియమ ములు గల్గి, అన్యమతస్థులందేగాక స్వమతమందును స్వశాఖతప్ప ఇత రత్ర అపరిశుద్ధతనెంచి, వారితో భోజన వివాహాదుల మానుట ఆచార సైనది. ప్రవర్తనవల్లకాక జన్మవల్లనే శౌచము సిద్ధించునని యెంచి శౌచ విహితమగు ఆచారనియమముల బాహ్యరూపము సహంకారముతో విచక్షణలేకుండ అమలుజరుపు విపరీతపద్ధతివల్ల పరస్పర విభేదములును ద్వేషములును హెచ్చి, పరస్పరప్రేమక్షీణించుచున్నది. దేహపరిశుద్ధికన్న మనః పరిశుద్ధికి, అందులోను అర్థశుద్ధికి (అనగా ద్రవ్యాశ లేకుండుటకు), శాస్త్రజ్ఞు లెక్కువ ప్రాధాన్యమిచ్చినారు.*

---

* సర్వేషామేవ శౌచానాం అర్థశౌచం విశిష్యతే
యోర్థేశుచి స్సహి శుచి ర్నమృద్వారిశ్శుచి శ్శుచిః (మనుస్మృతి)

# 30. శస్త్రవిసర్జన యత్నము.

1914-18 సం॥ యుద్ధంవల్ల ఆయోధదేశాలకేగాక లోకమంతకును చాల నష్టముగల్గినదిగదా! అదే తుదియుద్ధమని, అంతటితో లోకంలో యుద్ధంసాగించే అవసరము లేకుండ పోవునని, మిత్రమండలిప్రముఖులు లోకులకు చెప్పినారు. దానికి The war to end wars అని పేరుపెట్టినారు. ఆయుద్ధాంతమున ఉభయపక్షములు సొమ్మసిల్లినట్లయి, ఇక యుద్ధములుండకూడదన్నారు. కాని జరిగినదేమి?

అప్పటి అమెరికా అధ్యక్షుడగు విల్సనుపండితుడు సంధికిపూర్వం ప్రచురించిన శాంతిసూత్రములు నిరాక్షేపణమైనవి. వాటిని నమ్మి జర్మనులు యుద్ధముచాలించి, సంధినికోరిరి. 'అన్నిరాజ్యములు ఆయుధములు తగ్గించవలె, అన్నిజాతులకు స్వయం నిర్ణయపద్ధతి వర్తింపవలె, నానాజాతిసమితి యేర్పడి, ఆసమితిద్వారా లోకవ్యవహారములకు న్యాయమైన శాంతపరిష్కారముకావలె' అనుసూత్రములకందరు అంగీకరించిరి. అయితే 'వర్సాలే' సంధిలో జర్మనీపైన బ్రిటిషు ఫ్రెంచిరాజ్యములు కసితీర్చుకొన్నవి; దుర్భరమైననష్టపరిహారము, జర్మనునౌకావినాశము ఇత్యాదులేగాక, జర్మనీని కేవలం నిరాయుధముగ చేసిరి. బ్రిటిషు ఫ్రెంచివారు తమఆయుధసామగ్రులు నౌకావిమానాదులు నేమియుతగ్గించలేదు. మాండేటులపేరకొన్నిశత్రురాజ్యాలను వీరు వశపర్చుకొన్నారు, పరస్పరదూషణ సాగినది. జర్మనుల ఆర్థికస్థితి భగ్నమైనది. పరాధీనులకు న్యాయము కల్గలేదు. అంతర్జాతీయనీతి న్యాయదృష్టి క్షీణించినవి. 1919-39 ఈయిరవైయేండ్లలో మరల 20 పెద్దయుద్ధములు సాగినవి. వాటివివరము:—

1919, 1. పోలండు సోవియటు రష్యాపైన యుద్ధము సాగించెను.

,, 2. తెల్లరష్యనులు బ్రిటను ఫ్రాంసు జపానులసాయముతో సోవియటు రష్యాపైన దండయాత్ర చేసి, అన్నిప్రాంతాలలోను ఓడిరి.

1921, 3. పోలండు అన్యాయముగ రష్యాపైన యుద్ధము చేసి, కొంత ఉక్రేనియాను కొంత గలీషియాను తన రాజ్యంలో కలుపుకొనెను. (అందు కిప్పుడు పోలండుకు ప్రాయశ్చిత్తమయినది.)

„ 4. ఐరిషు బ్రిటిషువారిమధ్య తీవ్రముగా అంతర్యుద్ధము, తుదకు అమెరికావారి తొందరమీద సంధి (జరిగి) ఐరిషు ఫ్రీస్టేటు యేర్పడినది..

1819-22, 5. మొరాకోలో అక్కడిదేశీయులకు స్పెయినుసేనకు పెద్ద యుద్ధము, అపారనష్టము.

1919-26, 6. అరేబియాలో బ్రిటిషు పోషితుడగు 'హుస్సేను'రాజుతో దీర్ఘయుద్ధంచేసి, ఇబినాసౌదు అరేబియాలో చాలభాగము విడగొట్టి, మెక్కాప్రాంతమును స్వతంత్రముగ చేసి, దాని రాజయ్యెను.

1920, 7. బ్రిటిషువారి మద్దతుగలఆర్మీనియాతో టర్కీకి యుద్ధము, జయము. మరల రష్యా పోలండు యుద్ధము; పోలండు గెలుపు.

1920-26, 8. చీనాలో ఉత్తరదక్షిణరాజ్యాలమధ్య తీవ్రయుద్ధము, విశేషజననష్టము.

1922, 9. గ్రీకులు ఆసియామైనరులో దిగి దాడిచేసి, టర్కీచే నోడిపోయిరి.

„ 10. ఆఫ్ఘనుస్థానంలో అంతర్యుద్ధము. అమానుల్లా పదభ్రష్టత.

1925, 11. సిరియాలో జనులు ఫ్రెంచివారితో పోరుట; డమాస్కసుకు మహానష్టము.

1925-35, 12. దక్షిణఅమెరికాలో బొలీవియా ఉరుగ్వేలమధ్య దీర్ఘయుద్ధము; ఉభయులు నీరసించుట.

1926-28, 13. చీనాలో జాతీయపక్షముకు కమ్యూనిస్టులకు ఘోర యుద్ధము.

" 14. జపానీయులు అక్రమంగా మంచూరియాలో చీనాసేనల నోడించుట.

" 15. జపాను జహోలురాష్ట్రముపైన గూడ దండయాత్ర చేసి దానినిగూడ కలుపుకొని, మంచూకోరాజ్యమును స్థాపించుట.

" 16. షాంఘైప్రాంతంలో చీనా జపానులకు ఘోరయుద్ధము.

1935, 17. ఇటలీ అబిసీనియాపైన దాడిచేసి విషవాయుప్రయోగం తో అబిసీనియనులనోడించి, ఆదేశమునువశపర్చుకొనుట.

1936-38, 18. స్పెయినులో తీవ్రమగు అంతర్యుద్ధము. ఇటలీ జర్మనుల సాయంతోను, ఇంగ్లండు ఫ్రాంసుల 'తటస్థత'తోను నియాతృపక్షపు 'ఫ్రాంకో' జయించుట.

1939, 19. ఇటలీ ఆల్బేనియాపైన దాడిచేసి దానిని కబళించినది.

1937-41, 20. చీనా-జపాను యుద్ధము: ఉత్తరచీనాపైన దాడిచేసి జపాను క్రమంగా దానిని తూర్పుచీనానంతను ఆక్రమించుట (ఇంకనుసాగుచున్నది.)

(ఇంకను కొన్ని చిల్లరయుద్ధములు సాగినవి.) ఆయాజాతులమధ్య ద్వేషమును వెనుకటికన్నను హెచ్చినది. పెద్దరాజ్యాలమధ్య ద్వేషము పెరిగియే మరల మహాయుద్ధ మేర్పడినది. ఈసారి యుద్ధాలలో క్రౌర్యమును వినాశకతయు హెచ్చినవి. క్రిందటి మహాయుద్ధములో జర్మనులు బెల్జియంలోకోటలు పట్టుటలోను ఉత్తరఫ్రాంసులో నదులుదాటి ముట్టడి సాగించికందకపు యుద్ధములు సాగించుటలోనుఅద్భుతప్రజ్ఞ కనపర్చినారు. పరిశ్రమలపోటీలో విజ్ఞానావిష్కారములద్వారా నిరంతరకృషి చేసి బ్రిటిషు వారికన్న పై చేయియైనట్లే, ఆయుధనిర్మాణంలోను వాటియుపయోగం లోను జర్మనులు క్రమముగా ఖ్యాతి సాధించిరి. ఆ యుద్ధము కు జర్మనీవారే

బాధ్యులని నిర్ణయించి, జర్మనీని చాల బాధలపాలుచేసినారు. యథార్థముకు ఉభయపక్షములవారి లోపములవల్లను, దురాశవల్లను, యాంత్రిక పద్ధతిలోని సహజసంఘర్షముననను, ఆమహాయుద్ధము కలిగినది. ఆద్వేషాగ్ని తరువాత రగులుచునేయుండెను. జర్మనులవశంలోని అల్ససులో రైనును ఫ్రెంచివారు రాబట్టిరి. సాలీనా కోట్లకొలది కాసులనష్టపరిహారంలాగిరి. జర్మనులుజీవించుటకక్కడ పరిశ్రమలపునరుద్ధరణయుబలమగు ప్రజాయత్తరాజ్యమునవసరమైనవి కాని అందుకై పీమరు, స్ట్రెస్మను బ్రూనింగు మొదలగు రాజనీతిజ్ఞులతోడ్పాటుతో హిండెన్బర్గ (అధ్యక్షుడు) చేసినసాధు యత్నములన్నిటిని కొందరుఫ్రెంచి బ్రిటిషుప్రముఖులు ప్రతిఘటించిరి. వాయిదాసొమ్ములు బకాయిపడినవని ఫ్రెంచిసేనలు జర్మనులకు పారిశ్రామికంగా ఆయువపట్టువగు రుహ్రప్రాంతము నాక్రమించిరి. అంతట జర్మనురాజ్యము దివాలాతీసినది.

'మాకు సొమ్మెక్కడిది, ఆ సొమ్ముప్రాప్తికి మేము తయారుచేయు సరుకు లిత్తుమ'ని జర్మనులనిరి ఆ సరుకుల వాడుకవల్ల తమ సరుకులకు గిరాకి తగ్గి, వ్యాపారనష్టము కల్గునని ఫ్రెంచి బ్రిటిషులభయము.

ఈలోగా విజేతృరాజ్యములమధ్యను కొంత కలతలు కల్గినవి. బ్రిటిషుఫ్రెంచివారలకు అమెరికనులపైన (యుద్ధఋణములగూర్చి) అసూయ గల్గినది అమెరికనులుజర్మనులకు పెట్టుబడిపెట్టి జర్మనులనుద్ధరింపబోయిరి. ఆ విషయములోను భేదభావములు కల్గెను. ఆయుధవిసర్జనపద్ధతి నందరు నములుజరుపవలెనన్నను, రష్యామాత్రం అందుకుసిద్ధపడినది. తక్కినవారొప్పుకోలేదు. ఆ యుధాలు తగ్గించుట కమెరికా అధ్యక్షుడుజరిగించిన సభలలోను ఆయారాజ్యప్రతినిధులు స్వలాభపరత నేవహించిరి. ఆసభలు తుదకు పరిహాసాస్పదమైనవి. ప్రతివారును తమ యోధశక్తి తగ్గకుండ తక్కిన వారికి నష్టముకల్గురీతి నాలోచించిరి. విమానములనుండి నిరాయుధ శాంత జనులపైన బాంబులు వేయకూడదని కొన్నిరాజ్యాలవారు సూచించిరి. బ్రిటిషువారు తమ సామ్రాజ్యపు మారుమూలాలను వాటినుపయోగించుటకు మినహాయింపుకోరిరి.

నౌకాయుద్ధపద్ధతులగూర్చియు, ఏదో దేశము వ్యతిరేకించుచుం డెను. ఇప్పు డన్నిరాజ్యాలవారును ఆ చెడుఫల మనుభవించుచున్నారు. ఇట్లు 'డిజార్మమెంటు'(=శస్త్రనిసర్జన) సభలు భగ్నమై ద్వేషాసూయలు మరింత పెరుగుటే ఫలమైనది. క్రియలో ఒక్కరికన్న నొకరు పోటీగ యుద్ధనౌకలను, జలాంతర్గాములను, విమానములను టాంకులు వగైరా లను రహస్యముగ పెంచుటవల్ల భద్రత అడుగంటినది. ప్రతిదేశములోను కోట్లకొలది నవరనుల పెట్టుబడితో ఆయుధాల ఫాక్టరీలుపెట్టిరి. వీటియ జమానులు హెచ్చుధరకు నవ్యాయుధము లమ్మదొడగిరి. వైజ్ఞానికపరి శోధనలనూ చాలవరకు వినాశకచర్యలకే వినియోగించిరి. అందుకా యా ప్రభుత్వములును ప్రోత్సాహమిచ్చినవి. తమదేశము పెద్దది గనుక తమకెక్కువ సేనాబలము కావలెనని అమెరికనులు, తమకందరికన్న విశాలసామ్రాజ్య మున్నందున దాని రక్షణ కందరికన్న పెద్ద నౌకా విమానదళాలు కావలెనని బ్రిటిషువారు, వీరితో సమానమగు నౌకా బలము తమ ద్వీపరక్షణ కవసరమని జపానీయులు, ఇట్లు తగవులాడిరి.

ఈ పుంజపతిరాజ్యాలన్నియు కమ్యూనిస్టు అగు తమ్మును లొంగ దీయుటకై నిరీక్షించుచున్నవని చెప్పుచు, రష్యారాజ్యము మహాప్రబల మగు ఆయుధసామగ్రిని తయారుచేసియున్నది. అన్నిదేశాలును తమ తగవులను నానాజాతిసమితిద్వారా పరిష్కరించుకోవలెనని తీర్మానము న్నను తమకు లాభించునంతవరకే ఆతీర్మాన మమలుచేసినారు. జాతిసమి తియు మహారాజ్యముల ప్రాబల్యముకే యుపయోగించినది.

ఈ ఆయుధవృద్ధిపోటీలో ధనికదేశముల కెక్కువ సౌకర్యము న్నది. ఆయుధములకు సేనలకు విమానాదుల నడుపు పెట్రోలును మహా నౌకలకు కోట్లకొలది కాసులును కావలె. ధనముకు Sinews of war అని పేరువచ్చినది. సామ్రాజ్యదేశములు తమ వశమగు దేశముల ఆదా యములో నర్ధభాగమువరకు యుద్ధావసరములకు ఖర్చుచేయుచు, ఆదేశ ముల ధనమునుగూడ కొంత తమదేశముకు చేర్చి, తద్వారాను తమ ఆయుధబల మింకను హెచ్చించిరి. ఈ వైరిపోటీని మాన్పవలెనని ధీమం తులు గ్రహించిరి. కాని, సామ్రాజ్యతత్త్వము హింసాధోరణియు పెరుగు చున్నందున, ఆ ప్రయత్నము సాగక పరిహాసాస్పద మైనది.

ఆయుధవృద్ధిద్వారా హింసాతత్వమును, హింసాతత్వమువల్ల ఆయుధవృద్ధియు, ఇట్లు అన్యోన్యాశ్రయ మేర్పడినది.

బ్రిటిషు పాలితమగు మన దేశంలోను కేంద్రప్రభుత్వపు ఆదాయంలో రమారమి సగము ఏదో పేరున సైనికయత్నములకు ఖర్చగుచున్నది. ఐనను దాదాపు ఇక్కడి ప్రజలందరు వట్టి నిరాయుధులు.

ఇక్కడి ప్రజల విద్యారోగ్యాదుల వృద్ధికి తగు ద్రవ్యము లేదు. జనుల కాధివ్యాధులు మెండు. అట్టిస్థితిలో ప్రజలు బ్రిటిషువారిపైనను తమలో పరస్పరమును హింసాధోరణి గల్గియుండుట సహజము.

ఈ ఆయుధప్రాబల్యంలో బ్రిటిషుపాలనలో మనరాజ్యస్థితి యెట్లున్నదో చూడుడు.

ఆధునికయుద్ధాలలో దేశరక్షణకు యుద్ధవిమానములు, యుద్ధనౌకలు, జలాంతర్గాములు, ప్రేలుడుగనులవేయు నౌకలు, అట్టి విమానములు, నూనెతెచ్చు నౌకలు, బాంబర్లనుండి రక్షించు బలీయమగు తుపాకులును విశేషముగ కావలె. కాని, అట్టివి మనదేశమందు అరుదైనవి. వాటినిర్మాణము కేర్పాటులు లేవు.

మరియు ఈ కాలపు వర్తకనౌకలను యుద్ధనావలను నిర్మించి మరమ్మతుచేయు గొప్ప నౌకాశ్రయము లుండవలెను. అందుకును చాలసొమ్మును ప్రభుత్వసహాయమును కావలె. వీటికిని సర్కారువారు తగు ప్రోత్సాహ మిచ్చుటలేదు.

మహాయుద్ధము తటస్థించినను, ఇక్కడి ప్రజలేగాక, ప్రభుత్వమును కొంత అసహాయస్థితిలో నున్నారని తోచును.

ఈ దుస్థితిలో ఇతర నాగరికదేశాలతో సమంగా నవ్యాయుధముల నిర్మాణమునకు సంపాదనకు మన దేశము పోటీచేయుటయు దుస్సాధ్యము. అందు కవసరమగు సొమ్ము, అవకాశముగూడ మనకు లేదు. మన సంస్కృతితత్వమునుబట్టి అసౌకర్యములవల్లగూడ మనకట్టి మోహతత్వ మలవడలేదు. కనుక ఏవిధముగ జూచినను యుద్ధశస్త్రముల విసర్జనము లోకమునకు ముఖ్యంగా మన దేశమునకు క్షేమకరము.

24 

# 31. యూరపియనుల శాంతియత్నము.

విల్సనుగారు 1918 లో ప్రపంచశాంతి సూత్రములు ప్రచురించినారు, అన్నిజాతులకు స్వయంనిర్ణయమును జరుపుదుమన్నారు కాని ఆప్రకారం అమలుకై యూరపులోచేసిన శాంతి సభలన్నియు వ్యర్థమైనవి. తమసామ్రాజ్యాలలోని రంగుజాతులకు స్వయంనిర్ణయ సూత్రమును బ్రిటీషు ఫ్రెంచివారలమలుజరుపక, ఇక్కడగూడ డొమిని యను పద్ధతి యమలులో నున్నదని (Dominion status in action) కొందరు రాజనీతిజ్ఞులు ప్రచారమారంభించిరి; కొద్దిమందికి కొన్ని యుద్యోగములు అంతర్జాతీయ సమితులలో కొంచెం స్థానమును ఇచ్చి కొన్నిదేశాలలో హైకమిషనరులనుపేర భారతీయపు ప్రతినిధులను స్థాపించినమాట నిజమే. కాని, ఇందువలన ప్రపంచమునకు భ్రమయే గల్గెను. ఆయుద్యోగులు జాతీయప్రతినిధులుకాక, బ్రిటిషుసర్కారు కను చరులే. భారతజాతిస్వాతంత్ర్యము స్వదేశంలోనే లేదు, ఇతరత్ర సమాన స్థానమెట్లు గల్గును ? అయినను ఇవియు శాంతిస్థాపన సభలుచు తుపకు నాటకములయినవి.

ప్రపంచమంతయు ఒకేమహాశరీరమువంటిది. ఇతరుల నణచివేసి తాముబాగుపడ యత్నించుటవల్ల తత్కాలమునకు లాభించినను, తుదకందరకు నష్టముగల్గును. యూరపురాజ్యాల ఆర్థికదుస్థితి ఫలితంగా అమెరికాకు బాకీలువసూలుకాకయు వ్యాపారనష్టముగల్గియు, 1929 సం॥ లో అమెరికాలో చాలబాంకులు దివాలాతీసినవి. అయినను, అమెరికనులు స్వార్థపరులై తమలాభమే ముఖ్యముగ జూచుకొన్నారు. బ్రిటిషు వారును తమ ఆర్థికప్రాబల్యము కాపాడుకొనుటకని 1931సం॥లో బంగారుప్రమాణము వదలుకొన్నారు. భారతదేశపురూపాయ మారకమును తమకేలాభకరంగామార్చినారు. తమసామ్రాజ్యపు భారతదేశంవల్ల తమకు రాజకీయంగానే గాక ఆర్థికంగాను లాభకరంగా నుండునట్లు 'ఇంపీరియల్ ప్రిఫరెన్సు' పద్ధతులవలంబించినారు. దీనివల్ల భారతీయులకు విదే

శీయులకును నష్టము కల్గినది. 1931 సంగలో జరిగిన యెన్నికలలో బ్రిటిషు పార్లమెంటులో కరడుగట్టిన కాంసర్వేటివులు ప్రబలులైనారు. అంతట అక్కడ సామ్రాజ్యతత్వధోరణి స్వజాతిపక్షపాతమును మరింతబలపడినవి; జాతీయపక్షమనుపేర కాంసర్వేటివులే పాలనసూత్రములునిర్ణయించినారు. ఇందు కనుగుణంగా జర్మనీలోను తమ స్వలాభమునే కోరు నాజీలధికారులైనారు. ఇట్లే గ్రీసు, పోలండు, జపాను, స్పెయిను వగైరాలలో నిరంకుశులు స్వజాతిలాభపరులనగు నియంతలే అధికారులైనారు. కొద్ది తారతమ్యమున్నను, ఈ అన్నిరాజ్యాలలోగూడ, అన్యాయంగా ప్రబలురై తాముస్వలాభమొందు తత్వమే పెరిగినది. ఇట్టి తత్వముతో ప్రభుత్వములుండగ శాంతిసభ లెట్లు కార్యకారులగును? జాతి సమితిలోను సామ్రాజ్యాలమాటయే చలామణి యయినది. అంతట జర్మనీ యిటలీలు వానినుండి తప్పుకొన్నవి.

ఈస్థితిలో చీనాలో అంతర్యుద్ధము గల్గినది. అక్కడ సామ్యవాది తత్వము వ్యాపించుచున్నదని యెంచి బ్రిటను అమెరికాలు సామ్యవాదుల నణచుటకు చీనా అధ్యక్షుడగు చయంగు కైషకును ప్రోత్సహించినవి. తీవ్రయుద్ధముజరిగి కమ్యూనిస్టుల నణచగల్గినను, ఇందువల్ల చీనాప్రభుత్వము చాలదుర్బలమైనది. ఇదేసమయమని జపానీయులు చీనాసామ్రాజ్యంలో మంచూరియాను జెహోలురాష్ట్రమును ఆక్రమించిరి. చీనా జపానులు రెండును జాతిసమితిలోసభ్యులే, కాని జపాను దౌర్జన్యమును జాతిసమితివారాపలేదు; పై పెచ్చు, బ్రిటిషుప్రతినిధి జపానును కొంత సమర్థించెను. ఇట్లే 1935 లో అబిసీనియాను ఇటలీఆక్రమించినప్పుడును జాతిసమితి ఇటలిపైన తగుచర్యతీసుకోలేదు. పిమ్మట హిట్లరు జర్మను సేనతో ఆస్ట్రియాను, జెకోస్లవేకియాను వరుసగ నాక్రమించినప్పుడును, జాతిసమితి ఆశాంతిసభలయత్నములు వట్టి వ్యర్థములని తేలిపోయినది. శాంతి పద్ధతిని సంధియేర్పడుటకు పరస్పరమైత్రి సహృదయత కావలెను. తామెట్లో యితరులునట్లే యను సమభావముండవలె. మరియు, కొన్ని శ్వేతజాతులు తమవశంలోని భారతీయులవంటి రంగుజాతులను శోషిం

పజేసి, ఆసారంతో తాము బలీయులగుచుండగా, తక్కినవారు భీతులై ఆలాభములలో తమకును వాటాగోరినారు. భారతదేశాదులకు స్వాతంత్రత వచ్చినప్పుడు, అన్నిదేశాలును వాటితో వ్యాపారాదులు చేయుటకు సమానావకాశములుండును. సామ్రాజ్యంవల్ల అన్యాయము జరుగుటేగాక, హింసాభావమేర్పడి, శ్వేతజాతులలోను పరస్పర ద్వేషము పెరిగెను. ఇప్పుడు సామ్రాజ్యపాలకులలో ఉదారభావము సమదృష్టి చూపులేదు. శాంతిస్థాపనసభలు ఆలోచనలు ఇట్టిస్థితిలో వ్యర్థమగుట సహజమే. వ్యక్తితత్వమేగాక, జాతీయతత్వమును మారవలెను. అందుకు గాంధిమహాత్ము డారంభించిన అహింసా ప్రచారమే సాధకమగును.

గాంధిమహాత్ముడీ దేశమందు అహింసాపద్ధతిని రాజకీయములకములు చేయగనే దానివాసన ఇంగ్లండువగైరాలకు వ్యాపించకుండ అక్కడ ఆటంకములు కల్గినవి; కాని కొంచముగ అది యూరపులోను సోకినది. యుద్ధనివారణకు అహింసయే సాధనమను సిద్ధాంతముతో ఇంగ్లండులో 'శాంతివ్రతసంఘము' (పీస్ ప్లెడ్జి యూనియన్) ఏర్పడినది. హింసాతత్వముకూడదని క్రైస్తవులలో 'క్వేకరు' శాఖవారును నమ్ముచున్నారు. ఆయుధసామగ్రులు పెంచి, వైరములు రేపి యుద్ధములారంభించుట ప్రజలకు హానికరమని, శాంతికే అందరూ ప్రయత్నించవలెనని, యుద్ధపరత్వము కూడదని, వారుబోధింతురు. ఇట్టి సంఘములు నాగరికదేశములన్నిటిలోను ఏర్పడి కొంతపనిచేసినవి. ఇది లోకమంతటికి సంబంధించినది. కనుక 1921లో War Resisters International (=యుద్ధనిరోధకవిశ్వసంస్థ) ఏర్పడినది. ఇది అంతర్జాతీయము. అన్నిదేశముల 'శాంతివ్రతసంఘము'లు దీనికిశాఖలుగ జేరిరి. ఈసంఘము వారును Fellowship of Faiths అనుపేర మతసామరస్య సంఘమును శాంతి బోధించినారు. కాని, వారికి పలుకుబడిలేదు. హింసా వాతావరణము ప్రబలినది. ప్రతి 'నాగరిక' దేశములోను ప్రభుత్వము వారి

శాంతియుద్యమముకు వ్యతిరేకులైనారు. ఈయుద్ధకాలమందు దీనిసభ్యు లగొందరిని సర్కారుజయిలులోనుంచినారు. అది సహజమే. యుద్ధవ్యతిరేక ప్రచారమిప్పుడు యోధ దేశములలో పాపము 'దేశద్రోహ' పు నేరముకదా ! ఈశాంతివాదముకు పాశ్చాత్య దేశాలలో Pacifism అని పేరువచ్చినది. తమవశంలోని దేశాలకు సామ్రాజ్యప్రభుత్వములు వెంటనే స్వాతంత్ర్య మీయవలెనని, జాతిద్వేషముకూడదని, ఆయుధ నిర్మాణము తగ్గింపవలెనని, అవసరమైన నిర్మాణము వ్యక్తులుకాక ప్రభుత్వములే చేసుకోవలెనని కూడ, శాంతివ్రతులు బోధింతురు †

పాశ్చాత్యపు శాంతివాదులను ఆర్థికరాజకీయములలో సామ్యవాదులలో నొకశాఖగనెంచుటకలదు. అయితే రష్యాలోజరుగు హింసా చర్యలను వీరుహర్షించరు. ఈశాంతివాదులింకనుపారిశ్రామికరంగములో పీడనమును యాంత్రికపద్ధతిని గట్టిగ నిరసించుటలేదు; కనుక వారికక్కడ జయము కల్గలేదు. ఇటీవల జనులలో నైతికత్వ వృద్ధికై కృషి చేయుటకు Moral rearmament movement అను నుద్యమ మును బయలుదేరినది. నీతిన్యాయములబోధించి పరస్పరమైత్రి కల్గింప జేయుట ఈయుద్యమపు ఉద్దేశము. ఇది ఆధ్యాత్మికముగ ప్రశస్తమేకాని, ఆచరణలో దీనిరాజకీయధోరణితృప్తికరంగాలేదు. ఇట్లివి ప్రస్తుతముఫలించకున్నను, అహింసాసిద్ధాంతమే ఎప్పటికోనాగరికలోకమంతటనువ్యాపించుట కవకాశమున్నదని మాత్ర మీచిహ్నములు సూచించుచున్నవి.

బ్రిటిషుచరిత్రలో ఒకప్పుడు శాంతపద్ధతులద్వారాను అధికారమునంపాదించిన పరిస్థితులుకలవు. అక్రమపుపన్నులు నిరాకరించియు కార్మికులు తమకష్టములు తీరునిమిత్తం ఐకమత్యముతో సమ్మెకట్టియు రాజకీయభావముతో ప్రజానాయకులాందోళన జరిగించి శాసనసభ

† వ్యక్తుల కాయుధనిర్మాణపువాక్కు ఉండుటవల్ల వారు స్వలాభముకై, ఆయా దేశములమధ్య విరోధప్రచారముచేసి వైరము పెంచి, యుద్ధకారకులైనట్లు స్పష్టమైన ఋజువులు దొరికినవి.

లందును బయటను శాంతముగ ఒత్తిడిచేసియు, చాల పరిహారములను ప్రజలుపొందినారు. కొన్నియూరపురాజ్యాలలోనుకొంతవరకిట్లుజరిగినది. దక్షిణాఫ్రికాలో బోయరులను తమసేనాబలముతో బ్రిటిషుప్రభుత్వము వారణచినంతకాలమును అక్కడ బ్రిటిషువారిపైన విరోధమే చెలరేగినది. 1907 లో వారికి బ్రిటిషుప్రభుత్వమువారు స్వపరిపాలనమిచ్చినారు. ఇట్లుబ్రిటిషువారు ప్రేమతత్వముచూపగనే బోయరులును బ్రిటిషువారియందాదరగౌరవములుగల్గి, బ్రిటిషుసామ్రాజ్యమునజేరి అనుకూలురైనారు,

ఐర్లండులో స్వాతంత్ర్యపుపోరాటము క్లిష్టమై రక్తమయమైనది. బ్రిటిషువారు దౌర్జన్యముచూపినంతకాలము ఆ సమస్య పరిష్కారముకాలేదు. విశేషించిబాధ అప్రతిష్ఠ హెచ్చినవి. అంతట 1921 లో బ్రిటిషుప్రభుత్వమువారు దక్షిణ ఐర్లండుకు స్వపరిపాలన నిచ్చి 'డొమినియను'గ చేసినారు. అప్పటినుండి ఐరిషువారికి బ్రిటిషువారిపైన ద్వేషము పోయినది.

ఒకసారి జపానువారును, మరొకసారి బ్రిటిషువారును, చీనులను బాధించి, దౌర్జన్యము చేసినప్పుడు చీనులు అహింసాపద్ధతిని పోరుసాగించిరి; తీవ్రముగ జపాను, ఇంగ్లండుల సరుకులను బహిష్కరించిరి. బ్రిటిషు జపనీసుల వర్తక కార్యాలయములందుండు చీనాకార్మికులు సమ్మెకట్టిరి. అప్పుడు తుదకు జపానీయులు, బ్రిటిషువారుగూడ న్యాయపరిష్కారముకు వచ్చిరి. అహింసాయుద్ధము శాంతమగు పోరు సాధ్యములని, ఈ యుదాహరణలును, దక్షిణాఫ్రికాలోను మన దేశములోను గాంధిమహాత్ముడు సాగించిన సత్యాగ్రహములును సూచించుచున్నవి.

# 32. అహింసాయుద్ధము.

మనసంస్కృతివృద్ధికి అంతర్జాతీయక్షేమమునకు రాజకీయస్వాతంత్ర్యమవసరమనియు, ఆయారంగములం దభివృద్ధి గల్గించి, భారతజాతి అంతశ్శక్తి బలపర్చుటకు నిర్మాణకార్యక్రమపు వివిధాంశములు సహకారులనియు, గమనించినాము. వీటిఆత్మశక్తి నమలుజరిపినప్పుడు జాతీయజీవితమంతయు బాగుపడును. నిర్మాణకార్యక్రమము శ్రద్ధతో సాగించుచు అహింసాపద్ధతిచే స్వరాజ్యము సంపాదించుట కొఱకయుద్ధప్రక్రియయున్నది; ఇదే 'సత్యాగ్రహము' అనే అహింసాయుద్ధము. 'సత్యాగ్రహ'అనగా సత్యంనిమిత్తం పట్టుదలచూపుట; ఎట్టిబాధలనైనను సహించి వీరులై సత్యమను అహింసాపద్ధతినే కాపాడుట.

ఇట్టికొన్నియుద్ధములు:—దక్షిణాఫ్రికాలో గాంధిగారుజరిపినసత్యాగ్రహము పాసివ్ రెసిస్టెంసు(=శాంతనిరోధము)అనబడినది. అక్కడి భారతీయులందరు కలసి లక్షమందిమాత్రముందురు; అక్కడి పాలకజాతియగు తెల్లవారిసంఖ్య వారిద్రవ్యము భుజశక్తివగైరాలు మనవాటికన్న చాల హెచ్చు. ఆయుధములు అధికారము తెల్లవారివే. మరియు సాంఘికంగాను వారికున్నకట్టు, ఏకీభావము ఆత్మవిశ్వాసము భారతీయులకు లేవు. అయినను గాంధిగారక్కడి భారతీయులకు అన్యోన్యత ఆత్మగౌరవము కార్యదీక్ష, అహింసాతత్త్వము గల్గించెను. ఆశ్వేతరాజ్యపు అన్యాయశాసనముల నెదిర్చి, వేలుముద్రవేసి లైసెన్సులు తీసుకొనుట, తలపన్ను నిచ్చుట ఇట్టి కార్యములుచేయ నిరాకరింపజేసిరి. ఆయన అనుచరులకాయనయందు నమ్మిక, పూజ్యభావము, ఉత్సాహమును ఏర్పడినవి. నాయకు లరెస్టుఅయి కోర్టులువిధించినశిక్షలతో జైలులో జేరుచుండిరి. జనుల కార్యదీక్ష శాంతత హెచ్చినవి. దౌర్జన్యము పురికొల్పుట కితరులు చేసినయత్నములు వ్యర్థమైనవి, తరువాత వేలకొలది అరెస్టుఅయినను, ఆభారతీయులు తమ వ్రతమువదలలేదు. పైపెచ్చు కొందరు చీను

లును వీరికిత్రోడైరి. ఎన్ని ఆశలు సర్కారువారు పెట్టినను, సాధారణంగా భారతీయులు తమవ్రతము వీడలేదు. సర్కారు ఆజ్ఞలకొప్పుకోలేదు; ప్రభుత్వమువారు రాజీకివచ్చి, తమ అక్రమశాసనము లాపుచేసిరి.

తరువాత గాంధిగారీదేశంలోను జనులచే చాల సత్యాగ్రహములు సాగించిరి. వీటిలో మొదటిది బిహారులోని చంపారణులో జరిగినది. ఈజిల్లాలోని కొన్నిముఖ్యభూములు యూరపియనులవి. వారీమంచిభూములు తమప్రాబల్యముతో చౌకగ సంపాదించి, బీదరయితులద్వారా పంటలుపండించి, హెచ్చుశిస్తులు పెచ్చు లాభములు రాబట్టుచుండిరి. ఇదిగాక, అప్పటి హెచ్చురేటుకు నీలిరంగు ఎగుమతివల్లను వారికి మంచిరాబడియుండెను. అందు కవసరమయే నీలియావు నారయితులనుండి ఉచితముగ ఈనాందార్లగు తెల్లదొరలు రాబట్టుచుండిరి. వారు, నోరులేనిరయితులనుండి చిత్రవిచిత్రపు అన్యాయపు రుసుములును వసూలుచేయుచుండిరి. ఆజిల్లా ఉద్యోగులందరు (ప్రజానాయకులును) వారితో కల్పించుకొన్న తమకేమి ముప్పువచ్చునోయని జంకిరి. ఈస్థితినంతను నారయితులతరపునొకరు గాంధిగారితో చెప్పగా ఆయన (1917 సం॥లో) ఆజిల్లాకువెళ్ళి స్వయంగా రయితులనడిగి యథాస్థితినిగూర్చి వాఙ్మూలములుతీసికొనిరి. గాంధిగారాజిల్లాను తక్షణం విడువవలెనని వెంటనే అక్కడి మేజస్ట్రేటు ఆజ్ఞాపించెను. కాని, గాంధిగారు చలించక, అక్కడి అక్రమములను వైస్రాయికి పత్రికలకును తంతిద్వారా తెల్పిరి; అంతట గొప్ప ఆందోళనలేచినది. గాంధిగారి ధైర్యసాహసముల కాశ్చర్యమొంది, శ్రీ రాజేంద్రప్రసాదు ఇత్యాదు లాయనకండయైరి. ఇట్లు ఇరవై వేల రయితుల వాఙ్మూలములు తయారైనవి. ఈవార్తలు పత్రికలకెక్కినవి. ప్రభుత్వ మప్రతిష్ఠపాలైనది. 'గాంధిగారు పట్టువిడువరు' అనిగ్రహించి, అంతట సర్కారువారొక విచారణసంఘము పెట్టిరి. అందులో గాంధిగారు నొకసభ్యుడు. రయితులకన్యాయము జరిగినదని ఆసంఘము విచారణపైన నిర్ణయించినది.

అంతట సర్కారువారు చట్టముద్వారా ఆ అక్రమచర్యలను అన్యాయరుసుములను రద్దుచేయించిరి. అప్పటినుండి శ్రీ రాజేంద్రప్రసాదుగారు గాంధిగారి సహచరులైరి.

ఆసాలాఖరున గుజరాతులోని అహమ్మదాబాదులో గాంధిగారు కార్మికులనిమిత్తంసాగించినది యీదేశపు రెండవసత్యాగ్రహము. అక్కడ చాల బట్టలమిల్లులున్నవి. వాటియజమానులు ధనాఢ్యులు. వారప్పటి యుద్ధకాలంలో మంచి లాభంతీసిరి; కాని వారిపనివాండ్రజీతములు తగురీతిని హెచ్చించలేదు. గింజలధరవరలు పెరిగినవి. కార్మికులమొర వ్యర్థమైనది. గాంధిగారిసూచనను ఆమిల్లుదార్లు పెడచెవినిబెట్టిరి. అంతట ఆయన కార్మికులచేత సమ్మెచేయించిరి; వారికి నీతిని కట్టును బోధించి, సమ్మెకాలపు నిరుద్యోగసమయమందు వారిచేత రాట్నములమీద నూలు వడికించి, వారికి స్వయంసహాయమును నేర్పిరి. కాని ఆకార్మికులకు చదువు, ఐకమత్యము, తగినంతజ్ఞానమును లేవు. కనుక మిల్లుదార్లు వారిలో కొందరిని భ్రమపర్చి, భేదంకల్గించి, వారిని పనిలోకి రప్పించిరి; అంతట తక్కిన కార్మికులు నిరుత్సాహులై జంకిరి.

ఈఅన్యాయమువల్ల కార్మికుల కట్టుచెడెను. అపుడు గాంధిగారు దీర్ఘోపవాసమూరంభించిరి. తమకై గాంధిగారు ప్రాణమర్పించుచుండుట జూచి, లోగడ పనిలోజేరిన కార్మికులు నిగ్రహం వహించి,మరల సమ్మెదార్లతో కలిసిరి. అంతట మిల్లుదార్లును గాంధిగారిత్యాగముకు విభ్రాంతులై, లొంగిరి; పంచాయితీకొప్పుకొని ఆప్రకారం జీతములు న్యాయంగా హెచ్చించిరి. ఈఅహింసాయుద్ధమువల్ల అప్పటినుండి అక్కడి మిల్లు యజమానులు కార్మికులు మైత్రితోనున్నారు. తరువాత ఎప్పుడైనను తగవు వచ్చినను గాంధిగారు సూచించుప్రకార ముభయపక్షములును పరిష్కరించుకొనుటమామూలు. శ్రీమంతుల కప్పటిహృదయపరివర్తనపు ఫలితముగ సౌమ్యత్వమేర్పడి, అది నేటికిని నిల్చియున్నది.

1918 లో గుజరాతులోని 'ఖైరా' జిల్లాలో మఱొకరీతిది జరిగినది, అక్కడి పంటలుపోయి గొప్పక్షామము వచ్చినది. కనుక సర్కారువారు భూలుప్రికారం ఆసాలుకు పన్నులు రద్దుచేయవలెను, కాని, ప్రభుత్వోద్యోగులు పంటలంతగా పోలేదని చెప్పి, 'రెమిషన్' నీయక నిరాకరించిరి. అంతట గాంధిగారు స్వయముగా ఆజిల్లాలో తిరిగివచ్చి, పంటలు బొత్తిగా పోయినట్లు తగునిదర్శనములు చూపిరి. కాని ప్రభుత్వము లక్ష్యపెట్టలేదు; అంతట గాంధిగారు రయితులచేత ఆభూములకుమామూలు పన్నుల చెల్లింపుచుగూడ సీదాగా మాన్పించిరి. అప్పుడు సర్కారువారు భూముల కిస్తీసొమ్ముల వసూలునిమిత్తము జప్తులు సాగించిరి. ఈలోగా గాంధిగారు పత్రికలద్వారా ప్రభుత్వోద్యోగుల అన్యాయమును వెల్లడించుచు తీవ్రప్రచారం జరిగించిరి; అహమ్మదాబాదులోని బారిష్టర్లలో ముఖ్యుడగు వల్లభభాయిపటేలు మున్నగు ప్రముఖులపుడు గాంధిగారి ధైర్యమునకు మెచ్చుకొని, ఆయనకు తోడ్పడిరి; బొంబాయివర్తకులు ద్రవ్యమిచ్చి సాయముచేసిరి. సర్కారువారు ఆస్తులు వేలంవేసినను, వాటిని పాడుటకెవ్వరును రాలేదు. సర్కారుదే తప్పని వెల్లడియైనది. అంతట, సర్కారు పూర్తిగ బీదరయితులందరికి బకాయికొట్టివేసి, రాజీపడిరి.

1919-23 ల మధ్య జరిగిన 'నాన్ కోఆపరేషను' (=అసహాకారము) రాజకీయము, మనదేశమంతటికి సంబంధించినది. దీనిని మొదట ప్రభుత్వమువారు చేయబూనిన రౌలటుచట్టమును ఖిలాఫతుఅన్యాయమునుఆక్షేపించుచు సత్యాగ్రహముగా ఆరంభించిరి.

జర్మను యుద్ధానంతరం ప్రభుత్వము క్రొత్తనిర్బంధముల బెట్టిరి; టర్కీలో ముస్లిమురాజ్యముకపకారము చేసిరి; ఇక్కడిజనులలో స్వరాజ్యముకు ఆందోళనము జరిగినది. అప్పుడు గాంధిమహాత్ముడు అసహాకారముసాగించెను. "ఆంగపాఠశాలలవలను, కోర్టులద్వారాను కచేరీలద్వారా

ను శాసనసభలవల్లను బ్రిటిషుప్రభుత్వప్రాబల్యముస్థిరపడుచున్నది. వాటి వల్ల మనభావదాస్యము హెచ్చినది. అది పోయినప్పుడే మన జనులకు స్వతంత్రభావ మేర్పడును. కనుక, జాతీయవాదు లాసంస్థలను బహిష్కరింపవలె"నని కాంగ్రెసుసభ తీర్మానించి, ఈయుద్యమపు నియంతగ గాంధిగారి నేర్పర్చిరి. ఇందుకు చాల త్యాగము ధైర్యము అవసరము. విశాలదేశంలో వివిధశాఖలమధ్య ఐకమత్యము చాల కష్టసాధ్యము. కొందరు న్యాయవాదులు కోర్టులను, ఉపాధ్యాయులు విద్యార్థులు పాఠశాలలను, కాంగ్రెసుసభ్యులందరు శాసనసభ్యత్వములను, వదలిరి. కొద్దిమందిమాత్రం ప్రభుత్వోద్యోగము కూడ విడచిరి. ఇందువల్ల ఆప్రభుత్వ సంస్థల నిజస్థితి వెల్లడియై వాటిమీద జనుల వ్యామోహము తగ్గినది. నాయకులు మంచి పద్ధతులతో కొన్నిచోట్ల జాతీయవిద్యాలయముల స్థాపించిరి; కొన్ని చోట్లపంచాయతీసంఘము లేర్పడి, కోర్టువ్యవహారముల బరిష్కరించిరి. అప్పుడు ప్రభుత్వసంస్థల వదలినవారును ప్రజాసేవా పరులై జాతీయోద్యమ పరులైనారు. ఈదేశీయుల వృత్తిహీనుల జేయు విదేశవస్త్రములను, నిర్వీర్యులుగజేయు మద్యపానమును బహిష్కరించుటకై వాటిదుకాణములవద్ద శాంతముగ కాంగ్రెసుయువకులు నిరోధము సాగించిరి. దీనిని 'పికెటింగు' అందురు.

అప్పుడు (1921) బ్రిటిషుప్రభుత్వపు పరపతిని నిలువబెట్టుటకు సర్కారువారు బ్రిటిషు యువరాజుకీదేశమందు సంచారము బెట్టిరి. దానిని జాతీయవాదులు బహిష్కరించిరి. వేలకొలది పికెటర్లను సర్కారువారు జయిలులో నుంచిరి. చరమాస్త్రమగు పన్నులసత్యాగ్రహముకు దేశములో పూర్తిగ శాంతియునిగ్రహమును కావలె. కొన్నిప్రాంతాలలో కొందరుపోలీసులను హింసించిరి; హిందూముస్లిములు కొన్నిచోట్ల పరస్పరం కొట్టుకొనిరి. కనుక, గాంధిగారు అసహకారోద్యమమును నిల్పివేసిరి. అంతట నిర్మాణకార్యక్రమమునే సాగించుటకు గాంధిగారు తమ శక్తిని వినియోగించిరి.

1921-23 సం॥లలో పంజాబులో మరొక సత్యాగ్రహము జరిగినది. ఇది మతాచారముకు సంబంధించినది; సిక్కులమతములను ఆలయములను 'గురుద్వార' ములందురు. ఇవి 'మహంతు'ల పాలనలో నుండును. వీటిలో కొన్ని గొప్పవి; వాటికివిశేషాదాయములున్నవి. అయితే (ఇప్పటి హిందూమతస్థుల దేవాలయములలోవలె) ఆధర్మకర్తలలో చాలమంది తమధార్మికబాధ్యతను మరచి, విషయలోలురైరి. వీటిలో జరుగు దురాచారముల మాన్పి సంస్కరించుటకు కొందరు సిక్కు యువకులు ప్రతిజ్ఞపట్టిరి. వారే అకాలీలు. సామపద్ధతిచే ప్రయోజనములేక, ప్రభుత్వమువారు మహంతుల కండయైరి; అంతట వేరుదారిలేక, అకాలీలు కాంగ్రెసు సిద్ధాంతమనుసరించి సత్యాగ్రహం సాగించిరి అకాలీలాగురుద్వారములలో తమ గురుగ్రంథమును సమిష్టి భజనతో పారాయణచేయుచుండిరి. వారట్లు చేయకుండ, 'గురుకాబాగు'అను మఠపు మహంతు మరికొందరు నిషేధించిరి. అయినను ఆకాలీలు చిన్నజట్లుగ నేర్పడి, దానిలో గ్రంథము చదువుచుండిరి. వారిని వెంటనే పట్టుకొని పోలీసువారరెస్టుచేసిరి. ఈ ఆకాలీలలోకొందరు లోగడ సైనికులై పెన్షనుదారులైయుండిరి. ఈ వీరులపుచూపిన అహింస అద్భుతము. తమకన్నదుర్బలులైన పోలీసులు కొట్టినను, అకాలీ లోపికతో సహించిరి. దీక్షమాత్రం మానలేదు. ప్రభుత్వమువారంతట ఆగురుద్వారముల సంస్కరణకు చట్టముచేసి, కొన్ని దురాచారముల బోగొట్టిరి.

బెంగాలులో తారకేశ్వరదేవాలయముగూర్చి చాలయేండ్లొక సత్యాగ్రహము జరిగెను. ఇందులోను ఎందరో జైలుననుభవించిరి.తుదకు దాని దుష్టమహంతు తొలగెను; ఇదియు ధార్మికయుద్ధమే.

1922 సం॥పు బొర్సాను సత్యాగ్రహము విచిత్రమైనది. 'బొర్సాదు' గుజరాతులో చిన్నతాలూకా. ఇక్కడ 'దేవరబాబా' అను గొప్ప బందిపోటుదొంగ యుండెను. అతని పోలీసులు పట్టలేకపోయిరి. ఇతే

లో నొకతురక యతనికి పోటీగలూటీలారంభించెనట. పోలీసువారీతనితో స్నేహముచేసి ఇతనిసాయముతో 'దేవరబాబా'ను పట్టజూచిరి. కాని క్రియలో ఆముస్లిము పోలీసుల తుపాకులతో తూటాలతో తనదోపిడిని సాగించుచుండెను. పోలీసులప్రవృత్తి జనులకపకారముగ పరిణమించినది; అంతట వల్లభాయిపటేలుగారి నాయకత్వమున జనులు సత్యాగ్రహమారంభించిరి; అంతట దేవరబాబా జట్టు అదృశ్యమైపోయినది. కాని పోలీసులు ఆయిండ్లలో తిరుగుచుండిరి. వారిఫోటోలు, వారి ఆయుధములు, గుండ్లు వగైరాల చిత్రములును పత్రికలలో ప్రచురితమైనవి. కాని సర్కారువారుశిక్షార్థపుపోలీసులనుపెట్టి, అదనపుపన్నును జనులనుండి వసూలు చేయబోయిరి. ప్రజలు కట్టుగట్టిరి. వారి ఆస్తులు జప్తుచేసినను కొనుటకెవ్వరును లేరు. తుదకు సర్కారువారా పోలీసు దళములను తీసివేసి ఆచర్యలను రద్దుచేసుకొనిరి.

దానిప్రక్క తాలూకాయగు 'బార్డోలి' లో 1927 లో వేరొక సత్యాగ్రహము జరిగినది. అప్పుడక్కడిభూముల 'సెటిల్మెంటు' జరిగినది. అందులో సర్కారువారాభూములకు రూపాయకు పావులాచొప్పున పన్ను హెచ్చించిరి. పరిస్థితులనుబట్టి ఆహెచ్చింపుకు సబబులేదు. ఈ సంగతిని రయితులు సర్కారుతో మొరపెట్టుకొన్నను నిష్ఫలమైనది. "న్యాయశాస్త్రపద్ధతిని చేయుచో న్యాయమని తేలితే ఆప్రకార మొప్పుకొందుము" అని రయితులప్రతినిధులనిరి. కాని సర్కారందుకొప్పుకొనక, లోపాయికారీని పరీక్షించితిమనిరి. అంతట ఆపన్ను అన్యాయమని నిశ్చయించి, గాంధిమహాత్ముని సమ్మతితో, వల్లభభాయిపటేలు ఆరయితుల చేత సత్యాగ్రహము సాగించెను. సర్కారిట్లు విధించిన జాస్తిపన్నును కొట్టివేయువరకు ఆభూములపైన మామూలు పన్నునుగూడ రయితులిచ్చుటమానిరి. అంతట పోలీసులను పఠానులనుపెట్టి సర్కారువారు రయితుల ఆస్తులనుజప్తు చేసిరి; కాని జనులందరు కట్టుకట్టిరి; ఉద్యోగులు వేయించు వేలంలో కొనువారులేరు. సర్కారు తమ ఉద్యోగులచేతనే

పాడించిరి. పోలీసులు సైనికులు పెట్టుబాధ దుర్భరమైనది. అయినను రయితులు లొంగక పై సాలుకు వ్యవసాయములు మానుకొని, ప్రక్కనున్న బరోడారాజ్యముకు ప్రస్థానము చేసిరి. సర్కారు వారికాభూములు దున్నువారు దొరకలేదు. ఈలాగా దేశమందాందోళన హెచ్చెను. తుదకు ప్రభుత్వము రాజీకివచ్చి, బహిరంగవిచారణ చేయించిరి. రయితులవాదమే న్యాయమని తేలినది. ఆజాస్తిపన్నులు రద్దుచేయబడినవి.

ఈ అహింసాయుద్ధములన్నిటిలోను గొప్పది 1930, 1932 సం॥ల లో జరిగినది. ఇది దేశస్వాతంత్ర్యంనిమిత్తమని జరిగినది. కొందరిసూచన పైన భారతదేశపురాజ్యాంగప్రణాళికను 1928 లో అన్ని పక్షముల వారుకలిసి 'నెహ్రూరిపోర్టు' అనుపేర తయారుచేసిరి; దీనిలో మితమైన బాధ్యతాయుత ప్రభుత్వముచు మాత్రం కోరిరి. అయితే అట్టి దానినిగూడ ప్రసాదించుటకు ప్రభుత్వ మిష్టపడలేదు; కనుక సంపూర్ణ స్వాతంత్ర్యమే మనలక్ష్యమని 1929 సం॥ ఆఖరున తీర్మానించి సత్యాగ్రహముకు కాంగ్రెసువారు గాంధిమహాత్ముని నియంతగా ఏర్పర్చిరి. ఆయన నిర్ణయించినప్రకారము 1930 ఏప్రిలు నుండి దేశమంతట నిది సాగినది. ప్రభుత్వంవారి కొన్ని అన్యాయపు శాసనములను శాంతంగా ఉల్లంఘించుటే యీసత్యాగ్రహము. ఉప్పుపన్ను అన్యాయమని చాలసార్లు భారతశాసన సభవారు తీర్మానించినారు. దీనిని ఉప్పు ఉత్పత్తియగు మళ్ళలో ముందుగనే చెల్లింపజేసి ఈపన్ను వ్యాపారస్థులనుండి వసూలు చేయుదురు. ప్రజలు ఉప్పును స్వయంగానే తయారుచేయుట గనులనుండితీయుట అట్టి ఉప్పునువాడుట సరఫరా చేయుటయు ఉప్పుసత్యాగ్రహమగును. ప్రకృతిలో సమృద్ధిగనుండు ఉప్పు ఈపన్నువల్లనే ప్రియంగా అమ్ముచున్నది. ఏపన్నును యివ్వలేని బీదలును ఉప్పుకొనివాడుదురు. కనుక ఈపన్నుబీదలకు తలపన్నువంటిది. ఈపన్నువల్ల సర్కారుకులాభమేగాక, బ్రిటిషువర్తకు లింగ్లండునుండి నౌకలలో ఉప్పుతెచ్చి యిక్కడ అమ్మి సొమ్ముచేసుకొనుటకును వీలైనది.

అప్పుడు దండీ, గుజరాతు, కాకినాడ వేదారణ్యం మొదలగు కేవుస్థలములలో సత్యాగ్రహంద్వారా కొందరుఉప్పుతయారు చేసిరి. దీని నారంభించిన గాంధిమహాత్ముని, తక్కిన కాంగ్రెసుప్రముఖులను సర్కారువారుపట్టి, ఉప్పుచట్టపు ప్రకారం ఖైదులోపెట్టిరి. విదేశీబట్టలకొట్లకు కల్లంగళ్ళకు పికెటింగు నారంభించిరి. ఖద్దరుబట్టలకు ప్రబోధముజరిగి నిలవఖద్దరంతయు ఖర్చైనది. జనులయుత్సాహ మతిశయించినది. కల్లు ఖర్చుతగ్గి జనులస్థితి బాగుపడినది. కాని ప్రభుత్వముకు బ్రిటిషువ్యాపారస్థులకును ఆబాపతు ఆదాయముతగ్గినది. వేలకొలదిగ సత్యాగ్రహము చేయుచుండిరి. అంతట పోలీసులు సత్యాగ్రహులను చెదరదీయుటకని లాటీలతో కొట్టిరి. కొన్నిచోట్ల తుపాకులుపేల్చిరి. ఇట్లెన్ని బాధలపాలైనను ఆస్తులుపోయినను జాతీయవాదులు అహింసామార్గము తప్పలేదు. సుమారు రెండులక్షలవర కప్పుడు శాంతంగానే ఏదోరీతి శాసనోల్లంఘనమును సాగించియుందురు. కొందరు పన్నులీయ నిరాకరించిరి. అందువల్ల బ్రిటిషు ప్రభుత్వపునాది కదలును. అంతట సర్కారువారు రాజీకివచ్చిరి, (1931 మార్చి). ఇదే గాంధిఇర్విను సమాఖ్య. ఈప్రకారం మనదేశముకు వెంటనే ప్రజాయత్త రాజ్యమిచ్చుటకు సర్కారు సమ్మతించిరి. కాని భారతదేశక్షేమము కవసరమయే కొన్నిమినహాయింపులుండవలె నన్నారు. ఈసమాఖ్య ప్రకారం ఆసత్యాగ్రహము నిల్చిపోయినది.

ఇట్లు కొన్ని నెలలు గడచినవి. లండనులో అప్పుడు రాజ్యాంగసంస్కరణసభకు సర్కారువారి యాహ్వానమున కాంగ్రెసు తరపున గాంధిమహాత్ముడు వెళ్ళెను. భారతీయులకు స్వాతంత్ర్య మిచ్చుట న్యాయము, లోకముకుక్షేమకరము. అని ఆయన విశదపర్చెను. కాని, వట్టి సామ్రాజ్యతత్వపు వారు ప్రభుత్వపాలకులైరి. ప్రభుత్వ నియమితులైన జమీందార్లలో కులతత్వపు వారిలో సాంఘికసమస్య ప్రాముఖ్యముకు వచ్చెను.

బ్రిటిషువారు భారతీయులకు కేంద్రాధికార మొప్పగింతుమని ముందుగా ప్రకటించితే, అంతట సాంఘికసమస్య సులభముగ పరిష్కార మగును. కాని ప్రభుత్వ మట్లు చేయలేదు. మనలో సాంఘికంగా పర స్పరమున్న విభేదముకు హెచ్చు ప్రాముఖ్య మిచ్చి, అధికారులు తమ స్వార్థపరతను హింసాతత్వపు మాయతో కప్పుకొనిరి. రాజీ చెడి మరల సంఘర్ష మారంభమైనది. అంతట గాంధిమహాత్ము డీదేశముకు మరలి రాగనే కాంగ్రెసుకార్యవర్గపుసభ జరిగి సత్యాగ్రహము నిశ్చయమైనది. ఆయనను తక్కిన కాంగ్రెసుప్రముఖులనుగూడ వెంటనే ప్రభుత్వము వారు జైలులో నుంచిరి. వేలకొలదిజనులు మరల సత్యాగ్రహంచేసిరి. సర్కారువారు భేదతంత్రమును పూర్తిగ ప్రయోగించిరి; దౌర్జన్యము జరిగినది. అప్పుడు ప్రజలలో ధైర్యము ఐక్యము త్యాగభావము క్షీణించినవి.

ఈలోగా సాంఘికసంఘర్షము ప్రకోపించినది. సర్కారువారేర్ప ర్చుకొన్నట్రరాజ్యాంగములో హరిజనస్థానపు అభ్యర్థులను కేవలంహరిజనులే యెన్నుకోవలెనని, వారినిభిన్నమతస్థులవలె విడదీసిరి. ఇది సవర్ణులకుహరి జనులకుమధ్య కలతలకు కారణమై, హరిజనుల అస్పృశ్యతనుశాశ్వతంచే యును. రెండుపక్షములనాయకులు అంగీకరించిననే ఈపద్ధతినిమార్తుమని సర్కారువా రనిరి. ఈసంఘనాయకుల హృదయములు కరగించుటకై గాంధీగారు జైలులో దీర్ఘోపవాస మారంభించిరి. అంతట ఉభయపక్ష నాయకులును ఈసమస్య ప్రాముఖ్యమును గుర్తించిరి. శాసనసభలలో హరిజనస్థానముల సంఖ్య హెచ్చించిరి; ఒకరీతి సమిష్టినియోజనపద్ధతిని నిర్ణయించిరి. అంతట ప్రభుత్వమువారా రీతిని రాజ్యాంగమును సవ రించిరి. అప్పటినుండి గాంధీగారును కొంద రితరనాయకులును కేవలం హరిజనోద్ధరణకార్యమే చేయుచుండిరి. ఈకారణము లన్నిటివల్ల ఆరాజ కీయ సత్యాగ్రహము క్రమంగా క్షీణించినది.

ఇవిగాక మరికొన్ని చిల్లరసత్యాగ్రహములును అక్కడక్కడ జరిగినవి. జాతీయపతాకము నిలువబెట్టుటకు కాకినాడలో జరిగినది, వర్కలై గురువాయూరులలో హరిజనుల దేవాలయప్రవేశంనిమిత్తం కొందరు సాగించినవి, ఇందు పేర్కొనదగినవి.

ఇట్లే వ్యక్తిగతంగా కుటుంబజీవనంలోను భార్యా పుత్రాదుల పైన మిత్రులమీదకూడ నైతికసూత్రముల విషయంలో గాంధిగారు వ్యక్తిసత్యాగ్రహము లాచరించియున్నారు. గృహమందలి స్వకీయులకు మిత్రులకుగూడ నిగ్రహము నైతికత సత్యాగ్రహ తత్వము తెలిసి అభ్యస్తమగువరకు వారితో ప్రవర్తన సత్యాగ్రహి కొంతభావభేదముకు అందువల్ల భిన్నప్రవర్తనకుకు సిద్ధపడవలెను. అట్లు గాంధిగారికిని తటస్థించినది. అట్టిస్థితిలో వారితో సత్యాగ్రహము అవసరమయినది. తరువాత అట్టి అవసరము పోయినది. ఇప్పుడు గాంధి మహాత్ముడు సాగించుచున్న యుద్ధసత్యాగ్రహమునుగూర్చి తరువాత చర్చింతము.



# 33. సత్యాగ్రహ సూత్రములు.

లోగడ చెప్పిన అహింసాయుద్ధముల వివరమునుబట్టి తేలు ముఖ్య సూత్రముల నిప్పుడు గమనింతము.

ఏయుద్ధముగాని జయప్రదముగ సాగింపవలెనంటే ఐకమత్య మవసరము. ఇప్పటి హింసాయుద్ధము నాయూజాతు లెంత యేకాగ్రతతో జరుపుచున్నవో చూడుడు. చిన్నప్రాంతములోనో ఒకశాఖలోనో ఏకీభావ మేర్పఱ్చుట కొంతసులభము. కాని, 35 కోట్ల భారతజాతి కంతకు సంబంధించు మహోద్యమము కెంతదీక్ష ఏకీభావము నుండవలెను! వేర్వేరు కులములు మతములు వర్గములు గల మనజాతిలో భేదభావము లేర్పడకుటసులభము. వాటిని పోగొట్టి ఏకోద్దేశముతో కృషి జేయుటకు జనులలో త్యాగము కార్యదీక్ష పరస్పరప్రేమ సహనబుద్ధియు కావలెను. నిరాయుధులు శాంతులు వేర్వేరు మతములు కులములు కలసియున్నవారు హింసాయుద్ధము సాగింపబూనుట ప్రమాదకరము. ఒకసారి శత్రువుపైన రేగిన హింసాభావము పరస్పరహింసగను పరిణమింపవచ్చు. మనప్రత్యర్థి అట్లు మరల్పయత్నించుట, అట్లు సాధించుట యుసహజము. కనుక మనయోధులుహృదయంలో కేవలం అహింసాపరులుకావలె. శతుప్రక్షీయులుఅహింసాయోధులను బాధించియు, దూషించియు వీరిలో కలతలు పోరు కలిగించియు హింసలోకి దింపవచ్చు. అయినను సత్యాగ్రహు లెంతమాత్రమును హింసకు పూనకూడదు. మనస్సులోను హృదయములోను ఆంగ్లేయులపైన గూడ ద్వేషము హింసాభావము లేకుండవలెను. చుట్టుపట్లగూడ అహింసావాతావరణము నిలుపవలెను. అహింసాయుద్ధము జరుగుచున్నప్పుడు హింసాచర్యలుండుట అనర్థకము. కనుక ఈదేశపు విప్లవకారులు తమ హింసాచర్య లన్నిటిని కట్టిపెట్టిననే సత్యాగ్రహయుద్ధము సాగింప వీలగునవి లోగడ గాంధిగారుస్పష్టపర్చిరి. అంతటవిప్లవకారులు హింసాచర్యల మాని వేసిరి. దీర్ఘ

శిక్షలొంది అండమానులకు ప్రవాసితులైనయువకులును గాంధీబోధను హర్షించి, హింసాత్మకయుద్ధమందు నమ్మికవదలి అహింసాపరులై, ఆసంగతిని ప్రకటించిరి. అంతట వారిని గాంధీగారి సూచనప్రకారం ఆయారాష్ట్రప్రభుత్వములు చాలవరకు విడుదలచేసినవి.

అహింసాయుద్ధమును కేవలం నైతికంగాను న్యాయమగు ఆశయముల నిమిత్తమునే సాగింపవలెననియు పై వివరణవల్ల తేలినది. ప్రజాక్షేమమునకు వ్యతిరేకముగా దానిని సాధించుటకు సత్యాగ్రహము నెప్పుడును చేయగూడదు. ఇది భౌతికశక్తితో ఆత్మశక్తికి జరుగు పోరు; నైతికాశయములకే ఆత్మబలము చేకూరును. సదుద్దేశముతో దీనిని సాగించినప్పుడే జనులకు హృదయపరిణామము కల్గును. సత్యాగ్రహము ఆర్థికరాజకీయములకు ధార్మికములకు గూడ పనికివచ్చును; ఇది పై ఉదాహరణలవల్లస్పష్టమే.

అహింసాపరులు ముందుగా సామరూపంగా అనగా ప్రతిపక్షీకులోకులకు నచ్చజెప్పి కార్యసాధనచేయుటకు మనస్ఫూర్తిగా యత్నింపవలెను. ప్రత్యర్థిహితముకు కేవలము లొంగకమూర్ఖతవహించినప్పుడేసత్యాగ్రహమారంభించవలెను, అందువల్ల ఆలస్యమైననుసరే, ఉద్యమమునకు బలమేర్పడును. అది చరమాస్త్రము. దాని యుద్దేశమును, ఆశయమును, యుద్ధపద్ధతిని ప్రజలందరికి తెలియునట్లు ముందుగా బోధించి, అది న్యాయమని కనపర్చుచు, ప్రచారము చేయవలెను. అప్పుడే దాని సారముము అందలి నైతికభావమును జనులకు తెలియును. ఉత్సాహమును పూనికయు జనులకు కల్గును. ఆ యుద్ధమారంభించుముందు, యుద్ధమధ్యమందుగూడ, ప్రత్యర్థి రాజీకి వచ్చేయెడల, అందుకు సిద్ధులై న్యాయమగు రాజీ కంగీకరించవలెను. అహింసాయుద్ధము చాలవరకు సరిగా సాగినమీదట శత్రువు న్యాయమైన రాజీకి రాకతప్పదు. అట్టిపనతులకు ప్రజలు అంగీకరింపవలె; స్వల్పములనిమిత్తం పట్టుదలలు కూడదు.

అహింసాయుద్ధము ఆధ్యాత్మికము; కనుక, ఆ యోధులు సత్యవ్రతులై ఈశ్వరభక్తి కలిగియుండవలెను. ఈశ్వరేచ్ఛ మనకు తెలియదు. మనుష్యుడు కేవలం అల్పజ్ఞుడు. యుద్ధసమయములో మనము గ్రహింపలేని క్రొత్తసందర్భములును అవరోధములును రావచ్చు. అప్పుడీశ్వరుడే మనకు మార్గము తోపింపవలె. కనుక ఈశ్వరుని నమ్ముకొని పరిశుద్ధులమై ధ్యానింపవలె. అప్పుడే ఈశ్వరచోదన కలుగును. కనుక నిజమగు ప్రవృత్తిగలవారే ఈ యుద్ధపు ముఖ్యనాయకులు కాగలరు. సమిష్టిసత్యాగ్రహము జరిగించునప్పుడు ఆయాసంఘములలో జనులలో అహింసను పరస్పరమైత్రిని దృఢపర్చవలెను. జనులు అన్నవస్త్రములకు పరాధీనులు కాకుండునట్లు చేయవలెను. లేనియెడల అహింసాయుద్ధము తీవ్రంగా సాగుచుండగా, ఆర్థికంగా వస్త్రాదికులకు ప్రత్యర్థియైన సర్కారుపైనో వారికి లోబను మిల్లుయజమానులపైనో ఆధారపడితే, ఆ పుంజీపతులు తత్కాలముకు కొంత సహాయకులైనను, కొద్దికాలంలోనే ఉద్యమము దుర్బలమై చెడిపోవును. 1932 లో అట్లే జరిగినది. కనుక నిత్యావశ్యకములకు స్వావలంబమును మైత్రియు గల్గియుండవలెను. మొత్తముమీద నిర్మాణకార్యక్రమము జనులలో బాగుగ వ్యాపించినప్పుడే అట్టి పరిస్థితి కల్గును. కనుకనే నిర్మాణకార్యక్రమం పూర్తిగ సాగించితే, ఏడాదిలోనే స్వరాజ్యము వచ్చునని, గాంధిమహాత్ముడు 1921 సం॥రంలో చెప్పెను. కాని ప్రజలట్లు సాగించలేదు.

హింసాయుద్ధముల ప్రయత్నములు కార్యకలాపము గూఢముగ మోసముగ జరుగుచుండును. కాని, సత్యాగ్రహములో రహస్యధోరణి, గూఢచర్యలు, కూడదు. అంతయు బహిరంగముగనే సాగించవలెను. రహస్యతవలన భయము పిరికితనము హింసాతత్వము నేర్పడును. వాటివల్ల తుదకు అహింసాయుద్ధము విఫలమగును.

# 34. అహింసాపాలనపు పరీక్ష.

1934 సం॥లో సత్యాగ్రహము నిల్చిపోయినప్పుడు, కొందరు జాతీయనాయకులు, కేంద్రశాసనసభలో ప్రవేశించిరి. గాంధీయులును గాంధిమహాత్ముడు అందుకనుమతించిరి.

1923 లో దాసు మోతీలాలువంటి గొప్పనాయకులు శాసనసభా ప్రవేశమాశించినప్పుడందుకు గాంధిపక్షీయులు వ్యతిరేకించిరికదా! 'స్వరాజిస్టు'లు అప్పటి 'కౌన్సిళ్ళు' హానికరములని యెంచియు, అందులోనుండియే సర్కారువారి దుష్టచర్యలను ప్రతిఘటింపుచు అప్పటి ద్వంద్వప్రభుత్వమును భంగపరుపబోయిరి. అది ఒకరీతి విధ్వంసకచర్య. ఇట్టిచర్య పూర్తి అహింసావాదుల కిష్టముకాదు. అప్పటిప్రభుత్వపు మంత్రులు భారతీయులే. వారికి నిజమైన అధికారములేదు; స్వరాజిస్టులకు వారికికాలుష్యము గల్గినవి. నిర్మాణకార్యపుదృష్టి వెనుకబడినది.

1937 సం॥రపు కొత్తరాష్ట్రపాలనలో మంత్రులకు కొంతయధికారమేర్పడినది. దేశీయులలో అహింసా ధైర్యములను తత్సాధకమగు నిర్మాణకార్యమును బాగుగ విస్తరింపజేయ వీలుకల్గినది.

కాంగ్రెసువారు సభలలో జేరేయెడల, అందుండి ఆయారాష్ట్రములలో ఊపనులుచేసి వృద్ధిజేసి; తద్వారా కాంగ్రెసును బలపర్చవలెనని గాంధీగారుకోరిరి. అప్పుడు రాష్ట్రములలోజరిగిన యెన్నికలలో కాంగ్రెసువారు పాల్గొనిరి. అప్పటికి దేశంలో జాతీయభావమును తమ భౌతికబలంతోను హింసాశక్తితోను నశింపజేసితిమని బ్రిటిషు ప్రభుత్వముతలచిరి; కాని అట్లు కాలేదు.

సర్కారు హింసాబలంవల్ల తత్కాలముకు అణగినట్లుండినను, నైతికబలంవల్ల జనుల అంతశ్శక్తి హెచ్చునేగాని తగ్గదు. ఇది అహింసా ప్రభావము; కనుక ఆ ఎన్నికలలో 7 రాష్ట్రముల ప్రజాసభలలో కాంగ్రెసుపక్షమునకే ప్రాబల్యము కలిగినది. అక్కడను ప్రతిష్టంభనమే చేయ

వలెనని సామ్యవాదు లుద్దేశించిరి. కానిఅట్టిది హింసాప్రవృత్తికిదింపును. ఆక్టుపరతులకులోబడి మంత్రులు జరుపు మామూలుపాలనలోగవర్నర్లు కల్పించుకోమని మాట యిచ్చేయెడల, వీలైనచోట్ల కాంగ్రెసుపక్షీయులు మంత్రిత్వం వహింపదగునని గాంధీగారు సూచించిరి. ఆప్రకారం వారేడు రాష్ట్రాలలో మంత్రులైరి. 'సామ్రాజ్యతత్వముతో పోరుచున్న కాంగ్రెసువారిప్పుడు దానికిలోబడి రాజ్యమునడపుట సామ్రాజ్య సహకారమగు' నని కొందరాక్షేపించినారు. ఇది పైకల్లేతోచును. కాంగ్రెసు మంత్రులు వెంటనే గవర్నరుతో ప్రతిఘటించి 'డెడ్లాకు' (ప్రతిష్టంభన) కల్గించుట సులభమే. కాని అది విధ్వంసకమే; అహింసా వర్ధకంకాదు. కాంగ్రెసును బలపర్చి జాతీయశక్తిని హెచ్చించవలె; అందుకు దేశంలోనిర్మాణకార్యమును వృద్ధిచేయుటకే ప్రభుత్వబలమును ప్రజాశక్తినిగూడ కాంగ్రెసు వినియోగించినది. పూర్వపుప్రభుత్వోద్యోగులు ఖదరుజూచి కంటకించుకొనిరి, సాంఘికతత్వమును హెచ్చించిరి. ఆప్రభుత్వము మధ్యపానము ప్రోత్సహించిరి. కనుక నిర్మాణ కార్యమన్న ప్రజలును జంకిరి. ఇప్పుడు కాంగ్రెసువారుద్యోగంవహించగనే మంత్రులు ఖదరు ప్రోత్సహించిరి; చర్కా-సంఘములబోషించిరి. కొన్ని రాష్ట్రములందు కొందరు సర్కారు నౌకరులు ఖదరు దుస్తులే ధరించునట్లాజ్ఞవచ్చినది. ఇట్లే మద్యనిషేధమునుగూడ కొన్నిజిల్లాలలో సాగించిరి. ఇందువల్ల తగ్గిన సర్కారు ఆదాయమును వేరుపన్నుల వల్లను కొన్నిఖర్చుల తగ్గింపుద్వారాను పూడ్చుట కారంభించిరి. అహింసావ్యాప్తికై మంత్రులు ప్రచారము చేసిరి. అహింస కవసరమగు హరిజనోద్ధరణకు కృషిని అస్పృశ్యతానివారణకు చట్టమునుచేసిరి. కొన్ని ప్రాంతములందు నిమ్నజాతులకు సౌమ్యంగా దేవాలయప్రవేశ మిప్పింపదగు చట్టముల జేసిరి. సాంఘికమైత్రికై అల్పసంఖ్యాకుల కుద్యోగాదులందు ప్రత్యేకసౌకర్యము నిచ్చిరి. సామాన్యభాషయైన హిందూస్తానీని 1, 2, 3 వ ఫారములలో తప్పక బోధించుచు జేసిరి. దానికిసంతవరకు స్వదేశీ

వస్తువులనే సర్కారుకచేరీలలో వాడునట్లు నిర్ణయించిరి. ఈనిర్మాణ కార్యము వేగంగాబలపడితే అహింసాభావము ప్రజలలో నాటుకొనేది. అప్పుడు దేశపు ఆర్థికనైతికస్థితితో బాటు రాజకీయంగా మంత్రుల బలమును హెచ్చి యుండేది. అవసరమైతే బ్రిటిషు సర్కారుతో అహింసా యుద్ధము సాగించుటకును ప్రజలు సిద్ధమైయుండియుందురు.

కాని, నిర్మాణ కార్యపునిర్వాహము సరిగా జరుగలేదు. మంత్రిత్వము వచ్చిన 27 నెలలకే రాష్ట్రములలో కాంగ్రెసు మంత్రులు తమ ఉద్యోగముల వదలుకోవలసి వచ్చినది. 1939 సం॥ సెప్టెంబరులో మహాయుద్ధము రాగనే, రాష్ట్రప్రభుత్వముల సమ్మతిలేకుండా కేంద్ర ప్రభుత్వమువారే రాష్ట్రములందును యుద్ధావసరముకని తమకుతోచే పనులు చేయనారంభించినారు. నిరంకుశత హెచ్చించు ఆర్డినెన్సులను దేశమంతటను మంత్రుల సమ్మతిలేకుండ జారీచేసినారు. కొన్నిపన్ను లకు రాష్ట్రీయప్రభుత్వముకుండే అధికారమునుగూడా తగ్గించుచు 1940 లో పార్లమెంటులో మరొక సవరణచట్టము చేసినారు. ఈదేశపు సేనా ద్రవ్యసంపత్తులను యుద్ధకార్యములకై వినియోగించుటకు కేంద్రం లోరాష్ట్రాలల్లోగూడ ప్రయత్నమారంభించినారు; ఈకాలపు యుద్ధ మనేది అన్నిప్రక్కలను మహాహింసకు పోషకము. మంత్రులిక ఉద్యో గాలలోనుండి అహింసాతత్వమును నిర్మాణకార్యమును పోషింప వీలు లేదు. ప్రజాస్వాతంత్ర్యపు హక్కును ప్రచురింప బ్రిటిషు ప్రభుత్వము నిరాకరించిరి. ఈ యన్ని సందర్భాలవల్ల కాంగ్రెసువారు మంత్రిత్వము వదరి; కనుక పాలనాధికారంద్వారా నిర్మాణకార్యమును వృద్ధిజేయు యత్నము సగంలో నిల్చిపోయినది.

కాంగ్రెసుమంత్రిత్వపు అనుభవములగూడ ఇప్పుడు పరిశీలిం తము. కాంగ్రెసుమంత్రుల తోడ్పాటుతో ప్రజలందరూ అహింసను స్థాపించి నిర్మాణకార్యక్రమము నుత్సాహంతో అమలుజరిపితే మరల సత్యాగ్రహయుద్ధ మవసరముకాదు. ప్రజాశక్తి హెచ్చి స్వాతంత్ర్యము

లభించవచ్చును. స్వాతంత్ర్యయుద్ధ మవసరమైనను దానిని సాగించుటకును ముందుగా నిర్మాణకార్యం సాగించుట అవసరము, కనుక ఈశరుణంలో ఆపని పూర్తిచేయదగును' అని గాంధీమహాత్ముడు 1937 జూలైలో సూచించిరి. తరువాతగూడ అంశమునుగూర్చి ఆయన చాలసార్లు హెచ్చరించినారు. ఈవిషయంలో మంత్రులు ఇంకను బాగుగాపనిచేయుట కవకాశముండినది. ప్రభుత్వం పోలీసు, అబ్కారీ వగైరా ఆయా ఉద్యోగులకిచ్చు దుస్తులన్నిటిని ఖదరులోనే తయారు చేయించవచ్చును. గ్రామాలలో ఖదరుఉత్పత్తికింకను ప్రోత్సాహమీయవచ్చును. హరిజనులకు చెరువులు బడులు వగైరాలందైనను అస్పృశ్యతా నివారణ నెక్కువ చురుకుగ జరిపియుండవలసినది. దేవాలయ ప్రవేశముగూర్చిన చట్టము నింకను విశాలముగ సులభాచరణీయముగజేసి యుండవలెను. ఆమందపు చట్టమునైన మలబారుకేసెట్టిరి. అది వ్యర్థమైనది. దేవాలయాల అజమాయిషీ చేయు ఎండోమెంటు బోర్డుఅధికారుల కీకార్యక్రమమందు తగు శ్రద్ధఉత్సాహములేవు. మనరాష్ట్రంలో జమీందారీభూములకు కొత్తశాసనము చేయ కృషిజరిగినది. కాని, అది చట్టముకారయితుల బాధలట్లేయున్నవి మొత్తంమీదకాంగ్రెసు మంత్రులు తమకుండిన కొలది అవకాశంలో బాగుగనేపని చేసిరి. అయితే, ఈవిషయంలో ప్రజలు తమబాధ్యతను సరిగా నెరవేర్చలేదు; వారు మంత్రులకింకను సర్వాధికారము లేదని గ్రహించలేదు. అహింసాపాలనలో మంత్రులకుండుబాధ్యతలను కనిపెట్టక కొందరు మంత్రులకు బాధకల్గించిరి.

యజమానులకు కార్మికులకు, జమీందార్లకు, రయితులకు హరిజనులకు, సవర్ణులకు, హిందువులకు, ముస్లిములకు, జాతీయతకు, ప్రాంతీయతకు ఇట్లు ఆయాసంఘములమధ్య సమన్వయమును మంత్రులుచేయుచుంటే, ఇందుకు వ్యతిరేకంగా కొందరు యువకనాయకులు ఆందోళన, అల్లరులు లేవదీసి, మంత్రులకుక్లిష్టసమస్యలు తెచ్చిపెట్టిరి. కొందరు వరుసగా సమ్మెలుసాగించిరి. వీటిని పరిష్కరించుటకు మంత్రు

లకాలము వ్యయమైపోయినది. వీటివల్ల సంఘర్షము పెరిగి, మన ప్రాంతంలో ఉభయ తారకమైన కాన్గ్రెసు శాసనము చేయుటకు కాన్గ్రెసు ప్రేమి యగు గిరిగారికినితగు అవకాశము లేకపోయినది. కొన్ని జమీందారీలలో కల్లోలము కల్గినది.

కొందరు తీవ్రంగాసామ్యవాదోపన్యాసాలలో హింసాతత్వపు సూచనలజేసిరి. అందుకు వారిపైన చర్యజరిగినది. దీనివల్ల పౌరస్వేచ్ఛకు కాంగ్రెసుమంత్రులు భంగముగల్గించిరని ఆందోళన గల్గినది. కొందరు సామ్యవాదులు 'ఫార్వర్డుబ్లాకు' వారును వర్గసమన్వయమునకు వ్యతిరిక్తంగా వర్గసంఘర్షమునుసాగించినారు. అసలుముఖ్యసమస్యల అధికారము చాల వరకు కేంద్రప్రభుత్వపు చేతిలోనున్నది. అందులో కాంగ్రెసు వారికట్టి హక్కును ఇంకనుకలుగలేదు. రాష్ట్రాలలోని ఆర్థికాధికారము సంకుచితము, కార్యనిర్వాహము ఐ.సి ఎస్. వారిది. అదిబ్రిటిష్ప్రభుత్వముక్రింద ఉన్నది. ఆపెద్దయుద్యోగులపైన నిజమైన అధికారము మంత్రులకు లేదు. అయినను యావత్తుబాధ్యతలను కాంగ్రెసుమంత్రులే నిర్వహింతురన్నట్లు చాలమంది నడుచుకొనిరి. మంత్రుల సానుభూతితో జనులు వేగంతో నిర్మాణకార్యక్రమమును సాగించియుండవలెను. కాని జనులువిశేషంగా ఖదరుధరింపలేదు; ఉత్సాహులైన చాలయువకులును (గాంధీయులకన్న తీవ్రవాదులైనను) నిజమగుస్వదేశి నాచరింపలేదు. మద్యనిషేధం,అస్పృశ్యతానివారణ,హిందూముస్లింమైత్రి,ఇత్యాదుల ప్రచారమును దీక్షతో జరిగింపభారంవహించలేదు ఈయువకులకు ఇంకాక్రమశిక్షణకావలెను, ఉద్యోగులు విద్యార్థులు సామాన్యప్రజలుగూడ చాలవరకుమిల్లుబట్టలు పంచదార ఇట్టియాంత్రికవస్తువులనే (నేటికిని) హెచ్చుగవాడుచున్నారు. చాలచోట్ల హరిజనులు చెరువులు, బావులుబడులు వగైరాలలను ముట్టుటకుగూడ అనేకులుసవర్ణులు వ్యతిరేకించియున్నారు. అట్టిప్రయత్నములు జరిగినచోట్ల కొట్లాట అల్లరులును జరుగుచున్నవి. గ్రామజీవితము బాగుపడలేదు. 'వృద్ధనాయకులు మంత్రిత్వాలలోజేరి జాతీయ యుద్ధమును

వెరచుచున్నారని వారిని విద్యార్థులు యువకులు నిందించినారు కాని, ఇప్పుడుసత్యాగ్రహము మితంగానైనను తటస్థించగా, అందుకు అవసర మైన అంతశ్శక్తియు అహింసాబలమును దేశములోచాలవని నిదానంతో చూచువారికి స్పష్టమైనది. కాంగ్రెసుమంత్రివర్గమునుండిపూర్తి ఫలమును జనులు పొందలేదు. అహింసాశక్తి యింకను జనులలో బాగుగ వ్యాపించ లేదు. స్వయంకృషి సంఘీభావము కావలెను. ఎన్ని శాసనము లేర్పడినను ప్రజాభావము వాటినిసద్భావముతోను సంఘప్రేమతోను అమలుజరిపి, జనులలో అహింసాభావము వ్యాపించినప్పుడే, అవి జయప్రదంగా అమలు జరుగును. అహింసకు ప్రత్యక్షసాధకమగు నిర్మాణకార్యక్రమమునిప్పటి కైన భారత భావిభాగ్యముకోరుప్రతివారును, యావచ్ఛక్తితో సాగించ వలెనని సత్యాగ్రహప్రవక్త హెచ్చరించినారు.*

---

* The constructive work prescribed by the Congress is the best preparation ... ... ...... Those therefore who wish to see India realise her destiny through non-violance should devote every ounce of their energy towards fulfilment of the Constructive Programme in right earnest without any thought of Civil Disobediance.

(1-6-1940 తేదీని హరిజనపత్రికలో గాంధిమహాత్ముని వ్యాసము)

# 35. జాతిద్వేషపు ప్రాబల్యము.

పశ్చిమ యూరపురాజ్యముల ఆక్రమణవల్ల ఆఫ్రికా అమెరికా (లలో) భారతదేశాదులలోనురంగుజాతుల ఆర్థికస్థితితో బాటు మానవత్వ మును క్షీణించినది. ఈజాతులు పట్టి అనాగరికులని, వారికి తామే మా నవత్వము గల్గించి యుద్ధరించుచున్నామని, ఈపాలకవర్గములు తరుచు ప్రచురింతురు. శ్వేతవర్తకులును తాము సాగించునది శోషణగాదు, పో షణయన్నారు. ఇట్లు హింసాచర్యలకు అసత్యప్రచారము తోడగుట సహజమే. క్రీస్తు ధర్మప్రచారముకని బయలుదేరిన మిషనరీలలో హెచ్చు మందియు భారతీయులలోని విగ్రహారాధనను జాతరలను నిమ్నజాతులకు జరుగు అన్యాయములను పురాణగాధలలో కొన్నికథలను విపరీతము గచిత్రించి, ఉన్నతనాగరికతగల హైందవులును పట్టి అనాగరికులేయని స్వాతంత్ర్య మెరుగనివారని, వారినట్టి హీనస్థితినుండి ఉద్ధరించి శాంతిని రక్షించుటకు బ్రిటిషుపాలన మవసరమని ప్రచురించినారు. శ్వేతజాతులే ఘనులని, వారే తక్కినజాతుల బాలించుటలో బాధకోర్చి భూభారము మోయుచున్నారనియు యూరపులో ప్రజలకుభావమేర్పడినది. మొత్తం మీదవారిమోత బంగారుమోత. అయినను, 'ఇతరులు తెల్లజాతులకు దాస్యము చేయుటకే తగుదురు' అని యూరపియనుల యహంకృతి. ఆర్థి కంగాను రాజకీయంగాను పరాధీనులు తమస్వాతంత్ర్యముకు ఆత్మరక్ష ణకు యత్నింపగా, 'వీరు కృతఘ్నులు దుష్టులు వీరి నణచి యుంచవలసి నదే' అని వారుద్వేషప్రచారము సాగించినారు. ఇట్లు యూరపియనులకు అహంకారము, రంగుజాతులపైన ద్వేషమును హెచ్చినది.

ఈలోగా ఒకవిచిత్రపరిణామము. "ఈశోషణచర్యలోను అందుచే గల్గు లాభంలోను శ్వేతజాతులందరికీ సమభాగముండవలెను బ్రిటిషు ఫ్రెంచివారలే విశేషలాభ మొందుచున్నారు. మాకు లేకున్నది" అని జర్మను లసూయపడినారు. అయితే నౌకాబలముగలవారికే సామ్రాజ్య లాభముకల్గుచున్నది. ముఖ్యంగా ఈదేశాంతరాలలో తమ యాంత్రిక వస్తువుల వ్యాపారప్రాబల్యముకై జర్మనులు బ్రిటిషు ఫ్రెంచివారితోపోరిరి.

లయుద్ధపు ఫలంగా జర్మనులకుండిన కొద్దికాలనీలుగూడ విజేతలు వశ పర్చుకొన్నారు. ఇటలీవారు బ్రిటిషుపక్షమందుంటే తమకు లాభించునని ఆశపడి ఆయుద్ధంలో నటు చేరిరి. అయినను యుద్ధాంతమున వారను కొన్నట్లు లాభించలేదని ఇటాలియనులకును ద్వేషము గల్గినది.

వీటి దుష్ఫలితముగ ధర్మమే బలమగుటకుబదులు పశుబలమే ధర్మమను సిద్ధాంత మీనాగరికజాతుల కాదర్శమైనది. వర్సాలే సంధి షరతు లన్యాయమైనను యుద్ధంలో మిత్రమండలియేగెల్చెను గనుక ఆషరతు లొప్పుకొని దేశమును పునరుద్ధరించుటకు జర్మనునాయకులు యత్నించిరి, కాని విఫలులైరి. ఇటలీయు దాదాపు ఈస్థితికి వచ్చెను. రష్యాలోవలె సామ్యవాదమే కావలెనను భావ మేర్పడి యూరపుప్రజ లనేకులుదాని నభిమానించసాగిరి.

ఈస్థితిలో ఇటలీలో ముస్సోలినీనాయకత్వమున ఫాసిస్టుపక్షము ప్రబలినది, సామ్యవాదుల నణచి నియంతృ పద్ధతిని పాలించుటే ఫాసిజము. ఇట్లే జర్మనీలో లేచిన నాజీపక్షమును ప్రబలమయినది. సామ్యవాదముపైన ద్వేషము, పుంజీపతులసాయము, పారిశ్రామికుల ప్రాబల్యము, విజాతీయులపైన ద్వేషరూపమైన జాతీయతత్వము, నిరంకుశనియంతృపాలనయు, ఈరెంటిలో నున్నవి. ఇటలీలో ముస్సోలినీవలె కొంతకాలముకు జర్మనీలో హిట్లరు నాయకుడైనాడు.

యూరపులో సామ్యవాదము ప్రబలకుండుటకై పాశ్చాత్యపుంజీపతులు యంత్రయజమానులు తమపలుకుబడిద్వారా బ్రిటిషు ఫ్రెంచి ప్రభుత్వములు హిట్లరుకే కొంతసుముఖులగునట్లు చేసిరి. హిట్లరుపక్షీయులు సామ్యవాదుల దూషించుచు పుంజీపతితత్వమును స్తుతించుచు ధనికసహాయముతో జర్మనీలో పాలకులైరి. అంతట హిట్లరు యుక్తితో బ్రిటిషుపాలకులమైత్రిని సంపాదించి బలపడినాడు. ఫ్రాంసులో స్థిరపాలన లేకుండెను. ఫ్రెంచివారు బ్రిటిషుప్రభుత్వముతో మైత్రితో నుండుచుండిరి. ఒకసారి ఫ్రెంచిప్రజాసభలో సామ్యవాదులు (కొంచెపు)

మెజార్టీ సంపాదించి రష్యాతో మైత్రిసంధి చేయించిరి. వెంటనే బ్రిటిషు ప్రభుత్వము హిట్లరుతో నౌకాసంధి చేసుకొని అతనిని బలపర్చిరి. అంతట బ్రిటిషు సానుభూతితో ఫ్రెంచి పుంజీపతులు ఫ్రాంసులో ప్రబలురై, తమ ప్రభుత్వంచేత రష్యాతో జరిగిన మైత్రి నిరద్దు చేయించిరి. ఈనాలుగైదు రాజ్యము లేకీభవించి రష్యాను సామ్యవాదితత్వమును ప్రతిఘటింపసాగిరి. అయితే యాంత్రిక ధనార్జనలోను ఆయుధ ప్రాబల్యంలోను తమకు పోటీయై నిరోధకులైన బ్రిటిషు సామ్రాజ్యముతో పోరి, అందులో జర్మనీకి ఆధిక్యం సంపాదింపదలచి, జర్మనులు లోలోపల తమ సైనికబలము హెచ్చింపసాగిరి; గొప్పవైమానిక బలమును తయారుచేసిరి. ఈనాజీ నాయకుని అసలుసిద్ధాంతము జాతిద్వేషము. ఇతడు తన దేశంలోని యూదులనణచెను; శ్వేతజాతీయులే లోకపాలకులు కాదగునని బోధించెను. అయితే, జర్మనులే ఉత్తమ జాతీయులని, వారే లోకనాయకులు కాదగునని, క్రిందటి ప్రపంచయుద్ధంలో సామ్యవాదులకుట్రవల్లను ఆహారసామగ్రిలేకయు సైనికులు భయపడిరని, సరిగాతయారైతే జర్మనులు బ్రిటిషు ఫ్రెంచివారల నోడింతురని, ప్రచురించెను. లోకంలో జాతిసంఘర్షము తప్పదని, కనుక ప్రతిజాతియు యుద్ధప్రయత్నము చేయవలెనని జీవాభివృద్ధికి యుద్ధము సాగుట యవసరము (War is a biological necessity) అనియు, నాజీల వాదన. హెచ్చు ఆయుధబలమును యోధశక్తిని సంపాదించుటే మోక్షమార్గమని జర్మనులందరు నమ్మిరి. హిట్లరు అధికారములో నున్న ఐదేండ్లలోను నిరంకుశాధికారం వహించి దేశంలో యావత్తు రాజ్యాంగమును సాంఘికసంస్థలను భౌతికసంపదను యోధబలవృద్ధికి వినియోగించెను. పరస్పరం మోసము ద్వేషప్రచారము సాగినవి. అయినను సామ్యవాదము నరికట్టుటకు ధనాఢ్యుల సంస్థలును తమశక్తులుహింసాతత్వపువృద్ధికే వినియోగించినవి. భారతదేశాదులనుండి బ్రిటిషువారు ప్రబలురైనందున హిట్లరుకు కన్నెర్రయైనది. తమకును ఈదేశాలలో సమానసౌకర్యముండవలెనని ప్రచారమారంభించినది.

## 36. నేటి ప్రపంచ యుద్ధము.

ఇట్లు లోకమంతటను అశాంతి, ద్వేషభావము గూఢచర్యలు మరింత హెచ్చి, ఇప్పుడు యుద్ధప్రళయము సాగుచున్నది. తూర్పున 1937 సం॥ జూలైలో జపానువారు యుద్ధప్రకటనగూడ లేకుండనే ఉత్తరచీనాలో జొరబడి, 4 ఏండ్లనుండి మహాయుద్ధము సాగించుచున్నారు. ఇప్పటికిచీనాలో తూర్పుదక్షిణజిల్లాలును ఉత్తరపు ముఖ్యనగరాలను జపానీయు లాక్రమించినారు. చీనులు పడమటనున్న 'చంకింగు' అను గిరిపురమును తమ రాజధానిని మార్చుకొన్నారు. లక్షలకొలది జపానీయులు అంతకన్న హెచ్చుగ చీనులు నిప్పటికి హతులైనారు. చీనుల ఆస్తినష్టమును మితియేలేదు. ఈ పోరులో పాశ్చాత్యులు చూపిన నీతివిచిత్రము. చీనాకన్యాయము జరుగుచు ధర్మసూత్రములు నశించుచున్నందు కీనాగరిక రాజ్యాలకేమియు బాధకలుగలేదు. వారు చీనులకన్న హెచ్చుగ జపానీయులకును మొదట యుద్ధసామగ్రులమ్మి లాభమొందుచుండిరి. కాని జపానువల్ల బ్రిటిషు అమెరికనుల లాభవ్యాపారమునకు అడ్డమేర్పడెను. ఈ శ్వేతజాతుల అన్యాయార్జితమైన ప్రత్యేకపు హక్కులను జపానీయులు రద్దుచేసినారు. అంతట మాత్రం బ్రిటిషులు అమెరికనులు ఆగ్రహపడి జపానును బెదరించినారు. అయితే వారిప్పుడు యూరపు యుద్ధంలో చిక్కుకొన్నారు. కనుక, (వారి హక్కులకు భంగంచేయమని చెప్పుచునే) క్రియలో అక్కడి అన్నిహక్కులు జపానీయులు తమవశం చేసుకొనుచున్నారు. చీనులు కుటీరపరిశ్రమలు వృద్ధిజేయుచు, ధీరతతో జపానీయులను ప్రతిఘటించి అద్భుతధైర్యముతో పోరుచున్నారు. విశాలము ప్రకృతిసంపన్నము, జనసంకులము, సంస్కృతియుతమునగు చీనాను పూర్తిగ నోడించుట దుస్సాధ్యమని బోధపడియు ప్రతిష్ఠను లాభాశను విడువలేక జపానీయు లింకను క్రూరయుద్ధము సాగించుచున్నారు. ఇది ఈ మంగోలియను రాజ్యముల అంతర్వినాశమునకు కారణమగుచున్నది. ఉత్తర

చీనాను జపానీయులు ప్రత్యేక రాజ్యమన్నారు; కాని, క్రియలో దానికి ప్రజాసహాయ మెంతమాత్రమును లేకున్నది.

ఇక పశ్చిమంలో జరుగుయుద్ధమింకను ఘోరము దీనికినితలత్తోక లేకున్నవి జెకోస్లవేకియా స్వాతంత్ర్యమును అన్యాయముగ జర్మనులు హరించినను స్పెయినునువారు బాధించినను మిత్రమండలి యూరకొన్నది. పిమ్మట జర్మనుల సంఖ్య చాలహెచ్చుగనున్న డాంజిగును పోలండులో చిన్నభాగమును స్వభావికమగు తమలో (అక్రమంగానే) కలుపు కొన్నప్పుడు బ్రిటిషు వారడ్డు కొన్నారు స్పెయిను, అబిసీనియా, జెకోస్లవేకియాల విషయంలో బ్రిటిషువా రవలంబించిన కూటనీతికి స్టాలిను అనుమానపడి బ్రిటిషుపాలకులు తమ దంద్వపద్ధతినింకను మాన లేదనియొంచెను. రష్యాను, జర్మనీని వెంటనేడీకొనజేయుట బ్రిటిషుపాల కుల యుద్దేశమని తోచి, దానిని వీలైనంతవరకు తప్పించుటకు స్టాలిను జర్మనీతో అవిరోధపుసంధి (Non-agression pact) చేసుకొనెను. (22-8-39). జర్మనులు డాంజిగును కలుపుకొని పోలండుతో యుద్ధ మారంభించిరి. అంతట 3-9-39 నుండి పోలండురక్షణకని బ్రిటిషు, ఫ్రెంచిరాజ్యములు జర్మనీపైన యుద్ధమారంభించినవి. ఈ మహాయుద్ధ మిట్లు పశ్చిమ దక్షిణ రంగములకును వ్యాపించినది.

పోలండు రెండువారములలో నోడి పరాధీనమైనది. పశ్చిమ రంగంలో బ్రిటిషు, ఫ్రెంచిసేనలు మాగినోపంక్తినుండి జర్మనుల 'సీగ్ఫ్రీడు' కోటలపంక్తిని భేదించి జర్మనీలో ప్రవేశింపవలె. కాని ఆప్రయత్న మింకను సాగుచుండగనే (1940 ఏప్రిలు) జర్మనులు డెన్మా ర్కునుదాటి బ్రిటిషువారిమిత్రులగు నార్వేపై దాడిచేసిరి. ఘోరమగు విమానాదియుద్ధము సాగి, నార్వే జర్మనుల వశమైనది. మే నెలలో ఇట్లే హాలండు బెల్జియములు, ఆజూనులో ఫ్రాంసుకూడ, జర్మనులకోడి నవి. బాల్కనులు అనగా హంగరీ, రుమేనియా, బల్గేరియాలు బ్రిటిషు ప్రాబల్యమునుండి జారి, క్రమముగా జర్మనుల యధికారంక్రింద చేరినవి.

ప్రతిఘటించిన యుగోస్లావియా గ్రీసులను 1941 ఏప్రిలు, మే నెలలలో జర్మనులసేనలు వశపర్చుకొనుటేగాక, ఇటాలియనులనుండి గ్రీకులు జయించిన ఆల్బేనియానుకూడ మరల యిటాలియనులకు వశపర్చినారు, ఆఫ్రికాలోని ఇటలీసామ్రాజ్యము నోడించి ఎరిట్రియా, అబిసీనియా సోమాలీ లాండులను బ్రిటిషువారు వశపర్చుకొన్నారు. తటస్థ దేశాలను తమవైపుచేర్చుకొనుట కుభయ పక్షములును చతుర్విధోపాయములు కూటనీతిరహస్యసంఘులను ప్రయోగించి, విశ్వప్రయత్నముల జేయుచున్నారు. అసత్యత హెచ్చినది అమెరికా బ్రిటిషు వారికి సాయపడుచున్నది. బ్రిటిషుమిత్రులగు ఈజిప్టు టర్కీలు తటస్థమయినవి. ఇరాకు ఒకపూర్తి పట్టీకొట్టినది. మిత్రమండలిపక్షమునకొన్నరష్యాను అవిరోధసంధిద్వారా ముందేతటస్థపర్చి జర్మనీయుద్ధమారంభించినదిగదా! అప్పటినుండి రష్యా ధోరణి యతిగూఢముగ నుండెను. రష్యా జర్మనీలు, టర్కీ, బాల్కను, ఫిన్లండులలో తమతమ ప్రాబల్యము హెచ్చించుకొనుయత్నంలో సంఘర్ష పడుచుండిరి. ఇదిలోలోనరగిలి ఇప్పటుభగ్గుమన్నది. రష్యావారీయుద్ధంలో తటస్థులుగ నుండుచునే బాల్కను రాజ్యములను సోవియటు సమితిలో చేర్చుకొన్నారు; సేనావ్యూహాలతో తమపలుకుబడి హెచ్చించుకొన్నారు; వారిసైనికచర్యలు కొన్ని సంధులు జర్మనీవిజృంభణకు కంటకమైనవి. ఆర్థికంగానుజర్మనులు కోరినసాయము రష్యానుండి లభించలేదు. బ్రిటిషు ప్రభుత్వపుయుక్తివల్ల రష్యను లావైపుకు మొగ్గుచు తనకు వ్యతిరేకులై నారని నిశ్చయించి, జర్మనునియంతహిట్లరు 22-6-1941 తేదీనిరష్యాపైన అద్భుతమగు మహాయుద్ధ మారంభించినాడు. లక్షలకొలది జనులు చచ్చుచున్నారు. కనుక, ముం దెప్పుడో జరుగునని లోగడమన మూహించిన యుద్ధము రష్యా కిప్పుడే తటస్థించినది. ఈమహాయుద్ధజ్వాల యింక నెన్నివంకరలు తిరిగి యెన్నిదేశాల నాహుతిచేయునో తెలియదు. వెనుకటిమహాయుద్ధంలో కందకపుయుద్ధాలలో ఒక్కొక్క నెలలో లక్షల కొలది హతులైరి. ఇప్పుడు రేడియోవల్ల విమానాములనుండి రక్షణ

సులభమయినది. కాని, చాల అనర్థమును కల్గినది. అసత్యప్రచారము క్రౌర్యము మోసము చాల హెచ్చినవి. వ్యక్తిస్వాతంత్ర్య మసలే క్షీణించినది.

తమ పక్షమే న్యాయమైనదని, ధర్మయుతమని, ఉభయపక్షము లునువాదించుచున్నారు. శత్రుపక్షీయులను భ్రమపెట్టుటకునుకొందరిని తిప్పుకొనుటకు లేక అడలగొట్టుటకు చిత్రవిచిత్రపద్ధతు లవలంబించుచు న్నారు. జర్మనులు హూన్నులు రాక్షసులునని బ్రిటిషుపక్షీయులును, బ్రిటి వారు దుష్టపిశాచులని జర్మనులును దూషించుచున్నారు. యథార్థము కు ఉభయులును ట్యూటనుజాతి సోదరవర్గీయులు కాని, ఇప్పుడు యుద్ధంలో భాతృత్వముకు మానవత్వముకు స్వస్తిచెప్పి, పశుత్వ మవ లంబించుట శోచనీయము. నాజీలు బోల్షివిక్కులు ఇటీవల పరస్పరం చేయుదూషణల కసలే మితిలేదు.

ఇట్లుమానసిక వాచికహింసయేగాక, యుద్ధంలో కాయికహింసయు చాల హెచ్చినది. ఈ 20 ఏండ్లలో వైజ్ఞానికావిష్కారములింకను హెచ్చి నవి. కనుకకొత్తరీతిసాధనములు వినాశకపద్ధతులు అమలుకు వచ్చినవి. అన్నిటిలోముఖ్యము విమానపుదాడి. 1918 లోని వాటికిప్పటివాటితో పోలికయేలేదు. గంటకు 300 మైళ్ళవేగముతో బాంబర్లు, ఫైటర్లు వగై రాలు శత్రుదేశంపైకివెళ్ళి ఇరవై వేల అడుగుల యెత్తునుండియు బాంబులు విడుచును. ఎంతమంచిగురితో వేసినను అవి నేలచేరునప్పటికి మైళ్ళ కొలది దూరము గురిభేదించును. ఒక్కొక బాంబు 500 టన్నులబరువు ఉండును. వీటిలోకొన్ని ఆగ్నేయములు, కొన్ని గుండ్లుగలవి, కొన్ని విషరసాయనమయములు, కొన్ని పిడుగులవంటివి. వీటివల్ల రాతికోటలు ను, ఉక్కుమేడలుగూడ ధ్వంసమగును. ఆకాశంలో పోరు విమానములు తుపాకులగుండ్లు తగిలి నష్టమగును. ఆత్మరక్షణకుచు ఫిరంగులు సొరంగ ములు మంటచల్లార్చు కొత్తయంత్రములు బాంబువినాశికలు ఇట్టి కొత్తసాధనములును వచ్చినవి. చాలమంది పురములువిడచి గ్రామము లకుపోయినారు. లండను బెర్లినువంటి అద్భుతమగు మహానగరములును బాంబులదెబ్బలవల్ల కూలి చాలవీథులు భస్మావశేషమగుచున్నవి.

ఈయుద్ధంలో రణరంగము శాంతప్రాంతాలు అను భేదమే లేదు. భూస్థసారంగములకన్న జలాకాశములు ముఖ్యమగుచున్నవి. మరియు అతిదూరరంగంలో ఏకకాలమే యుద్ధమగుచున్నది. 1940 సం॥ జూనులో ఫ్రాంసు యుద్ధము 250 మైళ్ళ వెడల్పునను, 1941 జూను నుండి రష్యాలో 1500 మైళ్ళ వెడల్పునను జరిగిన విమానాదియుతయుద్ధమిదివరలో నెన్నడు కని విని యెరుగనిది! ఊహాతీతము. అట్లాంటికు మహాసముద్రపు జలయుద్ధము నిట్టిదే. వాటితో ఉభయపక్షాలలోను యోధులు కాని శాంతపౌరులును స్త్రీ శిశువులుకూడ ఎందరోచావక తప్పదు. కూలెడు ప్రతివిమానముతో ప్రజ్ఞావంతులగు శూరులు అయిదారుగురు యువకులును పడుచుందురు. ఇట్లు వైమానికనష్టము హెచ్చుచున్నది. పూర్వపుయుద్ధసూత్రములు తారుమారైనవి. డైవుబాంబర్లలో శత్రువులు వచ్చి మరతుపాకులతో జనసమూహమును చంపివేయవచ్చును. క్రొత్తరకపు వ్యూహపద్ధతులును వచ్చినవి. యాంత్రికశక్తి హెచ్చినది. యంత్రబలంవల్ల వ్యూహశక్తివల్ల మూడు లక్షల జనుల జర్మనుసేన 15 లక్షల ఫ్రెంచి యోధులను జయించి ఖైదీలుగ పట్టుకొన్నారు; 7 లక్షల మందిని చంపిరట. అసమాన బలము గలదనుకొన్న ఫ్రాంసు రాజ్యమొక్క నెలలో భగ్నమైనది. విమానములపైన ఛత్రధారులు రహస్యముగదిగి శత్రుసేనలవెనుక చీకాకుపర్చియు, విమానాశ్రయముల వశపర్చుకొనియు, జలాశయములనరికట్టియు, శత్రువ్యూహములకు అపారనష్టము కల్గింపవచ్చు. రేడియోద్వారా అక్కడి యోధరహస్యములను తమదూరసేనలకు తెలుపవచ్చు. ఉక్కుకవచములతోవచ్చు తమటాంకులను పైనుండి రహస్యములదెల్పుచును, ఎదుట శత్రువులపై నాగ్నేయాస్త్రముల గురిపించుచును, తోడ్పడవచ్చు. మరియు తమనౌకాబలముచాల కున్నను, విమానప్రాబల్యముంటే శత్రునౌకల భంగపర్చుచు గొడుగుపటాలములతో ద్వీపముల నాక్రమింపవచ్చు. జర్మనులుక్రీటు నిట్లువశపర్చుకొనిరి.

ఇప్పటి ఒక్కొక పెద్ద విమానమును యుద్ధనౌకను కట్టుటకు వెనుకటికన్న నాల్గురెట్ల సొమ్మగును; యుద్ధముకిప్పుడు మొత్తంమీద అన్ని విధములనుఖర్చు పెరిగినది. నౌకావిమానాద్యుల నడుపుటకవసరముపెట్రో

లు; దాని నిమిత్తం ఉభయపక్షములు ఎంతసొమ్మైన ఖర్చు చేయుచున్నారు.
బొగ్గునుండియు చాలఖర్చుతో పెట్రోలు తయారు చేయుచున్నారు. బ్రిటి
షువారమెరికాలో కొనుసరుకులకు ఆయుధాలకుమితిలేదు. మొత్తంమీద
రోజుకు 20 కోట్ల రూపాయలిప్పుడు ప్రతిరోజు బ్రిటిషువారియుద్ధముకు
ఖర్చుచేయుచున్నారట. ఇట్టిఆర్థికవినాశము లోకముకెంతహానికరమో
ముందుగాని తెలియదు. బ్రిటిషువారి నౌకాబల మస్ఖలితమైనది. కాని
ఈకాలపుసముద్రయుద్ధమును పూర్వముకన్న చాల ఘోరమైనది, నేటి
విమానములు నౌకలజాడలు సులభముగ తెలుసుకొని తమజలాంతర్గా
ములకు తెలుపవచ్చు. ఇప్పటికి రెండుపక్షములకు లక్షలకొలది టన్నుల
నౌకలు, కోట్లకొలది సవరనులవిలువ అహారము మందుగుండు వగై
రాలు ఆజనులతోసహా వరుణునిపాలైనవి. జర్మనీలోని యంత్రపద్ధతివల్ల
యావత్తు అంగములును నియంతృవశమై వారికి యుద్ధకౌశము హెచ్చి
నదని, బ్రిటిషువారును తమజాతీయ మంత్రిమండలికి సర్వాధికారమిచ్చి
నారు; అందరును యుద్ధయత్నముతప్ప తక్కిన కార్యములన్నిటిని కట్టిపెట్టి
నారు. ఈయోధదేశాలలో విమానాలదాడివల్ల జనులకు రాత్రింబవళ్ళు
నిద్రాహారములు విశ్రాంతిలేకయు, యుద్ధజ్వరపు తీవ్రతతో తపించి
నరులుద్విగ్నులైనారు. ధర్మము, దాక్షిణ్యము, అదృశ్యమగుచున్నవి.
ఏదో రీతిగ జయించుటే ఆశయ మగున్నది. ఇప్పటి మహాయుద్ధంలో
శత్రుసేనలకేగాక శత్రుప్రాబల్యపు దేశాల ప్రజలందరికిని సముద్రము
పైన ఆహారాదులందనిచ్చుటలేదు. ఆదేశాలలో జనులు అవశులై విప్లవ
ముగల్గించి తమప్రభుత్వముచే యుద్ధము మాన్పింతురనిభావన. బ్రిటిషు
వారు యూరపుకాహారాది సామగ్రులు వెళ్ళకుండజేసినారు. ఇందుకు
జవాబుగ బ్రిటనుకువచ్చు మందుగుండు నౌకలనేగాక ఆహారాది నౌక
లనుగూడ జలాంతర్గాములతోను విమానాలతోను ముంచివేయుటకు
జర్మనులు యత్నించుచున్నారు ఇట్టిక్రూరచర్యలు (పూర్వకాలయుద్ధాల
తోపోల్చిన) రాక్షసకృత్యాపుకీతిచున్నవి. విమానపుదాడులవల్ల అడవులు

గనులు తగులబడినవి. ఓడలు గుడులు ఆసుపత్రులు గూడ భగ్నమగుచున్నవి. ఈఘోరయుద్ధములు చేయుటమంచిదికాదని శాంతపరిష్కారమే యుక్తమని నోటనుచ్చరించినంతమాత్రమే అది నేరమై దండనార్హమగుచున్నది. మన దేశంలోను ఆర్థికబాధలెంతో పెరిగినవి. రాజ్యాంగము స్తంభించినది. వాక్ స్వాతంత్ర్యము క్షీణించినది. స్వతంత్రభావనయు తగ్గినది. ఇక్కడి ప్రజాక్షేమకార్యములకు వలయుద్రవ్యము అవకాశము లభించుటలేదు; కాని ఈ బీదదేశంలోను యుద్ధనిధిమాత్రం కోట్లకొలది రూపాయలు వసూలై విదేశాలలో ఖర్చగుచున్నది.

రష్యాతో జరుగు పోరులో జర్మనీ తుదకు గెల్చినను, దుర్బలమగును. ఈయుద్ధాశయము లెట్టివో ఇప్పటికిని స్పష్టపడలేదు. అమెరికా సహాయంతో తుదకు బ్రిటిషువారే గెలువవచ్చు,కాని రెండుపక్షములకు నష్టమును లోకమంతటికిని అనర్థమునుకలుగును. మరియు 'వర్సాలే'రీతి సంధికలిగితే మరల అశాంతి హింసావ్యాప్తి తప్పదు.

ఇప్పటి యుద్ధాలలో పూర్వముకన్న నెక్కువ విజ్ఞానానుభవములు,శిల్పశక్తి, సాంకేతికజ్ఞానమునేగాక, ఎక్కువ సాహసము, కౌశలము, స్థైర్యము, త్యాగశక్తి, ఆత్మార్పణముకూడ కావలెను. ఇవి గొప్పగుణములే. ముఖ్యంగా వైమానికులు సబ్‌మెరైనుయోధులు పరాచూటిస్టులు ప్రాణములకు తెగించకతప్పదు. మనపూర్వపు ఇతిహాస పురాణాలలోను రణరంగపు శౌర్యము వీరత్వము స్తుతింపబడినవి. కాని, ఈనాటి యుద్ధాలలో పాల్గొనుదేశీయులు పూర్వపువారికన్న చాల దయాశూన్యులు, దాక్షిణ్యహీనులునయి, ప్రేమతత్వమును చంపుకొందురు. జర్మనులు కేవలం రాక్షసులవలె క్రూరమృగములవలె వర్తించిరని బ్రిటిషు వార్తలు తెల్పినవి. బ్రిటిషువారి కొన్నిచర్యలు జర్మనులకునట్లు కన్పడక మానవు. రెండుపక్షముల వారును వెనుకటికన్న చాలక్రూరులైనారని తోచును. అందుకువ్యక్తిదోషములు కాక, ఇప్పటి స్వార్థనాగరికతలోను ద్వేషవాతావరణములోను యాంత్రికాశలోను సామ్రాజ్యతత్వములోను చేరియున్న హింసాపరత్వమే మూలకారణము.

# 37. ఇప్పటి సత్యాగ్రహము.

ఇప్పు డీదేశంలో సత్యాగ్రహము సాగుచున్నది. అది యీ మహాయుద్ధమునకు సంబంధించినది. జర్మనీపైన యీ యుద్ధమును ప్రభుత్వంవారు కనడా దక్షిణాఫ్రికా ఆస్ట్రేలియా వగైరా డొమినియనుల ప్రభుత్వములతో సంప్రతించి, వారిసమ్మతితో దిగిరి. ఐర్లండు మాత్రం తటస్థమైనది, తక్కినవి బ్రిటనుకు సాయపడ నిశ్చయించినవి. (మొత్తంమీద బ్రిటిషుజయంవల్ల ఈరాజ్యములన్నిటికి అమెరికాకును చాల లాభమున్నది). రక్తసంబంధులగు బ్రిటిషు వలస రాజ్యము లట్లు తీర్మానించుటసహజమే. ప్రపంచమంతటిలో ప్రాబల్యముకై ఆంగ్ల భాషిక జాతులమధ్యను జర్మనులమధ్యను పోటీకల్గినది. బ్రిటిషు సామ్రాజ్యమంతటిలో జనసంఖ్యలోను భౌతికసంపత్తులోను మనదేశమే నాయకమణి యని తెలిసినదే. (ఈ సామ్రాజ్యంలో $\frac{4}{5}$ వంతు ఈదేశీయులే) అయినను, ఇందులో వీరికి పలుకుబడిలేదు. దీనిని దింపుటకుముందు ఇక్కడి ప్రజాప్రతినిధుల యభిప్రాయమునుగూడ తీసుకొనుట న్యాయముగదా ! తుదకు, తామే యిక్కడ నేర్పర్చిన రాజ్యాంగపు ప్రభుత్వములతోను బ్రిటిషు అధికారులాలోచించక ఈదేశమునుగూడ బ్రిటను వైపున యీమహాయుద్ధములో దింపి ఇక్కడిసేనలను యుద్ధపరికరములను జన ధనసంపదను స్వేచ్ఛతో యుద్ధమునకు వినియోగించుచున్నారు. అధునిక యుద్ధంలో దిగుటవల్ల వేనవేలు జనులు హతులగుట కోట్లకొలది రూపాయలసొమ్ము వస్తువులు యుద్ధంలో నష్టమగుట తప్పదు. అదిగాక, ఆర్థిక నైతిక స్థితి రాజకీయస్థితిగూడ మారును.

ఈ దేశపు ప్రభుత్వమువారు బ్రిటిషు మంత్రివర్గపు తాబేదారులే, కనుక వారు నోరెత్తకుండుట సహజము. యుద్ధారంభమును (సెప్టెంబరు 1939) అన్ని రాష్ట్రములలో మంత్రివర్గములుండెనుకదా. వారితో నైన ఆలోచించు మర్యాదచూపకుండుట చాల యన్యాయము. మరియు, కాంగ్రెసువారి నధికారము వహించగోరినప్పుడు అప్పటి రాజ్యాంగప్ర

కారం మంత్రివర్గము జరుపు రాష్ట్రపాలనలో సాధారణంగా తాము కల్పించుకోమని వైస్రాయిగూడ మాటయిచ్చెను. కాని, యుద్ధమారంభించగనే, భారతదేశరక్షణకని నిబంధనలు తెచ్చి, రాష్ట్రీయ స్వాతంత్ర్యముతగ్గించివేసిరి. ఈవిషయంలోను ఈమంత్రులతో సంప్రతించలేదు. యుద్ధకార్యములకని, ఆయారాష్ట్రములందును చాలపనులు తమయిష్ట ప్రకారం చేయుటకు కేంద్రప్రభుత్వ మధికారముపుచ్చుకొని అట్లు పనులారంభించినారు. ప్రభుత్వశాఖ యుద్ధకార్యసహాయములు చేయునట్లు ఫర్మాయించినారు పోనీ, యూరపుప్రజలస్వాతంత్ర్యముకని యుద్ధావశ్యకతకట్లుచేసినను, భారతదేశపుసాతంత్ర్యపుహక్కునిప్పుడుగుర్తించిరా? లేదు; అట్టి రాజ్యాంగమును యుద్ధానంతమం దమలుకు తెత్తుమనియైన చెప్పలేదు. అంతట కాంగ్రెసుమంత్రు లందరును తమ ఉద్యోగసంబంధము మానుకొన్నారు. ఇకముందు చర్యనుగూర్చి కాంగ్రెసులో భేదాభిప్రాయము కల్గినది. ఆధునికయుద్ధప్రక్రియ యంతయు కేవలం హింసామయము. ప్రత్యర్థిది తప్పైనను వట్టి హింసాపద్ధతి ద్వారానే శత్రువు నణచి జయముపొంది ఆరీతిగ న్యాయము శాంతి స్థాపింపబూనుట సవ్యమార్గముకాదని, అహింసాపద్ధతితో శత్రుహృదయంలో పరిణామము గల్గించియు శత్రుప్రవల ముట్టడిని శాంతరీతినే తీవ్రముగ నిరోధించవచ్చుననియు,స్వచ్ఛమైపూర్ణమైన అహింసాతత్వమట్టి అద్భుతశక్తికలదనియు, అహింసాత్మకుడగు గాంధిగారిభావము. "యూరపులో జరుగుచున్న ఘోరయుద్ధమునకు భారతీయులు సహాయముచేయుట హింసకు ప్రతిహింసచేయుటలో తోడ్పడుటే. అట్టి హింసాప్రకోపంవల్ల లోకమందలి హింసాప్రవృత్తి మరింత హెచ్చునేగాని తగ్గదు. మరియు, బ్రిటిషుప్రభుత్వమీ దేశముకు స్వాతంత్ర్యమిత్తుమనిచెప్పి దానిని యుద్ధానంతర మాచరణకు తేవలెను; ఈ యుద్ధకాలంలో తమకు వీలైనంతవరకు ప్రజాయత్తపద్ధతి పెట్టవలెను" అని కాంగ్రెసువారు తీర్మానించిరి.

అందుకు బ్రిటిషుదొరతన మొప్పుకొన్నను, యూరపులోని యీ వినాశక యుద్ధంలో భారతీయులు ప్రత్యక్షంగా పాల్గొనకూడదనియు, మరియు బ్రిటిషు వారంగీకరించక వికటించినను, జర్మనుల ముట్టడివల్ల బ్రిటను ప్రమాదస్థితిలో నున్నప్పుడు ఈదేశంలో సర్కారుపైన సత్యాగ్రహం చేయకూడదనియు,ఆయన తేల్చినారు. అట్లుకాక, సదరు కాంగ్రెసు తీర్మానమును బ్రిటిషువారు మన్నించేయెడల బ్రిటిషువారి యుద్ధప్రయత్నంలో భారతీయులు సాయపడుదురని, బ్రిటిషువారందుకు నిరాకరించితేనే గాంధిగారి నాయకత్వంక్రింద సత్యాగ్రహం సాగించవలెనని, కాంగ్రెసునిర్ణయించినది. కాంగ్రెసు కోరినహక్కుల తీర్మానమును బ్రిటిషు ప్రభుత్వము మన్నించనేలేదు. యుద్ధయత్నం హెచ్చించిరి; ఇక సత్యాగ్రహము తప్పలేదు.

అయితే 1940 సం॥ మే మొదలు అక్టోబరు వరకు జర్మనీ తన పడమటివైపు ముట్టడించి ఇంగ్లండుపైన ఘోరముగ విమానపుదాడి సాగించుచు ఇంగ్లండులోనికి దిగుయత్నములో నుండెను. ప్రత్యర్థి యిట్టి క్లిష్టస్థితిలో నున్నందున గాంధిగారప్పుడు సత్యాగ్రహము చేయలేదు. ఆప్రమాదము తప్పినదని, అమెరికను సాయమునువచ్చుచున్నందున ఇక బ్రిటనురక్షణకు ఫరవా లేదని, బ్రిటిషు అధికారులు రాజనీతిజ్ఞులు నిర్ణయించి ప్రచురించినారు ఆతరువాతనే మనదేశంలో మితంగా సత్యాగ్రహమారంభించినది. అప్పుడైననుస్వాతంత్ర్యమిమ్మనికాదు. ఈ మహాయుద్ధములో భారతీయులుద్రవ్యాదులనిచ్చిపూర్తిసాయము చేయవలెనని ప్రభుత్వోద్యోగు లందరుదీక్షతో తీవ్రప్రచారము చేయుచున్నారు; తమంతట ప్రజలిచ్చు సొమ్మునే యుద్ధసహాయముకు వసూలు చేయుచున్నామని బ్రిటిషుప్రభువులు ప్రచురించిరి, కాని దానిని సర్కారు ఉద్యోగు లందరి ద్వారా తీవ్రంగా చేయించుటవల్ల ప్రజలకుభీతి యుండకతప్పదు. ఒత్తిడి నిర్బంధపు వసూలు జరుగుచున్నవని ఆక్షేపణలు వచ్చినవి. సర్కారు ఉద్యోగు లధికారపుహోదాతో గ్రామములకువెళ్ళి

పోలీసుల సహాయము తీసుకొని యుద్ధనిధిని పూనికతో వసూలుచేయు నప్పుడప్లేయుండును. వారికి ప్రజలిచ్చునది భయముపైనా, భక్తి పైనా, చెప్పగలమా? ఐచ్ఛికమనిచెప్పి అధికారులు అనియమితంగా వసూలు చేయుటకు బదులు సర్కారుకు తోచినరేటు పన్నువిధించుటే నయము పన్నుల ఆదాయంనుండియు యుద్ధపుకార్యములకు ఖర్చగుచున్నది. బ్రిటిషువారితరపున తీవ్రంగా ప్రచార మన్నివిధములను జరుగుచున్నది; రేడియోనుగూడ ఇందు కుపయోగించుచున్నారు. ఈసహాయము ప్రజలు తమంతటనే యిచ్చినారని, ఇందునుబట్టి భారతీయులందరు బ్రిటిషు యుద్ధము కనుకూలురై బ్రిటిషుపాలనకు తృప్తిజెందినట్లు స్పష్టమనియు, కొందరధికారులు ప్రకటించినారు స్వతంత్రాభిప్రాయము తెల్పుటకు స్వేచ్ఛయున్నప్పుడే ఈవాదము కర్థమున్నది. వ్యతిరేకభావము తెల్పుట నేరమయి వాగ్బంధనము జరిగినదని గాంధిగారునిర్ణయించి, వాక్స్వాతంత్ర్యరక్షణకే సత్యాగ్రహము సాగించుచున్నారు. ఆయనసిద్ధాంత ప్రకారం 'బ్రిటిషువారిహింసాయుద్ధముకు తోడ్పడుటయు హింసాచర్యయగును. అహింసాపద్ధతితో నిరోధించుటే సవ్యపద్ధతి' ఈభావముగల మాటల నుచ్చరించుటే ఆయన యేర్పచ్చిన సత్యాగ్రహపద్ధతి. ఆప్రకారం మాట లుచ్చరించు వారిని వెంటనే ఉద్యోగు లరెస్టుచేసి జైలులో నుంచినారు. వాక్స్వాతంత్ర్యము నిల్పి భారతీయులను అందరిని రక్షించుటకే యీసత్యాగ్రహము సాగించుచున్నాననిగాంధిగారు స్పష్టపర్చినారు.* మరియు ప్రభుత్వమువారింకను జర్మనులతో తీవ్రయుద్ధము సాగించు

* The immediate issue is the right to exist, that is the right of self-expression, which broadly put means free speach. This the Congress wants not for itself, but for all......

(5-10-40 తేదీ గాంధీగారి ప్రచురణ)

చున్నారు. కనుక, వారి కిబ్బంది లేకుండుటకు అతిమితంగానే సత్యాగ్రహం చేయుచున్నారు.*

ఈరీతిగా మాజీమంత్రులు, సభాధ్యక్షులు, శాసనసభ్యులు, బోర్డులసభ్యులు, కాంగ్రెసునాయకులు ఇట్టి వేలకొలది ప్రజాప్రతినిధులు సత్యాగ్రహులై జైలులో నిర్బంధితులుగ నున్నారు. యుద్ధనిరోధకమైనచర్య లేమియు చేయకున్నను భేదభావము తెలిపినంతమాత్రమున సహించక తమమాజీమంత్రులను సభాధ్యక్షులనుగూడ తీవ్రశిక్షలపాలు చేసినారు. వారిని యుద్ధపు శ్వేతవర్ణులగు జర్మను ఇటాలియను ఖైదీలకన్న హీనముగ నుంచుచున్నారు. అందును బట్టియు ప్రస్తుతపు ప్రభుత్వపద్ధతిలో హింసాతత్వము కలదనుసంగతి లోకమంతటికిని బాగుగ వెల్లడియైనది. మంత్రిత్వకాలంలో కాంగ్రెసుమంత్రు లారంభించిన అహింసాసాధకమగు నిర్మాణకార్యమునకును చాల నిరోధము గల్గినది.

* Care is being taken as far as possible to avoid allembarassments. The merit, as also the strength, of the struggle consists in reducing embarassment to the minimum, whilst the British are engaged in a deadly life and death war.

(6-7-41 తేదీని గాంధిమహాత్ముని ప్రచురణ)

# 38. సమన్వయము.

ఇట్లు మనసంస్కృతి ప్రారంభస్థితిని ప్రాచ్యపాశ్చాత్యముల క్రమపరిణామమును వాటి సంఘర్షణఫలితములను చూచియున్నాము. మనకు తెలిసినంతవరకు ఈభూమి అసలు సూర్యుని తేజోబింబమునుండి యేర్పడి చల్లబడుటలో ద్రవమై, క్రమంగా ఘనీభవించి శిల లేర్పడినవి. ఇట్లెన్నియో యుగములు గడువగా. అజీవమనుకొన్నప్రకృతిలో మంచి క్రమవృద్ధి గల్గినది. సృష్టిలో చిదచిత్తులకుండు సంబంధము అద్భుతము. కేవలం నిర్జీవమనుకొను వస్తువులు నిజంగా శక్తిపుంజములేకాని, అంత రికంగా కఠినములుకావు. ఈ శక్తిపుంజములును తేజఃఫలితములు. ఈ మహాప్రపంచమంతటను విశ్వశక్తి (Cosmic enerjy) యు విశ్వకిర ణములును (Cosmic rays) వ్యాపించియే యున్నవి. ఆకాశంలో చూపట్టు గోళములు మహాలోకములు. అవి తమ నిర్ణీతమార్గాలలో అతివేగమున పోవుచు తేజస్సు వెదజల్లును. అవి మనకు తెలియని గమ్య ముకుపోవుచున్నవి. ఇంతవరకు వైజ్ఞానికుల పరిశోధనాదులవల్ల కల్గిన జ్ఞానమల్పము. 'ఈమహావిశ్వమంతను సృజించి పరిణమింపజేయుచు'నియ మితస్థానాలలో కొన్నిసూత్రములతో నడిపించుచు, యుక్తఫలము లిచ్చు విశ్వాత్మ కలడు. మన భౌతికదేహముల నియమించి నడుపు ఆత్మ కీవి శ్వాత్మతో అవినాభావపుసంబాధమున్నది' అని క్రమంగా విశదమైనది.

భూమిపైన జీవజాతుల పరిణామంలోను భౌతికబలంకంటె జ్ఞానబలమునకును, అంతకన్న నైతికశక్తికిని అనగా ధర్మమునకు, క్రమంగా ప్రాముఖ్యము కల్గినదని సూచితము. మొదటి మత్స్యసర్పాదులకన్న మామలు (=సత్వ) జాతులలో, ఇందులోను భీకరక్రూరమృగముల కన్న అశ్వగోజాతులలోను, వాటికన్న తుదకు నరజాతిలోను క్రమంగా సాత్వికశక్తి సాంఘికత హెచ్చినవి. మానవులలోను నరాశనులై పచ్చి మాంసమునుదిని నిరంతరం మృగ్యాపానం చేయుచు శిలాప్రాయులైన క్రూర

లకన్న తరువాత వ్యాపించిననీతిభక్తిపరులు జెంది యితరులకు మార్గదర్శకులైనారు. మనదేశచరిత్రలో ప్రహ్లాద నారద వసిష్ఠ విశ్వామిత్రయాజ్ఞవల్క్యాదులు సాత్త్విక తేజస్కులై ఆదర్శజీవనులై, లోకకల్యాణము జరిగించినారు. పిమ్మట బుద్ధుడు అశోకుడు అహింసాధర్మవ్యాప్తికై జీవిత మర్పించి, భారతీయుల నుద్ధరించినారు. ఖండాంతరాలలోను వారి ధార్మిక సామ్రాజ్యము స్థాపితమైనది. ధర్మాచరణ చెడినమీదటనే హిందువులకు రాజకీయంగాను పతనముకల్గినది. మొగలుల కాలంలోను పరస్పరం ప్రేమవ్యాప్తి ధార్మికౌదార్యము రాజాదర్శమైనప్పుడు ప్రజాస్థితి బాగుండెను. మతవిరోధములు సాంఘికవిభేదములు వృద్ధిమైనమీదట జాతీయ క్షీణత సులభమైనది.

ముఖ్యమైన అన్నిమతములకు అహింసాసత్యశౌచాది రూపమగు ధర్మమే మూలసూత్రము; ఈశ్వరభక్తియే వాటిప్రాణము. వీటిపైన నిర్మితమైన సంస్కృతులలో పరిసరములబట్టియు దేశకాలానుసారంగాను కొన్నిభేదము లేర్పడినవి. శ్రుతులు స్మృతులు, ఇతిహాసములు, పురాణములు, కావ్యాలంకార వాఙ్మయముగూడ అహింసాతత్త్వమే ఉత్తమధర్మమని తెల్పుచు, విశ్వప్రేమకు ప్రాముఖ్యనిచ్చినవి. మన ఆయుర్వేదము అమరావతీ అజంతా ఎల్లోరాదులలోని ప్రాచీనకళలు శిల్పములును అహింసాప్రబోధకములే. మనపూర్వపు సాంఘికపద్ధతిలోను, ఆయాభిన్నజాతుల వ్యక్తిత్వముకునుజాతీయైక్యమునును సమన్వయము చేయుటకే యత్నించిరి. ఇట్లేగ్రామజీవితముకు వ్యక్తుల జీవితముతోను రాజ్యాంగపు పరిపాలనతోను సంఘర్షము లేకుండునట్లు గ్రామపంచాయతీపద్ధతి యమలులో నుండినది. అప్పటి వర్ణాశ్రమపద్ధతి, సాత్త్వికాహారము, వ్యాయామము, బ్రహ్మచర్యము ఇత్యాదులు అహింసాశక్తిని పెంపొందించినవి. ఆర్థికముగను వ్యక్తులకృషిపరత్వము కళాశిల్పముల నైపుణ్యము వృద్ధిచేయుచునే సంఘక్షేమముకల్గునట్లు వ్యాపారనియమము లేర్పర్చబడినవి. ఈ నిబంధనలు వారివారి హక్కులుగకాక బాధ్యతలుగను, ధర్మముగను వివరించి,

జనైక్యమునకు నీతిపరతకు ప్రాముఖ్యమిచ్చిరి. మరియు, ఆధ్యాత్మికరంగ మన్నిటికిని పునాదిగజేసి సర్వజీవులు ఈశ్వరమయములు. ఈశ్వరునిదేహములు, కనుక ప్రాణిరక్షణయు మానవసోదరత్వము ప్రజాసేవయునే ఈశ్వరసేవ యగునని నిర్ణయించి, మానవప్రేమను మన ధర్మముగ నిర్ణయించిరి; 24 ఏండ్లవయస్సు వరకు బ్రహ్మచర్యముపాలించి జ్ఞానము సంపాదింపవలెననిరి; అతిథిసత్కారము భూతబలి ప్రతిరోజును ప్రతిగృహస్థుడును జరిగించవలసిన నిత్యయజ్ఞములని విశదపర్చిరి. కొంతవయస్సుమీరినంతట దంపతులు వానప్రస్థులై, 60 ఏండ్ల వయస్సు తరువాత సన్న్యాసులు కావలెను. ప్రజాసేవలో జీవితము గడుపవలెను† మనదేశీయులందరి పండుగలువగైరాలసూత్రములును అహింసాధారములే. కనుక తక్కినదేశములసంగతి యెట్లున్నను, మనదేశపు ప్రాచీనసంస్కృతికి అహింసాతత్వమే పునాది. మరియు మనదేశీయులపైన అన్నివిషయాలలోను బ్రిటిషు వారిసామ్రాజ్యపుప్రాభవము వ్యాపించియున్నది. రాజకీయస్వాతంత్ర్యముగల్గినమీదటగానిఆర్థికసాంఘికవిషయాలలోను స్వాతంత్ర్యవికాసము లుండవు. మనలో మతభాషాదిభేదములు కలహములు హెచ్చియున్నవి. కనుక సౌకర్యమునుబట్టియు అహింసాతత్వమే మనకన్నివిధముల సాధకము.

రెండు భిన్నసంస్కృతులకు సంపర్కముకల్గినప్పుడు ఆరెంటిలోని మంచిగుణములే వృద్ధియగుట క్షేమకరము. కాని, సంఘట్టనము గల్గినప్పుడిందుకు బదులు విభేదము హెచ్చును. ముస్లిములు విజేతలుగ ఈదేశమునకువచ్చినప్పుడు ఉభయులకు విరోధమువల్ల సంఘర్షము ద్వేషము కల్గినవి. కనుక పరస్పరం దోషములే గమనించిరి. రెంటిలోను పరిశుద్ధత తగ్గి వికృతియేర్పడినది. తరువాత అక్బరు కబీరు నానకువంటి కొద్దిమంది రెంటిలోని సుగుణములకు ప్రాముఖ్యమిచ్చి సమన్వయింపజూచినారు.

---

† కామ్యానాం కర్మణాం న్యాసం సన్న్యాసం కవయోవిదుః
సర్వకర్మఫలత్యాగం ప్రాహుస్త్యాగం విచక్షణాః (భ. గీ. 18-2)

అనుకూల దృక్పథమేర్పడినప్పుడే రెంటిలోని సుగుణముల నుభయులును గ్రహింపగల్గుదురు.

ఇట్లే ప్రాచ్యపాశ్చాత్య సంస్కృతుల విషయంలోను. పాశ్చాత్యులిక్కడి ప్రకృతి సంపత్తును రాజ్యమును వశపర్చుకొను ధృష్టతలోను విభేదయుతులగు భారతీయులాశోషణచర్యను భీతిద్వేషాలతో నిరోధించుటలోను సంఘర్ష మేకల్గినది. పై పెచ్చు, ఇప్పటిపాలకులగు ఆంగ్లేయులు వట్టివిదేశీయులు. కనుక, ఈదేశంలో ఈరెండుసంస్కృతులలోని దోషములే ప్రకోపించుచున్నవి. ఉభయులకు ఆత్మీయులను భావము లేకుండ ద్వేషదృక్పథమున్నప్పు డట్లుజరుగుట సహజమే.

పాశ్చాత్యసంస్కృతి ముఖ్యంగా ప్రవృత్తిపరము, రాజసము. అది భౌతికవృద్ధికి, ఇంద్రియతృప్తికి, బాహ్యజ్ఞానంద్వారా బుద్ధివికాసముకు, యాంత్రికబలముకును ప్రాముఖ్యమిచ్చును. పూర్వపు ప్రాచ్య సంస్కృతి ముఖ్యంగా ఆంతరికము, సాత్వికము; అది నైతికవృద్ధికి, ఇంద్రియనిగ్రహముకు హృదయవికాసముకు ఆత్మశక్తికి, హస్తశిల్పముకును ప్రాముఖ్యమిచ్చినది.

ఈరెంటిలోను మానవకల్యాణముకు పోషకమగు కొంత సామాన్యధర్మ మున్నది. ఇప్పటి రవీంద్ర ప్రఫుల్లచంద్ర రాధాకృష్ణాదుల జీవితంలో (గాంధిమహాత్మునిలోను) ఈరెంటి సమన్వయము కలదు. ప్రాచ్యసాత్వికతవికృతినొంది ఇప్పుడు తామసప్రధానమైనది. పిరికిదనము, మూఢత్వము, మాంద్యము, నిరాశ వ్యాపించియున్నవి. పాశ్చాత్యులలోనున్న కార్యపరత, దీక్ష. సకాలత, సాంఘికసఖ్యము, దేశభక్తి, జ్ఞానపిపాస, జాతీయప్రేమ మన కలవడవలెను. మనలోని త్యాగశీలత ధార్మికత ప్రేమతత్వమును రక్షించి వృద్ధిజేసి, ఈయన్నిటికి సమన్వయము జరుపవలెను.

యుద్ధములిట్లు సాగుచుండుటబట్టియు లోకంలో హింసాభావము హెచ్చినదని స్పష్టము. అధికారులు నీతినిడిచి స్వదేశలాభమే చూచు

కొనుటవల్ల రాజ్యములకు భయము, సందిగ్ధత యేర్పడినవి, నమ్మిక పోయినది. బ్రిటిషు ఫ్రెంచి సామ్రాజ్యము లితరులకు చెప్పు నీతిని తమ వశంలోని మన దేశాలకు క్రియలో నిరాకరించుచున్నారు. ఈ సామ్రాజ్యతవల్ల బ్రిటిషు ధనికులకు లాభము మనకుజర్మనీ వగైరా లకు నష్టముకల్గినది. అవినీతి హెచ్చినది. బ్రిటిషు ఫ్రెంచివారికన్న తాము బలీయులైవారిని లొంగదీయవలెనని, నాజీఫాసిస్టులకు దుర్బుద్ధి పుట్టినది. సామ్యవాదియగు రష్యాకు జర్మనీతో జరుగు యుద్ధములో లక్షలకొలది చచ్చుచున్నారు. సంహారదేవత విజృంభించినది. ఎన్నడు నెరుగని క్రూరతతో నీ ఘోరయుద్ధములు సాగుచున్నవి. లోకమంత టను హింసాతత్వము ప్రబలుచున్నది. పత్రికలలోను రేడియోద్వా రానుపరస్పరదూషణఅసత్యములు, మాయాచర్యలుచాలరెట్లు హెచ్చు చున్నవి. ఇక్కడి బ్రిటిషుఅధికారుల ధోరణియు అహింసావ్యాప్తికి వ్యతి రిక్తమే. ఈఅన్నిటిప్రభావము మనదేశీయులకు తగులుటసహజము. అందు వల్ల ఇక్కడను హింసాతత్వముకే ప్రాముఖ్యముకల్గుచున్నది. పాలకులు శ్వేతసంస్కృతియేగొప్పదని, వారి ప్రభుత్వమును మనము తొలగింప జూచుట గొప్పనేరమని మనకు తెల్పుటమామూలయినది, ఇక్కడ దేశ ద్రోహమెంతయో జరుగుచున్నను అది మాత్రం నేరమనివారెంచలేదు.

పాశ్చాత్యులు ఘనులు, కనుక వారిహింసాతత్వము ఘనమని మనవారెంచి, దాని ననుకరింప నెంచుట సహజమే. ఈఘోరయుద్ధాలలో తమదేశపు జయముగోరి తోడ్పడు కోట్లకొలది పౌరులందరును శత్రుజను లెట్లైన నశించవలెనని కోరుదురు. ఇది హత్యాతత్వము. ఇది సామాన్య జీవితంలోనికిని వ్యాపించినది. సాంఘికద్వేషంవల్లను వ్యక్తిద్వేషంవల్లను హత్యలు జరుగుచున్నవి. నీగ్రోలను పట్టపగలు వీధులలో అమెరికనులు మోది చంపుటకలదని తెలిసినదే. ఇవిగాక, పాశ్చాత్యసంఘంలో రహ స్యహత్యలెన్నియో జరుగుచున్నవి. ఇందుకు సాంఘికవ్యత్యాసపు క్రోధ

మో స్త్రీ పురుషుల కామక్రోధములో మూలకారణములు. 'ప్రమాదము' లమరణములును విదేశాలలో హెచ్చు, అమెరికాలో పాశ్చాత్యసంస్కృతికి ప్రత్యక్షచిహ్నములగు మోటారుల క్రిందబడియు, ఫాక్టరీయంత్రాలలో చిక్కుకొనియు సాలీనా లక్షలకొలది జనులు మరణిస్తురు. ఇది మానవత్వంకన్న యాంత్రికతకే ప్రాధాన్యమిచ్చుట వలనిదుష్ఫలితాలలో నొకటి. ఈసంస్కృతిసంపర్కంవల్ల ఇటీవలమనదేశంలోను దుర్మరణములు చాలహెచ్చినవి. సాంఘికకలహాపు హత్యలగూర్చి గమనించియున్నాము. బీదలు ధనాశవల్లను, కొందరు స్త్రీపురుషులు కామక్రోధాలవల్లను, త్రాగిన మత్తతలోను, చేయు హత్య లీదేశంలోను హెచ్చుచున్నవి. కొంతవరకు దుర్భరమైన (ఆర్థికవ్యత్యాసముండి) బీదల విషయంలో శ్రీమంతులు దాక్షిణ్యహీనులగుటయు, తీవ్రమగు సాంఘికవ్యత్యాసంవల్ల మాలమాదిగలను సవర్ణులు కఠినంగా చూచుటవల్లను, కొందరు స్త్రీలను పురుషులు అణచియుంచి సంస్కరణకు వ్యతిరేకించుటవల్లను హృదయంలో జనించు నిరాశక్రోధాగ్ని మనదేశంలోని చాలహత్యలకు మూలకారణ మగుచున్నది. అట్టి వ్యత్యాసములను అన్యాయములను తొలగించినప్పుడే ద్వేషమును తద్వారాహత్యాప్రవృత్తియు తొలగును.

హంతకులకు కోర్టువిచారణపైన మరణదండనవిధించుట ప్రభుత్వములకు మామూలైనది. కాని యిదిఅహింసాసిద్ధాంతముకు వ్యతిరిక్తము. ఈవిచారణలలో యథార్థంగా హంతకుడెవడో సరిగా తెలియుట కష్టము. ఏదో అన్యాయము జరిగినప్పుడుగాని సాధారణంగా ఎవడును హత్యకు సిద్ధపడడు. అట్టి సాంఘికాన్యాయములను జనులును ప్రభుత్వమును తొలగించుటే ముఖ్యకార్యము దండనద్వారా దోషికి బుద్ధిచెప్పుటయు అవసరమనుకొన్నను, ఖైదుకు బదులు చంపుటవల్ల దోషికి సంస్కరణ గల్గింపజాలదు. అందువల్ల యితరులకు బుద్ధివచ్చుననుటయు పొరబాటే. తరుచు మొండితనము సాహసము మరింతహెచ్చును. హత్యలసందర్భంలో ఆత్మహత్యయు ...ననదే. ఆత్మహత్యయు క్రౌర్యఫలితమే.

యాంత్రిక నాగరికతనే యాచరించు పాశ్చాత్యులలో ఆత్మహత్యజరుగు వార్తలు తరుచువచ్చును † ఇటీవల, ఈదేశంలోను ఆత్మహత్య హెచ్చు చున్నది. ముఖ్యంగా పీడితులై కుటుంబపోషణ జేయలేనివారును సాంఘికహింసపడలేనివితంతువులుఆడపిల్లలును ఆత్మహత్య చేసుకొన్నట్లు దుర్వార్తలు తరుచు తెలియుచున్నవి. వీ:కి సంఘముతమ్ము రక్షించుటలేదని నిరాశయు దిగులునుకల్గియే అట్లుచేయుదురు. వీరిలో చాలమంది హిందువులు. ఇది హిందూసంఘముకు గొప్పకళంకము. ఇట్టి బాధలు తొలగి అహింసాబుద్ధి సంఘంలో వ్యాపించినప్పుడే అట్టి ఆత్మహత్యలుపోవును. ఆత్మహత్య మహాపాపము అనర్థకరము అని మన శాస్త్రములు చెప్పుచున్నవి. ఈ యన్నివిధముల హత్యలవార్తలు అహింసావ్యాప్తి జనులలో వెంటనే జరుగుట చాలఅవసరమని మనకు ఉద్బోధకములు కావలెను.

అహింసాతత్వపువ్యాప్తియే ఈలోకపుకష్టముల బోగొట్టి ప్రజాక్షేమము గల్గించునని కనిపెట్టిన ప్రవక్త లందరిలో ముఖ్యుడు మహాత్మాగాంధి. బుద్ధాదులవలె గాంధిగారును లోకకల్యాణమునే సాధించుటకై తనజీవితమంతను ధారబోయుచున్నాడు. అయితే హిట్లరు స్టాలిను చర్చిలు రూస్వెల్టు వగైరాలు నిప్పుడు ప్రపంచక్షేమము కోరుచున్నట్లు చెప్పుచున్నారు. వీరు గాంధికన్న భౌతికంగా బలీయులై, ఇప్పుడు తమ ప్రజలకు గౌరవపాత్రులయినమాట నిజము. వీరి యందరిలోను బొల్షివిజం స్థాపకుడైన కీ. శే. లెనినులోను వ్యక్తివిశేషమును కలదు. కాని వీ రందరును ప్రఖ్యాతిని కోరువారే. మరియు వీ రందరును స్వజాతియాధిక్యముకే యత్నించుచున్నారు. జర్మనీ కైట్లైనను లోకమంతటను ప్రాబల్యము సంపాదించుటే హిట్లరు సంకల్పము. భౌతికాధిక్యము తన జనులకు సంపాదించుటయు రష్యారాజ్యమంతను రక్షించి దాని నైట్లైన

† అమెరికా సంయుక్తరాష్ట్రంలో సగటున రోజుకరువదియు బ్రిటనులోరాజుకిరువదియు ఆత్మహత్యలు జరుగుచున్నవట.

బలీయముగ జేయుటయునే స్టాలిను సంకల్పము. ఇట్లే బ్రిటిషు సామ్రాజ్యలాభమే చర్చిలు ఆశయము. ఇక రూస్వెల్టును అన్ని దేశాలనుండి ద్రవ్యములాగి పశ్చిమార్ధగోళములో యూరపురాజ్యములన్నిటి ఆయువు పట్టుపులను వశపర్చుకొని, అమెరికాలోను బయటను స్వదేశమగు సంయుక్తరాజ్యపు ప్రాబల్యమును హెచ్చించుచున్నాడు. వారందరు తమ ప్రత్యర్థుల పతనమునుకోరుచు ద్వేషముతో అందుకు తీవ్రహింసాచర్యల జేయించుచున్నారు. మరియు వారందరు ఈయుద్ధముకని జాతీయైక్యము గోరుచున్నను, తమ దేశంలోను అసలు స్వపక్షమునే బలపర్చువారు: స్టాలిను అకించనులనే యుద్ధరించి, ధనికుల నణపజూచును. హిట్లరు చర్చిలు రూస్వెల్టులకు ధనికవర్గపు క్షేమము ప్రధానము, సమత్వదృష్టి లేదు. వారి ఆర్థిక రాజనీతులవల్ల వర్గసంఘర్షము ఆర్థికవ్యత్యాసము పెరుగుచున్నవి. యుద్ధజ్వాల లంతటను వ్యాపించి ప్రపంచము తల్లడిల్లుచున్నది. తటస్థదేశాలకును భద్రత సౌఖ్యము లేవు. 'సర్వేజనా స్సుఖినో భవంతు' అను సర్వోదయదృష్టిని గాంధిమహాత్ముడే యేర్పర్చినాడు. అట్టి శాంతివాక్యము నిప్పుడు పరులు బూతుగ నెంచవచ్చు; కాని, ఈయుద్ధాగ్నులపిమ్మటను ప్రపంచమిప్పటిద్వేషనీతినే అవలంబించితే మరల హింసాప్రకోపపు యుద్ధజ్వాలలు వ్యాపించును. బ్రిటను అమెరికాలవారు కార్మికులను రంగుజాతులలను అణచినట్లే, హిట్లరు జర్మనీలోను అణచినాడు. ఇట్లే స్టాలిను తన శత్రుల జంపించి దేశమును భీభత్సంగాచేసి దుర్బలపర్చినాడు. అందుల ఫల మిప్పుడు రష్యాకును కనబడుచున్నది.

ఇందులో బ్రిటిషులు అమెరికనులు చేయు శోషణము రక్తపాతము లేనిది. హిట్లరు వగైరాల హింస ప్రత్యక్షము, హత్యాయుతము. కాని, అన్ని సామ్రాజ్యాలలోను పరాధీనులకు పీడనము తప్పలేదు. ఇట్లు విభేదము పరపీడాపద్ధతి లేనిమహాత్ముడగు గాంధియట్టివాడే దేవునికిష్టుడు.†

† పరపీడాకరంకర్మ యస్యనాస్తి మహాత్మనః ।
సంవిభాగశ్చ... తస్య తుష్యతి కేశవః॥ (శంకరగీత)

అహింసాపద్ధతి నిదివరలో రష్యాలో టాల్స్టాయి, ఇంగ్లండులో రస్కినను, ఫ్రాంసులో రోమేంరోలండును, బోధించినారు. గాంధిగారు వీరి బోధనలు సిద్ధాంతములు యువకదశలో నేర్చుకొన్నారు, పిమ్మట రోలండుకు మిత్రులైనారు. అయితే, టాల్స్టాయి రస్కినులు కేవలం గ్రంథరచయితలు, సిద్ధాంతబోధకులుమాత్రమే. ఇట్లే రోలండును తత్వవేత్తగనే జీవితము గడపి వృద్ధుడైనాడు. వారివలెగాక, గాంధిమహాత్ముడు తనదేశపు జాతీయోద్యమాలలో ప్రత్యక్షముగాపాల్గొని, అహింసా సిద్ధాంతప్రకారం ఆయాసమస్యల ప్రత్యక్ష పరిష్కారముకు అంతర్జాతీయమైత్రికి వీలగు పూర్తియైన నిర్మాణకార్యక్రిమ మమలుజరుపుచు, బలిష్ఠసామ్రాజ్యంపైన అహింసాయుద్ధమును నాయకుడుగ సాగించుచున్నాడు. జ్ఞానియగుటేగాక, ఆత్మానుభవం కలిగి గాంధిమహాత్ముడు క్రియారూపకంగా ఆదర్శవాదియైన (Practical idealist) కర్మవీరుడు. కనుక ఆయనయే ఇప్పటి మహనీయులందరిలోను ఉత్తమపురుషుడనియు ఆయన చూపించు అహింసామార్గమువల్లనే లోకక్షేమము గల్గుననియు ధీమంతులగు కొందరు పాశ్చాత్యులు నంగీకరించినారు.

లోకమంతటివలె భారతీయు లిట్లు హింసాతరంగాలలో మునిగియున్నను, జనులు శాంతంగా కనబడుచున్నందున అహింసాతత్వ మీదేశంలో వ్యాపించియేయున్నదని అనేకులు భ్రమపడుచున్నారు. ఇప్పుడీదేశంలో నున్నది సరియైన అహింసాతత్వముకాదు. అహింసలో ధీరత సర్వమానవ భ్రాతృత్వము చేరి యున్నవి. నరులందరి హృదయాలలోను ఈశ్వరాంశయున్నది. కనుకవారందరిహృదయము దేవాలయంవంటిది. నరులపై ప్రేమ యీశ్వరప్రేమయే; జనుల బాధించుట ఈశ్వరుపై నపరాధమే. నిజమైన అహింస సాత్వికము, బలీయము. అట్లుకాక, ప్రత్యర్థిపైన ద్వేష ముంచి భయము, పిరికిదనము అజ్ఞానమువల్లనే రక్తపాతంచేయకుండుట నిజమైన అహింసకాదు. అది తామసము దుర్బలలక్షణము. విశ్వప్రేమగల్గి ఆంతరికంగా మహాతేజస్కులగువారు నిర్భీకులై వీరులై మహా

త్యాగులై పరోపకారులై యుందురు. త్యాగము, ధైర్యము, ఆత్మవిశ్వాసము భక్తిలేకుండ స్వాతంత్ర్యము సాంఘికసామరస్యము లభింపవు.*

నిజమగు అహింసతో రాజసము జయించి సాత్వికులగుటకు బదులు, మనవారు హింస నెదిరించలేక మందులై భీరువులై తామసత్వములో నున్నారు. ఇది జీవశక్తిక్షీణతకు సూచన. ఇట్లు తమోగుణపరిభూతులై జంకుటకన్న ధైర్యముతో దుష్టహింసను ప్రతిహింసతో నైననెదుర్కొని న్యాయరక్షణచేయుటే ప్రశస్తము.† అట్టి హింసాపరులు ధీరులు ఉత్సాహులు సాహసులునై హింసాఫలమునను భవించి ముందైనను అహింసాపరులై సాత్వికశక్తిగల్గి నిశ్శ్రేయసము సంపాదింతురు. అట్లుగాక, భయోద్వేగమున నిరోధముమాని అన్యాయమునకు హింసాభిచారమునకు లొంగి నిర్వీణ్ణులగువారికసలే మోక్ష ముండదు.‡ అనగా రాజసమునుండి సాత్వికత గలుగుట సులభము, తామసమునుండిసాత్వికత కెక్కుట చాలకష్టము. లోపలికామక్రోధాదు లణచి ప్రేమపరులగువారు సర్వత్ర నిల్చియున్న విశ్వశక్తిని సమన్వయించుకొని ఆత్మానుభవ మొందుదురు.

---

* Neither independance nor communal unity is possible without ample sacrifice bravery and self- confidence which is but another name for faith.

(గాంధిగారి 4-5-1941 తేదీ ప్రచురణ)

† .......... I advocate training in arms for those who believe in the method of violance. I would rather have India resort to arms in order to defend her honour than that she should in a cowardly manner become or remain a helpless witness to her own dis-honour.

(యంగు ఇండియా 6-8-20)

‡ There is hope for a violant man to be some day non-violant, but there is none for a coward. Ahimsa is the extreme limit of for give-ness. But forgiveness is the quality of the brave. Ahimsa is impossible without fearlessness.

(యంగు ఇండియా 21-10-26.)

ఈశక్తిని భౌతికులు ,Cosmic energy' అందురు. ఇదిమహనీయుల దేహములోనుండి ఆత్మశక్తిని పరమానందమును గల్గించు సాత్విక తేజ మన బడును. పరిపూర్ణమగు సాత్విక తేజపు బలము దుర్నివారము.

స్వీయమోక్షము నేకోరక ప్రజాక్షేమముకోరి అందుకై అహింసా ధర్మమును మనదేశీయులలో వ్యాపింపజేయుకృషిలో గాంధిమహాత్ముడు రాజకీయములకు దిగవలసివచ్చినది. జాతీయైక్యము దేశస్వాతంత్ర్యముగ ల్గినప్పుడే, జనులకున్నతిసాధ్యము. ఐనను రాజకీయస్వాతంత్ర్యముజాతీయో న్నతి కుపకరణమాత్రమే. అదేఆదర్శము కాదు. కనుక రాజకీయకృషితో పాటు సంపూర్ణమగు జాతీయాభివృద్ధికై ఆయన గొప్పఅహింసా ప్రక్రియ నాలోచించి అమలు చేయుచున్నాడు. ఇదే 5 శాఖలుగ నిర్మాణ కార్యక్రమమను పేరుతో జాతీయసభ వారియామోద మొందినది. దీనిని గాంధిగారిటీవల 13 గ విభజించినారు. 1. సాంఘిక మైత్రి 2. అస్పృశ్యతా నివారణ 3. మద్యనిషేధం 4. ఖదరు 5. తక్కిన గ్రామపరిశ్రమలు 6. గ్రామ పరిశుద్ధి 7. నవ్యవిద్యావిధానం 8. వయోజనవిద్య 9. స్త్రీలయుద్ధరణ 10. ఆరోగ్యాభివృద్ధి 11. సామాన్య భాష (హిందీ) 12. మాతృభాషాసేవ 13. ఆర్థికసమత్వము (వర్గసమన్వయం). ఈ మొత్తప్రణాళిక సర్వతో ముఖము. ఇందులో ఖదరుకు గ్రామపరిశ్రమలకు ఆర్థికంలోను మద్య నిషేధముకు నైతికంలోను సామాన్య భాషకు వాఙ్మయవ్యాపారాల లోను అస్పృశ్యతానివారణాదులకు సాంఘికంలోను ప్రాధాన్యమున్నది. కాని ఈకార్యక్రమము జాతీయజీవితమంతకుసంబంధించి సర్వాంగసుందర ముగనున్నది. జాతీయ వాదులు కాకున్నను సంఘక్షేమపరు లందరు ఈప్ర క్రియ నాచరింపదగును. రుచిభేదమునుబట్టి ఒక్కొక్కదానికి ప్రాధాన్య మీయవచ్చు. కాని, అన్నిటియందును ఆదరముండుట అవసరము. కొన్నిటికి వ్యతిరేకులై తక్కినవాటి నభిమానించినను అట్టివారు పూర్తి యగు అహింసాపరులు కాలేరు. ఇవియన్నియు ఒకే అహింసావృక్షపు శాఖలు, ఒకే ప్రేమదేహపు అంగములు, అనదగును. మరియు, ఈ నిర్మాణకార్యము సంఘజీవితముకు వ్యక్తిజీవితముకుగూడ సంబంధించినది.

ఈ కార్యక్రమమునకున్న పరస్పరసంబంధము గాఢము. ఖదరు గ్రామపరిశ్రమలవల్ల ఆర్థికక్షేమమేగాక, బస్తీలలో కిక్కిరిసి జీవించుట పరాధీనత పోయి, సాంఘికస్వేచ్ఛ లభించును; నైతికంగా సౌజన్యము ప్రేమభావము నేర్పడును. మరియు ఆరోగ్యము బాగుపడును, యాంత్రికశ్రమ మద్యాసక్తియు పోవును.

ఇట్లే హరిజనోద్ధరణ సాంఘికద్వేషము పోగొట్టి అహింసావ్యాప్తి గల్గించుటేగాక, వారికార్మికశక్తినివినియోగించివడికించుట నేయించుటవల్ల చౌకగ ప్రశస్తమగు మాలనూలుఖదరు తయారగును. ఇట్లు గ్రామపరిశ్రమల ఆర్థికజయము వీరి శిల్పకృషినుపయోగించిననే సాధ్యమగును. హరిజనులలో నేమద్యపానమిప్పుడు హెచ్చు. హరిజనులనుద్ధరించినమీదనే మద్యనిషేధము సరిగా అమలు జరుగును; మరియు అంటువ్యాధులు తరుచు స్నానపానాదుల కవకాశము అభ్యాసములేని మాలమాదిగల గూడెములలో పుట్టి సవర్ణులపేటలకు వ్యాపించును. కనుక వారి అస్పృశ్యతపోయిపరిశుభ్రతయేర్పడుట, విద్యవచ్చి మూఢాచారములునశించుట, గ్రామాభివృద్ధికిని అవసరము. కార్మికులగుహరిజనులుమూఢులు దుర్బలులుగనుంటే, పునాదిచెడిన భవనమువలె భారతజాతియంతయు క్షీణించును. అస్పృశ్యత పోయినప్పుడే హరిజనోద్ధరణ జరుగును. ఇదినిజంగా మానవత్వమురక్షించుధార్మికయుద్ధము†. సర్వదేవాలయాదుల ప్రవేశముండుట ధార్మికతకు హిందూమతదృఢత్వమునకు మద్యనిషేధవ్యాప్తికి ఆయామతస్థులమధ్య మైత్రికిని పోషకమనియు గమనించినాము. ఇట్లేమద్యనిషేధము నైతికమేగాక బీదజనుల కార్థికంగాను ఆరోగ్యవిషయంలోను సాంఘికమైత్రి విషయంలోను ఉపకారకము. సాంఘికమైత్రిగల్గుట జాతీయంగానేగాక, ధార్మికంగాను, అన్యోన్యసహాయంవల్ల ఆర్థికంగాను లాభకరము, జాతీయవ్యాపారమునకు సహాయకరము.

† The fight against untouchability is a religious fight; it is a fight for the recognition of human dignity.
(యంగ్ ఇండియాలో 5-2-25 తేదీ గాంధిగారి వ్యాసము.)

స్త్రీలు మూర్ఖస్థితిలోను అనారోగ్యంలోను ఉన్నంతకాలం మన జాతి ఏరీతిగను బాగుపడదు. వారి సహకారము లేకుండ ఖదరు, స్వదేశీ, సాంఘికమైత్రి, హరిజనోన్నతి, ఆరోగ్యము ఇట్టివి సరిగా సాగవు. ఇట్లే మన మాతృభాషలో జ్ఞానము వ్యాపించి, నవ్యోత్సాహమును నీతి పరతను అహింస దీక్షను, నిర్మాణకార్యపరతను ప్రేరేపించు సులభరచన లేర్పడవలె. వార్ధావిద్యావిధానము గ్రామపరిశ్రమలకు (ముఖ్యంగా ఖదరుకు) సహాయకరము. ఆర్థికమనుకొను వర్గసమన్వయము అహింసకు, సాంఘికమైత్రికి గ్రామాభివృద్ధికిని తోడ్పడును. ఇట్టీకార్యక్రమమంతయు పరస్పరం సంబంధించినది.

నిర్మాణ కార్యక్రమంలో ఆంధ్రులదే అగ్ర(=మొదటి)స్థానమని కొంతకాలము మంచిపేరుఉండేది. ఖదరు, సాంఘికమైత్రి, హిందీవ్యాప్తి ఇట్టివాటివిషయంలో తక్కినదాక్షిణాత్యులకన్న మనకెక్కువ సహజ సౌకర్యమునున్నది. కాని, ఇటీవల మనము నిర్మాణకార్యంలో బొత్తిగా వెనుకబడుచున్నామని ఒప్పుకోకతప్పదు. దక్షిణభారతసభవారి హిందీ ప్రచారపరీక్షల యంకెలను చూడగా, ఆంధ్రులు మొదటిస్థానమునుండి 3వ స్థానములోకి జారినట్లు స్పష్టము. కన్నడులు, కేరళులు జనాభాలో మనకన్న చాలతక్కువమైనను వారిలోనే ఇప్పుడెక్కువమంది హిందీపరీక్షార్థులున్నారు. ఇట్లే, ఖదరులో వెనుకబడియుండినతమిళనాడు,సంయుక్త ప్రాంతము బెంగాలుగూడ ఖదరు ఉత్పత్తివిక్రయములలో చర్కాసంఘ సభ్యతలోను మనకన్న చాలముందంజవేసినారని అఖలభారత చర్కాసంఘపునివేదికయంకెలువిశదపర్చుచున్నవి. హరిజనోద్ధరణ దేవాలయప్రవేశము ఆంధ్రప్రాంతాలలో బొత్తిగా వెనుకబడియున్నవని హరిజనసేవకసంఘపునివేదికవల్ల అనుభవంవల్ల సూచితము. ఆంధ్రజిల్లాల ప్రసిద్ధదేవాలయాలలో నొక్కటియు హరిజనులను రానిచ్చుటలేదు. అందుకు తగు కృషియులేదు. మద్యపానము నల్లమందుపొగాకుఖర్చు హెచ్చుగనున్నది. ఇక్కడ పొగాకు మిర్చిపంట హెచ్చుచుండుటయు శోకకరము; మంచి

పత్తియుత్పత్తి తక్కువ. ఆంధ్రంలో నవ్యవాఙ్మయము ప్రజాక్షేమకరమగు రీతిది కావలెను. ఆహారవిహారములలోను తీక్ష్ణహుష విదాహులనువదలి దేహంలో సంఘర్షము లేకుండ సాత్వికతను ఆరోగ్యమును వృద్ధిచేయు మార్పులు చేసుకోవలెనని లోగడ అధ్యాయాలలో చెప్పిన దాంధ్రుల కెక్కువ వర్తించును. రాజకీయంలో ప్రాంతీయతత్వమును హెచ్చుగ నున్నది. ఆంధ్రరాష్ట్రమందు మనకభిమానముండుట అవసరమే. అది స్వయంకృషిగ క్రియారూపమై, స్వాభివృద్ధికరమై యుండవలె. అట్లుగాక ఇతరులతోను మనలో ఆయాప్రాంతాలమధ్యను ద్వేషజనకంగా సాగించుట విచారకరము. ఇట్లేసహకారవ్యాపారంలో ఆంధ్రులపరస్పరకలహంవల్ల, ఆంధ్రులముఖ్యపరిశ్రమలు, వ్యాపారములు స్తంభించి యుండుట, వాఙ్మయవిషయంలో గ్రాంధిక వ్యావహారిక సంఘర్షమును నిరాదర్శత, అశ్లీలత, విద్వాంసులలోను పరస్పరదూషణలు; ఇట్టివిపోవలె; జాతీయోన్నతినీతిపరత ప్రోత్సహించు వాఙ్మయమును మాతృభాషలో. రచింపవలెను. ఆంధ్రులలో వేలకొలది యిప్పటిసత్యాగ్రహముకు సిద్ధపడియున్నను, తగు శోభ రాలేదు. నిర్మాణకార్యక్రమము జయప్రదంగా సాగించినప్పుడే సత్యాగ్రహము జయప్రదమైన ట్లెంచవలెను.*

ఆంధ్ర ప్రాంతపు నిర్మాణకార్యసంఘములిప్పుడు తగు ద్రవ్యసహాయము కార్యదీక్ష లేక మందముగనున్నవి; వాటికి ప్రజాసహాయమును చాలఅవసరము. వాచాలత ఉద్రేకము ద్వేషముమాని, గుజరాతీలుతమిళులు ఇత్యాదులనుండి మనమునిదానమును స్వయంకృషినిదీక్షను కార్యపరతను నేర్చుకొని వృద్ధికావలెను; మనగ్రామజనులు సోమరితనముస్వలా

* The success of civil resistance can be measured by the success of the constructive effort.

(గాంధిమహాత్ముని ప్రచురణ 21-3-41)

One who has completely devoted himself to constructive work will be doing more valuable work than a Satyagrahi merely courting imprisonment.

(గాంధిగారి 20-4-41 తేది ప్రచురణ)

భపరతమాని సంఘక్షేమముకై కృషిచేయుట కెంతేని అవకాశమున్నది. జనులలో పరస్పరప్రేమ ఉత్సాహమువల్ల నిర్మాణకార్యమును, నిర్మాణకార్యపరతవల్ల పరస్పరప్రేమయు ఉత్సాహమును, వృద్ధియగును.

ఇట్లు నిర్మాణపరత వెనుకబడినందున ఆంధ్రప్రాంతము హీనస్థితి లోనుండుట సహజమే. నిర్మాణ కార్యక్రమమును బాగుగసాగించితేనే ఆంధ్రులకన్నివిధాలను ప్రాంతాభివృద్ధియు, జాతీయతయు సిద్ధించును; మనలో త్యాగబుద్ధి సంఘసేవాసక్తి వృద్ధికావలెను. పాశ్చాత్యులలోను విషయలోలురై త్యాగహీనులైనవారు నశించినారు. 1918 సం॥పు జయము తరువాత త్యాగమునశించి విలాసిత్వము దురభ్యాసములు హెచ్చుట 1940సం॥రంలో ఫ్రెంచివారి పతనముకు కారణమైనది † స్వయంకృషి ద్వారా సర్వభూతసేవచేయుటవల్లనేసర్వభూతాత్మకుడగు ఈశ్వరునిసేవించితద్వారా మానవుడు సిద్ధిపొందగల్గును* విశ్వవికాసముకు ప్రేమఅవసరము, కనుక ప్రేమజనకమగు అహింస అవశ్యం ఆచరణీయము. నిజముగ, జీవాభివృద్ధికంతకు అహింసాప్రేమములే మూలాధారములు. మానవత్వములో ప్రేమయే ముఖ్యవిశేషము. విజ్ఞానపరిశోధనలవల్ల భౌతికముగ నెన్నిటినోసాధించినాము. కాని,ఇందులోఆత్మికజయము లేదు, ప్రేమతత్వముద్వారా పరిశుద్ధులై నిగ్రహులై సత్కర్మపరులై తే, అంతకన్న నెక్కువజయము సాధ్యమగును. అందువల్ల ప్రాణికోటి యున్నతస్థితి

† Since the victory of 1918, the spirit of pleasure has prevailed over the spirit of sacrifice. People have demanded more than they have given. They have wanted to spare themselves effort.

Statement of Marshall Petain (20-6-1940) on the fall of France.

* యతః ప్రవృత్తిర్భూతానాం యేన సర్వమిదంతతం ।
స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విందతి మానవః (గీత)

నొందును. ప్రేమ తత్వపుబలము త్యాగముద్వారానే తెలియును†

అహింస అత్యున్నతాదర్శము; దానినాచరింపలేకపోవుటకు మన దౌర్బల్యము కారణము. నిరంతరపరిశ్రమ కావలె. తేళ్ళు పాములు, దుష్టులగు దొంగలు, ఆతతాయులు కనబడినప్పుడు మనస్సులో భయము హింసాబుద్ధి కలుగుచుండును. అందుకు చాలవరకు మనపూర్వసంస్కారము కారణము. అహింస ఆచరణలో సాధ్యము కాదనుకొని,హింసాప్రవృత్తినే పెట్టుకొనుట తప్పు. అహింసవల్ల క్రమముగవినాశముతగ్గి, జీవశక్తిప్రేమము హెచ్చును. హింసాప్రవృత్తివల్ల నష్టము ద్వేషమును లోకములో వ్యాపించును *

అయితే, సంపూర్ణమగు అహింసాతత్వ మలవడువరకు, ఆచరణలో కొన్ని మినహాయింపులు పెట్టుకోవలసియున్నది. ఇందొకటి పాము తేలు పులులుప్లేగుఎలుకలు పిచ్చికుక్కలు మొదలగు జంతువులజంపుట. ఇప్పటిస్థితిలో మానవరక్షణకై ఈహింస తప్పదు. ఇట్లే చికిత్సవల్లను కుదరక తీవ్రవ్యాధిచే మరణబాధపడు పశువును చంపుటకు గాంధిగారంగీకరించినారు. మరియు ఆయుధహస్తులగు బందిపోట్లువచ్చి ప్రాణ

---

† But the victories of physical science would be nothing against the victory of the science of life which is of our being. ... .....It shall be proved by persons living it in their lives in utter disregard of consequences to themselves. There is no real gain without sacrifice And since the demonstration of the law of love is the realest gain, sacrifice for it must be the greatest required.

(హరిజనపత్రికలో గాంధిగారివ్యాసం 26-9-1936)

* The ideal must not be lowered because of our weaknesses or imperfections.........I own my fear of snakes,scorpions, lions ......... murderers. ... ... ... ... One who hooks his fortunes to Ahimsa, the law of love, daily lessens the circle of destruction and to that extent promotes life and love ; he who swears by Himsa, the law of hatred daily widens the circle of destruction and to that extent promotes death and hate. ... ... ... ... Though I may fail to carry it (ahimsa) out to the full in this life, my faith in it shall abide. Every failure brings me nearer the realisation. (హరిజన్ 22-6-1938)

ములుతీయుటకు స్త్రీలమానమునహరించుటకు సిద్ధమైనప్పుడు, రక్షణకై ఆకష్టుల హింసించుట తప్పనిసరియగును.*

జాతీయప్రభుత్వములు అహింసాస్థితిలో ఆయుధసామగ్రి లేకుండ, ఆత్మార్పణ చేయు శాంతిసైనికులద్వారాను, నిగ్రహముద్వారాను, దేశ రక్షణ చేయవచ్చునని గాంధిమహాత్ముని భావము. కాని అట్టిఆదర్శస్థితి యిప్పుడు రాలేదు. ఇప్పుడున్న హింసావ్యాప్తిలో స్వదేశస్వాతంత్ర్యము రక్షించుటకై యుద్ధపద్ధతులు నేర్చుకొని శత్రువులతో పోరి వారినిచంపుటయు తప్పనిసరియగును. లోకములో నెక్కడనుసంపూర్ణమగు అహింస యింకను వ్యాపించలేదు. హింసాశూరులకన్న అహింసావీరులకే హెచ్చు ఆత్మశక్తి సాహసము కావలెను. అట్టిగుండెబలము క్రమశిక్షచాలనప్పుడు, భీరులమై హింసకు లొంగుటకన్న ధీరులమై ఆయుధములతో పోరి రక్షించుకోవలసినదే. †

ఈ నిర్మాణకార్యక్రమమే మనదేశంలో అహింసాసత్యముల వ్యాప్తికి తగినది; సమన్వయశక్తిగలది. అది పాశ్చాత్యుల తీవ్రయాంత్రికతకు ఆదిమజనుల ప్రాకృతస్థితికిమధ్యగ సమన్వయకరము; ఇట్లే అది బ్రిటను అమెరికాలలోనుండిన వ్యక్తి స్వాతంత్ర్యపద్ధతికి జర్మనీ రష్యా ఇత్యాదులనియంతృపద్ధతికి మధ్యరకముగానున్నది; మరియు కిక్కిరిసిన మహానగరములకు ఏకాంతవనవాసమునకు మధ్య సమన్వయించి, గ్రామాభివృద్ధి గల్గించును. అది అన్నిప్రాంతములకులాభకరమై, ప్రాంతీయజాతీ

---

*I do not say "Eschew violance in your dealings with robbers or thieves or with nations that invade India. (యంగు ఇండియా 29-9-1924.)

They ought to possess the capacity of resisting Goonda-shahi violantly or non-violantly (23-5-41 తేదీని గాంధిగారి ప్రచురణ.)

† If there was national government, while I should not take direct part in any war, I conceive occasions when it is my duty to vote for the military training of those who wish to take it. For I know that all its members do not believe in non-violance to the extent that I do. It is not possible to make a person or society non-violant by compulsion. (యంగు ఇండియా 13-7-1928)

యతలను, ఇట్లే జాతీయతను అంతర్జాతీయతను, మేళవించి సంఘర్షము పోగొట్టును; జడశక్తికి కేవలపు ఆత్మపరతకు మధ్యను, తార్కికరూపమగు జ్ఞానయోగముకు కార్యపరమగు కర్మయోగముకు మధ్యను, అన్యోన్యతను కల్గించును; ప్రకృతిప్రధానమగు భౌతికతకు పురుషతత్వరూపమగునట్టి ఆధ్యాత్మికతకును సమ్మేళనమిచ్చును. ఇట్లే వ్యవసాయికతకు పరిశ్రామికతకు మధ్యను, కర్షకకార్మికుల మధ్యను, స్త్రీ పురుషజాతుల మధ్యను, ఆయా వర్గములమధ్యను, కులముల మతముల మధ్యనుగూడ, పరస్పర మైత్రిని ఏకీభావమునుగల్గించును; ఇది మహాసమన్వయకరము. మనజాతీయ నిర్మాణకార్యము అంతర్జాతీయశాంతికి క్షేమమునకును సహాయకము.

ఈ అహింసాకార్యక్రమము వ్యక్తి జీవనము కేకాక, జనసంఘమంతటికి నుపయోగించునని, ధార్మికముకు ఆర్థికసాంఘికములకు రాజకీయములకుగూడ ఉపయోగించి కార్యసాధనచేయవచ్చునని, ఈకాలమందు గాంధిమహాత్ముడు నిదర్శనపూర్వకముగను చూపియున్నాడు.

అహింస నిజముగబలీయమైనను, అది నిదానముమీదనే అలవడవలెను. అందుకునిరంతరకృషిఅవసరము. ఇంద్రియనిగ్రహము ఆత్మబలము నే దీనిముఖ్యసూత్రములు; అన్నియింద్రియములవశముకు యత్నించినప్పుడే సాధకులునిగ్రహమును సులభముగ నలవర్చుకోగలరు. మన అహింసావాదులును ఏదో ఒకటి రెండు ఇంద్రియముల నిగ్రహముకే శ్రద్ధవహించుటవల్ల వారి అహింసదృఢము సర్వతోముఖముకాకయున్నది. ఇంద్రియనిగ్రహములలో జననేంద్రియపు నిగ్రహము ముఖ్యము; అందువల్లరక్షితమగువీర్యశక్తిని నిర్మాణకరమగు సాంఘికసేవకు వినియోగించదగును.* ఇందులో దృష్టినిగ్రహముభావనిగ్రహము లేకుండ వట్టి క్రియానిగ్రహము ఫలప్రదముకాదు; త్రికరణశుద్ధి కావలెను. ఆహారనియమము, (జిహ్వ

---

* If the vitality is husbanded instead of being dissipated it is transmuted into creative energy of the highest order.

(హరిజన్‌లో 'గాంధీగారివ్యాసము-23-7-1938)

నిగ్రహము) మితభాషిత్వము, సత్యపరత (వాఙ్నిగ్రహము) వగైరా లును అలవడవలెను. సామ్యము:మితమునగు ఇంద్రియ పోషణమంచిదే, కానిఅనియమితము అనవసరము కాకూడదు. ఈనిగ్రహములకు అన్నిటికిని పరస్పరసంబంధమున్నదనియు గ్రహింపవలెను. ఆహారవిహారముల నిగ్రహము లేనిదే తక్కిననిగ్రహములును అంతశ్శక్తి సంపాదనయు సాధ్యము కావు. వీటి అన్నిటికిని మూలము మనోనిగ్రహము ఆత్మపరిశుద్ధి అనియు మరువ కూడదు. ‡

ఇట్లు వ్యక్తులవలె సంఘమంతయు సమిష్టిగను అహింసాసాధన చేయవలెను. వ్యక్తిసాధనవల్ల సంఘసాధనయు, సమిష్టిసాధనవల్ల వ్యక్తిసాధనయు సులభమై అన్యోన్యసహాయకమగును; ప్రేమతత్వముద్వారా జనుల అంతశ్శక్తి వృద్ధియై, ఉత్పాదకత బాగుపడి, సంఘపునిర్మాణమునకు ఉపయోగించును; వీటిఅన్నిటికుండు అన్యోన్యతనుబట్టి వీటిలో ప్రతిఅంశమును అహింసవ్యాప్తికిజాతీయజీవితములో అన్నివిషయముల నిర్మాణమునకు నుపయోగించునదే. కనుకవీటిసన్నిటినాచరించునప్పుడేమనము నిర్మాణ కార్యపరులము కాగలము. ఈ కార్యక్రమమును సరిగ సంఘములో హెచ్చుమంది ఆచరించినప్పుడే క్రియాకారియగు అహింసయేర్పడును. *

అవియెట్లు అహింసాసాధకములో లోగడ ఆయా అధ్యాయముల చర్చలోచూచియున్నాము. జాతీయస్వాతంత్ర్యరక్షణకును నిర్మాణకార్యపు జయమే సూచకము. ఇట్లు ఖదరువగైరాలద్వారా గ్రామపరిశ్రమలను బాగుగ వృద్ధిజేసి వీటిని ప్రోత్సహించితిమా, ప్రభుత్వముతో సంఘ

---

‡ He therefore who is resolved to control the one must be likewise determined to control the rest. I have always felt that much harm has been done by the narrow definition of Brahmacharya. If we practise simultaneous self-control in all directions, the attempt is scientific and easy of success. (From Yerravada Mandir P. 19.)

* Widening and working of the Constructive Programme is the only way in which active non-violance can express itself.

(గాంధిమహాత్ముని ఉద్బోధన 21-3-1941 తేదీ)

క్షము లేకుండనే మనకు స్వరాజ్యము లభించవచ్చును. † అట్లు రాదను కొన్నను, నిర్మాణకార్యపు బలముగల్గితే సత్యాగ్రహము జయప్రదమై స్వాతంత్ర్యము సంపాదిత మగును. దానిజయమునకు క్రమశిక్షణయు అన్నివిధముల త్యాగమును విశ్వాసమును కావలెను; అవిలేకనే అశ్రద్ధ ప్రబలినది. ‡ లోకమోక్షమునకును చేతిపనులే ఇంకనాధారంకావలెన్.§

ఒకవేళ ప్రభుత్వమువారు జబర్దస్తీతో సత్యాగ్రహుల ఆస్తులను వ్యక్తి స్వాతంత్ర్యమును పోగొట్టవచ్చును. ప్రాణాపాయము గల్గినను సత్యాగ్రహులు అట్టి సంపూర్ణ త్యాగమునకును సిద్ధపడవలెను. అయితే త్యాగమును ధైర్యముతోను తనకు సంఘమునకుసాధ్యమైనంతవరకు అంతశ్శక్తిని హెచ్చించుటకునే చేయవలెను. వ్యర్థత్యాగము ఆత్మహింసయగును. అట్టి ఆత్మహింసాచర్య నిరాశాఫలము, నిష్ప్రయోజనము. పరహింస వలె ఆత్మహింసయు దోషమే. మన దేహేంద్రియాదులను లోకోపకారమునకే దేవుడు ప్రసాదించినాడు. వాటితో పరహింసను ఆత్మహానిని చేసుకొనుటయు నరులదే తప్పు, అయినను వారుదేవుని నిందించుచున్నారు.* కనుక త్యాగము సదుద్దేశముతో లోకక్షేమమునకై చేయునప్పుడే సాహ

† 'The key to complete independance is in our own hands in the revival of village Industries.'

(15-3-1940 రామగఢు కాంగ్రెసు ఖద్దరు ప్రదర్శనములో గాంధిమహాత్ముని యుపన్యాసము.)

‡ The apathy about the constructive programme i. e. spinning khadi, etc. I take to be positive sign of unbelief. (హరిజన్ 9-3-1940)

§There is no deliverance for the world groaning under a gignantic war except through an enlightened and voluntary return to the handicrafts with the Charka in the centre.

('ఖాదీజగత్' పత్రికలో గాంధిగారి 26-7-1941 తేదీ వ్యాసము)

* క్లేశత్యాగకృతేఽర్పితేన కరణవ్యూహేన దేహేన చ,
స్వార్థం బత జంతురాశ్రయతిచేత్ మంతుర్నియంతుః కుతః।
శస్త్రే శత్రుజయాయ నైజగురుణా దత్తేఽథ తేనైవ చేత్
పుత్రో హంతి నిజం వపుః కథయ కే తత్రాపరాధీతుకః॥ (విశ్వగుణాదర్శం.)

సము ఫలప్రదమగును. నిజమైన ఈశ్వరభక్తిగల్గిన వారికి విచక్షణ సులభమే.

అహింసాయుద్ధపు సూత్రముల నిదివరలో గమనించినాము. ముఖ్యముగా, శత్రువినాశముకాక మనప్రేమద్వారా శత్రుహృదయము కరగించుటే ఈసిద్ధాంతపు ఉద్దేశము. తుదకు ఉభయులకు క్షేమకరమైన రాజీపరిష్కారము జరుగునట్లు చేయుటే అహింసాయుద్ధపు మూల సంకల్పము. కనుక శాంతవాతావరణము అవసరము; మరియు శత్రువు చాలకష్టపరిస్థితిలో నున్నప్పుడు అతనిపైన తీవ్రయుద్ధము సాగించి బాధపెట్టి లొంగదీసి సాధింపజూచుట అహింసాసిద్ధాంతముకు వ్యతిరేకమనియుగ్రహించవలె. *

ఇప్పటి యుద్ధసత్యాగ్రహమును కేవలం నైతికంగాను, లోకులకు హానిలేకుండను మానవత్వరక్షణకు సాగించినట్లు ఈయుద్ధానంతరం లోకముకు స్తిమితమేర్పడినప్పుడు తెలియగలదు †

అహింసాతత్వపుసూత్రములు సాధనపద్ధతులును గాంధిమహాత్ముడొకసారి యిట్లువివరించెను ‡

(1) మానవజాతికంతకు అహింసయే మూలధర్మము. ఇదిభౌతిక బలముకన్న నెంతయో అధికము, బలీయము.

---

* The end of non-violant war is always an agreement, never dictation, much less humiliation of the opponent. There can be no question of the Congress asking or expecting Britain to dishonour just obligations or treaties ......................

(హరిజన్‌లో ఒక ఆంగ్లేయుని లేఖకు 22-3-40 తేదీని గాంధిమహాత్ముని జవాబు.)

† When the clash of arms has ceased and we have settled down to peace, permanant or impermanent, history will record that the congress fight, in its totality, was a supremedy moral fight and free from any injury to man's dignity.

(21-4-41 తేదీని గాంధిమహాత్ముని ప్రచురణ)

‡ It may not therefore be presumptious on my part, if I set down without argument the implications; here they are :—

(1) Non-violance is the law of the human race, and is infinitey greater than and superior to brute force.

(2) ఇందుకు ప్రేమమయుడగు భగవంతునియందు ప్రపత్తి కావలె. అట్టి భక్తి లేకుండ క్లిష్టసమయమందు అహింసాసాధన చేయ వీలుకాదు.

(3) మర్యాదను ఆత్మగౌరవమును పూర్తిగ రక్షించుకొనుటకు అహింస ఉపయోగించును; భూములను చరాస్తిని రక్షించుట కొకప్పుడది యుపయోగింపక పోవచ్చు; అయితే వాటిరక్షణకును ఆయుధధారులకంటె నిత్యకృత్యముగ అహింసాభ్యాసముగలవారికే ఎక్కువ యుపయోగించుచుండును. అన్యాయార్జితమగు లాభములను అవినీతిచర్యలను కాపాడుటకు అహింస యెన్నడును ఉపయోగించదు; ఇది సహజమే.

(4) అహింసారాధకులగు వ్యక్తులు జాతులుగూడ గౌరవము తప్ప తక్కిన తమ సొత్తులన్నిటిని త్యజించుటకు సిద్ధపడవలెను. (జాతిలో నరులందరు నిట్టి త్యాగము చూపవలె.) కనుక ఇతరులదేశములను వశమందుంచుకొనుట అహింసాపద్ధతిలో పొసగదు. అనగా భౌతికబలముతో అధికారము నిల్పుకొను ఇప్పటి సామ్రాజ్యతత్వము అహింసకు వ్యతిరిక్తము.

---

(2) In the last resort it does not avail those who do not posses a living faith in the God of Love.

(3) Non-violance affords the fullest protection to one's self respect and service of honour, but not always to possession of land or movable property, though its habitual practice does prove a greater bulwark than the possession of armed men to defend them. Non-violance in the very nature of things is of no assistance in the defence of ill-gotten gains and immoral acts.

(4) Individuals or nations who would practise non-violance must be prepared to sacrifice (nations to the last man) their all except honour. It is therefore inconsistant with the possession of other people's countries, i. e. modern imperialism which is frankly based on force for its defence.

